# జ్ఞానసూర్యోదయము

## వేదాంతగ్రంథము

[ వచనము ]



గ్రంథకర్త:

మొవ్వ వేంకటదాసుగారు



ఏప్రిల్,

1953

మూల్యము:

రూ 10-0-0



భాష్యకార సమాజస్థాపకులు,
గ్రంథకర్త
మొవ్వ వేంకటదాసుగారు

# కుటుంబవివరణము

కూర్చున్నవారు, కుడినుండి:—

1. శ్రీనివాసప్పెరుమాళ్లు—గ్రంథకర్తగారి ప్రథమపుత్రుడు
2. గ్రంథకర్తగారు
3. రాధమ్మగారు— గ్రంథకర్తగారి ధర్మపత్ని
4. పద్యాల రామబాణమ్మ—గ్రంథకర్తగారి ప్రథమపుత్రిక
5. కమలాదేవి— గ్రంథకర్తగారి ద్వితీయపుత్రిక

నిలుచున్నవారు:—

1. వేంకటాచలపతి— గ్రంథకర్తగారి ద్వితీయపుత్రుడు
2. దాశరథిసూరి— గ్రంథకర్తగారి తృతీయపుత్రుడు
3. రామప్రసాదు— గ్రంథకర్తగారి చతుర్థపుత్రుడు
4. వృషాద్రిపతి— గ్రంథకర్తగారి మనుమడు

శ్రీవేంకట పరబ్రహ్మణేనమః

# ప్ర భా త ని ష్పా ద న ము

ఇదమంధం తమఃకృత్స్నం జాయేత భువనత్రయం
యది శబ్దాత్మకం జ్యోతి రాసంసారం న దీప్యతే

అన్నాఁడు దండి "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్య వ్యవస్థితౌ" అని భగవానులు సాయించిరి. ఏనాఁడు శాస్త్రజ్యోతి సంపూర్ణముగా నారిపోవునో యానాఁడు లోక మంధకారమయమే, పరబ్రహ్మమువలెనే శబ్దబ్రహ్మముననాది, యనంతము, వేదరూపమైన శబ్దజ్యోతిని లోకానుగ్రహార్థము భగవంతుఁడు ప్రకటించె. "అనంతపారంకిల వేదశాస్త్ర మల్పశ్చకాలోబహవశ్చవిఘ్నాః" అన్నట్లు స్వల్పాయుష్కులు విఘ్నోపహతులునైన మానవులు బహుళభూతములైన వేదముల విచారింప నసమర్థులగుటచే నధిగతసర్వార్థులును. ధర్మసంగ్రహ చికీర్షులునైన మన మహర్షులు వానినిమథించి సారాంశములను లాగి స్మృతీతిహాస పురాణ కావ్యరూపముల వెలువరించిరి. పూర్వులనిర్దుష్టానుభవరూపమైన శాస్త్రమునకు సర్వులును బద్ధులు కావలసినదే కాని నాఁడున్మత్తులకును నితరులకును భేదముండదు. ఇహపరములయందు శ్రేయస్సు నభిలషించువారికి శాస్త్రము మార్గదర్శకము శాస్త్రదృష్టిలేక పదచలనమొనర్చుటకును మానవు లసమర్థులే శాస్త్ర విచారణము నాధ్యాత్మికవిమర్శ భారతీయులకు సహజోన్మేషములు. ఇది యిట్లుండఁ బాశ్చాత్య సాంగత్య సల్లాప సంస్కారముల చేతనో కాలవైపరీత్యమువలననో పవిత్రమైన వైదికమార్గమునువదలి యధునాతనులుకొందఱు కుమార్గానుయాయు లగుచున్నారు. కేవల పాశ్చాత్త్యులును నాస్తికులుకారు. భారతీయు లధ్యాత్మ విచారణమునందుఁ బూర్వమునుండియుఁ బైచేయిగా నున్నవారేకదా, కాని పాశ్చాత్య భారతీయ సమ్మేళనమువలన నొక విచిత్ర నూతన సంప్రదాయము

బయలు వెడలినది. "శాస్త్రము లబద్ధములఁట స్వార్థపరులచేఁ గల్పిత ములఁట దేవుఁడే లేఁడఁట, శాస్త్ర విశ్వాసముగలిగి దానిననువర్తించు వారు మూఢులు పూర్వాచారపరాయణులు లోకజ్ఞానశూన్యులు మీమాంసకులు కూపమండూకములునఁట, వైదికకర్మములు నిరర్థకము లఁట, పూర్వపునర్జన్మములు, పాపపుణ్యములు లేవఁట, వైదికవేషధారణము ప్రజ్ఞాపౌరుషహీనులజీవనోపాయములఁట, సత్యశౌచాదులుదానేష్టాపూర్తాది సత్క్రియల నాచరించుట తెలివిలేమియఁట, దైవారాధనము మున్నగునవి వెఱ్ఱినమ్మకములఁట, శాస్త్ర గురు దూషణము విద్యాధికతయఁట. "కాఫీహోటలులకు వేంచేసి కడుపునిండభోంచేసి" యన్నట్లుదయాదిగాఁ జెమతొక్కచే నుదరమునింపి పెద్దలు శ్రమించి యార్జించిన ధనమువ్యయించి యారోగ్యహీనులై చెడుట నాగరికతయఁట, పరపరిహాసము చతురతయఁట సూటు, బూటు వేసి సర్వభ్రష్టులై వీధులవెంటఁదిరుగుట నవ్యతయఁట, యితరులవంచించి ధనమార్జించుటే పరమార్థమఁట, ఇవి వీరిసాంప్రదాయ ముఖ్యసూత్రములు. వేయేల? ఇహ పర సుఖావహములై యున్నతగతికి హేతువులైన ధర్మాచరణాదుల విసర్జించుట సర్వవిధపతనకారణములైన కుమార్గముల ననుసరించుట వీరికిముఖ్యోద్దేశ్యము పూర్వవిధానమును వదలి గుదస్థానముచే నాహారమునుగ్రహించి వదనముచే మలవిసర్జన మొనరించుటకును, పాదములచేఁ గార్యములొనరించి చేతులతోనడచుటకు యత్నించువాఁడును వీరికిం బూజ్యుఁడు నవీనుఁడు, అట్లుకాక యథాపూర్వముగా నోటితో నాహారముఁగొని యథాస్థానముద్వారా విసర్జించువాఁడును, పాదములతో నడచి చేతులతోఁ గార్యములొనరించు వాఁడును వీరియుద్దేశానుసారముగాఁ బూర్వాచారపరాయణుఁడు. మూఢుఁడు అహాహా కాలగతి! యుత్తమోత్తమమై వేదసంస్కృతుల కాస్పదమైన భరతఖండమున నిట్టి సంప్రదాయములు బయలుదేఱుననియు, నిట్టిదుర్వచనములు వినఁబడుననియు ననుకొంటిమే! అనుకొననేమి? కొన్నివేల వత్సరములక్రిందనే యిట్లు కలివిజృంభించునని తమ

దీర్ఘనిశితమైన దివ్యదృష్టిచే నవలోకించి మనమహర్షులు తమగ్రంథములయందు సూచించియున్నారుగదా, క్రొత్తగాదు. విస్మయపడ నవసరములేదు. ఈవిషయముల నన్నిటిని సూచించి వారు గర్హించిన కాలము సమీపించినది యెట్టి చిత్ర సంప్రదాయములైనను వెలువడును. ఇట్లనుటచే నాధునిక స్థితియంతయు నీచమనియుఁ బూర్వసంప్రదాయమే సర్వతోముఖముగా నుపాదేయమనియుఁ జెప్పుటగాదు సదసద్విషయగ్రహణమునఁ బూర్వాపరవిమర్శ న్యాయ్యము కాదనిదే నాభావము. పూర్వులనుష్ఠించిరని యసత్తును గ్రహింప నవసరములేదు. అర్వాచీనమనిసద్విషయమునుద్యజింపరాదు. ఎప్పటిదైనమనకేమి సద్విషయము ననుష్ఠింతుముగాక!

పైనఁజెప్పిన ప్రబుద్ధులు శాస్త్రము లబద్ధములనియు స్వార్థపరులు కొలఁదికాలముక్రిందనే సృజించిరనియుఁ జెప్పుచున్నారు. వస్తుతః వీరిదృష్టిలోఁ బ్రపంచమే కొంతకాలముక్రిందఁ బుట్టినదనియు నటుపిమ్మటఁ గొంతకాలమునకు శాస్త్రాదు లుత్పన్నములైనవనియు నంతకుఁబూర్వమేవియులేవనియు వీరియభిప్రాయము. కాలమఖండముగదా అది యొకప్పుడు పుట్టెనని చెప్పుటకు వీలుపడదు. ప్రపంచమెప్పుడుపుట్టినది? తత్పూర్వమేమియున్నది? అట్లు శూన్యస్వరూపమెంతకాలమునుండియున్నది? మన వంశమునకు మూలపురుషుఁడెవఁడు? వాఁడెంతకాలమునకు ముందున్నవాఁడు, వానికిఁగారణభూతుఁడెవఁడు? ఇట్టిప్రశ్నలచేఁ బైకిఁ బోయిపోయి జగత్తున కనాదిత్వమేర్పడుచున్నది. విచారింపక దూరదృష్టిలేక కొద్దికాలముక్రిందనే లోకము వొడమెననుట మూర్ఖత. పైవిషయమును మనశాస్త్రము లెంత మనోహరముగా సత్యముగా సహజముగాఁ బ్రతిపాదించినవో చూడుఁడు. "ప్రపంచమనాది, యొకప్పుడుండి యొకప్పుడు లేకుండ లేదు. భారమై చెడకుండునట్లు ప్రళయములు. కల్పములు, నశించుట, మరలఁబొడముట యిట్లు ప్రవాహరూపముగా దీనికి నిత్యత్వము ననాదిత్వము" కావున నఖండ ఖనాళమైన కాలగర్భమున నొకప

యము నూతనముగాఁ బుట్టినదనియుఁ గ్రొత్తగా నవించెననియుఁ దలంచుట తప్పు. అనంతమైన కాలప్రవాహమునఁ బ్రతివిషయమును నెప్పుడో యొకప్పు డీతరంగములోనో విలసితమైయేయుండును. అయితే నూతనవిషయము లిప్పుడు పుట్టలేదా ? శబ్దగ్రహణ యంత్రములు (రేడియోలు) చలనచిత్రములు (సినిమాలు) ధూమశకటములు (రైళ్లు) మున్నగునవి పూర్వమున్నవా? ఇవి క్రొత్తగా రాలేదా? యను ప్రశ్నలు పుట్టవచ్చును. నూతనముగా నవి రాకపోలేదు. కాని వాని నవ్యతలో విశేషమున్న దేమన, విశాలమైన కాలగర్భగోళమునఁ గొన్ని విషయములు కొంతకాలము మఱుగుపడిపోయి కనుపట్టవు. పోనుపోను వాని పూర్వపుటునికియే తరువాతివారికిఁ దెలియకపోవును. ఇదియే పదార్థముల యభావావస్థ. మరలఁ గొన్నికల్పములకో కొంతకాలమునకో యవి భగవత్సంకల్పముచే వెలువడుచుండు నిదియే వాని యుద్భూతావస్థ యిదియే నవ్యత. అంతేగాని యిది మొదలని వ్యవధిలేని కాలపరీవాహమున నేవిషయమును బూర్వమెప్పుడును లేదనియు నిప్పుడే గలిగెననియుఁ జెప్పుట పొరపాటు. కొంతకాలము పదార్థములకు స్థితి కొంతకాలము ప్రళయము కొంతకాలము వ్యక్తావస్థ కొంతకాలమవ్యక్తావస్థ యొక ప్రదేశమున నుండుట మఱియొక దేశమున లేకుండుట పొసఁగుచుండును. "నీచైర్గచ్ఛత్యుపరిచ దశాచక్రనేమిక్రమేణ" ఇదియే సృష్టిరహస్యము. భగవానుని యఘటనఘటనాపటిష్ఠత యిదియే. ఇట్టి విశ్వాత్ముని లీలారహస్యవిషయమును సంపూర్ణముగా నెఱుంగలేక స్వయంభువులైన వేదములును "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" యన్నట్లు నమస్కారముఁగావించి యా ప్రయత్నమునుండి విరమించుకొన్నవి. మహాత్ములును నీవిషయమున మోహపడుచున్నారు. సర్వశక్తుండైన భగవానుని మహిమ నెవ్వఁడెఱుంగనోపు. కావున ననాదియైన ప్రపంచమున సర్వవిషయములు సర్వదా యునికిగలవే. దీనిచే శాస్త్రములు నిత్యములనియే యేర్పడుచున్నది గదా. కాక కల్పించిరన్న నెవరు కల్పించిరి ? కల్పితములై

నవానినిసమకాలికు లొప్పుకొందురా? భిన్నమతప్రవిష్టు లనఁగా
భిన్నాభిప్రాయములు గలవారొకరు సృష్టించినదానిని మఱియొకరు
సహింతురా? రామాయణము కల్పితమన్నచో నేటికిని
సర్వప్రపంచమున ననుష్ఠింపఁబడు రామజయంతి (శ్రీరామ నవమి)
యెట్లు ప్రజలలోఁ బ్రవేశించినది. శ్రీకృష్ణజయంతి యెట్లువచ్చినది.
ఆ యా గ్రంథ ప్రతిపాదితములైన మహావిషయములు కాలపరిణామ
మున నశక్తులైన యిప్పటివారికి వింతగాఁదోఁపవచ్చు నంతమాత్రమున
నవికల్పితములా? వాల్మీకి లేనిపోని విషయములన్నిటి నొకగ్రంథ
ముగాఁ జేర్చి లోకమును మోసగించుచుండఁగా సమకాలికు లెట్లు
హర్షించిరి. సమకాలికు లందఱు వాల్మీకి యేమిచేయుచున్నదియుఁ దెలి
యనంత మూఢులా? యట్లైన మూఢనిక్షిప్తమగు నాపవిత్రగ్రంథ
మెట్లు బ్రతికి నేఁటికిని వచ్చె. నొకవేళ సమకాలికులు గర్హించియే
యుందురన్నచో రామాయణమువలె వారిగర్హణలును నేల ప్రపంచ
మునకు రావు? ఒక్కొక్క శాస్త్ర మెంత విస్తారముగా నెంత ప్రౌఢ
ముగా నెంత గంభీరముగానున్నదో పరిశీలింపుఁడు. గురుముఖమున
వినియువీని నవగతము చేసికొనలేక బాధపడుచున్నాము. అట్టివానినెవరో
గాలికిఁబోవువారు కల్పించిరన్న నరిపడునా. గురుకులవాస మొనర్చి
శాస్త్రముల నభ్యసించినవారికి వానియథార్థస్వరూపము వానిమహి
మయు బోధపడును. అట్లు గురుకులవాసముచేయక శాస్త్రములఁజవి
చూడక భాషాపరిశ్రమ మొనర్పక వానినిఁ బ్రకటించిన మహాత్ములశక్తి
యెట్టిదో గమనింపక యార్షసంప్రదాయమును బరిశీలింపక యింద్రియ
లోలురై యిచ్చవచ్చినట్లు మెక్కుచు నిచ్చవచ్చినరీతిఁ జరించుచు
నోటికివచ్చినట్లు "బొజ్జ తొండముచూచి బ్రహ్మదేవుఁడనుకొన్నాను
వెంకటేశ్వర్లువంటోయి వీరభద్రుఁడా" యన్నట్లు శాస్త్రములు కల్పిత
ములనియు, నబద్ధములనియు నున్మత్తాలాపములు వదరిన లాభమేమి?
లోకమాన్య బాలగంగాధరతిలకు "మృగశీర్షానక్షత్రము" (Orion)
అను గ్రంథమును వ్రాసి వేదమునందలి యానక్షత్ర సన్నివేశ వర్ణనము

ననుసరించి ఋగ్వేద మధ్యమపక్షమునఁ గ్రీస్తుశకమునకుఁ బూర్వము నాలుగువేలసంవత్సరములకుఁ బూర్వమేయున్నదని దాని నిత్యత్వ మును నిరూపించినాఁడు. మఱియు నతఁడే (Arctic Home in the Vedas) "వేదములయందలి యార్యుల యుత్తరధ్రువవాసము" అను గ్రంథమునువ్రాసి యనేకయుగములక్రింద నార్యు లుత్తరధ్రువప్రాంత మున నున్నారని వారి ప్రాచీన నాగరికతయుఁ బ్రపంచ నిత్యత్వమును వేదముల ప్రాచీనత్వమును వివరించియున్నాఁడు. ఆంధ్రకవితారచనకు నన్నయభట్టారకుఁడు ప్రథముఁడనిగదా యనుకొందుము. కాని యతండే "శాస్త్రమపౌరుష మాద్య"మ్మని పల్కినాఁడు. అనఁగా నతనికిఁ బూర్వము బహుకాలముక్రిందనే యాంధ్రకవితకు సిద్ధరూప మేర్పడియున్నది. కావున శాస్త్ర మనాది యపౌరుషము.

అట్టి శాస్త్రము సర్వథాసత్యము, ఆకసమునందు గ్రహములకు సంభవించు గ్రహణాదులు, మానవుడు తత్పూర్వమే శాస్త్రాధారమువలనఁగదా కనుఁగొనుచున్నాఁడు వసనాభిఁ దినిన మృతినొందునని యాయుర్వేదము నుడువుచున్నది. తిని బ్రదుకఁగలడా? శాస్త్ర మబద్ధమెట్లాయె? నయితే శాస్త్రము సత్యమైనచో నవి భిన్నభిన్నములుగా నొకదానికొకటి విరుద్ధముగా నుండనేల? మఱియు వేదము విధించుచుఁగాని యావిధులకుఁ బ్రయోజనమును జెప్పలేదు. పరికించినను గనఁబడుటలేదు. అట్టి నిష్ప్రయోజన విధులుగలిగిన వేదములేల? యుక్తివాదమునకవి దూరములగుచున్నవి. హేతు సంగతములుకాని వానినేల విశ్వసింపవలయు, నని పై యున్నత గ్రీవులధిక్షేపింతురు కాఁబోలు, వాని భిన్నరూపములకుఁ గారణము లేకపోలేదు. శాస్త్ర మొక్కటేయైనను దేశ కాల పాత్రముల ననుసరించి పరిణామమొందుచుండును. దానిచే నది భిన్నమని చెప్పరాదు, బంగార మొక్కటేయైనను, భూషణ వ్యవస్థచే రూపసన్నివేశము మాఱుచుండుటలేదా? కరగించిన మరల నొకేరూపము నొందుటలేదా? యట్లే శాస్త్రమును, నధికారిని బట్టి భిన్నమార్గదర్శకముగానుండును. సర్వ

శాస్త్ర సమవలోకన మొనర్చినఁగాని వానినిర్ణీతమైనయొకేరూపమైన సారాంశము తేలదు. కాక యేకదేశమునుగ్రహించి తోఁచినట్లు విమర్శ సలిపి త్రోసిపుచ్చుట మూర్ఖలక్షణము. మఱియు సన్వయశక్తినిఁ బట్టియు విరుద్ధరూపమును బొందుచున్నది. మనయసమర్థత నిర్దుష్టమైన శాస్త్రమునందారోపించి దానినిదూషించుట సమంజసముగాదు. వేదవిధులన్నియు సప్రయోజనములే. లోకసుఖమునకే యవి ప్రవర్తించినవి. 'సత్యంవద,—ధర్మంచర'— ఇవి మొదలుగాగల విధ్యుక్తముల ననుష్ఠించుటచే లోకమున కెంత సౌభాగ్యముగలుగునో విచారింపుడు. విధిరూపములైన వేదములే యనంతములైనవి. ఇఁక ప్రయోజనములఁ గూడ నవియే చెప్ప మొదలిడిన నపరిమితముగాఁ బెరిగిపోయి మానవుల కసాధ్యములై నిష్ప్రయోజనములగును. గావున "ననుక్తమన్యతో గ్రాహ్య"మ్మను న్యాయముచే నితరశాస్త్రములవలన నాప్రయోజనముల నెఱుంగవలయును. ఉదాహరణమున కొకదానినిఁ జూడుఁడు, "ఉద్యత్సూర్యం న పశ్యేత్" ఉదయించుచున్న (అస్తమించుచున్న) సూర్యునిఁ జూడఁగూడదని శ్రుతి నిషేధించినది. సామాన్యముగా దీనికిఁ బ్రయోజనము కానిపించుటలేదు. కాని విచారించిన నుదయాస్తమయసమయముల సూర్యకిరణములయం దొకవిధమైన విషమున్నదనియు వానినిఁజూచిన నేత్రములకు హానియనియుఁ బ్రకృతిశాస్త్రమును నాయుర్వేదమును దెలుపుచున్నవి. మనశాస్త్రముల కన్నిటికి నొకదానితో మఱియొకదానికి సంబంధమున్నది కాన నితరశాస్త్రములవలన వానిప్రయోజనములఁ దెలిసికొనఁదగు. పూర్వులకు మేధాశక్తి తక్కువయనియు దానిచే "గ్రుడ్డియెద్దు చేనునఁబడినట్లు" ఎవరేదిచెప్పిన నట్లుపోవుటయేగాని హేతువాదము నెఱుంగరనియు వీరి యపోహము. యుక్తి సమగ్రముగాదు. కొన్నిపట్ల యుక్తి సాధ్యసాధన విషయమున శక్తముకాదు. అతీతవిషయములందది పనిచేయదు. విరుద్ధార్థమును బ్రతిపాదించును. కాక మనయొక్కరియుక్తికన్న నభియుక్తులైన యనేకుల యుక్తిరూపమగు శాస్త్రము బలీయము. వీనినన్నిటిని

విమర్శించియే సూత్రకారుఁడు "తర్కా ప్రతిష్ఠానాత్" యుక్తి మేధా శక్తినిఁబట్టి పైకిఁబైకిఁ బోవుచునేయుండును. దానికొక వ్యవస్థలేదు నిర్ణయములేని యట్టియుక్తి సత్యముగాదు. కావున సందిగ్ధవిషయమున శాస్త్రమే ప్రమాణము, అని యుక్తివాదమును నిరాకరించియున్నారు శాస్త్రమునకు విరుద్ధముకాని యుక్తిని మనపూర్వు లంగీకరించియే యున్నారు. కావుననే "తావద్గర్జంతి శాస్త్రాణి జంబుకా విపినేయథా న గర్జతి మహాశక్తిః యావద్వేదాంత కేసరీ" సామాన్య శాస్త్రములు యుక్తివాదాదులు సింహముముందు నక్కలవలె వేదాంతశాస్త్రము ముందు మానమువహించునని యొక సుభాషితకారుఁడు సమస్త శాస్త్రసారమైన వేదాంతమును ప్రశంసించెను గాన శాస్త్రములు సర్వథా సత్యములు.

ఇంద్రియగోచరుఁడు కాకపోవుటచే దైవము లేఁడనుట ప్రత్యక్ష మొక్కటియే ప్రమాణమా? అనుమానాదులుప్రమాణములు కావా? తార్కికు లనుమానముచే దైవము స్థితి నుడువుచున్నారు. అచేతన ములైన యీభూమ్యాదు లెట్లుత్పన్నములైనవి, యెట్లు కార్యసమర్థము లగుచున్నవి, వీని నెవరుకల్పించిరి? వానియంతట నవియే పుట్టె నన్నచోఁ గారణములేక కార్య మెట్లుత్పన్నమగును లోకమున నట్టి న్యాయముగలదా యచేతనములైన యంత్రాదులు చేతనుఁడైన యొకఁడున్ననేగదా కార్యకారులగుచున్నవి. కావున భూమ్యాదుల సృజించి క్రియలయందు నియమించినవాఁడు వానిప్రయోజనముల నెఱింగినవాఁడొకఁడు గలఁడు లేనినాఁడు ప్రపంచమేలేదు. వాఁడే సర్వశక్తుఁడైన పరమాత్మ. వానివిభూతియే యీప్రపంచము. దైవ ప్రత్యక్షముమాత్ర మేలలేదు. తదారాధకులకుఁ బ్రత్యక్షమగుట లేదా? శ్రమింపక చిత్తశుద్ధిఁబడయక దైవమేల నాకుఁగనఁబడఁడని ప్రశ్నించినచో సమాధానముచెప్పుట కెవరూరక సిద్ధులైయున్నారు. లోకమునందును నొకమహాత్ముని లేక రాజపురుషునిఁ జూడవలయు నన్న దగిన మర్యాదతో నచ్చోటికేగినఁగదా యతఁడు కనఁబడును.

లేక యతఁడున్నచోటికే పోక వానిని దర్శించుట కనువైన యర్థ్వాత సంపాదింపక యతఁడొకఁడున్నచో నాకేల కనఁబడఁడని యింటిలో గూర్చుండి పలుకువారికిఁ గోర్కి సఫలమగునా? యట్లే భగవంతుఁడును లోకముఁ దృశీకరించి సేవించువారికి శాస్త్రానుసారముగాఁ గనఁబడుచునేయున్నాఁడు. కాక తిరుమల మొదలగు పుణ్యక్షేత్రముల యందు భగవన్మహిమ సహస్రముఖములుగాఁ బ్రత్యక్షమై తాండవించుచున్నది. అట్టులేనియెడల ధనైకజీవులైన లోభులుగూడ లక్షలాదిగా విత్తము వ్యయించి సేవింతురా? సేవించువారందఱు మూఢులా? భగవన్మహిమ ప్రత్యక్షముగా ననుభవించుచున్నవారనేకులు నేఁటికిని గలరు. అట్లింద్రియనిగ్రహమును బొందక తపంబాచరింపక ధర్మమును బరిపాటింపక భక్తిరూప మెఱుంగక భగవంతునిఁ దేరకుఁ దేర జూడ నతఁ డంత సులభుఁడా? యట్లైనచో నంతచులకనైన పదార్థములో నేమి ప్రయోజనముండును? కావున భక్తులకుఁ గనఁబడుటచేఁ బ్రత్యక్షమువలనను భూమ్యాది కార్యోత్పత్తిచే ననుమానమువలనను, నర్చారూపాది సామ్యముచే నుపమానమువలనను, శాస్త్రనిరూపితుఁడగుటచే శాబ్దమువలనను నిట్లు చతుర్విధ ప్రమాణములచేతను, నుపలభ్యమానుఁడై తనయవ్యాజకరుణచే లోకముల సర్వావస్థ సర్వకాలములయందు రక్షించు పరమాత్మను లేఁడని యతనిసేవింపక యధోగతిపాలగుట శోచనీయము. అట్టి కృతఘ్నులు మఱియొకరులేరు. ఆ యా దైవమంత్రముల ననుష్ఠించి సిద్ధినిఁబడసినవా రెందఱో కనుపట్టుచున్నారు. సర్పవిషహారమగు మంత్రముచే నొక్క డెక్కడనోయుండియు నిచ్చట విషమూర్ఛితుఁడైనవానిని బ్రతికించుచున్నాఁడుగదా. నిరంతర భగవదారాధనపరుఁడైనవాఁడు తనమరణ మెప్పుడైనది ముందేచెప్పి నిత్యపదవి కేగుచున్నాఁడు

శాస్త్రముల నభ్యసించి తమకర్మముల ననుష్ఠించువారెట్లు లోక

విషయముఁ దెలిసికొని శాశ్వతసుఖము నభిలషించి పాటుపడువారు లోకజ్ఞానశూన్యులో లేక లోకస్థితి నెఱుంగక యదియే శాశ్వతమని మీసాలమీఁది తేనెలవంటి లౌకిక సుఖములకు మరగి భ్రష్టులైయముని, నిశిత ప్రహారణ పూజలందుకొనువారు లోకజ్ఞానశూన్యులో పాపము నెఱుఁగరు. ఈలోకమొక్కటే సత్యమనుకొని దానియందే మగ్నులై తావన్మాత్రమే తెలిసికొని చరించువారు కూప మండూకములుగాక లోకమునెఱింగి శాస్త్రదృష్టిచే దూరస్థములగు పరలోకములనుగూడ దర్శించువారు కూపమండూకము లెట్లగుదురు? వైదిక కర్మలు నిరర్థకము లెట్లగును? పుత్రకామేష్టి మొదలైన క్రియలచేఁ దత్తత్కామ్యములఁ బ్రత్యక్షముగా నందుటలేదా? విధి నిరూపిత కర్మానుష్ఠానమే లోకకల్యాణహేతు వదలేనినాఁ డెల్లలోకము పరస్పర బాధచే నశించును.

నిత్యుఁడైన జీవుఁ డొకఁడు లేఁడనియుఁ బంచభూత సమ్మేళనమువలన శరీరమునందొక నూతనశక్తి పొడముటచే నదియే కార్యములొనర్ప సమర్థమగుచున్నదనియు, నందువలనఁ బూర్వ పునర్జన్మములు, పాపపుణ్యములు మొదలైన వబద్ధములనియు మృతులకొఱకు శ్రాద్ధాదుల నొనరించుట యనవసరమనియు నీయాధిభౌతికవాదులు పలుకుచున్నారు. శరీరమునందే చైతన్యశక్తి కలిగినయెడలఁ బసిపాపయై యున్నప్పుడు శరీరి పాలుద్రావుట సంభవింపదు. ఏలన నొకకార్య మాచరించునపుడు దానియందలి గుణములు తనకుఁగల లాభమును దెలిసికొనినప్పుడే యాకార్యమున మానవునకుఁ బ్రవృత్తి గలుగును. బాలునకట్టి జ్ఞానములేదుగదా పాలెట్లు ద్రావుచున్నాఁడు ఆస్తికులచ్చట జీవనాదృష్టమును హేతువుగా నుడువుచున్నారు. మఱియు వ్యవహారమువలనను జీవుఁడు స్వానుభవగోచరుం డగుచున్నాఁడు. యోగమహిమచే జీవసాక్షాత్కారమును బొంది పరకాయప్రవేశాదు లొనరించువారు నేఁడు లేకున్నను నిన్న మొన్నటివఱకు

నున్నారుగదా. ఇటీవల బొంబయినగరమున నొకబాల యెనిమిదేండ్ల వయస్సుగలది తనపూర్వజన్మ మధురలోననియు నప్పటితన తల్లిదండ్రులను బంధువులను వివరించి పేర్లుసెప్పి యిల్లు ఆవరణము మొదలైన గుర్తులన్నియుఁ దెలిపి యచ్చోటికేగి వారినందఱిని స్వయముగా గుర్తుపట్టెననియు నొక పత్రిక ప్రకటించినది. నామభ్రాంతివలన యమకింకరులచేఁ గొనిపోఁబడి మరల విడువఁగా వచ్చి శరీరమునఁ బ్రవేశించి తాము చూచివచ్చిన యావిషయము నుడువుచున్నవారనేకులు మన ప్రాంతములందే కనుపట్టుదురు. మృతులైనవా రన్యులయందావేశించి తమకు గయా శ్రాద్ధాదులొనరింపుమని యాచించుచున్నారు. పుళింద కిరాతాదు లధర్మము సంభవించినప్పు డొనర్చుకొను జలానల పరీక్షాదులయందు దైవము ప్రత్యక్షముగాఁ గనుపట్టుచున్నాఁడు లోకమునుచ్చ నీచావస్థలచేఁ బుణ్య పాపములు గానవచ్చుచున్నవి. ఒకఁడు మహాపండితుఁ డొకఁడు మందుఁ డొకఁడుభోగి మఱియొకఁడు నిత్యకష్టాలసుఁ డొకఁడు సుందరుఁడు వేఱొకఁడు కురూపి యొకఁడు బలిష్ఠుఁడు మఱియొకఁ డంగవైకల్యము గలవాఁ డిట్లు తారతమ్య మేల కలిగెను ? తల్లి దండ్రులయుఁ దనయు దోషాదు లచట కారణమని పైవారు హేతు కల్పన చేయఁబూనుచున్నారు. కాని యది పొసఁగదు. రూప విలాస సంపన్నులైన దంపతులకు విరూపుఁ డుదయింపఁ గారణమేమి ? వారిసంతానములోసైత మొక్కొక్కఁ డట్లగుటకుఁ గతమేమి ? మేధాశక్తిగలిగిన జాయాపతులకు నెందులకుఁ బనికిరాని మందబుద్ధి జనించుచున్నాఁడు. లోకజ్ఞానమేనియు నెఱుఁగని యమాయకుల గర్భమున మహామేధావి కలుగుచున్నాఁడు. కావున నా యా హేతువులు వ్యభిచరింపక నిలువవు. పుణ్య పాపములే కారణము. లాటకీ వేయుచున్నారు. అందఱును సమకాలమున నొకేవిధముగా

యుచట నిర్ణయింపుడు. రష్యాదేశస్థులు సమముగాఁ బంచుకొని సుఖమనుభవించుటలేదా, వారి కీపుణ్య పాపము లెటకుఁ బోయెనని యొకఁడు ప్రశ్నింపవచ్చును. ఆహారవిషయమునఁ దమ యాధునిక ప్రయత్నముచే వారున్యూనత పరిహరించుకొనవచ్చు నంతమాత్రమున వారు సిద్ధపురుషులు గారు. తెలివితేటలెట్లు పంచుకొందురు. వాని వ్యవస్థ యున్నంతవఱకుఁ గీర్త్యపకీర్తులు, నైచ్యోన్నతులు తప్పవు. దారిద్ర్యాదులచేతనే పాపపుణ్యము లనుభవింప నవసరములేదు. ఏవిధముగానైన దుఃఖ మనుభవించుటే పాపానుభవము. ఎట్టైన సుఖమనుభవించుటే పుణ్యానుభవము. రష్యావారికి నిట్టితారతమ్యముపోలేదు. పోదు. వారును బాప పుణ్యము లనుభవించుచున్నారు.

వైదికవేషధారణము జీవనోపాయమెట్లగును. దమ కదివరకున్న జీవనములఁ దృణప్రాయముగా విసర్జించి యింద్రియముల సహజప్రవృత్తిని నిష్టముమీఁదనాగి యమనియమాదులచేఁ గృశించి భగవదారాధనతత్పరులై లోకమునువదలి తమమార్గ మనుసరింపవచ్చినవారికి బోధించు వైదికులు వంచకులా? ఎంతయన్యాయము! లోకమునఁ బ్రతివిషయమును రెండువిధములుగాఁ బ్రతిభాసించుచుండు, మొదటిది దాని సత్యస్వరూపము, రెండవది దానిననుష్ఠింపలేక దాని యాభాసరూపమును దాల్చి పైకిదానిననుకరించుచు జనులవంచించుచునది. కృత్రిమమునుజూచి సర్వము నిట్టిదని సత్యస్వరూపమునుగూడ దూషించుట యన్యాయ్యము. సంక్షేపముగా నీనాస్తికుల యభిప్రాయములఁ బాశ్చాత్యుల మనస్స్థితి. మనమెన్ని చెప్పినను, నిదర్శనములు చూపినను, వారొప్పుకొనరు. తాముచెడి యితరుల భ్రష్టులనొనరించు నసురాంశసంభూతులైన వీరికి శాస్త్రవాక్యములు పనిచేయవు, వారిమార్గమే వారిది. కావున, "వ్యాళం బాలమృణాలతంతుభిరసౌ రోద్ధుం సముజ్జృంభతే, మాధుర్యం మధుబిందునా రచయితుం క్షారాంబుధే రీహతే ఛేత్తుం వజ్రమణిం శిరీషకుసుమప్రాంతేన సన్నహ్యతి, మూర్ఖాన్ యః

ప్రతినేతు మిచ్ఛతి ఖలాన్సూక్తి స్సుధాస్యందిభిః" అను సూక్తిని వీరి పాలిటి కల్పవృక్షముగాఁ బ్రమాణీకరించి పైవిషయమును వదలు చున్నాఁడ.

ఇఁక నైహిక సర్వేశత్వ మెఱిఁగి నిత్య సుఖాభిలాషులయ్యు సరియైనమార్గము దొరకక సదాచార్యుఁడు లభింపక సత్సాంగత్యము లేక శాస్త్రపరిచయములేక కుమత ప్రవిష్టులై ప్రాఁకులాడుచు మఱియొక తెగవారున్నారు. "చూడచక్కని చిన్నదికడ మేడగదిలో నున్నది ఏడుకొంగల మడుఁగులో జలక్రీడ లాడుచున్నది" "రెక్కముక్కు లేని పక్షి రేయుఁబవలు తపసుపట్టె రొక్కచెఱువు చేపలన్ని రొకలి మ్రింగెరా" "పోగా పోగా గోడుంది గోడకుదగ్గ గూడుంది గూడుకు దగ్గ ప్రమిదుంది" "చెప్పలేనిరాయి చెవిలోని జోరీగ కంటిలోని నలుసు కాలిముల్లు ఇంటిలోనిపోరు ఇంతంత గాదయా విశ్వదాభిరామ వినురవేమ" "పన్నిండుగొమ్మల పటామఱ్ఱి దానిపై పంచవన్నెల రామచిలుక దానిమీఁద నక్కనవలెఁ బ్రకాశించు చుక్క దానిలోనే బాగువంతుఁడు" "గుంటూరికవతలానున్న చింతలకాడ గుజ్జెంకడుపున గొఱ్ఱెపుట్టెనయా నందామయా గురుడ నందామయా ఆనందదేవికి నందమయా" ఇవి వీరి యుపనిషత్సూక్తులు, తత్త్వవాచకములు. వీని కేమో యంతరార్థమఁట వీరిశ్రాద్ధమఁట. ఉభయభ్రష్టులై చెడుట తక్క వీరికి వేఱుఫలములేదు. ఇదియా వేదాంతము. ఇట్టి పిచ్చిమతములను జూచియే నవీనులు మహాపవిత్రములైన వైదిక మతములను గూడ నిట్టివేయనుకొని దూషింపసాగిరి. మఱికొందఱు వైదికమత ప్రవిష్టులయ్యు స్వార్థపరులై స్వోన్నతి నభిలషించుచు, నితరవర్ణస్థుల బ్రహ్మవిద్య కనర్హులనియు, నాచార్యత్వమునకుఁ దగరనియు వైదిక కర్మానుష్ఠానమునకు ననధికారులనియు భగవత్పరులు తేజస్సంపన్నులు పండితులునైన మహాత్ముల దూషింపుచు దాముమాత్రము పందుల వలెఁదిని యింద్రియలోలురై దుర్వ్యసనములచేఁ గాలముఁబుచ్చుచు

భగవద్విషయమున నొక్కక్షణమైన వ్యయింపక గౌరవము మాత్రము మాకే యుండవలయునని దురభిమానముతో రొమ్ముచఱచుచున్నారు. కులవ్యవస్థ యెట్లేర్పడినదో యెంతవఱకది యుపయోగించునో యీ సూక్ష్మతను వీరెఱుఁగరు. విరాట్స్వరూపమునసే జనించిన వర్ణములలోఁ గొన్నిటికి నధికారము కొన్నిటి కనధికారము నియమించుటెట్లో నిషేధించిన శాస్త్రవాక్యముల కర్థమేమో వీరెఱుంగరు. మూఢనిక్షిప్తమైన శాస్త్రములు సరిగా నన్వయింపక వైరూప్యము పొందుననియే. నిషేధమునకు మూలమంతేగాని సహజాసక్తి హేతువుగాదు, "జాతిర్వ్యవహారకల్పితా" అని తేజోబిందూపనిషత్తు స్పష్టముగాఁ జెప్పుచున్నది. లోకము చిందర వందర గాకుండ నడచుటకే యిట్టివ్యవస్థలు. చెఱుపులేని సమయమున నెట్లు మాఱినను దోసఁగులేదు. దీనిరహస్య మెఱుఁగక యిటీవలి వారేవియో పిచ్చివ్రాతలు వ్రాసిరి. ఈవిషయము ననేకులుమహాత్ములు చర్చించియున్నారు. కావున విశేషముగాఁ జెప్పఁబనిలేదు. మఱికొందఱు "అయిన వీరభద్రయ్య" ఇయిన రామభద్రయ్య" యనునట్టు లెక్కడ లేని పక్కడ వేయుచు మాకు సర్వమతములు సమానములని చెప్పుచు నేదియు ననుష్ఠింప వీలుగాక సర్వశూన్యులై జనులను మాత్ర మాకర్షించుకొనుచు లౌకికయుక్తిని భగవద్విషయములోఁ గూడఁ బచరింపుచున్నారు. రెక్కపడవలమీఁద నొక్కసారి ప్రయాణమొనరించువాఁడెట్లు చెడునో యట్లే సర్వమతముల ననుష్ఠింపఁజూచువాఁడు విపత్తునొందును. పరస్పర భిన్నములైన వీనినన్నిటి నొక్కపరి ననుష్ఠింప నెట్లు వీలగును. "భక్తిరవ్యభిచారిణీ" యని చెప్పిన భగవద్వాక్యమున కర్థమేమి? ఇట్లనుటచే నితరమతముల సదా ద్వేషించుచుఁ గాలుద్రవ్వుమని చెప్పుటగాదుసుడీ. ఏమతమునందైన నొక్కదానియందు నిష్కల్మషమైనబుద్ధితోఁ బనిచేయువాఁ డున్నతిఁ జెందును గాని పలువిధముల నేగువాని కొక్కనాఁడును శాంతిలేదు. భగ

వానుఁడు సంతసింపఁడు. "విహాయ కోదండశరౌ ముహూర్తం గృహాణపాణౌ మణి చారువేణుం మాయూరబర్హంచ నిజోత్తమాంగే సీతాపతే త్వాంప్రణమామి పశ్చా" త్తనిపల్కిన లీలాశుకుని వాక్యమును బరిశీలింపుఁడు. అవ్యభిచారిణియైన 'భక్తి'యన నెట్టిదో గోచరించును.

ఇట్లు వైదికమత స్వరూపముఁ దెలియక భిన్నమార్గములఁబడి తడఁబడుచున్న ముముక్షువులకై ప్రవర్తించినది మా పితృపాదుల యీ 'జ్ఞానసూర్యోదయము' వారాడన్న వైష్ణవులు. భగవన్నిర్హేతుక కటాక్ష పరీవాహ ప్రసారసముపార్జిత సకలాగమార్థసారులు, దేవాంశ సంభూతులు, లోకమును దృణీకరించి క్షణక్షణము భగవన్మహిమ మందుమగ్నులై సదా భగవద్గుణ ప్రకటనముచే జనుల నమృతప్రవాహమున నోలలాడించు సిద్ధయోగులు. ఏబది వేలరూప్యములు వ్యయించి 'శ్రీవేణుగోపాలస్వామి'ని గ్రామమునఁ బ్రతిష్ఠించిన భగవత్కైంకర్య నిష్ఠాతులు, "భాష్యకారసమాజ" మొకదానిని స్థాపించి యాయువం దలమందికి సత్యాహింసాశౌచాదులఁగఱపి భగవదున్ముఖులఁ జేసి యుద్ధరించిన సహజాచార్యపూరుషులు, నిత్య నిరంతర తపోనిష్ఠులైన వారి ప్రభావములను నైజప్రతిభను సాకల్యముగాఁ జెప్పుటకు నావాక్కు చాలదు. మఱియు "అంగాదంగా త్సంభవసి" యను శ్రుతివాక్యముచే వారిశరీరమునుండియే యొకభాగము వెలువడివచ్చిననేను వారిమహిమలను జెప్ప నుద్యమించుట యసంభావ్యమను తలంపు కొందఱికిఁగలుగ వచ్చును గాని వారి నిత్యతపస్సమాధి శాస్త్రవిచారణము లోకవిరక్తి సహజకారుణ్యాది మహాపూరుష లక్షణములు నిమేష నిమేషమున నెదుటఁజూచుచున్న నాకుఁగాక కొంతలోఁగొంతయైన వారిమహిమ యితరుల కెట్లుఁ గోచరించుననను తలంపుచే నీమాత్ర ముట్టంకించితి. ఖద్యోతప్రకాశము, మణికాంతి నక్షత్రతేజము, చంద్రప్రభవలెఁగాక సూర్యోదయమునవలె స్వ పరభాసకమై యజ్ఞాన తమస్సును సమూల

ముగా నిరూపించు నఖండజ్ఞాన మీగ్రంథపఠనముచేఁ బాఠకులకుఁ గలుగవలయునని దీనికి "జ్ఞానసూర్యోదయ"మను నభిఖ్య యిడిన వారి యాశయము సర్వదా సత్యముగా నన్వయించినది. మోక్షేచ్ఛగలవాఁడేమిచేయవలసినది, యెట్లుచరింపవలసినది భగవన్మహిమ మున్నగు విషయములెన్నో సువిశదముగాఁ బ్రతిపాదింపఁబడినవి, వేయేల "యదిహాస్తి తదన్యత్రనాస్తి" యన్నట్లు భాగవతధర్మములలో నిందుఁ జెప్పఁబడనివియు మఱియొకచోఁ జెప్పఁబడినవియు లేవనియే చెప్పవచ్చు నిది వేదాంతమునకొక సమగ్ర భాష్యగ్రంథమనియు వర్ణింపఁదగు నయితే దీని,యందుఁ బ్రతిపుటలోను విశిష్టాద్వైత సిద్ధాంతము, విష్ణుపరత్వము నన్యదేవతాపారమ్య ఖండనము ప్రతిధ్వనించుచుండు నిట్టిప్రతిపాదనము కొందఱికి గంటకముగానుండవచ్చు నట్లగునని మహాత్ములు సత్యమును వెలార్పక మఱుగుపెట్టరు అప్పటిప్పటి కామాటలాడి తప్పించుకొని మూర్ఖులఁ దమవైపునకుఁ ద్రిప్పుకొనుట లౌకికుల కుత్సితయుక్తి మార్గము. లోకులయందు గౌరవము వడయుటకుఁ బ్రతిఫలమునకు మూర్ఖుల మెఱమెచ్చునకు మహాత్ములు పాటుపడరు. యథార్థమును బ్రకటించి లోకము నుద్ధరించుటే వారిసహజగుణము. తాముయథారూపముగాఁ బ్రతిపాదించినదాని నష్టాఁడైనవాఁ డొక్కఁడాచరించినను తమకార్యము సఫలమైనట్లే భావించుకొందురు. మూర్ఖజనుల గౌరవాదరణములకు వారులోఁబడరు. వారిదృష్టిలోనవి తృణప్రాయములు. కావుననే "పరిగత పరమార్థాన్ పండితాన్ మానంతస్తాస్తృణా మివ లఘు లక్ష్మీర్నైవ తాన్ సంరుణద్ధి అభినవ మదరేఖాశ్యామగండ స్థలానాం న భవతి బిసతంతుర్వారణం వారణానాం" అని చెప్పుటను లక్ష్యభూతులైరి. కాన సకలవేదసారమైనదియు సమస్తశ్రుతిభాగముల సమన్వయముచేసినదియు, పాశ్చాత్య పండితులచేఁగూడ మిగులఁ బ్రశంసింపఁబడినదియునగు విశిష్టాద్వైతమునే మాతాతపాదులు నిరూపించిరి వారికి విశిష్టాద్వైత సిద్ధాంతము జన్మతోడనే వచ్చినది. వారి కాగమ

రహస్యబోధకుఁడు నాచార్యుఁడు పరమపూరుషుఁడైన నారాయణుఁడే. యాదేవాదిదేవుఁడొసరించినయుపనిషద రహస్యమునే భగవదనుభవమునే వారిట్లు వెల్లడించిరి. నీవిట్లేల చెప్పితివని నియమింపనెవరికి శక్యమగును. "నియోగ పర్యనుయోగానర్హస్వ్యమునేరిష్టత్వాత్" కూరేశవిజయ వ్యాఖ్యానమునందు నాసహాయము వారికవసరమాయెనని తత్పీఠికలోనుడివిరి. మఱియు నన్నుఁ దర్క వేదాంత విశారదునిఁగాఁ దెలిపిరి. సహస్రభానునకు దివ్వెతో వస్తుదర్శనము చేయింపవలయునా? వారిది యఖండమై యకృత్రిమమైన దివ్య తేజస్సు. నాబోంట్లది కించిదున్మిషితమైన మానవశక్తి దీనితో వారికేమాత్రము ప్రయోజనముండును. ఇదివఱలో కాకపోయినను వారి సిద్ధవాక్కుచే శుభాశీస్సుచే నట్లు . తర్క వేదాంత విశారదుఁడ నగుదు ననియే తలంచుకొనెద. "ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోనుధావతి" యని యున్నదిగదా. లోకానుగ్రహార్థమై వారు నిఖిలాగమములఁ బరిశీలించి బహు వ్యయ ప్రయాసములకోర్చి ప్రకటించిన యీమహోత్తమ గ్రంథమునుజదివి తదుక్తము నాచరించి భగవదనుగ్రహపాత్రులై యాంధ్రులు వారిపరిశ్రమను సఫలముఁజేయుదురుగాతమని యాశించుచు సకలలోకాధిపతియైన మహావిష్ణుని పాదారవిందముల కెరగి యాజ్ఞాంశ సంభూతులైన మాపితృపాదుల చరణసరోజముల కంజలించి యీపీఠిక నిఁక ముగించుచున్నాఁడను.

పూడివాఁడ
9–4–53

విధేయుడు
కవిభట్టారక, మొవ్వ దాశరథిసూరి



తర్క–వేదాంత, పండిత, కవిభట్టారక,
మొవ్వ దాశరథిసూరి (గ్రంథకర్తగారి మూడవ కుమారులు)

# వార్తాసూచిక


| వి- | పుట |
|---|---|
| శరీర యాథార్థ్యము | 3 |
| శరీరదోషములు | 8 |
| శరీరాస్థైర్యము | 12 |
| శరీరోపయోగము | 14 |
| సంసారబంధము | 25 |
| అరిషడ్వర్గసమాచారము | 39 |
| గుణత్రయవిభాగము | 65 |
| సామాన్యధర్మ నిరూపణము | 69 |
| విశేషధర్మ నిర్ణయము | 78 |
| ద్వితీయ భాగము | |
| మాంసాహారనిషేధము | 165 |
| సురాపాననిషేధము | 184 |
| దురాచారనిషేధము | 183 |
| నాస్తికవాద ఖండనము | 201 |
| లక్ష్మీప్రభావము | 228 |
| విష్ణుపరత్వము | 234 |
| తృతీయ భాగము | |
| భగవదాకార నిరూపణము | 267 |
| భగవత్కల్యాణగుణ ప్రభావము | 280 |
| భగవత్సౌందర్యవర్ణనము | 309 |

| వి | పుట |
|---|---|
| భగవదుపకరణకథనము | 334 |
| భగవదవతారవైభవము | 341 |
| హరిహర తారతమ్యము | 412 |
| చతుర్థ భాగము | |
| భాగవతప్రభావము | 455 |
| భగవదపచారము | 514 |
| భాగవతాపచారము | 523 |
| పంచమ భాగము | |
| అనుష్ఠానావశ్యకత | 535 |
| సర్వరక్షకనిర్ణయము | 567 |
| సర్వశాసకనిర్ణయము | 589 |
| షష్ఠ భాగము | |
| అర్థపంచకనిర్ణయము | 609 |
| రామానుజప్రభావము | 618 |
| కూరేశవిజయము | 667 |
| వైష్ణవనిర్ణయము | 727 |
| ముక్తజనప్రయాణము | 747 |
| పరమపదవర్ణనము | 754 |
| రామానుజవిజ్ఞాపనము | 767 |
| లక్ష్మీవిజ్ఞాపనము | 771 |
| భగవద్విజ్ఞాపనము | 773 |

శ్రీమతే రామానుజాయనమః

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# జ్ఞానసూర్యోదయము

శ్లో॥ శ్రీనీళాధరణ్యేకరార్చితపదాంభోజం లసత్కౌస్తుభ
శ్రీవత్సామలహారసంయుతబృహద్వక్షఃకవాటోజ్జ్వలం
కావేరీ తటినీ తటస్థ విమల ప్రాకారసంవేష్టిత
శ్రీరంగస్థలవాసినం సురనుతం వందే ఖగేంద్రధ్వజం 1

శ్లో॥ సుధామయూఖామలబింబ వక్త్రాం
సుధాశనారాధిత పాదపద్మాం
సువర్ణపీఠానిభకోమలాంగీం
నమామి లక్ష్మీం జగదేకమాతరం 2

శ్లో॥ అనంతసేనాధిప పక్షినాయకాన్
కౌమోదకీ శార్ఙ్గదరారినందకాన్
చండప్రచండాది మురారిసేవకాన్
నమ్రోత్తమాంగః ప్రణతోస్మినిత్యమ్ 3

శ్లో॥ ముక్తప్రసూన పరితోషితరంగనాథాం
సర్వప్రపన్నజన సంసృతి దుఃఖహంత్రీం
శ్రీభట్టనాథతులసీవనభూమిజాతాం
గోదాం భజామి నిరతం మధువైరిపత్నీమ్ 4

శ్లో॥ కాసారం మహనీయభూతవిబుధం శ్రీభట్టనాథం సరో
యోగీంద్రం కులశేఖరం మునివరం శ్రీభక్తిసారం శఠా
రాతిం సన్మునివాహనం యతిపతిం భక్తాంఘ్రిరేణుం ద్విష
త్కాలం మాధురినామకాద్భుతకవిం వందే జగద్దేశికాన్ 5

శ్లో॥ జీవానాం హరిలాభదం మురహరే స్వర్యాత్మలాభప్రదం
నీరాటాద్రిచరాటవీచరముఖప్రాణిచ్ఛటామోక్షదం
పాషండాది పురాణవాగ్ఘతమతాదీవష్టంభవిధ్వంసినం
శ్రీరామానుజయోగిపుంగవమహం, శేషావతారం భజే 6

శ్లో॥ నాథం ద్రావిడవేదవర్ధనకరం సద్యోగవిద్యానిధిం
శ్రీమద్యామునదేశికం పరమతాచార్యైభకంఠీరవం
త్రయ్యంతాఖ్యగురుం కుదృష్టిమతఘోరారణ్యదావానలం
వందేహం మణవాలనామకమునిం కృష్ణాంఘ్రిభక్తిప్రదమ్ 7

వ॥ ఇవ్విధంబున నిష్టదేవతాప్రార్థనంబుఁ గావించి నారెయనర్పం
బూనిన జ్ఞానసూర్యోదయంబునకుఁ గథావిధానం బెట్టిదనిన భగవ
ద్రామానుజమతోద్ధారకుండును విశదవాక్యశిఖామణియు సంస్కృత
ద్రావిడనామకోభయవేదాంతనిర్ణయవాచాధురంధరుండును యోగి
జనాగ్రగణ్యుండును శ్రీ వైష్ణవశరణ్యుండునగు మణవాల మహా
మునీంద్రుండు శ్రీరంగంబున వసించి శిష్యసహస్రంబులకు భగవత్ప్ర
భావంబు బోధింపుచుండ నొక్కనాడు సుశీలుండను భాగవతుం
డద్దేశికశిఖామణితో నిట్లనియె. 8

సుశీలుండు

గురువర్యా! ప్రపంచస్థంబులగు నెనుబదినాలుగులక్షల జన్మం
బులలో నుత్తమం బెయ్యది. 9

పరపరముని
శిష్యా! భూలోకంబున స్థావరజంగమంబులలో మానవజన్మం బుత్కృష్టంబు. 10

సుశీలుఁడు
ఎందువలన? 11

పరపరముని
జ్ఞానం బార్జించి మోక్షంబుఁ జెందుటకు యోగ్యమైనది. 12

సుశీలుఁడు
అట్లైనచో నిది నిర్దోషమైనదేనా? 13

# శరీరయాథార్థ్యము

వరవరముని

కాదు కాదు ఏవస్తువునందైనను గుణదోషంబులు రెండును గలవు. కేవల దోషంబుగాని కేవల గుణంబుగాని దేనియందును లేదు. కాని మానుషజన్మంబునందుఁ గొన్నిదోషంబులున్నను గుణం బెక్కువగానున్నది. దానిదోషంబులు ముందు కొన్నివక్కాణించి యటుపిమ్మట గుణంబులెఱింగించెద నాకర్ణింపు మెట్లంటివేని జీవుండు కర్మానుసారంబుగా నే శరీరంబునఁబ్రవేశించునో యాశరీరంబె తానని తలంచు. దీనినే దేహాత్మభ్రమయందురు సర్వదోషంబులకంటె నిది గొప్ప దోషంబు, యిది యిట్లుండఁగా నిద్దేహము అశుద్ధము మూత్రము క్రొవ్వు వీర్యము రక్తము మజ్జ, చీమిడి, చొల్లు, శ్లేష్మము, కన్నీరు, చెమ్మట, జిహ్వామలము, దంతమలము, అపానవాయువులు మొదలగువానికి జన్మస్థానమై దుర్గంధభూయిష్ఠంబైయున్నది. వెండియు శీతోష్ణంబులు కలిమిలేములు భయాభయంబులు కీర్త్యపకీర్తులు

మానావమానంబులు రాగద్వేషంబులు, శత్రుమిత్రులు, జయాపజయంబులు, పుణ్యపాపంబులు క్షుద్దాహంబులు, కామ క్రోధ లోభ మద మాత్సర్యదంభేర్ష్యాసూయాదర్పాహంకారాదులు దీనియందు జనించును. 14

సుశీలుండు

గురువర్యా! దేహవిషయంబులింకను వక్కాణింపుడు 15

వరవరముని

భాగవతాగ్రగణ్యా తాపత్రయము ఈషణత్రయము వాసనాత్రయము అవస్థాత్రయము అవస్థాచతుష్టయము, ప్రాణపంచకము, ఉపప్రాణపంచకము, కోశపంచకము, ఊర్మిషట్కము, వికారషట్కము, వ్యసనసప్తకము, కష్టాష్టకము, ఇవి నర శరీరమును సంబంధించి యుండును. 16

సుశీలుండు

పైవానిని విశదముగా వక్కాణింపుము. 17

వరవరముని

తాపత్రయము, అనఁగా తాపములు మూఁడు ఆధ్యాత్మికము ఆధిభౌతికము, ఆధిదైవికము, ఆధ్యాత్మికమనఁగా నాత్మవల్లఁగలుగు జ్వరము కుష్ఠము పీనస దగ్గు తలనొప్పి కడుపులోనొప్పి విరేచనములు మొదలగు బాధలు.

ఆధిభౌతికమనఁగా సింగము పులి పాము తేలు మంత్రగర్భ భూత ప్రేత పిశాచాదులు మున్నగువానివలనఁ గలుగు బాధలు ఆధిదైవికమనఁగా దైవముచేఁగలుగు చలి పిడుగు దుర్భిక్షము ఝంఝామారుతము మొదలగు బాధలు. 18

ఈషణత్రయమనఁగా ధనేషణము దారేషణము పుత్రేషణము ధనేషణమనఁగా ధనమునందుఁగల కోరిక, దారేషణమనఁగా భార్యయందుండు నాసక్తి, పుత్రేషణమనఁగాఁ బుత్రునియందుఁగల మోహము. 19

వాసనాత్రయము, లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసనయని మూఁడు, లోకవాసనయనఁగా లోకములో నందఱు తన్నుఁబొగడవలయునను కోరిక, శాస్త్రవాసనయనఁగా శాస్త్రంబులన్నియుంజదివి సభల జయించవలయునను వాంఛ, దేహవాసనయనఁగా దేహము శాశ్వతముగానుండవలయునను కోరిక. 20

అవస్థాత్రయము

జాగ్రత్త, స్వప్నము, సుషుప్తియని,మూఁడు విధంబులు జాగ్రత్తయనఁగా మేల్కొని సర్వమునెఱింగియుండుట, స్వప్నమనఁగా జ్ఞానేంద్రియ కర్మేంద్రియవ్యాపారంబు లుడిగి మనోవ్యాపారము మాత్రము కలిగియుండుట సుషుప్తియనఁగా బాహ్యేంద్రియ వ్యాపారంబులు నంతరింద్రియమగు మనోవ్యాపారంబులు మాని ప్రపంచము మఱచియుండుట. 21

అవస్థాచతుష్టయము

అనఁగా, బాల్యము, కౌమారము, యౌవనము, వార్ధకము. 22

ప్రాణపంచకము

అనఁగాఁ ప్రాణము, అపానము, ఉదానము, సమానము, వ్యానము:

ప్రాణము హృదయమందును, అపానము గుదమునందును, సమానము నాభియందును, ఉదానము కంఠమందును, వ్యానము సర్వశరీరమందును నిలిచి రక్షించును. 23

### ఉపప్రాణపంచకము

నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము, నాగము వాక్కునందుననిలిచి మాట్లాడించును కూర్మము నోరు కన్నులు మూయుటయందును తెఱచుటయందును సహాయమగును కృకరము తుమ్ములిచ్చును దేవదత్త మావులింతలు గలిగించును, ధనంజయము మరణానంతరముకూడా కొంతసేపు నిలిచియుండును.

### కోశపంచకము

అన్నమయకోశము, ప్రాణమయకోశము, మనోమయకోశము, విజ్ఞానమయకోశము, ఆనందమయకోశము. 25

### ఊర్మిషట్కము

అనఁగా, నాకలి, దాహము, శోకము, మోహము, ముసలితనము, మరణము. 26

### వికారషట్కము

గర్భంబులోనుండుట, పుట్టుట, పెరుగుట, కృశించుట, ముదియుట, చచ్చుట. 27

### వ్యసనసప్తకము

కల్లుద్రావుట, వేఁటలాడుట, జూదమాడుట, స్త్రీలంగోరుట, కఠినవాక్యంబులాడుట, ధనము వ్యర్థముగా వ్యయించుట. పరద్రోహము. 28

### కష్టాష్టకము

అనఁగా, బరదేశగమనము, భార్యనెడఁబాసియుండుట, ఆపత్కాలమున బంధుదర్శనము, స్వయంపాకముచేసికొని భుజించుట, పరగృహమందు వసించుట, నిరక్షరకుక్షియై పండితసభలో మాట్లాడుట, దారిద్ర్యము, యాచనావృత్తి. 29

అరిషడ్వర్గము

అనఁగాఁ గామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము. 30

శరీరదోషము

మ॥ మలమున్ మూత్రముక్రొవ్వుచీము నరము, ల్మాంసంబు రోమంబులె
మ్ముకలు శింఘాణము లోహితంబు. నఖరం,బుల్ వెంట్రుకల్ స్వేదముం
గలుషంబౌ పుసి చొల్లు ప్రేవులును దు,ర్గంధంబులున్ గల్గి యా
కలిచే దాహముచే మెలంగఁగదయి కాయంబు హేయంబుగాన్

సీ॥ మాలతీమల్లికామాఖ్యాదిసుమము లి
కాయంబుఁ జేరి దుర్గంధమొందుఁ
గస్తూరికాముఖవస్తుసంఘంబు లి
త్తనువునంటిన సుగంధంబుఁ బాయు
సౌవర్ణభూషణాచ్ఛాదన మాల్యాది
మేని సంబంధంబుచే నశించుఁ
గర్పూరతాంబూల గౌరవం బిత్తనూ
స్పర్శంబుచే నిమేషమునఁ దొలఁగు
మానుషాంగమునంటి దుర్మలినవస్తు
వెద్దియును లేదు దీనియందిమిడియున్న
జీవుఁడెప్పుడు పరిశుద్ధుఁడై వసించు
నని వచించును శాస్త్రంబు లఘువిదూర 32

ఉ॥ గారెలు బూరె లప్పములు, కమ్మనియాజ్యము పాయసంబు బల్
కూరలు జున్ను వెన్న చెఱు,కు-ల్పితదుగ్ధము పప్పు లడ్డు వి
స్తారఫలంబులున్ గుడము. దధ్యుదకంబులు మర్త్యకుక్షిలోఁ
జేరినచో మలంబగును, చీ. యని. రోయుదు రెల్లవారలున్ 33

సుశీలుండు

ప్రభూ ! సర్వజన్మంబులలో నరశరీరంబు శ్రేష్ఠంబని శాస్త్రంబులు దెలుపుచున్నవి సకలజంతువులపై నధికారముగల మానవుండెట్లు నచోఁ దక్కిన జంతువులగతియేమి ? 34

వరపరముని

బిడ్డా ! మానవునకు శరీరమందుఁగాని గృహంబునందుఁగాని స్వాతంత్ర్యమే మాత్రమునులే దెట్లంటివేని 35

సీ॥ పైనిగ వాలినఁ జీనుగుట్టినఁ గుందు
నల్లిచేఁ దోమచేఁదల్లడిల్లుఁ
జీమకాటోర్వదు పాముకాటన్నచో
భయమొందుఁ దేలుగన్పడినఁ జంకుఁ
గీటకంబులచేతఁ జేటొందు బల్లిపైఁ
బడినంతఁ దత్తఱపాటుఁ గాంచుఁ
గాళ్లజెట్టికి మండ్రగబ్బకు మఱి నల్లి
కళ్లపామునకు నిక్కముగ బెదరు

మొసలిచేతను నెగడుచే మోసమొందు
జలగచే భయమొందు నీ ఖలశరీర
మట్లుజడియక వానికినగ్గమైన
శిథిలమై చెడుఁగాదె యో శిష్యవర్య 36

సీ॥ శార్దూలపంచాస్యసైరిభంబులచేత,
భల్లూకకపిమదేభములచేత
సారమేయసృగాలశల్యవారముచేత
ఘనమృగాదనమహాంగములచేత

వాజి మూషక బలీవర్దాళిచేత గో
లాంగూల వృకబిడాలములచేత
రాపులుంగులచేత నేపారు గృధ్రసం
ఘములచేఁ గాక ఘూకములచేతఁ
దేనెటీగలచేఁ దేనెతెండ్ల చేత
భయముఁజెందును నరకళేబరము దుష్ట
జంతువులకగ్గమైన నాశంబుఁజెందు
నీవెఱుంగనివనిగావు నిర్మలాత్మ. 37

ఉ॥ వైరులచే నపాయములు,వచ్చినఁగుందునిదాఘ వాయు సం
చారముచేఁగలంగునతి, శైత్యముచేతఁ గృశించుచుండు నై
గారికపాళి చేఁజెరుపుఁ,గాంచును నిప్పులచేతఁగాలుఁ దీ
పారు నరాంగ మెన్నటికి,నైనను జీవికి సొంతమున్న దే. 38

సీ॥ పంగుత్వముడుగని బాధిర్యమును నత్తి
గూనియు నడ్డియు గ్రుడ్డితనము
పుప్పిగోరులవ్రేళ్లు పుప్పిదంతంబులు
పులిపిరుల్బుడ్డలు బూరగాళ్లు
కణుతులు మచ్చలు కాయకన్నులు మెల్ల
కనులు ముక్కిడి బొల్లి కప్పుఁబొడలు
మూర్ఛ లున్మాదంబు మూకత్వ మెనలేని
కండూతి కర్వాణి కంటి మసక
కలిగి వొప్పారు మానవాంగము తదీయ
దోషములఁ ద్రోసివేయుట దుర్లభంబు
కానఁ దద్దేహమందు సుజ్ఞానులైన
వారు మోహంబుఁగనరు పావనగుణాఢ్య. 39

సీ॥ తలనొప్పి కడుపుంగోపలశూల కడుపులో
బల్లలు మంటలు పాదశూల
చెవిలోనఁబోటు నాసికయందుఁబీనస
సొక్కించు తల మాద ముక్కు మాద
కాస ముబ్బసము మోకాలిపోటులు కుష్టు
కాకరోగంబు భగందరంబు
వాతరోగము చెడువాపులు పైత్యంబు
నారివ్రణము పురాణజ్వరము చ

లిజ్వరము మేహరోగ వాత జ్వరములు
వేన వేలామయము లుద్భవింపుచుండ
బాధఁజెందును నరకళేబరము వాని
నాగశక్యంబు గాదుగదయ్య శిష్య. 40

సీ॥ ఊర్జితాపానవాయువు లావులింతలు
నోలయు పులిత్రేఁపు లొక్కతేప
మితిలేని తుమ్ము లద్భుత విరేచనములు
పెక్కైన వమనంబు లొక్కమాటు
విస్ఫారమైన మారీస్ఫోటకాదులు
నుక్కిన శైత్యంబు లొక్కసారి
తీరని దాహ మతిక్షుత్తు సిరిడి
మిక్కుటంబగు నొప్పు లొక్కవేళ

మందు లెన్ని తిన్న మానని వ్యాధులు
బాధపెట్టుచుండ బడలి సడలి
మచ్చమాయుచుండు మానవదేహంబు
సౌఖ్యమొందుననుట సంశయంబు. 41

మ॥ చలిచే నూష్మముచే ధరావరునిచే, సర్వత్ర యాచించు న
ర్థులచే దారుణ వృష్టిచేఁ బగఱచే, దుర్భిక్ష సంప్రాప్తిచే
బలువాతాశనిలబ్ధిచే నిరతమున్, బన్నంబులం గాంచు దు
ర్మలినాంగంబు సుఖంబు లీయఁగలదే, మర్త్యాళికిం బుత్రకా. 42

శా॥ తైలాభ్యంగన మాచరించిన సుగంధంబేనుచున్నట్టి పూ
మాలల్సుట్టినఁ జందనంబలఁదినన్, మాణిక్యసౌవర్ణ భూ
షాళుల్వెట్టిన భవ్యవస్త్రములు నె, య్యంబ స్ఫుగాఁగప్పినన్
మాలిన్యం బెడఁబాయ దీతనువు పల్మాఱీవు యోజింపుమా. 42

ఉ॥ పుంసనఁజీము పుర్వులునుఁ, బుట్టినరీతి మనుష్యదేహమఁ
దుండి యనేక దుర్మలము లొప్పుగఁగన్నడుఁ గట్టువస్త్రముల్
పుండునఁజుట్టు చేలముల పోల్కిఁ దలంపుము రోగ సస్యముల్
పండెడు సీత్య మిన్నరుని పాడుశరీరమటంచు నెంచుమీ. 43

సుశీలుఁడు

ఈ శరీర మిట్టిదైనచో జనులందఱు దీని నన్నిటికంటె నెక్కు
వగాఁ బ్రేమించుచున్నారే యెందువలన ? 44

వరవరముని

ప్రకృతి వశులైన జీవుల నాదికర్మబద్ధులై దేహాత్మ భ్రమచే
నట్లు తలంపుచున్నారు. 45

సుశీలుఁడు

ఇద్దేహమునకు నాయుఃప్రమాణ మెంత ? 46

వరవరముని

కలియుగంబున నూఱువర్షంబు లిమ్మానవదేహంబున కాయుః

ప్రమాణంబను ప్రతీతి కలదు గాని పూర్ణభంగురంబని బ్రహ్మవేత్తలు వచించిరి. 47

సుశీలుండు

ఈ రెంటిలో నిక్కంబెయ్యది ? 48

వరపరముని

రెండును సత్యమే. ఎట్లంటివేని 49

తే॥ మేను భువిమీఁదఁ గైకొన్న మానవుండు
బ్రతికినట్లైన నూఱేండ్లు బ్రతుకవచ్చు
నదియు ప్రారబ్ధకర్మంబు నాశమైనఁ
జచ్చు నివ్వాక్యమందు సంశయము లేదు. 50

సీ॥ పాదపంబునువీడు పత్రంబులకునైన
వెలలినపండు పెంకులకునైన
మర్దించి నిర్మించు మట్టిగోడలకైన
సారంబులేని కాష్ఠములకైనఁ
గొంచెపు వెలలేని గ్రుడ్డి గవ్వలకైన
దవిలి కోసిన శలాటువులకైన
మూలవైచిన ప్రాఁత నూలి గుడ్డలకైన
కాంతిలేకొను సూదిగములకైనఁ
జాఁపలకునైన శుష్క సస్యములకైనఁ
గొలుచులకునైనఁ జివికిన నులుకకైన
నిలుచుటకుఁ గాలపరిమితి కలదుగాని
కలదె నిల్కడ మానవకాయమునకు. 51

క॥ ఫేననిభంబై మెఱపుల
తో నెనయై కటకములకుఁ దుల్యంబై యు

మ్లానసన దేహము వెలయుం
గాన సుఖంబేవిధమునఁ గలుగు మారా. 52

మ॥ జననంబందిననాఁడో బాల్యమునరో, జానొప్పు కౌమారమం
దునరో యౌవనకాలమందునొ జరా, దుఃఖంబు పైకొన్న వే
ళనొ రోగంబులు క్రమ్మినప్పుడొ మహా, లౌల్యాస్పదంబైన యి
త్తనువుం బాయునుగాదె జీవుఁడు మనస్తాపంబుతోఁ బుత్రకా.

వ॥ బ్రహ్మాండంబను భాండంబునందు భూతసమూహంబను బియ్యంబును సూర్యుండను వైశ్వానరుండు పక్వంబు సేయఁగా, యముండను బుభుక్షితుఁడు స్వీకరింపుచున్నాఁడు. సకలాహారపదార్థంబులు భుజించినను, హంసతూలికాతల్పముల శయనించినను, దివ్యౌషధంబులు స్వీకరించినను, శైల గుహాంతరంబుల డాగినను, నానావిధ యోగసిద్ధు లార్జించినను దేహంబు శాశ్వతంబుగా నిలువదు. భరతఖండంబంతయు మిట్టు పల్లంబు లేకముగా నొనర్చిన పృథుచక్రవర్తియు, సువర్ణవర్షంబు గురిపించి సువర్ణమయజంతువులఁ గల్పించిన సుహోత్రుండును, వియన్నది భూమికి దించి యఱువదివేల పెద్దలకు స్వర్గంబొసంగిన భగీరథుండును శరీరము శాశ్వతంబుగా నిలుపఁజాలరైరి. వెండియు నఱువదివేల వత్సరంబులు రాజ్యంబుఁ బాలించిన దశరథుండును, సత్యహరిశ్చంద్రుఁడు, నలుఁడు, పురుకుత్సుఁడు, పురూరవుఁడు, భరతుఁడు, రంతిదేవుఁడు, మాంధాత, యయాతి, గయుఁడు, ముచికుందుఁడు, పాండవప్రభృతిమహామహులు వపువులు విడిచి కీర్తిశేషులైరి. మఱియుఁ ద్రిలోకకంటకుండగు రావణుండు, లుబ్ధజనాగ్రేసరుండైన సుయోధనుండు, కంస, జరాసంధ, పౌండ్రకాదులు మరణించి యపకీర్తిశేషులైరి. కాని కాయంబుల నపాయంబులుగా నిలుపఁజాలరైరి. 54

సుశీలుఁడు

దేవా ! దేవరవారు వచించిన వాక్యంబులు యోజింపఁగా మానవజన్మంబు నిరర్థకంబని తోఁచుచున్నది. ప్రయోజనం బేమియు లేదా యేమి ? 55

వరవరముని

ప్రయోజనము లేకపోలేదు. ఇంతవఱకు మానవశరీరదోషంబు లెఱింగించితి నిఁక మీఁద గుణంబులు వక్కాణింతు సావధానుండవై యాలకింపుము. జీవుండు. నానావిధ యోనులందు జనించి నానావిధ లోకంబులకేగి నానావిధ సుఖ దుఃఖంబు లనుభవింపవలసి యున్నది. ఇట్టిజీవి యనిష్టనివారణంబు నిష్టప్రాప్తిఁ గలిగించుకొనుట కొక్క సదుపాయంబుగల దెట్లంటివేని 56

సీ॥ నినువలగొనుట కన్నికగన్న పదములు
 నీ పూజఁ జేయఁ బాణిద్వయంబు
భవదీయనామము ల్పఠియించుటకు జిహ్వ
 నిరూపమునుఁ గాంచ నేత్రయుగము
తావక గాథామృతముఁ గ్రోల వీనులు
 దానక వందనార్థము శిరస్సు
మొనసి నీపద తులసిని మూర్కొనఁగ నాస
 చెలఁగి నీమహిమ యోజింపమనము

మానవునకిచ్చితివిగాని మఱి యొకందు
క్రియలేదని వాస్తవమెఱిఁగి నిన్ను
సన్నుతించినవాఁడెపో సజ్జనుండు
విశ్వలోకేశ తిరుమల వేంకటేశ. 57

వ॥ జీవునకిది విశేషధర్మంబు, మోక్షప్రదమైనది, త్రివర్గసాధనంబైన సామాన్య ధర్మంబెఱింగింతు నాకర్ణింపుము. 58

చ॥ అనువగులిండ్లెక్క వివి, ధాంబరముల్ధరియింప మంజు శ
య్యను బవళింపఁ దోఁటల వి,హారము సల్ప హయాది యానము
ల్గాని పయనింపఁ దీర్ఘముల, కుంజని క్రుంకులిడంగ దాన మీ
య నరున కొప్పుఁగాక యిత,రార్హమె పన్నగశైలనాయకా. 59

చ॥ కవినని కోవిదుండనని. గాఢ ధనాఢ్యుఁడనంచుఁ దెల్ప శూ
రవరుఁడనంచు రాజులకు, రాజునటంచు మునీంద్రుఁడైన నా
కెవఁడిల సాటియంచు వచి, యింప బలాఢ్యుఁడనంచుఁబల్క మా
నవునకుఁ జెల్లుఁగాక తగు,నా పరదేహికి వేంకటేశ్వరా. 60

చ॥ నిలుచుటకిల్లు క్రుంకులిడ నీరము పండుకొనంగ మంచముం
జలికిఁబటంబు లాకలికి, సారతరాన్నము రోగశాంతికై
పలువగలైనమందులు పి,పాసనడంపఁగ బానవస్తువుల్
కలిగినవాఁడు మానవుఁడుగా కితరాంగికినుండునే హరీ. 61

చ॥ పకపకనవ్వువాఁడు నిజ,భార్యలఁగూడి సుఖించువాఁడు సే
వకుల గడించువాఁడు సుత,వర్గముతో ముదమొందువాఁడు దే
శికుల పదారవిందములఁ, జేరి భజించి తదీయ సత్కృపా
ప్రకటిత మోక్షముం బడయు,వాఁడు నరుండెగదా మురాంతకా.

చ॥ పులుల వశీకరింపఁ బెను,పుట్టలఁ బాములఁబట్ట వాహినీ
జలముల నడ్డగింప నెఱి,సంద్రములోఁ బయనింప నన్యభూ
ములఁ గృషిచేసి ధాన్యములఁ, బొల్పుగఁగూరుప నిప్పు చేతిలో
నిలుప నరాళికిచ్చితివి, నేరుపు శేష మహీధ్రనాయకా. 63

చ॥ పలువగలైన జంతువుల,పై నధికారమొసంగినావు మ
ర్త్యులకు మనుష్యకోటికయి, నుంచవు నీ ధికార మన్య జ
న్ములకిది మానవుండెఱిఁగి, మోహమువీడి భవత్పదాంబుజం
బులు గొనియాడెనేని భువిఁ, బుట్టక మోక్షముంజెందునచ్యుతా.

ఉ॥ నీకృపఁగన్నచో నరుఁడు, నిర్భయుఁడై భయమేదిచేతనా
నీకము లన్నిటిన్ గెలుచు, నీకృపదప్పినఁ జీమచేతనో
చీకిన ముల్లుచేతనొ కృశించిన సర్పముచేతనో మఱిం
గాకముచేతనో మడియుఁ,గాదె, వృషాచల వేంకటేశ్వరా. 65

చ॥ విలువగలట్టి దేహమొదవెన్ మనకేమను కీవితో మను
ష్యులు నిఖిలాఘ కార్యములఁ, జొచ్చి వెసంజెడకుండఁగూర్చి నా
వలఘుభయంబద్దేమన న,హో క్షణభంగుర మీశరీరముల్
నిలువవటంచుఁదెల్పి ధ,రణిన్ వినశించుటఁజూపి మాధవా. 66

చ॥ జలదసహాయముంగని ర,సాస్థలిఁబండిన ధాన్యరాసు ల
జ్జలదము మాసినంజెడని, చాడ్పున మానిసిదేహలబ్ధిచేఁ
జలిపిన పాపపుణ్యములు, సత్య మసత్యము కీర్త్యకీర్తులుం
బొలియవు మేనునాశముఁ, బొందినజీవికి వేంకటేశ్వరా. 67

ఈపద్యములు శ్రీనివాసప్రభావమను గ్రంథములోనివి. అది మదీయము.

సు శీ లుఁ డు

అయ్యా! జీవునకు మానవశరీరంబు మహోపకారంబంటివి. సరేకాని దీనిచేతనే దేహి పాపపుణ్యంబులు లెస్సగా నాచరించి పాపానుగుణముగా దుఃఖంబులునుఁ బుణ్యానుగుణంబుగా సుఖంబునుఁ బొందుచున్నాడు. మొత్తముమీఁద సుఖములకన్న దుఃఖములు విశేషముఁబొందుచున్నాడు. పాపంబు లొనర్చుట సులభము. పుణ్యంబులొనర్చుట ప్రయాస. శరీరసంబంధములేకుండిన బాగుండు నేమో?

వ ర ప ర ము ని

సుగుణగరిష్ఠా నీవుచెప్పినది సత్యము. ఎట్లంటివేని ? 69

శ్లో॥ పుణ్యస్యఫల మిచ్ఛంతి పుణ్యం నేచ్ఛంతి మానవాః
నపాపఫల మిచ్ఛంతి, పాపం కుర్వంతి మానవాః

మానవులు పుణ్యఫలంబగు సుఖమును గోరుచున్నారు. పుణ్యమొనర్పవలయునని తలంపరు. పాపఫలంబగు దుఃఖము వలదనుచున్నారు. పాపము చేయుచున్నారు. సరేకాని యట్లని మేను వలదన్నచోఁ జేతనాచేతనములకు భేదము కన్పట్టదు. దానివలననే సర్వజీవదయాపరుండగు భగవంతుఁడు పూర్వము ప్రళయకాలములో మిణుగురు పురుగులవలె నేపురుషార్థమునకు జీవులు యోగ్యులుగాకయుంకట వీక్షించి విచిత్రావయవసమూహంబుతోఁగూడిన నరశరీరంబు లయ్యాత్మలకొసంగె.నందులోఁ గొందఱు దుష్కర్మపరులు కలుపుదీయుటకిచ్చిన కత్తితోఁ గన్నులు బొడుచుకొన్నట్లు అకృత్యకరణ, కృత్యాకరణ, భగవదపచార, భాగవతాపచార, అసహ్యాపచారంబు లొనర్చి నరకార్హులైరి. వారిలోఁ గొందఱు బుద్ధిమంతులుమాత్రము,

సీ॥ ధీరులై వివిధాధికారులై సుందరా
కారులై యాశ్రితాధారులగుచు
శూరులై లోకసంచారులై సత్కులో
ద్ధారులై జ్ఞానవిచారులగుచు
సూరులై విలసదుదారులై పుణ్యప్ర
చారులై వృజినసంహారులగుచు
హారులై సుగుణవిస్తారులై మానినీ
మారులై దుఃఖవిదూరులగుచుఁ

బేరుఁగాంచిరి కాంచుచున్నారు ముందుఁ
గాంచనున్నారు వీ రిన్నితీరులైన
హేతువెన్నంగ నరజన్మమెత్తుటొకటి
కాక యితరాంగములచేతఁగావశంబె.

సీ॥ కవులై కులీనసంభవులై పవిత్రవై
ష్ణవులై ప్రశస్త సాధువులనంగ
గురులై ప్రతాప భాస్కరులై ధనాఢ్య శే
ఖరులై సదాచారపరులనంగ
ఘనులై వనీప కావనులై మహామాన
ధనులై ప్రభూత పావనులనంగ
వ్రతులై పరాక్రమాన్వితులై బుధేంద్ర స
న్నుతులై గుణ మణీయుతులనంగఁ

జెలఁగుచున్నారు కొందఱీ క్షితితలమున
వార లాకీర్తిఁ గీర్తి విస్తారులగుట
కరయ హేతువు మనుజ దేహంబె కాక
యితర జన్మంబులందిట్టు లెనయవశమె.

సీ॥ ధీశాలియైన దధీచి శల్యంబుచే 72
బర్హిర్ముఖుల వనీపకులఁ జేసె
రఘుభూవరుండుదారత్వంబుచే ధర్మ
దేవతా హృద్వాంఛఁ దీర్పఁగలిగెఁ
గానీను డజినంబుచే నిర్జరేశ్వరా
శయసంస్థితోరు సంశయముఁ బాపె
బలిచక్రవర్తి శ్రీభామినీనాథ పా
ణిస్థలంబున దాన నీరమునిచెఁ

బంక్తిరథముచికుందాది పార్థివేంద్రు
లరిగి స్వర్గవిపత్తుల నడచి కీర్తిఁ
గనిరి వారట్టులగుటకుఁ గారణంబు
మానవత్వంబె కాదె నిర్మలచరిత్ర. 73

సీ॥ కనకాంబరునకు స్వజనకులై దశరథ
వసుదేవు లుర్విఁ బేఁసముఁ గనిరి
పంకజాక్షుని బహిఃప్రాణము లీవ్వరని
ప్రఖ్యాతినొందిరి పాండుసుతులు
మధుదానవారికి మామలై జనక భీ
ష్మ నృపాలకులు జగన్మాన్యులైరి
చక్రాయుధున కాత్మ సంబంధులై యాద
వులు నిరంతర కీర్తినిలయులైరి

గోపికాగోపకులు నాలమేఁపు బాల
కులు సమాఖ్యవహించిరి జలజనాభు
నలఘు భక్తి భజించి వారట్టులగుటఁ
దలఁప హేతువు మానవత్వంబె కాదె.

సీ॥ ధీమంతుఁడైన విశ్వామిత్రకన్నది
స్రష్ట సృష్టికి మాఱు సృష్టిఁ జేసెఁ
గలశీభవుఁడు గంధిజలమెల్ల నఱచేత
గుండెడు చేసి గ్రక్కున గ్రసించె
సాత్యవతేయుండు చచ్చినవారి ద
ర్శింపించి ధృతరాష్ట్రు చింతఁబాప
నౌర్వుండు తనకోప మంభోధిలోపల
బడబాగ్నిగానుంచి పరిఢవిల్లె

బాళి నభిమన్యుసుతునకు భాగవత క
థా విధానం బెఱింగించి పావనాప
వర్గ సుఖమిచ్చె శుకమునివర్యుఁడివి న
రాంగసంబంధమైన కార్యములుగావె.

సుశీలుఁడు

తండ్రీ ! నరశరీరధారులైనను బురుషులగుటచే నట్టి దుష్కర్మ కార్యంబు లొనరించిరి. స్త్రీ జన్మంబు వ్యర్థమేగదా ? 76

వరవరముని

సీ॥ పొలఁతిలేకున్నచోఁ పురుషుండు వుట్టడు
పురుషుండు లేకున్నఁ బొలఁతిరాదు
మగవాఁడు బీజంబుఁ దగినచోనుంపంగ
క్షేత్రమైకాంత రక్షింపుచుండుఁ
పదిమాసములుమోచి సుదతి బిడ్డనుగన్న
నటుమీఁదఁ బూరుషుఁడాదరించుఁ
దల్లియై పిల్ల నాదట లేమ పోషింపఁ
దండ్రియై మగవాఁడు ధనములిచ్చు
నతిథి పూజలు జరిగింప నఖిల ధర్మ
కార్యము లొనర్ప సద్మసౌఖ్యములు వొందఁ
గారణము మగవానికి నారిగాదె
లేరు దేహులు దంపతుల్ లేనినాడు. 77

సుశీలుఁడు

భార్య లేకయున్నను మగవాఁడు మోక్షంబుఁజెందుట కడ్డు లేదుగదా ? 78

వరవరముని

పుట్టినవాఁడుగదా మోక్షమునకు యత్నించును. నంతకు ముందుఁ దల్లియున్నచో జన్మించును. శరీరములేకున్న జీవుండేపనియుం జేయ నర్హుండుగాఁడు. బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులు, సన్యాసు లవధూతలు గృహస్థధర్మము నెఱపుచున్న దంపతులవల్లనే జన్మించిరి. కావున వధూజన్మంబు వ్యర్థంబుగాదు. 79

 

సుశీలుఁడు

మంచిది. యావిషయంబే సెలవిండు. 80

వరవరముని

సీ॥ జానకీదేవి లంకానాశ మొనరించి
జేజేనెలంతల చెఱలుమాన్పె
సావిత్రి సుతులచే సమవర్తిమెచ్చించి
యాత్మనాథునకు దీర్ఘాయు వొసఁగె
నలపత్ని నిజ తపోబలముచే వ్యాధుని
మసిఁజేసి పుడమిఁ బెల్లసముఁగాంచె
నాయనసచణకంబు లభ్యాషము లొనర్చి
యత్రిపురంధ్రి విఖ్యాతిజెందె
వర వసిష్ఠునిభార్య వివాహవేళ
దంపతులచే సపర్యావిధాన మొందె
జీవులిట్లు యశస్సు నార్జించుటెల్ల
మనుజదేహంబుఁ బ్రాపించి మనుటగాదె. 81

సీ॥ ఒకలేమ జగదీశునకు రామరూపంబుఁ
గలిగించి పొత్తుల నిలిపి సాఁకె
నొకయింతి భగవంతునకు వనవాసంబుఁ
గలిగించి మాని దుఃఖంబడంచె
నొకచాన లక్ష్మీశునకుఁ గృష్ణరూప మే
ర్పాటుఁగావించి వ్రేపల్లెనునిచె
నొకనాతి యాగభోక్తకు జున్ను పాలు మీఁ
గడలచే సంతృప్తిఁ గలుగఁజేసె
నాదిమధ్యాంతరహితు నజాండభాండ
గర్భు వేదాంతవేద్యు నిక్కారణిఁ జెలు ల

ధీనునిఁ జేసి మనిరిపో మానినీత్వ 82
మరయ సార్థకమేల గాదయ్య శిష్య.

సీ॥ లలి విప్రవామాలలామంబు లర్పించు
సాంతరోదనం బారగించి
వ్యాధాంగనోచ్ఛిష్ట వన్యఫలావళి
వీక లక్ష్మణునితో స్వీకరించి
యాజ్ఞసేనీదత్తమగుశిగ్రులవముచేఁ
బరితుష్టిఁగాంచి విపత్తుఁబాపి
వల్లవీమణులను వాచామగోచరం
బైన సౌఖ్యములచే నాదరించి
పూతనాస్తన్యమును మహాప్రీతినాని
మోక్షసామ్రాజ్యమిడిన దామోదరుండు
తక్కిన పొలంతులకు నేలదక్కకుండఁ 83
దలఁపఁగా స్త్రీభవంబు సార్థకముగాదె.

సీ॥ అంగరాగమొసంగి హరితోడలలి నిధు
వనమందఁగలరె త్రివక్రపోల్కిఁ
జూచినంతనె రమేశునిఁ బతిగాఁజేయఁ
గలరె పదార్వేల కన్యలట్లు
గాఢానురక్తిచేఁ గమలాక్షునకుఁ బరి
రంభమిత్తురె గోపరమణులట్లు
వనజనాభనకు మైథునసౌఖ్య మీయ నే
ర్తురె సత్యభామాది తరుణులగతి
సారిదిఁ గౌసల్యకీతి యశోదలీల
నిందిరాధీశునకు స్తన్య మీయఁగలరె
పురుషులగువారు శ్రీహరి కరుణఁజెంద
మగవొడలికన్న మేలు భామాభవంబు. 84

సుశీలుఁడు

స్వామీ! ప్రాపంచిక కార్యములన్నియు మాని భగవత్సేవ సేయుట జన్మంబునకు సార్థక్యంబని వచించితిరి. స్రక్చందనవనితాది భోగంబు లనుభవించు టెప్పుడు? 85

వరవరముని

వత్సా! యిదివఱకుఁ గడచన్న కాలంబునందు జీవుం డెత్తిన జన్మంబులు కోట్లుగలవు. జన్మమెత్తినప్పుడెల్ల నిద్రాహారభయమైథునంబులతోఁ గాలంబుం గడపుచున్నాడు. కాని యెుకప్పుడైనఁ దృప్తిఁ జెందినవాఁడుగాడు. భోగస్థానంబులైన గృహాదులును, భోగోపకరణంబులగు నింద్రియంబులును, భోగ్యంబులగు ప్రాకృత పదార్థములును నిత్యంబులుగావు. శరీరంబును నిత్యంబుగాదు. భోగలాలసచే శరీరి సంసారసాగరనిమగ్నుండై దరిగానక తల్లడిల్లుచుండు. 86

సుశీలుఁడు

సంసారంబన నెద్దియో, ఎట్టిదో సెలవిండు. 87

వరవరముని

జీవునకు జ్ఞాన సంకోచమే సంసారము, జ్ఞాన వికాసమే మోక్షము. నిత్యసూరులును, ముక్తులును సదా జ్ఞానవికాసము కలిగి యుందురు. కనుకనే వారికి సంసారబంధ మెన్నటికిని రాదు. బద్ధులెప్పుడును జ్ఞానసంకోచము గలవారై యజ్ఞానము అన్యథా జ్ఞానము, విపరీతజ్ఞానముగలవారై సంసార చక్రంబునఁ బరిభ్రమించుచుందురు. కోటి కల్పములకైనను బంధవిముక్తులు కాజాలరు. సంసారమును గూర్చి బ్రహ్మవేత్త లనేకులనేకవిధంబులఁ బ్రసంగించిరి. వానిలోఁ గొన్నివిషయంబులు వివరించెద నాకర్ణింపుము. 88

శ్లో॥ తృష్ణాతోయే మదన పవనోద్ధూతమోహోర్మిమాలే
దారావర్తే తనయసహజగ్రాహ సంఘాకులే చ

సంసారాఖ్యే మహతి జలధౌ మజ్జతాం నస్త్రిధామన్
పాదాంభోజే వరద భవతో భక్తి నావం ప్రయచ్ఛ

ఆశయను నీటిచేతను, మన్మథుఁడను గాలిచే నెగురఁగొట్టఁబడిన మోహమను వాగలచేతను, భార్యయను సుడితోడను, బుత్ర సహోదరులను మొసళ్లచేతను భయంకరమగు సంసారసముద్రమును దాఁటుటకు నోకృష్ణా! నీ పాదభక్తియను నావను దయచేయుమని కులశేఖర దివ్యసూరి ప్రార్థించెను. 89

శ్లో॥ అవివేక ఘనాంధ దిఙ్ముఖే, బహుధాసంతతదుఃఖ వర్షిణి
భగవన్ భవదుర్దినే పథః, స్ఖలితంమామవలోక యాచ్యుత.

అవివేకమను నంధకారముచే మూయఁబడినదియు, దుఃఖములను వర్షములు గలదియు, సంసారమను దుర్దినంబునఁ గాలుజాఱి పడిన నన్ను నో భగవంతుఁడా శీతల కటాక్షంబున వీక్షింపుమని యామునాచార్యులవారు నుతించిరి. 90

దుర్వ్యాధులను పెద్దపులులు, పుత్ర దార గృహ క్షేత్రాదులను నెండమావులు, విషయములను పొదలుగల సంసారమను నీరులేని యడవియందు నవివేకమను గ్రుడ్డితనముతో నిటునటు తారాడుచున్న నన్ను నో వరదరాజస్వామీ రక్షింపుమని తిరుక్కచ్చినంబిగారు వచించిరి. 91

శ్లో॥ నసంసారా త్పరోరిపుః = సంసారమునకు మించిన శత్రువులేదని యొకఁడు వచించెను. 92

వ॥ మఱియుఁ బూర్వము పుత్రశోకాతురుండైన ధృతరాష్ట్రునిఁ గాంచి విదురుం డిట్లనియె. నో రాజేంద్రా దుర్యోధనాదులు మరణించినందులకు దుఃఖింపుచున్నావు. ప్రయోజనమేమియులేదు. సంసార గహన కథఁజెప్పెద నెట్లంటివేని, నొకానొక బ్రాహ్మణుఁడు పోయి పోయి యొక ఘోరారణ్యముఁగాంచె. నవ్వనము సింహ, వ్యాఘ్ర,

గజవ్యాళోగ్రమైయుండెను. భయంకరమైన ధ్వనితోఁగూడియుండెను. మఱియు నవ్వనములో దగ్గఱదగ్గఱ వాగురలుండెను. (అనఁగా నురులు) ఘోరరూపిణియగు నొక స్త్రీ యుండె. నయ్యరణ్యమున కంతము లేదు. బైటికిఁబోవుటకుఁ ద్రోవలేదు. విప్రుం డగ్గహనంబునందుఁ బోవఁబోవ నగాధంబైన బావియుండె. నబ్బావిలో నైదు శిరస్సులు గల ఘోర సర్పముండెను. దట్టమైన గడ్డితోడను, గట్టి తీఁగలతోడ నకూపము గప్పఁబడియుండెను. అదివఱకుఁబోవుచున్న మనుజుం డబ్బావిలోఁ దలక్రిందుగానుఁ గాళ్లు పైఁగా నుండునట్లు పడి వ్రేలాడుచున్న తీవలలోఁ జిక్కియుండె. నకూపతటంబున నొక్క వృక్షముండెను. నల్లని తెల్లని యెలుక లా చెట్టువ్రేళ్లు నఱకుచుండె. నప్పాదపముక్రింద నాఱుముఖములు, పండ్రెండు కాళ్లు, రెం తోఁకలుగల యేనుఁగుండె. మఱియు నాచెట్టుమీఁద భయంకరములగు తుమ్మెదలు పుష్కలముగాఁ దేనెతెట్టెలు సమకూర్చియుంచె. నత్తెట్టెలనుండి కాఱుచున్న తేనెధారల నెన్నాళ్లుఁ గ్రోలినను మనుష్యునకుఁ దృప్తిలేకయుండెనని చెప్పిన విదురుం గాంచి ధృతరాష్ట్రుం డిట్లనియె. నీతిశాస్త్ర విశారదా! నీవు వచించినది చక్కఁగాఁ దెలియలేదు. విశదముగాఁ దెలుపుమనఁగా విదురుండు మరల నిట్లనియె. 93

ఓరాజా యిప్పుడు నేను వచించిన కాంతారము సంసారము నాలుగువైపుల నొడ్డియున్న యురులు రోగంబులు. వనములోఁ గానంబడిన స్త్రీ ముసలితనము. అగాధమైన బావి దేహము. బావిలోనుండు సర్పము సర్వభూత సంహారకుఁడైన యముండు. కూప మధ్యములో వ్రేలాడు తీవలు జీవితాశ. బావి యొడ్డుననుండు వృక్షము మనుష్యుని యాయుఃప్రమాణము. చెట్టు వ్రేళ్లు నఱకుచున్న నల్లని తెల్లని యెలుకలు రేయి పవళ్లు. చెట్టుక్రిందనున్న యేనుంగు సంవత్సరము. రెండు తోఁకలు రెం డయనంబులు. ముఖంబు లాఱును వసంతాది ఋతువులు. పండ్రెండు కాళ్లు చైత్రాదిమాసంబులు. చెట్టుపైనుండు తుమ్మె

దలు కామంబులు. కాఱుచున్న తేనెధారలు కామరసంబులు, ఎన్ని యనుభవించినను తృప్తిలేనివాఁడు సంసారి సుమీ యని విదురుండు ధృతరాష్ట్రున కెఱింగించెను. 94

(మహాభారతము, స్త్రీపర్వము.)

సుశీలుఁడు

దేశికసార్వభౌమా ! నే నేమో యనుకొంటిని. సంసారములో నింత కష్టంబుగలదా ? 95

వరపరముని

నిస్సారంబగు సంసారంబునంగల బాధలింకను వచించెద నాలకింపుము. గృహస్థధర్మంబున నన్నిటికిమించినకష్టము దారిద్ర్యము. 96

సీ॥ దినదినం బాహార మొనఁగూడనీయదు
విరివిగా వస్త్రముల్దొరకనీయ
దింటిపైకప్పుండనీయదు బాంధవ
జనుల రానీయదు సదనమునకు
నప్పులిచ్చినవారి కగపడనీయ ద
సత్యవాక్యములన్న జంకనీయ
దతిథులౌ వారి నోరాడనీయదు దొంగ
తనమన్న శంకనొందంగనీదు
దొరతనమువారు పిలిచిన దొరకనీదు
పరధనాపేక్ష తప్పని పలుకనీయ
దౌర దారిద్ర్యమునకంటె హానికరము
కలుగునే గృహపతికి లోకంబునందు 97

సీ॥ ఇల నేడుదీవులనేలు హరిశ్చంద్రుఁ
గూలివానిగఁజేసె మాలనికడఁ
జక్రవర్తిపదంబుఁ జవిఁగొన్న నలధరా
జానిని మఱుగుజ్జువానిఁజేసెఁ

బదివేలగౌరుల బలముగల్గిన భీమ
సేనుని వంటలవానిఁజేసె
జేజేలగెల్చి భాసిల్లినట్టి కిరీటి
నోడించి యేడాది పేడిఁజేసె

నారదైన్యము, పైవా రుదారపుణ్యు
లగుటఁగడచి సుఖించిరయ్యాపదను, న
రాధములు దాఁటఁగలరె యియ్యవనియందు. 98
విశ్వలోకేశ! తిరుమల వేంకటేశ!

వ॥ దారిద్ర్యవిషయ మటుండనిచ్చి సంసారబాధ లింకను
గొన్ని ప్రస్తావించెద సావధానుండవై యాలకింపుము. 99

సీ॥ పాపిష్ఠికామంబు ప్రబలినప్పుడు దాని
వారింప భార్యకావలసియుండు
రహి నెలంతుక కాఁపురముసేయుటకు రాఁగఁ
బెంపారు గీము నిర్మింపవలయు
నింటిలోపలనుండి యిల్లాలిఁగలియంగఁ
వింతగాఁబిల్ల లావిర్భవింతు
రా పిల్లలనుఁబ్రోచిన నఖిల వృత్తులఁబ్రవే
శించి ధనంబు లార్జింపవలయు

ధనముఁగూర్చువేళ జనుఁడొందుకష్టంబు
లెన్న నేరిశక్య మిన్నిటికిని
మూలమైన కామమునుజంపు శక్తి నా
సంగుమయ్య శేషశైలనాథ. 100

సీ॥ తనమాటకొప్పని దారఁబాసి మగండు
పస్తుండికొన్నాళ్లు పలుకకుండు

దీని చేతి వసాన మూని భక్షింపుచో
నను గాడిదని దూఱుడని వచించుఁ
బిల్లలకొఱకుగా కిల్లాలిఁ దృణముగా
విడిచిపోవనెయంచు నుడువుచుండుఁ
దరువాతఁ బుట్టింటికరిగిన భార్య ర
ప్పింపగఁ గబురు లంపించుచుండుఁ
జాన రాకయున్నఁ దానేగి బ్రతిమాలి
తెచ్చి గీము విత్తమిచ్చి పొగడు
నింతవింతగాఁగ నీకాఁపురంబెట్లు
నరునకిచ్చినావొ సరసిజాక్ష. 101

సీ॥ ఈ.పా. కాపురం బిఁకఁ జేయలేనని
పుట్టింటికొకసారి పోవుచుండుఁ
గాలుండుగాని మగఁడు గాడువీడఁని
మగవాని నొక్కొక్కమాఱు దూఱుఁ
గోటిబంధువులైన సాటివత్తురె ప్రాణ
విభునితోనని రెుక్కవేళఁబొగడుఁ
దనయులఁగాంచి మాతండ్రి గీమునకు రా
డయ్యె నేడనుచు నొకప్పుడడలు
నిన్నివిధములఁ జలియించి యింతులు పతి
నలముకొని కాఁపురమొనర్తు రనవరతము
బళిబళీనీదుసృష్టిఁ జెప్పంగనశమె
విమలకీర్తిప్రకాశ శ్రీవేంకటేశ. 102

సీ॥ త్రాడుదీసెదనంచు దారనల్కఁగ వీపు
పగులఁగొట్టెదనంచు భర్తదూఱు

విడుతునిన్నని యాలుసుతుల నీపైఁదాని
గైకొంముజుమ్మంచుఁ గాంతుఁడౌను
బ్రతుకనే నేనని భార్యవల్కఁగ నాకు
జరుగదా సొమ్మంచు వరుఁడదల్చు
నీవెంతయని జాయ నిరసింప నిఁక నోరు
మూయింతుననితేఁకు మొఱఁగఁ జూడు

నింకమీఁద వీర లేకీభవింపరం
చన్య్మ తెంచునట్టు లాడియాడి
రొకరి నొకరు వీడనొల్లరుదంపతుల్
నీదుమాయచేత నీరజాక్ష. 103

ఉ॥ ఒక్కఁడు భార్యఁగాంచి ముదమొందుఁ గుమారుని శ్రీవిజూచి వే
ఱొక్కఁడు సంతసించు ధన,మొందియొకండు రుధాన్యమొంది యిం
కొక్కఁడు మంచితిండిఁదిని, యొక్కఁడు పొంగునుగాని కాలుచేఁ
జిక్కెదనంచు డీల్పడఁడు, చిత్రముగాదె వృషాచలేశ్వరా. 104

సీ॥ చాలినంతధనంబు సమకూర్చితిమి వారు
కొను సుతుల్ లేరని కొంతమంది
యేటేటఁగాన్పయ్యె నిఁకఁ గామసౌఖ్యంబు
కొనసాగదని మఱికొంతమంది
కోడండ్రు కోలీలు కూతులకరణము
లూర్చితోసిలేక కొంతమంది
కొడుకులనేరము ల్కొడంద్రచేఁగల్లు
వంతలోర్వఁగలేక కొంతమంది

బాధపడుచుందురేగాని పాడునరులు
చావుగలదని తెలిసి నీచరణకమల
సేవఁజేసి తరింపరీ చిత్రమేమొ
విమలకీర్తిప్రకాశ శ్రీవేంకటేశ. 10.

సీ॥ సఖులతోఁ దనయ బాలికలతో భూరి సే
వకులతో నాముకేనికలతోడ
హారులతోఁ దాపిప్రాసరులతో ఘనవధూ
వరులతో వెలయుసుందరులతోడఁ
బాలతో నెఱి పావురాలతో నునుమూల
జాలతో బలి తంపుటాలతోడ
వడ్లతోఁ బెనునేతిబుడ్లతో విరివియా
దోడ్లతోఁ బసగల్లు నెడ్లతోడఁ

బరఁగుచున్న గృహములొక్క తరుణమందు
నామమాత్రావశిష్టంబులై మహీస్థ
లమునఁ దోఁచును గారడిలాగున బళి
విమలకీర్తిప్రకాశ! శ్రీ వేంకటేశ! 106

సీ॥ ధనముండి బిడ్డలొందవకున్నఁ గుక్కనో
పిల్లినో ప్రేమించి పెంచుచుండు
భార్యఁ గైకొనెడు పుంభావంబు లేకున్న
వింతైనపనులు గావింపుచుండుఁ
దన్నుఁ బ్రేరించి పెత్తన మీయకున్న నిం
టింటఁ దిరుపుఁ జెప్ప నేగుచుండుఁ
దిని పండుకొనుమంచుఁ దనవారు బోధింపఁ
బనులకై యాయాసపడుచునుండుఁ

గాని నినుఁ గొల్వలేడు దుర్మానవుండు
నిఖిలమునుఁ గలవాని వర్ణింపనేల
జీవికర్మమొ యిది భవత్సృష్టివిధమొ
విమలకీర్తిప్రకాశ శ్రీ వేంకటేశ. 107

సీ॥ ఈకార్యమయ్యె నాకింక విత్తంబేది
కనరాదు నూఱుకార్యంబులుండుఁ
గులకాంతతోఁ గూడుకొంటిఁ గామముదీఱె
ననరాదు పెఱలేమ లవసరమగుఁ
దప్పెగండములు సాధ్వసములేదన వీలు
గాదనేకము ముందుఁగలిగియుండఁ
గడుపారఁదింటి నాకలిదీఱె ననఁగరా
దాకలి మఱుపూటకల్గె మరలఁ

గలుగుదీనమ్మకంపు బంగారుగాను
పాడుసంసారమిట్లుండ బద్ధుఁడైన
వాఁడు కడతేరుటెట్లు నీవాఁడుగాక
విమలకీర్తిప్రకాశ శ్రీవేంకటేశ. 108

సీ॥ భృత్యుండు రాఁ డింటికృత్యంబు లెట్లను
నంతలో ఋతుమతియయ్యె భార్య
వంటకృత్యము సేయవలెనంచు యత్నింపఁ
గులగురుండరుదెంచి పిలువఁబంచె
నతని సన్మానార్థ మరుగుచుండంగఁ గ
ప్పమునకై గ్రామాధిపతియుఁజీరె
దానికై యోజించుతఱి లేఖవచ్చెఁ గో
డలి సమర్తకు శాంతికలిగెననుచు

నిన్ని యిటులుండఁగానె పాలిచ్చుబఱ్ఱె
తన్నె, జామాత మున్నిత్తునన్న కట్న
మడుగుటకువచ్చె నరునకియ్యాగడంపుఁ
గాఁపురంబెట్లుగూర్చితో గరుడవాహ. 109

సీ॥ అప్పుదెచ్చిన ధనంబడుగువారొక వైపు
పెక్కు మార్గణసంఘ మొక్కచాయ
లక్ష్యములేని పెండ్లము బిడ్డలొకప్రక్క
ధిక్కరించు విరోధు లొక్కయోర
బలుసాయములుగోరు బాంధవు లొకదెస
రొక్కంబడుగు భృత్యు లొక్కవంకఁ
దఱిఁ బన్నడుగు ప్రభుత్వమువార లొకచెంపఁ
జెలఁగి దూషించు దుష్టులొకతట్టు
మూఁగుచుండంగ సంసారమునొనరించు
మానవుం డూరు పాడక మ్రగ్గఁగాని
దీనిమూలంబు నిన్ను నుతించి తెలిసి
కొనఁగడంగ డిదేమియో వనజనాభ. 110

సుశీలుఁడు

స్వామీ మీరు వెల్లడించినకొలంది సంసారపీడ తెల్లంబగుచున్నది. భయంబొదవుచున్నది. మీవంటి మహాత్ము లీలోకంబున జన్మింపకున్న మావంటి పామరులకు దిక్కులేదు. భవద్వాగమృతంబును జుఱ్ఱుచున్న నాకుఁ దనివిగలుగలేదు. ఇట్టి సంసారంబునఁ గూలిన బద్ధునకు తుద కేమగును. 111

వరవరముని

సంసారబద్ధుండైనవాఁడు పరలోకంబున కేగి సుఖ దుఃఖముల ననుభవించి మరల నీలోకమునకు వచ్చు సమాచారంబువినుము. 112

సీ॥ ఆకాశపథమునం దధికబాధలుసెంది
మంచులోపలఁ బ్రవేశించి పొగిలి
తరువాత సూర్యుని కిరణజాలముఁ జేరి
వెడలి సస్యములోఁ బ్రవేశ మొంది

యటుమీఁద ధాన్యంబునందు నన్నమునందు
వరుసగా నివసించి వదలి పురుష
గర్భంబునందుండి కాంతాపురుష సమా
వేశకాలమునందు వెలఁదిగర్భ
గోళమునఁబడి మలమూత్రకూపమందు
మాసనవకంబుదాఁక సమస్తబాధ
లనుభవించి జగన్నాథునాజ్ఞ తనకు
వచ్చెనేని జనించు భూవలయమందు. 113

ఉ॥ ధారుణిపైజనించి యొక,తల్పమునందు శయించి తన్నుఁదా
నారసి ప్రోచుశక్తి యిసు,మంతయులేక పరానుకూలుఁడై
తోరపు మత్కుణంబులును, దోమలు చీమలు పాము లీఁగలున్
సూరెలమూఁగి కుట్టినను, శోకమునొందుచుఁ దోలలేఁడొగిన్. 114

చ॥ అహరహ మన్యదత్తమగు,నట్టి పదార్థములే భుజింపుచున్
గ్రహములుగ్రమ్మ రోగములు,గల్గినఁ బూనివచింపలేక దు
స్సహమగు బాధఁజెంది యొక,సావికిఁ గొంచెముసాయమొంది ఖే
లహృతమనస్కుఁడై యెపుడు, లక్ష్యముసేయఁడు లాఁతి
కార్యముల్. 115

ఉ॥ అంతట యౌవనం బడలి,యందునఁ గన్నడఁగా, మదాంధుఁడై
కంతుశరప్రహారములఁ, గస్తిజనింపఁ బ్రతీపదర్శిని
సంతతి నాశ్రయించి యరు,సంబునఁ గాలముఁబుచ్చి నొచ్చి యా
నంతయు లజ్జలేక 'బహుళామయ పీడితుఁడై కలంగుచున్. 116

చ॥ ఇపుడు గృహస్థధర్మమున, కెంతయు వీలగు సావివచ్చెనం
చపరిమితానురాగమున, నంగననొక్కతెఁ బెండ్లియాడి య

చ్చపలవిలోనంగలిసి, సంసృతిసౌఖ్యవశీకృతాత్ముఁడై
కృపణతచే ధనార్జనము, గింజలుపున్ వివిధైకవృత్తులన్. 117

వ॥ గృహస్థధర్మంబు ప్రారంభించినదిమొదలు నరుండొందు బాధలు వక్కాణించుట కలవిగా దైననుఁ గొలఁదిగా నెఱింగింతు.

సీ॥ నడిమిబిడ్డకురోగ ముడుగదయ్యో యంచుఁ
దనమాటకొప్పడు తమ్ముఁడనుచు
నప్పుమోపయ్యె నెట్లనుచు నిల్లాలితో
నానలేనిపోరయ్యె నెట్టులనుచుఁ
జిన్నవానికిఁబెండ్లిఁ జేయనైతినటంచుఁ
బెద్దవానికిలేరు పిల్లలనుచు
నినుఁడురాడయ్యెఁ గూతునకంచుఁ గోడండ్రు
ముప్పతిప్పలువెట్టి దెప్పిరనుచు
స్నేహితులు పరిపంథులై చెఱచిరనుచుఁ
బొరుగిరుగువారు తనకు మేలరయరనుచుఁ
దెలిసిచుట్టాలు కోర్కులు దీర్పరనుచు
జనుఁడు దుఃఖపుచుండు సంసారమందు. 119

సీ॥ తద్దినంబరుదెంచె ద్రవ్యంబులేదని
పాలీయదీనాఁడు బఱ్ఱెయనుచు
నింటిపై కప్పులేదేమిచేయుదునని
పసులకుమేఁత కన్పట్టదనుచు
నపవాదముల కర్హమయ్యె జన్మంబని
జీవనోపాయంబు చిక్కదనుచుఁ
బరిచర్యఁ జేయఁజాలరు కుమారకులని
యుద్యోగ మీనాటి కూడెననుచు

జరుగదిత్తఱిఁ దనవ్యవసాయమనుచు
వర్తకంబున నష్టము వచ్చెననుచు
శాంతిలేకనరుండు సంసారమందుఁ
జిక్కి విలపింపుచుండు సంచితగుణాఢ్య. 120

వ॥ ఇట్లు మానవుండు సంసారపారావారంబునంబడి యీఁదు
చుండ వార్ధకంబు సంభవించు. 121

సీ॥ తనశరీరముకంటెఁ జెనుకూర్మిఁబోషింపఁ
బడినట్టి కులకాంత పరిభవింపఁ
జననాటనుండి తామనిచి సంతతము లా
లించిన సుతులు దూషించి తొలఁగఁ
దన ధనవ్యయముచేఁ దనువుఁబ్రోచిన పరి
చారకుల్దూరదేశమున కేగ
నవసరంబయ్యు మున్నార్జించియున్న ధ
నంబు పాణికి నధీనంబుగాక
మానహీనుఁడగుచు మలమూత్రపూరిత
శయ్యలోఁబరుండి సకలరోగ
భారమునఁగృశించుఁ బ్రాయంబుగలనాడు
సేయుపనుల నరుఁడు సెప్పుకొనుచు. 122

ఉ॥ కాలము సేరువయ్యెనని, కాలుఁడు దూతలఁబంచినంత నా
భీలత వారలేగి కని,పించి నరుం గొనిపోయి ధర్మరా
జాలయమందునిల్ప నతఁ,డారసి శిక్షవిధింప యాతనా
కీలితదేహుఁడై నరక,గేహములన్ బహుబాధలొందెడున్. 123

మ॥ నరకస్థుండగుదేహి పీడలనుఁ దాఁ,నంబై యనేకాబ్దముల్
పరితాపంబు వహించి ధర్మఫల సం,పర్కంబుచే దేవతా

నరలోకంబున కేగి ధర్మములచే, నర్థిల్లి జన్మించు ని
న్నరలోకంబునఁ బూర్వజన్మకృత పుణ్యక్షీణకాలంబునన్. 124

మ॥ నరకస్థానమునుండివచ్చి ధరలో,నం బుట్టువాఁ డెంతయో
దురితాత్ముండగుఁగాన దుఃఖములచేఁ, దూలున్ దివింబాసి యి
న్నరలోకంబునఁబుట్టు మానవుఁడు నా,నాసౌఖ్యవిస్తారుఁడై
పరఁగున్ గౌరవనీయుఁడై చెలఁగు శుం,భత్కీర్తి నార్జించుచున్.

క॥ నరకస్వర్గములందునఁ దిరుగుచు భూలోకమందు దేహియగుచు సం
చరణ మొనర్చుట జీవున కురుతరసంసారమంచు నూహింపవలెన్.

సుశీలుఁడు

గురువర్యా యిమ్మానవదేహంబునకుఁ దత్త్వంబులెన్ని? 127

పరవరముని

పుత్రా! యి న్నరశరీరంబునకుఁ దత్త్వంబు లిరువదినాలుగు. వానిని వివరింతు నాలింపుము. 128

పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులు = అనఁగా భూమి, నీరములు, నిప్పు గాలి, ఆకాశమను భూతంబులైదు. 129

శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబులు = అనఁగాఁ జెవులు, చర్మము, నేత్రములు, నాలుక, ముక్కనను నవి జ్ఞానేంద్రియంబులైదు. 130

వాక్పాణిపాదపాయూపస్థలు = అనఁగా నోరు, చేతులు, పాదములు, గుదము, యోని యను కర్మేంద్రియంబులైదు. 131

శబ్దస్పర్శరూపరసగంధంబులు = అనఁగా శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధమను విషయంబులైదు. 138

మనోబుద్ధిచిత్తాహంకారంబులను నంతరింద్రియంబులు నాలుఁగు, మొత్త మిరువదినాలుగు తత్త్వంబులతోఁగూడి యీ మానవదేహంబొప్పు. ఇరువదియైదవవాఁడు జీవుఁడు. ఇరువది యారవవాఁడు పరమాత్మ. ఇటువదియాఱుతత్త్వంబులతోఁగూడి జీవుండీ శరీరంబున వసించుచున్నాఁడు. 133

సుశీలుఁడు

పంచభూతంబు లీశరీరమునం దెట్లున్నవో వచింపుఁడు. 134

పరపరముని

శరీరమే భూమి, రక్తమే నీరు, జఠరాగ్నియగు నాకలియే అగ్నిహోత్రము, ఉచ్ఛ్వాస నిశ్వాసములు గాలి, లోపలనుండు ఖాళీస్థలము ఆకాశము. 135

అకాశమునకు గుణము శబ్దము, గాలికి శబ్దము, స్పర్శమను రెండుగుణంబులు, అగ్నికి శబ్దము, స్పర్శము, రూపములను మూడు గుణంబులు. నీటికి శబ్దము, స్పర్శము,రూపము, రసము అనునాలుగు గుణంబులు. భూమికి శబ్దము, స్పర్శము, రూపము, గంధము, రసము లను నైదుగుణంబులుగలవు. 136

మఱియు భూమికి గతినస్వభావంబు గలిగినందున భూతముల వహించును, నీటికి నగాధస్వభావంబు గలిగినందున లోపలి కీడ్చి ముంచును. అగ్నికి దహనశ్వభావంబు గలదు గనుక కాల్చును. వాయువు భూతముల శోషింపఁజేయును, ఆకాశము నిల్చుట కవకాశ మిచ్చును. 147

సుశీలుఁడు

స్వామీ ! కర్మేంద్రియములనఁగా నర్థమేమి ? 138

వరవరముని

శిష్యా, కర్మమనఁగాఁబని, నోరు నమలును, చేతులుచేయును పాదములు నడచును,గుదంబు మలమును, ఉపస్థ మూత్రంబును విడు చునుగనుక యీ యైదింటికిఁ గర్మేంద్రియమనిపేరు. 139

జ్ఞానేంద్రియములనఁగా గ్రహించునవి, చెవులు శబ్దమును గ్రహించును, చర్మము స్పర్శమును గ్రహించును, కన్నులు రూపమును

గ్రహించును, నాలుక రసమును గ్రహించును, ముక్కు వాసనగ్రహిం
చునందువల్ల వీనిని జ్ఞానేంద్రియములని వ్యవహారింతురు. 140

ఒక్కొక్కొక్క జ్ఞానేంద్రియమునకు నొక్కొక్కొక్క కర్మేం
ద్రియమునకు సంబంధముగల దెట్లంటివేని, నిన్ను మీతండ్రిగారు
పిలుచుచున్నారని చెప్పఁగాఁ జెవులు వినును, సరేనని నోరు మాట్లా
డును, చర్మమునకు దురదపుట్టఁగాఁ జేతులుగోకును, నేత్రములు
దూరమునందొక రూపమునుఁజూడఁగాఁ గాళ్లు పరుగెత్తును, నాలు
కతో సర్వ రసంబు లారగింపఁగా మేఢ్రంబునకు మదంబెక్కును,
గుదమున నపానవాయువు బయలుదేఱఁగా, ముక్కు గ్రహించును. 141

శబ్ద స్పర్శ రూప రస గంధములవలనఁ బృథివ్యప్తేజోవాయ్వా
కాశంబులు జనించినవి గనుక శబ్దాదులకుఁ బంచతన్మాత్రలని పేరు.
వానికే విషయంబులనియుఁ బేరులుగలవు. ఇవ్విషయములవలననే
జీవుఁడు సుఖదుఃఖంబు లనుభవించుచున్నాడు. విషయ ప్రీతిచేతనే
పునః సంసారబంధంబునఁ జిక్కుచున్నాడు. విషయంబులు విషమున
కంటెఁ గ్రూరంబులు. విషము దేహమున కపాయముఁగూర్చును.
విషయములు జీవునకు నరకాద్యపాయంబులుదెచ్చు నెట్లంటివేని, శబ్ద
ముచే లేడి, స్పర్శంబుచే నేనుఁగు, రూపముచే శలభము, రసముచేఁ
దుమ్మెద, వాసనచే మత్స్యము మోసపోయెను. 142

సుశీలుఁడు

అవ్విధంబెట్లో సెలవింతు. 143

పరవరముని

బోయలు రాత్రివేళ నరణ్యంబునందుఁజేరి రొక్కచో నీల
వేయుచు డక్కి వాయింపుచుండ నా ధ్వనివినుచు లేళ్లు మైమఱచి
యుండఁగా బోయవాండ్రమ్ములువైచి చంపుదురు. ఇది లేడి మోస
పోయినవిధంబు. 144

అడవియేనుఁగునుఁబట్టఁగోరి మనుష్యులు లోతైనగుంటఁద్రవ్వి దానిమీఁద గట్టిలేని కఱ్ఱలువైచి యాకులుపరచి వానిపై మన్ను పోసి గడ్డివిత్తనంబులు చల్లుదు రవ్విత్తనంబులు మొలిచిన కొన్ని దినంబులకు నాగడ్డిపైఁబరుండవలయునని స్పర్శసుఖంబుఁగోరి పోవఁగాఁ గఱ్ఱలువిరిగి దంతావళము దానిలోఁగూలును. 145

భగభగమండుచున్న యగ్నినిఁగాంచి శలభము తన కుపయోగకరమైన వస్తువని భ్రమించి దుమికి దగ్ధమౌను. ఇది మిడుత వృత్తాంతము. 146

తుమ్మెదఁ గమలములోఁ బ్రవేశించి మకరంద రసమునకుఁ జొక్కియుండఁగాఁ బ్రొద్దుక్రుంకి కమలము ముకుళించు. నత్తరుణంబునఁ దుమ్మెద మోసపోవును. 147

మత్స్యము వాసనచేఁజొక్కి మాంసమని గాలమునుఁగబళించి చచ్చును. విషయములలో నొక్కొక్కదానిం గోరి యొక్కొక్క జంతువు నశింపుచుండఁగా విషయంబు లైదింటింగోరిన మానవుండు బాధలు సెందకుండునా? 148

## అరిషడ్వర్గసమాచారము

సుశీలుఁడు

స్వామీ! సంసారబంధవిషయముఁసరిపెట్టి యరిషడ్వర్గవిధానం బెఱింగింపుఁడు. 149

వరవరముని

పుత్రా! అరిషడ్వర్గమనఁగా నాఱుగురు పగవాండ్రగుంపని యర్థము. వానినే కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యము లందురు. వాని క్రౌర్యము భగవానులు గీతాశాస్త్రమునందు సూచనగా నర్జున కెఱిఁగించిరి. ఎట్లంటివేని. 150

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంసః, సంగస్తేషూపజాయతే
సంగాత్సంజాయతే కామః, కామాత్ క్రోధోఽభిజాయతే
క్రోధాద్భవతి సమ్మోహః, సమ్మోహాత్ స్మృతివిభ్రమః
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో, బుద్ధినాశాత్ప్రణశ్యతి

పురుషుండు శబ్దాది విషయములను స్మరింపఁగా వానితో సంగముగలుగును. సంగముచేఁ గామముగలుగును. కామానుభవమున కడ్డగించిన వానియందుఁ గ్రోధము కలుగును. క్రోధమువలన యుక్తాయుక్త వివేకశూన్యమైన మోహముకలుగును. మోహముచే నదివరకార్జించిన శాస్త్రజ్ఞానము మఱచిపోవును. వెంటనే మంచి చెడ్డలు నిర్ణయించుబుద్ధి నశించును. బుద్ధినశింపఁగా దేహి సంసారంబునఁగూలును. కామమే యనర్థములకు మూలమగుచున్నది. 151

శ్లో॥ కామఏష క్రోధఏష, రజోగుణ సముద్భవః
మహాశనో మహాపాప్మా,విద్ధ్యేన మిహవైరిణమ్

ఓ యర్జునా! ఇక్కామము రజోగుణమునందుఁ బుట్టినది. ఎన్ని యనుభవించినను దృప్తిలేని మహాపాపములకు మూలమైనది. దాని నడ్డగించువానియందదియే క్రోధముగా మాఱుచున్నది. 152

(భగవద్గీత—తృతీయాధ్యాయము)

శ్లో॥ త్రివిధం నరకస్యేదం, ద్వారం నాశనమాత్మనః
కామః క్రోధస్తథా లోభస్త,స్మాదేతత్త్రయంత్యజేత్

అర్జునా! ఆత్మనాశకములగు కామ క్రోధ లోభములు మూడును నరకమునకు వాకిళ్లు. వానిని విడువుము. 153

(భగవద్గీత—తృతీయాధ్యాయము)

వ॥ కావున గామ క్రోధాదు లంతశ్శత్రువులు. బహిశ్శత్రువుల భుజబలముచే జయించువాఁడైన, నంతశ్శత్రువులకు లోఁబడుచున్నాఁడు బాహ్యశత్రువులచే శరీరమున కపాయంబు కలుగు. నంతశ్శత్రువుచే నాత్మకు నరకాదులు నింభవించును. 154

సుశీలుఁడు

లోపలివైరుల జయించుట కుపాయంబెద్ది ? 155

వరపరముని

దేహి కోటిజన్మంబులెత్తినను, కోటియుగంబులు తపస్సుఁజేసినను, దేవతానుగ్రహంబు సంపాదించినను, యోగసిద్ధినొందినను లోపలి వైరుల జయింపఁజాలఁడు. ఇక్కామాదు లింద్రియంబులయందుఁజేరి కల్వరపెట్టుచుండు. నింద్రియములకుఁబ్రభువు నారాయణుఁడు కనుకనే హృషీకేశుఁడని పిలువఁబడుచున్నా డమ్మహాపురుషుని శరణాగతిఁజేసి లెస్సగా భజించినచో నంతర్బహిశ్శత్రువుల సులభముగా జయింపవచ్చు. నది యట్లుండనిమ్ము. కామాదువల్లఁబొడము గడబిడ సంగ్రహముగా వచింతునాకర్ణింపుము. 156

సీ॥ తనకెంతధనముండినను దరిద్రమించుక
కలవానిఁగాంచి టంకారమొందుఁ
దనభార్య సౌందర్యఖనియైన రూప ర
హితమైన పరకాంత నెనయఁగోరుఁ
దనకు ననేక సీత్యములుపండిన బీద
మనుజునిపొలముఁ గైకొనఁదలంచుఁ
దనకు నగణ్యవర్తకశాలలున్ననుఁ
బండ్లమ్ము వాని లాభమునకడలుఁ
దనకు మేడలుండిననుఁ జిన్నయిల్లు ని
ర్మించువానిఁగాంచి మిడుకుచుండుఁ
గామ మెవనిలోఁ బ్రకాశించు వాని క
సూయకల్గుఁ బరులఁజూచినపుడు. 157

మ॥ మణులంగాంచిన రమ్యనిష్కుటములన్, మాహాచ్ఛటన్ సుందరీ
మణులంజూచిన రూప్యరుక్మధన సంపన్నంబులో నిర్మలా

పణముల్గాంచినకాలమందున నద,భ్రాంబై విజృంభించి దు
ష్ఫణితిన్ మనుజాశయంబులను వే,బాధించుఁ గామంబహా. 158

చ॥ వేళకు భోజనంబిడదు, వేయిపనుల్కలిపించి నిత్యముం
గాలము పోయెఁబోయెనని, కల్వరపెట్టును నిద్రఁబోవనీ
జాలదు నిల్వనీయదొక, చక్కని మంచికథల్వచింప, నీ
కేల తొలంగుమంచు విన,నీయదు కామము మానవాధమున్.

తే॥ చేలములగుంజు చాకలి, మీలఁబట్టు
జాలరి, తటాకమందుండి జలముఁగ్రోల
జాల రతిదాహమొందియుఁ జలుపుచున్న
పనులుసెడునను కామంబు ప్రబలియుంట. 160

సీ॥ ద్వీపాంతరములకు దేశాంతరములకుఁ
బంపించి యిడుములపాలుసేయు
మానావమాన విధానంబరయకుండ
ధనముసంపాదింపుమని విధించు
దమ్మిడికొఱకు కన్నతండ్రి బాధమని తెల్పు
బానిసవృత్తి, కేర్పాటుచేయు
జారత్వమున కురుచౌర్యంబునకు జూద
మునకుఁ బోపొమ్మని మొనసిచొనుపు
ధనము ప్రాణముకంటె హెచ్చని వచించు
వనిత ద్రవ్యముకంటెఁ దీపనుచుఁబలుకుఁ
బాన మన్నిటికంటె మేలైనదని న
రాధములఁ గామమెప్పు డల్లార్చుచుండు, 161

సీ॥ శిష్టరక్షణ దుష్టశిక్షఁజేయుచు ధర్మ
వర్తనుండగు చక్రవర్తినైనఁ
దవిలి శిష్యులకు వేదాంతమర్మముల జ
స్రముఁదెల్పఁగల సదాచార్యునైనఁ

దనపొట్టకూటికైనను వ్యయింపక లిబ్బి
దాఁచి రక్షిఁచు కదర్యునైన
ఫలపత్రజలవాయు భక్షకుండై మేను
బడలజేసెడు మునిప్రవరునైన

మానవతులయింట బానిసవానిగాఁ
జేసి యిడుములొందఁజేయుచుండుఁ
బాడుకామమెంత పగవానికైనను
వలదు వలదు భాగవతవరేణ్య. 162

సీ॥ రమ్మన్నదరిఁజేరి పొమ్మన్నఁబోయెడు
సారమేయమురీతి సంచరించి
చాకలివానింటఁ జీకాకుపడు గార్ద
భముమాడ్కి వేసినబరువుమోచి
బలుదెబ్బలకునోర్చి బావురనుచుఁగూయు
పిల్లిచందాన నెంగిళ్లుమెక్కి
గంతలుదాల్చిన గంగిరెద్దనునట్లు
శాసించుపనుల నిచ్చలునొనర్చి

కాంతలకు దాసులౌదురుకాదె పూరు
షార్థములు కామవహ్ని నిజాశయమున
రగిలినప్పుడు వారింపరానికతనఁ
గాముఁడనఁ గామమనఁగ నొక్కటియెచుమ్ము. 163

సీ॥ పరికించి సిగ్గునుఁ బాఱఁద్రోలును రోఁత
పైకొనెనేనిఁ జీకాకు పరచు
మానంబుతోఁచిన మనసీదు సత్య శౌ
చ క్షమాదులను నాశంబొనర్చు

నున్మాదమునుఁబోలె నొకమాఱు లాహిరిఁ
బెంపొందఁజేసి యేడ్పించుచుండు
ధనముపైనొకసారి వనితలందొకతేప
పనులపైనొకనాఁడు పరువులెత్తుఁ

బానమున నొక్కతఱి జంతుపలలమందుఁ
జవులుగల్పించి నరుని నిచ్చలుఁగలంచుఁ
గామమునకంటె శత్రువు కానరాదు
కాన దాని వర్జించుటకార్యమండ్రు. 164

సీ॥ ధనముపై కామంబు జనియించునప్పుడా
హారనిద్రలు మానియైనఁదిరుగు
నక్కామ మిలుగట్టుమని తెల్ప డబ్బెంత
యైనఁ దదర్థమై వ్యయమొనర్చు
అంకుపై నక్కామముంకింప జారిణిఁ
బిలిచి యారెండు నర్పించి మెలఁగు
జూదంబు నక్కామమాదఱించినతఱి
సొమ్ములన్నియు వేడ్కఁ జూడులాడుఁ

గామమెటులాఁగునో నరస్తోమమట్లు
సంచరించునుగాని దోషంబులెఱిఁగి
మానవేరదు విమల సుజ్ఞాననిధులు
దీనినొల్లరు వైరాగ్యఖానులగుట. 165

సీ॥ స్తనపరిరంభమోదంబిత్తునని బ్రహ్మ
చారులనెల్ల మోసంబుసేసి
జారత్వమునఁగల చవిఁగాంచుడని
గృహమేధులొవారికి బోధఁజేసి

శయ్యాసుఖముమాని డయ్యనేమిటికని
వస నివాసులతో వివాదమాడి
రతికేళి సౌఖ్య విస్మృతి మంచిదాయని
కర్మంది హృదయము ల్కలఁగఁజేసి
మఱియు వనభూతలగువారి మందలించి
కామినులపాలుసేసె దుష్కామవహ్ని
యిట్టి యగ్నినిఁ జల్లార్ప నెవ్వఁడోపు
సకలమేలు హృషీకేశుఁ డొకఁడుదక్క. 166

ఉ॥ మందులుదిన్న రోగములు, మానక మేనిఁగృశింపఁజేసినం
గందులనేకమబ్బిననుఁ గూడభుజింపక వస్తులుండినం
గొందఱు దీనిచేతఁజెడి, కూలుటఁజూపిన నెన్నిజెప్పినన్
డిందదు కామపన్నగము, డీకొని మర్త్యునిఁ గాటువేయుచున్.

మ॥ పలుచాలూడిన దృష్టితగ్గినను శుం,భద్వాలము త్రెల్లచా
యలచే మీఱిన వీనులన్ వినికి శూన్యంబైన హస్తంబుల
జ్జలు నిస్సారములైన వార్ధకముచే, సత్వంబు జీర్ణించినన్
వెలయుం గామపిశాచ మిన్నరునిలో, విస్తారమై నిత్యమున్. 168

క॥ వావియెఱుంగదు భయముల
నానంతయు లెక్కచేయ దధికవ్రణముల్
భావింపదు గురునైనన్
సేవింపదు కామ మేమిసెప్పుదు శేషా. 169

మ॥ తరమోదుస్తరమో మఱిన్ సుకరమో ధన్యంబొ హైన్యంబొ దు
ష్కరమో దుర్లభమో మహాసులభమో, కాదో ఫలంబిచ్చునో
దురితంబో సుకృతంబొ కీర్తికరమో, దుష్కీర్తియో యంచుఁ దా
నరయన్నేరదు కామమీనరుని లో,నాహాన్ సదాపూరమై. 170

వ॥ వెండియు నిక్కామంబు క్షణభంగురంబులగు భోగాదుల యందు మనుష్యునిఁ బ్రేరించును. శాశ్వతంబైన మోక్షసాధనంబున కెడమీయదు. కాని! 171

శ్లో॥ ధర్మావిరుద్ధో భూతేషు, కామోస్మి భరతర్షభ.

అర్జునా ధర్మవిరుద్ధముగాని కామము నేనేయని భగవానులు గీతాశాస్త్రమునందుఁ దెలిపిరి. 172

సు శీ లుఁ డు

ధర్మవిరుద్ధమైన కామ మెద్దియో, కాని దెద్దియో సెలవిండు.

వ ర వ ర ము ని

సామాన్యముగా భార్యాపుత్ర బంధు మిత్రాదులయందుండు కామము ధర్మయుక్తమైనది. పరధన దార క్షేత్రాతులయందుండు కామము ధర్మవిరుద్ధమైనది. 174

సు శీ లుఁ డు

ఇఁకమీఁదఁ గ్రోధస్వభావంబు వెల్లడింపుడు. 175

వ ర వ ర ము ని

వచియింతు నాకర్ణింపుము.

శ్లో॥ కి మరిభిః క్రోధోఽ స్తిచేదేహినాం=క్రోధమున్నచో దేహధారులకుఁ బగవారితోఁ బనిలేదనియుఁ, తామసితామసి=తామసము గలవాఁడు తాను మసియగుననియు నీతివాక్యంబులుగలవు. 176

సు శీ లుఁ డు

శ్లో॥ లాలనాద్బహవోదోషా,స్తాడనాద్బహవోగుణాః
తస్మాచ్ఛ శిష్య పుత్రాంశ్చ, తాడయేన్నతులాలయేత్. 177

లాలించుటచే దోషములును, దండించుటచే గుణములును గలుగు. నక్కారణంబున శిష్యులనుఁ గుమారులను దండించవలయును

గాని లాలింపఁగూడదందురు. గృహమేధికిఁ గోపంబులేనిచో భార్యా పుత్ర సహోదరాదులు పనులొనర్పరు. గ్రామవాసులు సోమరియని లెక్క చేయరు. దీనికి సమాధానమేమి ? 178

పరమమునిని

ధర్మయుక్తమైన క్రోధ ముండవలసినదే, ధర్మ విరుద్ధమై ప్రాణుల కపకారపరమైన కామ క్రోధాదులుండరాదు. ఖర, దూషణ ప్రముఖ రాక్షసులు దండకాటవియందుండి క్రోధంబుచే మునుల వేధించిరి. మునులు ఖరాదులందుఁగల కోపంబుచే ననిష్ట నివారణార్థము శ్రీరామచంద్రునకు శరణాగతిఁజేసిరి. రాఘవుండు క్రోధంబుఁ గైకొని ఖరాదుల వధించె. ఖరాదులక్రోధము ధర్మవిరుద్ధంబగుటచే స్వకీయ నాశనంబునకుఁ గారణంబయ్యె. మునీంద్రుల క్రోధంబు ధర్మ యుక్తముగనుక స్వకీయ దేహ గేహ వన జలాశయాదుల రక్షించె. రాఘవుని క్రోధముచే దుష్ట నిగ్రహము, సాధు పరిత్రాణమైనది. కాబట్టి కీర్తి సుకృతంబుల నొసంగె. దీనింబట్టి క్రోధ తారతమ్యము గ్రహింపుచుందుము. 179

సుశీలుఁడు

చిత్తము. క్రోధవిషయంబింకను సెలవిండు. 180

పరమముని

క్రోధంబునకుఁ గోపము, అమర్షము, ప్రతిఘము, రుట్టు, రోష ములను సంస్కృతనామంబులు. కినుక మొదలగు నాంధ్రనామంబులుం గలవు. సమయోచితంబుగాఁ బ్రయోగింపుచుండు నెఱుంగుచుందుము.

ఉ॥ కొందఱిచేఁ గసాయిపని కొందఱిచే మృగయావినోదముం
గొందఱిచేఁ బరావమతిఁ గొందఱిచేత ససత్యసాక్ష్యముల్
కొందఱిచేత లాఁతులనుఁ, గొట్టుచుఁ దిట్టుచునుండు కార్యముల్
డిందక సంభవించును క, డిందియమర్షము మొల్క పెత్తినన్. 182

సీ॥ అనిశంబు పాంథుల కాధారమై యొప్పు
సత్రశాలల వినాశంబొనర్చు
వల్లీ ప్రసూన ప్రవాళ ఫలములచే
భాసిల్లు వనములఁ బాడుఁజేయుఁ
బతిత పావనములై పరఁగు దేవాయత
నంబులకైన హైన్యంబొసంగు
లక్షలజనులచే లలితమై తనరారు
పురములనైన గొబ్బున నడంచు
దంపతుల కింపుఁజెడ విరోధంబుఁగూర్చు
సరవిబావులలోన విషంబుఁగలుపు
మానవుఁడు భూరిరోషాగ్ని మానసమున
రగిలినప్పుడు సేయంగరానిదున్నె. 183

వ॥ మఱియు నీక్రోధగుణము బ్రహ్మహత్య, స్త్రీ హత్య, శిశు హత్య, గో హత్య, పితృ హత్య, మాతృ హత్య, భ్రాతృ హత్య మున్నగువానికిమూలంబై తనరారుచుండు 184

క॥ కూరిమిగల గురునైనన్ సారెకుదూషించి కవిసి చంపుమను కోప
స్ఫారాగ్ని దానికి తరులు భారమెహింసించునట్టి పనికిగుణాఢ్యా.

క॥ కోపియగువాఁడు సేయని పాపక్రియ లట్టివాఁడు పలుకని దుష్టా
లాపములొప్పని హింసా వ్యాపారము లేదుచుమి మహాగుణశాలీ.

సీ॥ భగినీ జఠరమందుఁ బ్రభవించినట్టి పా
కములవధింపఁడే కంసనృపతి
సరవిహితోపదేశముసేయు తమ్మునిఁ
దన్ని వర్జింపఁడే దశముఖుండు
పొరపాటుజరిగెఁ దప్పు సహింపుమన్న సు
గ్రీవు బాధింపఁడే కెరలి వాలి

పరమ భాగవతుఁడై భాసిల్లు ప్రహ్లాదుఁ
గాఱింపఁదొడఁగఁడే కన్నతండ్రి
పరమసాధ్వియైన పాంచాలిఁ దెచ్చి స
భాస్థలంబునందు వలువలూలువఁ
దలఁచినారుగాదె ధార్తరాష్ట్రులు కోప
మంతచేసె వారియందు రగిలి. 187

చ॥ జనకునకుం గుమారునకు జాయకు భర్తకు సోదరాళికిం
దనయకు మాత కల్లునకు, దాంతగల్గిన మామకుం బురా
తనులగు బంధుకోటికిని, దారుణకోపముచేతఁగాదె క
ల్గును పగ కొంతకాలమున, కున్ విడుచుండుఁ దదంతమైనచోన్.

సీ॥ కసరుచేతనెగదా కైకేయి, విభుఁడైన
దశరథోర్వీశు చిత్తముఁ గలంచెఁ
గినుకచేతనెగదా కెరలి కద్రువ నిజా
త్మజులైన పాముల మడియఁదిట్టె
రోసంబుచేగదా దోసియై చిత్రాంగి
సారంగధరుని హింసఁగనఁజేసెఁ
గనలుచేతనెగదా గాంధారి శ్రీకృష్ణ, దే
వు నిందించి నిందింపఁబడియెఁ

బూరుషాశయములఁబుట్టు రోషముకంటె
నాడువారి కోప మధికమగుచుఁ
బ్రజ్వరిల్లి తుద కషాయంబు సమకూర్చుఁ
బ్రతిఘమడఁచువాఁడు పావనుండు. 189

సుశీలుఁడు

గురుప్రవరా! క్రోధవిషయంబు నింతటితో విరమించి లోభ
తత్త్వం బెఱింగింపుడు. 190

పరవరవుని

బిడ్డా! లోభంబు గలవాఁడు లోభి, లోభికిఁ గదర్యుఁడు, కృపణుఁడు, కింపచానుఁడు, క్షుద్రుఁడు, మితంపచుఁడను పర్యాయనామంబులు గలవు. లోభియనఁగా దనకధీనంబైన ధనం బితరులకీయరాదని తనకొఱకైన వ్యయంబు గాఁగూడదనియుం బట్టుదల గలవాఁడు. 191

శ్లో॥ ఉపభోక్తుం నజానాతి, శ్రియం ప్రాప్యాపిలోలుపః
ఆకంఠ జల మగ్నోపి, శ్వాలిహత్యేవ జిహ్వయా.

శునకము నిండునీటిలోనున్నను నాలుకతోఁ గతుకునుగాని గబగబ త్రావజాలదు. లోభియైనవాఁడట్లే సిరిగల్గియున్నను భుజింపఁజాలఁడు. 192

సీ॥ చినిగినబట్ట తెచ్చిన ముదంబునఁదాల్చుఁ
బసలేని యింటిలోపల వసించుఁ
గూరలులేకుండఁ గుడుచు నాహారంబు
పాడిగల్గిన సదా పరులకమ్ము
సారిది రాగుల సజ్జ జొన్నసంకటిమెక్కి
వెలకిచ్చు వరిధాన్య విసరమున్నఁ
బంపుగునాడైన వండనియడుపప్పు
పిండివంటలు, వాన ఎండకోర్చి
పనులుసేయుచుండు పరగృహంబుల విందు
సంభవించెనేనిఁ జావుతిండిఁ
దిని ముదంబుఁగాంచు ధనవంతుఁడగు కింప
చానువార్తలివి విశాలహృదయ. 193

సీ॥ బికిరాలమారులఁ బిడించి పంపించు
బంధువుల్వచ్చిన భయముఁజెందుఁ
బాటకుల్సత్కార్యపరులు పండితులింటి
కడకురాఁదాను కన్పడకడాఁగుఁ
గలుగురుండరుదెంచి పిలువంగ భోజన
సామగ్రు లీయక జగడమాడుఁ
బావులాకోలకెన్ని పను లైనఁగావించు
దమ్మిడికై యనృతంబులాడు
ధనముకంటె వేలు, దైవంబు లేడని
నమ్మియుండెఁ బరఋణమ్ము లీక
మానుపెట్టులనెడు మార్గంబుఁ జెను లోభి
వెదకుచుండెఁ జుమి పవిత్రశీల 194

వ॥ ఒకానొకగ్రామంబున లోభిజనాగ్రేసరుండైన నరుండు వైకుంఠైకాదశినాడు దేవునకు నారికేళఫలం బీయఁదలంచి యంగడికేగి విచారింపఁగాఁ గొబ్బరికాయ అర్ధణా ఖరీదని తెలుసుకొని డబ్బులిచ్చుటకు మనస్సొప్పక తోఁటలోనికేగి తోటకాపునడిగె. నతండు దాత యగుటచే నయ్యా దేవునకిచ్చు టెంకాయమాత్రమునకు డబ్బులేల. చెట్టెక్కి నీ యిష్టమువచ్చినన్ని కాయలు కోసికొమ్మనియె. నమ్మాటకు లోభి సంతోషించి పెద్దకాయ లెక్కడఁగలవాయని తిరిగిచూచి యొకటికొబ్బువృక్షమునందు ప్రాఁకెక్కి కొబ్బరిమట్ట పట్టుకొనఁగాఁ గాలుజాఱి కొమ్మ నాధారముగాఁ గైకొని వ్రేలాడుచుండె. నింతలో మఱియొక లోభి యేనుంగునెక్కి పోవుచుండఁ జెట్టెక్కినవాఁ డతనిఁ గాంచి తండ్రీ నీకు నూఱురూప్యంబు లొసఁగెద నన్ను దింపుమని ప్రార్థించె. నది విని మావటివాఁ డత్యాశతో నేనుంగును సమీపంబునకుఁ బోనిచ్చి వృక్షారోహకుని కాలువట్టె. నంతలో దంతావళంబు దూరంబునకుం జనె. వారిద్దఱు నూఁగులాఁడుచుండి రయ్యవసరంబున నమ్మార్గంబున

గుఱ్ఱపురౌతు పోవుచుండఁగా వృక్షారోహకులుచూచి మహానుభావా మే మిద్దఱము వేయిరూప్యంబు లిచ్చెదము దింపుమనిరి. వాఁడును లోభియగుటచే వారువమును, జెంతకునడిపించి క్రిందివాని కాలు వట్టె. నదిసందుగా హయంబుపరుగెత్తె. నమువ్వురు నట్టేటంబడిచచ్చిరి. చూచితివా లోభివారిసంగతి. 195

మఱియొకగ్రామంబున నొకానొక విశ్వస్తావధూటి కొంతధనం బార్జించి భూమిలోఁబూడ్చిపెట్టి పునర్ధనార్జనమునకై నూఱురూప్యంబులు దీసికొని దేశాటనమునకై యరిగి యక్కడ నెవ్వరైన రూప్యశతకంబు నపహరింతురనియెంచి మూటఁగట్టి మోకాలిపైన బంధించి యొకరాత్రి వీధి వేదికయందు శయనించి క్షుద్బాధచేఁ బ్రేవులు గూయుచుండఁగా, నో ప్రేవులారా! మీ కెంతకూసినను గాలియం దున్న డబ్బులో రువ్వయైన వెచ్చింపననుచుండె. నది విని యొకచోరుం డామెనుడాసి పెద్దమ్మా యేమిటిసమాచారమని యడుగగా నయ్యా యాఱుమాసములనుండి జానువునందు వ్రణంబుపుట్టి బాధింపుచున్నది. దానికిఁ గట్టుకట్టినానని చెప్పె. నప్పుడచ్చోరుం డమ్మా నేను గొప్ప వ్రణవైద్యుండ నయ్యార్మ మిటుచూపింపుమని బలవంతముగా ముడి విప్పి యామెను రెండు చెంపదెబ్బలుగొట్టి ధనాపహరణంబొనర్చి వెళ్ళిపోయె. నవ్విశ్వస్తయు రిక్తహస్తంబుతోఁబోయె. నంతియేకాక.

సీ॥ నమ్మిదాచినవారి సొమ్ములపహరించు
జీతంబులీయఁడు సేవకులకు
దమసోదరులకు భాగములీయనొల్లఁడు
కూఁతులధనమైనఁగొని హరించు
భార్యాసుతులకైన బట్టలీయఁడు
కూడుఁగుడువనీయఁడు సదాకడుపునిండఁ
బెరవారిద్రవ్యంబుఁ బెల్లంబుగానెంచుఁ
దనలిబ్బివిషముగా దాఁచియుంచుఁ

దనయులకు జాయకైననుఁ దాళమీడు
పెట్టెలును సంచులునుఁ గనిపెట్టియుండుఁ
బనులుచేయించు రాత్రిరి పగలు లోభి
వాఁడు గృహమున నివసించువారిచేత.

సీ॥ కూడఁబెట్టిన దెల్లఁ గొడుకు పెండిలికయ్యె
నిఁక నెట్లుసమకూర్తు నింతడబ్బు
పాపచుట్టమువచ్చి మూడుదినములాయెఁ
గడుమెక్కుచున్నాడు కదలకుండ
భట్రాజు మునుపొక్కపరి తిండి దినిపోయి
చనుదెంచె మరల పిసాచిపోల్కి
నల్లుఁడొక్కఁడె రాక ముల్లమోచుటకుఁ గా
వలయునా యొకపనివాఁడు వెంట

నెన్నిమాఱులైన నేనొక్కఁడనెపోవ
బెక్కుమందివచ్చి రొక్కసారి
బంధుజనములనెడు పల్కులువినిపించు
నెపుడు లోభివానియింటియందు.



సీ॥ పరిణయంబున నొక్క పావులా పడిబియ్య
మిచ్చి పురోహితుఁబుచ్చినాఁడ
బహుధరాసురులు సంభావనకైరాఁగఁ
దలకొక్క బేడతోఁ దఱిమినాఁడ
భట్టువారెందఱో పైకొనఁగాఁ గొంచె
మిచ్చి వేవేగ నెట్టించినాఁడ
బాజాబజంత్రీలు పనిఁ జేసినను సగ
మొగవేసి కొంతడబ్బిచ్చినాఁడ

బప్పుకూటమమాత్ర మప్పనఁగావించి
చారువోసి పెండ్లివారినెల్లఁ
బంచినాఁడననెడు పల్కులు ధనవంతుఁ
డైన లోభివానియందు వెడలు. 199

సీ॥ గడువుదప్పినపత్ర మడఁగవచ్చినవారి
ఋణమీక వేలు హరించినాఁడ
నసలువడ్డీలతో నధమర్ణులీయంగఁ
బత్రమీయక డీలుపరచినాఁడఁ
గ్రయవిక్రయములలో ఘనులైనవారిని
వంచించినష్ట మొందించినాఁడ
సరకులుగొనుచోట సగముధనముమాత్ర
మర్పించి లాభంబు లందినాఁడ

ధనముఁ గూర్చుపనికి ననుఁబోలువారు నా
కంటె గొప్పవారు కానఁబడరు
నూటి కిరువురనెడు మాటలాడును మితం
పచుడు సిగ్గులేక భవ్యశీల. 200

వ॥ ఇదియిట్లుండఁ బూర్వకాలంబున దుర్యోధనుండు తొమ్మిదికోట్ల తులాభారంబులు దూఁగిన బంగారంబు ధనాగారంబులందుంచెను. మఱియు లెక్కకు మిక్కుటంబులగు పశుసమూహంబులు, నేఁబదిలక్షల గుఱ్ఱంబులు, తొమ్మిదిలక్షల భద్రజాతి యేనుంగులు, కోట్లకొలఁది సైన్యంబులు గలిగియుండియునుఁ దృప్తినొందక ద్యూతవ్యాజంబునఁ బాండవ రాజ్యలక్ష్మి నపహరించి వారిం బదుమూడు వత్సరంబు లరణ్యాజ్ఞాతవాసంబులఁ బాలుసేసె. నందులకుఁ బాండవులు సహించి పదునాలవయేట విరాటనగరంబునందుండి శ్రీకృష్ణదేవుని రాయబారంబునకనిచి రటుపిమ్మట రుక్మిణీకాంతుండు హస్తిపురం

బున కరిగి సభామధ్యంబునఁ గౌంతేయుల భాగంబుం గూర్చి సుయో
ధనునకు విన్నవింపఁగా రాజరాజు కోపించి పాండవులకు రాజ్యభాగ
మీయను సరేగదా వాఁడిగల సూదిమోపినంత స్థలంబైన నీయనని
ప్రతిజ్ఞఁజేసి సపరివారముగా నాశంబయ్యె. లోభగుణం బెంతవాని
నెట్లుచేసెనో వింటివా. 201

సుశీలుఁడు

దేవా దుర్యోధనునివంటి మూఢుం డెక్కడనుఁ గనంబ
డఁడుగదా ? 202

వరవరముని

వత్సా పొరపాటు. దుర్యోధనుఁడు మూఢుండు గాఁడుగాని
మూర్ఖుండగు. నేమియుం దెలియనివాఁడు మూఢుండు. తెలిసియు
దుర్ణయము వదలనివాఁడు మూర్ఖుఁడు. కనుకనే 203

శ్లో॥ ద్వావిమౌ పురుషౌ మూర్ఖౌ దుర్యోధన దశాననౌ
గోగ్రహణం వనభంగంచ దృష్ట్వా యుద్ధం పునఃపునః

గోగ్రహమునాఁడ ర్జునుండొక్కఁడు ససైన్యుండగు దుర్యోధనుని
జయించెను. రామదూతయగు హనుమంతుఁడేగి యనేక రాక్షసుల
వధించి రావణునిఁ దిరస్కరించి లంకాపురంబుఁ గాల్చె. నైనను దుర్యో
ధన రావణులు మరల సంగరమున కరిగిరి కనక మూర్ఖులనంబడిరి.
ఇప్పుడు నట్టివారు కలరుగదా ! 204

సుశీలుఁడు

ఇఁక మోహవిషయమెఱింగింపుఁడు. 205

వరవరముని

మోహము మానవులకు భార్యా నందన బంధు మిత్రాదుల
యందుఁగలుగు పరస్పరానురాగము. అదియే ముదిఱినచో విపరీత
జ్ఞానముగా మాఱును. ముందుఁ బరస్పరానురూపంబగు మోహం
బెఱింగింతు నాకర్ణింపుము. 206

మ॥ హితసంఘంబులపైఁ దనూభవులపై, నిల్లాండ్రపైఁ బౌత్ర సం
తతిపై నల్లురపైఁ గొమారితలపై, దౌహిత్ర సత్స్త్రీ వధూ
తతిపై మేనమఱంది కూఁటువలపై, ధారాళమై మర్త్య సం
హతిచిత్తంబులఁబుట్టు కూరిమిని మోహంబంచు యోజింపుమా.

క॥ కరులందశ్వములందును
ఖర మాహిష వృషభ ఘోటకంబులయందున్
నరమేండనికరములయం
దురుతరమోహంబు కలుగుచుండు నరులకున్. 208

మ॥ ఫలితారామచయంబుపై విపుల వస్త్రశ్రేణిపై ఫాల లాం
గల హాల్యంబులపై సుచేలములపై, ఖర్జూరచామీకరా
దులపై రత్నచయంబుపై నగలపైఁ దోరంపు ధాన్యంబుపైఁ
గలుగున్ మోహము మానవాళులకు నే,కాలంబు భక్తాగ్రణీ.

మ॥ మలమూత్రాది సమస్త హేయములతో, మాలిన్య దేహంబుతోఁ
గలగుండందిన రోదనధ్వనులతోఁ గండూతితో గజ్జితో
బలు శింఘాణముతో దురీర్ష్యములతో, బన్నంబులంగాంచు పి
ల్లల మోహంబునఁగాదె ప్రోతు రవలీ,లన్ భామినీసంఘముల్.

క॥ పసివాండ్రు మలము మూత్రము
వెసవిసవఁగ భోజనంబువిడిచియైన వె
క్కసపడక బాగుజేయును
ప్రసవించినతల్లి మోహభరమునఁగాదే. 211

క॥ తనయులు పరుషములాడిన
మనుమలు దన్నినను మాఱుమాటాడక యె
గ్గని తలఁపక లాలింతురు
జనములు మోహమునఁగాదె సాధువరేణ్యా! 212

క॥ తానైనఁ దినక బిడ్డల
నోముదు రాహార మనిశ మొసఁగి సుచేల
స్తోమంబొసంగి పాలింతలు
తాము ధరించెదరు నరులు తతమోహముచేన్. 213

వ॥ దశరథుండు భార్యయగు కైకయందలి మోహంబుచే సమస్త కల్యాణగుణ పరిపూర్ణుండగు రాముని వనవాసంబున కనిచి శ్రీరామునియందుఁగల మోహంబుచే మరణించెను. 214

సుశీలుఁడు

ప్రభూ దశరథుండు పరబ్రహ్మస్వరూపుండగు రామునకు జనకుఁడైయుండి రాముని దివ్యమంగళవిగ్రహంబు స్మరింపుచు దేహంబు విడిచి స్వర్గలోకంబుఁజెందెనుగాని పరమపదంబుఁజెందలేదు. రామ సంబంధుఁడు గాకపోయినను, మనుష్యుండుకాకపోయినను రామానుగ్రహంబుచే మోక్షంబుఁ జెందెనుగదా తిర్యగ్జంతువైన జటాయువు, పక్షీంద్రునిపాటిపుణ్యంబు దశరథునకు లేదాయేమి ? 215

వరవరముని

మోక్షంబు పుణ్యంబుచే సమకూడదు. “పునః ప్రతిబంధకత్వాత్పుణ్యం పాపసమ”మ్మను శాస్త్రవాక్యంబుగలదు. పుణ్యపాపరహితుండైనఁగాని ముక్తిగలుగదు. అట్టివాఁడు కావలయునని నవర్థపంచక జ్ఞానమార్జించి లెస్సగా విష్ణుభక్తి చేయవలయుఁ త్రివర్గప్రదంబైన సామాన్యధర్మంబనుష్ఠించి దశరథుఁడు స్వర్గంబుఁజెందె. నపవర్గసాధనంబైన విశేషధర్మం బవలంబించి జటాయువు మోక్షంబుఁచెందెను. సామాన్యధర్మ దౌర్బల్యంబును విశేషధర్మప్రాబల్యంబును, ముందె లెంగించెద. మోహప్రభావం బింకను వినుము. 216

సుశీలుఁడు

చిత్త మట్లే సెలవింతు. 217

వరవరముని

వ॥ ద్వాపరయుగంబున నొక ఋష్యాశ్రమంబున నుదంకుండను విప్రుండు గలఁడతండు గురుకులవాసంబొనర్చి వేదవేదాంగంబు లభ్యసించి స్వాధ్యాయ జపతపోనిరతుండై యుండెఁగాని యవ్విప్రునకు జన్మాంతరదోషంబుచే విపరీత జ్ఞానంబు జనించె. నది యట్లుండఁగా భారతయుద్ధానంతరము పాండవుల ననుగ్రహించి జనార్దనుండు రథారూఢుండై ద్వారవతి కేగుచు నుదంకాశ్రమంబున దిగఁగా నతండు శ్రీకృష్ణు నర్ఘ్యపాద్యాదివిధులం బూజించి కూర్చుండఁబెట్టి కోపదృష్టితోఁ గన్నులెఱ్ఱఁజేసి కృష్ణా నీవు భారతయుద్ధంబున సహోదరపుత్రులకు వైరంబుఁ గల్పించి పాండవపక్షపాతివై కౌరవులను సర్వదేశాధిపతులను ససైన్య సపరివారంబుగా వధించి ధర్మశూన్యుఁడవైన నిన్ను శపింతునని తిరస్కారవాక్యంబులాడె. నందులకు మధుసూదనుండు నవ్వి, యుదంకునితో విప్రా! విపరీతజ్ఞానంబుచే మదీయ ప్రభావం బెఱుంగవైతివి. యథార్థజ్ఞానులగు శుక వ్యాస నారదాదు లెఱుంగుదురు. మీవంటి యల్పుల శాపంబులు మామీఁదఁ బని చేయవు. నిదానింపుమని రత్న ఖచిత సువర్ణ కంకణోర్మికాది భూషణోపేతమై శంఖ చక్ర గదా పద్మ శర శరాసన ధ్వజ ఛత్రాది దివ్యరేఖాలంకృతంబై యాశ్రితాభయప్రదంబైన స్వకీయ హస్తంబు బ్రాహ్మణుని ముఖంబునందుంచె. నక్కారణంబున ధరాసురుని మనోమాలిన్యము నశించి నిర్మలజ్ఞాన ముదయించుటవలన శుచిర్భూతుండై రుక్మిణీకాంతుని దివ్యపాదారవిందంబులకు సాష్టాంగ నమస్కార మాచరించి లేచి బద్ధాంజలియై యిట్లనియె. దేవాదిదేవా! సర్వలోకశరణ్యా ! నీ పాణిస్పర్శంబుచే నీ మహాత్మ్యంబుఁ దెలిసి కొంటిని. ఇక్కాలంబున నిన్నుఁ బ్రత్యక్షంబుగా దర్శించియు విప

గీత జ్ఞానంబుచే దూషించితిఁ, గలియుగంబున నెట్టిమూర్ఖులు జనింతురో నీయవతారప్రభావంబెఱుంగక నేమనినిందించి యెట్టి దుర్గతులఁ జెందుదురోయని దుఃఖించెద. మదీయాపరాధంబు క్షమింపుమని స్తుతింపఁగా జగన్నాథుండనుగ్రహించి నీవు బ్రాహ్మణుండవై పుట్టియుఁ జెడిపోవఁగూడదని నిర్మలజ్ఞానంబిచ్చి క్షమించితిని. మదీయదర్శనంబు వ్యర్థంబు కాఁగూడదని కోరిన వరంబు లొసంగి ద్వారకాపురంబునకరిగె. 218

సుశీలుఁడు

స్వామీ! శిశుపాల జరాసంధ పౌండ్రకాదులిట్టి విపరీతజ్ఞానంబు గలవారలేకదా ? 219

వరవరముని

వారు నింక ననేకు లట్టివారు గలరుకాని వారి నెంచవలసిన పనిలే దెందుకనఁగా జరాసంధాదులు జన్మించినదాది మరణించు వరకు విపరీత జ్ఞానులే కావునఁ బేర్కొనవలసినదిలేదు. పైనఁజెప్పిన యుదంకుఁ డట్టివాఁడుకాడు. జన్మమాదిగా జ్ఞానియైయుండి యొకానొకసారి వైపరీత్యమునుఁబొంది మరల నిర్మలుఁ డయ్యెనుగనుక వచించితి. నట్టివాని దేమిలెక్క. దేవతలుసహిత మొకప్పుడు మోహము, ముదలగా విపరీతమార్గమునఁబడి లేచుచుందురు. 220

సుశీలుఁడు

అదియెట్టిదో వక్కాణింపుడు. 221

వరవరముని

బ్రహ్మరుద్రేంద్రాది నిర్జరులు ద్వాపరయుగాంతంబున, దుగ్ధార్ణవంబునకేగి శ్రీమన్నారాయణుని దర్శించి భూభారనివారణార్థ మవతరింపుమని ప్రార్థించి దేవకీగర్భస్థుండైనప్పుడు బహిర్గతుండవు గమ్మని ప్రార్థించిరి. తరువాత జగన్నాథుండు శ్రీకృష్ణుండై యవతరించి

బాల్యంబున గోకులంబునఁ జేరియుండఁగా నింద్రుండు మోహాపరీత మానసుండై నారాయణుని సామాన్యగోపబాలకునిగానెంచి శిక్షింపఁ గోరి నవమేఘంబులవిడిచి మితిలేనివానగురియించె. నందులకుఁ బ్రతీ కారంబుగా శ్రీకృష్ణుండు గోవర్ధనంబెత్తి గోపీగోపాలకుల రక్షించి సునాసీరునకుఁ బరాభవంబుఁగల్పించె, నిది యిట్లుండఁగా బ్రహ్మ దేవుండు హరిమాయచే మోహింపఁబడి కృష్ణుని వంచింపఁగోరి గోవత్సార్భకుల నంతర్ధానంబుసేసె. నంత నందనందనుఁడు లక్షల కొలంది గోవత్సార్భకరూపంబులఁ దానేధరించి సంవత్సరమువఱకు వ్రేపల్లెవారికిఁ గొఱంతలేకుండఁ జేసెను. పిమ్మటఁ దనలోకంబున విరించి సింహాసనం బెక్కఁబోవఁగా నచ్చటనొకబ్రహ్మ కూర్చుండి పరిపాలింపు చుండె. నత్తఱి దౌవారికు లసలుబ్రహ్మను నీవెవ్వండవని మెడఁబట్టి నెట్టి రిది భగవన్మాయయని తెలిసికొని కృష్ణసన్నిధానంబునకరిగి నమ స్కరించి స్తుతించి సెలవుఁగొనిపోయె. రుద్రుండు బాణాసురార్థ ముగా గోవిందునితోఁబోరి మూర్ఛిల్లి నందిమీఁదఁబడి లేచి దేవకీ సూనుం గొనియాడి తొలంగె. బృహస్పతి శిష్యుండైన శక్రుండు వేదార్థనిర్ణేతయగు విరించి సర్వజ్ఞుండగు శివుండు మోహముచే విపరీతజ్ఞానంబవలంబించి కృష్ణుని వంచింపఁగోరి విఫలమనోరథులై తుదకు శరణాగతులై హరినాశ్రయించిరి. 222

సుశీలుఁడు

దేవరవారి దివ్యానుగ్రహంబుచే మోహవిషయము చాలా వఱకు గోచరించినది ఇఁక మదంబునుఁగూర్చి సెలవిండు. 223

వరవరముని

తనసాటివారులేరని విఱ్ఱవీగుచు నన్యులఁ దిరస్కరించుస్వభా వమునకు మదమనిపేరు. దానిని మూఁడువిధంబులని కొందఱు, నెని మిదివిధంబులని కొందఱు వక్కాణింతురు. ధనమదము, విద్యా మదము, బలమదము. కొందఱీమూటినే వాడుకొందురు. ఆహార

మదము, అధికార మదము, యౌవన మదము, రూప మదము, స్త్రీ మదము- వీనినైదింటినిఁ బై మూఁటితోఁ జేర్చి యష్టమదంబులని కొందఱుభాషింతు రన్నింటిని వరుసగా నీకెఱింగింతు నాకర్ణింపుము.

శా॥ సంపాదించితి నెన్నియోగతుల దీ,క్షన్ స్వాపతేయంబుమున్
సంపాదించినవేళ నేఁగనిన క,ష్టంబుల్ వెతల్చింత లా
లింపన్ వీలగునే వచింపఁదరమే లిబ్బిన్ బళీ యిట్టు లా
ర్జింపంజెల్లునె లాఁతివానికని భాషించున్ వృథావాక్యముల్.

సీ॥ పోలేరుగుడికొద్ద వేలరూప్యములు వె
చ్చించి పొట్టేలుఁ జంపించినాఁడ
నప్పుఁబట్టినవారి నల్లాడఁ జేసి త
దీయ జీవనములు దీసినాఁడ
వరహాలుగవ్వగా వాడి యేడాదిలో
మితిలేని మేడ నిర్మించినాఁడ
నెదిరించువారిఁ గొట్టించి తచ్ఛాంతికై
మొనలేని ద్రవ్యంబు లిచ్చినాఁడఁ
గూటసాక్ష్యములనుఁ గూర్మితోఁ బల్కించి
బలువిధంబులైన వ్యాజ్యములను
గెలిచినాఁడననెడు పలుకులు ధనమదాం
ధుఁడు వచింపుచుండు జడుపులేక. 226

ఉ॥ మార్గములడ్డగించును సమస్తజనంబుల ధిక్కరించు స
న్మార్గము నాదరింపడు కు,మార్గమునందు సదా చరింపుచున్
మార్గణపాళిఁగన్న నస,మాన క్రుధాతురుఁడై తొలంచును
త్సర్గము లాచరింప డతి,ద్రవ్యమదాంధుఁడు దుష్టచిత్తుఁడై. 227

మ॥ పరభాషామణులం గలంచుఁ బరిసంపద్వైభవం బాఱుచుం
బరనిందాపరుఁడై స్వకస్తుతులచే, నర్తించుఁ గూలీలకున్
సరిగానీయఁడు కూలి పానమును హింసాకృత్యముల్సేయుచోఁ
బరమానందముఁ జెందు ద్రవ్యమద సంపన్నుండు భక్తాగ్రణీ.

మ॥ నరకం బెక్కడ దేవుఁ డెంగలఁడె దానం బేల శాస్త్రార్థముల్
పరికింపం బనియేమి వేదముల సంభావింపఁగా నేల దు
ర్భర పాండిత్యము లేల పుణ్యమునుఁ బాపంబున్న దేయంచు శా
ర్వరవాదంబు నరించు రిక్థమదయుక్తాత్ముండు భక్తాగ్రణీ. 229

వ॥ ఇఁక విద్యామదవిషయం బెఱింగించెద నెట్లంటివేని,

పరిజ్ఞానఫలం విద్యా=విద్యకు జ్ఞానమేఫలము. అనఁగా విద్య
వలన జ్ఞానమార్జించి భగవత్ప్రాప్తిఁ జెందవలసియుండఁగా, విద్యావివా
దాయ ధనం మదాయ, అనునట్లు విద్యనార్జించి వాదించి పరుల
నిర్జించుటే ఫలంబని మదంబుగలవారు తలంతురు. 230

చ॥ చదివితి నెల్ల శాస్త్రములు, సన్నుతిఁ గాంచితి నుర్విలోన న
న్నెదిరి జయించువారు గలరే యని పల్కుచు హెచ్చుపండితుల్
కదిసినఁ బాఱిపోవుచు జఘన్యులు డాసిన పాఱఁ దోలుచున్
మదమున రేఁగుచుండుఁ బలుమాఱు దురాత్ముఁడు విద్యగల్గినన్.

సీ॥ అమరసింహుని కవిత్వమునందుఁ గొన్ని
దోషములు గాంచితి గవేషణ నొనర్చి
కాళిదాసుఁడు మున్ను గావించినట్టి కా
వ్యములందుఁ గలవు దుర్వాక్యసమితి
పునరుక్తిదోషముల్ కనిపెట్టవచ్చు వే
దవ్యాసరచిత పుస్తకములందు

నాదికవీంద్రవిఖ్యాతిచేఁ దనరారు
వాల్మీకిమునికి లేవా నెరసులు
కీర్తినార్జించి మన మత కర్తలైన
పండితుల కోశములఁబొరపాట్లు లేవె
యనుచు వాదించు నల్ప విద్యాపరుండు
మదముగల్గినవేళ సన్మార్గధుర్య. 232

ఉ॥ అన్యులధిక్కరించి పర,మార్థమెఱుంగని దుష్టపండిత
మ్మన్యులఁగాంచి భాగవత,మార్గము రామకథామృతంబొ రా
జన్యచరిత్ర భారతము, చక్కఁగ నర్థముఁజెప్పుమంచు సా
మాన్యులు కోరిరేని మఱు,మాటవచింపరు శక్తిహీనులై. 233

వ॥ ఇఁకమీఁదఁ గులమదప్రకారంబు వినుము. కులమదంబు బ్రాహ్మణులయందు మిక్కుటంబుగానుండు. నన్యులయందదియుండినను రాణించదు. బ్రాహ్మణుండై జన్మించువానికి వేదశాస్త్రేతిహాసాదులు చదివి కృతార్థుఁడై యితరులకు వినిపించుట ముఖ్యధర్మంబుగాని యన్యజాతులఁ బసులపోల్కి నిరాకరించి యజ్ఞానంబునఁబడఁ ద్రోయుట న్యాయంబుగాదు. విప్రులకుఁ దపోబలము, మనోబలము, విద్యాబలము, యోగబలము, సత్కర్మానుష్ఠానబలము కలిమాహాత్మ్యంబుచే నశించినవి. మేమెక్కువనెడు కులమదంబుమాత్రము వృద్ధిలోనున్నది. 234

సుశీలుఁడు

స్వామీ! మీరు సద్బ్రాహ్మణవంశమున జన్మించినవారు గదా! బ్రాహ్మణదోషంబులు వెల్లడింపుచున్నారే. 235

వరవరముని

వత్సా! నీకు నే నిప్పుడెఱింగించునది వేదాంతంబుగాని కర్మప్రధానంబుగాదు. బ్రాహ్మణత్వము భగవదంగీకారయోగ్యముగాదు. భక్తిచే భగవంతుండధీనుఁడగును. 236

చ॥ తనకులమెక్కునంచు బహు,ధామదమెక్కి చరించువాఁడు స
జ్జనులగు నన్యవంశజుల, సర్వవిధంబుల ధిక్కరించు దు
ర్జనులయినన్ స్వకీయుల వి,చారణసేయక సత్కరించు స
జ్జనులకుఁగీడు దుష్టులకు, సౌఖ్యమొసంగెను జాతినైజముల్. 237

ఉ॥ ఎక్కువజాతియందు జనియించిన దుర్జనులైనవారిఁ దా
మెక్కువగాఁదలంచెదరు హీనకులోద్భవులైనజాతివా
రెక్కువ పుణ్యులైనను సహింపరు చెప్పరుశాస్త్రబోధ మే
మెక్కువజాతివారమని, యెంచు మదాంధులు పుణ్యవర్ధనా. 238

శా॥ జారుండైననుఁ జోరుఁడైనను దురా,చారాధికుండై దురా
హారంబుండినుచున్న జంతుచయ సం,హారంబుఁగావించు ని
ష్కారుణ్యాశయుఁడైన సొంతతెగలో, జన్మించువాఁడైనచో
గారాబంబునఁ జేరఁదీసికొని శృం,గారింతురు ర్వసురుల్. 239

తే॥ విషయ వైరాగ్యమునుఁబొంది విష్ణుపాద
చింతనాపరుఁడై ప్రకాశించు మనుజుఁ
డితరమగుజాతిలో జనియించెనేని
నతని కెతిఁగింపఁబోరు వేదాంతమైన. 240

వ॥ మఱియు నన్నాదులు భుజించుటచే శరీరపాటవంబుగలిగి పరాపకారంబు లొనరించుచుండుట లాహారమదము. పాత్రాపాత్ర, ధర్మాధర్మ విచారణచేయక లంచంబులుగొని పరులహింసించుట లధికారమదము. బాల వృద్ధాదుల నెగతాళిచేయుచు వావి వరుసలు లేకుండ స్త్రీలౌల్యంబుగల్గి చరించుట యౌవనమదము. కురూపులఁ గాంచి నవ్వి పరిహాసింపుచుఁ దనవంటిసుందరుఁడు లేడని గర్వించుట రూపమదము. వధూజనంబులకొఱకు సుందోపసుందులకైతి నన్యోన్యము కలహించుట స్త్రీమదము. ధన విద్యాదులచే నధికులైనవారి

నోడించి తాను గొప్పగా నుండవలయునని కోరుట మాత్సర్యము, కామము మొదలుకొని యింతవఱకుఁ జెప్పిన గుణంబు లాఱునుంగలిసి యరిషడ్వర్గము. అసూయ యనఁగా సద్గుణంబులను దోషంబులుగాఁ బరిగణించుట. ఈర్ష్యయనఁగాఁ దనకుం గల వైభవం బితరుల కుండరాదని సహించకపోవుట. ద్వేషమనఁగాఁ దనకు సంభవించిన కష్టంబు లితరులకు రావలయునని కోరుట. దంభమనఁగా నందఱుఁ దన్నుఁ బొగడవలయునని కోరుట. ఈగుణంబులన్నియు నరిషడ్వర్గంబునందుఁ బర్యవసించును. 241

# గుణత్రయవిభాగము

సుశీలుఁడు

ప్రభూ ! ఇఁకమీఁద గుణత్రయవిభాగం బెఱింగింపుడు. 242

వరవరముని

పుత్రా ! గుణత్రయవిభాగమును గూర్చి భగవానులు గీతాశాస్త్రంబున నెఱింగించిరి. వానినే నీకుం దెల్పెద నెట్లంటివేని. 243

శ్లో॥ సత్త్వం రజ స్తమ ఇతి, గుణాః ప్రకృతిసంభవాః
నిబధ్నంతి మహాబాహో, దేహే దేహిన మవ్యయమ్.

ప్రకృతియందు జన్మించినట్టి సత్త్వ రజ స్తమస్సులను మూఁడు గుణంబు లవ్యయుఁడైన జీవుని దేహమునందు బంధింపుచున్నవి. 244

శ్లో॥ తత్రసత్త్వం నిర్మలత్వా, త్ప్రకాశకమనామయమ్
సుఖసంగేన బధ్నాతి, జ్ఞానసంగేన చానఘ.

పాపరహితుఁడైన ఫల్గునా యీ మూఁడింటిలోఁ బ్రకాశ

మైనదియు, నారోగ్యమిచ్చునదియు నైన సత్వగుణము జీవుని సుఖము నందును, జ్ఞానమునందును నాసక్తిఁగలిగించి బంధింపుచున్నది. 245

శ్లో॥ రజోరాగాత్మకం విద్ధి, తృష్ణా సంగసముద్భవమ్
తన్నిబధ్నాతి కౌంతేయ, కర్మసంగేన దేహినమ్.

అర్జునా రజోగుణము స్త్రీ పురుషులయొక్క పరస్పర కామమునకు హేతువైనది. ఆశకుఁగారణమైనది.భార్యాపుత్రాదులయందుఁ గల మోహమునకు మూలమై సాంసారికకృత్యములయందు జీవుని బంధింపుచున్నది. 246

శ్లో॥ తమస్త్వ జ్ఞానజంవిద్ధి, మోహనం సర్వదేహినాం
ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతి భారత.

భారతా ! ఈతమోగుణము అజ్ఞానమువలనఁబుట్టి సమస్త ప్రాణులను యుక్తాయుక్త పరిజ్ఞానములేకుండ మోహింపఁజేయుచుఁ, బ్రమాదము, ఆలస్యము, నిద్ర వీనిచేత జీవుని బంధింపుచున్నది. ప్రమాదమనఁగాఁ జేయవలసినపనినిమాని మఱియొకిటిచేయుట, ఆలస్యమనఁగాఁ జేయవలసిపనుల నారంభింపకుండుట, నిద్రయనఁగా నంతరింద్రియ బాహ్యేంద్రియ వ్యాపారంబు లడఁగియుండుట. 247

శ్లో॥ సత్వం సుఖే సంజయతి, రజః కర్మణిభారత
జ్ఞాన మావృత్యతు తమః, ప్రమాదే సంజయత్యుత.

భారతా ! సత్వగుణము సుఖమునందును, రజోగుణము కర్మములయందును, తమోగుణము జ్ఞానమునుఁగప్పి ప్రమాదమునందును, జీవునకు సంగముఁ గలుగఁజేయుచున్నవి. 248

శ్లో॥ రజస్తమశ్చాభి భూయ, సత్త్వం భవతి భారత
రజస్సత్వం తమశ్చైవ, తమస్సత్త్వం రజస్తథా.

అర్జునా ! యొకప్పుడు రజోగుణ తమోగుణములఁ దిరస్క-
రించి సత్వగుణ ముద్రేకించియుండును. మెండియు సత్త్వ రజోగుణ
ములనడంచి తమోగుణ ముద్రేకించి యుండును. మఱియొకసారి
సత్త్వ తమస్సుల నడంచి రజస్సు మిక్కిలిగానుండును. 249

శ్లో॥ సర్వద్వారేషు దేహేస్మిన్ ప్రకాశ ఉపజాయతే
జ్ఞానం యదాతదా విద్యాద్వివృద్ధం సత్త్వమిత్యుత.

అర్జునా ! ఈశరీరమునందుఁ జక్షురాదీంద్రియములనుఁ బ్రకా
శింపఁజేయు జ్ఞానమెప్పుడు కలుగునో అప్పుడు సత్త్వము వృద్ధిఁబొందిన
దని తెలియవలెను. 250

శ్లో॥ లోభః ప్రవృత్తిరారంభః, కర్మణామశమస్పృహా
రజస్యేతాని జాయంతే,వి వృద్ధే భరతర్షభ.

భారతా ! లోభమును వృథాకార్యములయందుఁ బ్రయత్నము
పనులయందుఁ దృప్తిలేని యాసక్తి యెప్పుడుగల్గునో యప్పుడు రజో
గుణము వృద్ధినొందినదని తెలియవలెను. 251

శ్లో॥ అప్రకాశోఽప్రవృత్తిశ్చ, ప్రమాదో మోహ ఏవచ
తమస్యేతాని జాయంతే, వివృద్ధే కురునందన.

కురుప్రవరా ! ప్రకాశములేకుండుట, కార్యములు చేయ
కుండుట, చేయఁగూడనివానినిఁ జేయుట, విపరీతజ్ఞానము యెప్పుడు
గల్గునో యప్పుడు తమోగుణము వృద్ధినొందినదని తెలియవలెను.

శ్లో॥ యదాసత్త్వే ప్రవృద్ధేతు, ప్రళయంయాతి దేహభృత్
తదోత్తమవిదాంలోకా,నమలాన్ ప్రతిపద్యతే

సత్వము వృద్ధినొందినప్పుడు మరణించిన దేహి పుణ్యలోకము
లనుబొంది తత్త్వవిదులైనవారికులమున జన్మించి తత్త్వజ్ఞానాధి 253
కారమునుఁ బొందుచున్నాడు.

శ్లో॥ రజసి ప్రళయంగత్వా కర్మసంగిషుజాయతే

రజోగుణము వృద్ధినొందినప్పుడు చచ్చినవాఁడు యిహపర సుఖంబు లెఱుంగక సదా పనులు చేయువారి వంశములోఁ బుట్టుచున్నాడు. 254

శ్లో॥ తథాప్రలీనస్తమసి, మూఢయోనిషుజాయతే.

తమోగుణము వృద్ధిఁబొందినప్పుడు దేహము విడుచువాఁడు యేపురుషార్థమునకుఁదగని పశ్వాది యోనులందుఁ బుట్టుచున్నాడు.

శ్లో॥ సత్త్వాత్సంజాయతే జ్ఞానం, రజసో లోభ ఏవచ
ప్రమాద మోహౌ తమసో, భవతోఽజ్ఞానమేవచ.

సత్త్వగుణమువల్ల జ్ఞానము, రజోగుణమువలన లోభాదులు, తమోగుణముచేఁ బ్రమాదమోహాజ్ఞానములు సంభవించును. 256

శ్లో॥ ఊర్ధ్వంగచ్ఛంతి సత్త్వస్థా, మధ్యేతిష్ఠంతి రాజసాః
జఘన్యగుణ వృత్తిస్థా, అధోగచ్ఛంతి తామసాః.

సాత్త్వికు లూర్ధ్వలోకమునకుఁబోయి క్రమముగా మోక్షంబుఁజెందుదురు. రాజసు లీ లోకంబున జనించి కర్మములఁ జేయుచుందురు. నీచవృత్తిగల తామసు లధోలోకంబులగు నరకాదులఁ బొందుదురు. 257

వ॥ మఱియు విభీషణుండు సాత్త్వికుఁడు, రావణుండు రాజసుఁడు, కుంభకర్ణుఁడు తామసుఁడు, విభీషణునివలె సర్వసంగపరిత్యాగముసేసి భగవత్కైంకర్యపరులైనవారందఱు సాత్త్వికులు, రావణునివలెఁ బరావమానము, సాధుద్రోహము, పరవధూ లౌల్యము, ధనార్జనము, పరహింస, పరనింద, ఆత్మస్తుతిగలవారందఱు రాజసులు, కుంభకర్ణునివలె మితిలేని తిండిఁదిని, సదా నిద్రఁబోవుచు, మేల్కొని నప్పు డిహ పర సుఖరహితములైన పనులుసేయువారంఱు తామసులని యెఱుంగవలయును. పైనఁజెప్పిన గుణత్రయవిభాగంబున కిది దృష్టాం

తము. మఱియు నిమ్నోక్త ప్రాకృతగుణంబులుగాన బ్రహ్మాదిస్తంభ పర్యంతము సమస్త చరాచర భూతంబులయందుండు నీ మూఁడు గుణంబులనువిడిచినవాఁడేలోకమునందైనలేఁడు. జ్ఞానశక్తి బలైశ్వర్య వీర్య తేజ సౌశీల్యాద్యనంత కల్యాణగుణంబులు భగవంతునియం దుండు నితరులయందుండవు. బ్రహ్మాది ప్రాకృతలోకంబులయందు మిశ్ర సత్వముమాత్రమేయుండును. శుద్ధసత్త్వము పరమపదంబు నందుండును. 258

# సామాన్యధర్మనిరూపణము

సుశీలుఁడు

గురువర్యా ! యింక సామాన్య విశేష ధర్మంబులపద్ధతి నెఱింగింపుఁడు. 259

వరవరముని

శిష్యా ముందు సామాన్యధర్మంబెఱింగించి తమపరి విశేష ధర్మం బెఱింగించెద. ధర్మార్థకామంబులను నిమ్నోదనుంగలిసి త్రివర్గ మనంబడును. త్రివర్గఫలంబును సాధించునది సామాన్యధర్మం బది యెట్లుంటివేని. జనకుండు పుత్రాదుల రక్షించుట, పుత్రాదులు జనకునకుఁ బరిచర్యసేయుట, భర్త్యయగువాఁడు భార్యనుగాపాడుచు సంతానంబుఁబొందుట, భార్య భర్తకుఁ బరిచర్యఁజేయుచుఁ దదీయ శాసనంబు మీఱకయుండుట, జ్యేష్ఠసోదరులు కనిష్ఠ సోదరులఁ బాలించుట, కనిష్ఠులు జ్యేష్ఠుల నారాధించుట, ఉపాధ్యాయుఁడు శిష్యులకు విద్యాబుద్ధులు గఱపుట, శిష్యు లుపాధ్యాయుని శాసనము శిరసావహించి పరిచర్యలొనరించుట - ఇవిమొదలైనవి సామాన్య ధర్మంబులు. రాజైనవాఁడు ప్రజలఁ బుత్రులఁబోలెఁ బాలించుట,

ప్రజలు రాజశాసనంబుమీఱక చరించుట, బ్రహ్మచారులు వివాహము నకుఁబూర్వము స్త్రీ స్పర్శము లేకయుండుట, వానప్రస్థులు గ్రామ్య వస్తువులు భుజింపకుండుట, సన్యాసులు సాంసారికకృత్యంబులు వర్జించుట, గృహస్థుండు దీనాతిథి భిక్షుక వర్ణి వానప్రస్థ సన్యాసి మూకాంధ బధిరాదులను న్యాయార్జితధనంబుచే రక్షించుట మొదలైనవి సామాన్యధర్మంబులు. సత్య శౌచ క్షమాదాన వ్రతోపవాస యజ్ఞ సంధ్యావందనాగ్ని క్రియా తీర్థస్నాన స్వాధ్యాయేష్టాపూర్తాదు లన్నియు సామాన్యధర్మంబులు. సామాన్యధర్మము సఫలమైనచో జీవికి స్వర్గాదిలోకంబులుమాత్రము ప్రాప్తించుంగాని మోక్షంబు లభించదు. 260

హరిశ్చంద్రుఁడు మిక్కిలి పట్టుదలతో సత్యము నాశ్రయించి పడరానిబాములువడి దేవేంద్రుని సన్నిధానంబున నర్ధసింహాసనంబు సంపాదించెను. సుదర్శన రంతిదేవు లతిథిపూజయం దాఱితేఱినవారలై స్వర్గలోకసుఖంబు లార్జించిరి. సావిత్రి పాతివ్రత్య ప్రభావంబుచే యమునిసహా జడిపించి సత్యవంతుని బ్రతికించి భర్తతోఁ బ్రాపంచిక సుఖంబులు చిరకాలం బనుభవించి తుదకు స్వర్గమునొందెను. దమయంతి తనశక్తిచేఁ గిరాతుని భస్మముసేసి నట్టడవులలోఁ గష్టంబులకోర్చి మరల నలునిఁగూడి దేవలోకంబున కరిగెను. పాండురాజు సమవర్తితో నర్ధసింహాసనంబుననుండి సురలోకంబున కేగుట కుద్యోగించి రాజసూయయాగంబుఁ జేయుమని ధర్మరాజుతోఁ జెప్పుటకు నారదుని భూలోకంబునకనిచి తద్ద్వారా నిర్జరపదవింజేరె. కౌశికుండను విప్రుండు వేలసంవత్సరంబులు గాయత్రీజపంబొనరించి స్వకీయ జపఫలం బిక్ష్వాకునకొసంగి కౌశికుండును, పరిమితిలేని యజ్ఞఫలంబులు కౌశికునకు సమర్పించి యిక్ష్వాకుభూపతియు బ్రహ్మలోకంబుఁజెందిరి. భగీరథుండు మూడువేలవర్షంబులు తపంబొనర్చి బ్రహ్మను మెప్పించి యాకాశగంగను భూలోకంబునకుదించి యఖి

పదివేలమంది పెద్దలకుఁ బుణ్యగతులుగల్పించి యజ్ఞంబులు గావించి యపార దక్షిణలచే ధరాసురుల మెప్పించి నిర్జరలోకం బార్జించె. పర్వతసదృశమృష్టాన్నరాసులతోఁ నేతి కాలువలుపాఱునట్లు మఖంబు లొనర్చిన మాంధాతయు, సుహోత్రుండు, భరతుండు, శశిబిందుండు గయుండు, పృథువు, మరుత్తు, పురూరవుండు, పురుకుత్సుండు మొదలైన రాజు లపార పుణ్యకార్యంబు లొనరించి సురపదవి నార్జించిరి.

మఱియు రాగశూన్యులైన సన్న్యాసులు యమనియమముఖాష్టాంగ యోగసిద్ధులు వడసిన యోగులు, నస్ఖలిత బ్రహ్మచారులు, సమస్త తీర్థస్నానంబులచేఁ బవిత్రులైన పుణ్యులు, సత్కర్మానుష్ఠానపరులైన గృహమేధులు, గో భూ హిరణ్యాదిదానంబులచేఁ బ్రసిద్ధిఁ గాంచిన వదాన్యులు, నప్రతిమ పతిభావంబుగల సాధ్వీమణులు సత్రశాలలు, పానీయశాలలు, వనంబులు నిర్మించి పాంథులఁబ్రోచిన పరోపకారులు, ఫలాహారులు, జలాహారులు, వాతాహారులు, జీర్ణపర్ణాహారులు, నిరాహారులు, పౌండరీకాశ్వమేధ వాజపేయ రాజసూయాది వివిధాధ్వరకర్తలు రణంబున వెనుదీయక పోరి మరణించిన శూరులు, స్వాధ్యాయపరులు, కృచ్ఛ్రాంద్రాయణాది వ్రతనిష్ఠులు బ్రహ్మలోకమువఱకుంగల లోకంబులఁబొందిరి. ఇవియావత్తు సామాన్యధర్మ ప్రవర్తనంబులు. 262

సుశీలుఁడు

స్వామీ! పాండునందను లనుష్ఠించినది సామాన్య ధర్మమా, విశేషధర్మమా? 263

వరవరముని

శ్లో॥ మమప్రాణా హి పాండవాః = పాండవులు నా బహిః ప్రాణంబులని శ్రీకృష్ణుండు వచించుటచేతఁ బాంధవులు విశేషధర్మము ననుష్ఠించినవారేకాని మధ్యమధ్యమున సామాన్యధర్మముఁ గైకొని విశేషధర్మమును విడుచుటచేఁ గష్టములొందిరి. 264

సుశీలుఁడు

దానివిషయంబును విశదముగా సెలవింపుఁడు. 265

వరవరముని

ధర్మనందనుఁడు దుర్యోధనునితో ద్యూతంబాడుట, ద్రౌపదీ వస్త్రాపహరణవేళ నుదాసీనుఁడై వైరుల వధింపకపోవుట, యాజ్ఞసేని నపహరించినపుడు సైంధవుని ప్రాణంబులతోవిడుచుట నివి సామాన్య ధర్మంబులు. ధర్మపుత్రుఁడా యా సమయంబులందు విశేషధర్మము నడచి సామాన్య ధర్మంబునుఁ బరిగ్రహించెను. సామాన్య విశేష ధర్మంబులకు విరోధంబు లేనప్పుడు రెంటినిఁ గొనసాగించుకొన వచ్చును. విరోధముకలిగినచో సామాన్య ధర్మంబునువదలి విశేష ధర్మము ననుష్ఠింపవలయును. 266

సుశీలుఁడు

పైవిషయంబును విడఁదీసి చక్కఁగా వక్కాణింపుఁడు. 267

వరవరముని

దుర్యోధనుఁడు కపటోపాయంబుఁబన్ని రాజ్యము నపహరింపఁ దలఁచి ధర్మరాజును ద్యూతంబునకుఁ బిలిపించె. నత్తఱి ధర్మరాజు తనమనంబున నిట్లని వితర్కించె. రాజైనవాఁడు యుద్ధంబునకుఁగాని, జూదంబునకుఁగాని రమ్మని పిలిచినచో వెనుకాడరాదని యప్పనిఁ గావించెంగాని జూదము పాపమని మానలేదు. జూదంబాడుట రాజార్హమైనను సామాన్యధర్మము. దానినిమానుకొనుట విశేష ధర్మము. విశేషధర్మమునడంచి సామాన్యధర్మము ననుష్ఠించుట చేతనే ధర్మనందనుఁ డరణ్యవాసంబున భార్యా పుత్ర సోదర బంధు మిత్ర వనీపక పరివారాదుల రక్షింపలేక నానావిధ బాధలొందెను.

సుశీలుఁడు

దుర్యోధనాదులు సభాస్థలంబున యాజ్ఞసేనీ వస్త్రాపహరణం బొనర్చుటలే ధర్మమైయుండును. 268

వరవరముని

అది యేధర్మంబునుంగాదు. సామాన్య విశేషధర్మంబులలోఁ జేరదు. కేవల మధర్మమైయున్నది. ఎందులకంటివేనిఁ బుణ్యస్త్రీనిఁ గాని, నీచస్త్రీనిఁగాని యేయుగంబునందు నేకాలమునందును సభాస్థలంబునఁ జీరలు విప్పినట్లు వినలేదు. కల్లయుగంబైన కలియుగంబునందును లేదు. దుశ్శాసనుఁడు ద్రౌపది నీడ్చి తెచ్చి సభలో నిలువంబెట్టినప్పు డప్పుణ్యసాధ్వి సభాస్తారులం గని యయ్యలారా! ధర్మరాజు నన్నుఁ బణంబుగా నొడ్డెననియు నందువలన నేను మీ సొత్తు నైతిననియు స్వామియైనవాఁడు సొత్తు నెట్లైన నుపయోగించుకొనవచ్చుననియు నన్నిచ్చటికిఁ దెచ్చితిరి కాని నేను మీ సొత్తు నైతినో లేదో యని సందేహముగా నున్నది. ఎందుకనఁగా ధర్మరాజోడినపిమ్మట నన్నుఁ బందెములో నొడ్డెనా నన్నుఁ బందెములో నొడ్డినపిమ్మట ధర్మరాజోడెనా యని ప్రశ్నించెను. ధర్మరాజుండఁగా స్త్రీయైన ద్రౌపదినిఁ బణంబుగా నొడ్డుటకు వీలులేదు. ధర్మరాజోడినపిమ్మటఁ బందెములేదు. రెండువిధంబులచే నేను మీ సొత్తును గాలేదు. దుర్యోధనాదులు నాకు స్వాములుగారని ద్రౌపది నొక్కి వక్కాణించె. నందులకు భీష్మ ద్రోణాదు లేమియు మాట్లాడరైరి. విదురుండు ధర్మనిర్ణయము చేయుఁడని గోలపెట్టెంగాని యెవ్వరైన లక్ష్యము సేయరైరి. 269

సుశీలుఁడు

ఇందులోఁ బాండవులు సామాన్య ధర్మం బనుష్ఠించిన దేమున్నది? 270

వరవరముని

దుర్యోధనాదులకప్పటికి యాజ్ఞసేనియందే మాత్ర మధికారము లేదు. లేకపోయినను వారధర్మప్రవర్తకులై బాధింపుచుండఁగా ధార్తరాష్ట్రుల నెదిరించినచో లోకాపవాదంబు కలుగునని శంకించి

తమకు సాత్తై రక్షణీయయై విష్ణుభక్తురాలైన ద్రౌపదినిఁ బరిత్యజించి కాపాడకపోయినందున విశేషధర్మమును పాటింపనివారైరి. 271

సుశీలుఁడు

ద్రౌపదిని రక్షించుట పాండవులకు సామాన్యధర్మమేకాని విశేషధర్మ మెట్లగును ? 272

వరవరముని.

పాండవులు యాజ్ఞసేనిని భార్యాభిప్రాయంబుతో రక్షించుట సామాన్యధర్మంబుగాని విష్ణుభక్తురాలికిఁ గష్టమువచ్చెనేయని పరితపించి రక్షించుట విశేషధర్మంబగు. ఈవిషయంబు విశేషధర్మనిర్ణయములో లెస్సగా నెఱింగింతు. 273

సుశీలుఁడు

తరువాత సైంధవుని సమాచారం బెఱింగింపుఁడు. 274

వరవరముని

పాండవు లరణ్యవాసంబొనర్చుచు నొక్కనాడు ద్రౌపది నింటికడ విడిచి, ధౌమ్యుని కావలియుంచి వేఁటకుఁబోయి రట్టిసమయంబున నొంటరిగానుండు ద్రౌపదిని బలాత్కారముగా నపహరించి సైంధవుం డేగుచుండె. నది తెలుసుకొని భీముండు సైంధవునిఁబట్టి వధింపఁబోవ బంధు భావంబుచే ధర్మరాజు వదలిపెట్టించె. నిది సామాన్యధర్మంబు. 275

సుశీలుఁడు

అప్పుడు వానిని వదలక యేమిచేయవలసియుండును ? 276

వరవరముని

సైంధవునకు ద్రౌపది పరస్త్రీ యగుటగాక వావి వరుసలకు సహోదరి. అట్టి రాణివాసద్రోహి వధార్హుఁడు. వధ్యుఁడగువానిం జంపుట విశేషధర్మంబు. బంధుభావంబున విడుచుట సామాన్య

ధర్మంబు. జయద్రథు నప్పుడు పడలుటచేతనే మరల నభిమన్యువధకు హేతువై యర్జునునిచేఁ జంపఁబడియెఁగదా. 277

సుశీలుఁడు

పాండునందనులు రాజసూయాశ్వమేధాదులొనర్చుట సామాన్య ధర్మంబుకాదా? 278

వరవరముని

కాదుకాదు. పార్థులేకార్యంబొనర్చినను కృష్ణాజ్ఞచేఁ గృష్ణార్పణముగాఁ జేసిరి. మంగలంబున వేయించిన విత్తనంబులు మొలకలెత్తవట్లే భగవదర్పణంబుగా నేకర్మంబాచరించినను బంధకంబుగాక విశేష ధర్మంబై ముక్తినొసంగును గనుకనే. 279

శ్లో॥ యత్కరోషియదశ్నాసి యజ్జుహోషిదదాసియత్
యత్తపస్యసి కౌంతేయ, తత్కురుష్వ మదర్పణమ్.

అర్జునా! యేది చేయుచున్నావో యేది తినుచున్నావో యేది హోమముచేయుచున్నావో యేది తపస్సుచేయుచున్నావో దానిని నాకు సమర్పింపుము. 280

శ్లో॥ శుభాశుభ ఫలైరేవం మోక్ష్యసేకర్మబంధనైః
సన్యాసయోగ యుక్తాత్మా, విముక్తో మాముపైష్యసి.

ఇట్లు నీవుచేయు లౌకిక వైదిక కర్మములన్నియు నాకు సమర్పించితివేని శుభాశుభకర్మబంధములనుండి విడువఁబడి నన్నుఁబొందుదువు. అనఁగా ముక్తిఁగాంతువని భగవంతుఁడు గీతాశాస్త్రమునందు వచించెను. 281

సుశీలుఁడు

సామాన్యధర్మంబుచే స్వర్గాద్యశాశ్వత ఫలంబులు గలుగునంటివి. విఘ్నంబైనచో నేమగును? 282

వరవరముని

వత్సా! మంచిప్రశ్నమొనర్చి మేలుచేసితివి. సామాన్యధర్మంబనుష్ఠించుట మిక్కిలి ప్రయాస, నెఱవేఱినచో నశాశ్వతంబులగు స్వర్గాదిభోగంబులు గలుగును. విఘ్నంబైనచో విపరీతఫలంబు గలుగును. నిష్ఫలంబగుటయుఁగలదు. నిష్ఫలంబగుట కొక్కకథ నెఱింగింతు నాకర్ణింపుము. కైలాసనగంబునఁ గుమార వినాయకు లొక మామిడిపండుకొఱకు నాకంటే నాకని కలహించి రక్కాలంబున నక్కడనుండు మునీంద్రు లాలోచించి కోటి తీర్థస్నానంబు లొనర్చిన వానికిది లభించునని చెప్పి రంతటఁ గుమారస్వామి మయూరవాహనుండై యొక్కసంవత్సరమునకుఁ గోటితీర్థస్నానంబులు ముగించివచ్చె. నటుపిమ్మట విఘ్నేశ్వరుండు జ్ఞాననిధానమగు పార్వతిని సమీపించి మామిడిపండు కనిష్ఠుండైనను గుమారునకు దక్కఁబోవుచున్నది. నేను జ్యేష్ఠుండనయ్యు విఫలవాంఛితుఁడ నగుచుంటినని దుఃఖింపఁగా శర్వాణి దీర్ఘముగా నాలోచించి చూతఫలంబు నొకయుట్టిపైనుంచి వినాయకుంగని బిడ్డా! నారాయణస్మరణతో ముమ్మాఱు దీనిని వలగొనుమని చెప్పి యట్లుచేసినపిమ్మట నేకదంత కార్తికేయుల శిక్యంబునకు రెండుప్రక్కల నిలువఁబెట్టి చేతులు చాపించె. నంతట నా రసాలఫలం బెగిరి లంబోదరుని దోయిటంబడియె. నప్పుడు గజముఖుండు సంతోషించె. షణ్ముఖుండు విచారగ్రస్తుఁడయ్యె. ముమ్మాఱొనర్చిన నారాయణ నామోచ్చారణమునకుఁ గోటితీర్థస్నానఫలంబు సమానము కాలేదుగదా యని కైలాసవాసు లాశ్చర్యపడిరి. 283

సామాన్యధర్మానుష్ఠానములో లోపంబుగల్గినచో విపరీతఫలంబు గలుగుననుదానికి దృష్టాంతము వచింతు నాలకింపుము. పూర్వము సోమశర్మయను విప్రుం డధ్వరంబొనర్చి దానియందు సంభవించిన క్రియాలోప మంత్రలోపంబులచే బ్రహ్మరాక్షసుఁడై చరించెను. పరిమితిలేని గోదాన, భూదాన, హిరణ్యదానంబు లొనర్చిన నృగమహా

రా జూసరి వెల్లియయ్యె. ననేకసంవత్సరంబులు తపంబొనర్చిన యయాతి స్వర్గ పదభ్రష్టుఁడయ్యె. నూఱు హయమేధ సవనంబు లొనర్చిన నహుషుండు స్వర్గముఁబాసి వనంబునఁ గొండచిలువయయ్యె. నూట మొనిమిదివత్సరంబులు గౌతమముని కన్నంబొసంగిన బ్రహ్మదత్తుండు గ్రద్ధయై జన్మించె. మూఁడువేలవర్షంబులు బ్రహ్మనుగూర్చి తపంబొనర్చిన శ్వేతభూపతి స్వకీయశవమాంసం బనేకాబ్దంబులు భుజించె. కోట్లకొలఁది గోదానంబులొనర్చిన కార్తవీర్యార్జునుండు గోవత్స పాపంబుఁజెందె. ద్వాపరంబున నదాన్యాగ్రేసరుండని విఖ్యాతిఁ గాంచిన కర్ణుఁడు రథచక్రంబు యుద్ధభూమిలోఁ గ్రుంగినప్పుడు దిక్కు లేక విలపించె. ఇవియెల్లను సామాన్యధర్మంబులు. 284

సుశీలుఁడు

పుణ్యకార్యంబుల కన్నింటికిఁ గలంకం బాపాదించితిరిగదా యప్పనులు చేయఁగూడదాయేమి ? 285

వరవరముని

చేయవచ్చునుగాని సర్వ కర్మ ఫల ప్రదాత నారాయణుఁడు తదీయ రహస్యంబెఱింగి చేయవలయు. నొకపత్రమునం దక్షరములు వ్రాసి దానిపై నొకరాయి మోపినచోఁ గదలకయుండును, లేనిచో గాలి కెగిరిపోయి శిథిలంబగు నదేవిధంబునఁ బుణ్యకార్యమును శ్రీకృష్ణార్పణమ్మని, శ్రీరామార్పణమ్మని, భగవదర్పణమ్మని చేయ వలయు. నట్లొనర్చిన లెస్సగా ఫలించు. నహంకారముతో నొనర్చి నచో నిష్ఫలమో విపరీతఫలప్రదమో యగును. 286

సుశీలుఁడు

సామాన్యధర్మవిషయము నింతటితో విరమించి విశేషధర్మము నెఱింగింపుడు. 287

# విశేషధర్మ నిర్ణయము

వరవరముని

వ॥ భగవదారాధనమునకంటె నితరమైన పుణ్యంబు లన్నియు సామాన్య ధర్మములోఁ బర్యవసించు భగవత్సంబంధమగు పను లన్నియు విశేషధర్మంబగు నందువలననే భగవంతుఁడు గీతాశాస్త్రమునందు, సర్వధర్మంబులు సమూలముగావిడిచి నన్నొక్కనినే శరణుఁజెందుము. నేను నిన్ను సర్వపాపములనుండి విడిపింతునని యర్జునున కుపదేశించెను. 288

ధర్మవేత్తలలో సామాన్యులని, విశిష్టులని రెండుతెగలవారు గలరు. సామాన్యధర్మము ననుష్ఠించువారు సామాన్యులు. విశేష ధర్మ మాచరించువారు విశిష్టులు. 289

సీ॥ జల్లేడునలకాసించునే రోలంబ
మరవింద మకరంద మానమాని
పల్వలములయందు వర్తించునే హంస
మానస హ్రదములో మనికివిడిచి
దుత్తూరముల మేయఁదొడఁగునే పికము ర
సాల ప్రవాళ భక్షణమువదలి
తుంగకాయలను సంతోషించి మెక్కునే
కీర మబ్బిన పంచదారనేది

హీనమృగములఁగొనునె పంచాననంబు
కుంభి కుంభస్థలంబుఁ బగుల్చిటుడిగి
జ్ఞాని సామాన్య ధర్మ విధానమందు
మమతఁగనునె విశేషధర్మంబువిడిచి. 290

వ॥ ధర్మియున్నచో ధర్మముండును, వస్తువున్నచో గుణముండు నెట్లనఁగా రక్తాంభోజము, నల్లకలువనాఁ గావున విశేషధర్మం బాచ రించినవారిఁ దెలిపినచో విశేషధర్మంబు తేటపడును. పూర్వము త్రేతాయుగంబున శ్రీమన్నారాయణుండు రాముండై యవతరింపఁగా లక్ష్మణ భరత శత్రుఘ్నులు విశేషధర్మప్రవర్తకులై భగవంతుడగు రామునింగొలిచిరి. వారిలో లక్ష్మణుఁడు శేషావతారమూర్తి శేషునిఁ గూర్చి శ్రీయాళవందారు లేమి సాయించిరనఁగా. 291

శ్లో॥ నివాస శయ్యాసనపాదుకాంశుకో
పధాన వర్షాతప వారణాదిభిః
శరీరభేదై స్తవశేషతాంగతై
ర్యథోచితం శేష ఇతీర్యతే జనైః.

ఓ భగవంతుఁడా, నీవు నిలిచియుండునప్పుడు గృహముగాను, శయనించునప్పుడు శయ్యగాను, కూర్చుండునప్పుడు సింహాసనము గాను, నడచునప్పుడు పాదుకలుగాను, ధరించునప్పుడు వస్త్రముగాను తలక్రిందికి దిండుగాను, వర్షాతపంబులకు గొడుగుగాను కాలాను గుణ్యముగా రూపములు ధరించి నిన్ను సేవించుటవలన ననంతుని శేషుఁడని జనులు కీర్తింపుచున్నారని స్తుతించి రట్టి శేషస్వరూపుం డగు సౌమిత్రి 292

సీ॥ చంద్రశాలారామ, శయ్యాసనాందోళి
కార్వ గజాములం దాసపడక
ఘన ధాన్య ధన మణి కనక పరిష్కార
వస్త్రమాల్యములపై వాంఛలేక
ఘనసార మృగ మద గంధ సారాది సు
గంధవస్తువులపైఁ గాంక్షఁగనక
సూపదుగ్ధోదనాపూపాజ్యకూర్చికా
గుడసితాదులమీఁదఁ గూర్మిఁగొనక

దేవకాంతతోడ దీటైన యూర్మిళా
సతినివిడిచి రామచంద్రు పాద
సేవఁగోరి వనికిఁజేరెఁగదా సుమి
త్రాసుతుఁడు విశేషధర్మియగుచు. 293

వ॥ వెండియు నీ లక్ష్మణుండు శ్రీరామచంద్రునితో నరణ్యమున కేగునప్పుడు ఖనిత్రీ ఖనిత్ర ప్రసేవంబులను, అనఁగాఁ బాఱ,గడ్డపాఱ, పల్లికలను, సీతాదేవికిఁ బదునాలుగేండ్లకుఁ గావలసిన దివ్యాంబరంబులను, ధనుర్బాణ తూణీర ఖడ్గంబులను మూఁపున ధరించి పోవుచుండెను. సీతారాములు నిశాసమయంబునఁ బర్ణశాలలో నిద్రింపుచుండఁగా సౌమిత్రి ధనుర్బాణంబులు ధరించి కాపాడుచుండెను. సూర్యోదయాత్పూర్వమే స్నానాది కృత్యంబులు ముగించుకొని జానకీరాములను స్నానముచేయించి, చేలంబులచే వారి పాదంబులఁ దడియొత్తుచుండెను. నవీనస్థలముల కేగినప్పుడు నేల చదరముఁగావించి, గృహనిర్మాణము సేయుచుండును. నానావిధ పక్వ రుచిర ఫలంబులనుఁ గందమూలాదులనుఁదెచ్చి సమర్పించుచుండును. సుగంధ ద్రవ్యంబులను జాతి మల్లికా చాంపేయ పాటలీ సౌగంధి కోత్పలేందీవరపుండరీకారుణాంభోజాది పుష్పంబులఁదెచ్చిసమర్పించును. వినోదకరంబులగు వివిధపదార్థంబులుదెచ్చి యిచ్చును. లక్ష్మణపరిచర్యచే జానకీరాములకు నరణ్యవాసము స్వర్గంబుభంగిఁ గనుపట్టె. మఱియు నీ సుమిత్రాపుత్రుండు దేహాభిమాన, లోకాభిమానంబులువిడిచి రామకైంకర్యమే ధారక పోషక భోగ్యములుగా నెంచెను. నిద్రాహారంబులు వర్జించెను. భయ మైథునంబు లతని కెప్పుడునులేవు. మఱియు నీలక్ష్మణుండు శుచియం దగ్నిహోత్రుఁడు, వైరాగ్యంబున సనకాదిమునిసన్నిభుఁడు, పరాక్రమంబున నద్వితీయుఁడు, తేజస్సునందు సూర్యుఁడు, క్షమాగుణంబుచే

భూసహానుఁడు మహాజ్ఞాని. మహాయోగి యింద్రియంబుల దండించి జయించినమేటి. భోగలాలస నడంచిన నిస్పృహుఁడు బాహ్యాంతశ్శత్రువుల నిర్మూలించిన ధీరుఁడు. జిహ్వాచాపల్య, గుహ్యచాపల్యంబులను తుచ్ఛగుణంబులఁదరి జేరనీయని గండరగండఁడు. స్వకీయహృదయము నిర్మలాయతనముగాఁజేసి సీతాయుతుండగు రామునిఁ బ్రతిష్ఠించిన పునీతుఁడది యట్లుండఁగా. 294

సీతాన్వేషణసమయంబున రామచంద్రుఁడు సుగ్రీవదత్త సీతాభూషణంబులఁ బరీక్షించి నిశ్చయించి లక్ష్మణుని గుర్తింపుమనఁగా నతడు రామునితో.

శ్లో॥ నాహంజానామి కేయూరే, నాహంజానామి కుండలే
నూపురం త్వభిజానామి, నిత్యంపాదాభివందనాత్.

కేయూరంబులుగాని, కుండలంబులుగాని నే నెఱుంగను. నిరంతరము పాదప్రక్షాళనమొనర్చి నమస్కరించుటచే నూపురములనఁగా నందెలుమాత్రము సీతామహాదేవివని యెఱుంగుదుననియె. నప్పుడు సుగ్రీవ హనుమదాదులు విని యింతకాలమునుండి యిమ్మహాత్ముఁడు సన్నిధానమందుండి భూపుత్రి శరీరావయవంబులు చూడలే దెంతటి వైరాగ్య నిధియని విస్మయమందిరి. 295

సుశీలుఁడు

మహాత్మా! ఇట్టి సద్గుణాఢ్యుఁడైన లక్ష్మణు నొకప్పుడు సీత దూషించెనందుకే దోషంబుగాదా? 296

వరవరముని

సీతాదేవి లక్ష్మణుని వాస్తవముగా దూషింపలేదు. కారణంబేమందువా సీత సాక్షాల్లక్ష్మీదేవి. పూర్వమామె వేదవతియై శ్రీహరిని వివాహమాడఁగోరి హిమాలయనగంబునందుఁ దపంబొనర్చె. నయ్యవసరంబున నచ్చటికి రావణుం డాకస్మికముగావచ్చి మోహించి

తన్ను వరింపుమని జడఁబట్టిలాఁగె. నప్పుడప్పుణ్యవతికోపించి దురాత్మా రావణా, పరిశుద్ధాంగినైన నన్నుఁ దాఁకితివి. నీవు స్పృశించిన మేని స్పుడేవిడిచి రాఁబోవుజన్మంబున జానకినై రామరూపుండగు శ్రీహరినిఁ బెండ్లియాడి నిన్ను నీ పుత్ర మిత్ర బంధు పరివారంబులను హరిచేఁ జంపింతునని ప్రతిజ్ఞఁజేసి యగ్నిలోఁబడి దగ్ధమై నిజప్రతిజ్ఞా సాఫల్యంబుకొఱకు సీతయైజనించి హదనిదియని తెలిసికొని. మాయా మృగవ్యాజంబున రాముని దూరంబునకనిచి లక్ష్మణునిసహా వనుపఁ గోరి రహస్యము వెలిబుచ్చక కోపముతోనటించి లక్ష్మణునిదూఱెను.

సుశీలుఁడు

రావణుండు లంకలో యుద్ధరంగంబున మూర్ఛఁజెందినలక్ష్మణు నెత్తుకొనిపోవలయునని యత్నించి కదల్పఁజాలడయ్యెఁ బంచవటీతీరంబున సీత నెట్లులేవదీసెను ? 298

వరవరముని

రావణుండు వేలకొలంది దేవ గంధర్వకాంతలఁ జెఱలో నుంచియున్నాడు. సీతాపహరణంబొనర్చినంగాని రావణుని రాఘవుడు వధించుటకువీలులేదు. అప్పుడుగాని దేవకాంతలు కారాగృహము నుండి విడువంబడరు. మఱియు దేవతల శరణాగతి ఫలించుటకు, మునుల దుఃఖంబు లాఱుటకు, రామావతార ప్రయోజనంబు నెఱవేఱుటకు సమయంబు వచ్చియున్నది. ఇంతదూర మాలోచించి మైథిలి లంకకేగె. 299

సుశీలుఁడు

దమయంతి తన్నుమోహించిన కిరాతుని వెంటనే దగ్ధము సేసె. సీతాదేవి రావణుని భస్మముచేయని కారణమేమి ? 300

వరవరముని

కారణము మునుపే వక్కాణించితి నైన మరలఁజెప్పెద నాకర్ణింపుము మనుష్యస్త్రీయైన దమయంతికిఁగలశక్తి లక్ష్మీస్వరూపిణి

రైన సీతను లేకపోలేదు. లక్ష్మీశక్తికిఁ బరిమితిలేదు. హనుమంతుని తోఁకకు నిప్పంటించిరని తెలిసినప్పుడు భూపుత్రి పావకునిఁ దలంచి, శీతోభవహనూమతః = ఓ వీతిహోత్రా మారుతి వాలమునఁ జల్లగా నుండుమనఁగా మారుతికి జల్లగానేయుండి వాలాగ్ని లంకను దహించె గదా. అట్లే నష్టోభవ దశాననః = చావుము రావణా యన్నచోఁ జచ్చునుగాని తక్కిన లంకారాక్షసులు చావరు. దేవతాస్త్రీల కారాబాధలు తొలంగవు. అదియట్లుండఁగా రావణునిగూర్చి యన రణ్యుండను సూర్యవంశభూపతి యోరీ రావణా నన్నుఁ జంపుచున్నావు, ముందు మదీయవంశజుఁడగు రాముఁడు నిన్ను సపరివారంబుగాఁ జంపునని శపించెను. శాండిల్యుఁడనుముని ధాన్యమాలిని విషయము నఁగోపించి రావణుండు ససైన్యంబుగా వానరయుతుండగు రాము నిచేఁ జచ్చునని శపించెను. నందికేశ్వరుఁడు కోపించి రావణా నన్నుఁ బరిహసించితివిగాన నావంటి ముఖంబుగల కోఁతులు నిన్ను నీవారిని వధించునని శపించెను. యుద్ధకాలంబున రావణుండు తనకుఁగలిగిన శాపంబులు దలఁచుకొని న మిథ్యా ఋషి భాషణాః = ఋషులమాట లబద్ధముకావుగదాయని దుఃఖించె. నిన్నిశాపంబు లిట్లుండఁగాఁ బంచవటియందే రావణునకు మరణము కలుగుటకు వీలులేమికనుకనే సీతకుఁ గోపము రాలే దదియట్లుండఁగా.

శ్లో॥ జగ్రాహ రావణస్సీతాం బుధః ఖే రోహిణీమివ = ఆకసమునందు బుధుఁడు తనతల్లియగు రోహిణి నెట్లుగ్రహించెనో రావణుండు సీత నట్లుపట్టెననఁగా శాపభయంబుచేఁ గామముసుష్కింపఁగా మాతృ భావముతోఁ బట్టెనని భావము. 301

(రామాయణ యుద్ధకాండము)

సుశీలుఁడు

రావణునకుఁ బరస్త్రీని స్పృశింపరాదను శాప మేకారణంబున నేకాలంబున నెవ్వరిచేఁగలిగెను ? 302

వరవరముని

రావణుఁడు పూర్వము పుంజికస్థలియను నిలింపకామినింబట్టి బలాత్కారంబున భోగింపగా.

శ్లో॥ అథసంకుపితో దేవో
మా మిదం వాక్య మబ్రవీత్
అద్యప్రభృతియా మన్యాం బలాన్నారీం గమిష్యసి
తదా తే శతధా మూర్ధా ఫలిష్యతి నసంశయః.

బ్రహ్మదేవుఁడు కోపించి యిదిమొదలు పరకాంతను బలాత్కరించి పట్టితివేని నీ శిరస్సు నూఱువ్రక్కలుగాఁ బగులు నిందుకు సంశయములేదని తన్నుశపించెనని రావణుండు మహాపార్శ్వునితోఁ జెప్పెను. 303

(రామాయణ యుద్ధకాండము—13 వ సర్గము)

దీనికిఁ దార్కాణముగా.

శ్లో॥ దృష్ట్వా సీతాం పరామృష్టాం దీనాందివ్యేన చక్షుషా
కృతంకార్యమితి శ్రీమాన్ వ్యాజహార పితామహః

రావణునిచే నపహరింపఁబడిన దీనయగు సీతను శ్రీమంతుండగు బ్రహ్మ దివ్యదృష్టిచేఁగాంచి కార్యము సిద్ధించెననిపల్కె. నెట్లనఁగా సీతాపహరణ దోషముచే రావణుండు కొలఁదికాలములోఁ జచ్చుననియు నిర్జర శరణాగతి ఫలించుననియు భావము. 304

పైదానికిఁదార్కాణముగా

శ్లో॥ దృష్ట్వా సీతాం పరామృష్టాం, దండకారణ్యవాసినః
రావణస్య వినాశంచ ప్రాప్తంబుధ్వాయదృచ్ఛయా
ప్రహృష్టా వ్యథితాశ్చాసన్, సర్వేతే పరమర్షయః

సీతాపహరణంబుఁగాంచి దండకారణ్యవాసులైన సర్వమునీంద్రులు సీతకుఁగష్టముగలిగెనని దుఃఖంబును, రావణున కాకస్మికముగా మరణంబుగలుగునను సంతోషమును బొందిరి. 305

మఱియు,

శ్లో॥ సీతాకపీంద్ర క్షణదా చరాణాం రాజీవహేమ జ్వాలనోపమాని
సుగ్రీవ రామ ప్రణయప్రసంగే వామానినేత్రాణి సమంస్ఫురంతి.

రామ సుగ్రీవులు స్నేహప్రసంగ మొనర్చుచుండఁగాఁ బద్మ సదృశంబగు సీతావామనేత్రము, బంగారురంగుగలవాలి వామలోచనము, నిప్పువంటి రావణుని వామనేత్రము నేకకాలమందు సమానముగాఁ జలించెను. సీతకు వామనేత్రచలనము శుభప్రదము. వాలి రావణులకు వినాశకరము. 303

(శ్రీరామాయణ కిష్కింధాకాండ పంచమసర్గము)

శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా శుభంవాక్యం, పితామహసమీరితం
అంకేనాదాయ వైదేహీ, ముత్పపాతవిభావసుః
సవిధూయ చితాం తాంతు, వైదేహీం హవ్యవాహనః
ఉత్తస్థౌ మూర్తిమానాశు, గృహీత్వా జనకాత్మజాం
తరుణాదిత్య సంకాశాం, తప్తకాంచన భూషణాం
రక్తాంబర ధరాంబాలాం, నీలకుంచితమూర్ధజాం
అక్లిష్ట మాల్యాభరణాం తథారూపాం మనస్వినీం
దదౌరామాయ వైదేహీ, మంకేకృత్వా విభావసుః
అబ్రవీచ్చ తదారామం, సాక్షీ లోకస్యపావకః
ఏషాతే రామ వైదేహీ, పాపమస్యా నవిద్యతే
నైవవాచానమనసా, నానుధ్యానాన్న చక్షుషా
సువృత్తా వృత్తశౌండీర, నత్వా మతిచచారహ
రావణేనాపనీతైషా, వీర్యోత్సిక్తేన రక్షసా
త్వయా విరహితాదీనా, వివశా నిర్జనాద్వనాత్
రుద్ధాచాంతఃపురేగుప్తా, త్వచ్చిత్తా త్వత్పరాయణా
రక్షితా రాక్షసీ సంఘైః, ర్వికృతైర్ఘోరదర్శనైః
ప్రలోభ్యమానావివిధం, భర్త్స్యమానాచ మైథిలీ

నాచింతయతతద్రక్షః స్త్వద్గతే నాంతరాత్మనా
విశుద్ధభావాం నిష్పాపాం, ప్రతిగృహ్ణీష్వరాఘువ
నకించి దభిధాతవ్య. మహ మాజ్ఞాపయామి తే

పై శ్లోకములకు భావము.

శ్రీరామచంద్రుఁడు లోక సందేహానివృత్తికొఱకు భూపుత్రి నగ్నిప్రవేశము సేయించినప్పు డగ్నిహోత్రుఁడు మనుష్యరూపమును ధరించి నిప్పులుసిమ్ముకొనుచు, మధ్యాహ్నసమయసూర్యునివంటి తేజస్సుగలదియు, మేలిమిబంగారు సొమ్ములుగలదియు, ఎఱ్ఱని రోజారంగు చీరధరించినదియు, నరాళములై నల్లని కాంతిచేనొప్పు వెంట్రుకలు గలదియు, వాడనిపూలమాలికలు, శిథిలముగాని భూషణములుగలదియు, కసిగందనిరూపమును, గొప్పమనస్సుగల సీతాదేవి నెత్తుకొనివచ్చి రామునకు సమర్పించి లోకసాక్షియైన పావకుండిట్లనియె: రామా ! నీభార్యయగు వైదేహి మంచిప్రవర్తనముగలది. ఈమెయందుఁ బాపంబులేదు. వాక్కుచేతఁగాని, మనస్సుచేతఁగాని, ధ్యానముచేతఁగాని, నేత్రముచేతఁగాని నిన్నతిక్రమించి చరింపలేదు. నిర్జనంబగు వనంబున నీవులేనప్పుడు వీర్యవంతుండగు రావణుండీమెను బలాత్కారముగాఁ దెచ్చెను. సదా నీయందుఁజిత్తమునిల్పి నిన్నే స్మరింపుచున్న యీ జానకిని వికృతాకారలు, ఘోర దర్శనలగు రాక్షసస్త్రీ లంతఃపురంబుననిరోధించి రక్షించిరి. యనేకవైభవంబులు సూపి యాసగొల్పినను, తర్జనభర్జనంబులచే బాధించినను రాక్షసు నంగీకరింపలేదు. పరిశుద్ధభావముగలది, పాపములేనిదియునగు సీతను బరిగ్రహింపుమని రామునితో నగ్నిహోత్రుఁడు దేవసమూహమధ్యంబున నిరాఘాటముగావచించె. నివియెల్లఁ బరామర్శింపఁగా సపరివారుండగు రావణ వినాశమునకని యేర్పడుచున్నదేగాని సీతాదేవి ప్రాభవంబున కేకొఱంతయు లేదుగదా. ఇంతేకాకుండా సీత

నపహరించినది మొదలు మరణించువఱకొక్కనాఁడైన రావణుండు బ్రపంచసుఖంబులొందలేదు. 308

(శ్రీరామాయణ యుద్ధకాండము)

రావణుండు సీతంగొని లంకకుఁబోవునప్పుడు రామ లక్ష్మణులేప్రక్కనుండివచ్చి తన్నువధింతురోయను భయంబును, సీతను బలాత్కారముగాఁ దాఁకినందుకుఁ దన శిరస్సులు వగులునోయను భయంబును బాధింపుచుండఁగాఁ దబ్బిబ్బునొంది సముద్రముకడనుండు సంపాతికొమరునింగని లంకకు మార్గమెట్లని ప్రశ్నించెను. నిప్పుచేతఁబట్టి తటాలున నావలవైచినట్లు సీతను లంకలోడించి తొమ్మిదిమాసములవఱకు కామెపేరెత్తలేదు. మారుతి శింశుపావృక్షారోహణము సేసిననాటిరాత్రివచ్చి భూపుత్రిచేఁ జీవాట్లుదినిపోయె.నింతియేకాక సీత లంకలోఁబ్రవేశించి దుఃఖించుట కారంభింపఁగా రావణుని గుఱ్ఱంబులు కన్నీరువిడిచె. నేనుంగుల మదంబుడిగె. నుల్కాపాతంబులన్నిదెసలం గానంబడె. కాకులు, గూబలు, గ్రద్దలు, రాపులుంగులు గుంపులుగట్టి కూయందొడంగె. రాజవీధులయందు నక్కలు వాపోవుచుండె. ధూమంబు నలుప్రక్కల వ్యాపించె. రాక్షసనాశనంబునకివి హేతువులని ప్రాజ్ఞులుదలంచి సీతామాహాత్మ్యంబుఁగొనియాడిరి.

సుశీలుఁడు

భూపుత్రి పదిమాసంబులు లంకయందుండెనుగదా ఆహారంబెట్లు ? 309

ప ర వ వ ము ని

సీతకు రామవియోగంబాదిగా రామప్రాప్తిపఱకు నాహారంబు లేదు, నిద్రలేదు, పండుకొనుటయేలేదు, దాహశాంతికై నీరముం గ్రోలలేదు, స్నానములేదు, దేహసంస్కారంబు లేవియునులేవు. కాని రామనామోచ్చారణముసేయుచుఁ గాలంబుఁ గడపుచుండెను. 310

సుశీలుఁడు

నావంటివాఁడొక్కనాఁడాహారములేనిచో శుష్కించుచున్నాఁడు జనులందఱట్లేయున్నారు. మైథిలి నిరాహారదీక్షతోఁ బ్రాణంబు లెట్లునిలిపెను ? 311

పరవరముని

సీతారామలక్ష్మణుల శరీరములు మనవంటి తుచ్ఛప్రాకృతంబులుగావు. అప్రాకృతదివ్యమంగళవిగ్రహంబులు పంచోపనిషన్మయంబులు. గాలికి శోషింప వహ్నికిఁగాలవు, ప్రాకృతాహారంబులపై నాధారపడవు. వారి నిద్రాహారాదులు దేహసంస్కారంబులు లోకవిడంబనార్థమని యెఱుంగుము. కనుకనే లక్ష్మణుండు నిద్రాహారంబులం బాటింపక సీతారామ సపర్య లాచరించెను. భూపుత్రి శరీరమప్రాకృతమగుటయేకాక మహాప్రభావసంపన్నయగు ననసూయ స్వకీయాశ్రమములో సీతాదేవి శరీరంబున దివ్యాంగరాగమలంది, కౌఁగిలించి తల్లీ! ఈ సుగంధద్రవ్యము యావజ్జీవపర్యంతము నీదేహమందుండు, నేవిపత్తులును నిన్నుబాధింపఁజాలవని వరంబిచ్చె. సాక్షాల్లక్ష్మీస్వరూపిణియగు సీత కేవరంబు లవసరంబులేకయే స్వశక్తిచేతనే సుఖింపఁగలదు సందేహములేదు. 312

సుశీలుఁడు

ఇట్టిప్రభావముగల వైదేహి నిరపరాధియగు లక్ష్మణస్వామి నేల దూషించెను ? 313

పరవరముని

ఎంతటి సాధ్వీమణులైనను పరమభాగవతుల దూషింపరాదు. దూషించినచో నావలె విపత్తుపాలౌదురని లోకమునకు బోధించుట కట్లొనర్చెను. 314

సుశీలుఁడు

రామావతారప్రయోజనంబునకై లంకకేగిన మైథిలి నిరంతరము దుఃఖింపనేల ? 315

వరవరముని

పతివ్రతయైనకాంత భర్తనెడఁబాసినప్పు డిట్లుదుఃఖింపవలయుఁ గాని దృఢముగా నుండరాదని సాధ్వీమణులకు బోధించుట కట్లానర్చెను. 316

సుశీలుఁడు

తరువాతివిషయమును వక్కాణింపుఁడు. 317

వరవరముని

వెండియు లక్ష్మణస్వామి ఋజువాది త్రికరణములయందు నార్జవముగల స్థిరస్వభావుఁడు. భగవత్కైంకర్యసామ్రాజ్యధురంధరుఁడు. దానివల్లనే త్రిలోకదుర్జయులగు నింద్రజిదతికాయుల వధింపఁగల్గె. నిమ్మహాత్ముని వియోగంబు క్షణకాలమైననుఁ గానలేయుఁడు సహింపఁడు. రాముఁడు రాజ్యమొనర్చుతఱి సౌమిత్రి దౌవారికుండై వేత్రహస్తుఁడై వీధివేదికయందునిలిచి పౌరుల విజ్ఞాపనంబులు రామున కెఱింగింపుచుండు. నచిద్వద్భగవత్పారతంత్ర్యము వహించినవారిలో నింతవారెవ్వరునులేరు. 318

సుశీలుఁడు

అన్నిసరేగాని రామునిమాటవిని లక్ష్మణుఁడు నిర్దోషియు, నిండుచూలాలునైన వైదేహినివంచించి యడవిలోవిడుచుట లన్యాయముగాదా ? 319

వరవరముని

శ్రీరాముఁడయోధ్యలోఁ బదివేలవర్షంబులు రాజ్యముసేసిన పిమ్మట మిథ్యాపవాదంబుగలిగె. నప్పుడు 'జనవాక్యంతు కర్తవ్య' మ్మనునట్లానర్పఁదలఁచి పెరుమాళ్లు లక్ష్మణునితో బిడ్డా! సీత నరణ్యంబున విడిచిరమ్మనె. నమ్మాటవిని సౌమిత్రి యేకాంతస్థలంబునకుఁబోయి యిట్లని వితర్కించె. నక్కటా నేనింతవఱకు నచిత్తువంటి

పారతంత్ర్యమునవహించి రామునిఁగొలిచితి. నిప్పుడిది పాపకార్యంబని మానితినేని స్వరూపహాని కలుగుననితలంచి సీత నరణ్యంబునవిడిచి వచ్చెను. 320

సుశీలుఁడు

సీతామహాదేవి నిర్దోష, యయోనిజాత సాక్షాల్లక్ష్మి, లోక మాతగదా ? రాముని మూఁడుసారు లెడఁబాసినకారణంబేమి ? 321

వరవరముని

భూపుత్రి కది కర్మానుభవముచే వచ్చినదికాదు. స్వేచ్ఛచేఁ గలిగె. నెట్లంటివేని. ముందుగా లంకాపురంబునకు దేవతాస్త్రీల చెఱలువిడిపించుటకువెళ్ళి దయనుబ్రకటించెను. రెండవసారి గర్భిణియైయుండఁగా రాఘవుండు విడిచివచ్చినప్పుడు పుట్టినింటికైననుంబోవక కష్టములకోర్చి యతండుంచినచోటనే యుండెను గనుక భర్తృపారతంత్ర్యము ప్రకటించెను. మూఁడవసారి కౌసలేయుఁడుపిలిపించి. బాస చేయుమనఁగా మహాజనమధ్యంబుననిలిచి భూపుత్రి యోభూదేవీ మనోవాక్కాయకర్మంబులచే రామునిదక్క నన్యమెఱుంగనైతినేని నీ కన్నకడుపులోనికి మరలఁదీసికొనిపొమ్మనఁగా ధరాదేవి యట్లొనర్చెంగాన ననన్యార్హశేషత్వము ప్రకటించినది, మొదటి వియోగముచే దయ, రెండవవియోగముచేఁ బారతంత్ర్యము, మూఁడవ వియోగంబుచే ననన్యార్హశేషత్వముప్రకటించెంగాని కర్మబంధముచేఁగాదు. అదియట్లుండఁగా లక్ష్మణస్వామి లోకోత్తరపురుషుఁ డప్రతిమ ప్రభావుఁడుకనుకనే పండితులితనికి సిరియప్పెరుమాళ్లను బిరుదంబొసంగి రింతియేకాక సౌమిత్రిశరీరము బంగారువర్ణముగానుండు నని చెప్పుదురు. శరీరమేకాదితని మనస్సు బంగారము, వాక్కు బంగారము, నివర్తనము బంగారము, నిలిచినచోటెల్ల బంగారము. ఇట్టి మహాత్ముఁడుగనుకనే వనవాసంబున నేకాంతస్థలమునందు జానకీరాముల సపర్యకు యోగ్యుఁడయ్యెను. 322

ప్రశ్నలు

ఇవ్విశేషధర్మమునుగూర్చి యింకను సెలవిండు. 323

పరమగురుని

(భరతాళ్వారి విషయము)

భరతాళ్వారు కేకయరాజమందిరమునుండి యయోధ్యకువచ్చి కైకేయినిదర్శించి యామెచే దశరథరాజమృతిఁ దనకుఁగల్గిన రాజ్యప్రాప్తివినిసంతోషింపక తల్లితోనిట్లనియె. నోపాతకీ ! గోవధఁజేసి పాదరక్షలు సంపాదించినట్లు, తియ్యమామిడిచెట్టుఁగొట్టి బొగ్గులు సంపాదించినట్లు, కస్తూరివినిమయముచేసి భస్మమార్జించినట్లు రామానుగ్రహప్రాప్తిఁబోఁగొట్టి రాజ్యముగడించిన నీముఖంబు చూడరాదు. నీతో సంభాషింపనురాదు. నీవురాక్షసివి. ఇట్టిఘోరకృత్యంబొనర్చిన నిన్నుఁబట్టివధించినను బాపంబులేదుగాని మాతృహంతయగు నన్నుఁగోసలేశుఁడు మన్నింపడని భయపడుచున్నానని వచించి కౌసల్యకునమస్కరించి శపథంబులచే నామెమనస్సందేహంబులఁదీర్చి సంతోషముఁగలిగించి దశరథునకుఁ బరమక్రియలాచరించి పరిశుద్ధుండైయుండగా వసిష్ఠాదిమునులు, సుమంత్రాదిమంత్రులు, పౌరులు భరతుంగాంచి పట్టాభిషిక్తుండవై మమ్ముంబాలింపుమని రయ్యవసరంబున భరతస్వామి వారలంగని మీరిట్లనుట ధర్మంబుగాదు. దశరథానంతరము రామచంద్రుఁడురాజుగాని నేనుగాను. కైకేయి గర్భంబునఁబుట్టినదోషంబుదక్క నాయందితరదోషంబులేదు. రామసన్నిధికివెళ్ళి యమ్మహాత్మున కక్కడనే పట్టాభిషేకమొనర్చి రాజ్యంబునకుఁగొనివత్తమురండని చతురంగబలంబులతో పౌరజానపదాదులతోనేగి గంగాతీరంబున జటలుధరించి చిత్రకూటంబున రాముని దర్శించి రాజ్యమునకురమ్మని బహువిధంబులస్తుతించి ప్రసన్నుఁడుగాకయుండుటకడలి ప్రాయోపవేశంబుసేయనెంచి రామాజ్ఞచేమాని వసిష్ఠానుమతంబున రామపాదుకలు శిరసావహించి మరలినందిగ్రామ

మునకేగి యుద్యానవనస్థంబగు సౌధంబునందు సింహాసనంబునిలిపి పాదుకలుదానియందునిచి సమస్తభోగములువర్జించి పాదుకలయెదుట రామపాదారవిందధ్యానపరాయణుండైయుండె. నటుపిమ్మట సీతాపతి రావణసంహారంబొనర్చి సీతాలక్ష్మణ విభీషణ వానరాదులతోఁ బుష్పకవిమానంబారోహించి తిరిగివచ్చి భరద్వాజాశ్రమంబుననుండి గడువుదప్పినచో భరతుఁడు జీవింపఁడనియెంచి శ్రీరాముండాంజనేయుని నందిగ్రామంబునకనిచె. నమ్మహాత్ముఁ డచటికరిగిచూడఁగా నబ్భరతస్వామి కాషాయచేలంబులతో జటామండలపరీతశీర్షంబుతో సంస్కారాభావంబున మాలిన్యమొందినశరీరంబుతోఁ గృశించిన వైఖరితో విచారగ్రస్తాశయంబుతో నానాభోగ నిరాకరణంబుతో రామచరణరాజీవధ్యానంబుతో బ్రహ్మతేజస్సుతో సాక్షాత్కరించె. నప్పుడు మరుత్సుతుఁడు భరతునకునమస్కరించి రామవృత్తాంతంబు విన్నవింపంగా నమ్మహాత్ముఁడు తటాలున మూర్ఛిల్లి నేలయందుఁబడెను.

సుశీలుఁడు

సంతోషసమయంబున నుప్పొంగవలయుంగాని మూర్ఛిల్లుట లెందుకు ? 325

వరవరముని

క్షేత్రంబునందలి సస్యంబు లనావృష్టిగలిగిన, నతివృష్టిగలిగినను నశించు. నదేవిధంబున దేహధారులు దుఃఖాతిశయంబుచేతను సంతోషాతిశయంబుచేతను జీవింపఁజాలరు. దుఃఖాతిశయంబుచే దశరథుఁడు మరణించె. నదియట్లుండ రావణవధానంతరము మారుతి సీతసన్నిధికేగి రావణసంహారంబును, శ్రీరాముని విజయంబును విన్నవింప నాలోకమాత కొంతసేపు నిరుత్తరయయ్యె, నదిగని పావని తల్లీ ! నాతోసంభాషింపనికతంబేమని ప్రశ్నించె. నప్పుడు జగదంబ బిడ్డా ! వైరివధంబొనర్చి జయలక్ష్మీవిరాజమానుండగు భర్త క్షేమసమాచారంబువిని యానందంబుచే భాషింపఁజాలనైతి ననె. నట్లే రామక్షేమ

వార్తవిని మితిలేనిసమ్మోదమొందినందున భరతస్వామి మూర్ఛిల్లె.
నాకస్మికముగా రామసందర్శనమైనచో నేమగునో ! 326

సుశీలుఁడు

మంచిది. యటుపైనేమిజరిగెనో యెఱింగింపుఁడు. 327

వరవరముని

భరతస్వామి రామాగమనవార్తనాలించి యట్టిశుభవార్తఁ దెలిపినందులకు వేయియేనుంగులను బదివేలహయంబులను బదియాఱు గ్రామంబులను బదియార్గురు కన్నెలను సమర్పించెంగాని బ్రహ్మచారియగుటచే నతండంగీకరింపఁడయ్యె నటుపిమ్మట. 328

సీ॥ కరులతోఁ రథభటు,హరులతో వారసుం
దరులతో సర్వానుచరులతోడఁ
గవులతో మంత్రిపుం,గవులతో సురభి వ
స్తువులతో సకలబాంధవులతోడ
హితులతో ధనమహే,తతులతోఁ బౌర సం
హతులతో వాహినీ,పతులతోడ
ధనులతో సాధుస,జ్జనులతో రాజనం
దనులతో గురులైనమునులతోడ
గాన్యపట్టితోడ ఘనతరపాదుకా
ద్వయముతోడ వాయిదములతోడ
వందిమాగధాది బృందంబుతో భర
తుండుగదలి కొంతదూరమేగె.

329
సీ॥ దుర్దశావహ్నిచే నిర్దగ్ధుఁడగు కష్ట
జీవి నిక్షేపమార్జించినట్లు
సంతతవ్యాధిచే సంతప్తుఁడగు హీన
జనుఁడు సంజీవిఁ గైకొనినభంగి

బికిరాలమారియై బెగడుఁగాంచినవాఁడు
సెలఁగి రాజ్యావాప్తిఁజెందినగతి
ఘన పిపాసాలబ్ధిఁ గాసిఁజెందినవాఁడు
పీయూషరసముఁ గ్రోలించురీతి
వరుసగా మున్ను నీరేడువత్సరములు
కష్టమొందినభరతుండు కౌసలేయు
పాదపద్మంబులనుఁగాంచి భక్తితో న
పార వందనములుసేసి ప్రస్తుతించి. 330

వ॥ బద్ధాంజలియై నిలువంబడియున్న భరతుంగౌఁగిలించి రామభద్రుండు వత్సా! నాభాగ్యవశంబున జీవించియుంటివిగదాయని యానందబాష్పంబులచేఁ దడిపె. నప్పుడు కైకేయీపుత్రుండు రామునితో దేవా! నావంటిపామరుఁడు జీవించియున్నను లేకుండిన నొక్కటేయగుంగాని. 331

సీ॥ జనయిత్రినెడఁబాయు చంటిపాపనిమాడ్కి
సలిలంబుఁబాయు విసారమట్లు
నగశాఖవీడిన ఖగమట్లు శృంగిణీ
సన్నిధినేదు వత్సంబుపోల్కిఁ
గాన వర్జించుమృగము లేవ రాజ స
స్థానంబువిడిచిన దంతిభంగి
శాలనేదుకుటుంబచందానఁ గరగత
ద్రవ్యంబువీడు కదర్యురీతి
నిన్నుఁబాయుటాది నిఖిలజనములు సం
తాపమొంది నీదుదర్శనమునఁ
బొంగి నింగిముట్టి పొగడుచునున్నవా
రాలకింపుమో మహానుభావ. 332

సీ॥ కనులున్నదానికిఁ గలిగెఁగదా భాగ్య
మీనాటికనుచు వీక్షించువారు
కౌసలేయుఁడువూరఁ గనుపట్టడనియేస్ను
పిల్లల నెత్తిచూపించువారు
మాపాలి నిక్షేపమా కల్పవృక్షమా
తలఁపుమిన్నాయని పలుకువారు
మమ్ముఁబాయక ప్రోవుమా రాజ్యమేలుచు
నిఁకనైననని నుతియించువారు

నగుచుఁగేలుంగవలు మోడ్చి యతియుగము
లొక్కమాత్రైన మూయకనిక్కినిక్కి
కాంచువారెన్నికోటులుగలరో చూడు
మరిజనవిరామ రామ లోకాభిరామ. 333

వ॥ అనివచించి భరతస్వామి రామచంద్రస్వామితో నంది గ్రామంబునకరిగి యారాత్రినిద్రించి మఱునాడు జటావిసర్జనాభ్యంగ నాద్యులైనపిమ్మట నయోధ్యాజనులును, వానర విభీషణాదులును, వసిష్ఠాదిమునులును వినుచుండఁ జేతులుదోయిలించి భరతుండు రామునకిట్లనియె. 334

సీ॥ నీశాసనంబుచే నీరాజ్యమున్నినా
ళ్లలసటతోఁడఁ గాపాడినాఁడ
నుగ్రాణమందు మున్నున్నదానికినుంచి
పదిరెట్లుద్రవ్య మేర్పరచినాఁడ
నీపాదుకాప్రభావాపాదిత బలంబు
చే దేశజనుల రక్షించినాఁడ
నిందటిలోన నేఁడిద్ధరాభారంబుఁ
బెరిమతోనీకు నర్పించినాఁడ

వరుసగా నేటికీ రేఁసవత్సరములు
తావకీనపదాంభోజదర్శనాను
భవములేకున్కి మిక్కిలి బడలినాఁడ
నరిజనవిరామ రామ లోకాభిరామ. 335

సీ॥ భవదీయదర్శనప్రాప్తి లేకుంటచే
నక్షులుండియును లేనట్టివయ్యెఁ
దావకాలాప సుధను గ్రోలకున్కి నా
వీనులుగల్గియు లేనివయ్యె
భవదంఘ్రియుగళ సపర్యకు దూరమై
పాణులుండియు లేనివగిదిఁదోఁచె
ధనితంబు నినువలగొననికతమునఁ బా
దములుండి లేనిచందమునఁదోఁచెఁ

దావకీనాగ్రమందు వందనమొనర్ప
నట్టిపనిలేక శిరములేనట్లుపోసఁగె
నన్నియునుగల్గు ఫలమిప్పుడబ్బె నాకు
నరిజనవిరామ రామ లోకాభిరామ. 336

మ॥ పదునాల్గేఁడులునిన్నుఁబాసి మనుటన్, వ్యర్థుండనైతిన్ భవ
త్పదసేవావిభవార్హ జీవనముతోఁ, బ్రాసిల్లుటం జేసి కాం
చెదనీఘస్రమునుండి కీర్తిసుఖము, ల్చింతింప మాకెల్ల సం
పదలున్నీవె భవద్వియోగమె విపద్వారంబు సీతాపతీ. 337

వ॥ అని యనేక విధంబుల సన్నుతించి శ్రీరామచంద్రు
నకుఁ బట్టాభిషేకంబుఁగావించి రామానుగ్రహపాత్రుఁడై రామ
పాద కైంకర్యసామ్రాజ్యమే సర్వవిధ భోగభాగ్యంబులని తలంచి
మెలంగిన భరతస్వామికిఁ బ్రణామసహస్రంబులాచరించి ముగించితి నీవు
నట్లునమస్కరింపుము. 338

వ॥ అటుపిమ్మట రామకనిష్ఠసోదరుండగు శత్రుఘ్నునివిషయం బాకర్ణింపుము.

శ్లో॥ శత్రుఘ్నో నిత్య శత్రుఘ్నః=శత్రుఘ్నుఁడనఁగా లవణాది దుష్ట రాక్షసులవధించి లోకంబులఁ గాపాడెననియు నిత్యశత్రుఘ్నుఁడనఁగా జ్ఞానేంద్రియములజయించి శబ్ద స్పర్శ రూప రసగంధాది విషయంబుల నీసడించెననియుభావము. వెండియు నితండు పురుషదృష్టిచిత్తాపహారకం బగు రామరూపం బొకప్పుడైనను వీక్షింపలేడు. 339

సుశీలుఁడు

బలేపనిగానున్నది, ఎందుకనఁగా దండకాటవిలో దేహాభిమాన లోకాభిమానరహితులగు మునీంద్రులు రాముని దివ్యమంగళ విగ్రహంబు వీక్షించి మోహాతిశయంబుచేఁ గౌఁగిలింప నుద్యోగించి రాఘవుండిప్పుడు గాదని మందలింపఁగా మాని చింతించిరి. నరమాంస భక్షిణియు, నతీతానేకవత్సరాయుష్మతియు నగు శూర్పణఖ రాముని మోహించి పరిరంభసౌఖ్యంబుఁగోరెను. వానరాంగనయగు తార మోహించెను. రామప్రభువు గంగాతీరంబున రథావతరణంబొనర్చి నప్పుడు సుమంత్రుఁడు రథ్యంబులఁద్రిప్పఁదలంచి మోదఁగా నాగుఱ్ఱంబులు రాముఁడు గోచరించునఱకు వెనుకకు మరలలేవయ్యెను. మఱియుఁ గౌసల్యానందనుండు దండకాటవిలోఁ బ్రవేశించినప్పుడు మృగంబులు మార్గంబుఁజూపించెఁ, బక్షులు లాకసంబునఁ బంక్తులుగాఁ దీరి ఱెక్కలువిప్పి రామునిపై నెండ సోకనీయవయ్యె, వృక్షంబులు ఫలాహారంబు మకరందంబొసఁగుటగాక చిగురుటాకులచే సెజ్జ నమర్చె, లంకలో సీతాపరిగ్రహణకాలంబున రామునిఁగాంచి రాక్షస స్త్రీలు మోహావిష్టమనస్కలైరి. రావణవధానంతరము మందోదరి దుఃఖములోనుండియు రామునిఁగూర్చి పరుషంబులాడక నుతించెను. తదీయాశ్రితుండని విభీషణునిసహితము నిందింపలేదు. రాముఁడు

వనవాసంబేగునప్పు డతని వెంటఁ బాదచారిణియైపోవు సీతం గాంచి యాహా! సమస్తభోగంబులు వర్జించి భర్తననుసరించి వనంబున కేగుచున్నదిగదా యని జనులాడుకొనుచుండఁగా నొక్క పుణ్యాంగన భళీ తుచ్ఛభోగంబులతోఁ బనియేమి, రాముఁడు మగండైతే నేను వెళ్లనా, స్త్రీజాతిలో వదలిపెట్టువారెవ్వరనెను. రామునిఁ జూడనివాఁడు, రామునిచేఁ జూడఁబడనివాఁడు వ్యర్థుండని కోసలస్త్రీలు వచించిరి. రామవియోగంబుచే దశరథుఁడు మరణించెను. రామ సందర్శనాభావంబుచే భరతుం డీరేడువర్షంబులు భోగంబులు వర్జించి మునియయ్యె, రామవియోగభయంబున సౌమిత్రి యీరేడువర్షంబులు జటలుధరించి వనవాసుఁడై నిద్రాహారంబులు వర్జించె. రామానుగ్రహప్రాప్తికై వసిష్ఠుం డనేకపురుషాంతరంబులు సూర్యవంశజులకు నీచంబైన పౌరోహిత్యంబొనర్చె. రామప్రాప్తిం గోరి శరభంగ సుతీక్ష్ణప్రముఖమునులు బ్రహ్మేంద్రాదిలోకంబులఁ దిరస్కరించిరి. రామానుసరణార్థము రెండవసృష్టికర్తయగు విశ్వామిత్రుండు దశరథునిసన్నిధి యాచకుండయ్యె. నట్టిమహానుభావుండగు రాముని దివ్యమంగళవిగ్రహము శత్రుఘ్నుడు చూడకుండుట విస్మయముగానున్నదే. 340

వరవరముని

నీవుచెప్పినది వాస్తవము సందేహములేదు. కాని పైదానికిఁ గారణంబుగల దెట్లంటివేని భగవత్సేవకంటె భాగవతసేవ గొప్పది. రాజైనవాఁడు దన్నుసత్కరించువానికంటెఁ దనసన్నిధిఁ దనకుమారుని సత్కరించువాని నెక్కువగాఁ బ్రేమించు. నదేవిధంబున భగవంతుఁడు భాగవతసేవాపరుల నాదరించు. భాగవతవిరోధులదండించు. నందులకొఱకే భగవంతుఁడు రామకృష్ణాద్యవతారంబులెత్తెనని నంబిళ్లతో నంజియ్యరు వచించెను. దీనికిఁ దార్కాణముగాఁ జిత్రకూటంబునందుండి లక్ష్మణుఁడు భరతాగమనంబునకు శంకించి రామా! భరతుండు విరోధియై వచ్చుచున్నాఁడు. సెలవొసంగితివేని వానివధింతుననె. నమ్మాటవిని

శ్రీరాముఁడు చెవులుమూసికొని లక్ష్మణా! భరతుండెన్నఁడు విరోధి గాఁడు. స్వకీయ మాతృమతంబున కంగీకరింపక నన్నుఁ రాజ్యంబునకు గొనిపోవవచ్చుచున్నాఁడు నిశ్చయము. రాజ్యంబు నీకిప్పించెద సమ్మతింపుము. భరతుండు నన్నుఁగొల్చుచుండును. సోదరులగుమిమ్ముల వధించి తుచ్ఛరాజ్యంబున కంగీకరింతునా, మీరే నాకన్నిసౌఖ్యంబులని వక్కాణింపఁగా లజ్జించి సుమిత్రాపుత్రుఁ డూరకయుండెఁ గావున రాముని దివ్యమంగళవిగ్రహంబుఁ గాంచితినేని భరతుని యందు విరాగముద్భవించును. స్వరూపహానిగల్గునని శత్రుఘ్నుఁడు రామవిగ్రహ శోభానుభవముమాని భరతునిసేవించి కృతార్థుం డయ్యెను. 341

సుశీలుఁడు

ఈవిషయము లెస్సగానేయున్నది. ఇఁక రామచంద్రుని ధర్మాచరణంబెట్టిదో యెఱింగింపుఁడు. 342

వరవరముని

సావధానుండవై యాలకింపుము. సూర్యున కహోరాత్రంబులులేవు. సముద్రమునకు వృద్ధిక్షయంబులులేవు. నింగికి హ్రస్వదీర్ఘత్వంబులులేవు. రామునకట్లే సామాన్య విశేషధర్మంబులలో నొక్కటియు నవసరంబులేదు కనుకనే 343

శ్లో॥ నమే పార్థాస్తికర్తవ్యం, త్రిషులోకేషు కించన
నానవాప్త మవాప్తవ్యం. వర్తఏవచ కర్మణి

అర్జునా! ముల్లోకంబులయందును నాకుఁజేయవలసిన కర్మ మొక్కటియులేదు. ఇదివఱకుఁ బ్రాపింపక ముందుఁబ్రాపింపవలసిన వాంఛయులేదు. కాని లోకసంగ్రహార్థము కర్మమునందు వర్తింపుచున్నాను. 344

శ్లో॥ యదిహ్యహంన వర్తేయం, జాతుకర్మణ్యతంద్రితః
మమవర్త్మాను వర్తంతే, మనుష్యాఃపార్థసర్వశః

పార్థా! నేనొకప్పుడైనను సోమరితనముచేఁ గర్మమొనర్పకుందు
నేని మనుష్యులు సర్వవిధంబుల నాపద్ధతినే యవలంబింతురు. 345

శ్లో॥ ఉత్సీదేయురిమే లోకాః, నకుర్యాం కర్మచేదహమ్
సంకరస్యచ కర్తాస్యా,ముపహన్యా మిమాః ప్రజాః

నేను సత్కర్మానుష్ఠానము మానినచో లోకులు చెడిపోవుదు
రప్పుడీమనుష్యులు చెడుటకుఁ గారణభూతుండ నేనేయగుదునని భగ
వంతుఁడు గీతాశాస్త్రమున వచించెను. 346

వ॥ కావున రామున కవశ్యానుష్ఠేయంబులైన కర్మంబులేవియు
లేవుకాని యతండు సర్వేశ్వరుండగుటచే విశేషధర్మంబుతోఁబనిలేదు.
లోకులకు నేర్పుటకొఱకు సామాన్యధర్మంబనుష్ఠించు. నతండను
ష్ఠించునదెల్ల మనకు విశేషధర్మంబై పరిఢవిల్లు.

శ్లో॥ రామోవిగ్రహవాన్ ధర్మః=రాముఁడు ధర్మవిగ్రహుఁడనియు,

శ్లో॥ కృష్ణం ధర్మం సనాతనం=కృష్ణుని సనాతనధర్మస్వరూపునిగా
నెఱుంగవలెననియు,

శ్లో॥ ధర్మస్య ప్రభురచ్యుతః=ధర్మమునకుఁబ్రభు వచ్యుతుఁడనియు
ననేకప్రమాణంబులుగలవు. సర్వజ్ఞుండగు వాల్మీకిరచించిన రామా
యణమునందుఁగల రామప్రవర్తనంబు వింటివేనిఁ దదీయ ధర్మాను
ష్ఠానంబు దేటపడు నెట్లందువా: వాల్మీకి జగదాచార్యుండగు
నారదుంగని 347

శ్లో॥ కోన్వస్మిన్ సాంప్రతం లోకే, గుణవాన్ కశ్చ వీర్యవాన్
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ, సత్యవాక్యో దృఢవ్రతః
చారిత్రేణచకోయుక్తః, సర్వభూతేషు కోహితః
విద్వాన్కస్సమర్థశ్చ కశ్చైక ప్రియదర్శనః
ఆత్మవాన్ కో,జితక్రోధో, ద్యుతిమాన్కోఽనసూయకః

కస్యబిభ్యతి దేవాశ్చ, జాతరోషస్యసంయుగే
ఏ తదిచ్ఛామ్యహం శ్రోతుం, పరంకౌతూహలంహిమే.

ఓ నారదమునీంద్రా! ఇప్పుడీలోకంబునందు గుణవంతుఁడు, వీర్యవంతుఁడు, ధర్మమునెఱింగినవాఁడు, సేసినమేలు మఱువనివాఁడు, సత్యవాక్యమునందు దృఢవ్రతముగలవాఁడు, మంచిప్రవర్తనముగల వాఁడు, సర్వభూతములకు హితమాచరించువాఁడు, విద్వాంసుఁడు, సమర్థుఁడు, ముఖ్యప్రియదర్శనుఁడు, ధైర్యశాలి, క్రోధమును జయించినవాఁడు, తేజస్సుగలవాఁడు, పరులయందసూయలేనివాఁడు, యుద్ధములో రోషసమయంబున వేల్పులనుసహితము భయపెట్టువాఁడెవ్వఁడు గలఁడో వచింపుమిది వినుటకుఁగుతూహలినైయున్నానని ప్రశ్నింపఁగా నారదుండిట్లనియె. 348

శ్లో॥ ఇక్ష్వాకువంశప్రభవో రామోనామజనైశ్శ్రుతః
నియతాత్మా మహావీర్యో, ద్యుతిమాన్ ధృతిమాన్ వశీ
బుద్ధిమాన్ నీతిమాన్ వాగ్మి శ్రీమాన్ శత్రునిబర్హణః
విపులాంసోమహాబాహుః కంబుగ్రీవో మహాహనుః
మహోరస్కో మహేష్వాసో, గూఢజత్రురరిందమః
ఆజానుబాహు స్సుశిరా, స్సులలాటస్సు విక్రమః
సమస్సమవిభక్తాంగః, స్నిగ్ధవర్ణః ప్రతాపవాన్
పీనవక్షావిశాలాక్షో, లక్ష్మీవాన్ శుభలక్షణః
ధర్మజ్ఞ స్సత్యసంధశ్చ, ప్రజానాంచహితేరతః
యశస్వీ జ్ఞానసంపన్నః, శుచిర్వశ్యస మాధిమాన్
ప్రజాపతి సమః శ్రీమాన్,ధాతా, రిపునిషూదనః
రక్షితా జీవలోకస్య, ధర్మస్య పరిరక్షితా
వేదవేదాంగతత్త్వజ్ఞో, ధనుర్వేదే చనిష్ఠితః
సర్వశాస్త్రార్థ తత్త్వజ్ఞః స్మృతిమాన్ ప్రతిభానవాన్
సర్వలోకప్రియస్సాధుః దీనాత్మా విచక్షణః

సర్వదాభిగత స్సద్భిస్సముద్ర ఇవసింధుభిః
ఆర్యస్సర్వ సమశ్చైవ, సదైక ప్రియదర్శనః
సచసర్వగుణోపేతః కౌసల్యానందవర్ధనః
సముద్ర ఇవ గాంభీర్యే ధైర్యేణ హిమవానివ
విష్ణు నా సదృశోవీర్యే సోమవత్ప్రియదర్శనః
కాలాగ్నిసదృశః క్రోధేక్షమయా పృథివీసమః
ధనదేనసమస్త్యాగే సత్యే ధర్మ ఇవాపరః

పైశ్లోకములకు భావము

ఇక్ష్వాకువంశమునందు జన్మించిన శ్రీరాముఁడు మనస్సును శిక్షించినవాఁడు, గొప్ప వీర్యముగలవాఁడు, ధైర్యశాలి, జితేంద్రియుఁడు, బుద్ధిమంతుఁడు, నీతిమంతుడు, ప్రశస్తమగు వాక్కులుగల వాఁడు, సర్వాతిశయమైన శ్రీగలవాఁడు, శత్రువుల వధించు వాఁడు, విశాలములగు భుజశిరస్సులు గలవాఁడు, దీర్ఘములగు చేతులుగల వాఁడు, శంఖసమాన కంఠముగలవాఁడు, నున్నగా బలిసిన చెక్కిళ్లు గలవాఁడు, విశాలమగు వక్షము గలవాఁడు, గొప్ప ధనుస్సు గలవాఁడు, గూఢములగు జత్రువులు గలవాఁడు, షడరివర్గమును జయించినవాఁడు, ఆజానుబాహులు గలవాఁడు, మంచి గుండ్రని శిరస్సుగలవాఁడు, నాలుగురేఖలతోఁగూడిన లలాటము గలవాఁడు, శోభనమగు పాదవిన్యాసము గలవాఁడు, షణ్ణవత్యంగుళపరిమాణమగు శరీరముగలవాఁడు, రెండువైపులం గల చెవులు చేతులు మొదలగు నవయవముల సమత్వముగలవాఁడు, ఇంద్రనీలవర్ణుఁడు, వినికిమాత్రముననే శత్రుహృదయముల భేదించు పౌరుషశాలి, బలిసిన బొమ్మగలవాఁడు, విశాలనేత్రములుగలవాఁడు, సర్వావయవ శోభగలవాఁడు, మంగళాయతనములైన సాముద్రికలక్షణములుగలవాఁడు, శరణాగతరక్షణరూపధర్మమునెఱింగినవాఁడు, సత్యప్రతిజ్ఞగలవాఁడు, ప్రాణులయొక్క హితాచరణమునం దాసక్తిగల

వాఁడు, ఆశ్రితరక్షణమునందుఁ బ్రీతిగలవాఁడు, పరుల స్వరూప స్వభావములచేత సర్వవిషయముల నెఱుంగువాఁడు, పావనుఁడు, ఆశ్రితపరాధీనుఁడు, ఆశ్రితరక్షణచింతగలవాఁడు, జగద్రక్షణార్థము ప్రజాపతిసామ్యముతో నవతరించినవాఁడు, పురుషకారభూతయగు లక్ష్మితో వియోగములేనివాఁడు, పోషకుఁడు, ఆశ్రితవిరోధినిరసన శీలుఁడు, సర్వప్రాణిజాతమునకు రక్షకుఁడు, ఆచరణప్రామాణ్యముచేత సర్వధర్మములను స్థాపించువాఁడు, స్వీయమగు శరణాగతావనధర్మ మును గాపాడువాఁడు, స్వజనులం గాచువాఁడు, వేద వేదాంగ యాథార్థ్యము నెఱింగినవాఁడు, ధనుర్వేదములయందుఁ బూర్ణ జ్ఞానముగలవాఁడు. సర్వశాస్త్రార్థముల నెఱింగినవాఁడు, దెలియఁబడిన యర్థమునందు మఱపులేనివాఁడు, ప్రతిభాయుక్తుఁడు, సర్వలోక ప్రియుఁడు, కార్యసాధకుఁడు, దైన్యములేనివాఁడు, వైదిక లౌకిక క్రియలయందు నేర్పరి, నదులచే వేష్టింపఁబడు సముద్రునివలె సత్పు రుషులచేఁ బరివేష్టింపఁబడువాఁడు, సత్పురుషులచేఁ బొందఁబడుట కర్హుండగు వాఁడు జాతి గుణ వృత్త్యాదులనుఁ బాటింపక సర్వజనులచే నాశ్రయింపఁబడువాఁడు, సర్వదా ప్రియదర్శనుఁడు, సర్వగుణో పేతుఁడు, కౌసల్యకు నానందముఁ బెంచువాఁడు, సముద్రునివంటి గాంభీర్యము, హిమవద్గిరివంటి ధైర్యము, విష్ణునివంటి పరాక్రమ ముగలవాఁడు, చంద్రునివలె నాహ్లాదకరుఁడు, ప్రళయాగ్నివంటి క్రోధ ముగలవాఁడు, భూసమానమగు నోర్పుగలవాఁడు కుబేరసదృశత్యాగి, సత్యమునందు రెండవధర్మదేవతాస్వరూపుఁడునైనవాఁడు శ్రీరామచ ంద్రుఁడుదక్క రెండవ వాఁడు ముల్లోకంబులలోలేడని నారదుండు నాకు భవున కెఱింగించె.

వ॥ దశరథుండొక్కదినంబునఁ బౌర జ్ఞాన పదాదులఁ బిలిపించి కూర్చుండ నియోగించి యిట్లనియె. నోజనులారా! నేను వార్ధక్య ముచే రాజ్యపాలనమునం దశక్తుండనైతిని. మదీయ జ్యేష్ఠపుత్రుం

డగు రామునిఁ బ్రభువుగాఁ జేయఁగోరితిని. దీనికి మీ యభిప్రాయ మేమని ప్రశ్నింపఁగా సభాసదులందఱు నేకకాలంబున దశరథునితో రాజేంద్రా శ్రీరామునకుఁ బట్టాభిషేక మవశ్యముసేయుము. అవశ్యము అవశ్యము శీఘ్రముగా శీఘ్రముగాఁ జేయుము సేయుము సేయుమని మేఘగంభీరభాషణంబులతో నొక్కమాఱుగా నఱచిరి. దశరథుండు దానికి సందేహించి యిట్లనియె. నోప్రజలారా నానోటి నుండి మాట వచ్చిరాకముందే మీరిట్లు ఘోషించుట నాయందలి విరాగమా, రామునియందుండు ననురాగమా యని యడిగె. నప్పుడు పౌరులంద ఱేకీభవించి ప్రభూ! మాపెద్దలనాటనుండియు నింత వఱకుఁ జక్కగానే పరిపాలించితివి. నీయందు విసుగులేదు. కాని నీప్రాభవమును నీవేవదలుకొనుచున్నావు. దానికి మేముజెప్పవలసినది లేదు. శ్రీరామ పట్టాభిషేకవార్త వినినంతట నానందపరవశులమై యిట్లాడుచుంటిమి. కారణమేమనఁగాఁ జకోరములు చంద్రునిఁ, జక్రవాకములు సూర్యునిఁ, జాతకంబులు మేఘునిఁగోరునట్లు మా మనస్సులు రామునింగోరుచున్నవ మ్మహానుభావుని కల్యాణగుణంబులకుఁ బరిమితిలేదెట్లంటివేని. 349

వ॥ నీకుమారుండగు శ్రీరాముఁడు భూతంబులకుఁ బ్రియంబుగా మాటలాడును, సత్యముభాషించును, బహుశ్రుతులఁ బ్రాహ్మణుల నుపాసించెను రామునిచే మితిలేని కీర్తి తేజస్సులు వృద్ధిఁజెందుచున్నవి. సర్వాస్త్రములయందు నైపుణ్యము గడించెను, సాంగోపాంగము వేదాధ్యయనమొనర్చి వ్రతస్నానమొనర్చెను గానవిద్యయందు వైశారద్యము గడించెను. గ్రామాంతరములనుండి లక్ష్మణునితో నయోధ్యకువచ్చునప్పుడు రాజవీధిలోనే వాహనములు విసర్జించి పాదచారియై యింటింటికరిగి గృహస్థులంజేరి మీ పుత్రులు, నగ్నిహోత్రాదులు, భార్యలు, పరిజనులు క్షేమమా. మీశిష్యులు మీకుఁ జక్కగాఁ బరిచర్యచేయుచున్నారా? మీకోడండ్రకు, నాడు

బిడ్డలకు స్నేహముండునా ? మునుపటిదుశ్చేష్టలుమాని యీ కుమా
రులు నడుపుచున్నారాయని కుశలంబడుగుచుండును. జనులుత్స
వాదులచే సంతోషించునప్పుడు తండ్రివలె రాముఁడు సంతోషించును
వృద్ధులను సేవించె, నింద్రియములనుజయించె, నవ్వుచు మాట్లాడు
చుండు, నెట్టిహీనులైనవారిని ముందుగా బల్కరించి సంభాషించును,
దుష్టకథలయందు, వ్యర్థాలాపములయందు రుచియుంచడు. ధను
స్సులవంటి కనుబొమలు, విశాలారుణలోచనంబులు గలిగియున్నాడు.
శౌర్య వీర్య పరాక్రమము లార్జించి లోకమనోహరుండై యున్నాడు.
ప్రజాపాలనతత్త్వ మెఱింగినవాఁడు, రాగముచేఁ గొట్టఁబడని యింద్రి
యములుగలవాఁడు. ముల్లోకంబులం బాలించు శక్తిమంతుఁడు.
మఱియు నిమ్మహాత్ముని క్రోధంబుగాని, యనుగ్రహంబుగాని వృథా
కాదు. వధ్యుండైనవానిఁ దప్పకవధించు. నవధ్యుఁడగువానియందుఁ
గోపింపడు. దేవతలు, రాక్షసులు, గంధర్వులు, మనుష్యులు
ప్రసిద్ధుడగు రాముని కల్యాణగుణంబులకుఁజొక్కి యమ్మహాత్మునకు
బలాయురారోగ్యంబులు గలుగవలయునని కోరుచున్నారు. బాహ్యాం
తఃపురములందుండు వారు, పౌరులు, జానపదులు, స్త్రీలు, బాలురు,
యువకులు, వృద్ధులు రామునకు సర్వసౌఖ్యంబు లిమ్మని ప్రాతః
సాయంకాలములయందు దేవతల నర్చించుచున్నారు. సర్వశత్రు
సంహారకుండు, నిందీవరశ్యాముఁడునగు రామునకుఁ బట్టాభిషేకం
బొనర్చుపని నీయధీనములోనున్నది. మేమెల్లఁజూచి యానందించు
వారమేమమీయని సాకేతప్రజ లేకగ్రీవముగాఁజెప్పఁగాఁ బంక్తి
రథుండానందించె. నిట్టి రాముని కల్యాణగుణంబులఁ బఠింపుచు,
ననుభవింపుచు, నితరులకు బోధింపుచునుండుట శరీరధారులకు
విశేషధర్మము. శ్రీరాముని కల్యాణగుణంబులన్నియు సాకల్యం
బుగా వర్ణింప బ్రహ్మతరముగాదుగాని బ్రహ్మ వరప్రసాదముగల
వాల్మీకిమాత్రము సముద్రములో దోసెడునీరున్నదనియు, మేరువునఁ

విడికెడు బంగారమున్నదనియుఁజెప్పినట్లు కొన్నిగుణములు వెల్లడించి రామాయణమునందు నిక్షేపించె. నందులో స్వల్పముగా నీకెఱిం గించితి. 350

## సుశీలుఁడు

గురువర్యా! శ్రీరామచంద్రుని కల్యాణగుణామృతంబుఁ జెవులను దోసిళ్లఁజేఁద్రావుచుండఁగా దధి ఘృత మస్తుకూర్చికా గుడ శర్కరా మకరంద ద్రాక్షా ఖర్జూర నారంగ రసాలఫలదుగ్ధాన్న లడ్డుక సూపా పూప క్షీరాదులకంటె విశేషమనోహరముగానున్నది. తృప్తికలుగలేదు. మఱికొంతసేపు వానినే వక్కాణింపుము. 351

## వరవరముని

ఇంతమంచిసమయము నాకుమాత్ర మెప్పుడులభించును. చెప్పెద నాలకింపుము. శ్రీరాముఁడు తండ్రికోరఁగా రాజ్యంబర్పించెను. పినతల్లి వాంఛాప్రకారము వనవాసమంగీకరించెను. జటాయువు తనకై ప్రాణంబులు విడిచెనని దుఃఖించి చరమక్రియ లాచరించి మోక్షంబొసంగెను. తనపనికన్న సుగ్రీవునికార్యంబు ముందు నెఱవేర్చి రాజ్యసుఖంబు లొనఁగూర్చెను. మఱియు నినసుతుండు స్త్రీలౌల్యముచే మైమఱచి గడువులోరాక తామసించినను గోపింపఁడయ్యె. బగవానితమ్ముండని శంకించి సుగ్రీవుఁడు వధింపఁబూనఁగా నివారించి విభీషణునిఁ జేరందీసి రాఘవుఁడు రాజ్యంబిచ్చె. సుకృతకుఁ బుణ్యగతినొసంగెను. రావణునితోఁ బోరివచ్చిన సుగ్రీవునిఁ గాఁగిలించి. 352

శ్లో॥ త్వయికించి త్సమాపన్నే కిం కార్యం సీతయా మమ
భరతేన మహాబాహో లక్ష్మణేన యవీయసా
శత్రుఘ్నేన చ శత్రుఘ్న, స్వశరీరేణవా పునః

సుగ్రీవా! నీకాపదగల్గినచో, నాకు జానకితోఁగాని భరత లక్ష్మణ శత్రుఘ్నులతోఁగాని స్వశరీరముతోఁగాని ప్రయోజనము లేదుగదాయని దీనాలాపంబులాడె. నిది యిట్లుండఁగా నొక్కనాటి రణంబున విరథుఁడై ధనుఃఖండముఁ బుచ్చుకొని పాఱిపోవుటకు వీలులేక వాపోవుచున్న రావణుంగాంచి రాఘవుండు. 353

శ్లో॥ కృతం త్వయాకర్మ మహత్సుభీమం, హతప్రవీరశ్చ
కృత స్త్వయాహం, తస్మాత్పరిశ్రాంత ఇవవ్యవస్య
నత్వాం శరైర్మృత్యువశం నయామి
గచ్ఛాను జానామిరణార్దిత స్త్వం ప్ర విశ్య రాత్రించరరాజలంకాం
ఆశ్వాస్యనిర్యాహి రథీచధన్వీ తదాబలం ద్రక్ష్యసి మేరథస్థః

రావణా! యింతవఱకు లక్ష్మణాది వీరులతో గొప్పసంగర మొనర్చి యలసితి వక్కారణంబున నినుఁజంపకవిడిచితిని. రణపీడితుండ వగు నీకు సెలవొసంగితిని. వెళ్ళి లంకలోఁబ్రవేశించి యలసటఁ దీర్చుకొని, రథమునారోహించి, చాపముఁగైకొని మరల ననికేతెమ్ము నాబలంబుఁ జూపింతుననిపల్కెను. బలవచ్ఛత్రువు లోఁబడినప్పుడిట్టి యుపకారవాక్యంబులుసెప్పి విడుచువాఁడు మనపెరుమాళ్లు దక్క నెవ్వండుగలఁ డిదియిట్లుండఁగా రావణవధానంతర మాపాపాత్మునకు పరక్రియలు సేయననిమానుకొన్న విభీషణునిఁబురికొల్పి చేయించెను. యుద్ధానంతరము బ్రహ్మరుద్రేంద్రాది నిర్జరులచేఁ బొగడ్తఁగాంచె. నగ్నిచే సీతాపరిభావంబువిని పరిగ్రహించెఁ దనకైవచ్చి సంగరమున రాక్షసులచే నీల్గిన కోట్లకొలఁది వానరులఁ బునర్జీవితులఁజేసెను. మున్నిచ్చిన శపథప్రకారము భరతునకుఁ గానంబడిరక్షించెఁ బదునొకండు వేల సంవత్సరములు జనులఁబాలించి యానంద మొందించి రామ రాజ్యము సుఖప్రదాయకమను శాశ్వతకీర్తి గడించెను. శరణుఁ జొచ్చిన కుక్క మొఱాలకించి తదీయ విరోధినిదండించి శునకమనోరథ

మాడ్చె. నరణ్యమున గృధ్రోలూకంబుల కలహంబుఁబాపి బ్రహ్మదత్తుని శాపంబుఁహరించె. తనపై మిథ్యాపవాదంబు మోపిననుఁ బౌరులమన్నించి యంత్యకాలంబున ముక్తినొసంగె. ఔరా! కోసల దేశస్థంబులగు చరాచరభూతంబులకుఁ బ్రారబ్ధాదులు నశింపఁజేసి మోక్షంబొసంగిన రామావతారప్రభావం బెవ్వఁడు నుతింపఁగలడు.

సుశీలుఁడు

రామావతారకాలంబున రాక్షసులెక్కువవృద్ధిలోనున్నట్లు మఱియొకప్పుడు లేరుగదా? 355

వరవరముని

దానివలననే విష్ణువు రాముఁడై జనించి సాధ్వీమునినిలింపులఁ బ్రోచి రక్కసులవిత్తనంబు నశింపఁజేయఁగా మానవసంఘంబు వృద్ధియై కొనసాగె. నందువలన మనమందఱము జనించితిమి. రామావతారంబులేనిచో దుష్టరాక్షసులింకనువృద్ధిఁజెంది సాధుమానవులు నామావశిష్టులగుదు రీరహస్యంబెఱుంగక రాక్షసాంశసంభూతులగు మనుజులు రాముని నిందించి నరకాగ్నిపాలగుచున్నారు. మఱియు సీతాపతి మాతృభక్తి పితృభక్తి గురుభక్తి సోదర వాత్సల్యము ఏకపత్నీవ్రతము అహింసా దాన హోమతర్పణాగ్నిహోత్ర సంధ్యావందన స్వాధ్యాయాదుల సక్రమముగా నాచరించె. నశ్వమేధాదియాగంబులొనర్చె. నివియెల్ల లోకోద్ధరణనిమిత్తమని యెఱుంగు మింతయేల సముద్రంబున రత్నంబులావిర్భవించినట్లు రాముని హృదయంబునఁ గల్యాణగుణసమూహంబు లావిర్భవించెను. 356

సుశీలుఁడు

ఇఁక సీతామహాదేవి శుభచరిత్రము నెఱింగింపుడు. 357

వరవరముని

అమ్మహాదేవి విషయము ప్రస్తావవశంబున నిదివఱకే కొంత చెప్పితి. తక్కినది వివరింతు వినుము. పూర్వమొకప్పుడు లక్ష్మీదేవి

స్వాంతఃపురమునుండి బయలుదేఱి భగవత్సన్నిధి కరుగుచుండె. నింతలో జయవిజయులను దౌవారికులు తమోగుణావేశముగలవారై యిందిరనడ్డగించి తల్లీ! ఇంత కాల మంతఃపురంబున నేమిచేసితివి? తామసించితివిగనుక వెళ్ళనీయమని నిరాకరించిరి, లక్ష్మి లోకమాతయగుటచే వారిని శపింపనొల్లక భగవంతునిచే సెలవుఁ దెప్పించుకొని కేశవునికడకేగి యతనితో మృదుతల్పంబునశయనించి యుండె. నటుపిమ్మట సనకసనందను లచ్చోటికివచ్చి దౌవారిక నిరుద్ధులై కోపించి జయవిజయులను రాక్షసయోనిం బుట్టుడని శాపంబొసంగి లోనికివెళ్ళఁగాఁ జప్పుడాలించి పద్మాలయ సిగ్గుచేఁ దల్పము నుండి దుమికె. నప్పుడు సనకసనందనులు కోపము చల్లారనివారగుటచేఁ గమలనిలయంగాంచి యోతల్లీ! నీకు నేము పుత్రులము కామ క్రోధాదు లెఱుంగని పసివారము. పసివానినెత్తుకొని కాంతామణి భర్తతోఁగ్రీడించునప్పుడు సిగ్గుపడదు. ధర్మమట్లుండఁగా మమ్ము దుష్టులుగాశంకించి మాతండ్రిగారి సౌఖ్యముఁజెడఁగొట్టి శయ్యనుండి వేఁటితి వీదోషంబుచే మానవజన్మంబెత్తుమని శపింపఁగా విష్ణుపత్ని వారలంగని పుత్రులారా! తొందరపడి నన్నుశపించితిరి. మీశాపంబు నాయందుఁబనిచేయదు. వ్యర్థంబగు నట్లయ్యెనేని మీకసత్యదోషంబును గౌరవహానియు సంభవించు. నక్కారణంబున మీశాపంబంగీకరించితింగాని మానవయోనింబుట్టకుండ మానవజన్మం బెత్తునట్లు తీర్మానింపుడనియె. నప్పలుకులకులికి మునీంద్రులు భగవతిమాహాత్మ్యంబుఁదెలిసికొని తల్లీ! నీయిష్టమువచ్చినట్లాచరింపుమని లక్ష్మినారాయణులకు నమస్కరించి స్వేచ్ఛంజనిరంతట జనార్దనుండు దౌవారికులంగాంచి జ్ఞానహీనులారా లక్ష్మినడ్డగించి తదీయపాపంబుచే శాపంబునొందితిరి. రాక్షసయోనింబుట్టుదు తప్పదని శాసింపఁగా వారుదుఃఖింపుచు ముందుగా హిరణ్యాక్షహిరణ్యకశిపులై, రావణ కుంభకర్ణులై, శిశుపాలదంతవక్త్రులైజనించి హరిచేఁజంపఁబడి ముక్తినొందిరి

అదియట్లుండఁగా సనకసనందన శాపానంతరము కొంతకాలంబునకు శక్రాదినిర్జరులు బృహస్పతిం బురస్కరించుకొని క్షీరసాగరంబునకేగి భగవన్మందిరద్వారంబున నిలువంబడి రోదనధ్వనిఁ గావించిరి. తత్సమయంబున సర్వేశ్వరియగు లక్ష్మి వారల నివారించి నిర్జరులారా ! జనార్దనుఁడిప్పుడు నిద్రఁబోవుచున్నాఁడు. కొంచెము సేపటికి మేల్కాంచు నిప్పుడల్లరిచేయవలదని మందలించె. నప్పలుకులువిని వేల్పులు తల్లీ! నీవు మాకు నిరుపాధికజనయిత్రివిగాన మా మనోరథంబు నెఱవేర్పు మెట్లంటివేని, రావణకృతబాధలోర్వఁజాలక తద్దురాత్ముని వధింపుమని నీమగనికెన్నిసారులో మొఱవెట్టితిమిగాని యతండు తలయూపుచు కాలమురానిండని చెప్పుచున్నాఁడక్కాలమెప్పుడువచ్చునో నియమములేదు. బ్రహ్మవరప్రభావంబుచే రావణుండు క్రొవ్వి గర్వించి దేవ గంధర్వ సిద్ధ విద్యాధర మానవాది కాంతలను లక్షలకొలందిపట్టుకొనిపోయి కారాగృహంబుల నుంచియున్నాఁడు. మాకాఁపురంబులు పోవుదానికంటె నారాయణుని నిద్రాభంగ మెక్కువకాదనిరి. రమాదేవి వారిదీనాలాపంబులకు జాలిపడి బిడ్డలారా ! నేను కారాగృహంబునకరిగి మీకాంతల చెఱలు విడిపించెదనని శపథంబొనర్చి మధువైరి నిద్రఁజాలించినంతట విన్నవించె. బుండరీకాక్షుండప్పుడు దేవతలంగాంచి మీరు గోలాంగూల వానర భల్లూకంబులై యవతరింపుడు. నేను రామరూపంబుతో రావణాదుల వధింతునని చెప్పి వేల్పులసాగనంపి లక్ష్మితోఁ బురుషోత్తముఁడిట్లనియె. ప్రాణేశ్వరీ! వైకుంఠంబుఁబాసి కర్మభూమియగు భూలోకంబునకేగుటకాక కారాగృహవాసంబంగీకరించి దుష్కరప్రతిజ్ఞఁ జేసితివి. దానిననుభవింపుము. నేనును రామరూపంబుతో నరలోకంబున నిన్నుఁగైకొందునని చెప్పె. 359

తరువాత లక్ష్మీదేవి భూలోకంబునకువచ్చి సదాచారసంపన్నుండగు బ్రాహ్మణుండొకఁడు వేదాధ్యయనమొనర్చుచుండ నతని

నోటిగుండా గుబాలునఁ గన్యారూపంబుతోఁ దుమికె. నందుల కవ్వి ప్రుండాశ్చర్యమునొంది యక్కన్యామణికి వేదవతియని నామకరణంబుచేసి పెంచుచుండఁగా నామెసౌందర్య సౌకుమార్య లావణ్యాదులకు మోహించి బ్రాహ్మణులు క్షత్రియులు ననేకులువచ్చి యిమ్మని యాచించిరి. కానిసుజ్ఞానియగు నవ్విప్రుండీమెను శ్రీహరికిఁ దక్క నన్యులకీయనని వక్కాణింపుచుండె. నమ్మాటలాలించి సర్వజనులు నిరాశఁజెంది రిట్లుండఁగా నొక్కనాడొక్కరక్కసుండువచ్చి బాడబుంగని యక్కన్యారత్నంబును దనకిమ్మని యడిగి యీయని కారణంబున ద్వేషించి యొక నిశాసమయంబునఁ గన్యాజనకుని వధించి తత్పాపంబున వెంటనే రాక్షసుండు మరణించె. నంతట వేదవతి జనకాజ్ఞఁజెల్లింపనెంచి హిమవన్నగంబున శ్రీహరింగూర్చి తపంబుఁ జేయందొడంగె. దండయాత్రఁబోవు రావణుండచ్చటికివచ్చి వేదవతిని మోహించి జడఁబట్టిలాఁగె, నంత నా సాధ్వీరత్నము కోపించి జడఁద్రెంచుకొని రావణునిఁగని యోరిదుర్మతీ! హరిపరిచారికనగు నన్ను నీవుదాఁకితి వీశరీరం బగ్నికి సమర్పించి రాఁబోవుజన్మంబున శ్రీహరినిఁబెండ్లియాడి నిన్ను నీవారిని వధింపింతునని ప్రతిజ్ఞఁజేసి యగ్నిలోఁజొచ్చి శరీరంబువిడిచి రెండవజన్మంబున లంకలో నొక పద్మాకరంబునఁ గమలమునందు జనించియుండె, నొకనాడు దశగ్రీవుం డక్కమలాకరంబునకుఁ బుష్పార్థముఁబోయి యందున్న శిశువునెత్తుకొనివచ్చి శుక్రాచార్యునకుఁజూపింపఁగా నతండు దీర్ఘముగా నాలోచించి రావణునితో రాక్షసేశ్వరా! యిక్కన్య యెవ్వరో వచింపఁ జాలనుగాని యీమె నీకుదొరకిన ముహూర్తబలము విచారింప లంకానాశనకారణముగాఁ గనఁబడుచున్నదికాబట్టి తత్క్షణమే యొకమందసంబుననుంచి సముద్రమున విడువుమనిపల్కె. నతనిమాటకు సమ్మతించి రావణుండట్లుకావించె. నంత నప్పేటికను సముద్రుండు వాగలచేఁ గొనిచని మిథిలానగరసమీపంబున భూమిలో నిక్షేపించె. నటు

పిమ్మటఁ గతిసయకాలంబునకు జనకభూపతి సంతానార్థియై యాగం బొనర్పఁగోరి బంగారునాగేటిచే భూమిని దున్నింపుచుండ నొక్క పేటిక పైకిలేచె. నమ్మందసంబు వ్రక్కలించిచూడఁగా బంగారు బొమ్మవలె నొకకన్యామణి కూర్చుండియుండె. నప్పటి కనపత్యుండగు మిథిలాధిపతి యక్కన్యారత్నంబునుఁ దెచ్చి యింటిలోనుంచి సీతయని నామకరణంబొనర్చి పోషించె. నక్కన్యామణి పాదంబుపెట్టినది మొదలు జనకునిసంస్థానములో హయ గజ రథ భట ధన ధాన్య రూప్య కనకరత్న వస్త్రాదులు నూఱుమడుంగులుగా వృద్ధిఁజెందె. సీత జనకుని యిల్లూడ్చునపు డచ్చోటనుండు శివచాపంబునుఁ జేతితో 360
నెత్తి యావలావలఁ బెట్టుచుండు.

సుశీలుఁడు

స్వామీ! శివచాపంబును రామార్థముగా సభకుఁదెచ్చునప్పు డైదువేలమంది మల్లురు శకటంబుపైనుంచి నెట్టుకొనివచ్చెనని చెప్పుదురు. ప్రపంచస్థులగు బలాఢ్యులందఱు వచ్చి చూచి విల్లెత్తలేక పాఱిపోయిరి. కొందఱెత్తఁబూని శిథిలావయవులై చచ్చిరి. రావణుండు కూడావచ్చి విల్లెత్తఁబూని తొంటివిఱుఁగఁగా సిగ్గుచే లంకకేగి వైద్యశాలలో నాఱుమాసములు బాగుఁజేయించి కొనెనందు రట్టి ప్రచండ కోదండమును బాలికయగు సీత యెత్తి యెబ్బంగి నీవలావలఁ 361
బెట్టుచుండె నిది సత్యమేనా ?

వరవరముని

శిష్యా! శరీరధారులకు దుష్కరములగు పనులన్నియు భగవంతునకుఁగూడా దుష్కరములని తలంపకుము. నారాయణుండు సర్వశక్తుఁడుసంకల్పమాత్రమున నన్నియు నెఱవేర్చును. శ్రీరామచంద్రుఁడు హరకోదండ ఖండనము పరశురామగర్వభంగము విరాధ ఖరదూషణాది వధము వాలి నిబర్హణము వార్ధిపై సేతుబంధనము రావణ కుంభకర్ణాది సంహారము ననాయాసంబునఁ జేయలేదా. 362

సుశీలుండు

అతండు పురుషవర్యుండగుటచే నట్లొనర్చె, నబలారత్నంబునకు సహిత మట్టి శక్తియుండునా ? 363

వరవరముని

సీతను స్త్రీసామాన్యముగాఁ దలంచితివా ? యదిచాలా పొరపాటు. భగవంతునకుఁగల జ్ఞానశక్తి బలైశ్వర్యాది కల్యాణ గుణంబులన్నియు సీతాదేవికింగలవు, కనుకనే పంచవటీతీరమునందును లంకాపురమునందును రావణుని గడ్డిపరకగానెంచి నిరాకరించెను. రావణుండెత్తుకొని యాకాశంబున మహావేగముతోఁ బోవునప్పుడు మూర్ఛఁజెందలేదు. ఘోరవికారస్వరూపిణులగు నేకాక్షి ప్రభృతి రాక్షసస్త్రీలకు భయపడలేదు. ప్రాకృత స్త్రీయైనచోఁ బంచవటిలో నొంటరిగా దశగ్రీవునిఁగనినప్పుడే చచ్చునుగదా. సీతకుఁగోపము వచ్చెనేని లోకంబుల దహింపఁగలదు. దయగల్గినచో సకలసౌఖ్యము లీయంగలదు. రావణాదుల వధింపమికేఁ గారణం బిదియని నీకెఱింగించితి. 364

ఇమ్మహాదేవికి, భూమిలో దొరకినందున భూపుత్రియనియు, జనకునికొమార్తెయగుటచే జానకియనియు, మిథిలాపతి పుత్రికయగు టచే మైథిలియనియు, విదేహసంబంధయగుటచే వైదేహియనియు, నాగేటిచాలునందుఁబుట్టినందున సీతయనియు నామధేయంబులుగలవు. మఱియు నిద్దేవి జననముచే నయోనిసంభూత, రాజర్షియగు జనకుని పెంపుడుకూతురు, సౌందర్య సౌకుమార్య లావణ్యములచే నసమాన, సువర్ణమునకుఁ బచ్చిపసుపుఁగొమ్మునకుఁ దుల్యమగు వర్ణముగలది. విద్యుల్లతా సదృశకాంతిమతి, సువాసనచే యోజనగంధి, యప్రాకృత దివ్యమంగళగాత్రి, సర్వైశ్వర్యప్రదాయకి, సాధ్వీజనరత్నము, లక్ష్మీస్వరూపిణి, ఈమె రామునిఁ బెండ్లియాడినది మొదలు సహధర్మచారిణియై మేనికి నీడవలె వర్తించె. మనస్సుతో రామవిగ్రహంబు

స్మరింపుచు. వాక్కుతో రామప్రభావంబు వర్ణింపుచు, శరీరముతో రామపరిచర్యఁగావింపుచుఁ గాలంబుఁ గడపెంగాని రామేతరపదార్థం బొక్కనాఁడైనం గోరలేదు. 3౬5

సుశీలుఁడు

దేవా యొక్కమనవి. జానకీదేవి మాయామృగంబునుఁగోరి రాము నెడఁబాయలేదా ? 3౬౬

వరవరముని

దానికిఁగారణంబు గలదెట్లందువా భగవద్భక్తుండైనవాఁడు సర్వదా భగవంతునియందే ప్రీతినుంచవలయు. నట్లుగాక దేవతాంతర మంత్రాంతర సాధనాంతర ప్రయోజనాంతరంబులఁ గాంక్షించినచో, మాయలేడినిఁగోరి రాము నెడఁబాసిన నావలె వెంటనే విపత్తు నొందుదురని భాగవతులకు బోధించుటకు భూపుత్రి యట్లునటించెను.

సుశీలుఁడు

సమంజసముగానేయున్నది. ముందరికథాభాగంబునకుంజనుడు.

వరవరముని

రామభద్రుఁ డరణ్యమునకేగుచు సీతాదేవి సుకుమారియని తలంచి యిట్లనియె, ప్రాణేశ్వరీ! నీవు సుఖార్హావు. వనవాసము నానాదుఃఖప్రదమైనది. నీవు సహింపఁజాలవు. దీక్షముగించుకొని నేను వచ్చువఱకు మాతల్లియగు కౌసల్యకుఁ బరిచర్యసలుపుచుండుమని వక్కాణింపఁగా నప్పలుకులకులికి సీతాదేవి రామునితోఁ బ్రాణేశ్వరా! నిన్నువిడిచి క్షణకాలమైన జీవింపఁజాల. నీవుండుచోటరణ్యంబైన స్వర్గంబనితలంతు. నీవులేని స్వర్గభోగంబులైన నరకంబుగా భావింతునని యనేకవిధంబుల సమాధానంబుఁజెప్పి భూపుత్రి రామునితో నరణ్యంబునకేగి మహాతపస్వినియగు ననసూయచే సత్కారముఁజెందె. మహితాతప వర్ష శీతోష్ణంబులకు సహింపుచు శుష్క

పవాసంబులఁ గ్రహింపుచు, రాలయందు ముండ్లయందు గమనింపుచుఁ గఠినశయ్యలఁ బరుండుచు, సమయోచితముగాఁ గందమూలఫల పర్ణాదుల నాహారంబుగాఁ గొనుచు సంవత్సరముల నెలలుగా, నెలల వాసరంబులుగా వాసరంబులు నిమిషంబులుగాఁ గడపుచు రామచంద్రునిఁ గొల్చుచుండె. నప్పు డద్దేవి సౌకుమార్యాదులఁ దలంచి యిట్టి సుకుమారి కిట్టి కష్టంబులు సంభవించెనేయని మునిపత్నులును, మునీంద్రులును దుఃఖించిరి, కాని సీతారామలక్ష్మణుల కత్యంతానందము కలిగెను. 369

సుశీలుఁడు

రాజ్యభోగంబులు వదలిన యమ్మహాత్ములకు వనవాసంబున దుఃఖంబునకుమాఱుగా నానందం బెట్లు కలిగెను ? 370

వరవరముని

అయోధ్యాపురంబుననున్నచో రాజ్యాంగతంత్రాక్రాంతమనస్కుండనై యుండుటవలనఁ గాలంబు వ్యర్థంబుగాఁ గడచు. నిర్జనవాసంబుచే మునిసన్నిధానమందు శాస్త్రార్థవిచారణచే జీవితము సార్థకమగుచున్నదని తలంచుటచే శ్రీరామునకును, రాజ్యంబుననున్నచో మదీయ ప్రాణేశ్వరుండగు రామభద్రుఁడు నిశాసమయంబునఁ దక్కఁ బగలెప్పుడు నాకు దర్శనంబీయఁ డిప్పు డహర్నిశము నన్నెడఁబాయని కతంబున ధన్యనైతినని తలంచుటచే సీతాదేవికిని, జానకీరాము లూరిలోనున్నచో డెబ్బది రెండువిధములైన పరిచారికాజనులు నిరంతరము సేవింపుచుందు రిచ్చట నెవ్వరులేమి నద్దివ్యదంపతుల పరిచర్యాభాగ్యము నాకులభించుటచేఁ గృతార్థుఁడనైతిఁగదాయని యోజించుటచే లక్ష్మణస్వామివారికిని మితిలేనియానందముద్భవించెను. 371

తరువాత వైదేహి లంకాపురంబునకుఁజని దేహసంస్కారంబులు మాని నిద్రాహారంబులు వర్జించి మాసినవస్త్రంబుతో మాలిన్య శరీరంబుతో రామవియోగచింతాభరంబుతో రామానురాగంబుతో రామానుషంగోత్కంఠతో రామపారతంత్ర్య భంగముగల్గునేమో

యనుభవంబుతో రావణాదుల నణంపఁజేయక స్వశక్తిని వెల్లడింపక ప్రాకృత స్త్రీ విధంబున దుఃఖించెను, 372

సుశీలుఁడు

పారతంత్ర్యభంగమనంగా నర్థమేమి ? 373

వరవరముని

తనయిచ్ఛచే నేపనియుంజేయక త్రికరణంబులు రామునియిష్టానుసారముగాఁ బ్రవర్తింపఁజేయుట రామపారతంత్ర్యము. సీతాదేవి యట్టి నిష్ఠతోఁగూడినదిగనుక రామాజ్ఞలేకుండా రావణాది విరోధులఁ జంపినచోఁ బారతంత్ర్యముచెడునని శంకించియూరకుండె. హనుమద్దర్శనావసరంబున శల్యపరీక్షచేసి రామదూతయని నిశ్చయింపఁబడినతరువాత రామాంగుళీప్రదానంబుచేనమ్మి హనుమంతునితో సంభాషించి వెండియు భూపుత్రి హనుమద్వాలాగ్నిని వాఙ్మాత్రంబుచే శీతలంబొనరించెను. శీతలాగ్నిచేతనే లంకంగాల్పించె. తాను జయలక్ష్మికావున సర్వదా మారుతికి జయమునుఁగల్గించె. పదివేలమంది రాక్షసస్త్రీల పరుషంబులకులోంగక రాముని ధ్యానింపుచుండె. తన్ను బాధలువెట్టిన దనుజాంగనల వాయుపుత్రుఁడు వధింపఁబూని నప్పుడు దయతో నివారించి కాపాడె. లంకాపురంబున స్వకీయ నిర్దోషత్వము ప్రకటింపఁబూని యగ్నిలోఁబ్రవేశించి వాడని పూలమాలికలతో, రంగుమాయని రోజాజీరతోఁ, గసుగందని దివ్యదేహంబుతో వెలుపలికివచ్చి బ్రహ్మాదిదేవతల స్తోత్రంబులకుఁబాత్రమై, వైశ్వానరునిచేఁ బొగడ్తఁగని, రామునిఁబొందె నటుపిమ్మట నయోధ్యకేగి ప్రాణేశ్వరుండగు రామచంద్రునితోఁ బట్టాభిషిక్తయై భోగంబు లనుభవించెను. మఱియు శ్రీరామాయణమును 'సీతాయాశ్చరితం మహత్' సీతాదేవిచరిత్రమని చెప్పిరి. 374

సుశీలుఁడు

శ్రీరామాయణము రామకథయని ముల్లోకంబులందు విఖ్యాతిఁజెందినది సీతాచరిత మెట్లయ్యెను ? 375

వరవరముని

శ్రీమద్రామాయణమనిగాని, శ్రీరామాయణమనిగాని యాది కావ్యమునకు విఖ్యాతిగలదు. పట్టిరామాయణమని పండితులెవ్వరు భాషింపరు. శ్రీమద్రామాయణమనఁగా: లక్ష్మీవంతుండైన రాముని కథయని యర్థము. శ్రీరామాయణమనఁగా: శ్రీరామాయాః=లక్ష్మీస్వరూపిణియగు సీతయొక్క, అయనం స్థానము అని యర్థము శ్రీరామపరమైనప్పుడు, శ్రీరామస్య శ్రీరామునియొక్క, అయనం - స్థానము అనియర్థము. స్థానమనఁగాఁ జరిత్రమని యెంచవలయుఁ గావున శ్రీరామాయణశబ్దము సీతారాముల కిద్దఱికి నన్వయింపుచున్నది. ఈ శ్రీరామాయణమునుఁగూర్చి శ్లో॥ రాజన్ భూసుర దైవతైశ్చ పఠితం రామాయణం పుస్తక' మ్మని కాళిదాసు భోజున కెఱిఁగించెను. సీతాదేవిప్రభావమెఱింగి స్తుతించుటయే విశేషధర్మాచరణంబని యెఱుంగుము. 376

సుశీలుఁడు

ఆంజనేయుని సమాచారంబెట్టిదో యెఱింగింపుము. 377

వరవరముని

మారుతిజన్మవిషయమే మిక్కిలి యాశ్చర్యకరముగానుండు. నెట్లనఁగా, ఇత డంజనాదేవియందు జనించెను. కేసరికి క్షేత్రజుండు, వాయుదేవున కౌరసుఁడు, రుద్రాంశసంభూతుండైనను పరమవైష్ణవుండు. పుట్టినప్పుడే సూర్యునిఁ గబళించి విడిచెను. స్వర్భానునకు భయంబుఁగల్గించెను. శక్రుని వజ్రాయుధప్రహారమునకోర్చి హనుమద్విఖ్యాతి నొందెను. వజ్రి స్థాణు విరించనాది నిర్జరసమూహంబుచే దుర్లభ వరంబులొందెను. బహుసహస్రవర్షంబులు వాలిచే నపాయంబుఁగనకుండ సుగ్రీవునిఁగాపాడెను. త్రయీతను సన్నిధి వేద వేదాంగంబులు వల్లించెను. జననమాది బహుకాల మితండు సామాన్యధర్మమునందే ప్రవర్తించెనుగాని పంపాతీరంబున సలక్ష్మణుం

డగు రామునిఁగాంచినవెంటనే రాముండు స్వకీయోపాసనాదైవంబని మానవాకారంబుఁజెందిన విష్ణుదేవుండని గ్రహించెను. రాఘవుండును మారుతి తన కంతరంగ భక్తుండని తలంచి ప్రేమించెను. వెండియు మరున్నందనుండు వాక్కౌశలంబుచే రాఘవులమెప్పించి ధనుర్బాణాది సాధనంబులతో సమ్మహాత్ముల నంసభాగస్థులం జేసికొని ఋష్యమూకాద్రియందుడించి రామ సుగ్రీవులకు స్నేహంబుఁగూర్చి సుగ్రీవు భయంబుఁబాపెను. నాలుగుమాసంబులు దాశరథుల ధనుర్విద్యాపాటవాదులన్నియు గ్రహించెను. రామునిచే వాలినిఁజంపించెను. దుఃఖసమయంబున వేదాంతవాక్యంబులచేఁ దార నూఱడించెను. రామకార్యముమఱచి వధూలౌల్యంబుతోనుండు సుగ్రీవుని హెచ్చరించి మేలొనర్చె. సీతాన్వేషణార్థమేగునప్పుడే రామానుగ్రహపాత్రుఁడై తదీయ ముద్రికంగైకొనెను. స్వయంప్రభాగుహాలోని కాకర్షించి వానరక్షుత్పిపాసలఁదొలంగించి హాయిఁగూర్చెను. సముద్రతీరంబున నిరుత్సాహంబుచేఁ బ్రాయోపవిష్టులైన వనచరుల సంపాతి వ్యాజంబుచేఁదేర్చి మహేంద్రాద్రికిం జేర్చెను. సముద్రతరణోపాయంబుఁగానక చింతిల్లుచున్న జాంబవదంగదాదుల కుత్సాహంబుఁ గల్పించెను. మహేంద్రగిరినుండి గరుడానిలవేగంబుతోలేచి వనరాశిపైఁబయనించెను, సురసా గర్వభంగంబొనర్చెను. మైనాకకృత సత్కారంబులు వాఙ్మాత్రముచే నంగీకరించి దాఁటెను. ఛాయాగ్రాహిణియగు సింహిక నాయాసంబునసంహరించెను. కంధి లంఘనానంతరము ముందుగా లంకానామక దానవిని వధించెను. నిశాసమయంబున సూక్ష్మరూపంబుతో లంకాపురంబుఁబ్రవేశించి నాలుగులక్షల సోమసూర్యవీథులయందుఁగల గృహాదులలో నాలుగంగుళంబులచోటైనైన విడువక పరీక్షించె. రావణాంతఃపురంబున సుందరావయవంబులతో, సౌకుమార్యలావణ్యంబుతో ,మెఱుపుఁదీవలవంటి కాంతితో, సుగంధద్రవ్యంబులతో, నానావిధ భూషలతోఁ దేజరిల్లుచున్న దేవ

గంధర్వాది కాంతలంగని మోహింపక తృణీకరించి పరనారీమర్శం
బులు పరికించి పాపినైతినని నిర్వేదించి రామానుగ్రహంబుచేఁ
బాపంబురాదని యూఱడిల్లె. 378

సీతామహాదేవి నెందునుంగానక హనుమంతుఁడు విచారగ్ర
స్తుండై మరణోద్యోగంబుసేసి పరాక్రమశాలిగావున మరల నుత్సా
హంబవలంబించి.

సీ॥ లంకాపురముఁబేఁకి లావణశరధిలో
ముంతునాయనుచు నొక్కింతసేపు
దశకంధరునిఁబట్టి దశదిశల్వ్రాగడ మ
ర్దింతునాయనుచు నొక్కింతసేపు
ధారుణీవ్యోమము ల్తాళముల్సేసి వా
యింతునాయనుచు నొక్కింతసేపు
బ్రహ్మలోకముదాఁకఁబరఁగు లోకంబు లూఁ
గింతునాయనుచు నొక్కింతసేపు
లంకనిపుడు త్రికూటాచలంబుతోఁ బె
కల్చుకొని మేదినీసుతాకాంతుకడకు
నతి ముదంబునఁ బోవుదునాయటంచు
సల్పె యోచన నంజనాసంభవుండు. 379

వ॥ ఇట్లు యోచించి యశోకవనంబునఁబ్రవేశించి విహారంబు
సల్పి రాత్రికాలంబున సీతాదేవిని దర్శించి శింశుపావృక్షం బారో
హించి సీతాపరిగ్రహణ కుతూహలంబుతోవచ్చి పరాభవంబుఁజెంది
పోయినరావణుంగాంచి త్రిజటాస్వప్నవృత్తాంతంబాకర్ణించి నిధనోద్యో
గంబుతోనుండు సీతాదేవింగాంచి మరున్నందనుండు మనస్సులోనొన
ర్చిన యోచనాకౌశలంబెంత గంభీరముగానున్నదో విచారింపుము.

మారుతి శింశుపావృక్షంబునందుండి బళీ శ్రీరామచంద్రుం డీ సీతకై యనేక దుష్కరకార్యంబు లొనర్చెను. శ్రీరామునకీ సతియు నీసతికి రాముఁడును దగియున్నారు. ఇద్దఱికి దాంపత్యంబొనగూర్చిన బ్రహ్మదేవుఁడు నేర్పరియైయున్నాడు. బ్రహ్మసృష్టికీ దాంపత్యమహాకీర్తి నార్జించె. ఎన్నిబాధలైననోర్చి జీవించినచో నెన్నాళ్ళకైన రామునిఁ గౌఁగిలించుభాగ్యంబుగలుగునని సీతయు, నెప్పటికైన సీతం బొంది సుఖింపవచ్చునని రాముండును జీవితాశ కలిగియున్నారు. ఋశ్యమూకంబున నీమెకై దుఃఖించుచున్న రామునిఁ గాంచి 'యింత వాఁడు భార్యకై తల్లడిల్లుచున్నాడేయని మనస్సులో గర్హించితి. నిప్పుడా మాత్ర మిట్టి జాయాతిలకంబు నెడఁబాసి జీవించియున్నాఁడు రాముఁడెంతకఠినాత్ముఁడో యని నిందించితి. రామునకుఁ ద్రిలోకాధిపత్య మార్జించుటకన్న నీమెపత్నియగుటయే గొప్పలాభమని తోఁచుచున్నది. సౌందర్య సౌకుమార్యలావణ్యాదులయందీదంపతులు సమానులైయున్నారు. ఇట్టిదాంపత్యంబును విడఁదీసిన రావణుని సపరివారంబుగాఁ జంపించి మరల నేకీభవింపఁజేసి కన్నులారఁగాంచు భాగ్యంబెప్పుడుకలుగునో తెలియలే దది యట్లుండఁగా నీమె సామాన్య స్త్రీ గాదు. రామపత్ని, జనకరాజపుత్త్రి, యద్వితీయప్రభావసంపన్న సాధ్వీశిరోమణి, దుష్టుఁడైనవాఁడు గాని సజ్జనుఁడైననుఁ బరిచితిలేనివాఁడు గాని యీమెతో సంభాషించుట సాధ్యముగానిపనిగానున్న దట్లని సంభాషింపకుండ నూరక వెళ్లుదునేని నాశ్వాసించువారులేక యిప్పుడే మేనువిడుచునట్లున్నది. అదియట్లుండఁగా సీతతో సంభాషింపక వెళ్ళి దాశరథితో జానకిని దర్శించితినని చెప్పఁగానే, యేమన్నదని ప్రశ్నించును. సంభాషింపలేదంటినా దబ్బఱలాడితివని దండించును. పండితుండనగుటచేఁ గల్పనాచాతుర్యంబవలంబించి నే నిట్లనఁగా సీత యిట్లన్నదని యనృతంబాడి రామునిచ్చటికిఁ దెచ్చితినేని సీత మరణించెనా రాముండు నన్నువధించును. జీవించియుండెనా రావణవధానంతరము దంపతులేకీభవించి దాశరథి సీతతో హనుమంతుఁడువచ్చి

నప్పుడు మీకిరువురికిఁజరిగిన సల్లాపవిధం బెట్టిదనియడిగి యథార్థం బెఱింగి నీవంటి మోసగాఁడు లేఁడుగదాయని యుద్యుక్తుఁడైనను నన్ను దండించును. సంభాషింపకుండ వెళ్ళినచో నిన్ని దోషంబులు గన్పట్టుచున్నవి. 380

సంభాషింపఁబూని గీర్వాణభాష నుచ్చరించితినేని నిద్దేవి నన్ను రావణుండని శంకించును. కోసలదేశభాష నుచ్చరించినచో వానర మాత్రునకు నూదేశభాషాప్రవేశ మెట్లుగలిగెనని సందేహించి కేకలు వైచు. నింతలో రాక్షసస్త్రీలులేచి గోలచేయుచు రావణునకు విన్న వింపఁగాఁ దచ్ఛాసనంబుచే లక్షలకొలంది దనుజులు స్థానంబునకు వత్తురు. నేను నక్తంచరసమూహంబుల ననాయాసంబుగా వధింతు నందునా జయాపజయంబులు దైవాధీనంబులు. నేనుజయింతునేని మేలగు. నన్నుజయించిరేని దానవులు వధింతురు, లేదా కారాగృహం బుననుంతు రట్లుంచిరేని నావృత్తాంతము రామున కెఱింగించువారు లేరు. మరల నూఱామడసముద్రంబుదాఁటి యిచ్చటికివచ్చుటకు వానర లందు రెండవాఁడులేఁడు దీనికేమిచేయుదునాయని కుశాగ్రబుద్ధితో నాలోచించి యేమైనంగానిమ్మని సంస్కృతభాషతో రామవృత్తాం తంబుసీతాదేవి వినునట్లుపన్యసించెను. 381

అటుపిమ్మట ముద్రికాప్రదానంబుచే మైథిలికి విశ్వాసంబుఁ గలిగించి రాముని సర్వాంగ సౌందర్యంబు వేనోళ్ళఁ బ్రకటించి భూపుత్రికి జీవితాశఁగల్పించి యామెచేఁ జూడామణింగొని రామ పరిభావంబు దశాస్యున కెఱింగింపఁబూని ప్రమదావన ధ్వంసనమొనర్చి వేలకొలంది యాతుధానుల సంహరించి యక్షకుమారు నంతకలోకం బునకనిచి మేఘనాదప్రయుక్త బ్రహ్మాస్త్ర బంధనంబు సడలించుకొని సభాస్థలంబున రావణునిఁ దిరస్కరించి లంకాపురంబుఁగాల్చి వారాశి జలంబుచే వాలాగ్నిఁజల్లార్చుకొని మరల సీతంగాంచి నమస్కరించి తదీయాజ్ఞంగొని వారిధినుత్తరించి జాంబవదాదులకు సంతోషముఁ

బుట్టించి కిష్కింధకేగి శిరోమణితో సీతావృత్తాంతము రామున కెఱింగించెను. మఱియు నిమ్మహానుభావుండు రామ క్షేమసమాచారంబుచే సీతాప్రాణంబులను సీతావృత్తాంతంబుచే రాముని ప్రాణంబులు నిలిపెను. సంజీవిచే లక్ష్మణస్వామిని రామాగమన వార్తచే భరత శత్రుఘ్నులను విశల్యాద్యౌషధీదానంబుచే సమరఘూర్ఛితులగు కపి సంఘంబులను బ్రతికించెఁగనుకనే యితనింగూర్చి జాంబవంతుఁ డొక సమయంబున విభీషణునితో,

కII హనుమ జీవించియుండిన
  మనమందఱ మున్నయట్లె మరణంబైనన్
  హనుమ జీవింపకుండిన
  మనియుండియుఁ జచ్చిరనుచు మదినిఁదలఁపుమా.

యని విన్నవించెను. మఱియు నితండు రామకార్యధురంధరుఁడు, దీర్ఘాయుష్మంతుఁడు. భావి విరించనుఁడు, రాక్షసవంశ వన వైశ్వానరుఁడు, వైరాగ్యనిధి, సంగీతసాహిత్య విద్యావిశారదుఁడు, రామభక్తాగ్రగణ్యుఁడు, శౌర్య ధైర్య స్థైర్య చాతుర్యౌదార్యగాంభీర్యాది గుణగణసేవధి యిప్పటికిని రామాలయములముందునిలిచి నిజాశ్రితుల గ్రహబాధలు తొలంగించి వాంఛితంబు లొసంగుచుండును. గరుత్మంతుఁడు సురలజయించి పీయూషంబుఁదెచ్చి వినతాదాస్యము మాన్పినట్లు మారుతి దైత్యులజయించి సీతాక్షేమామృతంబుఁ దెచ్చి యిచ్చి రాముని దుఃఖంబుఁబాపెను. వైనతేయుండు మందరాద్రిఁ దెచ్చి సురలకు మేలొనర్చినట్లు మారుతి ద్రోణాద్రిఁదెచ్చి కపులకు మేలొనర్చెను. పన్నగాశనుఁడు పెరుమాళ్ళకు వాహనంబయ్యె. నిప్పావని దూతయయ్యె. హరిదాసులలో వీరిద్దఱు మహామహులు. సుపర్ణునకుఁ బెరియతిరువడియని నామము పావమానికి సిరియతిరువడి యని పేరు.

### సుశీలుఁడు

విశేషధర్మంబింకను లెస్సగా నాచరించినవారినెఱింగింపుదు.

### పరవరముని

పూర్వయుగంబున హిరణ్యకశిపుండను నిశాచరునకు నల్వురు నందనులుగలరు. వారిలో విషముష్టివనంబునఁ జందనవృక్షంబుభంగి జనించి బాల్యప్రభృతి విష్ణుభక్తుండై. 384

సీ॥ త్రైలోక్యమును నవలీలజయించిన
జనక శాసనముఁ గైకొనుటమాని
దైత్యసంతతి నుపాధ్యాయుఁడై పాలించు
నట్టి కావ్యునిబోధ మడ్డగించి
సుర సిద్ధ దనుజ ఖేచర సేవితంబైన
రాజ్యవైభవము నిరాకరించి
స్రక్చందనాంగనాస్వాచ్ఛాదనాభర
ణాది వస్తువులపై నాసవిడిచి
సకలరమ్యపదార్థతర్షంబడంచి
వాసవాది మహాభుక్తు లీసడించి
హరిపదాంభోజ మకరంద మనుదినంబు
నానుచుండెను గోరి ప్రహ్లాదసూరి. 385

వ॥ అంత నొక్కనాఁడు హిరణ్యకశిపుండు ప్రహ్లాదుని సభాస్థలికిఁ బిలిపించి యంకంబున నిడికొని పుత్రా ! నీవు కొంతకాలము నుండి మన యుపాధ్యాయులసన్నిధిఁ జదువుచుంటివి. విద్వాంసుఁడవై యెప్పుడు శాస్త్రార్థంబులఁ బ్రసంగింతువాయని మహోత్కంఠతో నున్నవాఁడ. నిప్పుడు కొన్నిపద్యంబులు పఠించి భావంబెఱింగింపు మనఁగాఁ బ్రహ్లాదుండిట్లనియె. 386

ఉ॥ గారడివానివస్తువుల, కైవడి నస్థిరమై పొసంగు సం
సారసుఖంబులంచవిలి, జ్ఞానవిచారణ సేయలేక భూ
భారకరాఘకృత్యములు, పల్మఱు సేయక యీసడించి ల
క్ష్మీరమణీ మనోహరునిఁ, జింతనఁ జేసిన మేలగుంజుమీ. 387

చ॥ పదములఁగోరి సూరులు నృ,పాలపదంబు నిలింప సంఘ రా
ట్పదమునుఁగోరి కొందఱును, బ్రహ్మపదంబునుఁగోరి కొందఱుం
బదపడి కొన్నినాళ్లకు నపాయముఁగాంచిరి వానిమాని మో
క్షదుఁడని కీర్తిఁగైకొనిన, చక్రిపదంబులుగొల్చు టొప్పగున్. 388

మ॥ కరులుఁ ఘోటకముల్ మహాంగములు సుగ్రాణంబులుఁ భూషణాం
బరము ల్కోఁటలు దొడ్డ గిడ్డ విలస, త్ప్రాకారము ల్భూరి సుం
దర సౌధంబులు భోగ భాగ్యము లని, త్యంబుల్గదా యెంచు నా
దరముఁ మాని రమాధిపుంగొలుచుట ధర్మంబు దైత్యాధిపా.

చ. పలికినమాటలే మరలఁ,బల్కుచుఁ జేసినకార్యము ల్మఱిం
జలుపుచుఁ దిన్నవస్తువులె, సారె భుజింపుచుఁ గన్నవానినే
పలుమఱుఁగాంచుచుఁ వినిన, పాడుకథల్వినుచుందుఁ నరుల్
జలజదళాయతాక్షుఁడగు, శౌరి భజింపరదేమిచిత్రమో. 390

చ॥ దినదినముం గృశించు నిజ,దేహమునమ్మి ఋణానుబంధులౌ
తనయులనమ్మి లేమితఱి, దగ్గఱఁజేరని బంధువర్గముఁ
మనముననమ్మి యౌవనము; మాఱిన రోసి తొలంగు మానినీ
జనములనమ్మి త్రాతయగు, చక్రినినమ్మరు మానవాధముల్. 391

వ॥ అని ప్రహ్లాదుండు పఠించిన పద్యార్థంబువిని హిరణ్యకశి
పుండు మండిపడి సభాసదులంగని యాతుధానులారా! బాలుని

మాటలువింటిరా ? యిద్దురాత్ముండు మత్పక్షంబు నిరసించి మదీయానుజుని వధించి విరోధియగు విష్ణుపక్షంబవలంబించినాడు. వీనినేమి చేయవచ్చునని నక్తంచరు లిట్లనిరి. ప్రభూ! బాలుండు, యుక్తాయుక్త పరిజ్ఞానశూన్యుండు గావున స్వపక్ష పరపక్ష తారతమ్యం బెఱుంగఁడు. నీతిశాస్త్రంబు బోధింపుడనిన హిరణ్యకశిపుండు శాస్త్రపుత్రుండగు చండామార్కులం బిలిపించి గురుపుంగవా! ఈ ప్రహ్లాదునకుఁ ద్రివర్గసాధనంబులగు ధర్మంబులు బోధింపుడని యప్పగింపఁగా నుపాధ్యాయుండు బాలునిఁ బాఠశాలకుం గొనిపోయి సామాన్యశాస్త్రంబులు వక్కాణింపుచుండె. నంతఁ గొంతకాలంబునకుఁ బ్రహ్లాదుండుపాధ్యాయుండు లేనిసమయంబున సమాధివహించి భగవద్ధ్యానంబొనర్చుచుండుటఁగాంచి రక్షోబాలకు లిట్లనిరి, రాజపుత్రా! నీప్రవర్తనంబుఁజూడఁగా నొకవిధంబుగానున్నది. గురువుగారు చెప్పిన పాఠంబులు పఠింపవు. తఱచుగా నిర్జనప్రదేశంబునవసింతు వేమేమియో లోలోనఁగొణఁగుచుందువు. కన్నులు మూయుచుందువు. బాష్పపూరితలోచనుండవై యుందువు. కారణంబేమని యడిగి రమ్మాటలకుఁ బ్రహ్లాదుండిట్లనియె. స్నేహితులారా! మనయుపాధ్యాయుండు విద్వాంసుండైనను జ్ఞానహీనుఁ డతని పాఠంబులు పఠించినందున నాత్మకుఁ బ్రయోజనంబులేదు. సర్వేశ్వరుండును, సర్వవ్యాపకుండును సర్వనియంతయునైన నారాయణునిసేవించినచో మనజన్మంబులు ధన్యంబులగును. శాశ్వతానందము ననుభవింతుము. లేనిచో నామమాత్రసుఖదంబును సదాదుఃఖప్రదంబునగు సంసారవారాశిలోఁగూలుదుము.

బాలకులు

నీ వీ రహస్యం బెట్లెఱింగితివి ? 393

ప్రహ్లాదుడు

జగదాచార్యుండగు నారదుండు నేనుజననిగర్భంబున నుండఁగా భగవన్మంత్రంబు మాతల్లి కుపదేశించె. నామె కొన్నిదినంబులకుమఱచె.

నేనుమాత్రము గర్భస్థుఁడనై విన్నదాది విస్మృతిం జెందక మంత్రంబు జపించుచుంటి. ఆవాసుదేవుండు మదీయ హృదయకమలంబున నిలిచి సమధికానందము నొసంగుచున్నాఁడు. 394

బాలకులు

నీచేఁజెప్పంబడిన వాసుదేవుం డెంతలావుతో, నెంతపొడవుతో నుండు నేదేశంబున వసించును? 395

ప్రహ్లాదుఁడు

అమ్మహాపురుషున కాకారనియమంబులేదు, స్థలనియమంబులే దైన నొకానొకసమయమున భగవంతుఁడు నారదునింగాంచి,

శ్లో॥ నాహం వసామి వైకుంఠే, నయోగి హృదయేరవౌ
మద్భక్తా యత్రగాయంతి, తత్ర తిష్ఠామి నారద.

నారదా! నేను వైకుంఠమునందుఁగాని, యోగుల హృదయ మందుఁగాని సూర్యమండలమునందుగాని లేను, నాభక్తులు నన్నుఁ గూర్చి యెచ్చట గానముచేయుచున్నారో యచ్చటనున్నానని చెప్పెను గనుక కమలాక్షుండు భక్తులుదలఁచినచోట నుండును. 396

బాలకులు

అతనిభక్తికధికారనియమము గలదా? 397

ప్రహ్లాదుఁడు

నియమమేమియులేదు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులును, యవన వ్యాళ పుళింద హూణ శకకంకాభీర పుల్కసులలో నెవ్వరైనను, సురాసుర గరుడ గంధర్వాదులలో నెవ్వరైనను విష్ణువు నాశ్రయించి సేవింపవచ్చును. బ్రహ్మహత్యాదులొనర్చిన పాతకులైనను విష్ణుభక్తులు కావచ్చును సందేహములేదు. 397

బాలకులు

అతండేమిఫలంబులిచ్చును? 398

ప్రహ్లాదుఁడు

కమలాక్షుండు దాశ్రితులకు నాయురారోగ్యైశ్వర్యంబు లిచ్చును. విద్యాబలము, జ్ఞానబలము, ధనబలము, ధాన్యబలము, మనోబలము, దేహబలము, వాక్పాటవము - యింతయేల ధర్మార్థ కామ మోక్షంబులలో నెద్దియైననిచ్చు. దీనికిఁ దార్కాణముగా భూదేవిని, శ్రీదేవిని భార్యలుగాఁ జేసికొనియున్నాఁడు. 400

బాలకులు

అద్దేవున కేమిసమర్పింపవలయును ? 401

ప్రహ్లాదుఁడు

వాసుదేవుఁ డుభయవిభూతినాయకుఁడు. అవాప్త సమస్త కాముఁడు గనుక నేమియు నీయనక్కఱలేదు. కాని మనోవాక్కాయంబు లతని కర్పించి భక్తిచేయవలయునని బోధింపఁగాఁ బ్రహ్లాదుని పరిభాషణంబుచే రాక్షసబాలకు లందఱు విష్ణుభక్తిపరులైరి. ఇంతలోఁ జండామార్కులువచ్చి వారిసమాచారంబున కాశ్చర్యంబు నొంది తిరిగిపోయి హిరణ్యకశిపునితో నిట్లనిరి. 402

మ॥ మునుపొక్కండె సరోజలోచనుని సమ్మోదంబుతోఁ గొల్చి నీ
తనయుం డిప్పు డనేకబాలకుల చిత్తంబుల్ గరంగించి చ
య్యన మోక్షార్థులఁ జేసినాఁడు విపులాయాసంబు
మాకేలతోఁ
చినచందంబునఁ జేసికొమ్మనఁ బలాశిశ్రేష్ఠుఁ డత్యుగ్రుఁడై. 403

శా॥ ఓరీదుర్మతి! దానవాన్వయములో నొక్కండవు సుప్రేమతో
నారాధింపడు శౌరి నెప్పుడును దైత్యారాతియానంచు ని
వారాధింతు వెవండు దెల్పె నిది బాహాటంబుగా నీమనో
నిరేజంబునఁ గల్గినట్లయిన హానిం దెచ్చు వర్జింపుమా. 404

వ॥ అనినవిని ప్రహ్లాదుండిట్లనియె, తండ్రీ! విష్ణుభక్తి గురూపదేశంబుచేఁగాని, శాస్త్రార్థవిచారణచేఁగాని, పండితబోధచేఁగాని దేహులకు లభింపదు.

శ్లో॥ జన్మాంతర సహస్రేషు తపో ధ్యాన సమాధిభిః
నరాణాం క్షీణ పాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే.

వేనవేలజన్మంబులయందార్జించిన తపోధ్యానాదులచేఁ బాపక్షీణమైనవారికిఁ గృష్ణునియందు భక్తిగలుగునని శాస్త్రోక్తిగల్గుటచే నాకిది బహుజన్మ సహస్ర సంచిత తపఃఫలంబై సిద్ధించినది. వింతు నన్నును నన్నాభక్తి విడువదని నిర్భయంబుగాఁ బల్కుచున్న కుమారుని తిరస్కారవాక్యంబు లాలకించి దురాత్ముండగు హిరణ్యకశిపుండు కోపించి భటులంగాంచి వీనిం దీక్ష్ణదండనములచే నలయింపుడని యాజ్ఞాపింపఁగా రాక్షసభటులు ప్రభుశాసనంబు యథాప్రకారంబుగాఁ జరుపుట కారంభించి రట్టిసమయంబున.

సీ॥ ఖడ్గప్రహారముల్కుమ్ప్రహారములయ్యె
శూలాయుధములు పీచోపులయ్యెఁ
బరిఘాతనములదెబ్బలు లతాంతములయ్యె
గదలపోటులు పైరగాడుపయ్యె
సర్వాస్త్ర ఘాతముల్ శశి కిరణములయ్యెఁ
బెనుశంకువులు దూదిపింజలయ్యెఁ
బరశుధారలు నిజ పరివారచయమయ్యెఁ
బిడికిళ్ళపోటులు దోడవులయ్యె

హరిపదాశ్రితుండైన ప్రహ్లాదుఁబట్టి
తిగిచి రాక్షసభటులు బాధించునప్పు
డంతియేకాని కష్టమావంతయైనఁ
గలుగ దచ్యుత పూర్ణానుకంపచేత.

సీ॥ వాల మీఁదికెక్కించి యాలకుఁద్రోయఁగ దూఁది
పటుపుప్పైఁ బంధించ పగిది లేచి
మందాకినిన్నూఁగో నుండఁ జేయఁగ హేమ
వారిలోఁ దేలినవగ నటించి
గరళంబు మ్రింగింపఁగాఁ బాయసాన్నంబుఁ
దినినట్లు మితిలేని తనివిఁ జెంది
మట్టిలోఁ బూడ్పించి మఱునాఁడు దీయంగ
భంగంబునొందక చెంగలించి

భీకరాహులచేఁ గఱపింపఁగొంచె
మైనఁ గష్టంబుఁ గనక ప్రహ్లాదసూరి
చక్రపాణిభజింపుచు సర్వదాన
వావళికి విస్మయప్రదుఁడై చరించె. 406

సీ॥ అట్టి మేనులు వాసెఁ బట్టనేగిన సింధు
రములెల్ల దీర్ఘతుండములు విఱుగ
వెక్కసంబునఁ గూలెఁ ద్రొక్కఁబూను తురంగ
సంఘాతములు కాళ్లు నచ్చువడఁగ
విసముఁ గ్రక్కుచుఁ బాఱె వెసఁ గాటు వేయుట
కరుదెంచు సర్పంబు లార్తిఁ జెంది
కంపంబు చేసీ(లె)ఁ జంపవచ్చు మృగాద
నవ్యాఘ్ర పంచాననములు బెదఱి

చెఱపవచ్చిన రాక్షసుల్చేటుఁగాంచి
రచ్యుతాశ్రయుఁడైన ప్రహ్లాదు సంహ
రింప నాతనితండ్రి ప్రేరించినపుడు
దెలిసెనే దానవేంద్రుని కలుషబుద్ధి. 407

మ॥ మరణోపాయము లాచరించినను వే,మర్దించినన్ దూఱినన్
దురితాత్ముండగు తండ్రి ?తులకుఁ దో,డ్తో సాధ్వసంబంద క
య్యరవిందాక్షు పదానురక్తుఁడగు ప్ర,హ్లాదున్ నిరీక్షించి ని
ర్జర సంఘంబు లతాంతవృష్టిఁగురిసెన్, సాంద్రప్రమోదంబునన్.

సీ॥ ఘనవహ్ని ?ఖలచేఁ గాకలఁజెందిన
పైఁడికడానిరూపంబుఁగనదె
పిడిసానచేత రాపిడిఁగన్న మణి నితాం
తస్తుత్యకాంతిమంతంబుగాదె
శితలాంగలాగ్రదారితమయ్యు సారకే
దారంబు ధాన్యవంతంబుగాదె
దారుణ ఫణివేష్టితంబైౖ పటీర పా
దపము సుగంధాన్వితంబుగాదె

దుర్దశాపీడచే సదా దుఃఖమొందు
సూరి సద్గోష్ఠియందుఁ బూజ్యుండుగాడె
తద్విధంబున దైత్యబాధలకు లొంగ
కచ్యుతినిఁగొల్చి ప్రహ్లాదుఁ డధికుఁడయ్యె. 409

వ॥ అట్టిప్రహ్లాదుంగాంచి మూర్ఖుండగు హిరణ్యకశిపుం డతని పరిభావం బారయఁజాలక విస్మయంబంది తనలో నోరా! మదీయ పుత్రుండగు ప్రహ్లాదునియందు నేనొనర్చిన మారణోపాయంబులన్నియు నూషరక్షేత్రగతంబులగు విత్తనంబులభంగి వ్యర్థంబులయ్యె, వీనివల్ల నాకే మరణంబుగలదేమోయని చింతించి కుమారుని వీక్షించి బాలకా! యేనువెట్టు బాధల కిసుమంతయైనఁ జలింపవైతివి. త్రిలోకస్థంబులగు చరాచరభూతంబులన్నియు నాయధీనములోనున్నవి. నీవు మాత్రము లొంగకున్నావు. నీకు మృతసంజీవినీమంత్రాదులుగాని,

విశల్యాద్యౌషధంబులుగాని తెలియ వెవ్వనిబలంబుచే ననాయాసం
బుగా జీవింపుచున్నావో సూచింపుమనఁ బ్రహ్లాదుండిట్లనియె. 410

సీ॥ సంద్రంబు లెవ్వాని శాసనంబునఁ జేసి
యాక్రమింపవు భూమి నాదినుండి
యిన చంద్రు లెవ్వానిపనుపున రాటంబు
లట్లు చరింతు రయ్యాకసమునఁ
బావకుండెవ్వాని భయముచే సప్త జి
హ్వాలుదాల్చి జగమునఁ బ్రజ్వరిల్లు
నభ్రంబు లెవ్వాని యాజ్ఞచే వర్షంబుఁ
గుంభినీస్థలమందుఁ గురియుచుండు
ధారుణీస్థల మెవ్వాని ప్రేరణమున
ధాన్యములొసంగు సర్వభూతచ్ఛటలకు
నట్టి జగదీశుఁ డాదినారాయణుండు
నాథుఁడై నన్నుఁ బ్రోచుచున్నాడు తండ్రి! 411

సీ॥ నిఖిలభూతములకు నిలువ నాధారమౌ
భూమి నెవ్వఁడు బలంబున వహించు
నగ్నిహోత్రునిలో దహనశక్తి శశి సూర్య
కాంతు లెవ్వానిచేఁ గలిగి వెలుఁగుఁ
దివిరి ప్రాణంబులై దేహధారులఁ బ్రోచు
వరనభస్వంతుఁ డెవ్వాని యూర్పు
మేతాల్పులగువారు మెక్కు పదార్థముల్
నిరతమెవ్వాఁడు జీర్ణింపఁ జేయు

నీకు నాకు సర్వలోకంబులకు హేమ
గర్భునకును సృష్టికర్త యెవ్వఁ
డమ్మహానుభావుఁ డాదివిష్ణుండు న
న్నేలుచున్నవాఁడు నేమమడర. 412

హిరణ్యకశిపుఁడు

నీచేఁజెప్పఁబడినవాఁ డెచ్చోటనుండును? 413

ప్రహ్లాదుఁడు

సీ॥ భవములందు భూపుష్కరములందు శుచి సమీ
రములందు సర్వతోయములయందు
ఖనులందు వనులందు జనులందు మునులందు
వనఘులందును నిశాదినములందు
గిరులందుఁ దరులందు దరులందు విరులందుఁ
గరులందు హరులందు సరసులందు
సురలందు దైత్య కిన్నరులందు సాధ్య ఖే
చరులందు మనుజ వానరులయందు
నీపురంబునందు నీయందు నాయం ద
జాండమందు శశధరార్కులందు
నిండియున్నవాఁడు పుండరీకాక్షుండు
సందులేక లేదు సందియంబు. 414

హిరణ్యకశిపుఁడు

అంతటను నిండియున్నాడని వచించితివి. యీ సభాస్తంభము నందుఁగలఁడా? 415

ప్రహ్లాదుడు

సర్వవ్యాపియైనవాఁ డీస్థాణంబునందే లలేకపోవునని వచింపఁగా దనుజపతి చూపింపుమనియె. నప్పుడు ప్రహ్లాదుండు తండ్రితో నయ్యా!

చూపించుట సాధ్యమైనదనిగాదు గాని యస్మదుపాస్యుండు భక్త వాత్సల్య జలధియగుటచే దద్దాసుండనైన నన్నుఁగాఁబట్టి కానంబడఁ గోపదృష్టితోనుంటివేని నుగ్రరూపంబుతోడను, శాంతితోనుంటివేని శాంతాకారంబుతోను సాక్షాత్కరించుమని చేతులుజోడించి మహా భక్తితో స్తుతింపుచుండ నింతలో నసురాధిపుండు గదాయుధంబుతో నొక్కదెబ్బ స్తంభంబునవ్రేయఁగా జనార్దనుం డాప్రాణంబు ప్రక్క లించుకొని భయంకర నిశాత దంష్ట్రలతో దీర్ఘ పీత జటాకలాపం బుతోఁ గులిశ సదృశ తీక్ష్ణ నఖావళితో సర్వ జగద్దహన సమర్థంబు లగు వీక్షణంబులతో నరసింహాకారంబుతో ననేక సహస్ర దివాకర సమానకాంతితో స్తంభంబున నుద్భవించి యనాయాసంబుగాఁ గనక కశిపునివధించి ప్రహ్లాదు నాకర్షించి స్వీయాంకభాగంబునందుంచుకొని లాలించి నీభక్తికి మెచ్చితి వరంబుఁగోరుమనఁగా నతండగ్రభాగంబున నిలిచి కరములు దోయిలించి యిట్లనియె, కేశవా! లోకోపకారార్థ మవతరించి యిద్దనుజుని వధించితివి. నీ తీక్ష్ణాకారంబునకు భూత కోటులేకాక బ్రహ్మాదిదేవతలునహా భయపడుచున్నారు. సౌమ్యరూపి వైనచో సుఖింతు రందరు. అది యట్లుండఁగా వరంబుఁగోరుమంటివి, నేను జన్మంబుచే రాక్షసుండ, వయస్సుచే బాలుండ, నింద్రియ జయంబులేనివాఁడ, సంసారబద్ధుండ నిట్టి నన్ను వరంబుఁగోరుమని వచింపనేల. నిన్నుఁబ్రార్థించి వరంబుఁగోరువాఁడు సార్థవాహుండు గాని భక్తుండుగాఁడు. వరంబీయఁదలంచితివేని నీపాదారవిందధ్యానా సక్తిదక్కఁ దక్కినది నాహృదయకమలంబు డాయకుండునట్లనుగ్ర హింపుమని వేడుచున్న ప్రహ్లాదుంగాంచి మధుసూదనుండు మంద హాసంబొనర్చి నీవడిగినదానికి సమ్మతించితి నైనను మదీయ నృసింహా వతార ప్రకటనార్థము చిరకాలం బిలపై నిలిచి పుత్ర పౌత్రాదులతోఁ గూడి రాజ్యసుఖంబు లనుభవింపుము. తరువాత మోక్షంబొసంగెద నని వచించి విరించినిఁబిలిచి ప్రహ్లాదుననుఁ బట్టాభిషేకంబు సేసి రమ్మని యాజ్ఞాపించి పుండరీకాక్షుం డంతర్ధానంబుసేసె. నటుపిమ్మట

వాగ్గాని ప్రహ్లాదునకుఁ బట్టాభిషేకంబొనర్చి స్వస్థానంబునకరిగె. పిమ్మటఁ జిరకాలంబు రాజ్యభోగంబు లనుభవించి యిప్పుడు పౌత్రుం డగు బలిచక్రవర్తితోఁ బాతాళంబునందు మహావైభవంబుతో వేంచేసియున్నాఁడు. సామాన్యధర్మమును దిరస్కరించి విశేషధర్మం బనుష్ఠించినవారలలో నిమ్మహాత్ముం డగ్రేసరుండు. 416

బలిచక్రవర్తి విషయము.

సుశీలుఁడు

ప్రభూ ! బలిచక్రవర్తి సామాన్యధర్మప్రవర్తకుఁడా ? విశేషధర్మానుష్ఠానపరుఁడా ? 417

వరవరముని

శిష్యా ! బలిచక్రవర్తి పరమభాగవతశిఖామణియగు ప్రహ్లాదుని పౌత్రుఁ డితండును భాగవతాగ్రణి. 418

సుశీలుఁడు

ప్రహ్లాదకుమారునిపేరు సెప్పకుండ మనుమని పేరెత్తుచున్నా రెందువల్ల ? 419

వరవరముని

ప్రహ్లాదసూనుఁడగు విరోచనుఁడు సామాన్యుఁడేకాని భాగవతుండు కాఁ డట్టివానితోఁ బనియేమి. బలివృత్తాంతమాలింపు మయ్యసురాధిపతి శక్రాది సురుల నోడించి స్వర్గ మర్త్య పాతాళంబులకు నేకచ్ఛత్రాధిపతియై యేలుచుండె. నత్తరుణంబున దేవమాతయగు నదితి దుఃఖించి జనార్దనునిఁ గూర్చి తపంబొనర్చి సాక్షాత్కరించిన యప్పురుషోత్తముఁ గాంచి వేదసూక్తులచే నుతించి కేలుదోయి మోడ్చి దేవా మదాత్మజులగు నిలింపులు బలికి నోడి దుర్దశావాప్తిచే నల్లాడుచున్నారు. నీబంగారుహస్తముతో నింతయన్నముఁ బెట్టుమని యాచించె. నప్పలుకులాలించి కమలాక్షుం డదితిం గాంచి యో మానినీమణీ !

నీగర్భంబున వామనుండనై జనించి దేవకార్యంబుదీర్తు దుఃఖంబు
విడువుమని బోధించి, బోధించినట్లే వామనుండై యావిర్భవించి
యాగశాలకుం జనిన నబ్బలీంద్రుండు వదాన్యశేఖరుండుగావున వామ
నునిం బూజించి సుఖోపవిష్టునిం గావించి, దేవా నీకులంబేమి? నీనివాసం
బెయ్యది ? నీవిచ్చటికివచ్చుటకుం గతంబేమి ? నీకు బాంధవులెవ్వరు ?
నీనామంబెద్ది ? యని ప్రశ్నింప వామనుండిట్లనియె. 420

సీ॥ కులమనునది నాకుఁగలుగ దెన్నఁడు సర్వ
కులములు నావియై పొలుపుఁగాంచు
స్థలనియమము లేదు తర్కింపఁగా నాకు
నన్నిచోటుల సొంతమని వసింతుఁ
గారణం బెద్దియుఁ గనరాదు కారణ
కార్యాస్పదుండనై ఖ్యాతిఁగాంతు
వైరులు బాంధవుల్లేరు దుష్టులె వైరు
లార్యులే బాంధవులని తలంతుఁ
పేరు లేదు నాకుఁ బేరులనంతంబు
లున్నవని తలంతు రుర్విజనులు
తావకీనకీర్తి కోవిదాళి వచింపఁ
జూడవచ్చినాఁడ సుగుణధుర్య. 421

బలీంద్రుఁడు 422

దేవా ! నీ వేమెఱినేర్తువు ?

వామనమూర్తి

సీ॥ శబ్దశాస్త్రమున విశారదులగువారి
డీకొని పోరి యోడించినాఁడ
స్వాధ్యాయపరులతో సంవాద మొనరించి
యధికుండనను కీర్తి నందినాఁడఁ

గార్తాంతికులమంచు గర్వించువారి సం
ధించి వేనోళ్లు మూయించినాఁడ
దార్కికోత్తములపై దండెత్తి త్రుటిలో జ
యించి సమస్కృతులం గాంచినాఁడ

నన్ను గెల్చువాఁడు సన్నిధానమునఁ గో
విదుఁడనంచు విఱ్ఱవీగువాఁడు
గానరాఁడు జగతిఁగల కవీశ్వరులలో
నాదిమైచరింతు నసురనాథ. 423

క॥ వేదత్రయమున నాయు ర్వేదమునందున నథర్వవేదమునను సం
పాదించితిఁ బాండిత్యము వాదమునకుఁ గవిసినట్టివారి జయింతున్.

ఆ॥ మిగులదాతవని సమీచీనభావ స,మన్వితుండవని మహాజనంబు
నిను నుతింపుచుండ విని పనికొంచెము,కలిగివచ్చినాఁడఁ గర్బురేంద్ర.

వ॥ అని వచింపుచుండ సూరిజను లాశ్చర్యనిమగ్నులైరి. బలి
చక్రవర్తి సంతోషవికసిత హృదయారవిందుండై సభాస్తారులం గాంచి
యిట్లనియె. 426

చ॥ కంటిరె యిద్ధరాసురు న,కల్మషచిత్తుని వర్ణివర్యు రే
కంటనుఁబోలు కాంతి సెగ, కంటినిఁబోలు వివేకపూర్తి చొ
గంటినిఁబోలు శౌచమును, కంజభవప్రతిమాకలాప్తి వే
గంటి గురూపమానమతి, గల్గి వెలుంగుచున్నవాఁడొగిన్. 427

సీ॥ విరి దమ్మిరేకులు వెదజల్లినట్లుండఁ
జూపు లీతఁడు సూచుచోటులందు
మంచి కెంపులు క్రుమ్మరించినట్లుండు నీ
తని పాదములు మోపు తలములందు

వర మకరంద పరివాహమట్లుండు నీ
ఘనుఁడు సంభాషించుకాలమందుఁ
గొఁదలేని పూసోన కురిసినట్లుండు నీ
వాగీశు పాండితి రేఁగినపుడు

పాయమునఁ జిన్నవాఁడై ప్రభావమెంతొ
కలిగియున్నాఁడహో స్వల్పకాలమందు
నెట్లునేర్చెనో యీవిద్య లింపుమీఱ
ననివచించి వనీపకు నాదరించి. 428

వ॥ పునః పునః ప్రణామంబు లాచరించి యిట్లనియె. 429

సీ॥ కడు సోయగముగల కన్యామణులనిత్తు
నంగన ల్వలదని యంటివేని
రమణీయ పుష్పితారామంబు లర్పింతు
నవి నా కననరంబంటివేని
భవ్యంబులై పొల్చు పంటభూములఁగూర్తు
నవియు నేఁగైకొననంటివేని
ధన రౌప్య మాణిక్య కనకముల్నేకూర్తు
నవి నేను వాంఛింపనంటివేని

సౌధ హర్మ్యములను సామజంబుల హయా
నీకములను శృంగారరథముల
నెద్దియైనఁ గోరు మిచ్చెద నను బలి
ప్రభునిఁగాంచి పల్కె వామనుండు. 430

ఉ॥ ఎందుల కయ్య నాకివి మహీభ్రమునందో మహాటవీస్థలం
బందొ వసించి మాధవ పదాంబుజ యుగ్మ మరంద వాహినీం
దిందిర తుల్య మానస మహిష్ఠుఁడనై తపమాచరించు క
ర్మందికి నిమ్ము చాలును క్రమత్రయిఁ దానక పాలితానని. 431

చ॥ అనవుడు దంభయాచక మ,హాశయ సంస్థిత భావమెట్టిదో
యని మది సంశయింపక సు,రారి వచించె మహానుభావ నా
ఘనతకుఁ దావకస్థితికి, గౌరవదానముగాదు కోరు ని
త్తు నఖిలవస్తుసంఘములు, దోషములేదన మార్గణుండనుఁ. 432

క॥ జీహా పగలోనైనను, జీవనము ఘటంబుకొలఁది సిద్ధించుఁగదా
నీవెంత దాతనైనను, నా విషయంబట్టి ఫలమునకు యోగ్యంబే.

వ॥ పదత్రియదానంబు చాలునని బలి నంగీకరింపఁజేసి కొలఁది దినంబులలో భూమిం బరిగ్రహింతునని స్వేచ్ఛంజనియె. నటు పిమ్మట శుక్రాచార్యుండు సనుదెంచి వైరోచనిచేఁ బూజితుండై కూర్చుండి వామనవృత్తాంతంబడిగి తెలుసుకొని యిట్లనియె. బలీంద్రా! వామనునకు దానంబిచ్చుట పొరపాటు తతండు యాచకుండు గాడు. సర్వేశ్వరుండగు నారాయణుండు. భూమ్యాకాశంబులు రెండును రెండడుగులుసేసి మూడవయడుగిమ్మని బాధించు. నయ్యవసరంబునఁ బంధ్లికిలించెదవు. సర్వ ధనాపహారణకాలంబునందునుఁ బ్రాణాపాయ సమయంబునందును బొంకిన దోషంబులేదని శాస్త్రంబుగలదు కావున నీవిపత్తునుండితొలంగుమని పలికిన దానవులందఱు దానికి సమ్మతించి కరతాళంబులు వైచి రత్తఱి వైరోచని ముహూర్తకాలంబు చింతించి కావ్యునితో గురుపుంగవా! వనీపక విషయములో వాగ్దత్త మనోదత్తంబులు జరిగిన విధారాదత్తము మిగిలియున్నది. తప్పించుకొను టకు సాధ్యంబుగా దమోఘ సత్యసంకల్పుండగు పురుషోత్తముండు తలఁచిన కార్యంబు మాన దది యట్లుంట. 434

సీ॥ రామాపురుషులకుఁ గామ సౌఖ్యములిచ్చు
సుమధన్విఁగాంచిన సుందరుండు
లీల జీవులనెల్లఁ దోలుబొమ్మలఁజేయు
కమలసంభూతునిఁగన్నతండ్రి

నానాప్రధాన ధాన్య జననిధానమగా
పృథ్వీనభూటికిఁ బ్రియవిభుండు
హర విరించన సురేంద్రాది సంపదల కా
స్పదమైన లక్ష్మికిఁ బ్రాణనాథుఁ
డఖిల విద్యాధిదేవతయై చెలంగు
భారతీశ్వరుం డట్టి పరమపురుషుఁ
డర్థియై నన్ను యాచించె నంతకంటెఁ
గలదె భాగ్యంబు సర్వలోకంబులందు. 435

మ॥ తనువా ఫేనము రాజ్యభోగముల చం,దంబా యనిత్యంబగున్
ధనమానింగి సుమంబు బంధు జన పు,త్ర శ్రేణులా మెవ్వరో
మనసా చంచల దేని నమ్మఁగొని శ్రీ,మంతున్ జగన్నాథు సే
వని వంచింతు మహత్తరాఘ మిదిగా, దాకీర్తి నాశిల్లదే. 436

మ॥ హరి పాణిస్థలిపైఁ గరంబునిచి దా,నాఢ్యుండనై యుంచి సు
స్థిర కీర్తింగనుదానికంటె హయముల్, శృంగారిసంఘంబు సుం
దరు లుద్యాన వనంబులున్ సచివబృం,దంబుల్ చమూవారముల్
తరణోపాయములౌనె శ్రీహరి పద, ధ్యానంబుతో సాటిగాన్.

ఉ॥ గారడివాఁడు సేయు తఱిఁ, గానఁబడున్ వివిధ ప్రధాన శృం
గార పదార్థజాలములు, గన్పడ వాతఁడు లేనిచోట న
త్తీరున మాధవుం డనుమ,తించిన దేహికి భోగ్యవస్తు వి
స్తారము గల్గియుండు నది, తప్పిన నొక్కటి సంభవించునే. 438

మ॥ నరకావాసము గల్గని పరివిమలానందంబు పోని పరం
పరఁగా వచ్చిన రాజ్యలక్ష్మి చెడని, బంధూత్కరంబుల్ నిరా
దర భావంబునఁ జూడని పల నధూ, త్రంసంబు వర్జించని
యరవిందాక్షునకిత్తు నిర్ధరణి మున్నన్న ప్రకారంబునన్. 439

వ॥ అమ్మాటలకు శుక్రుండు లజ్జించి యథేచ్ఛంజనియె. ననంతరము వామనాగమనంబున కుప్పొంగి బలీంద్రుండు సంధ్యావళీ సహితుండై వామను పదంబులు పసిండి హరివాణంబుననుంచి ప్రక్షాళింప నుద్యోగించిన భార్గవుండు యోగబలంబునఁ గలశధార నడ్డగింప సరోజాక్షుండెఱింగి దర్భతోఁ బొడిచి కన్నొక్కటి పోగొట్టి తఱిమి వైచె. నప్పుడు సంధ్యావళీ కరస్థ కలశ సలిలధారాపరంపరలచే వైరోచని హరిపాదంబులఁగడిగి పదత్రయ భూమి దానంబొసంగినఁ బురుషోత్తముండు స్వీకరించి మేనుఁబెంచి బ్రహ్మాండంబుఁగొలిచి ధారుణీవ్యోమంబులు పదద్వయంబయ్యెఁ దృతీయ పదప్రమాణ స్థలంబుఁ జూపింపుమనిన దనుజాధిపుం డిట్లనియె. 440

చ॥ కులజుల నీసడించి యధికుండగు కావ్యునిమాటదాఁటియుం
గులసతితోడఁగూడి కలఁగుండు వహింపక ధైర్యమూని నే
కలిగిన రాజ్యమిచ్చితిని. కాని పనుల్ నెఱవేర్చుటెట్లు నా
తలపయినుంపు తావక పదంబు తృతీయము పూర్తియయ్యెడున్.

వ॥ అని వచింపుచున్నసమయంబునఁ బ్రహ్లాదుండు సనుదెంచి కేశవునకు సాష్టాంగ సమస్కృతు లాచరించి దేవా ! మదాంధులైన యిద్దానవుల శిక్షించు సమర్థుండవే యట్లు శిక్షించుట మాకును లోకంబులకును మేలగుఁగాదే. మదీయపౌత్రు నేను దలంచితి నట్లు సేయుమనినం బురుషోత్తముండు మందహాసంబొనర్చి పుత్రా! యితండు పరాక్రమశాలియై దేవరాజ్యంబగు స్వర్గంబు నాక్రమింపఁగా వేల్పులు దీనులై దుఃఖింపుచున్నారు. వారికి స్వర్గంబొసంగి మీరు పాతాళంబునకేగి చిరకాల రాజ్యసుఖంబు లనుభవింపు డటు మీద మోక్షంబొసంగెద. నీవంశజుల వధింపనని మున్ను వరంబొసంగుటచే నింత చేయవలసెనని వినిచి బలినింగని యిట్లనియె. 442

చ॥ తనయుల నీసడించి నిజదార మనస్సునుఁ గుందఁజేసి వా
హినులఁ గలంచి మంత్రులకు, నింపుఁదొలంచి నిజాన్వయస్థితా
దనుజులమాటదాఁటి యుచితంబగు దాస మొసంగినావు నా
మనమున మెచ్చితిం గినుక, మాని వరంబునుఁగోరు మిచ్చెదన్.

వ॥ అనిన విని దానవేంద్రుం డిట్లనియె. 443

చ॥ సరసిజనాభ నిద్రఁగొని శయ్యను వీడ్కొని జాగరూకుఁడౌ
తరుణమునం బృథగ్విధ పదార్థతతుల్ గనరాక మున్నె నీ
చరణయుగంబు నేను గనుచాడ్పున నిమ్ము వరం బదైన నా
శరభవ దోషనాశన యశస్సు లభించును గాదె పృథ్విలోన్. 444

వ॥ మధుసూదనుం డద్దానవేంద్రునకుఁ గోరిన వరంబొసంగి యంతర్హితుండయ్యె. తదుపరి బలి ప్రహ్లాదులు రసాతలంబున కరిగి యిప్పటికిని నిరాఘాటంబుగా రాజ్యసుఖంబు లనుభవించుచున్నవా రివ్విరోచననందనుండు సామాన్యధర్మంబు వర్జించి విశేషధర్మంబు లెస్సగా నాచరించిన మహాత్ముండు. 445

విభీషణుని విషయము

సుశీలుఁడు

గురువర్యా! విభీషణుని ధర్మంబెట్టిదో యెఱింగింపుఁడు.

వరవరముని

విభీషణుఁడు రాక్షసకులంబున జనించినను రావణుని తమ్ముండైనను సాత్త్వికజనాగ్రేసరుఁడై వర్తించెను. జ్యేష్ఠసోదరుండను నభిమానముతోఁ జిరకాలము రావణునితోఁ గలిసియుండియు రావణుండు సీతనుఁ గారాగృహమునను౦చినది మొదలు విభీషణుం డంతరంగంబున దుఃఖింపుచుఁ జేయునదిలేక యూరకయుండి శ్రీరామ

చంద్రుఁడు సైన్యముతో సముద్రతీరమున విడిసినప్పుడు దశగ్రీవుఁడు లంకలో సభఁజేసి దానవులతో విచారింపఁగా నొక్కొక్కఁడే రాముని జయింతుమనియు సంధికార్య మనవసరమనియు విన్నవింపు చుండఁగా సరమావిభుండు లేచి దశగ్రీవునకు నమస్కరించి యన్నయ్యా! సీతాసాధ్వీమణి లోకమాత, పావకశిఖా సన్నిభ యామెనుఁదెచ్చి లంకలోనుంచినది మొదల నేకదుర్నిమిత్తములు గలిగి దనుజులకు మరణసూచన లిచ్చుచున్నవి. రామదూతయగు వానరుం డొక్కఁడువచ్చి ప్రమదావన ధ్వంసంబొనర్చి యాతుధాన సహస్రం బుల వధించి పట్టపగలు లంకఁ గాల్చుచుండఁగా నొక్కరుండైన నెది రించి నివారింపలేడయ్యె. నిట్టి నక్తంచరాధములు రాముని జయిం తురా? వీరిమాట లాలకించి మోసపోకుము. కుంభ నికుంభ కుంభ కర్ణేంద్ర జిదతికాయాదులును నీవును రాముని జయింపలేరు సరే కదా రణరంగంబున నాయనముందఱ నిల్వఁజాలరు. కనుక సీతా దేవినిఁ గోసలేయునకు సమర్పించినచో జీవింతువు. నీవారమగు మేమును జీవింతుముచుమీయని హితోపదేశంబొనర్చుచున్న విభీష ణుని నిరాకరించి తన్ని రావణుండు వెడలఁగొట్టఁగా సరమాపతి నలువురుమంత్రులతో లేచి గగనంబున నిల్వంబడి దశగ్రీవుంగాంచి.

సీ॥ ధీరులౌ కపులు మందిర వరప్రాకార
సౌధము ల్పడఁగొట్టు సావినైన
నాగ్రహోదగ్రుఁడౌ సుగ్రీవుఁడెదిరి ని
న్నాజిలోఁ బీడించునప్పుడైన
సౌమిత్రికరముక్త శర పరంపరలు త్వ
దాత్మద్భవులఁ జంపునప్పుడైన
సరవిమై లంక శ్మశానసమానమై
యాయాస మొనఁగూర్చునప్పుడైన

సమరమున రాము తీక్ష్ణబాణములు తాన
కీన రక్తంబుఁ జిల్చి తాఁకి తలక్రెల్ల
నరకమునపుడైన నానీతి మఱువకుండ
మని వచించి విభీషణుఁ డపుడు వెడలె. 448

సుశీలుఁడు

స్వామీ! యిచ్చట నొక్క సందేహంబు పొడముచున్న దెట్లం టివేని బాల్యప్రభృతి తన్నురక్షించిన జ్యేష్ఠసోదరుని విభీషణుండు వదలవచ్చునా? వదలినాఁడుపో సోదరునిఁ జంపవచ్చు శత్రువుతోఁ జేరవచ్చునా? చేరినాఁడుపో రావణుని సింహాసనంబుఁ గోరవచ్చునా? గోరినాఁడుపో రావణ వధోపాయం బెఱింగింపవచ్చునాయని కొందఱాక్షేపించుచున్నారు. దీనికి సమాధానమేమి? 449

వరవరముని

సహోదరుల ననువర్తించుట సామాన్యధర్మము. సర్వేశ్వరుం డగు రాము నాశ్రయించుట విశేషధర్మము. పరస్పర విరోధము లేన ప్పుడు రెంటి ననుష్ఠింపవచ్చును. విరోధంబు గలిగినచోఁ త్రైవర్గిక సాధనంబగు సామాన్యధర్మంబును వర్జించి మోక్షసాధనంబగు విశేష ధర్మం బనుష్ఠించుట యుత్తముని లక్షణ మది యట్లుండఁగా రావణుండు దురాత్ముండు. పరస్త్రీ లౌల్య ప్రధానుఁడు. నిర్జరవిరోధి. సాధ్వీజన దుఃఖదాయకుఁడు. మునిజనాపకారి. వైదిక యాగ నిర్మూలనకారి. దురాచార పరాయణుఁడు. రజస్తమః ప్రధానుడు. పతివ్రతా మునినిలింప శాపోపహతుఁడు. విష్ణుద్వేషి. ఇట్టి రావణునితో విభీష ణుఁడు చిరకాలము కలిసి మెలసియుండె. నిష్ఠ దట్లుండుటకు వీలు లేదు. సీత లక్ష్మీదేవి. శ్రీరాముఁడు సాక్షాద్విష్ణుఁడు. రావణుఁ డట్టి రాముని జయించి సీతను వశపఱచుకొనవలయునని తలంచియుండె. నప్పని నెఱవేఱునది కాదు. కాకపోగా నింద్రజిదాదులవలె విభీషణునకుఁ బ్రాణహాని యగు నిహంబున నపకీర్తి, పరంబున నరకము సంభవించు.

నింతదూరము సరమానాథుం డాలోచించి రావణునకు హితోపదేశముసేసె. నద్దుష్టుండు వినకపోగాఁ దన్ని వెడలఁగొట్టె. 450

సుశీలుఁడు

విభీషణుఁడు రామసన్నిధానముకాని మఱియొకచోటికిఁ బాఱి పోవవలదా? 451

వరవరముని

సర్వలోకంబులలో నెక్కడికేగినను వధ్యుఁడైనవానిని రాముండు వధించితీరును. కాకాసురుండు ముల్లోకంబులందిరిగి జీవితోపాయముఁగానక తుదకు రామునిసన్నిధి శరణాగతిఁజేసి జీవించె. నింతియేకాక దేహధారుల సృష్టి స్థితిలయాదులకు నధికారియగు విష్ణువే రాముండుగనుక యమ్మహాపురుషుని విడిచినచో జీవికి గతి లేదు. దీని నాలోచించియే విభీషణుఁడు రాఘవు నాశ్రయించెను.

సుశీలుఁడు

ఆశ్రయింపనిమ్ము, రాజ్యంబుఁగోరనేల? 453

వరవరముని

విభీషణుఁడు రాజ్యంబునుఁ గోరలేదనరేకదా.

శ్లో॥ త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ, రాఘవంశరణంగతః
సర్వలోక శరణ్యాయ రాఘవాయ మహాత్మనే
నివేదయ తమాంక్షిప్రం విభీషణ ముపస్థితమ్.

దారపుత్రాదులవిడిచి రాముని శరణుఁజెందితిననియు, సర్వలోక శరణ్యుఁడును, మహాత్ముఁడు నగు రాఘవునకు నావృత్తాంతము వినిపింపుడనియు వానరులతోను.

శ్లో॥ పరిత్యక్తామయా లంకా, మిత్రాణిచ ధనానివై
భవద్గతంచ మే రాజ్యం, జీవితంచ సుఖానివై.

లంకాపురంబును మిత్రులను ధనంబులను విడిచితిని. మదీయ రాజ్యము జీవితము సుఖములు నీయందే యున్నవని రామునితోను జెప్పె నందుకో విభీషణునకు రాజ్యకాంక్ష యెక్కడనున్నదో విచారింపుము.

సుశీలుండు

వాలిని వధించి సుగ్రీవునకు రాజ్యమిచ్చినట్లు రావణ వధానంతరము రాజ్యమిత్తువను నాసచే విభీషణుఁడు శరణాగతుఁడైనాడని హనుమంతుఁడు రామునితో నేలచెప్పెను ? 455

వరవరముని

అది సుగ్రీవుని సందేహ నివృత్తికొఱకు వచించిన హనుమదభిప్రాయమేగాని విభీషణాభిలాషకాదు. 456

సుశీలుండు

మోక్షప్రదాయకుండగు రఘువరుఁడు విభీషణునకు రాజ్యమేలయిచ్చె ? ఇచ్చినప్పుడు విభీషణుఁ డంగీకరింపనేల ? 457

వరవరముని

తీయమామిడిచెట్టు వేయువాఁడు కేవల ఫలాపేక్షతో వేసినను రసాలతరువు ఫలములేకాక పర్ణములు నీడ సమిధలు యిచ్చునట్లు

శ్లో॥ ఆయురారోగ్య మర్థాంశ్చ భోగాంశ్చైవానుషంగికాన్
దదాతి ధ్యాయతాం నిత్య మపవర్గ ప్రదో హరిః

అనఁగా మోక్షప్రదుండగు వాసుదేవుఁడు భక్తుల కాయురారోగ్యైశ్వర్య భోగంబు లొసంగునను శాస్త్రోక్తి కలదు గావునఁ గోరకున్నను రాముండు స్వభావానుసారంబుగా రాజ్యంబిచ్చె. భగవదభిప్రాయమునుఁ దిరస్కరింపరాదని విభీషణుఁ డంగీకరించెను. దీని యందు దోషంబులేదు. 458

సుశీలుండు

శరణాగతి యనఁగా నర్థమేమి ? 459

వరవరముని

శరణాగతుఁడనఁగా శరణుఁ జొచ్చువాఁడు, శరణ్యుఁడనఁగా రక్షించువాఁడు.

శ్లో॥ అనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనం
రక్షిష్యతీతి విశ్వాసో, గోప్తృత్వ వరణం తథా
ఆత్మనిక్షేప కార్పణ్యే, షడ్విధా శరణాగతిః

శరణ్యుఁడైనవానికి ననుకూలములైన పనులుసేయుట, ప్రాతికూల్యమును వర్జించుట, శరణ్యుఁడు తప్పకరక్షించునను విశ్వాసము, రక్షణమున కనుమతించుట, ఆత్మసమర్పణము, దీనస్వభావము నను నాఱుగుణంబులు శరణాగతున కుండవలయును. 460

సుశీలుఁడు

ఈగుణంబులు విభీషణునియందుఁ గలవేమో వచింపుడు. 461

వరవరముని

పూర్తిగాఁగల వెట్లంటివేని ముందుగా విభీషణుఁడు రామునకు సీత నిమ్మని చెప్పుటలానుకూల్య సంకల్పము, రావణాదుల వర్జించుట ప్రాతికూల్యవర్జనము వానరులు తర్జించి కొట్టఁబూనినను జలింపక నిల్చుట రక్షకవిశ్వాసము. రాముఁడు రాజ్యమిచ్చినప్పుడు వలదనక పోవుట రక్షణాంగీకారము, నాజీవితము రాజ్యము సుఖములు నీయందే కలవని రామునితో వచించుట లాత్మ సమర్పణము. రావణానుజుండనని దుష్టుఁడనని చెప్పుట దీనభావ మియ్యాఱంగములతోఁ గూడిన శరణాగతి విభీషణుఁడు పూర్తిగాఁ జేసెను. 462

సుశీలుఁడు

తరువాత నేమిజరిగెను? 463

వరవరముని

శరణాగతియందుండు ఫలము శరణ్యుని ప్రభావముఁ దెలియఁజాలక విభీషణుఁడు విరోధియని, వధ్యుఁడని సుగ్రీవుఁడు వచించెను.

వానరులు వారివారికిఁ దోఁచినట్లు వక్కాణించిరి. మారుతిమాత్రము సుమాపతి నిర్దోషియనియు రక్షింపఁబడఁదగినవాఁడనియు నెఱింగించె నప్పుడు శ్రీరామచంద్రమూర్తి వానరులకుఁ గపోతోపాఖ్యానాదులు విన్నవించి వారిమతములు లలితముగా ఖండించి.

శ్లో॥ మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన
దోషో యద్యపి తస్యస్యాత్సతామే తదగర్హితమ్.

మహాప్రీతితో నన్నాశ్రయించిన వాని నొకప్పుడైనను విడువను. శరణాగతుఁడైనవాఁడు దోషియైనను రక్షించవలయు. నట్లు సేయుట సత్పురుషులకు నిందితముకాదనియు,

శ్లో॥ సకృదేవ ప్రపన్నాయ, త వాస్మీతిచ యాచతే
అభయం సర్వభూతేభ్యో, దదామ్యే తద్వ్రతంమమ.

ఒక్కసారి నన్నుఁగూర్చి నీవాఁడనని శరణాగతి సేసిన వానికి సర్వభూతములవలన భయములేకుండఁ గాపాడుదు. నిది నాకు వ్రతం. బనియుఁజెప్పి సీతాపతి వానరుల సంతోషింపఁజేసి విభీషణుని రక్షించెను. 464

సుశీలుఁడు

దీనివల్లఁదేలిన సారస్యమేమి ? 465

వరవరముని

శరణాగతుని నైశ్చల్యము శరణ్యుని రక్షణసామర్థ్యము తేటఁబడిన దెట్టులనఁగా విభీషణుఁడు, 466

సీ॥ భార్యాసుతాదులఁబాసి పోవుటలెట్టు
లను సందియం బించుకైన లేక
రావణాదులు తన్నుఁ బోవనీయక యాఁగి
పడఁగూల్తురనియెడు భయములేక
యింతగా శరణన్న నినకులాధీశుఁ డే
మాడ్కిఁ జేయునో యను మాటలేక

రవిసుతాదులు దన్ను రక్షింపవలదని
వాదించునప్పుడు వగవులేక

రామచంద్రుడు పాదరాజీవములపైఁ బ్ర
పత్తిసేసి కృపకుఁ బాత్రుఁడయ్యె
నిట్టి నిశ్చలాత్ము నెంతైనఁగంటిమే
భక్తజనులలోఁ బ్రపన్నులందు. 427

సీ॥ సర్వజ్ఞుఁడగుటచే శరణాగతామల
స్వాంతస్థ భక్తినైశ్చల్య మెఱిఁగి
కరుణాసముద్రుఁడౌ కారణంబునఁ బ్రతి
కూల వానరుల సంకోచముడిపి
మాఱులేనట్టి సామర్థ్యంబు నిరతంబుఁ
గలవాఁడగుట విరోధుల వధించి
ఘన వదాన్యుండైనకతమున వైభవో
పేత రాజ్యంబు సంప్రీతి నొసఁగి

రామచంద్రవిభుఁడు రక్షించె నవ్విభీ
షణుని భూరి సాధ్వసంబడంచి
యట్టివాని విడిచి యన్యుని శరణన్నఁ
గలుగునేసుఖంబు ఘనగుణాఢ్య. 428

వ॥ శరణాగతుండైనవాఁ డకించనుఁడై యనన్యగతికుఁడై యుండ
వలయును. శరణ్యుఁడైనవాఁడు జ్ఞానశక్తి దయాదాతృత్వములు గల
వాఁడై యుండవలెను. శరణాగతులలో ముఖ్యుఁడు విభీషణుఁడు,
శరణ్యులలో నగ్రేసరుఁడు శ్రీరామచంద్రస్వామి, కట్టుగొయ్యనుండి
విప్పుకొన్న వత్సంబువలె విభీషణుఁడు రామునిడాసెను. పాలు చేపు 429
వచ్చు గోవువలె శ్రీరామచంద్రుఁడు స్వీకరించెను.

ద్రౌపదీవిషయము

సుశీలుఁడు

స్వామీ ! ద్రౌపదీసమాచారం బెట్టిదో విశదీకరింపుడు. 470

వరవరముని

యాజ్ఞసేనీప్రభావం బిదివఱకే కొంత నీకెఱింగించితి. వెండియుఁ జెప్పెద నాకర్ణింపుము. ద్యూతసమయంబున దుశ్శాసనాదులు యాజ్ఞసేని నీడ్చుకొనివచ్చి సభలోనిలువం బెట్టి వస్త్రాపహరణంబునకు నారంభింపఁగాఁ బాండవులు నిరుద్యోగులై చిత్రపుత్రికలభంగి నిరీక్షింపుచుండి రయ్యవసరంబునఁ బాంచాలి. 471

సీ॥ భర్తలైయుండి యాపదఁ బాపరేమని
రెచ్చి పార్థులఁ బల్కరించు టుడిగి
కర్ణాది ఖలులు దాఁగావించెడు ప్రపత్తి
సాగనీరనియెడు శంకలేక
జాహ్నవీసుత కుంభ సంభవాదులఁగాంచి
కావరేయను మ్రొక్కు కాంక్షలేక
మానభంగముకంటె మేనెడఁబాయుటే
భవ్యకార్యంబని పాలుపడక
యడరు లోకాభిమాన దేహాభిమాన
ములను వీడి వివేకంబు నెలమిఁ బెంచి
సకల భూభార హరణ దీక్షఁ మనుష్య
తనువుఁదాల్చిన పురుషోత్తమునిఁదలంచి. 472

శ్లో॥ హాకృష్ణ ద్వారకావాస, క్వాసి యాదవనందన, అని యొకచేయి మాత్రమెత్తి యాజ్ఞసేని శరణాగతిసేసె. నట్టిసమయంబున ద్వారకలోఁ జెట్టి సహస్ర పతివ్రతలగు రుక్మిణీ సత్యభామా ద్యష్టభార్యలతో శ్రీకృష్ణుండు పగడసాలాడుచు మహానందముతోనుండి ద్రౌపదీ

దీనాలాపంబు లాకర్ణించి యిట్లని తలంచె. నక్కటా పూర్వము వైకుంఠంబున శ్రీభూనీళాసమేతుండనై సరసగోష్ఠి నుండఁగా గజేంద్రుని దుఃఖవార్త విఘ్నంబుఁగల్పించె. నిప్పుడు ద్రౌపదీవార్తయు నట్టిదయ్యె. పూనినకర్మము పొరుగూరికేగినను దొలఁగదన్నట్లు లవతార కాలంబునందును నాకీదురవస్థ తప్పలేదు. ద్రోవదినిఁగాపాడుట కేగితినేని రుక్మిణ్యాదుల సంతోషము చెడును. మానితినేని స్త్రీలోలుండని సజ్జనులు దూషింతు రైన నొంటిహస్తమెత్తి స్తోత్రము సేయుటచే శరణాగతి పూర్తికాలేదు. పూర్తియగునంతకు నాపి చూచెద. నెట్టులనఁగాఁ గృష్ణయనఁగా నల్లవాని కర్థము, నల్లనివా రనేకు లున్నందువల్లను, ద్వారకావాస ద్వారకలో ననేకులు వసించుట వల్లను, యాదవనందన యాదవకులంబునందు జనించినవా రనేకు లున్నందువల్లను, క్వాసి యెక్కడనుంటివని పలుకుటవల్లను యివి మధ్యమ పురుష సంబోధనవాచకంబులు గావున నన్నేయను సిద్ధాంతములే దెవ్వరికైనం గావచ్చునని యూరకుండె. నింతలోఁ బాంచాలి ద్వితీయ పాణి నొచ్చుటచే వస్త్రాకర్షము మాని రెండుచేతులుజోడించి ప్రసత్తిఁ జేయుచు,

శ్లో॥ గోవింద పుండరీకాక్ష, రక్షమాం శరణాగతామ్ ఓ గోవిందా! పుండరీకాక్షా శరణాగతనగు నన్ను రక్షింపుమని ప్రార్థించెను. తత్క్షణమే జగన్నాథుఁడు లీలాసక్తిమాని 'అక్షయ' యని వాచికవైచె. నిది యిట్లుండ నక్కడ దుశ్శాసనుండు చీర విప్పుచుండఁగా రెండు మూడు వస్త్రంబులు పాంచాలి శరీరమున వ్యాపించి కప్పుచుండె. దుశ్శాసనాపహృతంబులగు వస్త్రంబులు పదులై నూఱులై వేలై లక్షలై గుట్టలుపడియెంగాని యాజ్ఞసేనిశరీరముమాత్రమాచ్ఛాదనాచ్ఛాదితమై యొప్పుచుండె. దుశ్శాసనాదులు నిరుత్సాహులై వస్త్రాపహరణంబుమాని తొలంగిరి. ద్రౌపది పాండవులలోఁజేరి సుఖించెను.

వెండియు ద్వారకలోఁ బగడసాలాడుచున్న గోవిందునిఁగాంచి సత్యభామాదులు ప్రాణనాథా! ప్రారంభించినది మొదలు నీవింత

నటువ నాటలో గెల్వలేవు సరేకదా, రోజొకసప్పుడెల్ల నొక్కొక్కలీల కొక్కొక్కభార్య కొక్కొక్కరాత్రి సంభోగసుఖం బిత్తునని చానకు నూఱేసిమాటలు బాకీ పడియున్నావు. ఇప్పు డక్షయయని పాచిక వైచి గెలిచి మమ్ముల వంచించితివి కారణమేమని ప్రశ్నింపఁగా, కృష్ణాజ్ఞఁగైకొని తదంతికస్థితుండగు నుద్ధవుం డిట్లనియె. తల్లులారా! మనస్వామిమాహాత్మ్యము తానే చెప్పుకొనుట లెస్సగానుండ దేనెఱిం గినదానింజెప్పెద నూఁకొనుఁడు. దూరంబున హస్తిపురసభలో దుశ్శా సనుండు యాజ్ఞసేనీ వస్త్రాపహరణంబు సేయుచున్నాఁడు. తత్పరాభవము సహింపలేక ద్రౌపది యప్పురుషోత్తమునిఁగూర్చి గోవిందా పుండరీ కాక్షా రక్షింపుమని మొఱవెట్టుచున్నది. ఇమ్మహామహుం డామెకు నక్షయచేలంబులు గలుగుఁగాకయని వరంబిచ్చి మానరక్షణంబుఁ గావించి గోవింద, పుండరీకాక్షయను శబ్దద్వయంబునకు వస్త్రంబు లిచ్చుటతోఁ జాలక బాకీపడితినని స్వామి చింతింపుచున్నాఁడని యెఱిం గించి సత్యభామాదుల సందేహంబుఁబాపె. 474

సుశీలుఁడు

గోవింద, పుండరీకాక్ష యను శబ్ద ద్వయంబునంగల సారస్య మేమి? 475

వరవరముని

'గాః' అను సంస్కృతశబ్దము తత్సమమైనప్పుడు 'గోవు' అని చెప్పఁబడును. గోవనఁగా భూమికి స్వర్గమునకు నావునకు వేదమునకు నర్థమగును. వరాహావతారమెత్తి ప్రళయోదధిమగ్నమైన భూమి నుద్ధరించి స్వస్థానమున నిలిపినందువల్లను, వామనమూర్తియై స్వర్గమునుఁ గాపాడుటవల్లను, ప్రస్తుత కృష్ణావతారమున గోవులరక్షిం చుటవల్లను, హయగ్రీవాకారంబుచే వేదములుద్ధరించుటవల్లను గోవిం దుఁడనియు, వికసించిన తెల్లదామరతోఁగాని కెందామరతోఁగాని సమానమగు నేత్రములుగలవాఁడుగనుక పుండరీకాక్షుఁడనియు భగ

భాగవతులఁ గాపాడవలయుఁ దమకట్టి శక్తిలేనిచోఁ లేచిపోవలయును. లేచిపోవుటకు వీలుగానిచోఁ గన్నులు మూసుకొనవలెను. పాండవులు సోపాధికమగు భార్యాసంబంధముమానుకొన్నను నిరుపాధికమగుభగవత్సంబంధమునుఁబట్టి రక్షింపవలయు నట్లు చేయలేరుగనుక వారిం జంపుదురాయని యోజించి మరల సర్వోత్కంఠసాహాయ్యముచేతనే యాజ్ఞసేని గోవిందాదినామంబు లుచ్చరించె నట్టి కంఠంబునకు ముఖ్యభూషణము మంగళసూత్రము. దానికి భంగము వచ్చునే యని పాండవుల మన్నించి యెవ్వరు ద్రౌపదికిఁ బరాభవముసేయ నుద్యోగించిరో వారిభార్యలఁ బరాభవింతుంగాక యని సంకల్పించెను.

తదనంతరము దుశ్శాసనునిచే నాకర్షింపఁబడినచీరలమూల్యంబులై కాంతియుక్తములై వేనవేలుగాఁ గుట్టలువడియుండుట కచ్చెరువొంది దుర్యోధనప్రభృతి సహోదరశతంబునుఁ గర్ణుండును నిల్వయున్న వస్త్రంబులఁ గైకొని తమతమ కులకాంతలకిచ్చి రేపు సూర్యోదయంబున వీనిని ధరించి సౌధంబుపై సభాస్థలంబున కెదురుగానిలిచి దర్శనంబీయవలయునని వక్కాణించి యటుపిమ్మట నక్కాంతామణులు భర్తలు చెప్పినట్లే రెండవనాఁడు కొన్నిచేలంబులు పేటికలయందు దాఁచి స్నానమాచరించి యొక్కొక్క గించెంబునుఁ గంచుకంబును ధరించి సౌధోపరిబహిర్భాగంబుననుండి దుర్యోధనాదులకు భృత్యునిచే వర్తమానముఁ దెలిపి రయ్యవసరంబున సుయోధన దుశ్శాసన కర్ణాదులు మహాసంతోషముతోఁ దలయెత్తిచూచి వెంటనే యధోముఖులైరి. ఇదేమియాయని యంతఃపురాంగనలు విచారమొంది తమ్ము దాముఁ జూచుకొనఁగా దిగంబరలైయుండి రక్కటాయని మందసంబుననుండు చీరలు గట్టుకొనవచ్చుఁగదాయని పరికింపఁగాఁ గృష్ణమాయానిర్మితాంశుక స్పర్శముచే నదివఱకుండు వలువలుకూడ నదృశ్యమయ్యెను. భాగవతాపచారంబెంత బాధఁ గలిగించెనో చూచితివా.

వంతునకుఁ జేసి యీకమలాక్షశబ్దము రూఢముచేతను యోగము చేతను నారాయణాభిధేయంబై యున్నదిగాని లాంతులకర్థంబుగాదు.

సుశీలుఁడు

సామాన్యముగాఁ గవీశ్వరులు కమలాక్షుండని పురుషుని యందును, కమలాక్షియని స్త్రీయందు నుపయోగింపుచున్నారే.

వరవరముని

కవులు సామాన్యులయి యీ కమలాక్షశబ్ద ముపయోగించుట యెట్టిదనఁగా లోకములో నొక సుందరునిఁగాంచి యాహా! వీఁడు మన్మథుఁడురా యనినమాత్రమున మదనుండుగాఁడుగదా, యట్లే ధనవంతునిఁ గుబేరుఁడని, శూరుని సింహమని, సత్యవంతుని ఋషివంటివాఁడని పొగడుదు రంతమాత్రమున నవి వాస్తవములుగాక యతిశయోక్తులగునట్లు కమలాక్షనామ మితరులయందు నతిశయోక్తిగాఁ బరిణమించును. 478

సుశీలుఁడు

తరువాత శ్రీకృష్ణుఁ డేమిచేసెను? 479

వరవరముని

ద్రౌపదీ మానరక్షణానంతరము శ్రీకృష్ణుండు తన దివ్యచిత్తంబున నారా మానరక్షణంబుచే ఋణంబుతీరలేదు. చక్రప్రయోగంబుచే దుర్యోధనాదుల వధింతునా యని తలంచి తనకు నపకీర్తి వచ్చునని మాని పాండవుల వధింతునాయని యోచించె. 480

సుశీలుఁడు

ప్రాణసమానులగు పాండవుల వధించుటకు వారియందు దోషంబులేదే. 481

వరవరముని

దోషము లేకపోలేదు. భగవద్భక్తుల నెవ్వరైన బాధింపుచున్నచో సమీపములోనున్న సజ్జనులైనవారు భక్తవిరోధుల దండించి

భాగవతులఁ గాపాడవలయుఁ దమకట్టి శక్తిలేనిచో లేచిపోవలయును. లేచిపోవుటకు వీలుగానిచోఁ గన్నులు మూయవలెను. పాండవులు సోపాధికమగు భార్యాసంబంధముమానుకొన్నను నిరుపాధికమగుభగవత్సంబంధమునుఁబట్టి రక్షింపవలయు నట్లు చేయలేదుగనుక వారిం జాపుదురాయని యోజించి మరల నయోగ్యా కంఠసాహాయ్యముచేతనే యాజ్ఞసేని గోవిందాదినామంబు లుచ్చరించె నట్టి కంఠంబునకు ముఖ్యభూషణము మంగళసూత్రము. దానికి భంగము వచ్చునే యని పాండవుల మన్నించి యెవ్వరు ద్రౌపదికిఁ బరాభవముసేయ నుద్యోగించిరో వారిభార్యలఁ బరాభవింతుంగాక యని సంకల్పించెను.

తదనంతరము దుశ్శాసనునిచే నాకర్షింపఁబడినచీరలమూల్యంబులై కాంతియుక్తములై వేనవేలుగాఁ గట్టలువడియుండుట కచ్చెరువొంది దుర్యోధన ప్రభృతి సహోదరశతంబునుఁ గర్ణుండును నిల్వయున్న వస్త్రంబులఁ గైకొని తమతమ కులకాంతలకిచ్చి రేపు సూర్యోదయంబున వీనిని ధరించి సౌధంబుపై సభాస్థలంబున కెదురుగానిలిచి దర్శనంబీయవలయునని వక్కాణించి రటుపిమ్మట నక్కాంతామణులు భర్తలు చెప్పినట్లే రెండవనాఁడు కొన్ని చేలంబులు పేటికలయందు దాఁచి స్నానమాచరించి యొక్కొక్క గించెంబునుఁ గంచుకంబును ధరించి సౌధోపరిబహిర్భాగంబుననుండి దుర్యోధనాదులకు భృత్యునిచే వర్తమానముఁ దెలిపి రయ్యవసరంబున సుయోధన దుశ్శాసన కర్ణాదులు మహాసంతోషముతోఁ దలయెత్తిచూచి వెంటనే యధోముఖులైరి. ఇదేమియని యంతఃపురాంగనలు విచారమొంది తమ్ముదాముఁ జూచుకొనఁగా దిగంబరలైయుండి రక్కటాయని మందసంబుననుండు చీరలు గట్టుకొనవచ్చుఁగదాయని పరికింపఁగాఁ గృష్ణమాయానిర్మితాంశుక స్పర్శముచే నదివఱకుండు వలువలుకూడ నదృశ్యమయ్యెను. భాగవతాపచారంబెంత బాధఁ గలిగించెనో చూచితివా.

సుశీలుఁడు

పరమయోగిదుర్లభుండగు శ్రీకృష్ణుఁడు ద్రౌపదికంత సులభుం డగుటకుఁ గారణంబేమి ? 484

వరవరముని

శ్రీమన్నారాయణుఁడు భక్తపరాధీనుఁడు, భక్తవత్సలుఁడు, భక్తాభీష్ట ఫలప్రదాయకుఁడు, భక్తవిరోధినిరసనశీలుం డట్టి శ్రీకృష్ణ స్వామి నదివఱకే ద్రౌపది మహాభక్తితో నారాధించి తలంచినప్పుడు ప్రత్యక్షమగునట్లు వరంబుఁగాంచియుండెను. కనుకనే భీష్మ ద్రోణాది మహామహులనైన గణింపక వాసుదేవు నాశ్రయించి యనిష్ట నివృత్తి యిష్టప్రాప్తి సంపాదించెను. 485

సుశీలుఁడు

పాండవభక్తికంటె యాజ్ఞసేని భక్తి గొప్పదగునా యేమి ?

వరవరముని

చాలాప్రశస్తమైనది. వనవాసంబున ధర్మనందనుండు సూర్యు నుపాసించి తదనుగ్రహంబుచేఁ దనకుఁ దనపరివారమునకు నొక్క పూట కాహారంబు సంపాదించెను. సవ్యసాచి హరు నుపాసించి యొక్క దివ్యాస్త్రము సంపాదించెను. యాజ్ఞసేని దేవతాంతర పరిత్యాగపూర్వకముగా శ్రీకృష్ణు నుపాసించి వాంఛితార్థములన్నియు సంపాదించెను. 487

సుశీలుఁడు

పాంచాలింగూర్చి మఱియొక గాథ వక్కాణింపుఁడు. 488

వరవరముని

కౌంతేయు లరణ్యవాస మొనర్చునపుడు దుర్వాసోముని దశసహస్ర శిష్యపరంపరతో హస్తిపురంబునకరిగి దుర్యోధన గృహంబున నన్నపానాదులచే సౌహిత్యమొంది దుర్యోధన ప్రేరితుఁడై యొక

నాడు మధ్యాహ్నంబున సశిష్యుండై ద్వైతవనంబునకరిగె నప్పటికిఁ బాండవులు భుజించి సాంద్రవృక్షచ్ఛాయయందుఁ గూర్చుండిరి. వారిలో సహదేవుండు దూరంబున దుర్వాసుంగని తక్కినవారి కెఱింగింపఁగా విని ధర్మరాజు విచారగ్రస్తమానసుండయ్యును సపరివారంబుగా నత్రిపుత్రునకెదురేగి నమస్కరించి కూర్చుండఁబెట్టి కుశలంబడిగి భోజనార్థము వచ్చుటెఱింగి స్నానముసేసిరమ్మనఁగా నమ్మునీంద్రుండు సచ్ఛాత్రుండై యరిగి నదీజలంబులందిగి మజ్జనమాచరింపుచుండె నప్పుడు ధర్మరాజు భీమునితో భీమా! దుర్వాసుండు పదివేల శిష్యులతో భోజనార్థము వచ్చినాడు. మన మాహారముఁ గైకొంటిమి. సూర్యవరదత్తమైన భోజన మొకపూటకేగాని రెండవపూటకు సంభవింపదు. మునీంద్రుఁడు వచ్చెనేని మనలనందఱి శపించు నతండు వచ్చులోఁగా నీల్గితిమేనిఁ జేయునదిలేక తిరిగిపోవును. తక్కినవారైన జీవింతురు. కాబట్టి ముష్టిశలాటువులఁ గైకొనిరమ్ము తిని మరణింతమని చెప్పఁగా వృకోదరుండు వెంటనే కోసితెచ్చె నక్కాయలు నడుమనుంచుకొని పాండవులు నారాయణస్మరణముతో భుజింప నుద్యోగింపుచుండిరి. వారింగని పాంచాలి గండూషపూర్వకముగాఁ బాదప్రక్షాళన మాచరించి పర్ణశాలాంతరమ్మునకరిగి రుక్మిణీకాంతుని ధ్యానించె నప్పు డప్పురుషుండు తత్క్షణమే పాండవదృగ్గోచరుండయ్యె నప్పుడు పాండవులుపరమానందభరితులై యద్దేవదేవునకుఁ బ్రదక్షిణ నమస్కారంబు లాచరించి సుఖాసీనుంగావించి నలుప్రక్కలఁ బరివేష్టించి పాదసంవాహనాద్యుపచారంబులు సేయుచుండిరి. యాజ్ఞసేనిసహా చనుదెంచి వాసుదేవునిఁ బూజింపుచుండె నంత నయ్యాదిదేవుండు వారియిక్కట్టుఁ బాపఁ దలంచి ద్రౌపదింగని సోదరీమణీ! నన్నాకలి బాధింపుచున్నది మీ భుక్తశేషము భాండములోనున్నచోఁ దెచ్చియిమ్ము లేనిచోఁ బ్రాణంబులు నిలువవనియె నమ్మాటల కచ్చేడియ వెఱంగంది ప్రభూ! నంటఁ జేసి తొందఱలో నీక్షుద్బాధనడంతు నిదానింపుమనఁగాఁ దల్లీ!

యంతవఱకు నీవ్వఁజాలఁ దే తెమ్మని ద్రౌపదీ దత్తారణ్యాళమిశ్రితా గస్త్యశాకంబు మూఁడుదోసిళ్ళు ద్రావి తృప్తిఁజెందె నత్తఱిఁ త్రైలోక్యస్థంబులగు చరాచరభూతముల పొట్టలునిండె నదేవిధంబున నాపగాసంస్థితుండగు దుర్వాసుండు నతనిశిష్యులును భుక్తాయాసంబుచేఁ బీడింపఁబడుచుండి రయ్యవసరంబున మధుసూదనుండు పాండవసహితంబుగా ధునీసమీపంబునకరిగి మునీంద్రునకు నమస్కరించి యాశీర్వాదంబులు గైకొని భోజనమునకు విచ్చేయుఁడు వంట తయారయ్యె ననఁగా ననసూయాసుతుండు హరింగాంచి దేవా! నీవు సర్వశక్తుండవు. నీవిచ్చటికి వత్తువన్నచో నేను రానోపను. వాని కురువంశము నిర్వంశముగాను ధుర్యోధనుండింతకుఁ గారకుఁడు. వానిప్రేరణచే వచ్చితిని నీవెఱింగి మాపొట్టలు నిండించుటయేకాక భుక్తాయాసంబుఁ గల్పించినావు క్షమింపు మిఁకవెళ్లెదనని భగవదనుగ్రహంబుఁజెంది దుర్వాసుండు శిష్యులతో నింగికెగసి మాయమయ్యెఁ బాండవుల స్వస్థానంబుఁజేర్చి గోవిందుఁడుసహిత మంతర్హితుండయ్యె, ద్రౌపదీయుక్తులగు పాండవులు సుఖంబుననుండిరి. 489

గోపికల విషయము

సుశీలుఁడు

గోపాలకాంతల సమాచారంబెట్టిది? 490

వరవరముని

విశేషధర్మ మనుష్ఠించినవారిలో నిట్టి మహాభాగ లెందునుఁ గానంబడరు. విద్యాగంధములేనివారై యబలలై యస్వతంత్రలై యుండియు సర్వసంగ పరిత్యాగపూర్వకముగా శ్రీకృష్ణు నాశ్రయించిరి. వారట్టివారుగనుకనే మన పెరియాళ్వారు గోపికనై హరిం గొల్వనైతినని చింతించె. వారి తిరుకొమరితయగు గోదాదేవి గోపికామార్గంబు ననుసరించి మాసవ్రతం బనుష్ఠించి రంగరాజస్వామిం

జెంద్రియాది సుఖించె సదియట్లుండఁగా గోపకామినీజన నేత్రంబులు జ్ఞానము, వారి స్తనంబులు భక్తి, వారిమధ్యంబులు వైరాగ్యము, జ్ఞాన భక్తి వైరాగ్యంబు లంగనారూపంబులుధరించి శ్రీకృష్ణ నాశ్రయించి శరీరులిట్టి పారతంత్ర్యంబుసహించి భగవంతునిఁగొలిచి యుజ్జీవింపవలయునని లోకంబున కుపదేశించిరి కనుకనే వీరిప్రభావంబు వేదవ్యాసుండు భాగవతమునందునుఁ బరాశరమునీంద్రుఁడు విష్ణుపురాణంబునందును వెల్లడించిరి. శుకయోగీంద్రుఁ డుపన్యాసరూపంబుగాఁ బరీక్షిద్భూవరున కెఱింగించి యేడుదినంబులలో ముక్తిం జెందించెను.

సుశీలుఁడు

రాసక్రీడా జలక్రీడలనఁగా నేమి ? 492

వరవరముని

కృష్ణుండు బృందావనంబునందు నిశాసమయంబున గోపికలను గుండ్రముగా నిలువంబెట్టి యిద్దఱుగోపికల నడుమఁగృష్ణుండు, నిద్దఱు కృష్ణులనడుమ గోపికగానిలిచి యాటలాడుచుఁ బాటలుపాడుచు లాస్యముఁజేయుచుఁ గాలయాపనమొనర్చుట రాసక్రీడయని చెప్పఁబడును. రాసక్రీడ చేఁ నలసినప్పుడు యమునానదియందు నీటిలో నీత వేయుచు నొకరిపై నొకరు నీళ్ళు చల్లుకొనుచుఁ బరిహాసవాక్యంబులు పల్కుచుఁ గాలముఁగడపుట జలక్రీడయని చెప్పఁబడును. భక్తాగ్రేసరులగు గోపికలతో నిట్లు క్రీడించి భగవంతుఁడు వారి కపరిమితానందముఁ గలిగించెను. 493

సుశీలుఁడు

వల్లవపల్లవాధరలలోఁ గృష్ణునితోఁ గ్రీడసలిపినవా రెందఱుందురు ? 494

వరవరముని

మూఁడులక్షల యేబదివేలమందియని యళగియమణవాళ

ప్పెరుమాళ్లనయనాచార్యులవా రాచార్యహృదయంబను గ్రంథంబు నందు వచించిరి. 495

సుశీలుఁడు

ఇంతమందితో నెనిమిదేండ్లవయస్సుగల కృష్ణుం డొక్కరుం డేవిధంబునఁ గ్రీడించెను ? 496

వరవరముని

శ్రీకృష్ణుం డమోఘ సత్యసంకల్పుఁడు సర్వశక్తుఁడు సర్వ నియంత.

సీ॥ నిమిషకాలంబు ననేకాబ్దములఁ జేయు
శతవర్షముల నిమేషముగ మార్చు
నంగుళస్థలములో నవనీధరము నిల్పుఁ
గులగిరినైన నంగుళముఁ జేయు
బీదయౌ వానిఁ గుబేరుఁ గావించుఁ గు
బేరుని క్షణములో బీదఁ జేయుఁ
బత్తనస్థలి న కూపారంబు నిర్మించు
నంబుధి నొగిఁ బత్తనంబొనర్చుఁ
బండితునిఁ బామరునిఁ జేయుఁ బామరుని మ
హా విచక్షణుఁ జేయు సర్వాధికారి
యైన కృష్ణుఁ డతని కసాధ్యంబు లేదు
కాన విస్మయమేల భాగవతవర్య. 497
సీ॥ పాదరజస్సుచేఁ బాషాణమును రూప
వతిఁగా నొనర్చి స్వపతికొసంగె
మున్నీటిపై శైలములు తేలునట్లుగా
సేతు నిర్మాణంబుఁ జేసె నోలిఁ
గోతిమూఁకల చేత యాతుధానుల నెల్లఁ
జంపించి జగతి కాశ్చర్య మొసఁగెఁ

పశ్చిమాంభోధిలో ద్వారకాపురము ని
ర్మించి లోకుల వసింపించియోటెఁ
దరణిబింబముఁ జక్రాయుధమున మూసి
యంధకారము సేసె బ్రహ్మాండమెల్ల
నట్టికృష్ణున కఖిల లోకైకపతి క
సాధ్య కార్యంబు గలదె విశాలహృదయ. 498

వ॥ యశోదానందనుం డట్టి సమర్థుండగుటచే మూడులక్షల యేబదివేల గోపాలాంగనలకు మూడులక్షల యేబదివేల రూపంబులతో సాక్షాత్కరించి క్రీడించి వారి నమందానంద పారావారంబునఁ దేలించె. 499

సుశీలుఁడు

పల్లవ పల్లవాధరలు సమూలంబుగాఁ బాతివ్రత్యంబు విడిచిరి గదా దోషంబు కాదా? 500

వరవరముని

పాతివ్రత్యంబు సామాన్యధర్మంబగుటచే స్త్రీజనులకు స్వర్గం బిచ్చి పునః పతనంబుఁ గలిగించును. కృష్ణసాంగత్యంబు శాశ్వతానందం బగు మోక్షంబిచ్చు నట్టి శాస్త్రధర్మంబు వ్రజాంగన లెఱుంగకున్నను.

సీ॥ కంజాక్షు దివ్యమంగళ విగ్రహముఁ గాంచు
కనులతో నన్యంబుఁ గానలేక
దైత్యారి నామామృతముఁ గ్రోలు రసనతోఁ
బరనామధేయము ల్పలుకలేక
మాధవస్పర్శంబు మనిఁగినతనువుతో
నే స్పర్శమైన గ్రహింపలేక
వలమురిదారి సూక్తులు విన్న చెవులతో
నితరవాక్యములు సహింపలేక

భాళి గోవిందుఁ గౌఁగింటఁబట్టి యొత్తు
శయయుగముతోడ సేవను సలుపలేక
మాని కృష్ణాంఘ్రిఁ పద్మ నిమగ్న మాన 501
సాబ్జలై గోపకామినుల్ హాయిఁగనిరి. 502

వ॥ మఱియు,

సీ॥ జున్ను మీఁగడలపై నున్నట్టిరుచి పద్మ
నాభుని కల్యాణ గుణంబులందు
మకరందమునఁగల మక్కువ దానవా
రాతిభాషించు భ్రాంతులయందు
భవ్య పుష్పములపైఁ బ్రసరింపుచున్నట్టి
కాంతి కేశవతనూగంధమందు
లలితమోచారసాలముఖ ఫలస్థమై
కెరలుకూరిమి హరిక్రీడలందు

సూప మధ్వాన్న శర్కరా పూప లడ్డు
కాది వస్తుచ్ఛటలమీఁద నరుగు తమి ము
రారి చేష్టలయందునఁ జేరి నిల్వ 503
విడిచి రన్యంబు మునువల్లవీజనములు.

సీ॥ ధనముపై సౌఖ్యసాధనముపై ముఖ్య జీ
వనముపై నెక్కొన్న వాంఛవిడిచి
సుతులపై దుహితృ సంతతులపైఁ బోషించు
పతులపై వర్ధిల్లు బాళిమాని
మణులపై హేమ కింకిణులపై నాత్మ రో
హిణులపైఁ బ్రసరించు నిచ్ఛనేది
సితులపై వాసించు విరులపై నుద్యాన
తరులపై వర్తించు తర్షమడఁచి

వివిధవస్త్రస్థితాశయ విస్మృతిదూటి
వల్లవాంగన లయ్యుదూద్వహుని దేవ
కీకుమారునిఁ గృష్ణు ననేకగతుల
మోహమునఁగొల్చి త్రైలోక్య పూజ్యలైరి. 504

సీ॥ వనజాతనయను లావణ్యసౌందర్య శ్రీ
మద్యౌవనములఁ గామంబునిలిపి
తమ్ము విసర్జించి తామసించిన వేళ
దైత్యారియందుఁ గ్రోధంబునుంచి
చక్రిఁగానని నిమేషంబైన నాయుస్సు
పాడయ్యెననెడు లోభంబుగలిగి
శౌరి మానసమందుఁ జేరఁ బ్రమాద కా
ర్యము లొనరించు మోహమువహించి
కనకచేలుండు వశుఁడయ్యెనను మదంబుఁ
జెంది హరి మమ్ముఁగాకన్యసుందరాంగి
నెనయరాదను మాత్సర్యమునునయించి
హరికినర్పించి రరివర్గ మప్పొలఁతులు. 505

సుశీలుఁడు

శ్రీకృష్ణదేవుని దివ్యమంగళవిగ్రహం బప్రాకృతంబై పంచోపనిషన్మయంబై దివ్యసౌరభోపేతంబై శ్రీభూనీళా ప్రముఖ దేవీసహస్రభోగయోగ్యంబై నిత్య సూరిసేవ్యంబై వేదవేద్యంబై యోగిజనధ్యేయంబై నిత్యానపాయంబై సౌందర్య సౌకుమార్య లావణ్యసంయుతంబై పొంపారుచుండు నట్టి దేవదేవునకు దుర్గంధభూయిష్ఠంబులగు గోపికల నరశరీరంబులు భోగింప నెట్లు యోగ్యంబులయ్యెను ?

వరవరముని

ఉ॥ చందనవృక్షసన్నిధి కుజంబులు సౌరభ మొందునట్లు లిం
దిందిర నిష్కకీటకము, తేటితనంబు వహించినట్లు గో
విందుని దివ్యవిగ్రహము, విస్తృతభక్తిని సంస్పృశించి య
య్యిందునిభాస్యలొందిరి మహీస్థలమందున దివ్యభావముల్. 507

సీ॥ సనకసనందనాద్యనఘాత్మలట్లు వై
రాగ్యంబుఁజెంది రభాగ్యవతులు
వాయుపుత్రాది విద్వత్కవీంద్రులఁబోలె
సాహితీపరులైరి చంద్రముఖులు
కలహాశనునిఁబోలె గాత్రిజంత్రములఁ గీ
తముఁ బాడనేర్చిరి భ్రమరకచలు
నిర్జరాంగనలట్లు నింగిపై విహరించు
సామర్థ్యమొంది రకోమలాంగు
లౌర ! శ్రీకృష్ణదేవు దివ్యాంగమంటి
నంతమాత్రముచే వార లట్టులైరి
కనుకనేకద నందనందనుఁడు వారి
నంటి పలుమారు సౌఖ్యంబులందఁజేసె. 508

వ॥ ఇదివఱకు విష్ణుభక్తులైనవారందఱు జీవితకాలము గొం
గొంత దేహయాత్రకుఁ గొంత కుటుంబపోషణార్థము కొంత లీలా
విరామ విహారాదులకొఱకు నుపయోగించుకొని కొంతకాలము
మాత్రమే భగవత్సేవ కుపయోగించిరి. కాని వ్రజాంగనా
రత్నంబు లట్లుకాక సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును మన
స్సుచేఁ గృష్ణాకారధ్యానంబును వాక్కుచేఁ గృష్ణ నామోచ్చారణం
బును శరీరంబుచేఁ గృష్ణ పరిచర్యయుఁ గావించి హరితో నిత్యసంబం
ధంబుఁ బ్రాపించిరి. కనుకనే మహాయోగియగు నుద్ధవుండు బృందా

వనంబున నాభీర వధూమణుల సందర్శించి సాష్టాంగ నమస్కృతు లాచరించి తల్లులారా! మీపాదస్పర్శముచే నివ్వనంబునందలి తరు గుల్మ లతా పాషాణాదులు ముక్తిఁగాంచుననిస్తుతించెను. విశేషధర్మా నుష్ఠానపరులలో నందఱు వీరికిఁ గ్రిందివారని యెంచవలెను. 509

**గద్యము:** ఇది శ్రీసీతావల్లభప్రసాద సమాసాదిత కవితాప్రవీణ
వేదాల సీతారామాచార్య కృపాలబ్ధ మంత్రరత్నాను సంధాన
పవిత్రాంతరంగ నిఖిల దుర్మత శిలోచ్చయదంభోళీ భూత
సముద్రాల లక్ష్మణాచార్యానుగ్రహబోధిత విశిష్టాద్వైత
రహస్యార్థ ధురంధర శఠగోపయతిరాడ్వర వర యోగి
ప్రభృతి పూర్వాచార్య చరణసరోజ భ్రమ
రాయమాన మొవ్వ వంశతిలక కృష్ణాంబా
కృష్ణమార్యతనూజ శ్రీవైష్ణవ విధేయ
వేంకటదాస నామధేయ ప్రణీతంబైన
జ్ఞానసూర్యోదయంబునందుఁ
ప్రథమ భాగము సంపూర్ణము

శ్రీమతే రామానుజాయనమః

శ్రీ రైనమః

శ్రీసీతారామాభ్యాంనమః

# జ్ఞానసూర్యోదయము

## ద్వితీయభాగము

## మాంసాహారనిషేధము

సుశీలుఁడు

దేశికసార్వభౌమా! మనరామానుజీయులలోఁ గొందఱు సురామాంసంబు లుపయోగింపుచు వానిని ద్రవ్యవస్తువులని చెప్పుచుననుభవింపుచున్నా రీ యాచారము మంచిదేనా? 510

వరవరముని

ఛీ ఛీ యదిదురాచారంబుగాని యాచారముగాదు. సజ్జనులైన రామానుజీయు లెన్నటికి దానినాచరింపరు సరేకదా స్వప్నంబుననైన నంగీకరింపరు. 511

సుశీలుఁడు

గురువర్యా! పరమపవిత్రంబైన రామానుజమతంబునందు దురాచారులు సంభవించుట లాశ్చర్యముగదా? 512

వరవరముని

దానికేమియు నాశ్చర్యంబులేదు. పాలసముద్రంబున హాలాహలంబు జనించె. సూర్యవంశంబున దుండగీడైన దండుండు పుట్టె

బ్రహ్మకులంబునఁ దుచ్ఛుండగు రావణుండుజనించెఁ జంద్రవంశంబునఁ
బరమలోభియైన దుర్యోధనుఁ డుద్భవించెఁ గాఁపువాఁడు క్షేత్రంబునఁ
బైరువెట్టఁగా సస్యమునకంటెఁ గలుపు ముందుగా విజృంభించునట్లే
రామానుజ సిద్ధాంతంబునందును దురాచారపరాయణు లావిర్భ
వింతురు. 513

సుశీలుఁడు

దుష్టాచారులనఁగా నెవ్వరో వచింపుడు. 514

వరవరముని

పరసతీ సంగమము, పానము, మాంసభక్షణము వేదవిరుద్ధంబు
లగుటవలన దురాచారంబులగును. 515

సుశీలుఁడు

ఈ దుష్టాచారంబులవలనఁ గలుగు ననర్థంబు లేవియో వేఱు
వేఱుగా సెలవిండు. 516

వరవరముని

మాంసాహారము అన్నిటికంటె గొప్పపాపము. 517

సుశీలుఁడు

మాంసాహారము మహాపాపమని వక్కాణించితిరి. మాంసంబు
భుజింపనివా రేకాలంబున నేజాతియందును గానంబడరు. బ్రాహ్మ
ణులలో రహస్యముగా మాంసము భుజించువారట్లుండగాఁ బ్రత్యక్ష
ముగా మత్స్యభుక్కులని యొకసంఘముగలదు. వైశ్యులయందు
బేరీలు మాంసము భుజింతురు. క్షత్రియులు వేటాడి జంతువులభక్షిం
తురు. శూద్రజాతులకిది కులక్రమాగత మర్యాదగానున్నది. మాల
మాదిగ యెఱుకల యేనాది మ్లేచ్ఛజాతుల లిక్కార్యమునఁ బండి
తులై యున్నారు. రాక్షసుల కాహారమే మాంసము. యాగముల
యందు దేవతలుసహితము పశుహింస నొప్పుకొనుచున్నారు. కసాయి

దుకాణమువారు ప్రతిదినము వందలు వేలుగా జంతువుల వధింపుచున్నారు. మాంసాహారము వర్జనీయమని మీరు వచించుట లాశ్చర్యముగా నున్నదిగదా ? 518

పరవరముని

యజ్ఞములయందు పితృకార్యములయందు జంతుహింస దోషము కాదని శాస్త్రము విధించినది. దానినైనను కృతయుగంబునందక్కఁ దక్కిన యుగంబునఁ జేయరాదని మునీంద్రులును సర్వయుగంబులఁ జేయనచ్చునని దేవతలును కలహించి రెండు తెగలవారు నుపరిచర వసుమహారాజును మధ్యవర్తిగా నెన్నుకొని న్యాయముఁ జెప్పుమని యడుగగా నవ్వసుధేశుండు దేవతాపక్షపాతంబు వహించి నాలుగు యుగంబులయందును జీవహింస దోషంబుగాదని తీర్మానించె. వేల్పులు సంతసించిరి. మునులు కోపించి రాజుతో నోభూపతీ! నీవు సత్యంబు వల్కినచో నేకొఱంతయుండదు. కపటవాక్యంబు వల్కినచోఁ బాతాళంబునఁ బడుదువు, మే మనృతంబాడిన నష్టే యగుదుమని ప్రతిజ్ఞఁజేసి రంతలో వసుమహీశుఁ డాకాశగమనమునకుఁ దొలంగి దబాలునఁ బాతాళంబునఁబడెను. కొందఱుప్రాజ్ఞులుమాత్రము పశుహింసాయుక్తయాగము కలియుగంబునఁ బనికిరాదనిరి. 519

సుశీలుఁడు

కారణంబేమో యానతిండు. 520

వరవరముని

శిష్యా! ద్వాపరయుగాంతమువఱకుఁ జేయు యాగంబులయందు జంతుహింస నొనర్చినచో నాజంతువునకు వెంటనే పశుత్వము పోయి స్వర్గమున దేవత్వమువచ్చును. యాగకర్త పశు రోమసంఖ్యచే నన్న దానంబొనర్చు నధ్వర్యులు తపస్సంపన్నులైయుండు రిప్పుడట్టి సమర్థులు లేరుగనుక మానవలయును. 521

సుశీలుఁడు

మహర్షిజనాగ్రగణ్యుండగు నగస్త్యుండు పితృకార్యంబులయందు మాంసము భుజించినట్లు శ్రీరామాయణంబునందున్నదే. 522

వరవరముని

అచ్చటివిషయంబు వేఱు. ఎట్లందువా, వాతాపీల్వలులను రాక్షసులిద్దఱు పితృకార్యవ్యాజంబున ననేకబ్రాహ్మణుల వంచించి చంపి తినుచుండి రయ్యవసరంబున లోకోపకారార్థము తరసంబు భక్షించి రాక్షసుల వధించెంగాని యిప్పటివారలభంగి జిహ్వాచాపల్యంబునఁ దినలేదు. 523

సుశీలుఁడు

ధర్మవ్యాధుఁడు పుణ్యశీలుఁడని ప్రసిద్ధినొందియుఁ గసాయిదుకాణము పెట్టి కౌశికునితోఁ దప్పులేదని వచింపలేదా ? 524

వరవరముని

ధర్మవ్యాధుఁడు కౌశికునితోఁ గసాయిదుకాణము నిర్దోషమని చెప్పలేదు. కాని తాను పూర్వజన్మంబున బ్రాహ్మణుండననియుఁ బాపకృత్యంబుచే నిట్టిజన్మము కలిగెననియు నీప్రారబ్ధం బనుభవముచేఁ గాని నశింపదనియు నితరపుణ్యంబులచే నీవృజినంబుఁ బోఁగొట్టుకొందు ననియు సమాధానంబిచ్చెంగాని జీవహింస కర్తవ్యంబని వాకొనలేదు. పూర్వభవంబున విప్రుండనై పాపంబొనర్చుటచే నిట్టిజన్మంబువచ్చెనని వచించుటచే నిప్పటి వ్యాధజన్మంబునుఁ గసాయి దుకాణమును, మాంసాహారంబును నీచంబులనియే నిర్ధారణ చేసెను. 525

సుశీలుఁడు

భారతాదిపర్వంబున నొకానొకచోట మాంసంబు దేవతానివేదనచేసి భుజింపుమనియున్నదే. 526

వరవరముని

ఆమిషంబుఁ దినవలదని వ్రాసినచో నామిషాహారుల కాగ్రంథంబున నీర్ష్యకలుగు నక్కారణంబునఁ జదువుటయు, వినుటయుం

బాసగ దప్పుడు భారతముండియుఁ బ్రయోజనములేదు. పామరులకు గ్రంథాసక్తికొఱకు వేదవ్యాసుం డట్టి వాక్యంబులు కొన్నివిధించెను. లేనిచో నాకులు పండ్లు వాయువు నీరము భక్షించి జీవించు వ్యాసుం డట్లేల విధించు. నీవిషయంబు భారతానుశాసనికపర్వంబున ధర్మజ భీష్మ సంవాదంబున యథార్థము వక్కాణింపఁబడియున్నది యెట్లనఁగా

శ్లో॥ అహింసా పరమోధర్మ ఇత్యుక్తం బహుశస్త్వయా
శ్రాద్ధేషుచ భవానాహ, పితౄనా మిష కాంక్షిణః

ధర్మజుండు భీష్మునిఁగాంచి స్వామీ! హింస లేకయుండుట పరమధర్మమని చెప్పితివి. పితృదేవతలు మాంసము నపేక్షింతురనియుఁ జెప్పితివి. 528

శ్లో॥ మాంసై ర్బహువిధైః ప్రోక్తస్త్వయా శ్రాద్ధవిధిః పురా
అహత్వాచకుతో మాంసమేవమేత ద్విరుధ్యతే

బహువిధములగు మాంసములచే శ్రాద్ధవిధి జరుగుచున్నదని మందుఁజెప్పితివి. జంతువులఁజంపక మాంస మెట్లువచ్చును. నీవుచెప్పిన రెండు నొకదానికొకటి విరుద్ధముగానున్నది. 529

శ్లో॥ జాతో నస్సంశయో ధర్మే, మాంసస్య పరివర్జనే
దోషో భక్షయతః కస్స్యాత్కశ్చ భక్షయతో గుణః

మాంసభక్షణము వర్జింపుమనెడు ధర్మమునందు మాకు సంశయము గలుగుచున్నది. మాంసము భక్షించువానికిఁగల దోషమేమి? భక్షింపనివానికి లాభమేమి? 530

శ్లో॥ ఏతదిచ్ఛామి తత్త్వేనకథ్య మానంత్వయానఘ
నిశ్చయే నదిక్షామి, ధర్మమే తం సనాతనమ్

పాపరహితుండగుభీష్మా యథార్థముగాఁజెప్పఁబడుచున్న యీ సనాతనధర్మము వినఁగోరుచున్నాను. 531

శ్లో॥ కథ మాయుర వాప్నోతి, కథంభవతి సత్వవాన్
కథ మ వ్యంగతామేతి, లక్షణ్యో జాయతే కథమ్

మనుష్యుఁ డాయువు నెట్లు పొందుచున్నా డెట్లు సత్వవంతుఁ డగుచున్నాఁడు అంగవైకల్యములేనివాఁ డెట్లగు నెట్లు లక్షణవంతుఁ డగుచున్నాఁడని ధర్మరాజడుగగా భీష్ముండిట్లనియె. 532

శ్లో॥ రూప మవ్యంగతా మాయు,ర్బుద్ధిం సత్వం బలం స్మృతిం
ప్రాప్తుకామైర్నరైర్హింసా వర్జితా వై మహాత్మభిః

రూపము నంగవైకల్యము లేకుంఁ టయు నాయుస్సును బుద్ధిని సత్వమును బలమును జ్ఞాపకశక్తినిఁగోరు మహాత్ములు జీవహింసను వర్జింపవలెను. 533

శ్లో॥ యే యజేతాశ్వమేధేన, మాసి మాసి యతవ్రతః
వర్జయే న్మధు మాంసంచ, సమమేతమ్యుధిష్ఠిర

ఓధర్మరాజా! నియమవ్రతముగలవాఁడై ప్రతిమాసమునందు నశ్వమేధము సేయువాఁడును మధు మాంసములు వర్జించినవాఁడును సమానులు. 534

శ్లో॥ సప్తర్షయో వాలఖిల్యా, స్తథైవచ మరీచిపాః
అమాంసభక్షణం రాజన్, ప్రశంసంతి మనీషిణః

ఓధర్మరాజా! పండితులైన సప్తమహామునులు వాలఖిల్యులు మరీచిపులు మాంసభక్షణావర్జనముమంచిదని కీర్తించిరి. 535

శ్లో॥ న భక్షయతియో మాంసం, న చ హన్యాన్నఘాతయేత్
తన్మిత్రం సర్వభూతానాం, మనుః స్వాయంభువో౽బ్రవీత్

ఎవ్వండు మాంసమునుఁదినడో యెవ్వఁడుచంపడో యెవ్వఁడు చంపించడో వాఁడు సర్వభూతములకు మిత్రుఁడని స్వాయంభువ మనువు చెప్పెను. 536

శ్లో॥ అధృష్య స్సర్వభూతానాం, విశ్వాస్యస్సర్వజంతుషు
సాధూనాం సమ్మతో నిత్యం, భవే న్మాంస వివర్జనాత్

మాంసమును వర్జించినవాఁడు సర్వభూతములకుఁ దిరస్కరింప రానివాఁడును నమ్మఁదగినవాఁడును సాధువుల కిష్టుఁడు నగును. 537

శ్లో॥ స్వమాంసం పరమాంసేన, యో వర్ధయితు మిచ్ఛతి
నారదః ప్రాహధర్మాత్మా, నియతంసోఽవసీదతి

ఇతరమాంసముచేఁ దనమాంసముఁ బెంపుసేయఁగోరువాఁడు తప్పక క్షీణించునని ధర్మాత్ముండగు నారదుండు సెప్పెను 538

శ్లో॥ దదాతి యజతే చాపి, తపస్వీచ భవత్యపి
మధుమాంస నివృత్త్యేతి, ప్రాహాచైవ బృహస్పతిః

ఎవ్వఁడు మధు మాంసమును వర్జించి దాన యజ్ఞములు సేయుచున్నాడో వాఁడు తపస్సంపన్నుఁడని బృహస్పతి సెప్పెను. 539

శ్లో॥ మాసి మా స్యశ్వమేధేన, యో యజేతశతం సమాః
నఖాదతి చ యో మాంసం సమమే తన్మతంమమ

ఎవ్వఁడు ప్రతిమాసము తప్పకుండ నశ్వమేధము నూఱుసంవత్సరములు సేయునో వాఁడును మాంసవర్జితుండును సమానులని నాయభిప్రాయము. 540

శ్లో॥ సదాయజతి సత్రేణ, సదా దానం ప్రయచ్ఛతి
సదా తపస్వీభవతి మధు మాంస వివర్జనాత్

మధు మాంసములు వర్జించుటవలన సదా యాగ దాన తపములు చేసినవాఁడగుచున్నాడు. ఆ యా ఫలములు పొందుననుట.

శ్లో॥ సర్వేవేదాన తత్కుర్యుః, సర్వే యజ్ఞాశ్చ భారత
యో భక్షయిత్వా మాంసాని, పశ్చా దపి నివర్తతే

ఎవ్వఁడు మాంస రుచినెఱింగియుఁ బిమ్మట మానునో వాఁడు సర్వవేదముల నధ్యయనము చేయనక్కఱలేదు సర్వయజ్ఞములు సేయనక్కఱ లేదు. ఆ యా ఫలితము లిందువల్లనే పొందుచున్నాఁడు 542

శ్లో॥ సర్వభూతేషు యో విద్వాన్, దదాత్యభయదక్షిణాం
దాతాభవతి లోకేస, ప్రాణానాం నాత్రసంశయః

ఏ విద్వాంసుఁడు సర్వభూతములయందు నభయమను దక్షిణ నిచ్చుచున్నాడో వాఁడు లోకమునఁ బ్రాణములిచ్చు దాత యిందుకు సందియము లేదు. 543

శ్లో॥ ఏతంవై పరమం ధర్మం. ప్రశంసంతి మనీషిణః
ప్రాణాయథాత్మనోఽభీష్టా, భూతానామ పితే తథా

ఈ ధర్మము శ్రేష్ఠమని కోవిదులు స్తుతింపుచున్నారు. తన ప్రాణములయందుఁ దనకెట్టి తీపు గలదో సమస్త ప్రాణులకట్లేగదా.

శ్లో॥ తస్మాద్విద్ధి మహారాజన్, మాంసస్య పరివర్జనమ్
ధర్మస్యాయతనం శ్రేష్ఠం, స్వర్గస్యచ సుఖస్యచ

కనుక ఓ ధర్మరాజా ! మాంస వర్జనము స్వర్గమునకుఁ బుణ్యమునకు నిలయమైన శ్రేష్ఠధర్మమని యెఱుంగుము 545

శ్లో॥ అహింసా పరమోధర్మస్తథాహింసా పరంతపః
అహింసా పరమం సత్యం, తతోధర్మం ప్రవర్తయేత్

హింస లేకపోవుటయే పరమ ధర్మము. అదియే మంచితపస్సు. అదియే మంచి సత్యము. దానివల్లనే ధర్మము నడచుచున్నది. 543

శ్లో॥ నహి మాంసం తృణాత్కాష్ఠా, దుపలాద్వాపిజాయతే
హత్వాజంతుం తతో మాంసం, తస్మాద్దోషస్తు భక్షణే

గడ్డి కొయ్యలు, రాళ్లు వీనివలన మాంసము పుట్టదు. జంతువులఁ జంపిన లభించు నక్కారణంబున మాంస భక్షణము దోషము.

శ్లో॥ కాంతారేష్వథఘోరేషు దుర్గేషు గహనేషుచ
రాత్రావహాని సంధ్యాసు, చత్వరేషు సభాసుచ,
ఉద్యతేషుచ శస్త్రేషు, మృగవ్యాళ భయేషుచ,
అమాంస భక్షణే రాజన్ భయమన్యైర్నగచ్ఛతి

కాంతారదుర్గ గహనాదులయందు నహర్నిశములందు నాలుగు మార్గములు కలిసిన ప్రదేశములయందు సభలయందు నెత్తఁబడిన యాయుధ ప్రదేశములయందు మృగ సర్పాదులయందు మాంసవర్జితులకు భయంబు గలుగదు 548

శ్లో॥ ఆహర్తాచానుమంతాచ, విశస్తా క్రయ విక్రయీ
సంస్కర్తా చోపభుక్తాచ, ఘాతుకాస్సర్వ ఏవతే

జంతుల నపహరించువాఁడు ననుమతించువాఁడు చంపువాఁడు కొనువాఁడు నమ్మువాఁడు వలల పక్వము సేయువాఁడు భక్షించువాఁడు వీరందఱు ఘాతుకులేసుమీ; యీ ప్రకారముగాఁ బంచమ వేదంబగు భారతానుశాసనిక పర్వంబునఁ జెప్పఁబడియున్నది, యిది యిట్లుండఁగా, 549

శ్లో॥ లాక్షయా మధు మాంసేన, లోహేనచ విషేనచ
సదైవ బిభ్రియాద్భృత్యాన్,యస్యార్యానుమతేగతః

అక్క కల్లు మాంసము యినుము విషము విక్రయించి కుటుంబమునుఁ బోషించువాఁడు పొందు నరకమును శామద్రోహి పొందు నని భరతాళ్వారు శపథము సేసిరి. 550

వెండియు శ్రీకృష్ణదేవుండు ముచుకుందునకుఁ బ్రసన్నుఁడై
మోక్షంబడిగిన యారాజుతో నో రాజా! పూర్వము నీవు వేటాడి
జంతువుల వధించి మాంసంబుఁదింటివి తత్పాపపరిహారార్థముగాఁగొంత
కాలము తపంబొనర్చు మటుపిమ్మట మోక్షంబొసంగెదనని యంతర్హి
తుండయ్యె. 551

సుశీలుఁడు

ప్రభూ! క్షత్రియులకు వేఁట దోషంబుగాదందురే. శ్రీకృష్ణుం
డట్లేల వచించెను ? 552

వరవరముని

క్షత్రియులైనను ధర్మార్థకామపరులైనంతవఱకు మృగయావినో
దంబు సెల్లును. మోక్షార్థులైనప్పుడు సెల్లదు. ముచుకుందుఁడు మో
క్షముఁ గోరినందున భగవానులట్లు వచించిరి. 553

సుశీలుఁడు

పాండవులరణ్యంబున నుండఁగా మృగంబులు ధర్మరాజ స్వప్నం
బునఁ గానిపించి ప్రభూ మృగంబుల నన్నిటిని వధించితిరి; జాతి కొక్కొ
క్కరుగా మిగిలి యున్నాము. మృగాన్వయంబులు నిర్మూలము కాక
మున్న వేఱు వనంబున కేగుడని చెప్పినట్లున్నది పరమ భాగవతులైన
పాండవులట్లు సేయవచ్చునా? 554

వరవరముని

అప్పుడు పాండవుల వెంట సజ్జనులైన బ్రాహ్మణ సహస్రంబు
లుండిరి. వారి కపాయంబు లేకుండుట కట్లు వధించిరి కాని జిహ్వా
చాపల్యంబుచేఁగాదు. 555

సుశీలుఁడు

భగవంతుఁడు రామకృష్ణాద్యవతార కాలంబులయందు మాం
సము భుజించినాఁడుగదా ? 556

వరవరముని

శ్రీమన్నారాయణుండు జగద్వ్యాపారి, సర్వేశ్వరుండు, నిర్దోషి ప్రకృతిబంధశూన్యుఁడతండెంతయైన మెక్కు నెంతకాలంబైన నిరాహారి యైయుండు నతని చేష్టలన్నియు మనకుఁ బ్రమాణంబులుగావు. దొరతనమువారెంత పన్ను విధించినఁ బ్రజలు చెల్లించి తీరవలయు. సర్వనియంతయగు భగవంతుని చిత్తవృత్తి బద్ధజీవులకెట్లుండును; భగవదవతార విలాసములకుప్పొంగి కొనియాడవలయునేగాని సందేహింపరాదు ప్రశ్నింపనురాదు. 557

సుశీలుఁడు

కొందఱు జాతరలయందు గ్రామపిశాచములకు జంతువులబలి యిత్తురే యది మంచిదేనా? 558

వరవరముని

అంతటి నీచకార్య మెద్దియు లేదు, యెందుకనఁగా,

శ్లో॥ యజంతే సాత్వికా దేవాన్, యక్షరక్షాంసి రాజసాః
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే, యజంతే తామసా జనాః

సాత్వికులగువారు దేవతలను, రాజసులు యక్షరాక్షసులను తామసులు భూత ప్రేత పిశాచముల నారాధింతురు. 559

శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛంతి సత్వస్థాః, మధ్యేతిష్ఠంతి రాజసాః
జఘన్యగుణవృత్తిస్థా, అధో గచ్ఛంతి తామసాః

సాత్వికులు స్వర్గాద్యూర్ధ్వలోకంబులను రాజసులు మధ్యమమగు నరలోకంబును నీచులగు తామసులు నరకాద్యధోలోకంబులనుఁ బొందుదురని గీతాచార్యులవారానతిచ్చిరి. క్షుద్రదేవతారాధనంబువల్లనే నరకమున్నప్పుడు భూతబలి యిచ్చువారినిఁగూర్చి విచారింపవలసినది లేదు. 560

సుశీలుఁడు

శాక్తేయులలోఁ గొందఱు మధు మాంసాదులు వాఁడు చున్నారే? 561

వరవరముని

శాక్తేయులు తామసులు తదీయ పూజార్హయగు శక్తియుఁ దామసయే. 562

సుశీలుఁడు

రామానుజీయులలోఁగొందఱు గ్రామసూకరంబులనుఁ గుక్కుటంబులను మేకపోతులనుఁగోసి పెరుమాళ్లకు నివేదింపుచున్నారే కారణమేమి? 563

వరవరముని

వారలింతకుఁబూర్వము సారమేయవ్యాఘ్రాది ఘాతుక మృగంబులుగానో రాక్షసులుగానో యుండి సుకృత లేశముచే నరజన్మం బెత్తిరి. కాని వారి పూర్వజన్మసంస్కారము మాత్రము వారిని విడువ లేదు. వారు నామమాత్ర వైష్ణవులుగాని వాస్తవముగా రామానుజీయులు గారు. వారి వేద విరుద్ధపూజను భగవంతుఁడంగీరింప డిందుల కొక కథ నెఱింగింతు వినుము. ఘంటాకర్ణుండు ప్రత్యక్షమైన శ్రీకృష్ణునకు బ్రాహ్మణ శవంబు లర్పింపఁగా నప్పరమపావనుండేవగించుకొని రాక్షసునితో శవాదులు మీకు భక్ష్యంబులు మేము శవదర్శన మాత్రంబుచే సచేలస్నానమాచరింపవలయునని పరిహరించి భక్తినిఁబట్టి యతని ననుగ్రహించెను. 564

సుశీలుఁడు

యావజ్జీవము మాంసాశనుండగు ఘంటాకర్ణునకు శ్రీకృష్ణుఁ డెట్లు మోక్షమిచ్చెను ? 565

## వరవరముని

శ్రీకృష్ణుండారక్కసునకు సర్వోన్యముక్తినొసంగక దేవత్వమిచ్చి తనవాత. ముక్తి నొసంగెదనని సాయించెను సరేకదా

శ్లో॥ పత్రం పుష్పం ఫలంతోయం, యేమేభక్త్యా ప్రియచ్ఛతి
తదహం భక్త్యుపహృత, మశ్నామి ప్రియతాత్మనః

భక్తితో నెవ్వండు పత్రముగాని, పుష్పముగాని, పండుగాని సలిలముగాని యిచ్చుచున్నాడో పరిశుద్ధాత్ముండగువానిచే నీయఁబడిన దానిని నేను తినుచున్నానని గీతాశాస్త్రమునందు భగవానులు సాయించినారేగాని నాకు మాంసాహారమిచ్చినచో నారగింతునని చెప్పలేదు మఱియు సత్పురుషోత్తముండు విదురాన్నమునకు ద్రౌపదీశాకలవమునకుఁ గుచేలుని యటుకులకు శబరీదత్త ఫలంబులకు దండకాటవిలో మహామునులొసంగిన కందమూలాదులకు గోపీగోపాలదత్త దధి ఘృత నవనీతక్షీర గోరసంబులకు నానందించి యనుభవించెనేగాని మాంసాహారంబెక్కడను స్వీకరింపలేదు. సాత్వికులగు భక్తాగ్రేసరు లెవ్వరునుఁ బెరుమాళ్లకు మాంసము నివేదింపనులేదు. ఇప్పటికిని శ్రీరంగము తిరుమల కాంచీపురము కురుకాపురిము శ్రీవిల్లిబుత్తూరు యాదవాద్రి తోతాద్రి ఘటికాచలము భూతపురి యహోబిలము మంగళగిరి భద్రాచలము పండరిపురము, ద్వారకాపురము, అయోధ్య మధుర, మాయ, హరిద్వారము, సింహాచలము, శ్రీకూర్మము, జగన్నాథము మొదలగు దివ్యక్షేత్రములందు సర్వావతారుండగు విష్ణువు దధ్యోదనము, పులిహోర, చక్కరపొంగలి, లడ్డుకము, గుడము, పంచదార, దోసి, గారెలు, అరిసెలు మొదలగు పరిశుద్ధ పదార్థములే స్వీకరింపుచున్నాడు. శివాలయములయందునుఁ గంచి కామాక్షి, మధురమీనాక్షి, ప్రభృత్యాలయంబుల యందును సాత్వికపదార్థములే వాడుచున్నారు. గ్రామ పిశాచ జాతరలునుఁ వదీయు పూజలును

శాస్త్రీయములుగావు. కనుక సాత్వికులకనాదరణీయంబులగు యట్లుం
డఁగాఁ గలరా మశూచికాది వ్యాధులు దేశములపై వ్యాపించి
నప్పుడు మాంసాహారులుకూడ వ్యాధులు హెచ్చునను భయంబుచే
నద్దురాహారము నుపయోగింపరు. మాంసాహార నైపుణ్యముగల
చోట మశూచికాది వ్యాధులు వ్యాపించెనేని మనుష్యులఁ జెళ్లపెళ్ల
విఱిచి చంపును. సదాచార సంపత్తిగల చోట నట్టి రుజలు వ్యా
పించవు. వ్యాపించియుండ్రొంపరలో శమించును. పండిత పామరుల
కిది యనుభవ సిద్ధంబు. 566

ఉ॥ గారెలు బూరెలప్పములు, కమ్మని శాకము లూరుగాయలుం
జారులు దప్పళంబులునుఁ, జక్కెరలుక్కెరలట్లు బెల్లమిం
పారెడు పప్పు నేయి ఘన, మా పరమాన్నముగల్గియుండఁగా
సారెకు శల్యరక్తతర, సంబులఁ జిత్తముఁ జేర్పనేటికిన్. 567

సీ॥ కాకరి బెండ వంగ సొర బీరయుఁ బొట్ల
మొదలైన కాయలు పొదలుచుండఁ
గందులుల్వలు సెనగలు పెసల్ మినుము లిం
క ననేక సూపవర్గంబులుండఁ
గంద పెండలము పొక్కుఫుఁ జేమ బంగాళ
దుంప లెన్నెన్నియో దొరకుచుండ
గోంగూర నెఱితోటకూర బచ్చలి పుల్ల
బచ్చలికూరలు ప్రబలుచుండఁ
బనసకాయలు మామిడిపండ్లు ద్రాక్ష
పండ్లు చక్కెర కేళీలు బహువిధంబు
లైన నారింజపండ్లు పూఁదేనెలుండ
మనుజుఁడాశింపనేల దుర్మాంసమునకు. 567

సీ॥ చవులకై మాంస భక్షణ మొనర్చెదరన్న
　　　　నుప్పు కారము సేర్ప కొప్పురాదు
పరిమళంబునకునై పాటింతురన్నచో
　　　　నంత దుర్గంధ మెందైనలేదు
వెల తక్కువని మెక్కఁదలఁచెదరన్నచో
　　　　దక్కిన కూరల ధరలు సాక
పరిశుద్ధమని దీని వాంఛింతురన్నచో
　　　　మలమూత్ర రక్తముల్కలిగియుండు
　　నసము కొలకు దీని నాదరించెదరన్న
　　భవ్య సభలయందుఁబనికిరాదు
　　పుణ్యకార్య వేళఁబొసగదు మాంసంబు
　　దానికింత మోహ మూనసేల. 5౬8

సునీలుఁడు

శ్రీమంతులగు రాక్షసులందఱు మాంసాహారులేకదా? 5౬9

వరవరముని

అకారణంబుననే రాక్షసులు మహాబలాఢ్యులయ్యు సంఘ మెక్కువగా నుండియు బహువిధ యత్నము లొనర్చియు నమృత రసం బునుఁ బ్రాపించలేకైరి. హింసా తత్పరులగుటచేతనే కద్రూనందనులు చేతికందిన సుధ, నొక్క బిందువైనం గ్రోలఁజాలరైరి. వేలుపులు దుర్బలులయ్యు నల్పసంఘము గలవారలయ్యుఁ బీయూషము నధీనము సేసికొనిరి. మృగములలో సింగములు, సివంగులు, పులులు, నక్కలు కుక్కలు, తోడేళ్లు, మాంశాశనంబులగుటవలనఁ గ్రూర మృగములని పేరుఁబొందినవి. పక్షులలో గ్రద్దలు, కాకులు, బందిపోతులు, కొంగలు, కొక్కెరలు మాంసాశనములైనందున లోకోపకారమున కయోగ్యములైనవి; పాములు, తేళ్లు, మండ్రగబ్బలు, చుంచులు, మూషకం

బులు, పందికొక్కులు హింసాసక్తములైనందువల్ల మనుష్యులు వానిని వధింపుచున్నారు. కీరములు, పావురములు, గోరువంకలు, కోకిలములు, గువ్వలు, హంసలు హింసాసక్తములు కానందువల్ల నరులు వానినిఁ బ్రేమించుచున్నారు. గోవులు, బఱ్ఱెలు, వృషభంబులు, గజంబులు, హయంబులు, గార్దభంబు లొంటెలు, గొఱ్ఱెలు, మేకలు సాధుజంతువులగుటచే గడ్డిగాదములువేసి నరులు వానింగాపాడుచున్నారు. గోవు కాన్పునకొకదూడనీనినను గోవులు వృషభంబులు వేనవేలుగాఁ బెరిగి లోకోపకారంబొనర్చుచున్నవి. పులియుఁ బామునుఁ గానుపునకనేక పాకంబులనీనినను తదీయజంతువులు వృద్ధిఁజెందలేవు. హింసయందుండు నపాయము, నహింసయందుండు లాభంబు దీనిఁబట్టి తెలుసుకొనుము. 570

సుశీలుఁడు

కాయలు దుంపలు మొదలగువానియందు జీవుండులేడా? యున్నచో శాకాహారంబుమాత్రము దోషముకాదా? 571

వరవరముని

కాయ లాకులు మొదలైనవానియందు జీవుండునుఁ బ్రాణంబులును లేకపోలేదు, కాని వానికి మనస్సు లేదు. పశు పక్షి మృగాదులకు మనస్సున్నదికాని కార్యనిర్ణయము సేయు బుద్ధిమాత్రములేదు. పశ్వాదులకు మనస్సున్నందువల్లనే యజమానునిఁగాంచినప్పు డంభా యని యఱచును. చెంతకుఁబోయిననాకు. నింటిదగ్గఱ విడిచినచోఁ గర్తృక్షేత్రమునకేపోయి నిలుచును. పొలమునుండి విడిచినచో యజమానుని యింటికివచ్చి నిలుచు. వెండియు మనస్సుండుటచేతనే పశ్వాదులకు భయముకలుగుచున్నది. బుద్ధిలేకపోవుటచేఁ గామము గలిగినప్పుడు తల్లిపై నెక్కుచున్నవి. భయాభయ జయాపజయాదులు లాభాలాభాదులు గ్రహించలేకయున్నవి. యదేవిధంబునఁ గాయలు దుంపలు మొదలగువానికి సస్యములకుఁ బ్రాణాదు లుండుటవల్ల వృద్ధి

క్షయాదులు గలుగుచున్నవి. మనస్సు బుద్ధి లేకపోవుటచే సుఖదుఃఖంబులు లేకయున్నవి. సస్యాదులకు మనము వృద్ధినొందించునప్పుడు సంతోషించుటగాని క్షయింపఁజేయునప్పుడు దుఃఖముగాని చెందినట్లు కానంబడదు. కాయ లాకులు దుంపలు ధాన్యములు మొదలైన శరీరములుదాల్చిన జీవులు తమశరీరము లుత్తమ శరీరుల కొసంగినందున దేవతానివేదన ప్రభృతి సత్కార్యంబుల కుపయోగించి తదుపరి నుత్తమజన్మంబు నెత్తుటకు వీలగును. కాబట్టి భగవంతుఁడు వాని మేలుకొఱకు వానినట్లు సృజించెను. 572

సుశీలుఁడు

మత్స్యభుక్కులు మొదలైనవారి నట్లేయనుకొనరాదా ? 573

వరవరముని

ఎంతమాత్రము వీలులేదు. పశు పక్షి మృగ మీనాదులకు మనవలె బుద్ధిమాత్రము లేదుగాని సుఖ దుఃఖముల గ్రహించు మనస్సు గలదు. నిద్రాహార భయ మైథునంబులునుఁగల వకారణంబున వాని వధింపరాదు. వధించినచోఁ దప్పక ద్రోహియగువాఁడు పాపంబుఁజెందును. 574

సుశీలుఁడు

మాంస వర్జితులకంటెను మాంసాహారు లధికముగానున్నారే.

వరవరముని

అధికసంఖ్యాకులున్నపక్షము మంచిదని తలంచితివేని కాఁబోలు నది చాలాపొరపాటు. ఎందుకంటివేని నేదేశమందైన నేగ్రామము నందైన బుద్ధిమంతులు కొలఁదిగాను బుద్ధిహీనులు విశేషముగా నుందురు. లోభులు పామరులు పేదలు బహుసంఖ్యాకులుగాను దాతలు పండితులు ధనికులు నల్పసంఖ్యాకులుగా నుందు రట్లే మాంసాహారులు విశేషసంఖ్యగలవారైన నల్పసంఖ్యగల మాంసవర్జి

తులే మంచివా రది యట్లుండఁగా మాంసవర్జితు లతిసుకుమారులు. వారు శాస్త్రంబులు సమువుటకు నితరులకుబోధించుటకు జపతపంబు లొనర్చుటకు మానసిక వ్యాపారంబు లొనర్చుటకుఁ దగియుందురు. వారు వ్యవసాయము మొదలగు మోటుపనులు సేయఁజాల రట్టివారి కన్న వస్త్రాదులు సంపాదించిపెట్టుటకు మాంసాహారులను సహితము భగవంతుఁడు వృద్ధిచేయుచున్నాఁడు. కానిసవృత్తి చేయువారిలో దఱచుగా నామిషాశనులేయుందురు. తరసాశనులు మానసిక వ్యాపార మగు పారలౌకికయోచన నెంతమాత్రముఁ జేయఁజాలరు. 576

సుశీలుఁడు

అట్లైనచో నామిషభక్షణము మానవలసినదేనా ? 577

వరవరముని

ఎవ్వరెట్లున్నను ముముక్షువైనవాఁడుమాత్రము వర్జించితీర వలయు నెన్నిపుణ్యకార్యంబు లొనర్చినను మాంసాహారియగు మను జుండెన్ని జన్మంబులకైన మోక్షంబు నొందఁజాలఁడు. తొల్లి వనవాస సమయంబున శ్రీరామచంద్రుఁడు ఖరదూషణాదుల వధింతునని మునుల కభయమియ్యఁగా సీతాదేవి రహస్యముగా రాఘవునిఁ గాంచి ప్రాణనాథా మునీంద్రులతో రాక్షసవధార్థమై ప్రతిజ్ఞఁజేసితివి సరేగాని,

శ్లో॥ త్రీణ్యేవవ్యసనాన్యత్ర కామజాని భవం త్యుత
మిథ్యావాక్యం పరమకం తస్మాద్గురు తరావుభౌ
పరదారాభిగమనం వినా వైరంచ రౌద్రతా.

ప్రతిపురుషునకు రాగముచే నుద్భవించిన మూఁడువ్యసనములు గలవవి యేవియనఁగా నసృతవాక్యము పరస్త్రీగమనము వైరము లేక జీవహింసాకృత్యమగు రౌద్రము. వానిలో, 578

శ్లో॥ మిథ్యావాక్యం నతే భూతం నభవిష్యతి రాఘవ
కుతోభిలాషిణాం స్త్రీణాం పరేషాం ధర్మనాశనమ్.

అబద్ధవాక్యము నీకు భూత భవిష్యత్కాలములయందులేదు. ధర్మ నాశనమైన పరాంగనాభిలాష యెక్కడిది. ఈరెండును లేవనుట. 579

శ్లో॥ తృతీయం యదిదం రౌద్రం పరప్రాణాభి హింసనమ్.
నిర్వైరం క్రియతే మోహాత్తచ్చతే సముపస్థితమ్.

మూడవదియగు పరప్రాణాభిహింసాకార్యక్రమమగు పాపము పామరులు మోహముచేఁ జేయుచున్నారు. దానియందు మీరును బ్రవర్తింపబోవుచున్నట్లు తోఁచుచున్నది. పూర్వ మొక తపస్వికడకు నింద్రుఁడువచ్చి కరవాలమొకటియిచ్చి నేను మఱలవచ్చునఱకు దీనింగాపాడుచుండుమని చెప్పిపోగా నత్తపస్వి తపస్సుమాను కొని యాయుధసంరక్షణార్థము చేతఁబట్టితిరుగుచు జంతువధఁజేసి నరకముఁజెందె నక్కతంబున హింసాకార్యము మంచిదికాదని దాశరథికి జెప్పె నమ్మాటలకు రాఘవుండు సంతసించి ప్రాణనాయకీ! నీవు చెప్పినట్లు నిష్కారణహింస పాపంబకాని సాధుజనరక్షణార్థమొనర్చు దుష్ట సంహారము పుణ్యంబిచ్చుచున్నదని సమాధానముఁజెప్పె నిందువలన నిర్వైరముతోఁగూడినహింస పాపప్రదంబని సీతారాముల వాక్యములచేఁ దేలినది. ఇదియిట్లుండఁగా నొకానొక సమయంబున శ్రీకృష్ణుఁ డర్జునునితో నన్నృతముకంటె హింసాకార్యము పాపమని వక్కాణించె. మాంసాహారికి దయా సత్య శౌచములుండవు. మనో బుద్ధులు మాలిన్యములైయుండుటవలన నామిషభక్షకులకు జ్ఞాన భక్తి వైరాగ్యములు నిల్వవుకనుక వారు భగవదనుగ్రహమున కెన్నటికిఁ బాత్రులు గారు. 580

# సురాపాననిషేధము

### సుశీలుఁడు

స్వామీ! కొందఱు రామానుజీయులు సురాపాన మొనర్చుచున్నారు మంచిదేనా? 581

### వరవరముని

శిష్యా! వైష్ణవచిహ్నంబులుగలవాఁడైనను సురాపానమొనర్చెనేని వాఁడు రామానుజీయుఁడుగాఁడు. సురామాంసంబులఁగాంచినప్పుడు వైష్ణవుఁడు సచేల స్నానమాచరింపవలయునని శ్రీరామానుజయోగీంద్రులు చెప్పి రది యట్లుండఁగాఁ బానరతునకుఁ బరలోక మట్లుండ నిచ్చి యిప్పుడే మహాబాధగల్గుచున్న దెట్లందువా త్రాగుబోతు దినమునకు నూఱురూప్యంబు లార్జించినను సదా దారిద్ర్యమునుఁ బొందుచున్నాఁడు. పెద్దలార్జించిన ద్రవ్యమును వృథా వ్యయముసేయుచున్నాఁడొకప్పుడు పెద్దల దూషింపుచున్నాఁడొకప్పుడు దిగంబరుఁడుగా నొకతఱి బలహీనుఁడుగా నొకసారిఁ బిచ్చివాఁడుగా నొకవేళ వాచాలుఁడుగాఁ గనిపించుచు నిష్ప్రయోజకుఁడైయున్నాఁడు. లోకమున నందఱికిది తెలిసినవిషయమేకదా. 582

### సుశీలుఁడు

మద్య మాకసంబునఁ జెట్టునందుఁ బుట్టుచున్నది. యాకాశతీర్థమని విఖ్యాతివడసియున్నది. జీవహింసాకార్యమూ కాదు. దానిని సేవించినచో దోషమేమి? 583

### వరవరముని

ఇది జన్మముచే మంచిదేకావచ్చు నంతేకాక దీనికిఁ బ్రసన్నాయని, గంధోత్తమాయని పేరులున్నవి. ప్రసన్నా యనఁగా నిర్మలమైనదని, గంధోత్తమ యనఁగా సుగంధముగలదియని నామములున్నను జన్మముచే మంచిదైననుఁ దమోగుణప్రధానమైనదిగనుక కల్లుగుణముచే

హీనమైనది. గుణహీనమైనవస్తువును సత్పురుషులు పరిగ్రహించరు. కొండతంగేడు పూలందముగానున్నను గౌరవింపఁబడవు. మొగలి పూవు ముండ్లతోనున్నను సేవ్యమైయున్నది. విదురుఁడు దాసీపుత్రుఁడైనను గుణవంతుఁడగుటచే లోకపూజ్యుఁడయ్యెను. దుర్యోధనుఁడు రాజరాజైనను గుణహీనుఁడగుటవల్ల నిందితుఁడయ్యెను. కావున మత్తు గలిగించు గంజాయి నల్లమందు పొగాకు సారాయములవలనఁ దమోగుణము వృద్ధిఁబొంది యుభయలోక సుఖంబులఁ జెఱచుచున్నది. 584

సుశీలుఁడు

పూర్వయుగములలోఁగూడఁ గొందఱు సురాపానమొనర్చినట్లున్నది. బలరాములవారెప్పుడు పానాసక్తుఁడైనట్లు వినుచుంటిమిగదా ? 585

వరవరముని

పూర్వులు సురాపానమొనర్పలేదని యెవ్వరుచెప్పిరి? పూర్వీకులందఱు పుణ్యాత్ములనియు నాధునికులందఱు పాతకులనియుఁ జెప్పవీలుగాదు. ముఖ్యముగా రాక్షసులలోఁ గొందఱు తామసులలో గొందఱు మద్యపానమొనర్తురు. సాత్వికులకిది యసహ్యంబగుటవలనఁ ద్రావరు. బలభద్రుండు సురాపానమొనర్చినను దదీయ పాపం బతని కంటదతండు భగవదంశసంభూతుఁడు. దుష్టనిగ్రహ శిష్టపరిపాలనార్థమవతరించిన మహాపురుషుఁడు. కర్మవశ్యుండుగాని స్వతంత్రుఁడు గనుక వారిప్రవర్తనంబులన్నియు మన కనుష్ఠేయంబులుగావు. బలరాముండు ద్రావినది యిప్పటి కల్లువంటిదిగాదు. తానున్నచోటికి వరుణపుత్రిక వచ్చి యొక చెట్టుతొఱ్ఱలోనిలిచి కావలసినంత గంధోత్తమ నిచ్చుచుండు నది యట్లుండఁగాఁ గల్లుద్రావుట, బ్రహ్మహత్య, స్వర్ణస్తేయము, గురుపత్నీగమనము సమాన పాపములని శాస్త్రోక్తి గలదు. రెండియు నర్జునుం డభిమన్యు వధచేఁ గలంగి ప్రతిజ్ఞ సేయునప్పుడు,

శ్లో॥ మద్యపో భిన్న మర్యాదః, కృతఘ్నో భ్రాతృనిందకః
తేషాంగతి నియాంతుశీఘ్రం, నచేద్ధన్యాం జయద్రథమ్

రేపటి సూర్యాస్తమయములోగా జయద్రథునిఁ జంపకపోయితినేని సురాపాయి, మర్యాదారహితుఁడు, కృతఘ్నుఁడు, సోదర నిందకుఁడు పొందినగతికిఁ బోవుదునని చెప్పె నందువల్ల మద్యపానము దోషమని తేలినది. మఱియు సురావిక్రేత పొందినగతి రామద్రోహి పొందునని భరతస్వామి ప్రతిజ్ఞఁజేసెను. 586

దేవసభలో హరిశ్చంద్రునివిషయమై వసిష్ఠ విశ్వామిత్రులు కలహించినపుడు హరిశ్చంద్రుం డనృతంబాడినచో గాడిదనెక్కి సురం గ్రోలుచు యమపురి కేగుదునని వసిష్ఠుఁడు శాబ్దిసేసెను. శుక్రాచార్యుండు సురాపాయి మహాపాపియగునని శాపంబిచ్చెను. సురాపాన మత్తులగు నలకూబర మణిగ్రీవులు నారదునిఁ దిరస్కరించి యతని శాపంబుచే వృక్షంబులైరి. కీచకుండు త్రాగుఁబోతగుటచే యుక్తాయుక్త పరిజ్ఞానంబులేక నూటైదుగురుతమ్ములతో నేకకాలంబున మడిసెను. ప్రభాసతీర్థంబున యాదవులు మితిమీఱినట్లు మద్యపానంబొనర్చి పరస్పర కలహంబుచేఁ జచ్చిరి. సజ్జనులగు లౌకికులే త్రాగుఁబోతులఁగాంచి నిందింతురు. వైదికులగు భాగవతుల కవశ్య వర్జనీయంబని చెప్పవలయునా. 587

## దురాచారనిషేధము

### సుశీలుఁడు

స్వామీ! రామానుజీయులమని చెప్పుచుఁ గొందఱు వామాచారపరాయణులు శిష్యురాండ్రచే మైథున కైంకర్యము స్వీకరింపుచున్నారే వారిసమాచారమెట్టిది? 588

పరవరముని

శిష్యా! రామానుజీయులలోఁ గూచి మూచి మతస్థులను నద్వైతశాఖీయులగు నచలపరిపూర్ణులను వామాచార శాక్తేయులను గుహ్యచాపల్య జిహ్వాచాపల్యములచే నిదికలుగుచున్నది. ప్రభుసమ్మిత మగు వేదమునందు, నానృతం వదేత్, న కలంజం భక్షేత్, న పరదారాన్ గచ్ఛేత్, న సురాంపిబేత్ = అబద్ధమాడఁగూడదు, గంజాయి మొదలగు మత్తువస్తువుల భుజింపరాదు, పరదారనుఁ బొందఁగూడదు కల్లుద్రావరాదు అని చెప్పఁబడియున్నది. 589

సుశీలుఁడు

పరదారనుఁ బొందగూడదని వేదమందున్నదిసరేగాని శిష్యురాండ్రను బొందఁగూడదని చెప్పలేదుగనుక దోషములేదందురేమో

పరవరముని

అట్లైనచో ననేకప్రమాదములువచ్చునెందుకంటివేని.

శ్లో॥ గు శబ్దం త్వంధకారస్తు, రు శబ్దం తన్నిరోధకః
అంధకార నిరోధత్వా, ద్గురు రిత్యభిధీయతే

గు అనఁగా నజ్ఞానమను నంధకారము, రు అనఁగా దాని నిరోధించువాఁడు. శిష్యుల యజ్ఞానమును బోగొట్టువాఁడు గురువని చెప్పఁబడుచున్నాడు. స్త్రీ పురుష సాంగత్యము రాజస తామసక కృత్యము. దానిలోఁ బరాంగనాసాంగత్యము పాపభూయిష్ఠమై యపకీర్తికరమై వివిధరోగాస్పదమై యాయుఃక్షీణమై ప్రాణాపాయకరమై యుంటచే నజ్ఞానకృత్యమేగాని జ్ఞానకృత్యముగాదు శిష్యులు ధన ధాన్య వస్త్రాదులిచ్చి నమస్కారాది పరిచర్యలు చేయవలయును. గురుండైనవాఁడు శాస్త్రార్థముదెలిపి దీవించుచుండవలయు నింత మాత్రమేకాని గురువుగారు శిష్యురాండ్రతో భోగించి వర్ణసంకరులగు బిడ్డలఁగనిపించి సంసారము వృద్ధిపరపుమని యే శాస్త్రముల

యందునులేదు. పిల్లలఁగనిపించుటకుఁ గామంబడంచుటకు స్త్రీకి మగండే చాలియుండఁగా గురువుగాఁడెందుకుఁ దగులఁబెట్టుటకా. జ్ఞాన వృద్ధి చేయవలసిన గురువు గుహ్యచాపల్య జిహ్వాచాపల్యములు గల వాఁడయ్యెనేని ముముక్షువులకు నాధారమేమిగలదు. చేనికాపుదలకు వేసిన కంచె పైరు మేసినచో సస్య మెట్లు వృద్ధిఁజెందును. 591

సీ॥ పాఁతళ్లు గాదె లపహరించిననైన
నుఱుధాన్య మెచ్చోట నుంపవలయు
సరవిపేటిక లదృశ్యముసేసిననైన
ద్రవ్యంబు నేరీతి దాఁచవలయు
నన్నంబుచే నామయముగల్గిననైన
నరుఁడేది మెక్కి మనంగవలయుఁ
జెనుదండియమ్ము గ్రింగినచో వివిధచేల
విసరంబు దేనిపై వేయవలయుఁ
జంటిపాపల జనయిత్రి చంపఁదలఁపఁ
జెలఁగి పెరవారలెవరు రక్షింతు రట్లె
గురుఁడు దుర్నీతిపరుఁడైన నరసి శిష్య
జనుల నెవ్వాఁడు ముక్తికిఁబనుపఁగలఁడు. 592

వ॥ శిశ్నోదర జిహ్వాపరాయణుండు దయాహీనుఁడు సోమరి భగవద్భక్తిశూన్యుఁడు శ్రద్ధారహితుఁడు సంసారవ్యాపారనిరంతరుఁడు నవిద్వాంసుఁడైనట్టివాని గురునిగా బుద్ధిమంతులు పరిగ్రహింపరాదు. గ్రహించినచోఁ గొఱవితోఁ దలగోకికొన్నట్లగును. గురుండగువాఁడు శిష్యురాలినిఁ బరకాంతగాదని పొందఁదలంచినను బ్రమాదమువచ్చు నెట్లంటివేని, మహాత్ముండని పేరుగొన్నవానియొద్దకు బోధకొఱకు నన్నకూఁతుండ్రు, తమ్మునికూఁతుండ్రు, సహోదరుల భార్యలు, మేనమామల భార్యలు, మేనత్తలు, మేనల్లుండ్రుల పెండ్లాలు, యింక

నెందఱోవచ్చి మంత్రోపదేశముఁ జెందుదు రట్టివారినందఱిని వావి వరుసలు లేకుండ మైథున కైంకర్యమున కాకర్షించి లోకమర్యాద శాస్త్రమర్యాదలు సెడఁగొట్టవలసినదేనా. బాల్యవితంతువులుకొందఱు బ్రహ్మచర్యము నవలంబించియుండి మోక్షాపేక్షచే గురువుగారి నాశ్రయింతు రట్టివారిని మైథునకైంకర్యమున కీడ్చినచో వ్రేఁకటిఁదాల్చి లోకాపవాదంబు సహింపలేక భ్రూణహత్యలు చేయుటో బలవన్మరణముఁ జెందుటో సంభవించు నట్టికార్యంబులకు గురుండు లక్ష్యంబు కావచ్చునా. దేశికుండైనవాఁడు ముందు హృషీకేశుండగు భగవంతుని దయకుఁ బాత్రుఁడై యింద్రియంబులజయించి దరువాత గురుపదవి నధిష్ఠించవలయును. గురుండగువాఁడు శిష్యులను శిష్యాంగనను జారత్వ చౌర్య ద్యూతాది దుష్టకార్యములఁ బోనీయకుండ మధు మాంసాహారులు గాకుండ రక్షింపవలయు. భగవన్నామోచ్చారణము భగవత్కథాశ్రవణము శిష్యులచే నెడతెగకుండఁ జేయింపవలయును.

సీ॥ పొలములందునఁ గృషీవలుఁడు సస్యంబులఁ
బోడిమిమీఱఁ గాపాడునట్లు
బాధలువడి కుటుంబము నహర్నిశమును
గృహమేధి చెలఁగి రక్షించుపోల్కిఁ
దనరాష్ట్రముననుండు జనుల కే కష్టంబు
లేకుండ రాజు పాలించురీతి
సేనాధిపతి వాహినీనికరంబుల
మించి నేర్పున నడిపించుమాడ్కి
వల్లవుఁడు శృంగిణీచయం బుల్లసిల్లఁ
గాచుచందాన శిష్యులఁ గావవలయు
సద్గురుండగువాఁడు మోక్షప్రదాత
యగు రమాపతి మహిమంబు లానతిచ్చి. 594

వ॥ శిష్యు లజ్ఞానమునవదలి జ్ఞానసిద్ధినిఁ బొందువరకును నానా ర్యుఁడు శ్రమమనిచూడక ప్రతిఫల మపేక్షింపక బోధింపవలయు నటుపిమ్మట ఛాత్రులవల్ల గురువుగారి కిహ పరలోక సుఖంబులు సిద్ధించును. 595

సు శీ లుఁ డు

శ్లో॥ న వైరాగ్యాత్పరోలాభః, న బోధాత్పరమం సుఖం
న గురోరపి పరస్త్రాతా, న సంసారాత్పరోరిపుః

వైరాగ్యమునకుమించిన లాభమును, భగవద్బోధకు మించిన సుఖమును, గురునకుమించిన రక్షకుండును, సంసారమునకు మించిన శత్రువును లేదని చెప్పఁబడియున్నది. అట్టిరక్షకుఁడైన దేశికుండడిగిన కోర్కి వ్యర్థముచేయవచ్చునా శిష్యులైనవారు. 596

వ ర ప ర ము ని

గురువుగారేదో వ్యథచేఁ జావవలయునని యోజించి యడిగి నప్పుడు శిష్యుఁడు విషంబుఁదెచ్చి యీయఁగూడనట్లు దురాగ్రహ తుండగు దేశికుని కాంక్ష నెఱవేర్పరాదు. నెఱవేర్చినచో నిద్దఱు చెడిపోవుదురు. 597

సు శీ లుఁ డు

దురాగ్రహయనఁగా నర్థమేమో సెలవిండు. 598

వ ర ప ర ము ని

శ్లో॥ యశ్శాస్త్రవిధి ముత్సృజ్య, వర్తతే కామకారతః
న ససిద్ధి మ వాప్నోతి, న సుఖం న పరాంగతిమ్.

ఎవ్వఁడు శాస్త్రవిధినివదలి తనయిష్టమువచ్చినట్లు నడచు న్నాడో వాఁడు సిద్ధిని సుఖమును మోక్షమునుఁ బొందడనియు.

శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే, కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వాశాస్త్రవిధానోక్తం, కర్మకర్తు మిహార్హసి.

అకార్యకరణమును చేయవలసినదానిని చేయుటకును చేయరాని దాని మానుటకు సజ్జనాసికు శాస్త్రమే ప్రమాణము. శాస్త్రోక్త విషయమును దెలుసుకొని కర్మమొనర్పుమని గీతాచార్యులవా రానతిచ్చిరి. 600

(భగవద్గీత - షోడశోఽధ్యాయము)

మఱియు రామబాణముచే వాలి భూమిమీదంబడి తత్త్వము దెలియక రాముని నిందించె నయ్యవసరంబున రఘుపుంగవుండు వాలింగాంచి,

శ్లో॥ జ్యేష్ఠోభ్రాతా పితాచైవ, యశ్చవిద్యాం ప్రయచ్ఛతి
త్రయస్తేపితరోజ్ఞేయా, ధర్మేపథిహివర్తినః

ధర్మమార్గమున వర్తించువానికి నన్నగారు తండ్రి విద్యనేర్పిన వాడు నీముగ్గురు తండ్రులని తెలియవలయును. 601

శ్లో॥ యవీయానాత్మనః పుత్రః శిష్యశ్చాపి గుణోదితః
పుత్రవత్తే త్రయశ్చిన్త్యా, ధర్మశ్చేదత్రకారణమ్

తమ్ముడు, తన కుమారుడు, గుణవంతుడైన శిష్యుడు నీముగ్గురు పుత్రులుగాఁ దలఁపవలయు నందులకు విరుద్ధముగాఁ దమ్మునిభార్యయగు రుమతో భోగించితివి. దానిచే నిన్ను వధించితినని చెప్పెను. 602

(శ్రీరామాయణ కిష్కింధాకాండము)

ఈప్రమాణంబులచే శిష్యుని భార్యను, శిష్యరాండ్రను బొందినవాడు భగవన్నిగ్రహమునకు బాత్రుడగును. జ్ఞానముగల వాని కింతకంటెఁ బ్రమాణం బేమికావలయును. సత్పురుషు లెవ్వరు నీ మైథున కైంకర్యము నంగీకరింపకపోగాఁ బలువిధంబుల దూషించి యున్నారు.

శ్లో॥ మహత్సేవాం ద్వారమాహుర్విముక్తే
స్తమోద్వారంయోషితాంసంగిసంగః

మహాత్ములసేవ ముక్తిద్వారము స్త్రీ సాంగత్యముగలవారి
చెలిమి చీఁకటిద్వారమని వృషభదేవులు సెప్పిరి. 603

(భాగవత పంచమస్కంధము)

పూర్వకాలంబున యయాతిరాజు శుక్రాచార్య శాపముచే జరాభారమునొంది మరల నతనికృపచేఁ గుమారునివయస్సుఁ దీసుకొని యనేకవేలసంవత్సరంబులు కామసుఖంబు లనుభవించి నిర్వేదమునొంది తనభార్యంగాంచి,

శ్లో॥ యత్పృథివ్యాంవ్రీహిమయం, హిరణ్యం పశవః స్త్రియః
నదు హంతి మనః ప్రీతిం, పుంసః కామహతస్య తే

భూమియందు మంచి ధాన్యములు బంగారము పశువులు
సుందరవతులగు స్త్రీలు కామోద్రేకముగలవాని మనస్సునకుఁ దృప్తిఁ
గలిగింపఁజాలకున్నవి. 604

శ్లో॥ న జాతుకామః కామానా, ముపభోగేనశామ్యతి
హవిషాకృష్ణవర్త్మేవ, భూయ ఏవాభివర్ధతే

కాముకులకుఁ గామసుఖంబు లనుభవించుటచేఁ గామము
శాంతిఁబొందదు హవిస్సువేసినకొలఁది నగ్నిహోత్రుఁడు మండిన
ట్లభివృద్ధినొందును. 605

శ్లో॥ యా దుస్త్యజా దుర్మతిభి,ర్జీర్యతేయానజీర్యతే
తాం తృష్ణాం దుఃఖనివహాం, శర్మకామోద్రుతం త్యజేత్

తాను క్షీణింపుచున్నను నశింపనియాశను దుర్మతులు విడువలేరు. సుఖముఁగోరువాఁడట్టి కామమునుఁ ద్వరగావిడువవలయును.

శ్లో॥ మాత్రాస్వస్రా దుహిత్రా వా, న వివిక్తాసనో భవేత్
బలవానింద్రియగ్రామో, విద్వాంసమపికర్షతి

తల్లి సోదరి మఱియుఁ గూఁతురు మొదలైనవారితో నేకాసనంబునఁ గూర్చుండరా దెందుకనఁగా బలవంతములైన యింద్రియములు విద్వాంసునైనను లాఁగి దుర్మార్గమునఁ బడవైచును. 607

శ్లో॥ తస్మాదేతా మహంత్యక్త్వా, బ్రహ్మణ్యాధాయమానసం
నిర్ద్వంద్వో నిరహంకార,శ్చరిష్యామి మృగైస్సహ

పైనఁజెప్పిన కారణమువలననే నీయాసను నిర్జించి శీతోష్ణాది ద్వంద్వములను జయించి నిరహంకారుఁడనై బ్రహ్మమునందు మనస్సు నిలిపి మృగములతోఁ గ్రీడింతునని వనమున కేగెను. 608

(భాగవత నవమస్కంధము)

విశ్వామిత్రుఁడు మేనకతోఁ గ్రీడించిన దినంబులన్నియు విషప్రాయంబులై తపోభంగంబానర్చెనని చింతించి మరల వంచింపవచ్చిన రంభను రాయివిఁగమ్మని శపించి పిమ్మట సిద్ధిఁబొందెను. సౌభరి మాంధాతృపుత్రికల నేబదిమందిఁ బెండ్లియాడి చిరకాలంబు వారితోఁ గ్రీడించి కొంతకాలంబున కసహ్యపడి విసర్జించి తపస్సునేసి ముక్తి నొందెను. మరున్నందనుండు రాత్రికాలంబున లంకాపురస్త్రీలవీక్షించి యయోగ్య కాంతామర్మస్థానంబులు నిరీక్షించి పాపినైతినని దుఃఖించి రామనామస్మరణంబుచే నద్దోషంబు వదలెనని యూఱడిల్లెను. సవ్యసాచి స్వర్గంబుననుండఁగా నేకాంత గృహంబునందు నూర్వశివచ్చి మోహించి కౌఁగిలింపఁగా శాపంబునకైననోర్చి యామెనుఁ దిరస్కరించెను. ధైర్యవల్లీలవిత్రంబులగు కాంతలను వర్జింపవలయునని ప్రహ్లాదుండును స్వప్నమువంటి భార్యాపుత్రాది మోహము వదలింపుము కృష్ణాయని యక్రూరుండును భార్యయను సుడితోఁగూడిన సంసార సముద్రమని కులశేఖరాళ్వారును దారపుత్రాదులను నెండమావుల

యందలి మోహంబుఁదొలఁగింపుమని తిరుక్కచ్చినంబిగారును భగవంతునిఁ బ్రార్థించిరి. మఱియు యామునాచార్యులవారు రామానుజులవారు నంజియ్యరు మొదలగు మహాత్ములు సన్యసించుట స్త్రీసాంగత్య నిరసనార్థమేకదా, తొండరడిప్పొడియాళ్వారు వేశ్యాసమావేశము మానినప్పుడుగదా తమ్ము ధన్యులుగా నెన్నుకొన్నది. 609

సుశీలుఁడు

స్వామీ! యుగములనాటి మహానుభావులును రామానుజాది పూర్వాచార్యులును నిరసించిన కుమార్గమీ వామాచారు లేయధికారముచే విశాలమొనర్చిరి. 610

వరవరముని.

పూర్వకాలమునం దనేకోపాయంబులచేత ననేక జన్మంబుల సాధింపరాని మోక్షంబు రామానుజులవారు సర్వజీవులకుఁ గరతలామలకమగునట్లుచేసిరి. రామానుజమతస్థులందఱు ముక్తికేగినచోఁ దనకపాయంబు సంభవించునని ప్రకృతి వారినట్లల్లాడింపుచున్నది.

సుశీలుఁడు

రామానుజులవారి శిష్యులుగాని వారి తరువాతివారుగాని యీ వామాచార మనుష్ఠించిరేమో? లేనిచో నిప్పటివారి కెట్లు పట్టుపడును? 612

వరవరముని

శిష్యా! యెంతపిచ్చివాఁడవు. మల్లెచెట్టునం దుల్లియుఁ దొళసి చెట్టునందు దురదగొండియుఁ బుట్టదుగదా యట్లే రామానుజభక్తుల కెన్నటికి నట్టిదుర్గుణంబులు గలుగవు. మఱియు రామానుజులవారి శిష్యులలో నగ్రేసరుండగు కూరత్తాళ్వారాండళమ్మను వివాహముసేసికొని యావజ్జీవపర్యంత మామెతో భోగింపక భగవద్వరప్రసాదంబుచే సంతానమువడసెను. రామానుజులవారిపినతల్లికుమారుండగు నెంబారు గర్భాధానమునకేగి మూడురాత్రులు భార్యతో సంభాషణమైనఁ

జేయక నిలుచుండి నాల్గవదినము దైవరుల సన్నిధానమునకరిగి భగవ
ద్గుణానుభవము సేయుచుండెను. వెంటనే యెంబారు మామ
కూఁతురుచే యావద్వృత్తాంతమువిని యతీంద్రుని సన్నిధి కరిగి
యెంబారువార్త నెఱింగించి నాకూతురి నితనికి ధారవోసి చెడితినని
దుఃఖించె నమ్మాటలువిని యతీంద్రుం డెంబారుంగాంచి వత్సా!
నిషేకంబున కరిగినవాఁడవు కొన్నిదినంబులు విషయసుఖంబు లనుభ
వింపవలదాయని మందలించె. నెంబా రమ్మహాత్మునితో గురుప్రవరా!
యెంతటి కామాతురునకైనను మైథునసమయంబున నేకాంతస్థల
ముండవలయు నదియట్లుండఁగా దేవరవారు సర్వకాల సర్వావస్థల
యందు నాకంటియెదుట సాక్షాత్కరింపుచుంటిరి. గురునియెదుట
నేనెట్లు భార్యతో సంభోగింతునని పల్కఁగా భాష్యకారులవా రవ్వం
డితుని వైరాగ్యంబునకు నాచార్యభక్తికి నాశ్చర్యమొంది యెంబా
రులకు సన్న్యాసమిప్పించి మామగారి నూఱడించి పనిచిరి. తరువాత
నెంబారు లోకాచార్యుఁడై యనేక బద్ధాత్ముల నుద్ధరించెను. వేదాంతి
భాగవతసేవకు విరోధించిరని భార్య లిరువురినివిడిచి శ్రీరంగముఁజేరి
భట్టరువారిని సేవించి సిద్ధాంతము నుద్ధరించెను. 613

శ్రీకృష్ణపాదదేశికులవారు వివాహమైనది మొదలు భార్యతోఁ
బలుకక గురునికడ వినివచ్చిన వేదాంత శాస్త్రమంతయు రాత్రుల
యందు వ్రాయుచుండ నది గాంచి తల్లిగారు నంబిళ్ళకడ కేగి నమస్క
రించి స్వామీ! నాకుమారుఁడు నాకోడలిఁ గాంచినప్పుడెల్లఁ బిచ్చి
కేకలు వేయుచున్నాడు. ముందు నాకు వంశాభివృద్ధి యెట్లుకాఁగలదని
దుఃఖింపఁగా నంబిళ్ళగా రామె నూఱడించి శిష్యుండగు కృష్ణపాద
దేశికునిఁ బిలిచి నీకు నావంటి సంతానము కలుఁగును జాయతో సంయో
గముఁ గావింపుమనఁగా నతండట్లుగావింపఁ బిళ్ళలోకాచార్యులవారు
జనించిరి. తరువాత నళహియప్పెరుమాళ్ళనయనాచార్యులవా రుద్భ
వించిరి. కృష్ణపాదదేశికులవారు భార్యను స్వీకరించినది మొదలు శరీ

రాంతమునకును గురునాజ్ఞ ననుసరించి సంతానాపేక్షచే భార్యతో రెండుసారులుమాత్రమే భోగించెను. చూచితివా రామానుజసంబంధుల యింద్రియనిగ్రహము. 614

సుశీలుఁడు

ఆహాహా రామానుజీయులందఱు పూర్వమునుండి గాఢవైరాగ్యసంపన్నులై రాజస తామసంబుల నతిక్రమించి శుద్ధ సాత్వికులై నిరంతర భగవద్గుణానుభవకైంకర్యపరులై భాగవతాభిమానము గలిగి గురుసేవానిరతులైయున్నట్లు విశదమగుచున్నది. దీనినెఱింగినచో మధుమాంసస్వీకారము మైథునాంగీకారము ననార్యానుభవయోగ్యమై పాపభూయిష్ఠమై తుచ్ఛమై నరకార్హమై శ్రవణాసహ్యమై మోక్షవిరోధమై యున్నదిగదా దేశికోత్తమా ? 615

వరవరముని

అంతులకు సందియములేదు. దీనికొక్క ధర్మసూక్ష్మం బెఱింగింతు నాకొనుము. పరాంగనాసాంగత్యము పాపంబని వేదము విధించెను. వేశ్యాసాంగత్యముచేఁ దచ్ఛరీర రోమంబుల సంఖ్యాప్రకారము నరకముగలుగునని మహాభారతము విధించెను. శిష్యురాలితో భోగించినవాఁడు వధ్యుండని శ్రీరామచంద్రుఁడు వక్కాణించెను. గురుపత్నీగమనము పంచమహాపాతకములలో నొక్కటియని ధర్మశాస్త్రముచెప్పెను. శిష్యుని భార్య గురువుగారికిఁ గూతురుగనుక శిష్యునిభార్యతో భోగించినప్పుడు కూతురునుఁబొందిన పాపమునుఁ బొందుచున్నాఁడు. గురువుగారిచే భోగింపఁబడిన తన భార్యతో శిష్యుఁడు మరలభోగించినప్పుడు గురుపత్నీగమనదోషంబున కర్హుఁడగుచున్నాఁడు. గురు శిష్యు లిద్దఱు అకార్యంబుచే నరకార్హులగుచున్నారు. వేదాంతశాస్త్రవిచారపారంగతులై ముక్తిఁజెందవలసిన గురుశిష్యులు విషయపీడింబడి నరకమున కేగుచున్నా రాశ్చర్యమాశ్చర్యము. 616

సుశీలుఁడు

దేశికశిఖామణీ! చక్కని యుపమానంబులచే నామనస్సంశయములన్నియు నివారించితిరి. ఇప్పటికిఁ గృతార్థుండ నైతి. 617

వరవరముని

దీని నింకనుఁ గొంచెము చెప్పి విరమించెద నాలకింపుము. రఘువు, ఇక్ష్వాకు జహ్నుఁడు, సగరుఁడు, భగీరథుఁడు, నాభాగుఁడు, కల్మాషపాదుఁడు, భరతుఁడు, రంతిదేవుఁడు, దుష్యంతుఁడు, జనకుఁడు, పాండవులు మొదలగువారు సంతానాపేక్షతో ఋతుకాలములయందుమాత్రము భార్యతోఁ భోగించి కామవ్యసనమును శాంతింపఁజేసుకొనిరిగాని క్షతయోని నాసించినవారుకారు కనుకనే వారికి రాజర్షులని బిరుదు ప్రాప్తించె నట్టిభోగలాలసగల రాజులే నియమవ్రతముతో నుండునప్పుడు కేవల ముముక్షువు లెట్లుండవలయునో యాలోచింపుము. 618

సుశీలుఁడు

గురువర్యా! యింకొక్క సందేహంబుగలదు. కొందఱు గురువుగారి మలమూత్రవీర్యాదులు తీర్థప్రసాదంబులుగాఁ బరిగ్రహింపుచు నిట్లైనచోఁ నాత్మసంబంధంబుగలిగి తద్ద్వారా మోక్షము సిద్ధించునని చెప్పుచున్నారే దానిసంగతి యేమి? 619

వరవరముని

శిష్యా! నీవుచెప్పినవారు మానవులైజనించినను మానవత్వమింకనుఁబొందలేదు. ఎందుకనఁగా మనుజ మలమును గ్రామసూకరంబులు కుక్కుటంబులు కాకులు బట్టగొడ్లు కుక్కలు తఱచుగా మెక్కుచుండు వాడుక గలదుగాని మనుజ మూత్ర వీర్యంబులను భక్షించుజంతువు లింతవఱకు భగవత్సృష్టిలోఁ గనఁబడలేదు. దానికిఁ జాలుమాలినవారు తినిపించినవారు యెంతనీచులని చెప్పవచ్చును.

నారికేళఫలంబులు పులిహోర కదంబము దోసె వడలు చక్కెర పొంగలి మొదలగు ప్రసాదములు కర్పూర తులసీ మిశ్రమగు సాలగ్రామతీర్థము సమృద్ధిగానుండగాఁ దుష్టపదార్థంబులిచ్చు గురుండును స్వీకరించు శిష్యులు నెంత జఘన్యులో యోజింపుము. 620

సు శీ లుఁ డు

అయ్యా మీరైననుఁ బంచసంస్కారసమయంబున శిష్యులకుఁ బంచగవ్యమిచ్చుచున్నారుగదా? పశుమలమూత్రములకంటెను గురు మలమూత్రములు నీచమా? 621

వ ర వ ర ము ని

వత్సా! గోమయము గోమూత్రము పావనంబని శాస్త్రము విధించుచున్నది. గోమయముచే స్థలశుద్ధిచేయుదురు, గోక్షీరము భగవదభిషేకమున కుపయోగింపుచున్నవి. యావునేతిచే నలువదియారు పిండివంటలు చేయుచున్నారు. ఆవుపెరుగు సదాచారసంపత్తిగలవారెక్కడ లభించునాయని కోరుచున్నారు. ఆవు మీఁగడలోఁగాని జున్నులోఁగాని చక్కెరఁగలిపి పుచ్చుకొన్నచో స్వర్గసుఖంబు కనిపించునుకాని గురువుగారిపేడతో స్థలశుద్ధి నెవ్వరుచేయుదురు చేసిన నెవ్వరొప్పుకొందురు. సర్వజనులు చీ చీ యని నిందింతురు. మనుజుఁడు మలమూత్రవిసర్జనముసేయునప్పుడు జలముతో శుద్ధిచేయవలయునని శాస్త్రము విధింపుచున్నది యట్లుచేయువారే సభాపూజ్యులుగా నెన్నఁబడుచున్నారు. గోమయ క్షీర దధ్యాదులు కన్నులనద్దుకొని కొనుచున్నారు. గురువుగారి పురీషప్రసాదంబుల నెవ్వరు కొనిరెదరు. దొరతనము వారెఱింగినచో విక్రేతకుఁ గ్రూరదండనము విధింతురు. పట్టణంబులలో గోవులెన్నియున్నను గోమయంబుదొరకుట దుర్లభంబు మనుష్యమలంబుగల పాయఖానాలు శుద్ధిచేయుటకు వేతనములిచ్చి జీతగాండ్రనుంచుచున్నారు. ఇంతమాత్రము లౌకికజ్ఞానములేనివారికి వేదాంత మెట్లు తెలియును. పరిశుద్ధుండగు భగవంతు నెట్లు సమీపింప

తురు. పట్టణవీథులయందేగునప్పు డీసలావలనైపులఁ బాఱుచుండు మూత్రమిశ్రితజలం బెంత దుర్గంధముగానుండును. లక్షగోవు లొకే ప్రదేశమందుండి మూత్రము విడిచినను దుర్గంధలేశమైనఁ గనిపించునా. సర్వేశ్వరుం డేవస్తు వెందుకై నిర్మించినాడో యది దానికే పనికివచ్చు నితరమున కుపయోగింపదు, సటికంటే నేయిగొప్పదైన నన్నమునం దుపయోగించునుగాని గంఘూష స్నానపానముల కుపయోగించునా, కస్తూరి కర్పూరానుబోధాదులు సుగంధమున కుపయోగించునుగాని భోజనపానార్హంబులగునా, తులసీదళము భగవత్పూజకేగాని నైవేద్యార్హ మగునా, గోవుకంటె గురువుగారు గొప్పవారైనను దేనియుపయోగము దానికే చెల్లును. గోవునందుద్భవించు వస్తువులు గొన్ని పనుల కుపయోగించును. గోవు గురునిభంగి శాస్త్రజ్ఞానము సంపాదింపలేదు. జ్ఞానబోధఁ జేయఁజాలదు. గురువుగారి మలమూత్రాదులు పంచగవ్యంబులవలెఁ బరిశుద్ధంబులుగావు. గోసంబంధ పదార్థంబులు పావనంబులు. గురుశరీరము పావనంబెకాని తచ్ఛరీరజనిత పురీషాదులు బహిర్దేశ విసర్జనీయంబులు. 622

సుశీలుఁడు

ఇట్టినీచయోచన యీవామాచారుల కేల పొడమినదో? 623

వరవరముని

తొల్లి పాండవు లరణ్యమున కేగునప్పుడు ద్రౌపది తడిసవస్త్రముతో వెండ్రుకలు వ్రేలాడవైచుకొని వెళ్ళుచుండె దీనికిఁ గారణమేమని ధృతరాష్ట్రుండడుగగా సంజయుండతనింగాంచి యోరాజా! రాఁబోవుసంగరంబునఁ గౌరవులందఱుఁ జావఁగా వారిభార్య లిట్టి వైఖరితో నేడ్తురని సూచింపుచున్నదని చెప్పె నట్లే యీవామాచారులు శాస్త్రవిరుద్ధమైన యాచార మవలంభించి ముందు నరకంబునఁగూలి మలమూత్రాదు లీరీతిగాననుభవింతురు. తరువాత గ్రామసూకరాది

జన్మంబులెత్తుదురని భగవంతుఁడు మనకు సూచనయిచ్చుచున్నాఁడు సందేహములేదు. 624

సుశీలుఁడు

ఈరీతిఁదినిపించిన యాచార్యుండేమగునోగదా ? 625

వరవరముని

ఇతరుల కేది యెవ్వఁడు దానమిచ్చునో మఱుజన్మంబున వాని కదియే లభించును. పూర్వమొకఁడు తాంబూలములో మేఁకపెంటిక లుంచి భావమఱఁదికి నగతాళికై రహస్యముగానిచ్చి శరీరాంతంబునఁ బరలోకంబున కేఁగఁగా యముండతనిఁగాంచి దుర్మతీ నీవితరదానంబు లేవియుంజేయక మేఁకపెంటికలుమాత్రము భావమఱఁదికిచ్చితి నవి మాత్రము వాములుగాఁబెరిగియున్నవని చూపించి వాని కాహారం బుగా విధించెనని చెప్పుదు రట్లే మలమూత్రాదులు శిష్యులకుఁ దీర్థ ప్రసాదంబులుగానిచ్చిన దుష్టగురువునకు నా యా పదార్థంబులే పర లోకంబునందును రాఁబోవుజన్మంబునందును నాహారపదార్థంబులై వృద్ధినొందు ననఁగా వానికిఁదగిన సూకరాది జన్మంబులెత్తుననుట.

సుశీలుఁడు

గురువుగారనఁగా జ్ఞానానుష్ఠానంబులుగలవారుగదా? వారికట్టి దుర్దశ రావచ్చునా ? 627

వరవరముని

జ్ఞానానుష్ఠానంబులుగల గురుండు శాస్త్రము నతిక్రమింపఁడు. మైథునకైంకర్యాదు లపేక్షింపఁడు. ఖర్జూర గోస్తనీ రసాలాది ఫలం బులు గుడము ఫాణితము శర్కరా ప్రముఖ పరిమళపదార్థంబులు భగ వన్నివేదనముసేసి శిష్యులకిచ్చుంగాని మలమూత్రాదు లీయనొల్లఁడు. దుష్ట గురుశిష్యులకన్న నేమియు నెఱుంగని బద్ధసంసారులు మంచి వారని చెప్పవచ్చును. మలమూత్రాదులు విడిచినప్పుడు వీర్య

విసర్జన మొనర్చినప్పుడు శవదర్శనావసరమునందు మధుమాంసములఁ గాంచినప్పుడు స్నానమాచరించి దేవతారాధనఁ జేయవలయునని వేదము విధింపుచున్నదని మణవాళమునీంద్రులు సెప్పఁగా సుశీలాది భాగవతబృందంబు లమందానందంబుఁజెంది యారేయి సుఖనిద్రఁజెంది రెండవనాడులేచి స్నానాదికాల్యంబులుదీర్చి రంగరాజస్వామివారిని సేవించి మరలసభాస్థానంబునకువచ్చి సుఖాసీనులైరి. మణవాళమహాముసీంద్రు లెద్దియో చెప్పుట కుపక్రమింపుచుండి రింతలో నొకనాస్తికాగ్రేసరుం డరుదెంచి మణవాళమహామునులకు నమస్కరించియిట్లనియె.

# నా స్తి క వా ద ఖ ం డ న ము

స్వామీ! మీరు మహాపండితులని విని కొన్నిసందేహములు నివారించుకొందమని వచ్చితి నడుగవచ్చునా? 629

భా గ వ తు లు

శ్రీమణవాళమహామునీంద్రునితో రహస్యముగా గురువర్యా! ఈ వచ్చినవాఁడు పరమనాస్తికుఁడు. దురాచారుఁడు, భక్తులఁగాంచి నవ్వఁ బరిహాసింపుచు నవ్వుచుండును. వ్యాఘ్రముంబువాతఁబడిన మేక వలె మీ చేరింబడిరి. గర్వభంగముసేయుఁడు. 630

వ ర వ ర ము ని

అయ్యా! నీవెవ్వఁడవు? యేమిచదివితివి? 631

నా స్తి కుఁ డు

నేనెవ్వఁడనైననేమి! కొంతవఱకు సంస్కృతవిద్యయే చదివితి నదియట్లుండనిండు. మీరాస్తికులు నేను నాస్తికుండను. దేశదేశంబులఁజరించి శాక్తేయులను గాణాపత్యులను సౌరులను ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతస్థులఁగాంచితిని. వారిచ్చు సమాధానములు నాకు

ధూపమునకుఁబనికిరాలేదు. వారిసమాచార మట్లుండనిండు. మీరు ప్రతిదినము నిచ్చట గోలగా నఱచుచున్నారు కారణమేమి ? 632

వరవరముని

మేము శ్రీవైష్ణవులము. రామానుజీయులము. సర్వేశ్వరుఁడు సృష్టిస్థితిలయకారుఁడు, సర్వాంతర్యామి, సర్వనియంత, లక్ష్మీవిశిష్టుఁడగు భగవంతుఁడున్నాఁడని యనిష్టవిధ్వంసన సర్వాభీష్ట సిద్ధ్యర్థమై భజింపుచున్నాము. 633

నాస్తికుఁడు

అట్టివాఁడొకడు గలఁడని మీకెట్లు తెలిసినది ? లేడని నానమ్మకము. 634

వరవరముని

శాబ్దము, అనుమానముఁ ప్రత్యక్షమునను మూఁడు ప్రమాణములచేఁ దెలిసికొంటి. 635

నాస్తికుఁడు

ప్రమాణత్రయమునుఁగూర్చి విశదముగా సెలవీయండి. 636

వరవరముని

శాబ్దమనఁగా శబ్దసంబంధమైన వేదముచేతను, ధూమమునుఁ బట్టి యగ్నియున్నదనునట్టి యనుమానముచేతను, నింద్రియగోచరమగు పదార్థములచేతను—యీమూఁడు ప్రమాణములచే భగవంతుఁడున్నాఁడని నిశ్చయించుకొని సేవింపుచుంటిమి. 637

నాస్తికుఁడు

శాబ్దానుమానముల నేనంగీకరింపను, ప్రత్యక్షముగాఁ జూపించినచో నొప్పుకొందును. 638

వరవరముని

నీవు దేవుఁడులేడను విశ్వాసముతోనుంటివి. నేను చూపించినప్పుడు వీఁడు దేవుఁడు కాదందువు ప్రయోజనమేమి ? 639

నాస్తికుఁడు

మీరు నిర్వేదమునువహింపక చూపించినచో సతనిగ్రహభావమునుఁబట్టి దేవుఁడనినమ్మి సేవింతును. 640

వరవరముని

మంచిది. ఈలోఁగా నింకొక్కటిచెప్పెద నాలకింపు మెట్లంటివేని, వసంతకుసుమాకరము, పూర్ణచంద్రోదయము, మకరధ్వజము, సువర్ణసూర్యావర్తి మొదలగు పదిరకముల మందుకుప్పె లొక్కచో నుంచెద వానింజూచి యేమందుపేరెద్దియో చెప్పి కుప్పెను విడఁదీసి యేరోగము నేదినివారించునో చెప్పఁగలవా ? 641

నాస్తికుఁడు

నాకిదివఱకు వైద్యశాస్త్రపరిజ్ఞానములేమిగనుకఁ జెప్పఁజాలను.

వరవరముని

గనిలోనుండి రాలను మణులనుఁగలిపి తీసి నీకుఁజూపించెద వానిలో రత్నంబులేవియో రాలేవియో విడదీయంగలవా ? 643

నాస్తికుఁడు

రత్నపరీక్షావిషయమైన జ్ఞానములేమిగనుక చెప్పఁజాలను. 644

వరవరముని

నీముందఱ నవీనులగు విద్వాంసులఁ బదిమందిఁ గూర్చుండఁబెట్టెద నెవరినామమెద్దియో, నెవరికెంత పాండిత్యముగలదో చెప్పఁగలవా ? 645

నాస్తికుఁడు

అనుభవజ్ఞానములేనందువల్లఁ జెప్పఁజాలను. 646

వరవరముని

ఔషధంబులను మణులను విద్వాంసులను శాస్త్రజ్ఞానానుభవజ్ఞానములు లేనందునఁ దెలియఁజాలనంటివి. భగవత్సంబంధజ్ఞానములేని నీవు భగవంతునిఁజూపించిన నెట్లుతెలిసికొందువు ? 647

నాస్తికుఁడు

తెలియకున్నను విశ్వసింతును చూపించండిస్వామీ. 648

వరవరముని

చూడఁబడినదెల్లను సత్యమని నీకునమ్మకమేనా ? 649

నాస్తికుఁడు

అయ్యారెయ్యో ! ఏందుకుఁగాదండి ! లోకములో నందఱు చూచినప్పుడు తప్పకనమ్ముచున్నారుగదా, చూచినప్పుడుగూడ నమ్మనివాఁడు మూర్ఖుఁడేగదా ! 650

వరవరముని

నీవొక్కయూరిలోనుండి చూడఁగాఁ గొలఁదిదూరములో నాకాశము నాలుగువైపుల భూమిపై వ్రాలినట్టు కనిపించుచున్న దది సత్యమేనా ? 651

నాస్తికుఁడు

సత్యముకాదు. విహాయసము దిగినట్లున్నచోటికి వెళ్ళిచూడఁగా నక్కడ నేమియునుండదు. 652

వరవరముని

ఇంద్రజాలముసేయు గారడివానియొద్దనుండి చూడఁగాఁ బులులు సింగములు సివంగులు రూప్యములు మేడలు మిద్దె లుద్యానవనాదులున్నట్లు ప్రత్యక్షముగాఁ గనఁబడుచున్నవి యావస్తువులన్నియు సత్యమేనా ? 653

నాస్తికుఁడు

గారడివాఁడు లేచిపోయిన వెంటనే తదీయ వస్తువులెల్లను మాయమగునుగాన సత్యముగావు. 654

వరవరముని

మధ్యాహ్నకాలంబునఁ జవిటిపఱ్ఱలో జలప్రవాహ మగపడుచున్నది సత్యమేనా ? 655

నా స్తి కుఁ డు

అవి యెండమావులగుటచే వానియందు నీరంబులేదు కాబట్టి యసత్యమే యగును. 656

వ ర వ ర ము ని

రాత్రియందుఁ జీఁకటిలో దొంగను మొద్దుగాను మొద్దును దొంగగాను సర్పమును రజ్జువుగాను రజ్జువును సర్పముగాను పురుషుని స్త్రీగాను స్త్రీనిఁ బురుషునిఁగానుఁ గాంచుచున్నావు సత్యమేనా?

నా స్తి కుఁ డు

వెలుతురులేనికాలమునందుఁ జిత్తవిభ్రాంతిచే నట్లుకాంచినను సత్యముగాదు. జ్ఞానము విజృంభించినచో యథార్థమే గోచరించును.

వ ర వ ర ము ని

బంగారుమొలాముచేఁ బూయఁబడిన యిత్తడినిఁగాంచి బంగారమని కొన్నవానికి లాభంబువచ్చునా? 659

నా స్తి కుఁ డు

ఒఱపిడిచేసినప్పుడు నష్టమేవచ్చును. 660

వ ర వ ర ము ని

సూర్య చంద్రబింబంబు లేయూరిలోనున్నవారికి నాయూరిలో జేనెడువెడల్పునఁ దోచుచున్నవి అదినిక్కమా? 661

నా స్తి కుఁ డు

ఏయూరిలో నేదేశములోనైన నట్లేకనఁబడుచుండుటవల్ల నొకయూరిలో నొకమనుష్యుఁడుచూచినది నిక్కంబనుటకు వీలులేదు. సమస్తదేశములలో నొక్కపర్యాయముదయించి యొకేపర్యాయ మస్తమించుటవల్లఁ బ్రతిగ్రామములో సూర్య చంద్రులు వేఱుగానున్నారనుటకు శక్యముగాదు. దైవమహిమంబని యోజించవలెను. 662

పరవరముని

ఒకనికి లోచనవ్యాధిచేఁ జంద్రబింబము రెండుగాఁగనఁబడుచున్నది సత్యమేనా ? 663

నాస్తికుఁడు

కంటిరోగము నశింపఁగాఁ జంద్రుఁడొక్కఁడే తోఁచుటవలన ద్విచంద్రబింబజ్ఞానము నిక్కంబుగాదు. 664

పరవరముని

ప్రత్యక్షముగాఁగనఁబడినదాని నమ్మెదనంటివి. దానిలో నిన్ని విరోధములుగలవు యిఁకమీఁద నేమిచెప్పెదవు ? 665

నాస్తికుఁడు

ఏమిచెప్పుటకునుఁదోఁచలేదు మీరేశెలవింపవలె. 666

పరవరముని

పచ్చకర్పూరము నెప్పుడైనను వీక్షించితివా ? 667

నాస్తికుఁడు

ఎప్పుడైనఁ జూడలేదు కాని యున్నదని యప్పుడప్పుడు విని యున్నదనియే విశ్వసించినాను. 668

పరవరముని

మాణిక్యము నెప్పుడైనఁ గంటివా ? 669

నాస్తికుఁడు

నేనెప్పుడు సూడలేదుగాని మానాయనగారివల్ల నెఱింగితి నెట్టులందురా ? పొలముపనికేఁగి యొకనాఁడొకకత్తిఁబాఱవైచి యింటికి రాఁగా మాతండ్రి నన్నుఁగాంచి దుర్మతీ ! మాణిక్యమువంటి కత్తిఁ బాఱవైచితివని దండించె నందువల్ల లోకమునందు మాణిక్యమున్నదని నమ్మితిని. 670

పరవరముని

నీనామమేది ? మీనాయనగారి పేరేమి ? 671

నాస్తికుఁడు

నాపేరు పుల్లయ్య, మా నాయనపేరు మల్లయ్య. 672

వరవరముని

మల్లయ్యగారి బీజమునకే నీవు జనించినట్లు నీకు దృష్టాంతమేమి?

నాస్తికుఁడు

మా తల్లిగారు మల్లయ్య నీ జనకుండని పలుమారు వచింపఁగా విని నమ్మితిని. 674

వరవరముని

నానుడి ననుసరించి పచ్చకర్పూరమును జనకవాక్యమునుబట్టి మాణిక్యమును జననివాక్యముచేఁ దండ్రి మల్లయ్యయని యెట్లు విశ్వసించితివో యంతకంటె వేయిమడుంగు లెక్కువగా శాస్త్రమును విశ్వసింపవలయును. 675

నాస్తికుఁడు

శాస్త్రమును నమ్మెదనుగాని యనుమానమునుమాత్ర మంగీకరింపనండి. 676

వరవరముని

నీవు పేటికలో ధనముంచి నిద్రించి రెండవనాఁడు పరికింపఁగా శూన్యపేటికయుండె నప్పుడేమనితలంతువు ? 677

నాస్తికుఁడు

దొంగ లెవ్వరో దొంగిలించుకొనిపోయిరని యూహింతును. 678

వరవరముని

దొంగను నీవుచూడలేదు, మఱియొకరుచూచి చెప్పఁగావినను లేదు దొంగ దొంగిలించినాఁడని యెట్లూహించితివి ? 679

నాస్తికుఁడు

రాత్రిపూట ద్రవ్యమపహరించువాఁడు చోరుండని యూహించితిని. 680

వరవరముని

ఒక గొప్ప దేవాలయమునందు శిల్పచాతుర్యము నీక్షించినప్పు డేమనితలంతువు ? 681

నాస్తికుఁడు

శిల్పకారినిఁజూడకపోయినను మహాసమర్థుఁడగు శిల్పకారిచే నిద్దేవళము నిర్మింపఁబడెనని తలంతును. 682

వరవరముని

నీగర్భాధానమునకుముందు నీభార్య గర్భవతియైనచో నేమని యోజింతువు ? 683

నాస్తికుఁడు

ఊరక వ్రేఁకటిరాదుగనుక పరపురుషసంయోగంబుచేఁ గర్భవతియయ్యెనని దండించి వర్జింతును. 684

వరవరముని

దొంగవాఁడపహరించినంగాని ద్రవ్యంబుపోలేదని సమర్థుఁడగు శిల్పకారిచేఁగాని దేవళంబు నిర్మింపఁబడదని పురుషసంయోగంబుచేఁగాని స్త్రీకి గర్భంబురాదని తలంచిన నీయూహయే అనుమానము నీవిప్పుడు శాబ్దానుమానప్రత్యక్షములు మూఁడు ప్రమాణములకు బద్ధుండవైతివిగదా ? 685

నాస్తికుఁడు

దేవరవారి దివ్యవాక్యసుధారసపానంబుచే మౌఢ్యంబు వదలిపోయినది. ప్రమాణబద్ధుండనైతిని. ప్రమాణత్రయంబులో శ్రేష్ఠమైన దెద్దియో వచింపుఁడు. 686

వరవరముని

ప్రమాణత్రయంబునందుఁ బ్రత్యక్షంబునం గల దోషంబులు గొన్నివచించితి ననుమానంబునందు నట్టిదోషంబు లనేకంబులుగలవు కాని నిర్దోషమైనది శాస్త్రమొక్కటియే. 687

నాస్తికుఁడు

శాస్త్రములుకూడ నొకదానికొకటి విరోధముగానున్నట్లు కాన్పించుచున్నవిగదా ? ౬88

వరవరముని

వేదమునందు విరుద్ధములేకుగాని వ్యాఖ్యానము చేయువారి యందు వైరుధ్యము సంభవించినది. గంగానదియందుఁ బుణ్యులు పాపు లెందఱు స్నానముసేసినను నదీమాహాత్మ్యంబు వ్యత్యాసముఁ జెందనట్లు గీతాశాస్త్రంబును వేదంబులునుఁ జెడక పవిత్రంబులై యున్నవి. తొల్లి భగవదంశసంభూతుండగు వేదవ్యాసుండు రాశీభూతంబుగానుండు వేదంబును నాలుగుభాగంబులుగా విభజించి వేదార్థము నైదువందలఱువదినాలుగు బ్రహ్మసూత్రములచే సంగ్రహముగా వివరించె దానిపై ననేకవృత్తులు భాష్యంబులు జనించె. ననేక పురాణంబు లితిహాసంబు లుపపురాణంబులు జనించె. రామాయణ భారతంబు లితిహాసంబులు, మన్వాదిస్మృతులు ధర్మశాస్త్రంబులు, వైష్ణవపాద్మాది పురాణంబులుజనించె. శ్రుతి స్మృతీతిహాస పురాణంబులకు నెవ్వరిమతానుసారంబుగా వారర్థముసెప్పుకొందురు. మదీయ మతాచార్యులగు రామానుజయోగీంద్రులు బ్రహ్మసూత్రములకు దశోపనిషత్తులకు భగవద్గీతకు భాష్యంబువ్రాసిరి. తదీయ దివ్య వాక్యానుసారంబుగా మే మాస్తికులమై భగవదారాధన భగవద్గుణానుభవ కైంకర్యంబు లొనర్చుచుఁ గాలయాపన మొనర్చుచున్నాము.

నాస్తికుఁడు

శంకరాది మహామహు లనేకులుండఁగా మీరు రామానుజులవారి వాక్యములనుమాత్రమే విశ్వసించి తదీయసిద్ధాంతమునను౦డుటకు హేతువేమి ? ౬90

తత్కనమత్తాచార్యులును మునీంద్రులును వేదములకుఁ దోఁచిన యర్థంబు లుపన్యసించి మోక్షమార్గమిదియని శిష్యులకు బోధసేసిరి గాని మోక్షమునకుఁ బనుపఁజాలరైరి. మా రామానుజులవారు శ్రీవైకుంఠమునుండి భగవదాజ్ఞచే భూమిపై నవతరించిరి. 691

ఉ॥ క్షీరము సంగువారలనుఁ, జెంగటనిల్చి నమోనమోయటం
చారసి మ్రొక్కువారలను, నాకులు వక్కలొసంగువారలన్
నీరములిచ్చువారలను, నీవె సదా గతియన్నవారలం
జేరిచినాడు ముక్తికి వి,శిష్ట యతీంద్రుఁ డనుగ్రహంబుతోఁ.

వ॥ పూర్వికులగు జ్ఞానులు బ్రాహ్మణాద్యుత్తమ జాతులకు వారిలోఁ బండితులకుమాత్రమే వేదాంతము బోధించిరి. మదీయాచార్యు లంతటితోఁ జాలింపక,

ఉ॥ మాలలకున్ నిషాదులకు, మాదిగవారికిఁ జెంచువారికిన్
సాలెల కజ్జవట్టు కమ,సాలులకున్ గతిమాలియున్న కూ
లీలకుఁ గుక్కమాంసముల,లిం దినువారికి గోపగోపికా
పాళికి మోక్షమిచ్చెను కృ,పానిధి మాయతిరాజు నాస్తికా. 693

సీ॥ పెరుగొక్కపరి నిజపరివారమునకీయ
గొల్లచానకు ముక్తిఁ గూర్మినిచ్చె
మూకుఁడౌవాని కమోఘ పాండిత్యంబు
నొనఁగూర్చి వైకుంఠమునకుఁబనిచెఁ
బాషండసిద్ధాంతపరులైనవారి వై
ష్ణవులఁగావించి మోక్షంబొసంగె
నెఱుకల నొడ్డెల నేనాదివారి ను
త్తమమైన పరమపదంబుఁ జేర్చె

విల్లిబుత్తూరిచెలువుఁగో వృద్ధిగన్న
లక్షలకొలంది చేపల కక్షయాప
వర్గ సుఖమిచ్చె మాయతివరుఁడు మున్న
మోఘ నైపుణిఁ గరుణాసముద్రుఁడగుచు. 694

వ॥ వెండియు నమ్మునుభావుం డనతార సమాప్తకాలంబున శ్రీరంగంబున లక్ష్మీసహితుండగు రంగరాజస్వామినిదర్శించి యిట్లనియెఁ గమలాక్షా! జీవించియున్నంతవఱకు శ్రమమనిచూడక నీగుణానుభవంబుచే బద్ధసంసారులనుద్ధరించితి నిప్పుడు పరమపదంబున కరుగుచుంటి నీకమీఁద నాప్రపత్తినంగీకరించి మదీయసంబంధులకు మోక్షంబిచ్చుచుండవలయునని వరంబుఁగోరి భగవదంగీకారంబువడసి వైకుంఠంబునకేగె నక్కారణంబున మా జ్ఞానానుష్ఠానంబులెట్టులుండినను రామానుజసంబంధంబుచే మోక్షంబు సిద్ధించునను విశ్వాసముతోఁ దదాజ్ఞానుసారంబుగానుంటిమి. 695

నాస్తికుఁడు

మంచిది నేనిదిమొదలుగా రామానుజసిద్ధాంతంబునఁ బ్రవేశింతు నొక్కసారి మీవిష్ణుదేవునిఁజూపించండి. 696

వరవరముని

ఇంతసేపిన్ని విధంబులచే సమాధానముసెప్పినను నీదుర్బుద్ధి వదలినదికాదు. సరియైనజ్ఞానముకలుగువఱకు భగవద్దర్శనమును గోరరాదు. మహాబలాఢ్యుండగు హిరణ్యకశిపుండు నీవలె దుష్టాశయముతో భగవద్దర్శనంబుఁగోరి ప్రహ్లాదుఁడు చూపింపఁగా దత్క్షణమే హిమకశిపుండుసచ్చె. మారీచుండు శ్రీరామునిదర్శించి భయంబుచే నిద్రాహారంబులుమాని తుదకు నమ్మహాత్మునిచే సగ్గె. శ్రీకృష్ణదర్శనమాత్రంబునఁ గంసుఁడు మరణించె. రావణ విరాధ జరాసంధ శిశుపాలాదులు హరిదర్శనమాత్రంబున వధింపఁబడిరి. ప్రహ్లాద విభీషణ

పాండవ విదురాక్రూరాదులు భగవద్దర్శనంబుచేఁ గృతార్థులైరి. కావున నిర్మల జ్ఞాన భక్తి వైరాగ్యములు లేనివానికి భగవద్దర్శనంబుచే ననర్థకంబు సంభవించు నిందుకు సందియంబులేదు. 697

నాస్తికుఁడు

దాని నటుండనిచ్చి లోకానుభవయోగ్యంబైన భగవన్మహిమంబు లుగ్గడింపుదు. 698

వరవరముని

భగవంతుఁడు ముందుగా స్వకీయనాభీకమలంబున బ్రహ్మను సృష్టించి వేదంబులిచ్చి తదుపరి నాకాశాది పంచభూతములసృజించి భూమియందు వహనశక్తి నీటియందుఁ బోషకశక్తి వహ్నియందు సర్వపదార్థ పక్వవిధానశక్తి వాయువునందుఁ బ్రాణరూపశక్తి ఆకసమునం దవకాశశక్తి నిర్మించెను. భూతోపయోగప్రకాశముకొఱకు సూర్యచంద్రాగ్నినక్షత్రములయందు స్వకీయ తేజస్సులో స్వల్పభాగముంచె దీని కుదాహరణముగా. 699

శ్లో॥ యదాదిత్య గతం తేజో, జగద్భాసయ తేఽఖిలమ్
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ, తత్తేజోవిద్ధిమామకమ్

ఏతేజస్సు సూర్యునియందుండి సమస్తజగత్తునుఁ బ్రకాశింపఁ జేయుచున్నదో యేతేజస్సు చంద్రాగ్నులయందుఁగలదో యది నాది యని యెఱుంగుము. 700

శ్లో॥ గామావిశ్యచభూతాని, ధారయామ్యహమోజసా
పుష్ణామి చౌషధీస్సర్వాస్సోమోభూత్వారసాత్మకః

నేను భూమియందావేశించి బలముచే భూతముల వహింపుచున్నాను. రసాత్మకుండగు చంద్రునియందుండి సస్యములనుబోషింపుచున్నాను. 701

శ్లో॥ అహంవైశ్వానరో భూత్వా, ప్రాణినాం దేహమాశ్రితః
ప్రాణాపానసమాయుక్తః, పచామ్యన్నం చతుర్విధమ్

నేను వహ్ని వాయు రూపములతో ప్రాణుల దేహములయం దుండి భోజ్య చోష్య లేహ్య పానీయములను చతుర్విధాహారములనుఁ బచనముసేయుచున్నాను. 702

శ్లో॥ సర్వస్యచాహంహృది సన్నివిష్టో
మత్తఃస్మృతిర్జ్ఞానమపోహనంచ
వేదైశ్చ సర్వైరహమేవవేద్యో
వేదాంత కృద్వేద విదేవచాహమ్

నేను సర్వశరీరుల హృదయంబునందున్నాను. జ్ఞాపకశక్తియు జ్ఞానంబును నూహయు నావల్లనే కలుగుచున్నవి. నేను సర్వవేదములచేఁ దెలియఁదగినవాఁడను. వేదాంతములుసేసినవాఁడను వేదంబుల నెఱింగినవాఁడను నేనేనని గీతాశాస్త్రమునందు ఫల్గునునకు భగవంతుండు బోధించె నంతేకాక మనము నిద్రించునపుడతండు మేలుకొని రక్షింపుచున్నాఁడు. భగవదాజ్ఞననుసరించి మేఘములు సమయోచితంబుగాఁ గురియుచున్నవి. గాలి వీచుచున్నది. వహ్ని మండుచున్నది. భూమిపండుచున్నది. వడగాడ్పు లుమ్మదము ఝంఝామారుతములు దుర్భిక్ష సుభిక్షంబులు గలుగుచున్నవి. మఱియు నన్నారాయణుని శాసనముచేతనే సముద్రములు భూమి నాక్రమింపకయున్నవి. పిడుగులు మెఱపు లతనివల్లనే పొడముచున్నవి.

క॥ హరిమయము విశ్వమెల్లను
హరి విశ్వమయుండు సంశయముపనిలే దా
హరిమయముగాని వస్తువు
పరమాణువులేదు వంశపావనవింటే

యని భాగవతంబునఁగలదు. మఱియు 703

సీ॥ స్పర్శింపఁదగని మార్జాలదేహమునందు
సాంకినంబేరిటి సంభవించె
మలమూత్రభరితమై వెలయు కురంగశ
రీరమందెట్లు కస్తూరిపొడమె
సలిలంబుఁజెఱచు నిషద్వారంబునఁ బద్మ
విసర మెట్లంగి నావిర్భవించె
లవణాపగేశ జలమున నానావిధ
మణిగణంబెట్లు జన్మంబుఁగాంచె

హయమునందు జవంబు సింహమున శౌర్య
మును గజంబునమదము కోల్పులికిఁ గ్రౌర్య
మేవిధంబునఁగలిగె రమేశుఁడై చ
రించు ముప్పోకలాశసృజించెఁగాని. 704

సీ॥ గాఢాగ్నిశిఖలచేఁ గాలియు వనములు
వృష్టికాలమునందు వృద్ధిఁగాంచు
హస్తి సింహ వ్యాఘ్ర హరిణంబు లొక్క గ
హనమందొనర్చు విహారమోలి
వడగాలి కెండకు వానకధీనమై
చెడక జీవించుఁ బక్షిమృగపాళి
గిరులందు దడవులందు శరధులందువసించు
మెయి తాలుపులు తిండిమెక్కి బ్రతుకు

మించు వేసఁగిలోన శుష్కించునదులు
మరలఁబ్రవహించు ప్రావృట్సమయములందు
సంద్రమెల్ల తఱుల నొక్కజాడనుండు
మానమో నాయకుని దివ్యమహిమచేత, 705

సీ॥ గాఢాంధకార సంకర సఘూగర్భ సం
స్థితపిండ మేరీతిఁ జెందె వృద్ధి
కడువింతగా బహిర్గతుఁడైన వెంటనే
బాలు డేగతిఁ దల్లి పాలు గ్రోలఁ
దనుధారి తినుపదార్థంబులు జీర్ణించి
విణ్మూత్రములు సదా వెడలుచెట్లు
పురుమూర్తి మచ్ఛిలాంతరమునఁబుట్టు భే
కమున కాహార మేకరణినొదవె

నోరెఱుంగని మృగపక్షివారమెల్లఁ
బాకముల నేవిధంబున సాకుచుండె
మాననీయాద్భుతా ప్రతిమాప్రభావ
కలితుఁడైన రమాధీశువలనఁగాక. 706

సీ॥ కాకోదరములందు గరళంబు మాహా చ
యమునందు మధురంబులైనపాలు
శిఖిసంచయమునందుఁ జిత్రవర్ణము తేటి
బారులయందు ఝుంకారరవము
తామ్రాక్షములయం దుదారమధురగీతి
చిలుకలయందు భాషించుశక్తి
నీరమిశ్రిత దుగ్ధధారావిభాగ వి
జ్ఞానంబు రాజహంసములయందు

నడుసుఁగోఁజేరియైన మేనంటకుండఁ
దిరుగునేరుపుఁ గుమ్మరపురుగులందు
నుంచి తన సృష్టి సామర్థ్య మంచితముగ
శ్రీవధూనాయకుఁడు ప్రదర్శించుచుండె. 707

సీ॥ నగములయందు నిమ్నగలనుఁ గల్పించి
బహుయోజనంబులు పాఱఁజేసె
దేవమాతృకయు నదీమాతృకయు నను
ద్వివిధవప్రములు పృథ్విఁ సృజించె
నారోగ్యమునకు భవ్యౌషధంబులు పుష్టి
కాహారవస్తువు లమరఁజేసెఁ
దరులందుఁ బూవు ల,వ్విరులందు మకరంద
రసము నమోఘ సౌరభమునుంచె
ఘనఫలంబులు శీఘ్రూపకారమైన
దినుసులను ధాన్యములను వర్ధిల్లఁజేసె
భూతకోటులకొఱకుఁ బ్రభూతకరుణ
చేత సర్వసమయముల లక్ష్మీవిభుండు. 708

నాస్తికుఁడు

మనుష్యులు ధాన్యములఁ బండింపుచున్నారు, వస్త్రముల
నేయుచున్నారు శాకవస్తువులు నిర్మింపుచున్నారుగదా యిందులో 709
భగవంతుని పెత్తనమేమికలదు ?

పరవరముని

భూమిపై క్షేత్రములను బీజసమూహంబుల నిదివఱకే భగవం
తుఁడు నిర్మించియుంచఁగా మనుజుండు క్షేత్రమును దున్ని విత్తనం 710
బులు సల్లుచున్నాడు. కాని,

సీ॥ వర్షంబుఁగురియించి వప్రస్థబీజముల్
సొంపుగా మొలకలెత్తింపఁగలఁడె
మొలకలెత్తిన సస్యములను నాకర్షించి
శీఘ్రంబుగా వృద్ధిఁజేయఁగలఁడె
దేవుండు వృద్ధిఁజెందించిన పైరులో
లస్సగాఁగోలుచుఁ గల్పింపఁగలఁడె

ధాన్యంబు పండిసతకేఁ బదింతలుసేసి
ఎచ్చుధరకు విక్రయింపఁగలఁడె
చిత్తమునఁగోరినంత భుజింపఁగలఁడె
మందులేకుండ రోగముల్మాన్పఁగలఁడె
మానవున కెల్లసౌఖ్యముల్మానకుండ
నలిననాభుండొసంగుచున్నాఁడుగాని. 711

సీ॥ సతిఁగూర్పవచ్చు సురత మొనర్పఁగవచ్చు
సంతాన మొదవింప సాధ్యమగునె
సంతానమునకు దుష్టత్వంబుఁ దొలఁగించి
భవ్యవర్తనముఁ గూర్పంగవశమె!
పాఠశాలావిద్యఁ బఠనఁ జేయఁగవచ్చు
ఘనపండితఖ్యాతిఁ గాంచఁదలమె
ధనమునకై ప్రయత్నము సేయనగుఁగాని
కోరినంతంత చేకూర్పఁదరమె
వేలవర్షంబు లిలను జీవింతుననుచుఁ
బలుకనగుఁగాని మితిమీఱి బ్రతుకగలడె
యన్నియును దైవతంత్రంబులనుచు నతని
ధ్యానమొనరింపవలయు నిమ్మానవుండు. 712

నాస్తికుఁడు

అటులైనచో మానవునకుఁ బాపపుణ్యంబులతోఁ బనిలేదే !

పరవరముని

పనిలేకపోలేదు,

శ్లో॥ కర్మణ్యేవాధికారస్తే, మా ఫలేషు కదాచన=అర్జునా కర్మము చేయుటయందు నీకధికారముకలదుగాని ఫలమునందులేదని గీతాచా

ర్యులవా రానతిచ్చుటచే దేహి తన్నుక కర్మము నాచరింపవలయుంగాని దుష్కర్మ మొనర్చినచో దుఃఖంబును సత్కార్యానుష్ఠానంబుచే సుఖంబును సంభవించు నారెంటు ఫలంబులిచ్చుటకు భగవంతుఁడధికారి.

నాస్తికుఁడు

నేనెట్లుచరించిన నతని కేమి? ఫలమీయకుండనుండరాదా?

వరవరముని

అతండు ఫలమీయక విడిచినచో నీజీవునకు శరీరమేరాదు. సర్వావయవపరిపూర్ణమగు దేహములేనిజీవుఁడు ఖద్యోతమువలె నాకసంబున నల్లాడుచుండు నకాలంబునఁ బరిమితిలేని దుఃఖంబుఁ గాంతువు. నీవేకాదు సర్వజీవులును దుఃఖింతురు. 716

నాస్తికుఁడు

భగవంతుఁడు నాకు మంచిదేహమే యిచ్చి మంచిబుద్ధులే కల్పించి మంచిమార్గమున నడిపించి మోక్షమీయరాదా? 717

వరవరముని

ప్రళయాంతంబునందు నారాయణుఁడు నీకు

శ్లో॥ విచిత్రా దేహసంపత్తి రీశ్వరాయ నివేదితుం=సర్వావయవములతోఁగూడిన తనువు భగవత్సేవఁజేసి మోక్షంబందుటకే యిచ్చె నటుపిమ్మట నీవు కలుపుఁదీయుటకిచ్చిన కత్తితోఁ గనులు పొడుచుకున్నట్లు భగవదపచార భాగవతాపచారాసహ్యాపచారాదు లొనర్చి స్వస్వరూప పరస్వరూపంబులుమఱచి ప్రకృతివశుండవై చెడితివి. 718

నాస్తికుఁడు

ఓహో! ప్రకృతివల్లనే సర్వము జరుగుచున్నదేమో! భగవంతునితోఁ బనియేమి? 719

పరపరముని

ఈప్రకృతికి జడమనియు నచిత్తనియుఁ బేరులుగలవు. చేతనుండగు జీవుని నచేతనంబగు ప్రకృతిని సర్వకాలం బీశ్వరుఁడు శాసించును. 720

నాస్తికుఁడు

భగవంతుండట్టి సమర్థుఁడైనచో లేడని నిందించువారినిఁ గలిగియు మేలొనర్పలేదని దూషించువారిని వెంటనే వధింపరాదా ? 

పరపరముని

భగవద్దూషకుల నభ్భగవంతుఁడు వధింపనక్కఱలేదు. తత్పాపమే వారిని వధించును. 722

సీ॥ అతిమోదమున ఫలంబనియెంచి మంటలోఁ
దుమికిన శలభంబుకమరకున్నె
తారతమ్య మెఱుంగనేరక కొండతోఁ
డీకొన్న పొట్టేలు డిందకున్నె
ఝుంఝూప్రభంజన స్పర్శంబునెదిరించి
విపులారుహాంబు వేవిఱుగకున్నె
కడుఁకిన్కఁబూని భాస్కరునిముందఱ సమా
వేశించి గూబ జీవింపఁగలదె

గంధసింధురమునుఁ గనువేడ్కఁదాఁకి కుం
దేలు బ్రతుకఁగలదె తెలియకల్లె
దేవదేవుదూఱి తీఱరనిబాధల
కగ్గమానుగద నరాధముండు. 723

నాస్తికుఁడు

తమంతటఁదాము చచ్చుటకంటె శీఘ్రి మరణంబు దేవుఁడు వారికిఁగల్గించిన బాగుండునేమో ! 724

వ ర వ ర ము ని

సీ॥ పాలికిఁ దన్నిన బట్టి నద్దినమందె
తీవ్రకోపముతో వధింపఁగలఁడె
పైనుండు కాతునుఁ బడవేసినంతనే
ఘోటక కంఠంబుఁ గోయఁగలఁడె
చేనిలో బైరు మేసినమాత్రమున మహో
క్షంబును దయమాని చంపఁగలఁడె
పదరి యవాచ్యము ల్పలికినమాత్రాన
మాణవకునిఁ బేరు మాపఁగలఁడె

మానవుండివ్విధంబున మాననీయుఁ
డఖిలలోకైకగురుఁడు నారాయణుండు
తన్నునిందించువాని నత్తరుణమందె
సంహరింపడు కినుకమై సాహసించి. 725

వ॥ విభీషణశరణాగతిసమయంబున సుగ్రీవాదులు రామునిఁగని స్వామీ ! మీరు సర్వశక్తులై యుండియు సంకల్పమాత్రమున రావణు నేలచంపలేదని ప్రశ్నింపఁగా భగవంతుఁడు వారితో వనచరు లారా ! మదీయ సేతుబంధనాద్యఘటితకృత్యంబులుగాంచి భయపడి రావణుండు శరణాగతుండగునేమో రక్షింపవలయునను నాసతోనుంటి నని వచించెఁ గృష్ణావతారకాలంబునఁ దనపైఁ బదునెనిమిదిపర్యాయంబులు దండెత్తిన జరాసంధుని శీఘ్రముగావధింపక వధింపఁబూనిన బలరాముని వారించి చిరకాలంబునకు భీముని చేఁ జంపించె నట్లే నిరీశ్వరవాదులై తన్నును స్వకావతారంబులను దూషించు పాపిష్ఠులను భగవంతుఁడు తత్క్షణమే వధింపక కాలము నిరీక్షించుచుండును. తరువాత, శ్లో॥ న క్షమామి వసుంధరే, శ్లో॥ క్షిపామ్యాసురయోనిషు అన్నట్లు వారినిఁ బాపానుగుణ్యముగా దండించును. 726

నా స్తి కు (డు

శరీరధారులందఱు భగవత్సృష్టిలోనివారేగదా? కొందఱు మాత్రము భగవంతుని నిందింపనేల? 727

వ ర వ ర ము ని

సీ॥ గుణహీనుఁడైనట్టి కొమరుండు మహనీయుఁ
డైన తండ్రికి సిగ్గు లాచరించు
జారత్వగుణచిచేతఁ జరియించు లేమ స
జ్జనుఁడైన పతికి విషాదమొసఁగు
శఠుఁడైన విద్యార్థి చదువనేరక నిజో
పాధ్యాయునందు దుర్భావమొందుఁ
బిచ్చివాఁడై ప్రలాపించు సేవకుఁడు ధ
ర్మాత్ముఁడౌ రాజున నాదరించు
మొండియెద్దు రైతుముంగిట మేసియుఁ
బనులవేళఁ గ్రిందఁబడి కలంగు
నట్లె దుర్జనుం డహర్నిశంబును దేవ
దేవు దూఱుచుంటఁ దెలివిమాలి. 728

నా స్తి కు (డు

అట్లు సర్వేశ్వరుని దూషించువాఁడేమగును? 729

వ ర వ ర ము ని

వీనినిఁగూర్చి మనము విచారింప నవసరములేకుండ గీతాశాస్త్రమునందు భగవంతుఁడే చెప్పియున్నాఁ డెట్టులనఁగా, 730

శ్లో॥ నమాంరుష్కృతినోమూఢాః, ప్రపద్యంతే నరాధమాః
మాయయాపహృతజ్ఞానాః, అసురంభావమాశ్రితాః

భగవద్భక్తిచేయనివారు మూఢులు, నరాధములు మాయాపహృతజ్ఞానులు, అసురస్వభావులు నను నాలుగు తెగలువారుగా

నుందురు. వారిలో నాహారమునుసంపాదించు మెట్లులనియు భక్షితాహారము జీర్ణించి యారోగ్యానుసారముగా బయటికి వెడలుమెట్లులనియు మాత్ర మాలోచించి యితరమెఱుంగనివారు మూఢులు. శాస్త్రార్థ మనేకసారులు పండితులచేతవినియుఁ బూర్వోత్తరసంబంధ్యముఁ దెలిసికొనలేనివారు నరాధములు. శాస్త్రార్థములువిని యెఱింగి భగవంతునియందు భక్తికిమాఱుగా ద్వేషమునుఁ హించువారు మాయాపహృతజ్ఞానులు. తాము భగవద్ద్వేషులగుటగాక కుయుక్తులచే భాగవతుల మనస్సునకుఁ గలంకమాపాదించువారు అసురస్వభావులు. ఈ నాలుగుతరగతులవారు మహాపాతకులనియు. 731

శ్లో॥ అవజానంతి మాంమూఢా, మానుషీంతనుమాశ్రితమ్
పరంభావ మజానంతో, మమభూత మహేశ్వరమ్

మూఢులు భూతమహేశ్వరుండనగు నా పరస్వరూపమునుఁ దెలియక, నేను మనుష్యరూపమునుఁ బొందినమాత్రమున సామాన్య మనుష్యునిగాఎంచి తిరస్కరింపుచున్నారు. 732

శ్లో॥ మోఘాశామోఘ కర్మాణో, మోఘజ్ఞానావిచేతసః
రాక్షసీమాసురీంచైవ, ప్రకృతీం మోహినీంశ్రితాః

రాక్షసీ ఆసురీ ప్రకృతీ మోహిని యను నాలుగుగుణముల నాశ్రయించి జన్మించినమనుష్యులు మదవతారంబుల నిందింపుచున్నారట్టి వారేమేమి సౌఖ్యములు పొందవలయునని తలంతురో యట్టి యాసలును వారుకావించు పుణ్యకర్మంబులును వారిజ్ఞానంబులు వ్యర్థంబులగును. తుదకు నచేతనములకు వారికి భేదముండదుచుమీయనియు గీతాశాస్త్రమునందు భగవంతుఁడు విధించుచున్నాఁడిందులకుఁ దార్కాణముగా, 733

సీ॥ ధర్మజుగోష్ఠిలోఁ దామోదరుని సభ
 మానించి చైద్యుండు మేనుఁబాసె
బిరుదంబు లిడు దూడఁబీఁకుమాయుని కృష్ణు
 నదలించి పౌండ్రకుం డసువులీడె
గురుసభలోఁ జగద్గురుకూటి యూధార్త
 రాష్ట్రికు సపరివారముగ నీల్గె
వాచాలుఁడై స్వయంవరవేళఁ గమలాక్షు
 నిందించి రుక్మి కీడొంది యేడ్చె

పదియునెనిమిదిసార్లు గోపాలమౌళి
తోడ డీకొని బార్హద్రథుండు మడిసెఁ
గానఁ బరమాత్ము దూషించు జానపదుల
కుండునే చిరసుఖము భూమండలమున. 734

నాస్తికుఁడు

భగవన్నిందాపరులెల్ల నీల్గిరని చెప్పితివి. భగవద్భక్తులుమాత్రము స్థిరముగానుండిరా ? 735

వరవరముని

పైవారిద్దఱిచావునకు భేదమున్న దెట్లందువా, దుష్టులు భగవన్నిందాపాపంబుచే నస్త్రశస్త్రాదులచే నకాలమృతి కధీనులై మేను లెడఁబాసి యీలోకంబున నపకీర్తినిఁ బరలోకంబున దుర్గతినిఁగాంచిరి. భాగవతులు స్వీయవాంఛితంబులన్నియు నెఱవేర్చుకొని స్వేచ్ఛానుకూలంబుగా ననాయాస మరణంబొంది ముక్తికేఁజనిరి. 736

నాస్తికుఁడు

ఇంతవఱకు భగవన్నిందాపరుల సమాచారమే చెప్పితివి. భగవంతు నాశ్రయించువారెవ్వరును లేరా ? లేనిచో నీశ్వరునకు గౌరవమేమిగలదు ? 737

## వరవరముని

లోకమునందు విష్ణుభక్తులులేకపోలేదు. ప్రతియుగమునందును
బ్రతిదేశమునం దట్టివారు లేని భూమి తల్లక్రిందగును. భక్తులం
గూర్చియు భగవంతుఁడు భక్తులకొసంగు శుభంబులఁగూర్చియు సర్వే
శ్వరుఁడు వచించినదానింజెప్పెద నాకర్ణింపుము. 738

శ్లో॥ జన్మ కర్మచమే దివ్య, మేవంయో వేత్తితత్త్వతః
త్యక్త్వాదేహం పునర్జన్మ, నైతిమామేతిసోర్జున.

నా యవతారంబుల నవతారంబులయందొనర్చిన పనులనుఁ
బ్రాకృతసంబంధములుకావని దివ్యంబులని యథార్థంబుగా నెవ్వం
డెఱుంగునో వాడు దేహమువిడిచినపిమ్మటఁ బునర్జన్మమునొందక
నన్నేపొందుచున్నాడు. 739

(భగవద్గీత చతుర్థోథ్యాయము,

శ్లో॥ తపస్విభ్యోఽధికో యోగీ, జ్ఞానిభ్యోఽపిమతోఽధికః
కర్మభ్యశ్చాధికోయోగీ, తస్మాద్యోగీ భవార్జున

శ్లో॥ యోగినామపిసర్వేషాం, మద్గతేనాంతరాత్మనా
శ్రద్ధావాన్ భజతేయోమాం, సమేయుక్త తమోమతః

అర్జునా! తపోయోగులకంటె జ్ఞానయోగులకంటెఁ గర్మయో
గులకంటె యోగి గొప్పవాఁడుగనుక నీవు యోగివికమ్ము. సమస్త
విధ యోగులలో నాయందు మనస్సునుంచి శ్రద్ధావంతుఁడై భజించు
వాఁడు శ్రేష్ఠుఁడని నాయభిప్రాయము. 740

(భగవద్గీత షష్ఠోఽధ్యాయము)

శ్లో॥ చతుర్విధా భజన్తే, మాం, జనాస్సుకృతినోర్జున
ఆర్తోజిజ్ఞాసురర్థార్థీ, జ్ఞానీచభరతర్ష భ

నన్ను భజించువారిలో నాపదలను నిస్తరింపఁగోరు నార్తుఁడు జీవప్రాప్తింగు కైవల్యమునుఁగోరు జిజ్ఞాసువు, విద్యాధనధాన్యాంబర భూషణ సంతానాదులఁగోరు నర్థార్థి సర్వకాల సర్వదేశ సర్వావస్థ లందు నన్నే ధారక పోషక భోగ్యములుగా నెంచునట్టి జ్ఞానియని నాలుగుతరగతులుగానున్నారు. 741

శ్లో॥ తేషాం జ్ఞానీ నిత్యయుక్త, ఏకభక్తిర్విశిష్యతే
ప్రియోహి జ్ఞానినోఽత్యర్థ, మహంసచమమప్రియః

ఇతరఫలములు సాధింపఁగోరి నన్నాశ్రయించు నార్త జిజ్ఞాస్వ ర్థార్థులకంటె నాతో నిత్యసంబంధముగల జ్ఞాని శ్రేష్ఠుఁడు జ్ఞానికినేను మిక్కిలిప్రియుఁడను జ్ఞాని నాకత్యంత ప్రియుఁడు. 742

శ్లో॥ ఉదారాస్సర్వ ఏవైతే, జ్ఞానీత్వాత్మైవమేమతమ్
ఆస్థితస్సహియుక్తాత్మా, మామేవానుత్తమాంగతిమ్

పైనఁజెప్పిన నలుగురు నావల్లఁబుచ్చుకొని నాకుఁగీర్తినొసంగు వారు గనుక నాకు దాతలేఁగుదురుకాని నాకంటె నుత్తమగతి లేదని విశ్వసించు జ్ఞాని నేనేయని నాయభిప్రాయము. 743

శ్లో॥ బహూనాం జన్మనామంతే, జ్ఞానవాన్మాంప్రపద్యతే
వాసుదేవ స్సర్వమితి, సమహాత్మా సుదుర్లభః

పుణ్యజన్మంబు లనేకము గడువఁగా జ్ఞానియై నన్ను భజింపు చున్నాఁడు. సర్వము వాసుదేవుఁడేయను నధ్యవసాయముగల మహాత్ముఁడు దుర్లభుఁడు. 744

(భగవద్గీత సప్తమాధ్యాయము)

శ్లో॥ అనన్యచేతా స్సతతం, యో మాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ, నిత్యయుక్తస్యయోగినః

— అన్యమునందుఁబ్రసరింపనిమనస్సుతో నెల్లప్పుడు నన్నువిడువక యెవ్వఁడు భజింపుచున్నాఁడో యట్టియోగికి నేను సులభుఁడను. 745

శ్లో॥ మా ముపేత్య పునర్జన్మ, దుఃఖాలయమశాశ్వతమ్
నాప్నువంతి మహాత్మాన స్సంసిద్ధిం పరమాంగతాః

శ్రేష్ఠమైన జ్ఞానసిద్ధినిఁబొందినమహాత్ములు నన్నుఁబొంది దుఃఖాలయమైన పునర్జన్మమునుఁబొందరు. 746

శ్లో॥ ఆబ్రహ్మ భువనాల్లోకాః, పునరావృత్తినోర్జున
మాముపేత్యతు కౌంతేయ, పునర్జన్మ నవిద్యతే

బ్రహ్మలోకమువఱకుండు లోకములు పునరావృత్తినిఁ గలిగించును. నన్నుఁబొందినవారికిఁ బునర్జన్మములేదు, 747

(భగవద్గీత అష్టమాధ్యాయము)

శ్లో॥ అనన్యాశ్చింతయంతోమాం, యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం, యోగక్షేమం వహామ్యహమ్

ఇతరచింతలులేనివారై యేజనులు లెస్సగా నన్నుపాసింపుచున్నారో నాతో నిత్యసంబంధంబుగలిగినవారియొక్క యోగక్షేమములు నేనువహింపుచున్నాను. 748

శ్లో॥ అపిచేత్సుదురాచారో భజతే మామనన్యభాక్
సాధురేవ సమంతవ్యస్సమగ్వ్యవసితోహిసః

మిగులదురాచారుఁడైన నన్యమునందుఁబోవని మనస్సుతో నన్నుభజించెనేని వానిని సాధువనియే తలంపవలెను. వాఁడు మంచి మనోనిశ్చయముగలవాఁడుగదా ! 749

శ్లో॥ క్షిప్రంభవతి ధర్మాత్మా, శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి
కౌంతేయ ప్రతిజానీహి, నమే భక్తః ప్రణశ్యతి

పైనఁజెప్పఁబడిన నా భక్తుఁడు శీఘ్రముగ ధర్మాత్ముఁ డగుచున్నాఁడు. శాశ్వతమైన శాంతినిఁబొందుచున్నాఁడు. నాభక్తుఁడు చెడఁడని నీవు ప్రతిజ్ఞఁజేయుము. 750

(భగవద్గీత నవమాధ్యాయము)

శ్లో॥ యో మామజమనాదించ, వేత్తి లోక మహేశ్వరమ్
అసమ్మూఢ స్సమర్త్యేషు. సర్వపాపైః ప్రముచ్యతే

ఎవ్వఁడు నన్ను జన్మమరణాదులులేనివానిగాను లోకమహేశ్వరునిఁగాను దెలిసికొనుచున్నాఁడో వాఁడు మనుష్యులలో గొప్పవాఁడై సర్వపాపములచే విడువఁబడుచున్నాఁడు. 751

శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణా, బోధయంతః పరస్పరమ్
కథయంతశ్చమాంనిత్యం, తుష్యంతి చ రమంతిచ

శ్లో॥ తేషాంసతతయుక్తానాం, భజతాం ప్రీతిపూర్వకమ్
దదామి బుద్ధియోగం తం, యేనమా ముపయాంతి తే

నాభక్తులు నాయందు లయించిన మనఃప్రాణములుగలవారై నాప్రభావంబు లొకరికొకరు చెప్పుకొనుచుఁ సంతోషముతోఁగ్రీడింపుచున్నారు. నాతో నిత్యసంబంధముగలవారై ప్రీతిపూర్వకముగా భజించు భక్తులకు సంసారమూఁదాటి నన్నుఁబొందునట్టి బుద్ధియోగమును నేనేయిచ్చుచున్నాను. 752

(భగవద్గీత దశమాధ్యాయము)

వ। ఇవ్విధంబగు భగవదుపన్యాసంబు వచింపఁగా నాస్తికుఁడు విని నాస్తిక్యమునుఁ బూర్తిగావిడిచి మణవాళమునీంద్రుల పాదంబులఁబడి స్వామీ! నన్నుద్ధరింపవలయునని ప్రార్థింపఁగాఁ బంచసంస్కారంబు లొనర్చి మంత్ర మంత్రార్థంబు లుపదేశించి పునీతునింజేసి వరవరమునీంద్రుఁడు పుల్లయ్యను గోష్ఠియందుఁజేర్చె నటుపిమ్మట భాగవతప్రేరణంబుచే సుశీలుండులేచి గురువర్యునకు నమస్కరించి

యిట్లనియె, శ్రీ వైష్ణవశిఖామణీ! నానావిధ కుదృష్టిసిద్ధాంత శిలోచ్చయ దంభోళీ, రామానుజసిద్ధాంత నిర్ధారణ సమర్థ సార్వభౌమా, నితాంత మురనగావ నిగమాంత రహస్యార్థ ధురంధరా, జ్ఞాన భక్తి వైరాగ్యసంరక్షకా, సౌమ్యజామాతృయోగీంద్రా, రమ్యజామాతృ మునీంద్రా, మణవాళమహామునీంద్రా భాస్కరుండుదయించి తమః పటలంబును నశింపఁజేసినట్లు మాదృశ పామర జనాజ్ఞానాంధకారంబు నడఁగించుటకు జన్మించిన మహానుభావుండవు. నాస్తికు ననాయాసంబున దిద్దుబాటుసేసి వైష్ణవునిఁ గావించితి వప్పరాత్పరుఁడు విష్ణువే యని తీర్మానించితివి. లోకంబున వందలకొలఁది మతస్థులుగలిగి యనేక దేవతల నర్చింపుచున్నారు. నారాయణుండే సర్వోత్కృష్టుండని చెప్పుటకు హేతువేమో సెలవీయవలయును. 753

# లక్ష్మీ ప్రభావము

### వరవరముని

పుత్రా! లోకంబునఁ గొన్ని యాస్తిక సిద్ధాంతములునుఁ గొన్ని నిరీశ్వరసిద్ధాంతములునుఁగలవు. నానావిధ దేవతాభక్తులును, నిరీశ్వరవాదులును విష్ణుదేవుని బుద్ధిపూర్వకముగా భజింపకపోయిన నబుద్ధిపూర్వకముగా భజింపుచున్నా రెట్లంటివేని నారాయణుఁడు సర్వభూత సంరక్షణార్థముగా భూదేవిని లక్ష్మీదేవిని భార్యలుగాఁ బరిగ్రహించియున్నాఁడు. ప్రతి మతస్థుఁడునుఁ బుట్టినదాదిగా భూమి యందునిలిచి భూసంభవ పదార్థములు భుజించి భూమియందు జనించు వస్తువులచేనైన వస్త్రములుధరించి జీవింపుచు భూమి క్రుంగినప్పుడు చచ్చుచున్నాఁడదియట్లుండఁగా దేవతలు రాక్షసులు గరుడ గంధర్వ కిన్నర కింపురుష సిద్ధసాధ్య ఖచర ఖేచరాదులు మానవప్రభృతి నిఖిల శరీరధారులు లక్ష్మీకటాక్షంబుకొఱకుఁ గోటిపృత్తులాచరింపుచున్నారు.

భూలక్ష్మీప్రభృతులు వాసుదేవుని శాసనంబుచే జీవులఁ బోషింపుచున్నా రక్కారణంబున శరీరులందఱు నారాయణుని భజించినవారగుచున్నారు. 754

సుశీలుఁడు

ఈకనఁబడుచున్న మంటినే భూదేవిగాను ధనాదులనే లక్ష్మిగానుఁ దలంపవచ్చునా ? 755

వరవరముని

కాదుకాదది చాలాపొరపాటు. పుస్తకంబులు నక్షరంబులు మొదలగునవి చూచినప్పుడు సరస్వతియందు మంతమాత్రమున నవి సరస్వతికావు. సర్వవిద్యల కధిదేవత సరస్వతి, పంటల కధిదేవత భూదేవి, సంపదలకధిదేవత లక్ష్మీదేవి. భూ రమాకాంతలు సౌందర్య సౌకుమార్య లావణ్యాద్యనంత కల్యాణగుణంబులుగల స్త్రీ రూపంబులు ధరించి వైకుంఠంబునవసించి శ్రీహరిని సేవింపుచు లోకంబుల రక్షింపుచున్నారు. భూదేవిసమాచార మటుండనిచ్చి లక్ష్మీప్రభావంబు వినుము. 756

మ॥ అవధూత ల్వటు పుంగవుల్ వివిధసన్న్యాసుల్ గృహస్థాశ్రమం
బవలంబించినవారు బ్రాహ్మణులు బాహాసంభవుల్ సక్థి సం
భవులున్ శూద్రు లనేకవంశజులు శుంభద్వ్రతుల్ హాలికుల్
శివదంబైన రమాప్రసాదమునకై, చింతింతు రెల్లప్పుడున్. 757

చ॥ సవములొనర్చువారు గుడి, సత్ర తటాక వనాగ్రహారముల్
తవిలి రచించువారఖిల, దానగుణాఢ్యు లమోఘులైనతో
త్సవములు సేయువారతిథి, సంఘముఁ బ్రోచెడివార లిందిరా
స్తవమొనరింపుచుండెదరు, తత్కరుణాభవరిక్థలబ్ధికై. 758

సీ॥ లక్ష్మీకటాక్ష సంలబ్ధి లేకున్నచోఁ
జోగులౌదురు మహాభోగులెల్లఁ
బద్మాలయాకృపా ప్రాప్తిలేకున్నఁ ద
రాజులౌదురు మహారాజులెల్ల
శ్రీరమాపాంగ ప్రసారంబు లేనిచోఁ
బక్షులౌదురు ధనాఢ్యతకులెల్ల
క్షీరాబ్ధి జా దయా సిద్ధిలేకున్నచోఁ
వంతఁగాంతురు సుధీవర్యులెల్ల

నుదధిజానుగ్రహము కల్గకుండెనేనిఁ
దొత్తులౌదురు దొరసాని తుటుము లఖిల
సంపదలువాసి, భూమిపై జనులకెల్ల
నాదరవుగాదె లక్ష్మి భక్తాగ్రగణ్య. 759

సీ॥ వీరశైవులమంచు విఱ్ఱవీగెడువారు
కాపాలికులమంచుఁ గ్రాలువారు
స్మార్తమతస్థులై సంచరించెడువారు
శాక్తేయులై పూజఁజలుపువారు
గణనాథుపూజచే ఘనతఁజెందినవారు
సౌరమతమునందుఁ జేరువారు
జైనులమంచు విలాసములు దువ్వెడువారు
బౌద్ధమతస్థులై పరఁగువారు

మ్లేచ్ఛసిద్ధాంతమునసదా మెలఁగువారు
క్రైస్తవమతస్థులని పేరుఁగాంచువారు
ధనము ధాన్యంబులేకున్నఁ దనువునిల్ప
నేర రా రెంటికిని లక్ష్మి కారణంబు. 760

సీ॥ ద్వీపాంతరములకు దేశాంతరములకుఁ
జనుదురు భార్యాది జనులవీడి
ప్రాణసంశయమైన భండనంబున యోధు
లై చరింతురు కొంద ఱనవరతము
చక్రవర్తులు పరస్పర జయకాంక్షతోఁ
గావించెదరు ఘోరకదనములను
బహుశైత్య వాతాతపగ్రీష్మములకు స
హించి మౌనస్థు లెన్నెన్నొ పనులు

మానవులు విత్తమునకై సమస్తవేళ
లందుఁ దద్విత్తమునకు దైత్యారిపత్ని
ఘనకటాక్షము మూలమై తనరుఁగాన
సిరిని విడనాడి జీవించు నరుఁడు లేడు. 761

సీ॥ ప్రాణహాని భయంబుఁ బాటింప కన్య గృ
హములందు నొకఁడు చౌర్యంబొనర్చు
భార్యా సుతాదులఁ బాసి యొక్కఁడు పయో
నిధిమీఁదఁ బయనంబు నెరపనేగు
నుద్యోగియై యొక్కఁ డూరూర దేశ దే
శములలో శ్రమమొంది సంచరించు
భూరంధ్రములు సొచ్చి బోరఁగిల్లి యొకండు
దివిరి బొగ్గులు రాలు దీయుచుండు

నొకఁడు కుణపంబులుండుచోటి కరుదెంచి
కన్నుమూయక మేల్కొని కాచుచుండు
స్వాపతేయంబుకొఱకు నా స్వాపతేయ
మునకు నాధారమై లక్ష్మి పొనరుగాదె. 762

సీ॥ జననీజనకుల దూషణసేయు నొకఁ డొక్కఁ
డన్నదమ్ములమీఁద నాగ్రహించుఁ
దనయులతో విరోధముఁగాంచు నొకఁ డొక్కఁ
డాలిపైఁగినిసి మాట్లాడకుండుఁ
దనబాంధవులమీఁద దండెత్తునొకఁ డొక్కఁ
డాచార్యునైన ననాదరించు
బాటసారులనైన బంధించు నొకఁ డొక్కఁ
డతి సాధువులనైన వెతలఁబెట్టు.

నెప్పులిచ్చినవారు తన్నడఁగరాఁగ
వారి బెదిరించి దూషించి పాఱఁదోలు
మనుజుఁడు ధనార్థమై యిట్టిపనులుసేయు
గాని ప్రాప్తించునే రమా కరుణలేక. 763

సీ॥ శ్రీచూర్ణమై సదా శ్రీవైష్ణవులచేత
గంధమై యద్వైతిగణముచేత
సంకోచ పిశునమై శాక్తులచేఁ దలం
బ్రాలై వధూవరపాళిచేతఁ
బొనరు మాంగల్యమై ఘన సువాసినులచే
రహినిద్ధమై ముకురములచేత
సూనమాలికలై విశుద్ధాంగనలచేతఁ
గస్తూరియై తిలకములచేతఁ

బచ్చకర్పూరమై బహుప్రజలచేత
ఘనశుభములై యనేక లోకములచేత
గౌరవముఁ గాంచుచున్నదిగాదె శ్రీవ
ధూ కటాక్ష ప్రసారంబు దురితదూర. 764

సీ॥ సామ్రాజ్యలక్ష్మియై చక్రవర్తులచేత
జయలక్ష్మియై శూరజనులచేత
ఘన తపోధనమై సకలమునీంద్రులచేతఁ
గావ్యసామ్రాజ్యమై కవులచేతఁ
బురుధాన్యలక్ష్మియై భూతకోటులచే స
భాలక్ష్మియై సభాపతులచేత
సౌందర్యలక్ష్మియై కొందఱిచే ధైర్య
లక్ష్మియై ధీరతల్లజులచేత

జన్యలక్ష్మియగుచు శాత్రవానీక సం
హారమునకుఁ గడఁగువారిచే ను
పాస్తిఁ జేయఁబడుచు భాసిల్లు లక్ష్మి క
టాక్షమెన్న సాధ్యమగునె పుత్ర. 765

సీ॥ వితరణ లక్ష్మియై వివిధదాతలచేతఁ
బురలక్ష్మియై పౌరవరులచేత
నుద్యోగలక్ష్మియై యొగిఁ గార్యపరులచే
ధనలక్ష్మియై సర్వజనులచేతఁ
గైలాసమై యుమాగంగాధరులచేత
దివియై శచీశచీధవులచేత
వరసత్యలోకమై వాగ్వరించనులచే
మేరువై సకలానిమిషులచేత

నవనిధానములై యక్షనాథుచేత
రమ్యనందనమై యప్సరసలచే ను
పాసితంబై ప్రకాశించు భార్గవీ ని
రీక్షణాతిశయంబు వర్ణింపఁదరమె. 766

ఉ॥ ఏనుఁగులై మహాంగము ల,నేకములై వృషభాశ్వవారమై
ధేనువులై సువర్ణమణి,దీపిత సౌధములై మహత్తరో
ద్యానములై యమూల్య పరి,ధానములై యధికారదంబులై
మానవుఁ బ్రోచుచుండు నుర, మాకరుణోద్భవ వీక్షణావళుల్.

ఉ॥ మాన్యములై యనేక బహు,మానములై వివిధామయచ్ఛటా
శూన్యములై సనాతన య,శోధన హేతువులై యమోఘ సౌ
జన్యకరంబులై సుకృత, సౌఖ్యనిధానములై మనుష్యులన్
మాన్యులఁజేసి ప్రోచును ర,మాసతి దివ్యకటాక్షముల్సదా. 768

## విష్ణుపరత్వము

సమస్తశరీరధారులును సర్వకాలంబులందును లక్ష్మీకటాక్ష ప్రాప్తికై యనేకకష్టంబులపాలగుచున్నారట్టిలక్ష్మి విష్ణువు నాశ్ర యించియున్నది. విష్ణుదేవుండెవ్వరినాశ్రయింపక తనకుఁదానే యాధా రుఁడై యొప్పుచు శ్రీభూనీళాసుందరులకు మనోహరుండై బ్రహ్మాం డంబులఁ బాలించును. నారాయణుండు పరాత్పరుఁడనుటకు లక్ష్మీప తిత్వమొక ముఖ్యకారణంబని వక్కాణించితి నిఁక శ్రుతిప్రమాణంబు లిచ్చుచున్నా నెట్లంటివేని. 769

శ్రుతి:

ఏకోహవై నారాయణ ఆసీత్ నబ్రహ్మానేశానో నేమేద్యావా పృథివీ ననక్షత్రాణి నాపోనాగ్నిర్నసోమో న సూర్యః స ఏకాకీ నరమేత, తస్యధ్యానాంతస్థస్య ఏకాకన్యాదశేంద్రియాణి జాయంతే.

భావము

సృష్టికిఁబూర్వము నారాయణుఁడొక్కఁడేయుండెను. బ్రహ్మ లేఁడు, రుద్రుఁడులేఁడు, యీ భూమ్యంతరిక్షములులేవు, నక్షత్రములు

లేవు, నీరులేదు, అగ్నిలేదు, చంద్రుడులేడు, సూర్యుడులేడు. ఆభగవంతుడొంటరిగానుండుటకు దోచక సృష్టికొఱకు సంకల్పించెను. ఆసంకల్పమువలన మనస్సు, దశేంద్రియములు పుట్టెను. 770

మహోపనిషత్తు 1—1—1

శ్రుతి:

అథపునరేవ నారాయణస్సోన్యం కామం మనసాధ్యాయీత తస్య ధ్యానాం తస్థస్యలలాటాత్ స్వేదోఽపతత్ తా ఇమా ఆప స్తత్తేజో హిరణ్మయ మండమభవత్ తత్రబ్రహ్మా చతుర్ముఖోఽజాయత అథ పునరేవ నారాయణస్సోన్యంకామం మనసాధ్యాయీత తస్యధ్యానాం తస్థస్యలలాటాత్ స్వేదోఽపతత్ స్వేదాద్బుద్బుదమభవత్ బుద్బుదాత్ త్ర్యక్షః శూలపాణిః పురుషోజాయతే.

భావము

మరల నారాయణుడు సంకల్పించెను. ఆ సంకల్పమువలన నతనిలలాటమునుండి చెమటపడెను. అదియే యీనీరు. తేజోమయమైన యాస్వేదమే హిరణ్మయమైన బ్రహ్మాండమాయెను. ఆయండమునందు చతుర్ముఖుడైన బ్రహ్మపుట్టెను. పిమ్మట మరలసంకల్పించెను. సంకల్పమువలన లలాటమునుండి చెమటపడెను. దానినుండి బుడగపుట్టెను. బుడగనుండి శూలపాణియైన శివుడు జన్మించెను. 771

మహోపనిషత్తు 1—2—1

శ్రుతి:

కిం తదాసీత్ నైవేహ కిం చనాగ్ర ఆసీత్ అమూలమనాధారా ఇమాః ప్రజాః ప్రజాయంతే దివ్యోదేవ ఏకోనారాయణః

భావము

సృష్టికిఁబూర్వ మిప్పుడున్న దేమియులేదు. కారణభూతమైన దొక్కటియులేదు. జీవులందఱు నాధారములేకయుండిరి. నిత్యుఁడును లీలారతుఁడైన నారాయణుఁ డొక్కఁడేయుండెను. 772

సుబాలోపనిషత్తు 9—40

శ్రుతి:

అథ పురుషోహవై నారాయణో౽కామయత ప్రజాః సృజేయమితి అథాపః ససర్జ ♦ ♦ ♦ నారాయణాద్బ్రహ్మా జాయతే నారాయణాద్రుద్రో జాయతే నారాయణాదింద్రో జాయతే నారాయణాత్ప్రజాః ప్రజాయంతే నారాయణాత్ ద్వాదశాదిత్యా రుద్రా వసవః ప్రజాపతయశ్చ సర్వే దేవా స్సముత్పద్యంతే సర్వేలోకా స్సర్వాణిచ భూతాని నారాయణాదేవ సముత్పద్యంతే నారాయణే ప్రలీయంతే. 773

భావము

పరమపురుషుఁడైన నారాయణుఁడు ప్రజలను సృజింపఁదలంచెను. మొదట నీటిని సృజించెను ♦ ♦ ♦ నారాయణునివలన బ్రహ్మ పుట్టెను. నారాయణునివలన రుద్రుఁడు జన్మించెను. నారాయణునివలన నింద్రుఁడు గలిగెను. నారాయణునివలన సర్వప్రజ లుద్భవించిరి. నారాయణునివలన ద్వాదశాదిత్యులు ఏకాదశరుద్రులు వసువులు ప్రజాపతులు తక్కిన దేవతలు జన్మించిరి. సర్వలోకములు సర్వభూతములు నారాయణునివలననే కలుగుచున్నవి. నారాయణునియందే లీనమగుచున్నవి. 774

నారాయణోపనిషత్తు

శ్రుతి:

యన్నాభి పద్మాదభవన్ మహాత్మా ప్రజాపతిర్విశ్వసృగ్విశ్వరూపః,
తమేవవిదిత్వా౽తి మృత్యుమేతినాన్యః పంథావిద్యతే౽యనాయ

భావము

ఎవని నాభిపద్మమున విశ్వస్రష్టయు విశ్వరూపుఁడునైన బ్రహ్మ జనించెనో యట్టి పరబ్రహ్మను దెలుసుకొనినవాఁడే మృత్యురూపమగు సంసారమును దరింపుచున్నాడు. ముక్తికి మఱియొక మార్గములేదు. 775

మహోపనిషత్తు

శ్రు తి :

అస్య దేవస్య మీఢుషో వయోవిష్ణోరేషస్య అవభృథే హవిర్భిః విదేహి రుద్రో రుద్రియం మహాత్వం

భా వ ము

మహావిష్ణువును హవిరాది సాధనములచేతఁ జక్కఁగా నర్చించి రుద్రుఁడు మహాత్వమొందెను. 776

శ్రు తి :

నారాయణః పరంబ్రహ్మ, తత్త్వంనారాయణః పరః, నారాయణః పరోజ్యోతి, రాత్మా నారాయణఃపరః

భా వ ము

నారాయణుఁడే పరబ్రహ్మ, నారాయణుఁడే పరతత్త్వము, నారాయణుఁడే పరస్వరూపమైన జ్యోతి, నారాయణుడు సకలాత్మలకు నాత్మయైనవాఁడు. 777

మహోపనిషత్తు

కఠవల్లియందు

సర్వేవేదా యత్పదమామనంతి = సర్వ వేదములు ఎవని స్థానమునుఁ గూర్చి చెప్పుచున్నవో అని మొదలుపెట్టి, తత్తేపదం సంగ్రహేణ బ్రవీమి = ఆస్థానమును నీకు సంగ్రహముగాఁ జెప్పెదనని చెప్పి, సోఽధ్వనః పరమాప్నోతి తద్విష్ణోః పరమంపదమ్ = అట్టివాఁడు ప్రవృత్తి రూపమైన సంసారమును దాటుచున్నాడు. అ దాఁటిచేరునది యావిష్ణు దేవుని పరమధామమేయని చెప్పుటచేత మోక్షప్రదాయకుఁడు విష్ణువే యని తేలినది. 778

శ్రు తి :

యస్మాత్పరంనా పరమస్తి కించిత్ యస్మాన్నాణీయో నజ్యాయోస్తి కశ్చిత్ వృక్షఇవ స్తబ్ధోదివితిష్ఠత్యేకః, తేనేదం పూర్ణం పురుషేణసర్వం

భావము

ఎవనికంటెఁ బరమైనది మఱియొకటిలేదో యెవనికంటెఁ గొంచెదది గొప్పది లేదో యెవఁడొక్కఁడై నిత్యపదవియందు చెట్టువలె స్తబ్ధుఁడై నిలుచునో ఆపరమపురుషునిచే నీజగత్తంతయు వ్యాప్తమైనది.

శ్వేతాశ్వతరోపనిషత్తు

యస్మాత్పరతరం నాస్తి, పురుషాత్పరమేష్ఠినః నజ్యాయోఽస్తి నచాణీయః సతు నారాయణో హరిః యేనేదమఖిలం పూర్ణం పురుషేణ మహాత్మనా సతు నారాయణో దేవః ఇతీయం వైదికీశ్రుతిః

భావము

నిత్యపదస్థితుఁడైన యేపురుషునికంటె శ్రేష్ఠమైనది మఱియొకటి లేదో, యెవనికంటెఁ జిన్నది పెద్దదిలేదో వాఁడే నారాయణుఁడు. మహాతేజస్వియైన యేమహాపురుషునిచే నీజగత్తంతయు వ్యాప్తమైనదో యామహాపురుషుఁడు నారాయణుఁడు. 780

భార్గవసంహిత

శ్రుతిః

యద్వేదాదౌస్వరః ప్రోక్తో, వేదాంతేచ ప్రతిష్ఠితః తస్య ప్రకృతిలీనస్య యః పరః స మహేశ్వరః

భావము

వేదాంతములయందుఁ బ్రతిష్ఠింపఁబడినదియు వేదములకు మొదటిస్వరమునగు అకారముచేఁ బ్రతిపాదింపఁబడినవాఁడే జగత్ప్రభువు.

తైత్తిరీయోపనిషత్తు

శ్రుతిః

అకారో విష్ణువాచకః, అ ఇతిబ్రహ్మ, అ ఇతిభగవతో నారాయణస్య ప్రథమాభిధానం

భావము

అకారము విష్ణువాచకము. అ అనఁగా బరబ్రహ్మ, అయను నారాయణునకు మొదటినామము. 782

వ॥ ఇవి శ్రుతిప్రమాణములు, విష్ణుపారమ్య ప్రతిపాదకములగు నుపనిషత్తులను సాకల్యముగా వివరింపఁబూనినచో మన జీవితము చాలమిగనుక నింతటితో ముగించి భగవద్గీతాదులయందుఁగల విష్ణు పరత్వంబు నెఱింగించెద నాకర్ణింపుము. 783

శ్లో॥ పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్
ఆహుస్త్వామృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా
అసితో దేవలో వ్యాసః స్వయం చైవ బ్రవీషిమే

భావము

ఓ కృష్ణా! నీవు పరబ్రహ్మమనియు పరంధాముఁడనియుఁ బరమపవిత్రుఁడనియు శాశ్వతపురుషుఁడనియు నప్రాకృతుఁడనియు నాదిదేవుఁడనియుఁ బుట్టుకలేనివాఁడనియు సర్వవ్యాపకుఁడగుటచేత విభుఁడనియు ఋషులందఱు చెప్పుచున్నారు. దేవర్షియగు నారదుఁడు అసితుఁడు దేవలుఁడు వ్యాసుఁడు నట్లేచెప్పుచున్నారు నీవును చెప్పు చున్నావని శ్రీకృష్ణు నర్జునుఁడు స్తుతించెను. 784

(భగవద్గీత దశమాధ్యాయము)

వ॥ ఇంకను విష్ణు పారమ్య ప్రతిపాదకంబులగు స్మృతీతిహాస పురాణవాక్యంబు లెఱింగించెద నాకర్ణింపుము. 785

శ్లో॥ ఆద్యో నారాయణో దేవః తస్మాద్బ్రహ్మా తతో భవః.

నారాయణుండాదిదేవుఁడు. వానివల్ల బ్రహ్మయు రుద్రుఁడును జన్మించిరి. 786

శ్లో॥ క ఇతిబ్రహ్మణోనామ, ఈశోహం సర్వదేహినాం
ఆవాంతవాంగ సంభూతౌ, తస్మాత్కేశవనామవాన్

కః = అనఁగా బ్రహ్మదేవుఁడు శరీరధారులకుఁ బ్రభుండగు నే నీశుండను. మేమిద్దఱము నీదేహమునందు జనించుటచేఁ గేశవః— అను నామముగలవాఁడవైతివని హరిని రుద్రుఁడునుతించెను. 787

హరివంశము

ఈశ్లోకద్వయముచే శివపారమ్యము శివకేశవ సమత్వము నైక్యముఁ గొట్టఁబడినదిగదాయని తెలియుము. 788

శ్లో॥ స ఏవ వాసుదేవో యం, సాక్షాత్పురుష ఉచ్యతే
స్త్రీ ప్రాయమేతత్సర్వం, జగద్బ్రహ్మ పురస్సరమ్

ప్రసిద్ధుఁడగు వాసుదేవుఁడొక్కఁడే పురుషుఁడు, బ్రహ్మాది స్తంభ పర్యంతము సర్వశరీరులు స్త్రీప్రాయులు. 789

విష్ణుపురాణము

సుశీలుఁడు

లోకములో స్త్రీలెందఱుగలరో పురుషులందఱున్నారు. జగత్తంతయు స్త్రీప్రాయమని పరాశరయోగిచెప్పుటకుఁ గారణమేమి? 790

వరవరముని

అవ్వాక్యము రూపములఁగూర్చి చెప్పినదికాదు. సామర్థ్యానుభవంబులఁగూర్చి చెప్పె నెట్లందువా! స్వాతంత్ర్యమే పుంస్త్వము. పారతంత్ర్యమే స్త్రీత్వము. కర్మానుసారముగా ఫలములనుభవించువారంఱు స్త్రీప్రాయులు. ఇచ్ఛానుసారముగానుండువాఁడు వాసుదేవుఁడొక్కఁడేగనుక పురుషుఁడు వెండియుఁ బురుషోత్తముఁడు. 791

శ్లో॥ నవాసుదేవాత్పరమస్తి మంగళం, న వాసుదేవాత్పరమస్తి పావనం
న వాసుదేవాత్పరమస్తిదైవతం, న వాసుదేవం ప్రణిపత్యసీదతి

భావము

వాసుదేవునకంటె మంగళమైనది పావనమైనది లేదు. వాసుదేవునకంటె శ్రేష్ఠుఁడగు దైవములేదు. వాసుదేవునకు నమస్కరించువాఁడు క్షీణింపఁడు. 792

శ్లో॥ ఏక ఏవ జగత్స్వామీ, శక్తిమానచ్యుతప్రభుః
తదంశాచ్ఛక్తిమంతోన్యే, బ్రహ్మేశానాదయోమరాః

భావము

శక్తిమంతుఁడు ప్రభువునగు నచ్యుతుఁడొక్కఁడే జగత్తునకు స్వామి. బ్రహ్మరుద్రాదిదేవతలతని యంశముచే శక్తిమంతులైరి.

శ్లో॥ నారాయణం పరిత్యజ్య, హృదిస్థం ప్రభుమీశ్వరం
యోఽన్య మర్చయతే దేవం, పరబుద్ధ్యాసపాపభాక్।

భావము

హృదయమందున్నవాఁడును ప్రభుండు నీశ్వరుండునగు నారాయణుని విడిచి యితరదేవతనుఁ బరబ్రహ్మమనుబుద్ధితో నెవ్వఁడర్చించుచున్నాఁడో వాఁడు పాపనిలయుఁడు. 794

ప్రాజాపత్యస్మృతి

శ్లో॥ ధ్యాయేన్నారాయణం దేవం, స్నానాదిషుచ కర్మసు
బ్రహ్మలోక మవాప్నోతి, నచేహ జాయతేపునః

భావము

స్నానాది కర్మములయందు నారాయణుని ధ్యానింపవలయునట్లు చేయువాఁడు పరబ్రహ్మలోకమునుఁ బొంది మరలజన్మింపఁడు.

శ్లో॥ యేద్విషంతి మహాత్మానం, నస్మరంతిచకేశవమ్
నతేషాం పుణ్యతీర్థేషు, గతిస్సంసర్గిణామపి

భావము

మహాత్ముఁడగు కేశవు నెవ్వరు ద్వేషించి సేవింపరో యట్టి వారికిఁ దీర్ఘసేవచేఁ బుణ్యగతిలేదు. 796

భారతము

శ్లో॥ యః పుత్రః పితరం ద్వేష్టి, తంవిద్యాదన్య రేతసం
యో విష్ణుం సతతం ద్వేష్టి,తం విద్యాదంత్య రేతసం

ఏపుత్రుఁడు సదా జనకుని ద్వేషించునో వాఁడన్యబీజమునకుఁ బుట్టినవాఁడనియు నెవ్వఁడు సదా విష్ణువును ద్వేషించునో వాఁడంత్య జాతివానికిఁబుట్టినవాఁడనియునుఁ దెలియవలయును. 797

పైదానికుదాహరణము

ఒక్కతఱి నొకానొకరాజు ధర్మార్థ కామ మోక్షాహ్వయ చతుర్విధ పురుషార్థ ప్రతిపాదకములగు నాలుగుగ్రంథములనుఁ బంపిం పుమని విద్వత్పరిపాలకుఁడగు కృష్ణదేవరాయలకు నుత్తరము వ్రాసె. దానిందిలకించి రాయలు పెద్దనాదికవులంబిలిచి యా వృత్తాంతంబుఁ దెలుపఁగా వారిలోఁ దెనాలిరామకృష్ణుఁడు రాయలంగాంచి ప్రభూ! మీది విద్వత్సంస్థానమని గౌరవించి యారాజు లేఖవ్రాసినాఁడు. దానికిఁదగినట్లు మనము సన్మానముచేయవలయు నెట్లందువా! ధర్మ మునకు భారతము, అర్థమునకు రామాయణము, కామమునకుఁ గలా శాస్త్రము, మోక్షమునకుఁ భాగవతము పంపించుమని చెప్పఁగాఁ గృష్ణరాయలానందించి యట్లొనర్చి నటుపిమ్మటఁ గొన్నిదినంబులకుఁ దిరుగుజవాబువచ్చె నెట్టనఁగాఁ గృష్ణరాయప్రభూ! మీ గ్రంథము లలో మూటినంగీకరించితిమి. భాగవతము మోక్షగ్రంథమని మేము విశ్వసింపలేదని వ్రాయఁబడియుండె నది చూచి రాయలు పండి తుల కెఱింగింపఁగా రాయలతో మరల రామకృష్ణుఁడు దేవా మేమి చ్చటనేయుండి వారికి సమాధానమీయ వీలులే దచ్చటికేగవలయు నని చెప్పి రాజాంగీకారంబువడసి యల్లసాని పెద్దనతో రామకృష్ణకవి

వాహనారూఢుండై ప్రతివాదిపురంబునకరిగి రాజునుంగాంచి తదీయ సత్కారంబువడసి భోజన పానాదులచేఁ దృప్తిఁగాంచి యారేయి నిద్రించి ద్వితీయదినప్రాతఃకాలంబున సభాస్థలికరిగి భాగవతంబునుఁ దిరస్కరించినవారెవ్వరని రాజునడిగె నబ్భూపతి స్వకీయాస్థానపండితుని జూపించె. రామకృష్ణుండా ప్రతివాదింగని యయ్యా నీకులంబెయ్యది, నీపేరేమి, నీవేమిచదివితివి, భాగవతంబును నిరసించుటకు హేతువేమని ప్రశ్నించె నంతట నా ప్రతివాది రామకృష్ణునిఁగాంచి యిట్లనియె. నేను బ్రాహ్మణుండను. నాపే రుద్దండశాస్త్రి, నాకు సాహిత్యమునం దునుఁ గొన్నిశాస్త్రములయందునుఁ బూర్ణప్రవేశము గలదు. భాగవతము జారత్వ చౌర్యములుగల కృష్ణచరిత్రమని గర్హించితిననియె నమ్మాటలకులికి రామకృష్ణుడు మహాసాహసముతో సభాసదులు వినుచుండఁగా రాజుతో నిట్లనియె నయ్యా మీపండితుండు బ్రాహ్మణుండని చెప్పుచున్నాడుగాని నేనునమ్మలేను. కారణమేమనఁగా వేద వ్యాసుఁడు లోకోద్ధరణార్థమై మహాభాగవతమునురచించెను. రచించు నప్పుడు భా అనఁగా భక్తి, గ జ్ఞానము, వ వైరాగ్యము, త తత్త్వము ము ముక్తి యను నైదర్థంబులఁగూర్చి నిర్మించెనని చెప్పుదురు. అట్టి భాగవతంబును స్త్రీ పురుష విభాగ జ్ఞానములేని వైరాగ్య నిధియగు శుకయోగీంద్రుఁడు తీవ్రమోక్షాపేక్షయగు పరీక్షిద్భూవరునకు బోధించి యేడ దినంబులలో ముక్తికనిచెఁ గృష్ణావతార ప్రభావంబు భాగవత ప్రణేతయగు వ్యాసునకును విమర్శకుండగు శుకునకును సద్యోముక్తిఁ గాంచిన పరీక్షిద్భూవరునకునుఁ దెలియవలయు నన్యులకుఁ బూర్తిగా గోచరింపదు దదియట్లుండఁగా,

శ్లో॥ విష్ణుభక్తివిహీనస్తు యతిశ్చశ్వపచాధమః = విష్ణుభక్తి లేనివాఁడు యతియైనను శ్వపచునకంటె నీచుఁడనియు,

శ్లో॥ విష్ణుభక్తిపరోదేవః విపరీతస్తథాసురః = విష్ణుభక్తిపరుఁడు దేవుఁడు విష్ణుద్వేషియసురుండనియు, శ్లో॥ యోహివిష్ణుం సతతంద్వేష్టితం విద్యాదం

త్యచేతనం - సదా విష్ణుద్వేషముగలవాఁ డంత్యజాతివానికిఁ బుట్టిన వాఁడనియు శాస్త్రప్రమాణంబులు గలవుకావున నుద్దండశాస్త్రిగారి జన్మమునుఁగూర్చి విచారింపవలయునని సభాసదులకుఁజెప్పి యుద్దండ శాస్త్రినిఁగాంచి శాస్త్రిగారూ మీజన్మవృత్తాంతము మీతల్లినడిగి తెలిసికొనిరమ్మనఁగా నతండరిగి తల్లితోనవ్విషయంబెఱింగించి సత్యము సెప్పుమని నిర్బంధించె నప్పు డయ్యంగన భయంబొంది పుత్రా యే పాపాత్ముం డీరహస్యము వెల్లడించెనని ఏసుగుతో నిట్లనియెఁ దొల్లి మీతండ్రి నన్నువివాహముసేసికొని జ్యోతిష్కుండగుటచే నాజాతక మునుఁ బరీక్షింపఁగా జీవితకాలములో నొక్కనాఁడు మాలవానితో సంయోగమొనర్చునట్లుండెనట దాని కమ్మహాత్ముఁడు దుఃఖించి వేచి యుండి యాదినమురాగానే మాలవానింబిలిచి నాయెదుట వానితో నోరీ నేనీరాత్రి గ్రామాంతరమున కేగుచుంటి నిల్లుఁగాపాడుచుండు మని వచించి యెక్కడికో వెళ్లునట్లునటించి మాయింటికివచ్చుచుండు మాలవానికెదురేగి నేనింటియొద్దనేయుంటి నీవురావలదని రహస్య ముగాఁజెప్పి పంపించి తానే మాలవేషముతోవచ్చి పరుండగా నాజా తకప్రకారము వానినిమోహించి సంపర్కముసేసి గర్భవతినైతి నప్పుడు నీవుజన్మించితివి. తరువాత నాసంయోగము మీ తండ్రితోనేగాని మాలవానితోఁగాలేదని దెలిసియు భయపడుచుండగా దానినెఱింగి మీతండ్రిగారు జాతకదోషముఁదప్పించితిని చింతింపకుమని యూఱ డించెనని వక్కాణింపఁగా నుద్దండుడువిని లజ్జించి సభాస్థలంబునకుం జని యథార్థము విన్నవించె నయ్యవసరంబున సభాసదులును రాజును ప్రభూతాశ్చర్యంబునుబొంది రామకృష్ణకవి ననేకవిధంబుల సన్నుతిం చిరి. రాజుగారు రామకృష్ణునకు సువర్ణ రత్నాభిషేకంబుఁ జేయించి బహుమతులిచ్చి పంపించె నటుపిమ్మటఁ బెద్దనరామకృష్ణులానెగొంది కరిగి కృష్ణదేవరాయలకు విన్నవించి యానందింపఁజేసి సుఖంబుగా నుండిరి. 798

శ్లో॥ విష్ణుభక్తి విహీనో యః, సర్వశాస్త్రార్థవేద్యపి
బ్రాహ్మణ్యంతస్యసభవే, త్తస్యోత్పత్తిర్విరూప్యతాం

ఎవనికి విష్ణుభక్తిలేదో వానికి బ్రాహ్మణత్వము సిద్ధింపదు. కాగా వానిజన్మ మెట్లుగల్గెనాయని విచారింపవలయును. 799

శ్లో॥ చతుర్వేద్యపిరయో విప్రో, వాసుదేవం నవిందతి
వేదభారభరాక్రాంత స్సవై బ్రాహ్మణ గార్దభః

ఏవిప్రుఁడు నాలుగువేదము లెఱింగియు వాసుదేవునెఱుంగఁడో వాఁడు వేదభారమునవహించిన బ్రాహ్మణగార్దభము. 800

శ్లో॥ బ్రహ్మాదయస్సురాస్సర్వే, విష్ణుమారాధ్య తే పురా
స్వంస్వంపదమనుప్రాప్తాః, కేశవస్య ప్రసాదతః

బ్రహ్మాది సర్వనిలింపులు పూర్వము విష్ణునారాధించి వారి వారి పదవులు పొందిరి. 801

శ్లో॥ శ్వపచోఽపి మహీపాల, విష్ణుభక్తో ద్విజాధికః
విష్ణుభక్తి విహీనస్తు, యతిశ్చ శ్వపచాధమః

కుక్కమాంసమునుఁ దిను వాఁడైనను విష్ణుభక్తుఁడు బ్రాహ్మణునికంటె నధికుఁడు. విష్ణుభక్తి లేనివాఁడు బ్రాహ్మణుఁడై యంమలో యతియైనను శ్వపచునికంటెను నీచుఁడగును. 802

శ్లో॥ యథాసర్వేషు వేదేషు, నాస్తి నారాయణాత్పరః
తథాసర్వేషు మంత్రేషు, నాస్తి చాష్టాక్షరాత్పరః

సర్వవేదములయందును నారాయణునకంటె శ్రేష్ఠుఁడెట్లులేఁడో యట్లే యష్టాక్షరికంటె గొప్పమంత్రములేదు. 803

శ్లో॥ సర్వవేదాంతసారార్థ స్సంసారార్ణవతారకః
గతిరష్టాక్షరోనౄణాం, మపునర్జన్మ కాంక్షిణాం

జన్మరాహిత్యంబుఁగోరువారికి సర్వవేదాంతసారార్థమైనదియు సంసార సముద్రము దాఁటించునట్టిదియగునట్టి యష్టాక్షరిమంత్రమే గతియైయున్నది. 804

శ్లో॥ ఆర్తా విషణ్ణాశ్శిథిలాశ్చభీతా
ఘోరేషుచవ్యాధిషు వర్తమానాః
సంకీర్త్య నారాయణ శబ్దమాత్రం
విముక్త దుఃఖా స్సుఖినోభవంతి

ఆర్తులైనవారు విషణ్ణులైనవారు శిథిలులైనవారు భీతినొందిన వారు ఘోరవ్యాధులుగలవారు నారాయణనామ ముచ్చరించి దుఃఖములచే విడువఁబడి సుఖములఁగాంతురు. 805

శ్లో॥ నారాయణేతిశబ్దశ్చ, వాగస్తి వశవర్తినీ
తథాపినరకేఘోరే, పతంతీతికిమద్భుతమ్

నారాయణశబ్ద మూరకలభించుచున్నది. దానినుచ్చరించుటకు వాక్కు స్వాధీనములోనున్నది యట్టినారాయణశబ్దమును వాక్కుతో నుచ్చరింపలేక జనులు ఘోరనరకమునఁబడుచున్నారు. 806

శ్లో॥ కింతత్ర బహుభిర్మంత్రైః కిం తత్రబహుభి ర్వ్రతైః
నమోనారాయణాయేతి, మంత్రస్సర్వార్థసాధకః

అనేకమంత్రములతోడ ననేకవ్రతములతోడనుఁ బ్రయోజనము లేదు. ప్రణవనమస్సులతోఁగూడిన నారాయణమంత్రమే సర్వార్థ సాధకము. 807

శ్లో॥ నారాయణః పరంబ్రహ్మ, తత్త్వం నారాయణః పరః
యచ్చ కించిజ్జగత్యస్మిన్, దృశ్యతే శ్రూయతేఽపివా
అంతర్బహిశ్చ తత్సర్వం, వ్యాప్యనారాయణః స్థితః

నారాయణుఁడు పరబ్రహ్మ. నారాయణుఁడు శ్రేష్ఠమైన తత్త్వము యీజగత్తునందు దేనికనఁబడుచున్నదో యేది వినఁబడు

చున్నదో దానియందును లోపల వెలుపల సర్వమునందును నారాయ
ణుఁడు వ్యాపించియున్నాఁడు. 808

శ్లో॥ ఆలోక్య సర్వశాస్త్రాణి, విచార్యచ పునఃపునః
ఇదమేకం సునిష్పన్నం, ధ్యేయో నారాయణస్సదా

సర్వశాస్త్రములు మరలమరల విచారింపఁగా ధ్యానింపఁబడఁ
దగినవాఁడు నారాయణుఁడని సిద్ధాంతీకరింపఁబడినది. 809

శ్లో॥ సత్యంసత్యం పునస్సత్య, ముద్ధృత్యభుజముచ్యతే
వేదశాస్త్రాత్పరంనాస్తి, నదైవం కేశవాత్పరమ్

వేదశాస్త్రముకంటె శ్రేష్ఠమైనది కేశవునకంటె దైవములేదు.
ఇట్లని చేయెత్తి చెప్పఁబడుచున్నది. సత్యము సత్యము సత్యము.

శ్లో॥ సంసారార్ణవమగ్నానాం, విషయాక్రాంతచేతసాం
విష్ణుపోతం వినానాన్య, త్కించిదస్తి పరాయణం

సంసారసముద్రమునఁబడి విషయములచే నాక్రమింపఁబడిన
వారికి విష్ణువను నావగాక మఱియొకగతిలేదు. 811

శ్లో॥ నారాయణం సమారాధ్య, యాతాముక్తిం ముముక్షవః
వాసుదేవ మనారాధ్య,కో మోక్షం సమవాప్నుయాత్

నారాయణుని లెస్సగానారాధించి ముముక్షువులు మోక్షముఁ
జెందిరి, వాసుదేవునిభజింపక మోక్షమెవ్వఁడుజెందును యెవ్వఁడును
లేడనుట. 812

శ్లో॥ యుగకోటిసహస్రాణి, విష్ణుమారాధ్య పద్మభూః
పునస్త్రైలోక్య ధాతృత్వం, ప్రాప్తవానితిశుశ్రుమః

బ్రహ్మదేవుఁడు సహస్రకోటియుగములు విష్ణు నారాధించి
మరల త్రైలోక్యమును సృష్టించుశక్తిని సంపాదించెను. 813

శ్లో॥ బ్రహ్మాద్యాస్సకలాదేవా, మనుష్యాః పశవస్తథా
విష్ణోర్మాయయా మహావర్త, మోహాంధ తమసావృతాః

శ్లో॥ ఆబ్రహ్మస్తంభ పర్యంత జగదంతర్వ్యవస్థితాః
ప్రాణినః కర్మజనిత, సంసారవశవర్తినః

బ్రహ్మ ప్రముఖదేవతలందఱు మనుష్యులు పశువులు విష్ణుమాయావర్తమనెడు మహాంధకారముచే నావరింపఁబడియున్నారు. బ్రహ్మమొదలు స్తంభపర్యము జగత్తునందున్న ప్రాణులు ప్రాకృతకర్మముచేఁ గలిగిన సంసారదుఃఖమున కధీనులైయున్నారు. 814

వ॥ ఇంతవఱకును నీకు శ్రుతి స్మృతిప్రమాణంబులచే విష్ణువే సర్వోత్కృష్టుండని యెఱిఁగించితి నిఁక నితిహాసప్రమాణంబు లెఱింగించెద నాలింపుము. 815

శ్లో॥ వేదే రామాయణేచైవ, భారతే భరతర్షభ
ఆదౌమధ్యే తథాంతే, విష్ణుస్సర్వత్రగీయతే

వేదమునందును, రామాయణమునందును, భారతమునందు నాదిమధ్యాంతములయందంతటను విష్ణువే కీర్తింపఁబడుచున్నాడు. ఆదికావ్యమగు రామాయణ మేమిచెప్పుచున్నదోవినుము. 816

శ్లో॥ కోన్వస్మిన్ సాంప్రతం లోకే, గుణవాన్ కశ్చవీర్యవాన్
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ, సత్యవాక్యో దృఢవ్రతః

ఇప్పుడీలోకమునందుఁ గల్యాణగుణపరిపూర్ణుఁడు వీర్యవంతుఁడు ధర్మజ్ఞుఁడు కృతజ్ఞుఁడు సత్యవాది దృఢవ్రతుఁ డెవ్వఁడని యడిగిన వాల్మీకినిగుఱించి. 817

శ్లో॥ ఇక్ష్వాకువంశప్రభవో రామోనామ జనైఃశ్రుతః

ఇక్ష్వాకువంశమునఁబుట్టిన రాముఁడే పరాత్పరుఁడని నారదుఁడు నక్కాణించెను. 818

శ్లో॥ అహంవేద్మి మహాత్మానం, రామం సత్య పరాక్రమం
వసిష్ఠోఽపి మహాతేజా, యేచేమే తపసిస్థితాః

ఓ దశరథుఁడా ! యీరాముని సత్యపరాక్రమాది ప్రభావము. అన్నఁగాఁ బరబ్రహ్మమగుట నేనెఱుంగుదును. సరస్వతీవల్లభపుత్రుం డగు వశిష్ఠుఁడును గొప్ప తపస్సంపన్నులగు నగస్త్యాది మునులు నెఱుంగుదురని విశ్వామిత్రుఁడు చెప్పెను. దీనిచేఁ దపశ్శక్తి లేనివానికి రామపరతత్త్వము తెలియదని తేటపడినది. 819

శ్లో॥ ఆకాశప్రభవో బ్రహ్మశాశ్వతో నిత్యఅవ్యయః

విష్ణు నాభీకమలంబునఁబుట్టిన బ్రహ్మ నాకాశంబునఁ బుట్టెనని వసిష్ఠుఁడు చెప్పుటచే నాకాశశబ్దము విష్ణుపరమనియు నారాయణుండొకసముభంగి సర్వ వ్యాపకుఁడని నిర్దోషియని శాశ్వతుఁడని తెలుచున్నది. 820

వ॥ ఒకానొకసమయంబున దేవతలు బ్రహ్మకడకేగి శివకేశవులయం దెవ్వరధికులని యడుగఁగా నాకునుఁదెలియదు మీరే చూడుడని హరిహరులకుఁ గలహంబుఁ గల్పించె నప్పుడు శివుఁ డోడె. విష్ణువు జయించె నక్కారణంబున. 821

శ్లో॥ అధికం మేనిరే విష్ణుం దేవాస్సర్షి గణాస్తథా

దేవతలును మునులును విష్ణువే సర్వాధికుండని తలంచిరని పరశురాముఁడు రాఘవునితోఁజెప్పెను. 822

వ్యా॥ విష్ణుపరాక్రమైః జడీకృతం ధనుః శితికంఠం దృష్ట్వా
సకలజగద్వ్యాపకం విష్ణుం శితికంఠా త్పరాక్రమైః
జ్ఞానశక్త్యాదిభిశ్చ అధికం సర్వోత్తమం మేనిరే

అని అద్వైతమతస్థులగు మహేశ్వరతీర్థులవారు వ్యాఖ్యానముసేసిరి. 923

శ్లో॥ తేవయం భవతారక్ష్యాః, భవద్విషయవాసినః
నగరస్థో వనస్థోవా త్వంనో రాజా జనేశ్వర

మేము నీదేశవాసులము నీచేఁ గాపాడఁబడఁదగినవారము రాజ్యమునందున్నను వనమునందున్నను మాకు నీవేరక్షకుండవని దేహాభిమాన లోకాభిమాన వర్జితులగు దండకామునులు శరణాగతి చేయుటచే రామపరత్వమును వెల్లడించిరి. 824

శ్లో॥ రామోవిగ్రహవాన్ ధర్మః సాధుస్సత్యపరాక్రమః
రాజాసర్వస్య లోకస్య, దేవానాం మఘవానివ

రాముఁడు విగ్రహముఁదాల్చినధర్మము, సాధువు, సత్యపరాక్రమములుగలవాఁడు దేవతలకు దేవేంద్రునికీతి సర్వలోకములకుఁ బ్రభువుచుమీాయని మారీచుఁడుసెప్పెను, 825

శ్లో॥ త్వమ ప్రమేయశ్చ దురాసదశ్చ
జితేంద్రియశ్చోత్తమధార్మికశ్చ
అక్షయ్యకీర్తిశ్చ విచక్షణశ్చ
క్షితిక్షమావాన్ క్షతజోపమాక్షః

రామా! నీవు ప్రమాణములచే నిర్ణయింప నలవికానివాఁడవు. పొందనలవికానివాఁడవు. ఇంద్రియములజయించినవాఁడవు. ధర్మాత్ములలో శ్రేష్ఠుండవు. నాశములేని కీర్తిమంతుఁడవు. మహాపండితుండవు. నేలభంగి నోర్పుగలవాఁడవు. ఎఱ్ఱని లోచనాంతములు గలవాఁడవని తార రాముని నుతించెను. 826

శ్లో॥ బ్రహ్మా స్వయంభూశ్చతురాననోవా
రుద్రస్త్రినేత్రస్త్రిపురాంతకోవా
ఇంద్రో మహేంద్ర స్సురనాయకోవా
త్రాతుం నశక్తా యుధిరామవధ్యం

స్వయంభువైన నాలుగుమోములుగల బ్రహ్మగాని త్రినేత్రములుగలిగి త్రిపురసంహారమొనర్చిన రుద్రుండుగాని దేవతాప్రభువై వృత్రాసురునివధించిన యింద్రుఁడుగాని రాముఁడు వధింపఁదీర్మానించినవానిని రక్షింపలేరు. "త్రాతుం నశక్తాః" యను బహువచనంబుచే ముగ్గురేకీభవించియుఁ గావఁజాలరని శ్రీయాంజనేయులవారు రావణునితోఁజెప్పిరి. 827

శ్లో॥ సర్వలోకశరణ్యాయ రాఘవాయ మహాత్మనే
నివేదయతమాం క్షిప్రం, విభీషణముపస్థితమ్

సర్వలోకశరణ్యుఁడై రఘుకులమునందవతరించిన పరమాత్మయగు రామునకు నాసమాచారము విన్నవింపుఁడని వానరులతోఁ విభీషణుఁడు చెప్పె నిదేవిధమున నతికాయుఁడు మాల్యవంతుఁడు మందోదరి యకంపనుఁడు మొదలగువారు రాక్షసులైనను రామపరతత్వము ననేకవిధంబులఁ గొనియాడిరి. 828

వ॥ రావణవధానంతరంబున లంకాపురంబునకు బ్రహ్మాదిదేవతలరుగుదెంచిరి. వారిలో బ్రహ్మదేవుండు శ్రీరామచంద్రుంగాంచి

శ్లో॥ భవాన్నారాయణో దేవ, శ్రీమాం శ్చక్రాయుధోవిభుః

అని ప్రారంభించి రామా! నేనీకుఁ గ్రోడము సరస్వతి నీజిహ్వా దేవతలు నీరోమములు జగత్తు నీశరీరము నీకోప మగ్ని నీప్రసాదము చంద్రుఁడు శ్రీవత్సమను మచ్చ నీకు లాంఛనము సీత లక్ష్మీదేవి నీవు విష్ణుండవు నీవు సర్వేశ్వరుఁడవు సర్వమయుండవు నీవుగాని దెద్దియును లేదు యావత్తు నీవైయున్నావని విరించి సర్వదేవతా సమక్షంబున రాముని స్తుతించెను. కోసలదేశప్రజలందఱు నశ్వమేధయాగకాలంబున రామాయణ మామూలాగ్రముగా రామసన్నిధానమందు విని పునీతులై రామానుగ్రహంబుచే ముక్తిఁగాంచిరి. కాబట్టి రామా

యణమంతయు విష్ణుపరత్వమును వెల్లడించుచున్నది. ఇంక భారత విషయ మాలోచింతము. 828

వ॥ మహాభారతము రచించునప్పుడు వేదవ్యాసుఁడు నారాయణకథఁ జెప్పెదనని ప్రతిజ్ఞఁ జేసెను. దానికిఁదార్కాణముగా భగవద్గీతాశాస్త్రంబును విష్ణుసహస్రనామస్తోత్రంబును భారత మధ్యంబున నిక్షేపించి భారతంబునుఁ దిక్కనసోమయాజి ఆంధ్రభాషగా మార్చునప్పుడు వ్యాసుండు సోమయాజి స్వప్నంబున సాక్షాత్కరించి సోమయాజీ! భారతమహాసముద్రమునందు భగవద్గీతావిష్ణుసహస్రనామ రత్నములు దాచియున్నాను. వానిని భాషాంతరీకరణ మొనర్చుటకు నీబుద్ధిచాలదు విడిచి పైభాగమునకుఁ బొమ్మని యంతర్హితుండయ్యె నక్కారణంబునఁ దిక్కయజ్వ గీతాసహస్రనామ స్తోత్రములను దెలుఁగుభాషకు మార్చలేదు శంకరాచార్యులవారు భగవద్గీతకు విష్ణు నామములకు భాష్యమువ్రాసెను. శివగీతలకు శివ సహస్రనామమునకు వ్రాయలేదు. ఇంతేకాక శంకరభగవత్పాదులు కాశిలోనుండి

శ్లో॥ గేయం గీతానామసహస్రం ధ్యేయం శ్రీపతి రూప మజస్రం
నేయం సజ్జనసంగతమనిశం దేయం దీనజనాయచవిత్తం

భగవద్గీతావిష్ణుసహస్రనామములను బఠింపవలెను. శ్రీపతిరూప మున జస్రమును ధ్యానింపవలయును. సజ్జనసాంగత్య మెల్లప్పుడు సేయవలెను. విత్తమును దీనులయం దుపయోగపరచవలయునని భజగోవిందశ్లోకములయందు వచించె నిదియిట్లుండఁగా. 829

వ॥ మయసభా మధ్యంబున రాజసూయాధ్వర సమయంబున భీష్మునసుజ్ఞచే ధర్మనందనుఁడు శ్రీకృష్ణున కగ్రపూజ నొసంగఁగా సూర్యరశ్మినోర్వని ఘూకంబువలె శిశుపాలుఁడుసహింపక వాసుదేవుని దూషింపుచుండె నా సమయంబున లక్షలకొలఁదిగానుండు సభాసదు

లేమియుం బలుకక యూరకుండిరి. వారింగని శిశుపాలాభిప్రాయం
బునకు వీరందఱు సమ్మతించిరేమోయను సందేహముతో రోషా
వేశమనస్కుండై సహదేవుం డిట్లనియె. 830

శ్లో॥ కేశవం కేశి హంతారమప్రమేయ పరాక్రమం
పూజ్యమానంమయాయోవః కృష్ణం నసహతే నృపాః
సర్వేషాం బలినాం మూర్ధ్ని మయేదం నిహితం పదం

అప్రమేయపరాక్రముఁడును కేశి యను రాక్షసునిఁ జంపిన
వాఁడునగు శ్రీకృష్ణుని మేము పూజించినందులకీ సభలో నెవ్వరు
సహింపరో యట్టి సర్వబలాఢ్యులగు మీ శిరస్సునందు నాయెడమ
పదంబు మోపెదనని పలికె నందులకు సంతోషించి దేవతలు. 831

శ్లో॥ పుష్పవృష్టిర్మహత్యాసీ త్సహదేవస్య మూర్ధని
సహదేవుని శిరస్సునందుఁ బుష్పవర్షముఁ గురియించిరి. 832

శ్లో॥ కృష్ణం కమలపత్రాక్షం, నార్చయిష్యంతియే నరాః
జీవన్మృతాస్తు తేజ్ఞేయాః, నసంభాష్యాః కదాచన

కమలపత్రములవంటి కన్నులుగల శ్రీకృష్ణు నెవ్వరుపూజింపరో
వారు బ్రతికియుఁ జచ్చినవారు. ఎప్పుడైనను వారితో సంభాషింప
రాదని దేవర్షియు జగద్గురుండగు నారదుండు వచించెను. 833

వ॥ సౌగంధికపుష్పమునకేగు భీమునితో విష్ణువే జగత్కారణ
వస్తువనియుఁ బరబ్రహ్మమనియు నతండు కృతయుగంబునఁ దెల్లని
రూపంబుతోఁ ద్రేతాయుగంబున నెఱ్ఱనిరూపంబుతో ద్వాపరంబునఁ
బచ్చనిరూపంబుతోఁ గలియుగంబున నల్లనిరూపంబుతో లోకంబుల
రక్షించుచుండునని నవవ్యాకరణపండితుండును బ్రహ్మవిదగ్రేసరుండు
నగు హనుమంతుండు చెప్పెను. 834

వ॥ విశేషధర్మశ్రవణ కుతూహలమానసుండగు ధర్మసూను
నకు భీష్ముం డిట్లనియె. 835

శ్లో॥ గ్రహాచంద్రార్క నక్షత్రా ఖందిశో భూర్మహోదధిః
వాసుదేవస్య వీర్యేణ, విధృతాని మహాత్మనః

గ్రహచంద్రార్క నక్షత్రములు ఆకసము దిశలు భూమి సము
ద్రము వాసుదేవశక్తిచే ధరింపఁబడుచున్నవి. 836

శ్లో॥ ససురాసుర గంధర్వం, సయక్షోరగరాక్షసం
జగద్వశే వర్తతేదం, కృష్ణస్య స చరాచరమ్

సురాసుర గంధర్వ యక్ష పన్నగ రాక్షసాదులతోఁగూడిన
చరాచర ప్రపంచమంతయు శ్రీకృష్ణునివశములోఁ బ్రవర్తింపుచున్నది.

శ్లో॥ ఇంద్రియాణి మనోబుద్ధి స్సత్వం తేజో బలం ధృతిః
వాసుదేవాత్మకాన్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవచ

ఇంద్రియములు మనస్సు బుద్ధి సత్వము తేజస్సు బలము
ధైర్యము క్షేత్రము క్షేత్రజ్ఞుఁడు వాసుదేవాత్మకములని చెప్పుదురు.

శ్లో॥ ఋషయః పితరో దేవాః మహాభూతానిధాతవః
జంగమా జంగమంచైవ జగన్నారాయణోద్భవమ్

మునులు పితృదేవతలు మహాభూతములు ధాతలు జంగమ
స్థావరంబులు వీనితోఁగూడిన జగత్తు నారాయణునివలన నుద్భ
వించెను. 839

శ్లో॥ యోగోజ్ఞానం తథాసాంఖ్యం, విద్యా శిల్పాది కర్మచ
వేదశాస్త్రాణి విజ్ఞానమే తత్సర్వం జనార్దనాత్

యోగము జ్ఞానము సాంఖ్యము విద్యా శిల్పాది కర్మములు
వేదములు శాస్త్రములు విజ్ఞానము విష్ణునివలనఁ బుట్టినవి. 840

శ్లో॥ ఏకోవిష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః
త్రిలోకాన్ వ్యాప్య భూతాత్మా భుంక్తే విశ్వభుగవ్యయః

తక్కిన భూతము లనేకములున్నవి. విష్ణువొక్కఁడే మహాభూతము. అవ్యయుండైన విష్ణు వీవిశ్వము ననుభవించుచున్నాఁడు. 841

శ్లో॥ విశ్వేశ్వరమజం దేవం జగతః ప్రభవాప్యయమ్
భజంతియే పుష్కరాక్షం, నతేయాంతి పరాభవం

విశ్వమున కీశ్వరుఁడు, పుట్టుకలేని వాఁడు. దేవుఁడు జగత్తులనుఁ బుట్టించువాఁడు, నవ్యయుఁడునగు కమలాక్షు నెవ్వరు భజింతురో వారు పరాభవమునుఁ బొందరని భీష్మాచార్యుండు యుధిష్ఠిరున కెఱింగించెను. 842

(భారతానుశాసనికపర్వము)

పాండవులు కామ్యకవనంబున నుండఁగా మార్కండేయమునీంద్రుఁడరుగుదెంచి పురాణగాథలు సెప్పుచుండఁగా శ్రీకృష్ణుం డచ్చోటికివచ్చె నప్పుడు పెన్నిధింగన్న బీదలపోల్కి నవ్వనవాసు లందఱు సంతోషించి వాసుదేవునిఁ బూజించి కృష్ణుండు సుఖాసీనుండైన పిమ్మట నందఱునుఁ గూర్చుండిరి.అటుపిమ్మట మార్కండేయుండు ధర్మరాజుతో రాజేంద్రా! పూర్వ మొకప్పుడు ప్రళయముచే లోకమంతయు జలమయంబుకాఁగా నేను నిలువ వీలులేక యల్లాడుచుం బోయిపోయి యొక్కచోట వటపత్రశాయియగు బాలునిఁగంటి నబ్బాలుండు నన్నుఁగాంచి మార్కండేయా చాలాడస్సితివి. నాపొట్టిలో విశ్రమింపుమనియె నంతట నాకేనాశ్చర్యమొంది యిబ్బాలుం డెవ్వఁడితనిపొట్టెంత? విశ్రమించుటెట్లని విచారింపుచుండఁగా నాప్రయత్నంబు లేకయే యబ్బాలునిలోఁ బ్రవేశించి బ్రహ్మాండంబంతయు నుండుటఁ గాంచి చిరకాలంబు సుఖించి మరల బహిర్గతుండనైన నన్నుఁగాంచి యబ్బాలకుండు మునీంద్రా! నేను జగత్కారణుండగు నాది నారాయణుండనని నిజప్రభావంబుఁ గొంత నాకుఁదెల్పి యదృశ్యుండయ్యె.

శ్లో॥ యః సదేవో మయాదృష్టః, పురా పద్మాయతేక్షణః
స ఏవ పురుష వ్యాఘ్రః, సంబంధీతే జనార్దనః

ఏదేవుని పూర్వము యుగక్షయకాలంబున నేనుచూచితినో ఆ పద్మాక్షుండు పురుష శ్రేష్ఠుఁడు జనార్దనుం డితఁడే యిప్పుడు నీకు బంధువైనాఁడు. 844

శ్లో॥ అస్యైవ వరదానాద్ధి, స్మృతిర్నప్రజహాతిమామ్
దీర్ఘమాయుశ్చ కౌంతేయ, స్వచ్ఛందమరణంమమ

ఈదేవుని వరప్రభావమువలననే జ్ఞాపకశక్తి నన్నువిడువలేదు. దీర్ఘాయువును స్వచ్ఛందమరణము నితనివలననే కలిగినది. 845

శ్లో॥ సర్వేషామేవ భూతానాం, పితామాతాచ మాధవః
గచ్ఛధ్వమేనం శరణం శరణ్యం కౌరవర్షభ

ఓధర్మరాజా ! సర్వభూతములకుఁ దల్లియుఁ దండ్రియునై లక్ష్మీపతియై రక్షకుండగు శ్రీకృష్ణుని శరణుఁజెందుమని మార్కండేయుండు వక్కాణించెను. 746

(భారతారణ్యపర్వము)

సుశీలుఁడు

అత్రిమహాముని సంతానముఁ బడయంగోరి జగత్కారణవస్తు వెద్దియని నిర్ణయింపలేక యట్టిపరమేశ్వరుండు ప్రసన్నుఁడగుఁగాకయని తపంబొనర్చె నప్పుడు బ్రహ్మ రుద్రులతోఁగూడి విష్ణువు ప్రత్యక్షమయ్యె నయ్యవసరంబున నత్రిమహాముని వారిఁగని వేల్పులారా ! నేనొక్కనిఁగూర్చి తపంబుచేయఁగా మీరు ముగ్గురు కానఁబడుటకుఁ గారణంబేమని ప్రశ్నించె నప్పుడు నారాయణుం డత్రిమునితో నయ్యా నీసంకల్పమున కన్యథా యెద్దియు జరుగదు. మేము ముగ్గురము నీచేధ్యానింపఁబడిన యేకవస్తువేనని చెప్పి కోరిన వరంబులిచ్చి

బ్రహ్మపుత్రులతోఁ సంతర్పింపకుండరయ్యె. దీనింబట్టి త్రిమూర్తు లేక
మను నద్వైతసిద్ధాంతము స్థిరపడినట్లున్నదే. 847

వరవరముని

అంతమాత్రముచే నేకత్వము సిద్ధింపదు. మునికిఁ ద్రిమూర్తు
లలో నొక్కఁడుమాత్రమే సాక్షాత్కరించి బ్రహ్మ విష్ణు మహేశ్వరు
లవసరములేదు, వారి ముగ్గురిరూపము నేనొక్కఁడనే ధరించితినని
చెప్పినచో నేకత్వము సిద్ధించునేమోకాని యిప్పు డట్లుగాక వాహన
భేదములతోఁ జిహ్నభేదములతో నాకారభేదములతో సాక్షాత్క
రించి ముగ్గురు మూఁడువరంబులొసంగి చనిరి. యత్రికోరినది కామ్యార్థ
మైన సంతానముగనుక విష్ణువు తనపరత్వమునుఁ బ్రకటింపవలసినపని
లేకపోయినది. 848

సుశీలుఁడు

హరి మోక్షార్థికిఁ బరాత్పరత్వము ప్రకటించునా? 849

వరవరముని

భగవంతుఁడుగాని యన్యదేవతలుగాని మోక్షవిషయమున
బరాత్పరత్వమునుఁ బ్రకటించితీరవలయును. ఘంటాకర్ణుఁడు శివు
నారాధించి మోక్షమిమ్మని యడుగఁగా మోక్షప్రదాత నారాయ
ణుఁడుగాని యన్యులుగారని చెప్పి తొలంగె. ఘంటాకర్ణుఁ డప్పటి
నుండి విష్ణు నారాధించి మోక్షంబుఁ జెందె నది యట్లుండనిమ్ము
గజేంద్రుఁడు శాస్త్రాధికారము లేనందువల్ల భగవంతుఁడు ఫలాని
వాఁడని తెలియనివాఁడగుటచే నాపత్కాలంబున నిట్లనియె నెవ్వ
నిచే లోకంబులు జనించెనో యెవ్వనిచే వృద్ధిఁగాంచునో యెవ్వనిచే
లయించునో యెవ్వఁడు సర్వవ్యాపకుఁడో యాదిమధ్యాంతరహి
తుఁడో సర్వశక్తుఁడో సర్వేశ్వరుఁడో మునులు నిర్జరు లెవ్వని
మహిమం బెఱుంగరో యట్టివాని జేర్కొనుచుంటినని నుతింపఁగా
బ్రహ్మ రుద్రాది దేవతలందఱు మేముగామని తొలంగిరి. కాని విష్ణు

దేవుఁడు సాక్షాత్కరించి మకరినిఁ ద్రుంచి విపత్తుఁ బాపి కరీంద్రునకు మోక్షంబ సంగెను. అత్రిముని శాస్త్రాధికారియైనను బ్రహ్మ విష్ణు మహేశ్వరుల మువ్వురిని మనస్సునం దలంచి వీరిలో జగత్కారణ వస్తు వెద్దియోయని ధ్యానింపఁగా వాస్తవమునకు నారాయణుఁడే జగత్కర్తయైనను సృష్టిలయముల కధికారము బ్రహ్మరుద్రుల కిచ్చి యుండుటచే మేము ముగ్గురము నీచే ధ్యానింపఁబడిన జగత్కారణు లమేనని చెప్పి ముగ్గురు మూఁడువరంబు లొసఁగి చనిరి. దానిచే నత్రి మునికి నారాయణాంశముచే దత్తాత్రేయుఁడు బ్రహ్మాంశముచేఁ జంద్రుఁడు శివాంశముచే దుర్వాసుఁడు జనించిరి.

శ్లో॥ యాదృశీ భావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ

అనునట్లు అత్రిమహాముని చిత్తానుసారముగా గోచరించి భగవంతుఁడు కామ్యార్థమొసంగెను. కాని గజేంద్రుఁ డన్యంబేమియు నెఱుంగక ప్రథమపురుషవాచకంబులచేఁ బరబ్రహ్మను ధ్యానింపఁగా నతండు ప్రసన్నుఁడై యనిష్టంబుఁ దొలంగించి మోక్షంబ సంగెను. బ్రహ్మ రుద్రాదులుకూడఁ బరస్వరూపులైనచో హరితోసహా గజేంద్రునకు సాక్షాత్కరింపవలయు నట్లురాకపోగా గజేంద్రేరిత బిరుదంబులుతమకులేవని ముందుగానే మేముగామని తొలంగిరి. త్రిమూర్తులకు నేకత్వ మెప్పటికినిఁ బొసఁగదు. బ్రహ్మరుద్రాదులు జీవులు, నారాయణుఁ డొక్కఁడే పరాత్పరుఁడు. 850

సు శీ లుఁ డు

అట్లైనచో హరిహరబ్రహ్మలను నేకసమాస మేలకలిగెను ?

వ ర వ ర ము ని

విష్ణుదేవుఁడు వేల్పులలో వామనుఁడై బ్రాహ్మణులలోఁ బరశురాముఁడై జలచరములలో మత్స్య కూర్మములై మనుష్యులలో రామ కృష్ణులై యవతరించినట్లు బ్రహ్మ రుద్రులలో జగద్రక్షణార్థము విష్ణ్వవతారమెత్తె నందువలన నాసమాసము కలిగినది. 852

వ॥ ఇంతవఱకును నీకు శ్రుతిస్మృతీతిహాసంబులచే పరాత్పరుండు విష్ణుదేవుండని వక్కాణించితి నిఁకఁ బురాణంబులసంగతి వినుము. 853

సుశీలుఁడు

స్వామీ ! పురాణములెన్ని ? వాని నామధేయములేవి ?

పరవరముని

పురాణములు పదునెనిమిది. వానినామంబులు పేరుకొనియెద వినుము. 855

శ్లో॥ బ్రాహ్మం పాద్మం వైష్ణవంచ శైవం భాగవతం తథా
తథాన్యన్నారదీయంచ, మార్కండేయంచ సప్తమమ్
ఆగ్నేయ మష్టమంచైవ భవిష్యన్నవమంస్మృతమ్
దశమం బ్రహ్మకైవర్తం లైంగ్య మేకాదశంస్మృతమ్
వారాహంద్వాదశంచైవ స్కాందంచైవత్రయోదశమ్
చతుర్దశం వామనంచ కౌర్మంపంచదశంతథా
మాత్స్యంచ గారుడంచైవ బ్రహ్మాండంచ తతఃపరమ్

1 బ్రహ్మపురాణము, 2 పద్మపురాణము, 3 విష్ణుపురాణము 4 శివపురాణము, 5 భాగవతము, 6 నారదపురాణము, 7 మార్కండేయపురాణము, 8 అగ్నిపురాణము, 9 భవిష్యత్పురాణము, 10 బ్రహ్మకైవర్తపురాణము, 11 లింగపురాణము, 12 వరాహపురాణము, 13 స్కాందపురాణము, 14 వామనపురాణము, 15 కూర్మపురాణము, 16 మత్స్యపురాము, 17 గరుడపురాణము, 18 బ్రహ్మాండపురాణము.

సుశీలుఁడు

ఈపురాణముల రచించినవారెవ్వరు ? 857

పరవరముని

శ్లో॥ అష్టాదశ పురాణానాం కర్తా సత్యవతీసుతః

అని యున్నదిగనుక యిమ్మహాపురాణంబులు రచించినవాఁడు వ్యాసమునీంద్రుఁడు. 858

సుశీలుఁడు

వ్యాసుఁడు శైవుఁడా, వైష్ణవుఁడా అద్వైతమతస్థుఁడా ? 859

పరవరముని

వేదవ్యాసుఁడు శైవుఁడుగా దద్వైతియుఁగాఁడు. నిష్కల్మష వైష్ణవుఁడు వ్యాసుఁడొక్కఁడేకాక రామావతారానుభవమున్నదై యనేక పురుషాంతరములు సూర్యవంశజులకుఁ బౌరోహిత్యమొనర్చిన వసిష్ఠుండు నతనికుమారుండగు శక్తిముని శక్తిపుత్రుండై విష్ణుపురాణము రచించిన పరాశరుఁడు పారాశర్యుండైన వ్యాసుఁడు వ్యాసపుత్రుండగు శుకయోగీంద్రుఁడు నారదుఁడు నరనారాయణులు సనకుఁడు సనందనుండు సనత్కుమారుఁడు సనత్సుజాతుఁడు వాల్మీకి హారీతుఁడు గర్గుఁడు మొదలగు మహామునులందఱు వైష్ణవులేకాని యితరమతస్థులుకారు నిస్సందేహము. 860

సుశీలుఁడు

పురాణములన్నియు విష్ణువునే బోధించునా ? 861

పరవరముని

పురాణములలోఁ గొన్ని సాత్వికములు కొన్ని రాజసములు కొన్నితామసములు.వానివాని భేదంబు లెఱింగింతు వినుము. 862

శ్లో॥ వైష్ణవం నారదీయంచ తథాభాగవతమ్ శుభమ్
గారుడంచ తథాపాద్మం, వారాహంశుభదర్శనే
షడేతాని పురాణాని సాత్వికాని నిబోధమే

విష్ణుపురాణము, నారదీయము, భాగవతము, గారుడము, పాద్మము, వరాహము యివి సాత్త్వికపురాణములు. 833

శ్లో॥ బ్రహ్మాండం బ్రహ్మవైవర్తం, మార్కండేయం తథైవచ
భవిష్యద్వామనం బ్రాహ్మం, రాజసానినిబోధమే

బ్రహ్మాండపురాణము, బ్రహ్మవైవర్తము, మార్కండేయము, భవిష్యత్పురాణము, వామనము, బ్రహ్మపురాణము యివి రాజసములు. 834

శ్లో॥ మాత్స్యం కౌర్మం తథాలైంగ్యం శైవంస్కాందం తథైవచ
ఆగ్నేయంచషడేతాని, తామసాని వరాననే

మత్స్యపురాణము, కూర్మపురాణము, లైంగ్యము, శైవము స్కాందము, ఆగ్నేయము యివియారును తామసపురాణములు. 835

శ్లో॥ నారాయణంపరంయానివదంతి జగదీశ్వరమ్
తాని సర్వాణి శాస్త్రాణి సాత్త్వికాని మతానిమే

పరబ్రహ్మమును జగదీశ్వరుండునగు నారాయణప్రభావమును జెప్పుచున్న శాస్త్రములు సాత్త్వికములు. 836

శ్లో॥ చతుర్ముఖం కృశానుంచ, తథాదేవీం సరస్వతీం
పరత్వేనవదేద్యచ్ఛాస్త్రం, రాజసం తత్ప్రచక్షతే

బ్రహ్మ అగ్ని సరస్వతీదేవి, వీరిపరత్వము నేవి చెప్పుచున్నవో రాజసములు. 837

శ్లో॥ సల్లింగ దుర్గా విఘ్నేశ, కుమార ప్రముఖాన్ సురాన్
ప్రశంసతిచయచ్ఛాస్త్రం, తత్తామసముదాహృతమ్

నాలింగమును దుర్గను విఘ్నేశ్వరునిఁ గుమారునిఁగూర్చి యేశాస్త్రము వక్కాణించుచున్నదో యది తామసమనఁబడును. 838

శ్లో॥ తామసం దుర్గతిందత్తే, రాజసం స్వర్గదంభవేత్
సాత్వికం మోక్షసామ్రాజ్య, ధౌరంధర్యందదాత్యహో

తామసశాస్త్రము దుర్గతిని, రాజసము స్వర్గమును సాత్వికము మోక్ష సామ్రాజ్యము నిచ్చు నివియెల్లనుఁ బార్వతీదేవికి శివుండుసెప్పెను. 869

(పారాశర్యోపపురాణము)

సుశీలుఁడు

సాత్వికపురాణంబులయందు నితరదేవతాప్రభావంబు గలదు. రాజస తామస శాస్త్రములందు విష్ణుప్రభావంబున్నది. సాత్విక రాజస తామసములకు భేదము కనఁబడలేదే ! 870

వరవరముని

సాత్వికశాస్త్రమనఁగా రాజస తామస మిశ్రమేకాని శుద్ధ సాత్వికముగాదు. శుద్ధసాత్వికము పరమపదమునందుమాత్రమే కలదు. లీలావిభూతియందు లేదు. 871

సుశీలుఁడు

అట్లైనచో నిదమిత్థమని నిర్ణయించుటకు నాధారములేదే ?

వరవరముని

కుంచెడుపాలలోఁ జేరెడు నీళ్లు కలిసిననుఁ బాలనియందురు. కుంచెడునీటిలోఁ జేరెడు పాలుగలిసినను నీళ్ళనియందురు. ఇదేవిధంబున నేగుణ మెక్కువగానున్నచో దాని కాపురాణమనిపేరు. 873

సుశీలుఁడు

ఇప్పురాణ నిర్మాణమునకుఁ గారణమేమి ? 874

వరవరముని

వేదార్థము సామాన్యమానవులకు గోచరింపదని భగవదంశ సంభూతుండగు వ్యాసుండు తదీయార్థము సులభశైలితోఁ బంచమ

వేదంబగు భారతమునందును పురాణములయందును నిరూపించి చెప్పెను. వీనిలో విష్ణుపురాణమునకుఁ బురాణరత్నమనియు రామాయణమునకు నితిహాసరత్నమనియు భగవద్గీతకు భారతరత్నమనియు ద్వయమంత్రమునకు మంత్రరత్నమనియు నాళవందారు స్తోత్రమునకు స్తోత్రరత్నమనియు బిరుదులుగలవు. 875

సుశీలుఁడు

వ్యాసుండు వైష్ణవుండంటివి. పురాణములు నానాదేవతా పరములుగా రచించుటకుఁ గారణంబేమి ? 876

వరవరముని

జననమాదిగా శాల్యన్నము భుజించువాఁడైనను వాణిజ్యము సేయఁదలంచినప్పుడు పత్తనముఁజేరి నివసింపవలయు నటుపిమ్మట వీథిలో దుకాణము పెట్టవలయును. దుకాణములో నొక్క బియ్యము మాత్ర ముంచుకొన్నందువలన నానాజనోపయోగములేదు కాబట్టి దుకాణములో బియ్యమేకాకుండ జొన్నలు సజ్జలు రాగులు వరిగెలు జనపవిత్తులు మినుములు సెనగలు పెసలు కందులు జనపనార గోగునార మిరపగాయలు చింతపండు బెల్లము లవణము మొదలగుపదార్థములన్నియు నుంచవలయు నేదికావలసినవాఁడు దానిఁగైకొందు రట్లె వ్యాసుండు వివిధదేవతోపాసకోపయోగార్థమై పురాణములయందు నాయాదేవతాప్రభావంబు వెల్లడించెను. 877

సుశీలుఁడు

ఏదేవత కేపాటిసామర్థ్యముగలదో యంతమాత్రమే చెప్పవలయునుఁగాని ప్రతిదేవతకుఁ బరత్వమునుఁ జెప్పవలసిన పనియేమి ?

వరవరముని

పూర్వకర్మానుసారముగా నొక్కొక్కమానవున కొక్కొక్క దేవతయందుఁ బ్రీతిజనించు నద్దేహముండఁగా నారుచి మాఱదు. కాబట్టి యాయా దేవతాభక్తుఁడా యా దేవతను లెస్సగా భజించుటకు నా యా పురాణము లుపయోగించును. లేనిచో నే దేవతను భజింపక నాస్తికులగుదురని వ్యాసుండట్లు తీర్మానించెను. 879

సుశీలుఁడు

వేదవ్యాసుం డన్యదేవతాభక్తులకై పురాణములు నిర్మించి నందువల్ల లాభమేమి? 880

వరవరముని

శ్లో॥ ఆకాశాత్పతితం తోయం, యథాగచ్ఛతి సాగరం
సర్వదేవనమస్కారః, కేశవం ప్రతిగచ్ఛతి

ఆకసమునుండిపడిన వర్షధారలన్నియు నెట్లు సాగరమునుఁ బొందుచున్నవో యట్లే సర్వదేవతలనుఁగూర్చి చేసిన పూజానమస్కారాదులు దేవతాంతర్యామియైన శ్రీహరినిఁ జెందుచున్నవి. 881

శ్లో॥ సూర్యస్యైవతుయోభక్త, స్సప్తజన్మాంతరంనరః
తస్యైవతు ప్రసాదేన విష్ణుభక్తః ప్రజాయతే

ఏమనుజుం డేడుజన్మంబులయందు సూర్యోపాసన మొనర్చునో వాఁడా సూర్యునికారుణ్యముచే విష్ణుభక్తుండై జనించును. 882

శ్లో॥ శంకరస్యతుయోభక్త, స్సప్త జన్మాంతరంనరః
తస్యైవతు ప్రసాదేన, విష్ణుభక్తః ప్రజాయతే

ఏమనుజుం డేడుజన్మములయందు శంకరు నుపాసించునో వాఁడు తదీయానుగ్రహంబుచే నటుపిమ్మట విష్ణుభక్తుండగును. 883

వ॥ ఈప్రమాణంబులచే సత్వగుణప్రాధాన్యులై దేవతాంతర భక్తి సేసినవారు తత్పుణ్యముచేఁ గొంతకాలమునకు విష్ణుభక్తులై ముక్తిఁగాంతురు, సద్యోముక్తినిఁ బొందఁజాలరు. ఈ హేతువుచే వ్యాసుం డితరదేవతాప్రభావమును సహితము పురాణంబులలో వెల్లడించెను. 884

**గద్యము:** ఇది శ్రీసీతావల్లభ ప్రసాద సమాసాదిత కవితాప్రవీణ
వేదాల సీతారామాచార్య కృపాలబ్ధ మంత్ర రత్నాను సంధాన
పవిత్రాంతరంగ నిఖిల దుర్మత శిలోచ్చయదంభోళీ భూత
సముద్రాల లక్ష్మణాచార్యానుగ్రహాబోధిత విశిష్టాద్వైత
రహస్యార్థ ధురంధర శఠగోపయతిరాడ్వర వర యోగి
ప్రభృతి పూర్వాచార్య చరణ సరోజ భ్రమ
రాయమాన కృష్ణమాంబా కృష్ణార్య తనూజ
శ్రీవైష్ణవవిధేయ వేంకటదాస నామధేయ
ప్రణీతంబైన జ్ఞానసూర్యోదయమునందు
ద్వితీయ భాగము
సంపూర్ణము

శ్రీమతే రామానుజాయనమః

# జ్ఞానసూర్యోదయము

## తృతీయ భాగము

## భగవదాకారనిరూపణము

సుశీలుండు

భగవంతుండు నిర్గుణుండా సగుణుండా ? 885

వరవరముని

భగవంతుండు నిర్గుణుండని సగుణుండని రెండువిధములుగా చెప్పటనులేదు. కల్యాణగుణపరిపూర్ణుండని హేయగుణ రహితుండని వేదములు చెప్పుచున్నవి. 886

సుశీలుండు

నిర్గుణుండని కొందఱు చెప్పుచున్నారే ! 887

వరవరముని

శ్లో॥ అచింత్యావ్యక్తరూపాయ, నిర్గుణాయ గుణాత్మనే

ఇత్యాది వాక్యంబులు శాస్త్రమునందుఁగలవుకాని నిర్గుణుండనఁగా హేయగుణరహితుండని సగుణుండనఁగాఁ కల్యాణగుణ పరిపూర్ణుండని యర్థము, లోకములో మన మొకనింగాంచి వీఁడు గుణ హీనుండా యన్నపుడు మంచిగుణములు లేనివాఁడని యర్థమగుంగాని యేగుణములు లేనివాఁడని కాదుగదా. గుణదోషములు విమర్శింప

వలయునన్నప్పుడు గుణమనఁగా మంచిదనియు దోషమనఁగాఁ జెడ్డ యనియు నర్థముకాదా! దీనికొక నీతిశ్లోకమిచ్చెద నాలింపుము.

శ్లో॥ ఏకోఽపి గుణవాన్ పుత్రో, నిర్గుణానాం శతైరపి
ఏకచంద్రప్రకాశేన, నక్షత్రైః కిం ప్రయోజనమ్

గుణహీనులైన కుమారులు నూర్గురికంటెను గుణవంతుఁడైన కుమారుఁ డొక్కఁడు మేలు. చంద్రుఁ డొక్కఁడుండినను లోకము ప్రకాశించును. వేనవేల నక్షత్రములుండినను బ్రయోజనములేదు.

శ్లో॥ ఏకోఽపి గుణవాన్ శిష్యః, నిర్గుణానాం శతైరపి
ఏకసూర్య స్తమోహంతి ఖద్యోతైః కిం ప్రయోజనం

నిర్గుణులైన నూఱుమంది శిష్యులకంటెను గుణవంతుఁ డొక్కఁడేచాలు నెట్లనఁగా సూర్యుఁడొక్కఁడే చీఁకటి నశింపఁజేయుచున్నాడు. మిణుగురుబూచు లనేకముండినను బ్రయోజనములేదు.

వ॥ ఈరెండుశ్లోకములచేఁ దేలినభావమేమనఁగా శ్లోక ద్వితీయ పాదములయందు నిర్గుణులైన కుమారులనియు నిర్గుణులైన శిష్యు లనియు నున్నది. నిర్గుణులనఁగా సుగుణములు లేనివారని యర్థమగుఁ గాని యేగుణములులేని శూన్యులని యర్థము కాదుగదా యట్లే భగవంతుఁడు నిర్గుణుఁడని శాస్త్రముండుటవలన హేయగుణరహితుఁ డని యర్థము. దీనికిం దార్కాణముగా. 891

శ్లో॥ అహుశ్చ్వేదాసమానం కతిచనకతిచారాజకం విశ్వమేత
ద్రాజన్వత్కేచిదీశంగుణిన మపి గుణైస్తం దరిద్రాణమన్యే
భిక్షావన్యే సురాజవ్యవమితిచజడాస్తే తలాతల్యకాఙ్క్ష
శ్చ్యైతే శ్రీరంగ హర్మ్యాంగణ కనకలతే నతుణాం లక్ష్యమాసన్

ఓతల్లీ! రంగనాయకీ కొందఱు వేదముల ప్రమాణమని చెప్పుచున్నారు. కొందఱీవిశ్వమునకు నీశ్వరుఁడు లేఁడనియుఁ గొందఱీశ్వ

రుండుండినను నిమిత్తమాత్రుఁడనియుఁ గొందఱు కల్యాణగుణ పరిపూర్ణుఁడైన యీశ్వరుని గుణహీనుఁడనియు గొందఱు భిక్షువగు రుద్రుని సర్వేశ్వరుఁడనియుఁ జెప్పుచు వేదవిరుద్ధములగు మతములు కల్పించుకొని కలహింపుచుందురు రట్టివారు నీకటాక్షమునకు దూరులైనను పాత్రులుగారని పరాశరభట్టరువారు నుతించిరి. 892

(శ్రీగుణరత్నకోశము)

శ్లో॥ వశీవదాన్యో గుణవానృజుశ్శుచి
ర్మృదుర్దయాళుర్మధురస్స్థిరస్సమః
కృతీ కృతజ్ఞస్త్వమసి స్వభావత
స్సమస్త కల్యాణగుణామృతోదధిః

భక్తుల వశములోనుండువాఁడును భక్తుల కోరిక లిచ్చువాఁడును గుణవంతుఁడును ఋజుస్వభావము గలవాఁడును మృదుస్వభావుఁడును దయాపరుఁడును జలింపని స్వభావము గలవాఁడవును సర్వసముఁడును తలఁచిన పనులన్నియు నెఱవేర్చువాఁడవును, యితరులొనర్చిన మేలు మఱవనివాఁడును నగు నీవు స్వభావముతోడనే సమస్తకల్యాణగుణామృత సముద్రుఁడవగుచున్నావని శ్రీయాళవందారు సన్నుతించిరి. 893

(స్తోత్రరత్నము)

వ॥ ఇదేప్రకారము భగవంతుఁడు సర్వకల్యాణగుణ పరిపూర్ణుఁడని శ్రీరామానుజులవారు వేదాంతదేశికులవారు శ్రీకృష్ణపాద దేశికులు నంజియ్యరు నంబిళ్ల పిళ్లైలోకాచార్యులవారు మొదలగు పూర్వాచార్యులు వారి వారి గ్రంథములయందుఁ దీర్మానించిరి. పన్నిద్దఱాళ్వార్లు పంచనంబులు నళ్లె భగవంతుని నుతించిరి. మాధ్వమతస్థులందఱు నీశ్వరుఁడు గుణాఢ్యుఁడనియే వచించిరి. భజగోవింద శ్లోకములయందును లక్ష్మీనృసింహస్తోత్రమునందును రామ కర్ణామృతమునందును భగవద్దివ్యమంగళ విగ్రహంబును గల్యాణగుణంబులను

శంకరభగవత్పాదులవారు వర్ణించిరి. ఇంతేకాక జగన్నాథపండితుని
కరుణాలహరి, మధుసూదనసరస్వతి ఆనందమందాకిని, లీలాశుకుని
కృష్ణకర్ణామృతము, దీక్షితులవారి ఆనందలహరి, నారాయణతీర్థులవారి
కృష్ణలీలాతరంగిణి, త్యాగరాజస్వామి కృతులు, భద్రాద్రిరామదాస
స్వామికీర్తనలు వివిధ దేశభాషలయందుండు హరికీర్తనలు పద్యములు
పాటలు యివియావత్తు భగవత్కల్యాణగుణవర్ణనములైయున్నవి. 894

సునీలుఁడు

ఇప్పుడు మీరుచెప్పినవారందఱు కలియుగంబునఁ బుట్టినవారు.
వీరి సమాచార మట్లుంచి పూర్వ యుగములవారి సమాచార
మెఱింగింపుడు. 895

వరవరముని

పూర్వయుగములయందుసహా సర్వేశ్వరుఁడు గుణహీనుఁడని
యొక్కరును జెప్పలేదనరేకదా రావణసంహారముఁ జేయింపఁగోరి
దేవతలు భగవంతునిఁ బ్రార్థింపఁగా. 896

శ్లో॥ ఏతస్మిన్నంతరేవిష్ణు, రుపయాతో మహాద్యుతిః
శంఖ చక్ర గదాపాణిః, పీతవాసా జగత్పతిః

ఇంతలో శంఖ చక్ర గదా పాణియై పీతాంబరముధరించి మహా
తేజస్సుతో జగత్పతియైన విష్ణుదేవుఁడు సాక్షాత్కరించెను. తరువాత
దేవత లద్దేవాదిదేవునకుఁ దమవిషయము విన్నవించుకొనిరి. 897

(శ్రీరామాయణబాలకాండము)

వ॥ వాల్మీకి నారదునకు నమస్కరించి పరాత్పరుఁ డెవ్వఁడని
యడుగఁగా గల్యాణగుణపరిపూర్ణుఁడగు శ్రీరాముఁడేనని వక్కా
ణించెను. వాల్మీకి రాముని కల్యాణగుణములు వర్ణించి రామాయణ
సర్వకాండములయందు నిక్షేపించెను. దండకాటవిలోనుండు మునీం
ద్రులు వేలవర్షంబులు తపంబాచరించి ధ్యానయోగంబుఁజలిపి పొంద

రాని యానందమును సీతాపతి దివ్యాంగ సౌందర్య లావణ్య సౌకుమార్యాదులఁ గాంచినప్పుడు పొందిరి. ఖరాదుల వధించినప్పుడు గదా మునీంద్రులబాధ నశించినది. శరభంగమహాముని శ్రీరామ చంద్రునిఁ జూడఁగానే దేవేంద్రవిమానమును బాటిఁదోలి రాముని దర్శించి యప్పురుషోత్తమునకు స్వకీయ తపఃఫలంబంతయు ధారవోసి మోక్షముఁజెందెను. దాశరథి దర్శనముచేతనే సుతీక్ష్ణమునీంద్రుఁ డమందానందముఁ గాంచెను. రామదర్శనమైనదాఁక శబరికి జన్మ సాఫల్యము కాలేదుగదా! మరుత్సుతుఁడు సీతారామదర్శన ప్రాప్తిచే నపరిమితానందముఁగాంచెను. విభీషణుఁడు రామపాదప్రాప్తిచే నార్తి విడిచెను. సీతాదేవి లంకలో నున్నప్పుడు రామధ్యాన మొనర్చియు దుఃఖముతోడనేయుండి రామసంయోగముచే సుఖించెను. భరతుఁడు శత్రుఘ్నుఁడు కౌసల్యాసుమిత్రాదు లయోధ్యాపురవాసులు రామ ధ్యానముచేఁ బొందరాని సుఖంబు రామదర్శనముచే ననుభవించిరి. రామప్రాప్తికొఱకుగదా లక్ష్మణస్వామివారు స్రక్చందన భార్యా వస్త్రాభరణ ధనధాన్యాదుల విసర్జించెను. ఈవృత్తాంతములచేఁ దేలిన దేమనఁగా భగవంతుఁ డెప్పుడును దివ్యమంగళ విగ్రహుఁడనియుఁ గల్యాణగుణ పరిపూర్ణుడనియుఁ గుణహీనుఁడు రూపరహితుఁడు కాడ నియు సర్వేశ్వరునిదర్శించి స్పర్శించి తదీయ దివ్యగుణాలాపామృతంబు లనుభవించినంగాని దేహధారులకు సుఖంబు కలుగదనియు భావము.

పూర్వము వేదవ్యాసుఁడు మహాభారతమునురచించి వ్యాకుల చిత్తుఁడై దుఃఖింపుచుండఁగా నారదుండు సాక్షాత్కరించి చింతా కారణంబడిగి యిట్లనియె నోవ్యాసా! మహాకవీంద్రుండవైయుండియు నితర కథావ్యాసంగంబుచేఁ గాలంబు గడిపితివి. దానిచే నీకుఁ జిత్త వ్యాకులత గలిగె నిఁక హరిగుణవర్ణన మొనర్పుమనఁగా భగవన్మహి మాతిశయమును బ్రకటించు భాగవతమును రచించి కృతార్థుఁ డయ్యెను, భీష్మాచార్యుఁడు ధర్మనందనున కఖిల ధర్మంబు లుపదే

శించి యటుపిమ్మటఁ బ్రతిదినము విష్ణుసహస్రనామంబులు పారాయ
ణము సేయుమనియు నట్లుసేయువా రెన్నటికిఁ బరాభవముఁ జెంద
రనియు మోక్షధర్మంబులందెల్ల నిది యుత్తమ ధర్మంబనియు నొక్కి
వక్కాణించెఁగాని నామ రూపాదులులేని మొద్దుదేవునింగూర్చి
యొక్కవాక్యంబైనం జెప్పలేదు సరేగదా తాను మేను విడువఁ
బోవునప్పుడు. 899

శ్లో॥ త్రిభువనకమనం తమాలవర్ణం, రవికరగౌరవరాంబరందధానే
వపురలకకులావృతాననాబ్జే, విజయసఖేరతిరస్తుమేఽనవద్యా

త్రిభువన మనోహరుఁడై, చీఁకటిమ్రాకువర్ణముగలిగి, సూర్య
కిరణ ప్రభా సదృశంబగు వస్త్రముధరించి, ముంగురులతోఁ గూడిన
ముఖాబ్జముగలిగియున్న విజయసఖుండగు కృష్ణునియందు నాకు మంచి
ప్రేమకలుగుంగాక. 900

శ్లో॥ యుధితురగరజో విధూమ్రవిష్వ
క్కచలులితశ్రమవార్యలంకృతాస్యే
మమనిశితశరైర్విభిద్యమాన
త్వచివిలసత్కవచేఽస్తు కృష్ణఆత్మా

యుద్ధమునందు గుఱ్ఱపుగిట్టల దుమ్మునచే ధూసరవర్ణమై యిటు
నటు చలింపుచున్న ముంగురులచే వ్యాపింపఁబడినదియు స్వేదబిందు
వులచే నలంకృతమైనదియునగు ముఖము గలవాఁడును నా వాడి
కోలలచేఁ జీల్పఁబడిన చర్మముగలవాఁడగుటచేతఁ దదీయరక్తముచేఁ
బ్రకాశింపుచున్న కవచముగలవాఁడగు శ్రీకృష్ణునియందు నా మనస్సు
దృఢమగుఁగాక. 901

శ్లో॥ సపది సఖివచోనిశమ్యమధ్యే నిజపరయోర్బలయోారథంప్రవేశ్య
స్థితవతి పరసైనికాయురక్ష్ణా హృతవతిపార్థసఖేరతిర్మమాస్తు

సఖుండగు నరునిమాటలువిని యప్పుడే యుభయసేనామధ్య మందు రథంబునిల్పి విరోధిసేనల యాయువులను గాలప్రాయమైన చూపులచే హరింపుచున్న శ్రీకృష్ణునియందు నాకు మంచి ప్రీతి కలుగుఁగాక. 902

శ్లో॥ వ్యవహితపృతనాముఖం నిరీక్ష్య
స్వజనవధాద్విముఖస్య దోషబుద్ధ్యా
కుమతిమహరదాత్మవిద్యయా య
శ్చరణరతిః పరమస్య తస్య మేఽస్తు

దూరమునందున్న విరోధిసైన్యములఁగాంచి చంపిన దోషమని యెంచి కుమతియైన ఫల్గునునకు జ్ఞానవిద్య నుపదేశించి తేర్చిన పరమ పురుషుఁడగు శ్రీకృష్ణుని పాదములయందు నాకుఁ బ్రీతిగలుగుఁగాక.

శ్లో॥ స్వనిగమ మపహాయ మత్ప్రతిజ్ఞా
మృతమధికర్తుమవప్లుతో రథస్థః
ధృతరథచరణోఽభ్యయాచ్చలద్గు
ర్హరిరివ హంతుమిభం గతోత్తరీయః

తనప్రతిజ్ఞనువిడిచి నాప్రతిజ్ఞను సత్యముచేయుటకై చక్రము పట్టుకొని రథమునుండిదిగి యుత్తరీయము జాఱునట్లు గజముపైఁకి బోవు సింహమువలె నాపైకి దుమికిన శ్రీకృష్ణదేవుండు నన్ను రక్షించుగాక. 904

శ్లో॥ శితవిశిఖహతో విశీర్ణదంశః, క్షతజపరిప్లుత ఆతతాయినో మే
ప్రసభమభిససార మద్వధార్థః స భవతు మే భగవాన్ గతిర్ముకుందః

మదీయ తీక్ష్ణశరములచేఁ గవచముపగులుటచేత నెత్తురుచేఁ దడిసిన మేనుగలవాఁడై బలాత్కారముగా నివారింపుచున్న ఫల్గును నతిక్రమించి నన్నువధించుట కుద్యోగించిన మోక్షాధికారియగు భగవంతుఁడు నాకుగతియగుఁగాక. 905

శ్లో॥ విజయరథకుటుంబ అత్తతోత్త్రే
ధృతహయరశ్మిని తచ్ఛ్రియేక్షణీయే
భగవతిరతిరస్తు మే ముమూర్షో
ర్యమిహ నిరీక్ష్య హతాగతాస్స్వరూపం

ఎవ్వఁడు ములుకోలను గుఱ్ఱముల పగ్గములనుధరించి యర్జునుని రథంబునందు సారథివేషముతోఁ బ్రకాశింపుచుండెనో యుద్ధరంగమున నీల్గు శూరులెవ్వనిఁగాంచి మోక్షప్రాప్తిఁ జెందుచున్నారో యట్టి భగవంతుఁడగు శ్రీకృష్ణునియందు మరణింపఁగోరునాకు మిక్కిలి ప్రీతిఁగలుగుఁగాక. 906

శ్లో॥ లలితగతి విలాసవల్గుహాస
ప్రణయనిరీక్షణ కల్పితోరు మానాః
కృత మనుకృతవత్య ఉన్మదాంధాః
ప్రకృతిమగన్ కిలయస్య గోపవధ్వః

మంచినడకలచేతను శృంగారాది విలాసములచేతను జిఱునవ్వులచేతను స్నేహముతోఁగూడిన నిరీక్షణములచేతను నేర్పరుపఁబడిన పూజలుగలవారును శ్రీకృష్ణుని దివ్యచేష్టల ననుసరింపుచున్నవారునగు గోపవధూమణు లెవ్వని సామ్యమును బొందిరో యట్టి శ్రీకృష్ణునిపై నాకపారప్రీతి కలుగుఁగాక. 907

శ్లో॥ మునిగణనృపవర్య సంకులేంతస్సదసి యుధిష్ఠిరరాజసూయయేషాం
అర్హణముపపేద ఈక్షణీయో మమదృశిగోచర ఏష ఆవిరాత్మా

ఋషిసమూహములచేతను నృపవర్యులచేతను నిండింపఁబడిన ధర్మజునిసభయందు రాజసూయావసరమున సభ్యుల కాశ్చర్యమొనగూర్చుచుఁ బూజింపఁబడినవాఁడును జగముల కాత్మయైనవాఁడును నగు శ్రీకృష్ణుఁడు మదీయదృష్టియందు నిలుచుఁగాక. 908

శ్లో॥ క్షితిభరమవరోపితుం కురూణాం
శ్వసన ఇవాసృజదక్షౌ వంశవహ్నిం
తమిమమహమనువ్రతార్తిహంత్రిం
హృదిపరిరభ్య జహామి మర్త్యనీడమ్

నేలబరువుఁ దొలంగింపనెంచి వెదుళ్ళయందు నిప్పుఁబుట్టించు గాలివలెఁ గురుసమూహములకుఁ బోరుఁగల్పించి చంపినవాఁడును భక్తుల దుఃఖములఁ బోగొట్టువాఁడునగు శ్రీకృష్ణుని మదీయమనస్సుచేఁ గౌఁగిలించి మానవశరీరమును విడుచుచున్నానని మహాభక్తుఁడును బండితుండును నస్ఖలిత బ్రహ్మచారియగు భీష్ముండు చరమదశయందుఁ గల్యాణగుణపరిపూర్ణుండగు భగవంతుని దివ్యమంగళ విగ్రహమునే స్తుతింపుచుఁ బ్రాణములువిడిచి ముక్తింజెందెఁగాని గుణహీనుఁడు రూపరహితుఁడగు శుద్ధదేవుని నుతింపలేదు. 909

(భాగవతము ప్రథమస్కంధము,

వ॥ తపస్సుఁజేయుట కుద్యోగించి మధువనంబున కేగుచున్న ధ్రువునింగూర్చి. 910

శ్లో॥ శ్రీవత్సాంగం ఘనశ్యామం, పురుషం వనమాలినం
శంఖ చక్ర గదా పద్మై, రభివ్యక్త చతుర్భుజమ్

శ్లో॥ కిరీటినం కుండలినం, కేయూర వలయాన్వితమ్
కౌస్తుభాభరణగ్రీవం, పీతకౌశేయవాససమ్

శ్లో॥ కాంచీకలాపపర్యంతం, లసత్కాంచననూపురం
దర్శనీయతమం శాంతం, మనోనయనవర్ధనమ్
స్మయమాన మభిధ్యాయేత్, సానురాగావలోకనమ్

శ్రీవత్సచిహ్నముగలవాఁడును జీమూతవర్ణుఁడును పురుషోత్తముఁడును వనమాలను ధరించినవాఁడును శంఖ చక్ర గదా పద్మము

లచే నొప్పు చతుర్భుజములుగలవాఁడును గిరీట కుండల కేయూర వల యములతోఁ గూడినవాఁడును, కంఠమందుఁ గౌస్తుభరత్నము గల వాఁడును, కాంచీకలాపముచే నలంకరింపఁబడినవాఁడును, దర్శనీయుఁ డును, శాంతుఁడును మనోనయనములకు హర్షమిచ్చువాఁడును నవ్వు చున్నవాఁడును ప్రేమయుక్తములగు కటాక్షములుగలవాఁడును నగు హరిని ధ్యానింపవలయునని నారదుం డుపదేశించెను. 911

(భాగవతము చతుర్థస్కంధము)

శ్లో॥ వనే వివిధకుసుమ కిసలయ తులసికాంబుభిః
కందమూల ఫలోపహారైశ్చ సమీహామానో భగవత
ఆరాధనం వివిక్త ఉపరత విషయాభిలాష
ఉపభృతోపశమః పరాం నిర్వృతిమవాప

మహాయోగియగు భరతుఁడు వివిక్తమైన వనంబునందుఁ బ్రవే శించి విషయాభిలాషనువదలి యింద్రియనిగ్రహంబుగలిగి మిక్కిలి సంతోషమును బొంది వివిధ పుష్పకిసలయ తులసీదళములచేతను గందమూలఫలాదులచేతను భగవదారాధన మొనర్చెను. 912

శ్లో॥ ఏవం సహస్రవదనాంఘ్రి శిరఃకరోరు
నాసాస్యకర్ణనయనాభరణాయుధాఢ్యం
మాయామయం సదుపలక్షితసన్నివేశం
దృష్ట్వా మహాపురుషమాప ముదం విరించః

ఇట్లు సహస్రవదనములు సహస్రసంఖ్యచే నొప్పు పాదములు శిరస్సులు కరము లూరువులు నాసికలు నోళ్లు నేత్రములు వీనితోఁ గూడినవాఁడును దివ్యాభరణములు గలవాఁడును మాయామయుఁ డును బ్రపంచముచే గ్రహింపఁబడిన స్థితిగలవాఁడును నగు, మహాపురుషునిన్నుఁ గాంచి యాదికాలమందు బ్రహ్మ మహా సంతోషమును బొందెను. 913

శ్లో॥ తస్మైస్మభగవాన్ హయశిరస్తనుమాత్రబిభ్ర
ద్వేదద్రుహావతి బలౌ మధుకైటభాఖ్యౌ
హత్వాఽఽనయచ్ఛ్రుతిగణాంశ్చ రజస్తమశ్చ
సత్త్వం తవప్రియతమాంతనుమామనంతి

నీవు హయగ్రీవరూపమునుధరించి వేదద్రోహులు మహాబలాఢ్యులు రజస్తమోరూపులునైన మధుకైటభులను సంహరించి శ్రుతులను బ్రహ్మకిచ్చితివిగనుక సత్త్వమే నీకుఁ బ్రియస్వరూపమని బ్రహ్మవేత్తలు దెలిసికొనుచున్నారు. 914

శ్లో॥ ఇత్థంనృతిర్యగృషిదేవఝషావతారై
ర్లోకాన్ విభావయసి హంసి జగత్ప్రతీపాన్
ధర్మం మహాపురుషపాసి యుగానువృత్తం
ఛన్నఃకలౌయదభవస్త్రియుగోఽథసత్వం

ఓభగవంతా! మనుష్యులయందుఁ దిర్యక్కులయందు ఋషులయందు దేవతలయందు నవతరించి లోకవిరోధులగు దుష్టుల వధింపుచున్నావు. ధర్మము నిలుపుచున్నావు. కృతాది మూఁడుయుగంబుల నవతరింతువు. దీనిచేఁ ద్రియుగుండని ఖ్యాతివహించితివి. కలియుగంబునఁ బ్రచ్ఛన్నరూపముతోనుండి యా యా కార్యము లొనర్చుచున్నావుచుమీయని ప్రహ్లాదుండు చెప్పెను. 915

వ॥ ఏడవనాఁడు మోక్షముఁజెందవలయునని తొందరపడుచున్న పరీక్షిద్భూవరుం డంతిమదివసంబున శుకయోగీంద్రునిఁగాంచి. 916

శ్లో॥ అవతీర్యయదోర్వంశే భగవాన్ భూతభావనః
కృతవాన్యాని విశ్వాత్మా,తానినోవద విస్తరాత్

భూతభావనుండును విశ్వాత్ముండునైన భగవంతుఁడు యదువంశంబున నవతరించి యేయేమిపనులుచేసెనో వానిని మాకు విస్తరముగా నెఱింగింపుము. 917

శ్లో॥ నివృత్తతర్షైరుపగీయమానాత్
భవౌషధాచ్ఛ్రోత్రమనోఽభిరామాత్
క ఉత్తమశ్లోక గుణానువాదా
త్పుమాన్ విరజ్యేతవినా పశుఘ్నాత్

రాగాదులులేని ముక్తపురుషులచేఁ గీర్తింపబడుటవల్లను జన్మరోగముల కౌషధమగుటవల్లను వినువారి కానంద మిచ్చుటవల్లను నుత్తమశ్లోకుఁడగు భగవంతుని కథాశ్రవణము పశుఘాతుకునకుదక్క నెవ్వనికి వినుకుపుట్టించు నెవ్వనికినిఁ బుట్టింపదనుట. 818

శ్లో॥ పితామహా మే సమరేఽమరంజయై
ర్దేవవ్రతాద్యాతిరథై స్తిమింగిలైః
దురత్యయం కౌరవసైన్యసాగరం
కృత్వాఽతరన్ వత్సపదం స్మయత్ ప్లవాః

నాతాతలైన పాండవులు వేల్పులనైన జయించునట్టి భీష్మాద్యతిరథులనెడు తిమింగిలములతోఁ గూడిన కౌరవసేనాసముద్రము నేమహాత్ముఁడైన కృష్ణుని నావగాఁజేసికొని దాఁటిరో. 819

శ్లో॥ ద్రౌణ్యస్త్ర విప్లుష్టమిదం మదంగం
సంతానబీజం కురుపాండవానాం
జుగోపకుక్షింగత ఆత్తచక్రో
మాతుశ్చమేయశ్శరణంగతాయాః

అశ్వత్థామబాణాగ్నిచేఁ గాలినప్పుడు కురుపాండవ వంశాంకురమగు నాశరీరమును శరణాగతయైన మాతల్లి గర్భమునఁజొచ్చి యెవ్వఁడు రక్షించెనో. 820

శ్లో॥ వీర్యాణి తస్యాఖిలదేహభాజా
మంతర్బహిఃపూరుషకాలరూపైః

ప్రయచ్ఛతో మృత్యుముతామృతంచ
మాయామనుష్యస్యవదస్వ విద్వాన్

ఓ జ్ఞాననిధీ! యెవ్వఁడు దేహధారులకు లోపలనుండి ధారణా స్థితిని వెలుపల కాలరూపిగానుండి మృత్యువును, భక్తులకు మోక్షము నిచ్చుచున్నాడో యట్టి మాయామనుష్యుండగు భగవంతుని ప్రభావమును జెప్పుము. ఇట్లు పాండవపౌత్రుం డడుగఁగా శుక యోగీంద్రుం డుపప్పాంగి. 821

శ్లో॥ సమ్యగ్వ్యవసితా బుద్ధి, స్తవరాజర్షిసత్తమ
వాసుదేవకథాయాం తే, యజ్జాతానైష్ఠికీరతిః

శ్లో॥ వాసుదేవకథాప్రశ్నః, పురుషాం స్త్రీన్ పునాతిహి
వక్తారం పృచ్ఛకంశ్రోతౄం స్తత్పాదసలిలంయథా

రాజేంద్రా! యెందువలన వాసుదేవుని కథయందు నిష్ఠతోఁ గూడిన యనురాగము కల్గెనో యా హేతువువలన నీబుద్ధి లెస్సగా నున్నది. విష్ణుకథాప్రపంచము ప్రశ్నించువానిని వినువానినిఁ జెప్పువానిని విష్ణుపాదోద్భవియగు గంగాప్రవాహముభంగిఁ బవిత్రము సేయునని కృష్ణకథ కుపక్రమించెను. కాని తీవ్రమోక్షార్థియగు విష్ణురాతుఁడు నామ రూప గుణహీనుఁడగు మొద్దు దేవునిఁ జెప్పుమని ప్రశ్నించలేదు. అట్టిశూన్యునింగూర్చియడుగక యిట్టిగుణవంతునడుగ నేలయని శుకుం డాక్షేపింపనులేదు. దీనిచే భగవంతుఁడు కల్యాణ గుణపరిపూర్ణుఁడని దివ్యమంగళ విగ్రహుఁడని నిశ్చయింపఁబడినది.
(భాగవతము దశమస్కంధము)

శ్లో॥ యానియానీహ రూపాణి, క్రీడార్థం త్వం బిభర్షిహి
తైరామృష్టశుచో లోకా, ముదాగాయంతి తేయశః

శ్రీహరీ! నీవు విలాసార్థముగా నే యే రూపములు ధరించుచున్నావో లోకులా యా రూపములచే దుఃఖముఁ బోగొట్టుకొని

తదీయయశమును గానముసేయుచున్నారని యక్రూరుండనుతించెను. కనుక భగవంతుఁడు భక్తులు గోరిన యాకారముతో సాక్షాత్కరించును. సాక్షాత్కరించినప్పుడే భక్తు లానందింతురు. సర్వేశ్వరుఁ డెల్లప్పుడు దివ్యాకారుఁడేగాని మొద్దుదేవుఁడు గాడు. 923

## భగవత్కల్యాణగుణప్రభావము

సుశీలుఁడు

ఇఁక భగవత్కల్యాణగుణంబు లెఱింగింపుడు. 924

వరవరముని

వత్సా! సుగంధ ద్రవ్యంబు నందఱు స్వీకరింతురు. దుర్గంధ వస్తువు నిర్గంధవస్తువు నెవ్వరు నంగీకరింపరు. అదేవిధంబున భగవంతుఁడు కల్యాణగుణపరిపూర్ణుఁడుగనుకనే వివిధవాంఛలచే భక్తు లుపాసింపుచున్నారు. విశిష్టాద్వైతమతాధికారియు మనకులదైవంబు నగు రామానుజులవారు శరణాగతిగద్యమునందుఁ గొన్ని భగవద్గుణంబులు వక్కాణించియున్నా రెట్లంటివేని. 925

గ॥ స్వాభావికానవధికాతిశయజ్ఞానబలైశ్వర్య వీర్యశక్తితేజస్సౌశీల్య వాత్సల్య మార్దవార్జవ సౌహార్దసామ్య కారుణ్య మాధుర్య గాంభీర్యౌదార్య చాతుర్య స్థైర్య ధైర్య శౌర్య పరాక్రమ సత్యకామ సత్యసంకల్ప కృతిత్వ కృతజ్ఞతాద్యసంఖ్యేయ కల్యాణగుణగణార్ణవుఁడని వర్ణించినారు. 926

సుశీలుఁడు

వీని కర్థము సెలవిండు. 927

వరవరముని

స్వాభావికములై అనవధికములై అతిశయములై యుండు కల్యాణగుణములతోఁ గూడినవాఁడు భగవంతుఁడు, స్వాభావికమనఁగా

గొంతకాలము లేక మధ్యకాలమున వచ్చినవిగావు. తపస్సు మొదలైన వానివల్లఁగాని పరానుగ్రహమువల్లఁగాని వచ్చినవిగా వక్కల్యాణ గుణములు సర్వేశ్వరునకు సహజముగానున్నవని యర్థము. 928

సుశీలుఁడు

అక్కల్యాణగుణంబులు విశదముగా వక్కాణింపుఁడు. 929

వరవరముని

చెప్పెద నాకర్ణింపుము, 1 జ్ఞానము, 2 బలము, 3 ఐశ్వర్యము 4 వీర్యము, 5 శక్తి, 6 తేజస్సు, 7 సౌశీల్యము, 8 వాత్సల్యము, 9 మార్దవము, 10 ఆర్జవము, 11 సౌహార్దము, 12 సామ్యము, 13 కారుణ్యము, 14 మాధుర్యము, 15 గాంభీర్యము, 16 ఔదార్యము, 17 చాతుర్యము, 18 స్థైర్యము, 19 ధైర్యము, 20 శౌర్యము 21 పరాక్రమము, 22 సత్యకామము, 23 సత్యసంకల్పము, 24 కృతిత్వము, 25 కృతజ్ఞత, 26 తారుణ్యము, 27 లావణ్యము, 28 పరిమళము, 29 సౌకుమార్యము, 30 సౌందర్యము. 930

సుశీలుఁడు

ఇప్పుడు మీరుచెప్పినవి ముప్పదిసంఖ్యమీఁదఁ నిలిచినవి యివి యింతేనా ? యింకనుగలవా ? 931

వరవరముని

భగవత్కల్యాణగుణంబు లసంఖ్యేయంబులై యున్నవి. సముద్రములోఁ గొన్నిరత్నంబు లెత్తినట్లు రామానుజయోగీంద్రులు గొన్ని మాత్రము వక్కాణించిరి. వానియర్థంబు సెప్పెద నాలకింపుము. జ్ఞాన మనఁగా మంచిచెడ్డలు, సుఖ దుఃఖములు, నిత్యానిత్యములు, బంధ మోక్షములు, యథార్థముగా నెఱుంగునట్టి తెలివి. ఈజ్ఞానము శరీరులకు వారివారి కర్మానుసారముగాఁ గలుగుచుండు నెట్లంటివేని, నాయురారోగ్యైశ్వర్యములు సమృద్ధిగాఁ నున్నచోఁ జాలునని బోధిం

చునది సంసారులజ్ఞానము. సంసారుల జ్ఞానంబునకుఁ బ్రస్తుత సుఖదుఃఖం
బులేకాని భూత భవిష్యత్కాల విషయంబు లేశయుఁ దెలియవు.

స్వర్గలోకమున కేవిధమగు నపాయములేకుండఁ దమ వాంఛి
తంబులు నిర్విఘ్నంబుగాఁ గొనసాగుచున్నచోఁ జాలుననునది దేవతల
జ్ఞానము. శాపానుగ్రహ సామర్థ్యముఁగలిగించుకొనఁగోరునది ఋషుల
జ్ఞానము. దేవమునీంద్రులు భూత భవిష్యద్వర్తమానకాల వృత్తాం
తంబుం దెలిసికొనవలయునని యోజించినచో నేవిషయమునందు
మనస్సు నెలకొల్పుదురో యావిషయముమాత్రమే తెలియునుగాని
తక్కినవి తెలియవు. ఋషులకుఁ దపస్సు క్షీణించినను దేవతలకు
బుణ్యము క్షీణించినను బైనఁజెప్పినశక్తి నశించును. భగవంతుని జ్ఞాన
మొకానొకప్పుడువచ్చి యొకకాలమునఁ బోవునట్టిది, కాదు. దీనికిఁ
దార్కాణముగా. 932

శ్లో॥ వేదాహం సమతీతాని, వర్తమానానిచార్జున
భవిష్యాణిచ భూతాని, మాంతువేదనకశ్చన

అర్జునా భూతకాలమునందు జరిగిపోయిన భూతములను నిప్పు
డున్న ప్రాణులను రాఁబోవు భూతములను నేనెఱుంగుదును. నన్నొ
క్కఁడైన నెఱుంగఁడని భగవంతుఁడు చెప్పెను. 933

(భగవద్గీత)

వ॥ ఇట్లుచెప్పియున్నందున భూత భవిష్యద్వర్తమానకాలము
లయం దెవ్వరెవ్వరు జన్మించి యెట్లునటించి యెక్కడికేగిరో భగవం
తుఁ డెఱింగియున్నాఁ డట్టివిషయంబు లెఱుంగుటకు నమ్మహాత్ము
నకు నేత్రాదీంద్రియములుగాని యోచనాకౌశలముగాని గురుబోధ
గాని శాస్త్రావలోకనముగాని యవసరములేదనియు మఱియు నతని
జ్ఞానమునకు సంకోచ వికాసములు లేవనియు నతండు సత్య జ్ఞానా
నందమయుండనియు నెఱుంగుము. 934

సుశీలుఁడు

భగవంతున కీజ్ఞానముచేఁ బ్రయోజనం బేమి? 935

పరవరముని

భగవంతున కట్టిజ్ఞానంబు లేనిచోఁ జగద్వ్యాపారంబు జరుగ నేరదు. 936

సుశీలుఁడు

తదీయజ్ఞానంబుచేఁ భక్తుల కేమైన నుపయోగంబు గలదా?

వరవరముని

భగవంతునకట్టి జ్ఞానంబులేనిచోఁ భక్తులపని నిద్రించినవాని పాదంబులకు మ్రొక్కినట్లగును. భక్తులకు సర్వేశ్వరునివల్లఁ గావలసినవి రెండుపనులు. అవి యేవియనఁగా ననిష్టములగు బాధలు నశించుట యిష్టములైన సుఖంబులు ప్రాప్తించుట సర్వజ్ఞత్వములేనివాఁడేభక్తుని కష్టము నివారింపవలయునో యేసౌఖ్యము నియ్యవలయునో తెలిసికొననేరఁడుగదా! 938

సుశీలుఁడు

అట్లైనచో నాపదలు నివారింపుమనిగాని సౌఖ్యము లిమ్మని గాని భగవంతు నడుగవలసిన పనిలేనట్లు తోఁచుచున్నదే! 939

వరవరముని

బాగుగాఁబూచిన సంపెంగచెట్టునీడ కేఁగినచో గాలివిసరినప్పు డెల్లఁ బుష్పములు పైనఁబడుచుండును. పండిన మామిడిచెట్టుక్రిందఁ జేరినచోఁ బండ్లులభించు నగ్నినిసమీపించినచో శీతబాధ నశించు నదేరీతిగ శ్రియఃపతినిఁ బ్రేమించినఁజాలు నతండు సర్వజ్ఞుండగుటచే మనకష్టంబులు నివారించి సుఖంబు లొసంగును. 940

సుశీలుఁడు

అవమానసమయంబున ద్రౌపదియుఁ గొలనిలో గజేంద్రుండును మిక్కిలి ప్రలాపించువఱకు భగవంతుఁడు రక్షింపలేదే! 941

వరవరముని

ద్రౌపదీదేవికిఁ బ్రపత్తి పూర్తికాసంమువల్లను గజేంద్రుని కహంకారము విజృంభించినంతవఱకు నుదాసీనుఁడై విష్ణువు తదుపరి రక్షించెను. 942

సుశీలుఁడు

తక్కినవిషయంబు లనుగ్రహింపుఁడు. 943

వరవరముని

బలము అనఁగా నెట్టి భారమైన కార్యమునైన ననాయాసంబుగాఁ జేయుటయుఁ జేసినపిమ్మట నవయవములుగాని దేహముగాని బడలక కందక శిథిలముగాకయుండుట. దీనికిఁ దార్కాణముగా వాసుదేవుఁడు కృష్ణావతారకాలంబున గోవర్ధనగిరి మోచెను. రామావతారంబున శివధనుర్భంగంబొనర్చి దుందుభి కళేబరంబు బహుయోజనదూరంబేగునట్లు పాదాంగుష్ఠంబుచే నెగఁజిమ్మెను. నృసింహరూపంబుచే హిరణ్యకశిపుని జానువులపైమోపి చీల్చెను. కూర్మావతార సమయంబున నేకాదశ సహస్ర పరిమితయోజన విశాలంబగు మందరపర్వతంబు వీపునమోపి క్షీరవారాశిపైఁ దేలించి ముప్పదిమూడుకోట్ల దేవతల నఱువదియాఱుకోట్ల రాక్షసులను మోచెను. వరాహావతారతరుణంబున ప్రళయోదధిమగ్నంబగు భూమి నొంటికొమ్ముచే నుద్ధరించి స్వస్థానంబున నిల్పెను. ఇంతయేల నిరంతరము బ్రహ్మాండంబులన్నియుఁ గుక్షియందుంచి కాపాడుచున్నాఁడు. కావున నిది గోవిందుని బలప్రకారంబని యెఱుంగుము. 944

ఐశ్వర్యము అనఁగా నీశ్వరస్యభావః ఐశ్వర్యమ్మని విగ్రహము గనుక నీశ్వరుఁడనఁ బ్రభువు. ప్రభునిసొత్తు ఐశ్వర్యము దీనినిగుఱించి యామునాచార్యులవారు,

శ్లో॥ యదండమండాంతరగోచరంచయ
ద్దశోత్తరాణ్యావరణాని యానిచ
గుణాః ప్రధానం పురుషః పరంపదం
పరాత్పరం బ్రహ్మచతే విభూతయః

ఓహరీ! బ్రహ్మాండములు బ్రహ్మాండాంతర్గతంబులగు భూతములు దశావరణములు సత్వ రజ స్తమోగుణంబులు ప్రకృతి నిత్యముక్తాదిజీవులు పరమపదము దివ్యమంగళ విగ్రహము ఇవియావత్తు నీసొంతాస్తియని స్తుతించిరి. 945

వీర్యము: ఏకాలమునందైన నెట్టి వైరితోనైన సందేహింపకుండ నెదిరించి జయించువాఁడు వీరుఁడు. వీరునిపని వీర్యము. 946

శక్తి: ఎంతదుష్కరమగు కార్యమునైన సులభముగా నొనరించుట శక్తియని యెఱుంగునది. పూర్వము భగవంతుఁడు కురంగంబునందుఁ గస్తూరి, పిల్లియందు జవ్వాది, తురంగంబునందు జవంబు, బురదయందు రాజీవంబులను, సింధురంబునందు మదంబు, గోవులయందు క్షీరంబులు గల్పించి తనశక్తిని వెల్లడించెను. వెండియుఁ గీరంబులకు భాషించుస్వభావము. కోకిలంబులకు గళమాధుర్యము, హంసలకు నీరక్షీర విభాగజ్ఞానము, భృంగములకు ఝుంకారము, ఈగలకుఁ బూరసంబుదెచ్చి తేనెతెట్టగా సమకూరుచునట్టి సామర్థ్యము, కుమ్మరపురుగ్వలకు నడుసులోజరించియు నంటకుండు నేర్పునొసంగెను. మఱియు సర్పములందు గరళము, నదులయందుఁ బ్రవాహము, విష్ణుపదియందుఁ ద్రిలోకసంచారము, సముద్రములయందు లోఁతుఁ, బర్వతములయందుఁ గాఠిన్యము, వాయువునందుఁ బ్రాణాకారము, వహ్నియందు దహనాకారము, నీరములయందు శైత్యాకారము, విహాయసమునం దవకాశాకారము, భూమియందు సహనాకారము కల్పించె. మఱియు నమ్ముశపోషకలాడు వడగాడ్పు లుమ్మదములు, శైత్యము, వర్షము,

ఝంఝామారుతములు మొదలైనవాని నొనర్చె. నింతేకాక సర్వే శ్వరుఁడు వానరులచేఁ రాక్షసులఁ జంపించెను. నీటిపైఁ గొండలు దేలించెను. ద్రౌపది కక్షయవస్త్రంబులొసంగెను. కురూపియగు కంస దాసికి లోకోత్తర సౌందర్యంబొసంగెను. శరతల్పగతుఁడైన భీష్ముని బాధ నివారించి మహాపాండిత్యమొసంగి బోధకునిఁజేసెను. బాలుం డగు ప్రహ్లాదునకు ధైర్య స్థైర్యంబులొసంగి హిరణ్యకశిపునకు లొంగ కుండఁ జేసెను. రాక్షసజన్యంబునఁజచ్చిన వానరులఁ బునర్జీవితులఁ జేసెను. వైదిక సాందీపన్యాదులకుమృతపుత్రదానంబొనర్చె ననేకపర్యా యములు నిత్యసంసారుల నిత్యసూరులుగా నొనర్చె నివి సర్వేశ్వరుని శక్తిచేనైన పనులని యెఱుంగుము. 947

తేజస్సు: ఎట్టివైరులనైనఁదిరస్కరించి భయముగల్గించుగుణము. దీనికిఁ దార్కాణముగా శ్రీరామచంద్రుఁ డెన్నిసారు లెంతగాదూఱి నను రావణుండు నోరెత్తి భాషింపడయ్యె. మఱియు రాయబారార్థమై హస్తిపురి కేగినప్పుడు శ్రీకృష్ణు నవమానింపనెంచి శ్రీకృష్ణుండు సాత్యకి విదురులతో నడచివచ్చు మార్గమునందు శకుని కర్ణ దుర్యో ధన దుశ్శాసను లున్నతాసనంబులఁ గూర్చుండిరి. కాని గోవిందదర్శన మాత్రంబునఁ గూర్చుండుటకు ధైర్యములేనివారై వెంటనేలేచి సత్కరించిరి. మఱియుఁ దేజస్సునకు ద్వితీయార్థ మేమనఁగాఁ గాంతి యని యర్థము. కాంతియనఁగా,

శ్లో॥ యదాదిత్యగతం తేజో. జగద్భాసయతేఖిలం
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ, తత్తేజోవిద్ధిమామకమ్

సూర్యునియందుండి యేతేజస్సు సమస్తజగత్తును వెలిగింపు చున్నదో, యేతేజస్సు చంద్రాగ్నులయందున్నదో యది నాదియని భగవంతుఁడు వక్కాణించెను. సర్వేశ్వరుఁడు కోటిసూర్య ప్రకాశుఁ డని శ్రుతులును సూరులును వచించిరి. దీపకాంతి గృహస్థులకు

మహోపయోగమై గ్రుడ్డివారికి నిరుపయోగమై కనుకలకవారికసహ్యమైయుండునట్లు భగవత్తేజస్సు ప్రతికూలురకు సహింపరానిదై నిరుపయోగముగానుండును. 948

సౌశీల్యము: భగవానుఁడు తన గొప్పతనము దేహధారుల నీచత్వమును గణింపక కలిసి మెలిసియుండుట లిది యెట్లంటివేని. 949

| భగవంతుఁడు | శరీరియగు జీవుఁడు |
|---|---|
| 1 దివ్యమంగళవిగ్రహుఁడు | 1 ప్రాకృతశరీరి |
| 2 స్వేచ్ఛాప్రవర్తకుఁడు | 2 కర్మబద్ధుఁడు |
| 3 కల్యాణగుణ పరిపూర్ణుఁడు | 3 హేయగుణపరిపూర్ణుఁడు |
| 4 సర్వజ్ఞుఁడు | 4 దేహాత్మభ్రమతో నుండువాఁడు |
| 5 ఆద్యంతరహితుఁడు | 5 జన్మ మృత్యు జరా వ్యాధులు గలవాఁడు. |
| 6 సర్వేశ్వరుఁడు | 6 పరాధీనుఁడు |
| 7 నిత్యానందుఁడు | 7 నిత్యసంసారదుఃఖభాజనుఁడు |
| 8 పరమోత్కృష్టుఁడు | 8 పరమనీచుఁడు |
| 9 సర్వదా దీనానుకంపి | 9 సర్వదా పరాపకారి |
| 10 లక్ష్మీపతి | 10 దరిద్రుఁడు |
| 11 నిరవధిక భోగి | 11 నిరవధిక రోగి |
| 12 దివ్యపరిమళముగలవాఁడు | 12 నిత్య దుర్గంధముగలవాఁడు |
| 13 అప్రతిమప్రభావుఁడు | 13 దుర్యశస్కుఁడు |

వ॥ ఈప్రకారముగా భగవంతుఁడెంత మంచివాఁడో జీవుఁడంత చెడ్డవాఁడు. శరీరధారులు నీచులైనను నారాయణుఁడు వారినీచత్వమును స్వకీయ మాహాత్మ్యమును దలంపక శరీరులతోఁ గలిసి మెలిసి యుండి వారి బాగుఁజేయుట సౌశీల్య మనఁబడును. 950

సుశీలుఁడు

సౌశీల్యమును నారాయణుఁ డెప్పుడు కనపరచెను ? 951

వరవరముని

రామావతారకాలంబున వానరుల సహాయంబుగాఁ గొను టయుఁ గృష్ణావతారకాలంబున గోగోపీగోపాలుర నాదరించుట మొదలైనవి సౌశీల్యంబులు. 952

వాత్సల్యము: వత్సమనఁగా దూడ. దూడ పుట్టగానే దాని శరీరమాలిన్యమంతయుఁ దల్లియగు నావు భోగ్యముగానెంచి నాకు చుండునుగాన దూడయం దావునకుఁగల ప్రేమ వాత్సల్యము. అట్టి వాత్సల్యముతో భక్తుల రక్షించునట్టి భగవంతునిగుణమువాత్సల్యము.

సుశీలుఁడు

అట్టివాత్సల్య మెవ్వరియందుఁజూపించెను ? 954

వరవరముని

ఒక్కొక్క భగవద్గుణము వర్ణింపవలయునన్న మనుష్యున కాయుస్సు చాల దక్లైనను విసుగుఁజెందరాదు. శక్తికొలఁది వర్ణింతు నాలకింపుము. విభీషణాళ్వారు రాముని శరణుజొచ్చినప్పుడు సుగ్రీవుఁడు పెరుమాళ్ళంగాచి ప్రభూ ! వీఁడు శరణాగతుఁడైనను రాక్షసుఁడుగనుక దోషియైయున్నాడు. వధింపవలయునేకాని రక్షింపఁగూడదని వాదించె నప్పుడు. 955

శ్లో॥ మిత్రభావేన సంప్రాప్తం, నత్యజేయం కథంచన
దోషోయద్యపితస్యస్యా, త్సతామేతదగర్హితమ్

భక్తిభావముచే నెవ్వఁడు నాకుఁ బ్రాప్తించునో వాని నెప్పుడును విడువను. శరణాగతుఁడైనవాఁడు దుష్టుఁడై నట్టివాని రక్షింపవలెను. రక్షించినచో సత్పురుషులకు గర్హ్యంబుగాదు. శరణాగతుఁడైనవాని మంచిచెడ్డలు విచారింపరాదని సుగ్రీవాదుల మతమును నిరసించి విభీషణునిరక్షించె నిదిప్రధానమైన వాత్సల్యము. 956

వ॥ వెండియు శ్రీరామచంద్రుఁడు రక్తసిక్తగాత్రుఁడగు సుగ్రీవునిఁ గౌఁగిలించి సన్మానించినందువల్లను నిషాదుఁడగు గుహునిఁ గౌఁగిలించినందువల్లను శబరియెంగిలిపండ్లు భుజించినందువల్లను చిక్రోడమును లాలించుటవల్లను వానరులచే సద్భృత్యకృత్యములు చేయించుటవల్లను యశోదచే నులూఖలంబునఁ గట్టుపడుటవల్లను కుబ్జామనోరథంబీడేర్చుటవల్లను విదురాన్నము ప్రీతితో నారగించుటవల్లను ద్రౌపది శాకలవమున కానందించుటవల్లను దుర్యోధనసభలో నేను పాండవదూతననియుఁ బాండవులు నాబహిఃప్రాణంబులనియుఁ జెప్పుటవల్లను ఫల్గునుని రథికునిఁజేసి తాను సారథిగా నుండుటవల్లను కుచేలుని చెమ్మటచే నానిన యడుకులు దినుటచేతను భగవంతుని వాత్సల్యసౌశీల్యములు ప్రకాశించెను. 956

మార్దవము: అనఁగా మృదుస్వభావము. దీని కుదాహరణం బిచ్చెద నాకర్ణింపుము. రావణుం డొక్కనాటి యుద్ధంబున నిజకిరీటములు చూర్ణమైపోగా రామబాణములచే డస్సి పాఱిపోవుటకు వీలు లేక దుఃఖింపుచుండగా రాఘవుం డతనిం గాంచి రావణా. 957

శ్లో॥ కృతంత్వయా కర్మమహత్సుభీమం
హతప్రవీరశ్చ కృతస్త్వయాహం
తస్మాత్పరిశ్రాంత ఇవవ్యవస్య
నత్వాం శరైర్మృత్యువశంనయామి

భయంకరకార్యము చేసితివి. వీరులగువారి ననేకులఁ గొట్టితివి. డస్సియున్నావని విడిచితిని. ఇప్పుడు వధింపను. విశ్రాంతిఁగైకొనుము.

శ్లో॥ గచ్ఛానుజానామిరణార్దిత స్త్వం
ప్రవిశ్యరాత్రించరరాజ లంకాం
ఆశ్వాస్యనిర్యాహి రథీచధన్వీ
తదాబలం ద్రక్ష్యసిమే రథస్థః

రాక్షసరాజా ! యిప్పటికి నీకు బ్రతుకుటకనుజ్ఞయిచ్చితిని పొమ్ము లంకాపురమును బ్రవేశించి బడలికఁదీర్చుకొని ధన్విౕనై రథివై బయలుదేఱు మప్పుడు నాబలమును జూడనచ్చునని వచించెను.

సుశీలుఁడు

బలవద్వైరి చిక్కినప్పుడంతేచాలునని వధింపవలసియుండఁగా నుపకారవాక్యములచే విడువనేల ? 960

వరవరముని

అల్పబలుండగువాఁడు దనకు వైరి లోబడినప్పుడే చంపును. సీతావిభుండు సర్వశక్తుండగుటవల్లఁ దొందరపడ నవసరంబులే దింతేకాక రావణుండు రఘువరునితో రణంబొనరించి యుద్ధ సాధనంబు లన్నియు నశింపగా విఱిగిన వింటితుంటను చేతఁబట్టుకొని పాఱిపోవుటకు వీలులేక దుఃఖింపుచుండఁగా దాశరథి బాణంబులు పుంఖానుపుంఖంబులుగాఁ బ్రయోగించి రావణుని దేహమునందు జల్లెడతూట్లు గావించె నంతట వాఁడవ్వింటితుంటను విడువగా స్వరక్షణమందుఁ బ్రయత్నము మానినవానిని దైవము రక్షింపవలయు నట్టి దైవము శ్రీరాముఁడేగనుక రావణ రక్షణభారము రామునియందే నిలిచె నవ్యవసరంబున రామ కల్యాణగుణములలో నొక్కటియగు మార్దవము ప్రభుత్వమున కుపక్రమించె నక్కారణంబున రావణుం డప్పటికి రక్షింపఁబడియె. సర్వేశ్వరుని మార్దవంబున కిదియొక తార్కాణము.

వ॥ వెండియుం బెరుమాళ్లు లవణాసురునిఁ జంపఁబోవు శత్రుఘ్నునిఁగాంచి యిట్లనియె. వత్సా ! నీవెప్పుడు లవణుని వధింతువో యప్పుడే విజయలేఖను బనుపు మందులకుఁ దామసించినచో మదీయ ప్రాణంబులు నిలువవని పలికె నిదియు మార్దవము. జన్యరంగంబున మూర్ఛాగతుండగు లక్ష్మణునిఁగాంచి సీతావిభుం డతనిం గౌఁగిలించి వత్సా ! నీవులేనిచో రాజ్యంబును, సీతయు, జీవితంబును నాకేటికి. నీవయోధ్యలో నొంటరినుండలేక నాతో నరణ్యంబునకు

వచ్చితివి. నేనిప్పుడు సీతోఁ బరలోకంబునకు వత్తునని దుఃఖించి సంజీవిచే సౌమిత్రి బ్రతికినప్పుడు మిక్కిలి సంతోషించి బ్రతికితివా లక్ష్మణా! బ్రతికితివా తండ్రీ! నేనిప్పుడు కృతార్థుండ నైతిననె నిదియు మార్దవము. 932

వ॥ మున్ను రావణ వధానంతరంబున విభీషణుఁడు శ్రీరామునిఁ గాంచి దేవా! పద్మినీజాతి స్త్రీలందఱు పన్నీటి జలమును దెచ్చి నారు. నీదివ్యమంగళవిగ్రహమునుఁదాఁకి నలుగువెట్టి స్నానముసేయింప వలెనని కోరుచున్నారు సమ్మతింపవలయునని ప్రార్థింపఁగా శ్రీరామ చంద్రుఁ డతనింగాంచి విభీషణా నీవాక్యంబుల కానందించితిం గాని నీసత్కారంబు లంగీకరించుటకు వీలులే దేమనఁగా మదీయ సహోదరుండగు భరతుండు నాకై భోగ్య పదార్థంబులు వర్జించి యయోధ్యలోఁ గష్టములొందుచున్నా డమ్మహాత్ముఁడు బాధపడు చుండఁగా నాకు భోగాభిలాష కలుగనేరదు సరేగదా భరతు నెప్పుడువీక్షింతునాయని మనంబు తల్లడిల్లుచున్నదని వచించె నిది మార్దవము. 933

శ్రీకృష్ణుండు కంసవధానంతరంబున దేవ వసుదేవుల చెఱ విడిపించి యిన్నిదినములు మీకష్టము నివారింపలేని నావంటి నిష్ప్రయోజక పుత్రుండుపుట్టి యేమిలాభమని దీనాలాపంబులాడె. సామాన్యుండగు నుగ్రసేనుని రాజుఁగావించి తాను ప్రతినిధిగానుండె నిది మార్దవము. 934

శ్రీకృష్ణుండు జరాసంధవధ కేగునప్పుడు ధర్మపుత్రుంగాంచి పాండవాగ్రజా! నేను చిరకాలము రాక్షసులతోఁ బోరి పోరి శ్రమముఁజెంది యిప్పుడు మీ సహోదరులు పెద్దవారై నాకు సహాయమైనందువల్ల వైరులందఱుజడిసి నాజోలికి రానందుచే హాయిఁ జెందితినని భాషించె నిదిమార్దవము. రాజసూయావసరంబున ధర్మ

రాజు నొకభవనములో సువర్ణాసనంబునఁ గూర్చుండఁబెట్టి శ్రీకృష్ణుం డొక దౌవారికుండై నానాదేశ భూపతులచే ధర్మజునకు మ్రొక్కించె నిది మార్దవము. 965

ఆర్జవము: అనఁగా మనోవాక్కాయంబులను త్రికరణంబులచే ఋజుస్వభావము కలిగి ప్రవర్తించుట, మనస్సులో నెట్లుండునో వాక్కుతో నట్లే చెప్పుట, వాక్కుతో నెట్లు చెప్పునో యట్లే పనిచేయుట యిది యార్జవము. దీనికిఁ దార్కాణము వచించెద వినుము. శ్రీరామచంద్రుఁడు చిత్రకూటాద్రియం దుండఁగా భరతస్వామి యచ్చోటికేగి రాముని దర్శించి రాజ్యంబునకు రమ్మని ఫలంబుగానక ప్రాణాపాయంబున కుంకింపగా సీతాపతి భరతు నూఱడించి పదునాల్గవ సంవత్సరాంతంబున వచ్చెదనని మనస్సులోనున్నట్లే వాక్కుతోఁ జెప్పి చెప్పినట్లే గడువులో నయోధ్యకేగి భరతు నార్తి నడంపఁజేసి బ్రహ్మానంద మిచ్చెను గనుక నిది యార్జవము. 966

శ్రీరాముఁడు సుగ్రీవునితో స్నేహము సేయునప్పుడును విభీషణు ననుగ్రహించునప్పుడు నేమేమి చెప్పెనో యట్లే కావించెను గనుక నిది యార్జవము. 967

నృసింహుఁడు ప్రహ్లాదునితో నీవంశజుల వధింపనని చెప్పి తన భక్తులైన వేల్పుల కపకారము చేసినను బలిచక్రవర్తిని వధింపక పాతాళంబున శాశ్వతరాజ్యంబొసంగెను. బలిపుత్రుండగు బాణుఁడు తనకపకార మొనర్చినను చేతులుమాత్రము నఱికి విడిచిపుచ్చె నీకృత్యంబులెల్లను భగవంతుని యార్జవంబున కుదాహరణంబులు. 968

సౌహార్దము: సుహృదోభావస్సౌహార్దమ్మని విగ్రహము. సుహృదుఁడనగా స్నేహితుఁడు స్నేహితుని కార్యము సౌహార్దము. స్నేహమనఁగాఁ జమురు. చమురులన్నిటిలో నేరఁడతైలము జిడ్డుగలది గనుక స్నేహమాముదపు జిడ్డువలె నుండవలయుననియు నీటితడివలె నుండఁ

గూడదనియుం జెప్పుదురు. నీటితఁడి తుడుపకున్నను గొంతసేపటి కారిపోవు నామదపుజిడ్డు కుంకుడురసముతోఁ గడిగినను బోవక కొంతకాలము నిలిచియుండు నదేవిధంబునఁ దన్నుఁ బ్రేమించు చెలికాని నెన్ని కష్టంబులు వచ్చినను విడువని స్నేహితుఁడే స్నేహితుఁ డట్టివాని పని సౌహార్దము. 969

సుశీలుఁడు

అట్టిసౌహార్దము పెరుమాళ్లసమయంబున నెవ్వరిపై నుంచెనో యెఱిఁగింపుము. 970

వరవరముని

ముందు మంచి తెలిసెనేనిఁ జెడ్డ తెలియును. ముందు చెడ్డ తెలిసినను మంచి సులభముగాఁ దెలియు నక్కారణంబున దుష్టస్నేహంబు ముందెఱిఁగించి తరువాతఁ బెరుమాళ్ల సౌహార్దం బెఱిఁగింతు నాకర్ణింపుము. 971

వ॥ పూర్వము ద్రుపదుండును ద్రోణుండు నొక్కవనంబునఁ జదువుచుండఁగా ద్రుపదుం ద్రోణుంగాంచి యిట్లనియె. విప్రవర్యా! నీవు నాకియ్యరణ్యంబున వయస్యుండవై దురవగాహంబైన పాఠంబులు సెప్పితివి. నేను ప్రభుత్వము వహించినప్పుడు నీవు వచ్చితివేని మిక్కిలి సన్మానింతునని చెప్పియుండె నటుపిమ్మటఁ గొంతకాలంబునకు ద్రుపదుండు రాష్ట్రాధిపతియయ్యె నయ్యవసరంబున ద్రోణుఁడు లేమిచే బడితుండై ద్రుపదునికడ కేగి యాచింపఁగా నబ్భూపతి ద్రోణాచార్యునిఁ గాంచి,

శ్లో॥ న దరిద్రో వసుమతో, నావిద్వాన్ విదుషస్సఖా
శూరస్య సఖా క్లీబ, స్సఖిపూర్వం కిమిష్యతే

శ్లో॥ నా శ్రోత్రియ శ్శ్రోత్రియస్య నా రథీ రథినస్సఖా
నా రాజా పార్థివస్యాపి, సఖిపూర్వం కిమిష్యతే

శ్లో॥ యయోరేవ సమం విత్తం, యయోరేవ సమం శ్రుతమ్
తయోర్వివాహస్సఖ్యంచ, నతుపుష్టవిపుష్టయోః

ధనసంపన్నునకు దరిద్రుఁడు, విద్వాంసునకు మూర్ఖుఁడు, శూరునకు నపుంసకుఁడు, శ్రోత్రియునకు దురాచారుఁడు, ప్రభునకు సామాన్యుఁడు స్నేహితుఁడు కాఁజాలఁడు. సమాన ధన శ్రుతములు గలవారికి వివాహ సఖ్యంబులు కుదురును. బలవంతులకు బలహీనులకుఁ గుదురవు. కావున నీకును నాకును సఖ్యంబు లేదని దూఱఁగా ద్రోణుం డవమానముఁ జెంది హస్తిపురంబున కేగి పాండవుల వశీకరించి ద్రుపదునియందుఁగల వైరము దీర్చుకొనెను. ద్రుపదుఁడు ధనాఢ్యుఁడే కాని విద్యా శౌర్యాదులయందు ద్రోణుని కెంతమాత్రము సమానుఁడు కాఁడు. వీరి సమాచార మిట్లుండెనుగదా యిఁకఁ బెరుమాళ్ళ సమాచారం బెఱింగింతు నాలకింపు. 972

శ్రీరామచంద్రుఁడు ముల్లోకంబుల నొక్కశరంబుచే నాశము సేయఁగలిగియు లోకవిడంబనార్థము సుగ్రీవునితో సఖ్యంబొనర్చి వాలిని వధించి సుగ్రీవుని కార్యంబులన్నియు ముందుగా నెఱవేర్పఁగా నారవిపుత్రుండు పానమత్తుండై స్త్రీలౌల్యంబు వహించి తనపురంబునకుఁ గ్రొత్తదుదూఱములోనుండు రామునిచెంత కొక్కనాడైనం బోవక మూఁడు మాసంబులు రామకార్యంబు మఱచియుండె నంత నొక్కనాఁడు లక్ష్మణుండు మండిపడి సుగ్రీవునిఁ జంపెదనని పోవుచుండ సీతాపతి సోదరుంగాంచి వత్సా! నీబోటిసజ్జనులు స్నేహితులఁ జంపదగదాయని శ్లాఘించి రవిపుత్రుని మనస్సు నొప్పింపక తీసికొనిరమ్మని చెప్పిపంచి సుగ్రీవుఁడు తనకడకు రాఁగా నొక్క పరుషవాక్యంబు పలుకక మధురాలాపంబులాడి యతనికరంబులు కన్నులఁగప్పకొనియె నింతేకాక విభీషణ రక్షణసమయములో,

శ్లో॥ న సర్వే భ్రాతరస్తాత, భవంతి భరతోపమాః
మద్విధా వా పితుః పుత్రాస్సుహృదో వా భవద్విధాః

తండ్రీ! లోకములో సందఱు భరతునివంటి సోదరులుందురు. జనకునకు నావంటి కొడుకులుందురు, నీవంటి స్నేహితులుందురని సుగ్రీవునిఁ బొగడెను. చూచితివా! సర్వేశ్వరుని సౌహార్దము. 473

వ॥ ఇది యిట్లుండఁగా నిరుపేదయగు కుచేలుఁడు తనగృహంబునకు రాగా శ్రీకృష్ణుం డపార ప్రేమతోఁ బూజించి యతనితో నన్నయ్యా! మనము సాందీపునిచెంగటం జదువునప్పుడు చిరకాలము క్రిందట నిన్నుఁ గాంచితి నింతవఱకు నొక్కనత్యుపాయమైనవచ్చి నన్నుఁ గాంచవైతివి. నీకు వివాహంబైనదా, మా వదినగారు సుగుణవతి యగునా, పిల్లకాయ లేమైనంగలరా, మనము గురుమందిరమునఁ జిన్ననాడొర్చిన చెయ్యు లేమైన జ్ఞాపకమున్నవాయని మాధుర్యాలాపంబులఁ గుశలంబడిగి సర్వోపచారంబులొనర్చి సరసాన్నంబుఁ బెట్టించి యమర్త్యదుర్లభంబగు నైశ్వర్యంబొసంగె నిది పెరుమాళ్ళ సౌహార్దమున కుదాహరణము. ఇట్లి ప్రమాణంబు లనేకము చూపవచ్చునైన నింతటితో విరమించెద. 974

సామ్యము: అనఁగా సమానభావము.

శ్లో॥ సమోఽహం సర్వభూతేషు, నమే ద్వేష్యోస్తి నప్రియః
యే భజంతితుమాం భక్త్యా, మయితే తేషుచాప్యహమ్

అర్జునా! నేను సర్వభూతములయందు సముఁడను. నాకు ద్వేషింపఁదగినవాఁడుగాని ప్రియుఁడుగాని లేఁడు. నన్నెవరు భక్తితో భజింతురో వారియందు నేనుందును. నాయందు వారుందురని భగవంతుఁడు సెప్పెను. 975

(భగవద్గీత)

సుశీలుఁడు

భగవంతుఁడ కందఱు సమానులైనప్పుడు తన్ను భోజనమునకుఁ బిలిచిన దుర్యోధనునితో శ్రీకృష్ణుఁడు నీవు విరోధివిగాన నీయింట భుజింపనని యేలచెప్పెను? 976

వరపరముని

ప్రియాప్రియతి యనగా సమస్తకామములను కోరు సత్పురుషోత్తమున కెట్టివాంఛయులేదు. ఎద్దియైన సంపాదింపవలసియున్నప్పుడు కాంక్షకలుగును. దానికి విఘ్నము కలిగినప్పుడు దేహికి విరోధు లుందురు. శ్రీహరికిఁ బొందవలసిన పదార్థము లేదుగనుక వాంఛలేదు. విరోధులునులేరు. కాని సుయోధనుఁడు భోజనార్థ మాహ్వానించినప్పుడు స్వామివారు,

శ్లో॥ ద్విషదన్నం న భుంజీత, ద్విషంతం నైవభోజయేత్
పాండవాన్ ద్విషసేరాజన్, మమప్రాణాహి పాండవాః

ఓదుర్యోధనా! విరోధ్యన్నము భుజింపఁగూడదు, విరోధికిఁబెట్టఁగూడదు. నీవు సదా పాండవులను ద్వేషింపుచున్నావు. పాండవులు నా బహిఃప్రాణంబులు. వారికి విరోధివగుటచే నాకును విరోధివి. నీయింట భుజింపనని చెప్పెను. దీనివల్లఁదేలిన విషయ మేమనఁగా భగవంతుడు సర్వసముఁడతనికి స్వయము విరోధులులేరుగాని భక్త విరోధులే విరోధులు. తాను జన్మింపకముందునుండి వైరముసాధించిన కంసునకు స్తనములలో విషమునుంచి చంపవచ్చిన పూతనకు నిరంతాపరాధియైన శిశుపాలునకు మోక్షమిచ్చుటచే శ్రీకృష్ణుఁడు సమత్వమును ప్రకటించెను. దీనినే సామ్యమందురు. 977

కారుణ్యము: అనఁగా దయ, శరీరధారులచే నేవిధమైన ప్రతిఫలమును గోరక నిర్హేతుకముగా నుపకారమొనర్చు గుణము. ఎట్లందువేని - భగవంతుడు ప్రళయకాలమందు ఖద్యోతములభంగి మెలంగుచున్న జీవులకుఁ గరణకళేబరంబులొసంగి భూతోపయుక్తముగాఁ బంచభూతముల నిర్మించి సూర్య చంద్రాదులచే ప్రకాశింపఁజేయుచు వివిధాహారపదార్థంబులు సృజించి భుక్తాహారంబులు పచనమొనర్చుచు నోషధులచే రోగబాధలు నివారింపుచు దుష్టజంతువులచే సాధుభూతంబుల కపాయంబుగలుగకుండఁగాపాడుచుభూతకోటికి

నిద్రచే హాయిఁగల్గింపుచు మైథునసౌఖ్యం బొసఁగూర్చుచు శాస్త్రంబులచే జ్ఞానంబుఁ గల్గింపుచు భవ్యాంబరాభరణ ధనధాన్యకనకరత్న స్రక్చందన వాహనాదులచే నానందంబు, గల్పింపుచు నిరీశ్వరవాదులను భూతద్రోహులకు నింద్రియ కింకరులకు వేదదూషకులకును హితమాహారం బొసఁగూర్చుచు సదాజ్ఞానస గోచరుండయ్యు భక్తులకు మాత్రము గోచరింపుచు వివిధవృత్తులచే జీవనంబులును నానావిధ విద్యలచేఁ బ్రమోదం బావహిల్లఁజేయుచు వాతాతప ఝంఝా మారుత మారీ స్ఫోటకాదులచే సాధ్వసంబు లేకుండఁ బ్రోచుచు శరీరాత్మభ్రమచే నొక్కనాఁడైనఁ దన్నుభజింపలేని బద్ధసంసారులకు సహా విషయసుఖంబులిచ్చుచు వివిధదేవతాభక్తులకు ఫలంబులిచ్చుచు నజ్ఞాత సుకృతంబు నాధారముగాఁగైకొని కొందఱి ముముక్షువులఁ జేయుచు శరీరధారులకు ధర్మార్థ కామ మోక్షంబు లొసఁగుచున్నాఁడు గనుక నిది సర్వేశ్వరుని కారుణ్యమని యెఱుంగుము. 978

మాధుర్యము: అనఁగా మిక్కిలి రుచికరమైనది. జంబూ ద్రాక్షా రసాల మోచా ఫలంబులు భుజించునప్పుడును, గుడ క్షీర క్షీరాన్న మస్తుసితా పీయూషంబు లాస్వాదించునప్పుడును జిహ్వ కెట్టి రుచికల్గునో సాంకవ కస్తూరి చందనాదు లాఘ్రాణించునప్పుడు నాస కెట్టి యానందముగల్గునో భగవన్మాధుర్య గుణ మాకర్ణించునప్పుడు వీనుల కంతకంటె నెక్కువ సంతోషము కలుగును. దశరథోపన్యాస సమయంబునఁబౌరులతనింగాంచి రాజేంద్రా! నియందు రాజసామాన్య గుణంబు లున్నవిగాని నీకుమారుండగు శ్రీరాముని యందు లోకోత్తర కల్యాణగుణంబులుగల వెట్లంటివేని శ్రీరామచంద్రుఁ డెక్కడికైనను వెళ్ళి తిరిగి స్వగృహంబునకు వచ్చునపుడు వాహనంబుదిగి పాదచారియై మా యిండ్లకువచ్చి తాతగారూ! మీ నిత్యానుష్ఠానము చక్కగాజరుగుచున్నదా, అక్కయ్యా మీరందఱు సేమమేగదా, తల్లీ మీకోడండ్ర కొడుబిడ్డలకు వైరములేదుగదా యనియడుగుచుండు

నిట్టిమహాత్ముఁడు మీవంశంబున నిక్ష్వాకుమొదలింతవఱకు లేఁడనిరి. తాను ప్రభుండయ్యు తత్సంబంధగర్వ మించుకైనలేక సామాన్య ప్రజా గృహంబులకేగి శ్రీరాముండిట్లు సంభాషించుగుణము మాధుర్య మనంబడును. మాట్లాడునప్పుడెల్ల మొగమునఁ జిఱునవ్వు గలిగియుం డుటయు నప్పలుకులు పూదేనెవలెఁ జెఱకుపాలభంగి పీయూషంబు తేన నుండుటయు మాధుర్యమనఁబడు నిట్టిగుణంబు లనేకము సీతా పతియందుఁ గలవని కోసలవాసులునుడివిరి. 979

వ॥ నారదుం డొక్కదినంబున షోడశ సహస్రాంగనామందిరం బులనుండు శ్రీకృష్ణునిఁ బరీక్షింపనెంచి ద్వారవతికరిగి యొక్కకాంతా మణితో సరససల్లాపంబులాడు శ్రీకృష్ణుని దర్శింపఁగా నప్పురుషోత్త ముండు నారదుని సువర్ణపీఠంబునఁగూర్చుండఁబెట్టి కేలుమోడ్చి దేవ మునీ! మీవంటివారు త్రికాలఫలప్రదాయకులు మావంటి గృహస్థు లకుఁ బూర్వపుణ్యమున మీదర్శనంబుప్రాప్తించు నిప్పుడు సంభాషిం చుటచే వర్తమానకాలంబు పుణ్యదాయకమైనది. దీనిచే భవిష్య త్కాలముకూడ ఫలప్రదమేయగునని భాషించి నారదపాదదీర్థమును స్వీకరించెను. త్రిలోకపావనియగు గంగాప్రభవకారణపాదుండగు శ్రీకృ ష్ణుండిట్లు కలహభోజనునిఁ బ్రశంసించుటయు తత్పాద తీర్థంబు స్వీకరించుటయు మాధుర్యగుణంబని యెఱుంగుము, 980

గాంభీర్యము: అనఁగాఁ జూపఱ కత్యద్భుతముగాఁదోఁచు నైఖరి.

శ్లో॥ త్రితామ్రస్త్రిషుచస్నిగ్ధో, త్రిగంభీరస్త్రిషునిత్యశః

శ్రీరామచంద్రుఁడు గంభీరుఁడని సీతాదేవితో మారుతి వచించెను.

శ్లో॥ స్వరేసత్వేచనాభౌచ, గంభీరస్త్రిషుశస్యతే॥

అనఁగాఁ గంఠస్వరమునందు గమనమునందు నాభియందు గాంభీర్యముండుట యుత్తమపురుషలక్షణములని సాముద్రికశాస్త్రము నందుఁగలదు. కంఠస్వరగాంభీర్యమనఁగా నొకానొకపురుషుఁడు సభాస్థలమునందేవిషయమైన నుపన్యసింపుచుండఁ దూరమందున్నవారికిని స్పష్టముగా వినఁబడుచు దుందుభిధ్వనివలె, మేఘగర్జనవలెమ్రోయుట స్వరగాంభీర్యము. వాగ్గాంభీర్యంబు నట్టిదియే. పురుషుఁడు నడచునప్పుడు సింహముభంగి శార్దూలంబుపగిది గంధసింధురమురీతి మహోక్షంబుభాతిఁదోఁచుట సత్త్వగాంభీర్యంబు. విషయము లుపన్యసించునప్పుడు తొట్రుపాటు నాలస్యములేక యక్షరములు స్పష్టముగాఁ దెలియుచు శ్రోతల మనస్సు నాకర్షింపుచు గంగాప్రవాహంబుఁబోలె వాక్కు నడచుట వాగ్గాంభీర్యము. 991

ఔదార్యము: ఉదారస్యభావ ఔదార్యమ్ = ఉదారుఁడనఁగా దాత. వానికార్య మౌదార్యము. యాచకులు సమీపించినమాత్రమున నడిగిన నడుగకున్నఁ గొంకు, జంకు, కసరు, కోపమువిడిచి పరిమితిలేకుండఁ జిఱునగవుతోనిచ్చునది యౌదార్యము. దీనియందుఁ గల్పవృక్షము, కామధేనువు, చింతామణి, క్షీరసముద్రము, మేఘుఁడు చంద్రుఁడు మొదలైనవారును, బలి, శిబి, కర్ణ, రఘు, దధీచి, జీమూతవాహనులు విఖ్యాతివడసిరి. 982

సుశీలుఁడు

ఇప్పుడు మీరువచించినవారి యౌదార్యమును భగవదౌదార్యమును సమానములేనా? 983

పరవరముని

సమానములుగావు. గోవులేనియూరిలో గొడ్డుబఱ్ఱె పూజ్యమైనట్లు వృక్షరహితప్రదేశములో నేరండభూజము ఖ్యాతివడసినట్లు శ్రియఃపతినిఁ జెప్పకముందు వీరందఱు దాతలేగాని యటుపిమ్మట నేతిబీర

కాయ బెల్లముకొండవంటివారగుదు రెట్లందువేనిఁ బైవారందఱు పూర్వకర్మానుసారంబుగా లభించినదానిలోఁ గొంత దాఁచుకొని శక్త్యనుసారముగా దేశకాలపాత్రల ననుసరించి వనీపకులకిత్తురు. సామర్థ్యము చాలనప్పుడు లేదనుటయో గౌరవప్రాప్తికై ప్రాణంబులు విడుచుటయో తటస్థించును. భగవంతుని దాతృత్వ మట్టిదికాదు. భూదేవియు లక్ష్మీదేవియు సర్వైశ్వర్యముల కాధారమై యుండిరి. వారిద్దఱికి నారాయణుండు భర్తయైనందున శరీరులకు సంకల్పమాత్రముచే ధర్మార్థకామములనిచ్చు నింతేకాక శాశ్వతానందప్రదాయకమైన మోక్షమునిచ్చును. దీనికిఁ దార్కాణముగా ధ్రువునకిలోకంబున నిరువదియాఱువేలవర్షములపరిమితిగలరాజ్యంబిచ్చి యంత్యంబున శాశ్వతరాజ్యంబిచ్చెను. ప్రహ్లాదునకు రాజ్యంబిచ్చెను. బలి విభీషణాదులకు నాచంద్రార్కముండునట్టి రాజ్యంబులిచ్చెను. సుగ్రీవునకు నేకాదశసహస్రసంవత్సర పరిమితరాజ్యంబిచ్చెను. పాండవులకు రాజ్యంబిచ్చెను. సంకల్పమాత్రముచేఁ గుచేలునకు పారైశ్వర్యంబును ద్రౌపదికక్షయవస్త్రంబులును కుబ్జకు లోకోత్తరసౌందర్యంబును గోపికలకు నిధువనసౌఖ్యంబును వైదిక సాందీపాదులకు మృతపుత్ర దానంబును రామావతారకాలంబునఁ ద్రిజటునకు పారైశ్వర్యంబు నొసంగె. వానరులకు దేశకాలపాత్రజ్ఞానంబును బల ప్రతాప పౌరుష విద్యా కీర్తి ధన కనక వస్తు వాహనాంబరాదుల నవ్వారిగానిచ్చె. హనుమకు భావి బ్రహ్మాధిపత్యంబును సర్వలోకపూజ్యతయు నొసంగె. గౌతమపత్నికి సురూపంబు నొసంగె. జటాయుఃప్రభృతిపక్షులకు, శబరీప్రభృతిబోయలకు, మూఢులగు గొల్లలకుఁ బూతనాప్రముఖ రాక్షసస్త్రీలకుఁ గంస శిశుపాలాది వైరులకు శరభంగాది మునులకు గజేంద్రాదులకు నయోధ్యా బృందావనస్థంబులగు స్థావరజంగమంబులకు మోక్షంబొసంగెను. మఱియు బ్రహ్మరుద్రేంద్రాదులకు దిక్పాలకులకు వసు రుద్రాదిత్యులకు వారివారిపదవులు విష్ణుదత్తంబులని యెఱుంగుము. మఱియు

నిప్పురుషోత్తమునంతు సముద్రమథనమునకొల్లు దేవతల కమృతంబు సంగ నితరదాతలు ధనాద్యైశ్వర్య పదార్థంబు లీయఁగలరుగాని మోక్షం బీయంజాలరు. ముక్తిప్రదాత విష్ణువొక్కండయని శ్రుతులు ప్రసిద్ధముగాఁ జాటింపుచున్నవి లక్ష్మీనాథౌదార్యమును కోటియుగములు వక్కాణించినను బూర్తికానేరదు. ఇది యౌదార్యమని యెఱుంగుము.

చాతుర్యము: చతురస్యభావశ్చాతుర్యమ్=చతురుని ధర్మము చాతుర్యము, అనఁగా నేర్పరితనము, రామావతారసమయంబునఁ గోతుల వశీకరించి పనులుగొనుటయు, సముద్రుని బాణంబులచే వశీకరించుటయు, సేతువుగట్టించుటయు, సుగ్రీవాదులకు మనస్సమాధానము చేసి విభీషణుని రక్షించుటయుఁ గృష్ణావతారంబున గోపీగోపాలకుల నాకర్షించి తనవంకకుఁ ద్రిప్పుకొనుట యుఁబదియాఱువేల యెనిమిదిమంది భార్యలతోఁ గలహములేకుండఁగాఁ బురంబున నడపుటయు, నొకేకాలమునందు భార్యలందఱియొద్దనుండి లాలించి నవ్వించి యానందింపించి భోగించుటయు, సర్పమును శయ్యగాఁ బక్షీంద్రుని వాహనముగా సముద్రమును గీముగా నమర్చుకొనుటయు నివిచాతుర్యలక్షణములని యెఱుంగుము. 984

స్థైర్యము: స్థిరస్యభావః, స్థైర్యమ్=స్థిరుఁడైనవాని ధర్మము స్థైర్యము చలనములేనివానిపనికిది యర్థము. దండకాటవిలో మహామునీంద్రులు శ్రీరామునిసమీపించి దనుజవధార్థమై శరణుచేయఁగాఁ దథాస్తని రాఘవుండంగీకరించెను. తదుపరి భూపుత్రి రామునిఁగాంచి ప్రాణనాథా నిష్కారణవైరంబుఁగొని దనుజులవధించుట ధర్మంబుగాదని ప్రార్థించెను. దాశరథి తదీయవాక్యంబంగీకరింపక సాధ్వీమణీ! నిరపరాధులై మద్భక్తులైన మునుల నిర్హేతుకముగా బాధింపుచున్న పోకుమూకలవధించుట లధర్మంబుగాదుగావున విడువనని ప్రతిజ్ఞఁజేసి దుష్టులఁ బోకుసంహరించి శిష్టులంగాపాడె నిది స్థైర్యము. 985

విభీషణుఁడు వచ్చి శ్రీరామచంద్రుని శరణుసొచ్చినప్పు డతనిఁ గాంచి రాక్షసుండగుగనుక వధింపవలయునని సుగ్రీవుండును దేశము గాని దేశములోఁ గాలముగానికాలములో వచ్చినాఁడుగనుక పరీక్షింప వలయునని జాంబవంతుండును వీనింబనులయందు నియోగించి మంచి వాఁడైనచోఁ బరిగ్రహింపవలయు లేనిచో విడువవలయునని యంగ దుండును మఱియు ననేకు లనేకవిధంబుల నివారింపఁగా, లక్ష్యము చేయక శ్రీరామచంద్రుఁడు విభీషణుని రక్షించెనుగనుక యిది భగ వంతుని స్థైర్యము. రఘుపతి చిత్రకూటమునందుండఁగా భరతస్వామి వచ్చి దర్శించి రాజ్యంబునకు రమ్మని యెంతనుతించినను వెళ్లక దేవతల శరణాగతికి ఫలంబైన రావణవధయుఁ బితృవాక్యపరిపాలనంబును గావించె దీనిచే స్వామివారి స్థైర్యము ప్రకటింపఁబడియె. 986

ధీరస్యభావః ధైర్యమ్ ధీరునిభావము ధైర్యము. ప్రస్తుత బాధలకు రాఁబోవు కష్టములకు భయపడకుండుటయు నెంతబలాఢ్యు లైన వైరులు తటస్థించినను జంకులేకుండుటయు, నెంతదుష్కరకార్య మైనం జేయఁగలనో చేయఁజాలనోయని చింతింపకుండుటయు ధైర్య మునకు లక్షణములు. 987

దశరథుండు పట్టాభిషేక మొనర్తునని చెప్పిననాఁడు శ్రీరాముని ముఖారవిందం బెంత వికాసముగానుండెనో వనవాసమునకనిచినప్పుడు నట్లేయుండెనుగనుక నిది ధైర్యము. మునులువచ్చి ఖరదూషణాదుల వధింపుమని రాముని ప్రార్థించినప్పుడును తదీయ రాక్షసవధావసరంబు నను రాఘవుండొక్కరీతిగానుండె. మఱియు రామభద్రుఁడు రావణ వధాత్పూర్వమే విభీషణునకుఁ బట్టాభిషేక మొనర్చెను. లవణాసుర వధాత్పూర్వమే శత్రుఘ్నునకుఁ బట్టాభిషేక మొనరించి మధురాపురం బున కనిచెను. మూఁడుకోట్లగంధర్వులఁ జంపుటకుమున్నే భరతపుత్రు లగు దక్షపుష్కరులకు రాజ్యాభిషేక మొనరించె. సముద్రజలమునింకిం

సంగలనో లేదోయని సందేహింపక బాణప్రయోగమొనర్చి సముద్రుని వశీకరించెను. శ్రీరామచంద్రుని ధైర్యలక్ష్మికివి యుదాహరణంబులు.

వ॥ స్వకీయకుమారులు పౌత్రులు సోదరులు నితరబంధువులు ప్రభాసతీర్థంబునఁ బరస్పర కలహంబులచే నీల్గుచుండగా వీక్షించియుఁ గన్నీరైనవిడువక దిగులునడక శ్రీకృష్ణుం డుదాసీనుండైయుండె నిది ధైర్యమని తెలిసికొనుము. 988

శౌర్యము: శూరస్యభావశ్శౌర్యమ్ శూరునిపని శౌర్యము. దేనిచేతను జావులేని హిరణ్యకశిపుని హరి నృసింహరూపియై గోళ్ళచేఁజీల్చి చంపెనుగనుక యిదిశౌర్యము. 989

ప్రహ్లాదవంశజులఁజంపనని వరమిచ్చితి నిబ్బాణాసురుఁడు ప్రహ్లాదుని పౌత్రుఁడు శివవరప్రసాది వీనినెట్లు శిక్షింతునాయని నెలవెలఁ బోక యబ్బాణాసురుని బాహువులనతికి శివుని జయించెనుగనుక యిది శౌర్యము. 990

పరాక్రమము: పరులనఁగా విరోధులు వారి నాక్రమించి జయించు సామర్థ్యము పరాక్రమమనఁబడును. సీతాపతి సముద్రముపై సేతువునిర్మించి లంకాపురంబునకరిగి యాక్రమించి సపుత్ర పౌత్ర భ్రాతృ పరివారకుండగు రావణునిసంహరించె నిదిపరాక్రమము. 987

శ్రీకృష్ణుండు వజ్రనాభ సునాభ హంసడిభకుల స్థానంబులకరిగి వారిని వధించెనుగనుక నిదియుం బరాక్రమము. 991

సత్యకామము: అనఁగా సత్యమునందుఁగలరుచి.

శ్లో॥ సత్యేనలోకాన్ జయతి, దీనాన్ దానేన రాఘవః = శ్రీరాముఁడు సత్యముచేత లోకములజయించుచున్నాఁడు, దానముచే దీనులజయించుచున్నాఁడని శ్రీరామాయణమునందుఁగలదు. వెండియు,

శ్లో॥ రామోవిగ్రహవాన్ ధర్మస్సాధు స్సత్యపరాక్రమః = రాముఁడు ధర్మస్వరూపుఁడని మారీచుఁడు వచించెను.

శ్లో॥ అహంవేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమం = రాముఁడు సత్య పరాక్రమముగల పరబ్రహ్మస్వరూపుఁడని విశ్వామిత్రుఁడు సెప్పెను. దీనికిఁదార్కాణముగా మునుమఁజెప్పినప్రకారము శ్రీరామచంద్రుఁడు సుగ్రీవ విభీషణులకు వైరినిర్మూలనపూర్వకముగా రాజ్యంబు లొసంగెను, ఋషుల కభయమిచ్చినప్రకారము ఖరదూషణాదుల వధించెను. చిత్రకూటమున వచించినరీతి గడువులోఁగా నయోధ్యకరిగి భరతుని రక్షించెను. మఱియు నిట్టిప్రమాణంబు లనేకములుగలవు గాన నిది సర్వేశ్వరుని సత్యకామంబని యెఱుంగుము. 992

సత్య సంకల్పము: సంకల్పమనగా మనస్సునజనించు కోరిక. సత్యసంకల్పమనఁగా వ్యర్థముగానివాంఛ. మనకు నిద్రనుండి లేచిన దాది పరుండుకొనునంతకు ననేక సంకల్పములు జనింపుచుండు నొక్కటియైన నెఱవేరదు. భగవంతునిసంకల్ప మట్టిదికాదు. పుట్టినచో నిరాఘాటముగా నెఱవేరును. సర్వేశ్వరుని సంకల్పమువల్లనే యనంత కోటి బ్రహ్మాండములు జనింపుచున్నవి వృద్ధిఁగాంచుచున్నవి లయింపుచున్నవి. మఱియు నప్పురుషోత్తముని సంకల్పము మేరువును దృణముగాఁ దృణమును మేరువుగా సల్పుచున్నది. సముద్రమునందూళ్లు నిర్మింపుచున్నది. పత్తనప్రదేశములు సముద్రముగాఁ జేయుచున్నది. పండితులను మూఢులుగా మూఢులఁబండితులుగా, ధనాఢ్యుల దీనులుగా దరిద్రుల ధనాఢ్యులుగా, రాజులఁ గింకరులుగా నొనరింపుచున్నది. శిరియతిరువడి మహాబ్ధి నుల్లంఘించి వైరుల వధించి రామకార్యంబు సాధించుటయుఁ గుచేలుం డైశ్వర్యంబుఁ జెందుటయు యాజ్ఞసేని వస్త్రంబులు ప్రాపించుటయుఁ బ్రహ్లాదుండు భక్తి రాజ్యాధికారియై హిరణ్యకశిపునిఁ దిరస్కరించుటయు ధ్రువుండు షట్సమాప్రాయుండయ్యును దపస్సిద్ధి నొందుటయు నర్జునుఁడు సూర్యాస్తమయములోఁగా సైంధవుని వధించుటయు కంసదాసి లోకోత్తరసౌందర్యవతియై వాంఛాసిద్ధినొందుటయు భగవత్సత్యసంకల్పసిద్ధంబులని యెఱుంగుము.

గాలివీచుట వహ్నిదహించుట విహాయసంబవకాశంబొసంగుట నీరంబులు జీవనాధారంబులగుట భూమి చరాచరభూతంబుల వహించుట కఠిన శిలోచ్చయములయందుఁ దరుగుల్మలతాదులు నదులు జనించుట నిశాకర దివాకర ప్రభృతిగ్రహంబులు విధిప్రకారంబుసంచరించుట, యువతీగర్భములఁ బిండోత్పత్తియై దినదినాభివృద్ధిఁ గాంచుట శిశువులు జననీ స్తన్యంబులుఁ గ్రోలుట, యోగులు రాగులై కామినీ జనంబుల కూడిగంబొనర్చుట, శైత్యాతపంబులు ఝంఝామారుతంబులు పిడుగులు దుర్భిక్షంబులు వడగాడ్పు లుమ్మాదములు కలుగుచుండుట, మారీస్ఫోటకాదులు జగతిపైఁ బ్రబలుట శమించుట, సింహ వ్యాఘ్ర భల్లూక లులాయ లేలిహాన గంధసింధురాదులు మానవుల కధీనంబులగుట శిలాస్థానంబులగు గనులయందు రత్నంబులు జనించుట, కాంతారంబులయందు ఖగ మృగ భూరుహాదులు వృద్ధినొందుట వారాశియందు విసార కచ్ఛప కుళీర తిమి తిమింగిలాదులు జన్మించి పెంపుఁగాంచుట, శీతోష్ణములు మానావమానములు లాభాలాభములు జయాపజయములు కీర్త్యపకీర్తులు కలిమిలేములు మొదలగు ద్వంద్వంబులు మనుష్యులయందుఁ బ్రసరించుట భగవదమోఘ సత్య సంకల్పముచేతనని భావింపుము. లవణోదకంబునందు రత్నంబులు బురదయందు రాజీవంబులు కురంగంబులయందుఁ గస్తూరి మార్జాలంబులయందు సాంకవంబు బఱ్ఱెలయందు క్షీరంబులు కుగ్రామంబులయందు నీచకులంబులయందు భగవద్భక్తులుజన్మించుట భగవత్సంకల్పముచేతనని యోజింపుము. ఈభగవత్సంకల్పంబునకు నాద్యంతంబులు లేవుగనుక నింతటితో విరమించెద. 993

కృతిత్వము: అనఁగా నెన్నిపనులుమనంబునందలంచు నవియెల్ల నొక్కటియైన విడువక విఘ్నమునొందకుండ నన్నియు నెఱవేర్చుట. విష్ణువు వరాహ నారసింహ రామ కృష్ణాద్యవతారంబులయం దేమేమి

షను లోనర్పఁదలంచి యవతరించె నవియెల్ల ముగిసినదాఁక వైకుంఠంబున కేగలేము. కాబట్టి యిది కృతిత్వమని తెలిసికొనుము. 994

కృతజ్ఞత: అనఁగాఁ దనకు నన్యులొనర్చినమేలు స్వల్పమైనను దానిని గొప్పగానెంచుకొనుచుండుట. దీని కుదాహరణము,

శ్లో॥ ప్రథమవయసిపీతంతోయ మల్పంస్మరంతః
శిరసినిహితభారా నారికేళానరాణాం
సలిలమమృతకల్పం దద్యురాజీవితాంతం
నహి కృత ముపకారం సాధవో విస్మరంతి

ప్రథమవయస్సునఁ దనకుఁబోసిన స్వల్పజలమును దలంచుకొని కొబ్బరిచెట్టు లమృతతుల్యమగు జలమును శిరస్సునందు ధరించి మోచి మనుజులకు యావజ్జీవపర్యంత మిచ్చుచున్న వదేప్రకారము సాధువులు పరకృతోపకారమును మఱువరన్నట్లు పురుషోత్తముఁడు నిజభక్తుఁడైన ప్రహ్లాదునిఁ దలఁచుకొని బలిని వధింపక పాతాళంబున కనిచి లౌకికరాజ్యంబును భక్తిరాజ్యంబునొసంగె. బలిచక్రవర్తి దాన సాహసంబుఁదలంచి యతనివాకిట దౌవారికుండయ్యె. నుడుత సేతువుపై మన్నుదులిపెనని యుప్పొంగి దానిశరీరమును స్పృశించి మోక్షం బొసంగెను. శ్వానంబు తనవాకిలిడాసి శరణన్నదని తద్విరోధినిదండించెను. శిరియతిరువడి చేసిన కైంకర్యంబుఁదలఁచి యతనికి భావి బ్రహ్మాధిపత్యంబొసంగెను. గోపికలు తనకొఱకై సంసారంబువిడిచిరని వారినూఱడింప నుద్ధవునిఁబనిచెను. చిన్ననాటి స్నేహంబుఁదలంచుకొని కుచేలున కురుతరైశ్వర్యం బొసంగెను. సత్యభామాజనకుని వధింపఁ గారకుఁడైనప్పుడక్రూరుని భక్తుఁడని దండింపక మీఁదు మిక్కిలి స్యమంతకమణి నొసంగెను. గడువులోరాక తన్నుమఱచిన సుగ్రీవుని దండింపడయ్యెఁ జెరువూళ్ళయందిట్టివి కోట్లుగలవు. వర్ణింప నోరు చాల దిది కృతజ్ఞతాలక్షణంబని యెఱుంగుము. 995

తారుణ్యము: అనఁగా యౌవనము. శరీరధారులకు బాల్యము కౌమారము యౌవనము వార్ధకమునని నాలుగు వయోవస్థలుగలవు. ఈనాల్గింటిలో యౌవనము ప్రశస్తమైనది. ఎట్లనఁగా బాల్యమునందుఁ జదివిన విద్యాఫలంబునుబొందుటకును సమస్తదేశసంచారంబొనర్చుటకును, దిగ్విజయంబు చేయుటకును, సర్వవిషయంబులుగ్రహించుటకును తీర్థములుసేవించుటకును, సద్గ్రంథములు రచించుటకును, పుణ్యలోకసుఖంబు లార్జించుటకును మోక్ష సామ్రాజ్యం బార్జించుటకును యోగ్యంబైన యీ యౌవనంబేచుమీ. ఈతారుణ్యము వేల్పులకుఁ బుణ్య క్షీణకాలంబువఱకుండును. నూఱుసంవత్సరములు జీవించెడి మానవులకు నిరువదైదువర్షంబులవఱకుండును. శ్రియఃపతికిఁబరవ్యూహ విభవాది సర్వరూపంబులయందును తారుణ్యముదక్క దక్కిన వయోవస్థలు లేవు. 996

సుశీలుఁడు

శ్రీరామకృష్ణాద్యవతారములయందు బాల్య కౌమారాదులున్నట్లు కనిపించుచున్నవిగదా? 997

వరవరముని

పెరుమాళ్ళకు బాల్య కౌమార వార్ధకదశ లేకాలమునందును లేవు. మనుష్యావతారంబులెత్తినప్పు డవియున్నట్లునటింపనిచో లోకము భయపడునని తలంచి యున్నట్లు నటింపుచుండును. దీనికిఁదార్కాణముగా శ్రీరామచంద్రుండు బాల్యంబునఁ దాటకావధ విశ్వామిత్రయాగావనములు శివధనుర్భంగము మొదలైన దుష్కరకృత్యంబు లొనర్చెను. శ్రీకృష్ణుండతిబాల్యంబునఁ బూతనా శకట తృణావర్తాదుల వధించెను. గోవర్ధనంబెత్తె నెనిమిదిసంవత్సరములప్రాయములో మూడు లక్షల యేబదివేలమంది నల్లవీరత్నంబులను నిధువనకేళిచే సౌహిత్యం బొందించె నింతయేల జన్మకాలమునందే దేవకీవసుదేవులకు విశ్వరూపంబుఁజూపించి పూర్వవృత్తాంతంబుఁజెప్పె నివి శైశవార్హకృత్యం

బులుకావుగదా. కాబట్టి మధుసూదనుఁడు సర్వకాల సర్వదేశ సర్వా వస్థలయందును దాసుణ్యముగలవాఁడైయుండును. 998

లావణ్యము: అనఁగా నిది ముక్తాఫలస్థంబగునీటివలె ముఖము నందును సర్వాంగములందునుండు తళుకు. భగవంతుఁడు రామ కృష్ణాద్యవతారంబులయందు దృగ్గోచరుండైనప్పు డతని విగ్రహంబునం దలి కాంతిచేఁ జూపఱకు విభ్రాంతికలుగుచుండు నతనిఁబరివేష్టించిన వారి రూపంబులన్నియు నద్దమునందువలెఁ బ్రతిబింబములు కానంబడు చుండు నప్పురుషోత్తముని దేహకాంతి సూర్యకాంతికంటె మిక్కుటమై శైత్యముగానుండును. 999

పరిమళము: అనఁగా నిది ప్రతివారి నాసాపుటంబునకు సౌఖ్య మిచ్చు నిప్పరిమళంబునకాసించి చాంపేయ మల్లికాది పుష్పారామము లయందును జందనవృక్షంబులయందును బ్రవేశించి సర్పంబులు నిలిచి యున్నవి, ఈసుగంధము మల్లికా పాటల కేతకీ చాంపేయ జాతి మాలతీ మాఖ్యాది పుష్పములయందును జందన కర్పూర కస్తూరికాలాగురు ప్రబోధన సాంకవాదులయందును, కదళీకపిత్థ రసాల జంబీరాది ఫలం బులయందును నివసించియున్నది. ఈసుగంధము తులసీ దమనాది పత్ర ములయందును గలదు. కాని యిది మిక్కిలిస్వల్పమైనది. ప్రపంచస్థం బులగు సుగంధంబులన్నియు నొకత్రాసునందుంచి భగవద్దివ్యమంగళ విగ్రహపరిమళం బొక్కత్రాసునందునిచి తూచినచో నీ సౌరభ్యంబు లన్నియు భగవద్దివ్యమంగళవిగ్రహ సుగంధమునందుఁ గోటిభాగము లలో నొకవంతునకైనం జాలవు. మన శరీరంబులయందు దుర్గంధ మెంతగానుండునో లక్ష్మీపతి దివ్యవిగ్రహమునందు సుగంధ మంతగా నుండు, నీపరిమళమప్పురుషోత్తమున కాపాదమస్తకము కేరీతినుండును. కమలాక్షుని సుగంధమునకుఁజొక్కి సర్వైశ్వర్యాధిదేవతయగు లక్ష్మి తదీయవక్షస్సునందు నిలిచియున్నది. ఈసువాసన కాసించియే వాతాశన

స్వామియగు శేషుండు పానుపై కొలుచుచున్నాడు. భూదేవి విష్ణుని భార్యయై యతనితో భోగించుకాలమున గొంతసుగంధము సంగ్రహించుకొని గంధవతియను విఖ్యాతినడసి నానాజాతి పుష్పంబులను తులసీ ప్రభృతి పత్రంబులను జందనాది వృక్షంబుల నీనుచున్నది. విష్ణుపాదోద్భవియగు గంగాపరిమళంబునకాశించి రుద్రుండు శిరస్సునధరించి శివుండైనాడు. శ్రీవైకుంఠంబున శ్రీభూనీళలకు వారినాశ్రయించియుండు దేవీసహస్రంబులకు నారాయణాంగసౌరభ్యంబు నిరంతరము ప్రాప్తించు. నిత్యముక్తులకప్పుడప్పుడు లభించును. మఱియు నవతారకాలంబులందప్పరిమళంబు సీతా రుక్మిణీ సత్యభామా ప్రముఖ పట్టమహిషులకు షోడశ సహస్ర రాజాంగనలకు గోపాలాంగనలకు బ్రాప్తించె నిది భగవద్దివ్యమంగళవిగ్రహ పరిమళవిధంబని యెఱుంగుము. 1000

సౌకుమార్యము: అనగా శరీరమృదుత్వము. సర్వేశ్వరుని దివ్యమంగళవిగ్రహ సౌకుమార్యము పద్మ కైరవ కిసలయ శిరీష సుమాదులతో సరిదూగుచుండును. మఱియు గరవాలంబులు బాణంబులు పర్వతంబులు దారువులువృక్షంబులు శిలలక్కేశవ దివ్యాంగ సౌకుమార్యంబుపై డీకొన్నచో నాయావస్తువులు శిథిలంబులగుంగాని సౌకుమార్య యుక్తమగు భగవద్దేహము కసుగందక వైవర్ణ్యము జెందక తనరారుచుండును. భగవద్భక్తులగు ప్రహ్లాదాంజనేయాదుల దేహంబులు రాక్షసుల దెబ్బలచే నొవ్వగాంచవయ్యె, భగవదాశ్రితులకే యట్టిప్రభావమున్నప్పుడు భగవచ్ఛరీర మనపాయమని వచింపనవసరములేదుగదా. 1001

# భగవత్సౌందర్య వర్ణనము

సౌందర్యము: అనగా దేహమునందలి కర చరణాద్యవయవములు సాముద్రికశాస్త్రోక్తప్రకారముగా హెచ్చులొచ్చులులేక సమా

నముగానుండుట. ఈ సౌందర్యము స్త్రీజనులలో లక్ష్మియందును పురుషులలో నారాయణునియందును పూర్తిగానుండును. తక్కిన వారియందు రెండు మూడు నాలు గైదు లక్షణము లుండుట దుర్లభము. 1002

సుశీలుఁడు

కాంతలలో రంభా వరూధినీ ప్రభృతులును పురుషులలోఁ మన్మథ జయంత వసంతాదులును సౌందర్యవంతులని చెప్పుదురే.

వరవరముని

దేహధారులైన జీవులలో వారు గొప్పవారు. వారిసౌందర్యము పరిమితితోఁగూడి మృత్యు భయ శాప దుర్గంధముల కధీనమైయుండును. రమా రమాధిపుల సౌందర్య మట్టిదికాదు. భయ మృత్యు శాపాదులఁ దొలంగఁజేయునది పరిమితిలేనిది వాచామగోచరమైనది తేజఃపుంజవిరాజమైనది పరాధీనముకానిది శాశ్వతంబైనది లక్ష్మి సౌందర్యము భగవంతునకుపయోగించును భగవత్సౌందర్యము లక్ష్మికిని స్వాశ్రితులగు వధూజనంబులకు నుపయోగించును. వెండియు భక్తుల నేత్రోత్సవమునకు యోగీంద్రుల ధ్యానంబునకు నుపయోగించును. 1004

సుశీలుఁడు

భగవత్సౌందర్య మవతారకాలమునందుఁ బూర్తిగానుండునా?

వరవరముని

భగవత్సౌందర్యము శరీరమునకు నీడవలె నెల్లప్పు డొక్క రీతిగానుండును. పరత్వమునం దెక్కువగాను తక్కినచోటఁ గించిల్లోపముగానుండును. పరవ్యూహాదులయందుఁగల సౌందర్యము గ్రంథములయందు విశేషముగాఁగన్పింపక యవాఙ్మానసగోచరమై యున్నది. రామ కృష్ణాద్యవతారములసంగతి మనపూర్వులుకొందఱు కనులారం గాంచి మనసారధ్యానించి నోరారవినుతించి సుఖించిరి. వారిలో (పెరియతిరువడి) హనుమంతుఁ డగ్రగణ్యుఁడు. 1003

సుశీలుఁడు

భగవద్విభవములను సేవించినవారనేకులుండఁగా హనుమంతుఁడు గొప్పవాఁడని పలికితివే యెందువల్ల ? 1007

పరవరముని

అవతారకాలములందు భగవద్విగ్రహముఁ గాంచినవారిలో ననుకూలురు ప్రతికూలురు ననుభయులునని మూఁడుతరగతులుగా నున్నారు. వారిలో ననుకూలురు హనుమదుద్ధవాక్రూరార్జునాదులు, ప్రతికూలురు: రావణ కంస శిశుపాల పౌండ్రక జరాసంధాదులు. అనుభయులా యా కాలములందుండియు నజ్ఞులై యుదాసీనులై యుండువారు. అనుకూలురకు భగవంతుని గాంచినతోడనే యున్నదున్నట్లు గోచరించునుగనుక వారు పునీతులగుదురు. ప్రతికూలురకు మంచి చెడ్డగాను చెడ్డ మంచిగాను తోఁచునుగనుక దాను తబ్బిబ్బునొంది చెడుదురు. అనుభయులకుఁ జూచినను జూడకున్న నేమియు గోచరింపదు. 1008

రోగి కన్న మసహ్యమైనట్లు శిశుపాలాదులకు భగవంతునిగుణములు దోషములుగాఁదోఁచుటచేఁ బడరాని బాములుపడి నశించిరి. అనుభయుల కేమియు గోచరింపకుండుటచే వారిసంసారమే వారిదిగా నుండెను. అనుకూలురనఁగా భక్తులుగనుక వారికి భగవంతునిఁ గాంచినప్పుడు తదీయప్రభావము యథార్థముగాగోచరించు నట్లు గోచరించినను పండితులుగానివా రితరులకు బోధింపఁజాలరు. భగవద్విషయ మెఱింగి యనుభవించుటకు ననన్యభక్తి కావలయు నట్టిభక్తి నభ్యాసకులకు బోధించుటకుఁ బాండిత్యముకావలయు భక్తి పాండిత్యముల రెంటియందును సర్వతోముఖ చాతుర్యముగలవాఁడు శిరియతినువడి గనుక నమ్మారుతి గొప్పవాఁడని వక్కాణించితిని. 1009

సుశీలుఁడు

అమ్మహాత్మునకు భగవత్సౌందర్యమును వర్ణించుమని యేల తటస్థించెను. 1010

వరపరముని

దేవతాంగనల రక్షించుటకు మన జనయిత్రియగు సీతాదేవి లంకలోనుండె నయ్యవసరంబునఁ దన్నుదర్శింపఁబోయిన మారుతింగాంచి రామకింకరుండగునో కాడో యని శంకించి సందేహనివారణార్థము రాముని సర్వాంగలక్షణములు వచింపుమని భూపుత్రియడుగగా ననుమ డిట్లనియెఁ దల్లీ! జానకీ!! నీవల్లభుండైన శ్రీరామచంద్రుఁడు 1 త్రిస్థిరుఁడు, త్రిప్రలంబుఁడు, 3 త్రిసముఁడు, 4 త్రిసమున్నతుఁడు, 5 త్రితామ్రుఁడు, 6 త్రిస్నిగ్ధుఁడు, 7 త్రిగంభీరుఁడు, 8 త్రివలీవంతుఁడు, 9 త్ర్యవనతుఁడు, 10 చతుర్వ్యంగుఁడు, 11 త్రిశీర్షుఁడు, 12 చతుష్కలుఁడు, 13 చతుర్లేఖుఁడు, 14 చతుష్కిష్కుఁడు, 15 చతుస్సముఁడు 16 చతుర్దశ సమద్వంద్వుఁడు, 17 చతుర్దంష్ట్రుఁడు, 18 చతుర్గతి, 19 మహోష్ఠహనునాసుఁడు, 20 పంచస్నిగ్ధుఁడు, 21 అష్టవంశవంతుఁడు, 22 దశపద్ముఁడు, 23 దశబృహత్తు, 24 త్రివ్యాప్తుఁడు, 25 ద్విశుక్లవంతుఁడు, 26 షడున్నతుఁడు నని చెప్పెను. 1011

సుశీలుఁడు

ఈవాక్యములకు విశదముగా నర్థము సెలవీయండి 1012

వరపరముని

1. త్రిస్థిరుఁడు: అనఁగా,

శ్లో॥ ఉరశ్చ మణిబంధశ్చ ముష్టిశ్చ నృప తేస్థిరాః, అను సాముద్రికోక్తిచే వక్షము, మణిబంధము, పిడికిలి యీమూఁడు కఠినములుగా నుండుటవలన శ్రీరామచంద్రుఁడు త్రిస్థిరుఁడనఁబడెను. 1013

2. త్రిప్రలంబుఁడు: అనఁగా,

శ్లో॥ దీర్ఘభ్రూబాహు ముష్కస్తు, చిరజీవీ ధనీనరః, అను శాస్త్రోక్తిచే

గను బాహులు, చేతులు, వృషణములు నిడుపుగాను దీర్ఘముగానుండుట
వల్ల శ్రీరాముఁడు త్రిప్రలంబుఁ డనిపించుకొనుచున్నాఁడు. 1014

3. త్రిసముఁడు: అనఁగా,

శ్లో॥ కేశాగ్రం వృషణం జానుస్సమా యస్య సభూపతిః। అను న్యాయ
ముచే వెంట్రుకలకొనలు వృషణములు మోకాళ్లు సమానముగా
నుండుటవల్ల రాఘవుఁడు త్రిసముఁడనఁబడును. 1015

4. త్రిసమున్నతుఁడు: అనఁగా,

శ్లో॥ నాభ్యంతః కుక్షి వక్షోభిరున్నతస్త్రిసమోన్నతః। అను నార్యోక్తిచేఁ
కుక్షి వక్షము నాభిలోపలిభాగము నిడుపు నెత్తుగా నుండుటవల్ల
రాముఁడు త్రిసమున్నతుఁడని యర్థము. 1016

5. త్రితామ్రుఁడు: అనఁగా,

శ్లో॥ నేత్రాంతనఖ పాణ్యంఘ్రిః, తైస్తామ్రైస్త్రిభిస్సుఖీ। అనున్యాయ
ముచేఁ కనుకొలుకులు గోళ్లు పాదతల హస్తతలములు కెందామర
వలె నెఱ్ఱగానుండుటచే సీపతి త్రితామ్రుఁడనఁబడును. 1017

6. త్రిస్నిగ్ధుఁడు: అనఁగా,

శ్లో॥ స్నిగ్ధా భవంతి వై యేషాం పాదరేఖాః శిరోరుహాః
స్తథాలింగమణిస్తేషాం మహాభాగ్యం వినిర్దిశేత్। అను న్యాయ
ముచేఁ బాదరేఖలు శిరోజములు వరాంగము వీనియందు నునుపు
గలవాఁడగుటవలన రాఘవుఁడు త్రిస్నిగ్ధుఁడనఁబడును। 1018

7. త్రిగంభీరుఁడు: అనఁగా.

శ్లో॥ స్వరస్సత్వంచ నాభిశ్చ, గంభీరశ్చస్య తేబుధాః॥ అను శాస్త్రోక్తిచేఁ
కంఠస్వరము గమనము బొడ్డు నీమూఁడు గాంభీర్యముగా నుండుట
వలన దాశరథి త్రిగంభీరుఁడనఁబడుచున్నాఁడు. 1019

8. త్రివళీవంతుఁడు: అనఁగా,

శ్లో॥ స్థిరా త్రిరేఖా సుభగోపపన్నా, స్నిగ్ధా సుమాంసోపచితా సువృత్తా
నచాతి దీర్ఘా చతురంగుళా చ, గ్రీవా చ దీర్ఘా భవతీహ ధన్యే। అను
న్యాయంబుచే నుదరంబున మూఁడుమడతలు గళంబున మూఁడు రేఖ
లుండుటవల్ల సిప్రాణేశ్వరుఁడు త్రివళీవంతుఁడనఁబడును. 1020

9. త్ర్యవనతుఁడు: అనఁగా,

శ్లో॥ పీనోపచితైర్నిమ్నైః క్షితిపోయఃశ్చూచుకైః స్తనైః సుఖనఖి
స్నిగ్ధానిమ్నా రేఖాధనినాం తద్వ్యత్యయేన నిస్స్వానాం। అను
న్యాయముచే నిమ్నముగానుండు పాదరేఖలు చనుమొనలు చనులు
గలవాఁడుగనుక శ్రీరాముఁడు త్ర్యవనతుఁడనఁబడును. 1021

10. చతుర్వ్యంగుఁడు: అనఁగా,

శ్లో॥ గ్రీవాచప్రజననం పృష్ఠం హ్రస్వం జంఘా చ పూజ్యతే। అనున్యా
యంబుచే గళము శ్రోణి వరాంగము పిక్క యీనాలుగు హ్రస్వము
లుగా నుండుటవలన శ్రీరామచంద్రుఁడు చతుర్వ్యంగుఁడనఁబడును.

11. త్రిశీర్షుఁడు: అనఁగా,

శ్లో॥ ఆవర్తత్రయ రుచిరం యస్యశిరస్సక్షితిభృతాం నేతా। అను
న్యాయముచే నుత్తమాంగమున దక్షిణావర్తములగు మూఁడు సుడు
లుండుటచే కౌసలేయుఁడు త్రిశీర్షుఁడనఁబడును. 1023

12. చతుష్కలుఁడు: అనఁగా,

శ్లో॥ మూలేఽంగుష్ఠస్య వేదానాం చతస్రస్తిస్ర ఏవవా
ఏకాద్వేవా యథాయోగం రేఖాజ్ఞేయా ద్విజన్మనామ్। అనుస
ట్లంగుష్ఠమూలమునందు నాలుగు వేదములువచ్చిన వాఁడని సూచించు
నాలుగు రేఖలు గలవాఁడుగనుక సీహ్యాదీశుఁడు చతుష్కలుఁడనం
బడును. 1024

13. చతుర్లేఖుఁడు: అనఁగా,

శ్లో॥ లలాటే యస్య దృశ్యంతే చతుస్త్రిద్వ్యేకరేఖికాః
శతద్వయం శతం షష్టిస్తస్యాయుర్వింశతిస్తథా
యస్య పాదతలే వజ్రధ్వజశంఖాంకుశోపమాః
రేఖాసమ్యక్ప్రకాశంతే మనుజేంద్రం తమాదిశేత్। అనునట్లు
లలాటంబున నాలుగు రేఖలు పాణి పాదతలములయందు వజ్ర ధ్వజ
శంఖాంకుశాది రేఖలుగలవాఁడుగనుక నీ మనోహరుండగు శ్రీరా
ముఁడు చతుర్లేఖుఁడనఁబడును. 1025

14. చతుష్కిష్కుఁడు: అనఁగా,

శ్లో॥ షణ్ణవత్యంగుళోత్సేధో యఃపుమాన్సదివౌకసః। అనునట్లు రామ
చంద్రమూర్తి తొంబదియాఱంగుళముల పొడవుగలవాఁడు గనుకఁ జతు
ష్కిష్కుఁడనఁబడును. 1026

15. చతుస్సముఁడు: అనఁగా,

శ్లో॥ బాహుజానూరుజంఘాశ్చ, చత్వారస్యుస్సమానిచ। అనురీతిని
బాహులు మోకాళ్లు తొడలు పిక్కలు నీనాలుగుప్రదేశములు సమా
నముగా నుండుటవలన నీపతి చతుస్సముఁడనఁబడును. 1027

16. చతుర్దశసమద్వంద్వుఁడు: అనఁగా,

శ్లో॥ భ్రువౌ నాసాపుటే నేత్రే కర్ణావోష్ఠౌ చచూచుకే
కూర్పరౌ మణిబంధేచజానునీ వృషణౌకటీ
కరౌ పాదౌ స్ఫిజౌ యస్య సమౌ జ్ఞేయస్సభూపతిః। అనునట్లు కను
బొమలు ముకుఁగ్రోళ్లు లోచనములు కర్ణములు మోవులు స్తనాగ్ర
ములు మోచేతులు మణిబంధములు మోకాళ్ళు వృషణములు కటి
ప్రదేశములు కరములు పాదములు పృష్ఠములు నీపదునాల్గుజోళ్లు
సమానముగానుండుటవలనఁ జతుర్దశసమద్వంద్వుఁడని రామునకు
బిరుదముగలదు. 1028

17. చతుర్దంష్ట్రుఁడు: అనఁగా,

శ్లో॥ స్నిగ్ధా ఘనాశ్చదశనా స్సుతీక్ష్ణదంష్ట్రాస్సమాశ్చశుభాః। అనుసన్న నునుపుగలిగి మంచిమొనలుగల నాలుగు కోఱపండ్లు గలవాఁడగనుక శ్రీరామచంద్రుఁడు చతుర్దంష్ట్రుఁడనంబడును. 1029

18. చతుర్గతి: అనఁగా.

శ్లో॥ గజసింహగతీ వీరౌ శార్దూల వృషభోపమౌ। అను రామాయణ బాలకాండోక్తప్రకారంబుననేనుఁగు సింగము పులి యాఁబోతు వీనివలె గర్వముతో గంభీరముగా నడచుటవలన రాఘవుఁడు చతుర్గతి యనఁబడును. 1030

19. మహోష్ఠహనునాసుఁడు: అనఁగా,

శ్లో॥ బంధు జీవ కుసుమోపమాధరో
మాంసలోరుచిరబింబరూపధృత్
పూర్ణమాంసలహనుస్సుభూషిత
స్తుంగతుండరుచిరాకృతిస్తథా। మంకెనపువ్వును దొండపండును బోలిన యెఱుపుతోఁగూడిన మోవిగలవాఁడును కండ బలుపుగల చెక్కిళ్ళుగలవాఁడును కోఁటేరువలె నెత్తైన ముక్కుగలవాఁడునుగనుక దాశరథి మహోష్ఠహనునాసుఁడనఁబడును. 1031

20. పంచస్నిగ్ధుఁడు: అనఁగా,

శ్లో॥ చక్షుస్స్నేహేన సౌభాగ్యం, దంతస్నేహేన భోజనం
కృత్తిస్నేహేన శయనం, పాదస్నేహేన వాహనం
స్నిగ్ధ నీల మృదు కుంచితా స్తథా, మూర్ధజాస్సుఖకరాస్సమంతతః॥
అను న్యాయముచే లోచనములు దంతములు చర్మము పాదములు శిరోరుహములు నీయైదింటియందు మృదుత్వము నునుపు గలవాఁడు గనుక సీభర్తయగు రాముఁడు పంచస్నిగ్ధుఁడనఁబడును. 1032

21. అష్టవంశసంతుఁడు: అనఁగా,

శ్లో॥ పృష్ఠవంశశ్శరీరంచ, హస్త పాదాంగుళీకరౌ
నాసికా చక్షుషీకర్ణౌ, ప్రజననం యస్యచాయతా। అను శాస్త్రోక్తిచే వీపు దేహము హస్త పాదముల వ్రేళ్లు హస్తములు ముక్కు నేత్రములు వీనులు లింగము నీయెనిమిది దీర్ఘముగానుండును గనుక రాఘవుఁ డష్టవంశసంతుఁడనఁబడును. 1033

22. దశపద్ముఁడు: అనఁగా,

శ్లో॥ ముఖ నేత్రాశ్చ జిహ్వోష్ఠ, తాలు స్తన నఖాః కరౌ
పాదౌచదశపద్మాని, పద్మాకారాణి యస్యచ। అను శాస్త్రోక్తిచే నోరు నేత్రములు మొగము నాలుక పెదవులు దవుడలు స్తనములు గోళ్ళు హస్తములు పాదములు నీపదియును పద్మాకారములుగానుండుటచే రాఘవుఁడు దశపద్ముఁడనంబడుచున్నాఁడు. 1034

23. దశబృహత్తు: అనఁగా,

శ్లో॥ శిరో లలాటే శ్రవణే, గ్రీవా వక్షశ్చ హృత్తథా
ఉదరం పాణి పాదౌచ, పృష్ఠం దశబృహంతిచ। అనునట్లు శిరస్సు లలాటము చెవులు గళము ఱొమ్ము హృదయము కుక్షి కరములు పాదములు పృష్ఠము నీపదియును విశాలముగానుండుటవలన శ్రీరాముఁడు దశ విశాలుఁడనఁబడుచున్నాఁడు. 1035

24. త్రివ్యాప్తుఁడు: అనఁగా,

శ్లో॥ త్రిభిర్వ్యాప్నోతిశ్చయస్సస్యాత్తేజసా యశసాశ్రియా। అను న్యాయంబుచేఁ దేజస్సు కీర్తి ఐశ్వర్యము నీమూఁడింటిచే లోకమంతయు వ్యాపించినవాఁడుగనుక నీపతియగు కౌసలేయుఁడు త్రివ్యాప్తుఁడనఁబడుచున్నాఁడు. 1036

25 ద్విశుక్లసంతుఁడు: అనఁగా,

శ్లో॥ ద్వాశుక్లౌతుశుభౌశుద్ధౌ, వంశౌమాంతుః పితుస్తథా। అను

న్యాయంబుచేఁ బరిశుద్ధములగు మాతృ పితృ వంశంబులు గలవాఁడు గనుక శ్రీరామచంద్రుఁడు ద్విశుక్లవంతుఁడనఁబడుచున్నాఁడు.

26. షడున్నతుఁడు: అనఁగా,

శ్లో॥ కక్షః కుక్షిశ్చ వక్షశ్చ, ఘ్రాణస్కంధౌ లలాటికా
సర్వభూతేషు నిర్దిష్టా, ఉన్నతాంగా శుభప్రదాః। అనుకీతినిఁ జంకలు కుక్షి వక్షము ముక్కు భుజశిరస్సులు లలాటము నీయారు ప్రదేశము లున్నతముగా నుండుటవలన దాశరథి షడున్నతుఁ డనఁబడుచున్నాఁడు. 1038

27. నవతనుఁడు: అనఁగా,

శ్లో॥ సూక్ష్మాణ్యంగుళి పర్వాణి కేశలోమనఖత్వచః
శేఫశ్చయేషాం సూక్ష్మాణి, తే నరా దీర్ఘజీవినః। అనునట్లు వ్రేళ్ళ కనుపులు కురులు రోమములు గోళ్ళు చర్మము లింగము మీసములు బుద్ధి దర్శనము నీతొమ్మిది సూక్ష్మముగా నుండుటవలన శ్రీరాముఁడు నవతనుఁడనఁబడును. 1039

వ॥ మఱియు నీమనోహరుఁడగు శ్రీరామభద్రుఁడు పూర్వాహ్ణమునందు ధర్మము మధ్యాహ్నమునందు నర్థము నపరాహ్ణమునందు గామమునుఁ బొందువాఁడుగనుక త్రివర్గప్రవర్తకుఁ డనంబడుచున్నాఁడు.

శ్రీరామచంద్రుఁ డిన్నివిధములైన సాముద్రికలక్షణములు గలవాఁడని పండితాగ్రేసరుండగు హనుమంతుఁడు సీతాదేవి కెఱింగించెను.

సుశీలుఁడు

ఈలక్షణము లింకెవ్వరికైనంగలవా ? 1042

వరవరముని

సుజాతుండగు పురుషున కిందులో రెండు మూడుండునేమో గాని యిన్నిసాముద్రికలక్షణములు రామునకుఁదక్క నెవ్వనికి లేవు.

ఇంతేకాక యుత్తమనాయకగుణంబులన్నియు రామునియందే కలవని కవీశ్వరులును లక్షణవేత్తలైన పండితులును వేనోళ్ళ నగ్గించిరి.

సుశీలుఁడు

సీతామహాదేవి సాముద్రికలక్షణంబులుసహా చెప్పగలరావిూరు!

వరవరముని

అవి మన కవసరంబులుగావు, వానినెన్నఁబూనియే రావణుండు సపరివారంబుగా నశించె నామెపాదంబులుదక్క నేనేమియు నెఱుంగ నని వచించిన లక్ష్మణుండు త్రిలోకపూజ్యుఁ డయ్యెఁగావున మనకును సర్వలోకములకును దల్లియైన సీతాదేవి పాదంబులు నామె కల్యాణ గుణంబులును ధ్యేయంబులు. లక్ష్మీసర్వావయవంబులు నారాయణ మనోరంజకంబులు. 1045

సుశీలుఁడు

భగవత్సౌందర్యంబు విూరువచింపుచుంటిరి నేనువినుచుంటిని. దీనివల్ల రాఁగల లాభమేమి? 1046

వరవరముని

పుత్రా! భగవద్వైభవం బెఱుంగని కతంబున నిట్లడిగితివి చెప్పెద వినుము. 1047

సీ॥ గంధర్వశృంగిణీ గంధ సింధుర సౌర
భేయ సమృద్ధికై ప్రీతిఁజెంది
ప్రాకారమంటప ప్రాసాద సౌధ చై
త్యాది విభవమున గాసఁజేసి
నానావిధారామ సూన సస్య ఫలౌఘ
రామణీయకముపై రక్తిఁగాంచి
తరుణీజనాంగ సౌందర్య సంప్రాప్తికై
ధన పట ప్రాణముల్ ధారవోసి

చూడిరి చెలువముండి రీఁకనిూనఁ జెలువు రఖిల
జనులు మురవైరి సౌందర్యమునలయించు
వారు పెడఁబోరు గోపికావారవుట్లు
సరసుసరసమును గాంతు రసాయముఁడిగి. 1048

సుశీలుఁడు

ప్రభూ! భగవదమోఘ సౌందర్యంబు శ్రీరామాయణంబునఁ దక్క నెందునుగానరాదే యెందువల్ల ? 1049

వరవరముని

సాత్త్వికమైనవక్తయు శ్రోతయు నొక్కచోటఁ దటస్థించినప్పుడు గాని యేవిషయమైనను బయలుపడదు. భూపుత్రికి రామాంగ సౌందర్యంబడుగవలసిన కార్యము తటస్థించెను. వేదాంత తత్త్వజ్ఞుండగు హనుమంతుండు వచించెను. దానిని సర్వజ్ఞుండగు వాల్మీకి శ్లోకరూపంబున నెల్లడించె నయ్యర్థము మన పూర్వాచార్యులగు యామున రామానుజాదియోగుల బోధామృత ప్రవాహ సంప్రాప్తిచే మన మెఱుంగఁజాలితిమి. కాన జీవికి మోక్షప్రదంబగు నారాయణ సౌందర్యవర్ణనంబింకనువక్కాణించెద నాకర్ణింపుము. ఎట్లంటివేని సర్వేశ్వరుని భజించునట్టి జ్ఞానులకు భగవద్దివ్యమంగళవిగ్రహ సౌందర్యము కన్నులకు గోచరింపకముందు జ్ఞానదశలోనుందురు. సోయగము నేత్రోత్సవముగా దర్శించినప్పుడు ప్రేమదశలోమునుంగుదురు. ఈవిషయమును పిళ్లలోకాచార్యులవారు శ్రీవచనభూషణంబను గ్రంథంబునఁ దీర్మానించిరి. ఎట్లంటివేని జ్ఞానదశలోనున్నప్పుడు భాగవతులకు భగవంతుఁడు సర్వేశ్వరుఁడని సర్వశక్తుఁడని సర్వనియామకుఁడని విరోధి నిరసనశీలుఁడని యాశ్రితరక్షకుఁడని గోచరించును. సరసిజాక్షుఁడు కనిపించినప్పుడు తదీయ దివ్యమంగళ విగ్రహంబున కే మపాయము సంభవించునోయను భయంబుదక్క మఱేమియుఁదోఁచదు.

సుశీలుఁడు

దీని కుదాహరణంబు సెలవిండు. 1050

పరవరముని

జారరూపతగలవాఁడవై యూరక్షింపుము. తొల్లి దానవులచే నోటువడి దైన్యముఁజెందియున్న దేవతల రక్షింపఁగోరి నిలింపమాత యగు నదితి శ్రియఃపతినిఁగూర్చి తపస్సుసేసి ప్రత్యక్షము చేసుకొని వరంబుఁగోరఁగా జనార్దనుం డామెగర్భంబున వామనుండై జన్మించి కొన్నిదినంబులకు బలిని జయింపఁబోవుచుండ నమ్మోహసంయుతయగు నదితి వామనరూపియగు విష్ణువు సర్వశక్తుఁడుగనుక యితనికెట్టి యపాయంబును లేదనుమాటమఱచి పుత్రా! విపత్తులేనివాఁడవై జయంబుఁ గాంచిరమ్మని దీవించెఁ దనరక్షణమునకై తెచ్చుకొన్న వామనునిఁ గూర్చి యదితి యాశీస్సులొసఁగుట ప్రేమదశయని యెఱుఁగుము.

మున్ను బలిచక్రవర్తి వామనుని సౌందర్య సౌకుమార్యాదులకుఁ జొక్కి నిజాచార్యుండగు శుక్రునిసహా తిరస్కరించి ప్రాణహానికి శంకింపక సర్వస్వము వామనునకు ధారవోసె నిది ప్రేమదశయని యెఱుంగుము. 1052

విశ్వామిత్రమహర్షి యయోధ్యకువచ్చి దశరథునిఁ గాంచి స్వకాధ్వర రక్షణముకొఱకు శ్రీరాము నిమ్మని యాచించి దానికి నాజి యంగీకరింపక భయమొందఁగా గాధిపుత్రుండు దశరథు నీక్షించి రాజేంద్రా! నీవజ్ఞుండవు నేను బహుగురూపాసలబ్ధజ్ఞానసేవధిని, నీవు కామాంధుండవు నేను తపోనేత్రముగలవాఁడను, నీవు పుత్రకామేష్టి చేసినవాఁడవు నేను మోక్షకామేష్టి చేసినవాఁడను, నీవు స్త్రీలోలుండవు నేను విరాగిజనాగ్రేసరుండను, రాముఁడు పరబ్రహ్మస్వరూపుఁడు సత్యపరాక్రమాది కల్యాణగుణనిధి. ఈ రహస్యంబు నీకుఁదెలియదు నాకుఁ బూర్తిగాఁదెలియును. సందేహమున్నచో నాకు విరోధియై నీకులగురుండై సంస్తుతివల్లభపుత్రుండైన వశిష్ఠునడుగుము,

మఱియుఁ దపోనిష్ఠులగు గౌతమ మార్కండేయాగస్త్య నారద వాల్మీకాదుల సమగుమని రాజేంద్రుని నోరుమూయించి వసిష్ఠానుమతిచే సలక్ష్మణుండగు రాముని దీసుకొనిపోయిన గాధేయుండు తాటక సమీపించినప్పుడు హుంకారధ్వనిచే నారక్కసి నదలించి రామలక్ష్మణులఁ గౌఁగిలించుకొని యాశీర్వదించి తదుపరి రామునిచేఁ దాటకను సంహరింపఁజేసె నిది విశ్వామిత్రుని ప్రేమదశయని యెఱుంగుము. 1053

శ్రీరాముఁడొనరించిన తాటకావధ, విశ్వామిత్రయాగావనము శివధనుర్భంజనము మొదలైన యమానుషకృత్యంబులు వినియుండియు రామవనవాసగమన ప్రారంభమునఁ గౌసల్యాదేవి కుమారుని దక్షిణ కరమున రక్షఁగట్టి సర్వాంగక్షేమ సమృద్ధికై సహస్రవిధంబుల నాశీర్వాదం బొనర్చె నిది కౌసల్యాప్రేమదశయని భావింపుము. 1054

సీతావల్లభుఁడు దండకాటవి కేగినప్పు డమ్మహాపురుషుఁడు సర్వేశ్వరుఁడని తెలుసుకొని దేవా మావిరోధులసంహరించి మమ్ముల రక్షింపుమని ప్రార్థించిన మునీంద్రులు ఖరాదులతోఁ బోరునప్పుడు రామునకు జయంబును రాక్షసులకు నాశనంబును గలుగుఁగాకయని వచించి రామవిజయంబున కుప్పొంగిరి. ఇది మహర్షుల ప్రేమదశయని యూహింపుము. 1055

నరమాంసముభక్షించు సూర్పనఖ రామునిఁగాంచి తదీయ సౌందర్య ప్రవాహ నిమగ్నమానసయై తీయనిమాటలతో సమీపించి స్వకీయ జరఠాత్వముమఱచి రామునితో రామా! నీవిగ్రహ సౌందర్యము వీక్షింపఁగా మదీయ నేత్రము లస్యమును ధిక్కరించినవి. చేతులు నిన్నుఁ గౌఁగిలింపఁగోరుచున్నవి. మామక కుచంబులు నీభుజాంతరమును స్పృశింపఁగోరుచున్నవి. రదంబులు మీ కపోలంబులందు దంతక్షతంబులు సేయఁగోరుచున్నవి. మదీయ సర్వేంద్రియంబులు చలింపుచున్నవిసుమీయని వక్కాణించి స్వకీయ దుర్ణయాను

సారముగాఁ గర్ణనాసాభంగంబుఁ గాంచి ఖరాసురునిఁ జేరి యతండు నీ కర్ణనాసాచ్ఛేదకు లెవ్వరని ప్రశ్నింపఁగా దూషించుటమాని రామలక్ష్మణులఁ దలంచి ఓరి ఖరాసురా! నవయౌవనవసంతులు, చీరకృష్ణాజినాంబరులు, వీరులు, సౌకుమార్య లావణ్య సౌందర్య నిధులు, సురూప నిర్జిత కంతు జయంత వసంతులు, సంఫుల్లరాజీవాక్షులు రామలక్ష్మణులని స్తుతించెనేగాని పరుషంబు లాడలేదు. ఇది రాక్షసి ప్రేమదశయని తలంపుము. 1056

సుశీలుఁడు

స్వామీ! కర్ణనాసాచ్ఛేదంబొనర్చినను దూషింపక స్తుతించిన శూర్పనఖ భగవంతునివల్ల నేమిలాభము పొందినది? 1057

వరవరముని

మంచిప్రశ్నమొనర్చితివి చెప్పెద వినుము. చేటగోళ్ళరాకాసి రాముని గాంచినదిమొదలన్యంబువర్జించి రామవిగ్రహంబు మనస్సులోనిల్పి ధ్యానింపుచుఁ గౌఁగిలింపుచు ముద్దుపెట్టుచు రామప్రభావం బితరులకెఱింగింపుచుఁ గాలంబుఁగడపి రాక్షసకళేబరంబు విడిచి రామసంబంధ సుకృతప్రాప్తిచే మఱుజన్మంబున మధురాపురిలో జనించి కంసదాసియై శ్రీకృష్ణానుగ్రహంబుచే సర్వాంగ సౌందర్యంబుఁ బ్రాపించి నందనందనునితో సంభోగసౌఖ్యం బనుభవించెను.

సుశీలుఁడు

శూర్పనఖ ప్రథమజన్మంబున దురవస్థఁ జెందినను ద్వితీయజన్మంబున భగవంతునితోఁ గలిసి సుఖించెను. రావణుని సమాచారమేమి?

వరవరముని

రావణునకు నిజకృత్యానుసారముగా సపరివారనాశము లభించెను. రావణునకు సీతయందుఁ గల్గినది దుర్మోహము. శూర్పనఖకు రామునియందుఁ గల్గినది తైలధారావదవిచ్ఛిన్నభక్తి. జీవులకు సర్వేశ్వరునితో నవవిధసంబంధంబులుగలవు. తత్సంబంధంబులలో నేకతిగా

భావించినను భగవదనుగ్రహపాత్రులై సుఖింతురు. కాని లక్ష్మీదేవితో జీవులకు మాతా పుత్ర సంబంధ మొక్కటియే కలదు. దీనికి ప్రమాణము,

శ్లో॥ మాతాచ కమలాదేవి పితాదేవో జనార్దనః
భాంధవా విష్ణుభక్తాశ్చ, స్వదేశం భువనత్రయమ్

అని యున్నదికాఁబట్టి లీలా నిత్యవిభూతులయందుండు సమస్త దేహధారులు పుత్రులు. వారికి లక్ష్మీదేవి జనయిత్రి. ఈరమాదేవి నారాయణునకుఁ బురుషకారమొనర్చి జీవులనుద్ధరింపుచుండు నిమ్మార్గంబు ననుసరించి మంగళదేవతను నిరుపాధిక సవిత్రిగాఁదలంచి కమలాక్షుని భజించువారల నిష్ట నివృత్తి యిష్ట ప్రాప్తిగలవారై సుఖింతురు. దీనికివిరుద్ధముగా మూర్ఖుండగు రావణుండు నిరుపాధిక జనని యగు సీతాదేవిపై దుర్మోహముఁజెంది నశించెను. జగద్భర్తయై నిరుపాధికభర్తయగు రాముని భర్తగాఁగోరి శూర్పనఖ సుఖించెను. 1060

తారాంగన వాలిమరణంబు వినఁగానే రాముని నమలి క్రింగవలెనను కోపంబుతోనేగి రణభూమియందు సుగ్రీవాది వానరులతో లక్ష్మణసహితుఁడై యున్న రాముని దర్శించి స్వభర్తృవియోగంబునుఁ దృణంబుగా నీసడించి రామాంగసౌందర్యంబునఁజూచి. 1061

సీ॥ ఈరామునెడఁబాసి గారాబమునఁగన్న
భూపాలుఁడీల్గు టద్భుతముగాదు
తనకుదక్కిన రాజ్యమును నీగుణాబ్ధికి
భరతుఁ డర్పించు టబ్బురముగాదు
భోగములన్నియు విడి యిప్పుణ్యనిధాను ల
క్ష్మణుఁడు గొల్చుటయు విస్మయముగాదు.
తమ తపఃఫలము లీ ధన్యునకిడి మౌని
వరు లాశ్రయించుట వమ్ముగాదు

వీనులారంగ విని యిమ్మహానుభావుఁ
గన్నులారంగఁ గాంచిన కాలమంతు
సతివ్రతైనను మగవారలైనఁ బ్రాణ
ధనము లర్పించెదరుచుమిా తప్పకుండ. 1062

సీ॥ యీ కౌసలేయు కలాకలాపముఁ గన్న
శశికలానిధియన సాధ్యమగునె
యీ పుణ్యరాశి సురూపంబుఁ గన్నచో
నింపుగా మరుని గణింపఁ దరమె
యీ జానకీనాథు దేజస్సుఁ దిలకింప
నినునిఁ బ్రభాకరుండనవశంబె
యీ రాఘవుని నిర్జితేంద్రియత్వముఁ గన్న
సనకాదులను ఘనులనఁ గదగునె

పండిన రసాల గోస్తనీపాదపముల
రీతిఁ గల్యాణగుణసముపేతుఁడగుచుఁ
దనరుచున్నాఁడు దశరథాత్మజుఁడు వీని
ననుభవింపనిచో వ్యర్థమగును జీవి. 1062

సీ॥ సౌందర్యమునకు నాశ్రయ మించుకయుఁ గల్గ
దీ రాఘవుఁడు జనియింపకున్న
నైశ్వర్యమున కాశ్రయముగల్గనేర దీ
లోకైకనాథుండు లేకయున్న
భూరి పుణ్యమున కాధారంబు గానరా
దీ దాశరథి జన్మమెత్తకున్న
సత్కీర్తికెచట వాసంబు లభింపఁబో
దీ రామవిభుఁ డాదరింపకున్న

సమధికజ్ఞానమునకును సత్యమునకుఁ
బ్రవిమలానందమునకుఁ బ్రాభవమునకును
బట్టుఁగొమ్మనైయె జనించె నిభవ్యశీలు
రామచంద్రు నుతింపఁదరంబెనాకు. 1064

సీ॥ గుడ సితా మకరంద గురు సుధారసము లి
యనఘాత్ము దివ్యవాక్యంబులయ్యె
స్వాదీవరసాల మోచాఫలస్థంబులా
చవు లీతని గుణప్రచయములయ్యెఁ
దరుణీ జనానందదాయక మదన వి
భూతి యీతని పుణ్యమూర్తియయ్యె
నీహార కిరణాగ్ని నీరజాప్త ప్రభా
ధిక్య మీతని తనూదీప్తియయ్యె
నట్లుగాకయున్న నఖిలజనుసేంద్రుల
కిడునె మోహమూర్తి నెనసియున్న
నాకు మోహమిడునె నరమాంస భక్షిణి
కిడునె భూరి మోహమితని రూపు. 1065

వ. తారాప్రతీపదర్శిని యిట్లు కొంతసేపాలోచించి సాహిత్యం బుఁజెందక రాముని దివ్యమంగళవిగ్రహంబు మనంబుననిలిపి ధ్యానించి కౌఁగిలించి చుంబనంబులిడి రామునింగాంచి ప్రభూ ! ప్రమాణముల చేతఁ దెలియరాని వాఁడవు శత్రునిరాసకుండవు జితేంద్రియులలో నుత్తముఁడవు ధార్మికులలో నగ్రేసరుండవని స్తుతించె నిది ప్రేమదశ యని యెఱుంగుము. 1066

సీతామహాదేవి స్వీయమనోహరుండగు రాముని పరాక్రమాదు లెఱింగియుండియు సతంత్రు మాయామృగంబును సంహరించు

నప్పుడు హా సీతా లక్ష్మణా యను నార్తధ్వనివిని భయంబుఁజెంది లక్ష్మణుని సహాయంబుఁ బొమ్మనుటయు నతండు పోవక నిరాకరించె నని దూఱుటయు నిది భూపుత్రి ప్రేమదశయని యెఱుంగుము. 1037

వ॥ శృంగిబేరపురంబున శ్రీరామచంద్రుఁడు మైథిలీసహితుండై శయనించిననాటిరాత్రి యిమ్మహాత్మున కీయరణ్యంబున నేమి సాధ్వసంబు గల్గునోయని శంకించి సౌమిత్రి ధనుర్బాణంబులు ధరించి మేల్కొని కాపాడుచుండె నిది యిట్లుండఁగా లక్ష్మణుఁడు సవతి తల్లి కొడుకు రాముని వెంట నిష్కారణముగావచ్చి కాపాడునట్లు నటింపుచున్నా డేమి కీడుచేయునోయని సందేహించి చాలాసేపు గుహుఁడు లక్ష్మణునిపైఁ గావలియుండె, లక్ష్మణ గుహు లేకీభవించి రామునకుఁ గీడొనర్తురేమోయని సంశయించి వారిద్దఱిపై గుహునిభటులు కావలి యుండిరి. ఇదియావత్తు రామవిగ్రహ సౌందర్యముఁ గాంచినప్పుడు వారివారికిఁ గలిగిన ప్రేమదశయని భావింపుము. 1038

సీతావల్లభుఁ డరణ్యమున కేగినప్పు డయోధ్యావాసులగు జనులు స్త్రీపురుషులు వేలకొలంది సంసారంబులువదలి రాముని వెంట నేగుటయు, గంగాతీరంబున రామునివీడి రథంబు మరలించునప్పుడు సుమంత్రుఁడు దుఃఖించుటయు, రథ్యంబులగు హయంబు లెంతమోదినను వెనుకకుఁ దిరుగకపోవుటయు మరలి సుమంత్రుఁ డయోధ్య కేగునప్పుడు త్రోవలోఁ జెట్లు తీవలు వాడిపోవుటయుఁ బక్షి మృగాదులు మేత లుడుగుటయుఁ గోసలవాసులగు జనులు నిద్రాహారంబులు మాని చింతాపరీతచిత్తులై యుండుటయు రామ సౌందర్యమగ్నులై యని యోజింపుము. 1039

మఱియు శ్రీరామచంద్రుఁ డరణ్యమున కేగునప్పుడు రాలు ముండ్లు గల ప్రదేశంబున నడచుచుండఁగాఁ దదీయ బాధానివారణంబునకై వృక్షములు తమయందుండు పుష్పంబులు ప్రవాళంబులు

దులిపి మెత్తలుగా నమర్చుచుండెను. మోడులు చిగురించి ఛాయ నిచ్చెను. భూరుహ రహిత ప్రదేశంబునఁ బక్షులు గుంపులుగా నాకసంబునఁజేరి ఱెక్కలువిప్పి సీతాపతి గమనించు మార్గంబునందెల్ల నీడ వట్టెను. సింహ శార్దూలాది క్రూరమృగంబులు దుర్గమప్రదేశంబునఁ దెరువులుసూపెను. జలాశయంబు లుప్పొంగి స్నాన పానంబులకు నిర్మల మాధుర్యజలంబు లొసంగెను. కావలసినపుడెల్ల మేఘుఁడు వర్షింపుచుండెను. రామునకు విందులుసేయనెంచి దినమున కిరువది ముప్పదిమంది మహామును లామంత్రణమొనర్చి, లభించినవారు సంతోషముతోడను లభింపనివారు దుఃఖముతోడ నుండిరి. సర్వభూతంబు లిట్లొనరించుట రామ సౌందర్య ప్రవాహ మగ్నమగుటచేనని తలంపుము. 1070

సుశీలుఁడు

స్వామీ! రావణవధానంతరము హనుమచే రామాగమన వార్తవిని భరతస్వామి మూర్ఛాగతుండయ్యెనే యెందువల్ల? 1071

వరవరముని

పుత్రా! 'వర్షములేకున్న సస్య మెండిపోవు నెక్కువైనచో మునిగిపోవు నదేరీతి శరీరులకు దుఃఖముగాని సంతోషముగాని మిక్కుటమైనచోఁ బ్రాణంబులు నిల్వ వక్కారణంబున రామాగమన వార్త నాకర్ణింపఁగానే భరతస్వామి కానంద మతిశయించె నందువల్ల మూర్ఛనొందె. హఠాత్తుగా రామదర్శనమైనచోఁ బ్రాణంబులేపోవు నని యెంచుము. 1072

సుశీలుఁడు

ఆహా! రామాయణములో మిక్కిలి రహస్య గంభీర విషయము లున్నవి. సంస్కృతభాషాజ్ఞానములేక రామాయణము నొక్కసారియైన సాంతంబుగాఁ జదువక వినక వినియు నామూలాగ్రము గ్రహింపలేని మూఢుల కేమియుం దెలియదుగదా? 1073

వరవరముని

అట్టి మనుష్య మృగంబులువల్కు దూషణాలాపంబులచేతనే గదా పరమభాగవతుల చెవులు చిల్లులువడి మనస్సులు వ్రణంబు లగుచున్నవి. 1074

సుశీలుఁడు

అట్టిదురాత్ములవల్లనే శమనోద్యోగంబు నిరాఘాటముగా సాగు చున్నది. రోగంబు లమ్మానవమృగంబుల నాశ్రయించి జీవింపుచున్నవి. పంగుత్వ మూకత్వ బధిరత్వ దారిద్ర్య మారీస్ఫోటక దుర్భిక్ష భయా దులు భగవద్దూషకుల నలమి బ్రతుకుచున్నవి. వారిసంగతు లటుండ నిచ్చి కథాభాగమునకుఁజనుడు. 1075

వరవరముని

మంచిది శ్రీరామచంద్రుఁడు వనవాసంబు ముగించి యయోధ్యకు వచ్చుచున్న వృత్తాంతము విన్నలోడనే భరతాళ్వారానందసముద్రంబున నోలలాడుచు పాదుకలు శిరంబునధరించి రామునెదుర్కొని దర్శించె నదియట్లుండనిమ్ము,

సీ॥ కాళ్ళుచేతులులేమిఁ గదలనేరనివాను
కూలీలుమోచు డోలీలతోడ
వార్ధకభరమున నడకుచుండెడువారు
వాలగు కఱ్ఱపోటీలతోడ
నాల్గైదు దినములనాటి బాలింతలౌ
నవలాలు సంక నిసువులతోడ
ఘన రుజావ్యాప్తిచేఁ గష్టంబుఁగని మూల్గు
చుండెడువారు నిట్టూర్పుతోడ

నేఁగి రామభద్రు నెలమి నిరీక్షించి
బాధలెల్లఁబోవ ఘనముగన్న
దాది నెఱుఁగరాని యానందమొందిరి
తనులఁ జెప్పనేల ధన్యశీల. 1076

సీ॥ కనులున్నదాని కికౌసలేయుని దర్శ
నావాప్తిచేఁగల్గె ననఘఫలము
శ్రుతులున్నదాని కీసుందరాకారుని
వాక్సుధారసముచే వాసిగల్గెఁ
గరములున్నందు కిభరతాగ్రజాంఘ్రి వం
దనముచేఁ బడమె నుదారకీర్తి
పాదములున్నందు కియ్యవనిజాధీశ సా
మీప్యంబుచేఁగల్గె మిగులశుభము
లవయవములుగల్గినందుల కీనాఁడు
సఫలమయ్యె రామచంద్రువలన
ననుచుఁ బౌరజనము లానందజాశ్రు పూ
ర్ణాక్షులైరి జ్ఞానదీక్షగల్గి. 1077

వెండియుఁ బౌర జానపదులు రాము నెదుర్కొన్నసమయం బున నంజలీబంధంబు లిన్నికోట్లని వక్కాణింపఁ దరముగాకయుండె. రామార్పణంబులగు జనకృత స్తోత్రంబు లమృతప్రాయమై యద్భుత ముగానుండె. శ్రీరామ పట్టాభిషేకకాలంబునఁ బౌర జానపద వాన రాదుల కానందంబు మితిమీఱియుండె. మఱియు నయ్యవసరంబున దిక్పాలకులు రత్నహారాదులు కానుకలుగా సమర్పించిరి. వేల్పులు విరులఁగురియించిరి. రంభాదికాంతలు లాస్యంబొనరించిరి. గంధర్వులు గానంబొనరించిరి. భూమియందు ముక్కారుపంటలు పండెను. సము ద్రంబు లలచే రత్నంబులు నేలపైఁజిమ్మె. సర్వభూతంబు లపూర్వ

సుఖంబులొందె నివియెల్ల రామ కల్యాణ గుణ ప్రభావంబునని
భావింపు మిఁక మీఁదఁ గృష్ణావతారసౌందర్య మాకర్ణింపుము. 1078

సుశీలుఁడు

సర్వ పుష్ప రసంబుఁ గ్రోలు తుమ్మెద చాంపేయ సుమంబును ధిక్కరించినట్లు సీతావల్లభుఁ డమోఘాద్భుతానవధిక సౌందర్యవంతుఁడై పుంసాంమోహన రూపుఁడయ్యు నొక్కరి వాంఛితంబుఁ దీర్పఁడయ్యెఁ గృష్ణుండు బహుజనంబుల మనోరథంబు లొసంగినాఁడు కారణం బేమి ? 1079

వరవరముని

శ్రీరామావతార మాదర్శావతారము కృష్ణావతార ముపదేశావతారము. జానకీపతి వైదికనిష్ఠాగరిష్ఠుఁడై జితేంద్రియత్వమునుఁ బ్రకటింపుచు మాతృభక్తి పితృభక్తి గురుభక్తి శాస్త్రవశ్యతా ప్రముఖ సామాన్య ధర్మప్రవర్తకుఁడై చరించె నక్కాలంబున నమ్మహాత్ముని చర్యలనుఁ గాంచి తెలుసుకొని యదే ప్రకారంబున వర్తించి పునీతులగువారలనేకులుండిరి. ద్వాపరమనఁగా సందేహము. సందేహయుగంబునఁ జూచి గ్రహించి బాగుపడువారు లేనందున శ్రీకృష్ణుఁడు గీతాశాస్త్రాదులచేఁ దత్త్వమునుపదేశించెఁ గనుక రామ రూపమాదర్శావతారము. కృష్ణరూప ముపదేశావతారము, రాముఁడు వైదికజనాగ్రేసరుఁడు కృష్ణుఁడు రసికాగ్రగణ్యుఁడు, రాఘవుఁడు కోసలదేశస్థంబులగు చరాచరభూతంబులను మోహింపఁ జేసెఁ గృష్ణుఁడు బృందావనస్థంబులగు గోపికా గోపాల పశు పక్షి మృగ వృక్ష లతా లతాంత గుల్మాదులను మోహింపఁజేసెఁ. రాముఁ డేకపత్నీవ్రతుఁడు కృష్ణుఁడు బహుపత్నీకుఁడు నైనప్పు డట్లు చరించుటను నిట్లు గావించుటకుఁ గారణంబేమని భగవంతునిఁ బ్రశ్నించు నధికారి లేఁడు. సమాధాన మీయవలసిన యవసరమాయనకు లేదు. శ్రీకృష్ణుఁడు జన్మించి నప్పుడు తదీయ విశ్వరూపంబుఁ గన్నులారఁ గాంచి నుతించియు మహా

యోగియగు వసుదేవుఁడు కంసభయంబుచేఁ గృష్ణుని రాత్రియందు వ్రేపల్లెలోఁదాఁచి వచ్చుట ప్రేమదశయని యెఱుంగుము. 1080

శ్రీకృష్ణుని యమానుష చర్యలన్నియు బాల్యము ప్రభృతి నెఱింగియున్న ధర్మరాజు రాయబారముకొఱకు హస్తిపురంబున కేగు రుక్మిణీపతిం గాంచి దేవా! దుర్యోధనాదులు దుష్టులు. నీవొంటరిగా వచ్చుటి కేగవలదు. నీకపాయంబు సంభవించినచో నాకుఁ ద్రిలోకాధిపత్యంబు వచ్చినను సంతోషములేదు. జాగరూకతతో సపరివారుండవై సాయుధుండవై యేగుమని చెప్పుట కృష్ణ సౌందర్యంబుచేఁ బరవశుండైనప్పుడు గల్గిన ప్రేమదశయని యెఱుంగుము. 1081

శ్రీకృష్ణుండు యమునానదిలో దుమికి కాళియుని దండించునప్పుడు నంద యశోదాది వల్లవీవల్లవులు కృష్ణాపాయంబున కుశంకించి దుఃఖించుటయుఁ గాళియ పత్నులగు నాగాంగనలఁగాంచి యయ్యో! మీరేలవచ్చితిరి. పొండు పొండు మాకృష్ణుండు జడియుననుటయుఁ గృష్ణసౌందర్యంబుచేఁ గలిగిన ప్రేమదశయని యూహింపుము. 1082

భారతయుద్ధంబున సంశప్తకులు విజృంభించినప్పుడు ఫల్గునుఁడు గోవిందునిఁజేరి కృష్ణా భయపడకుము నిన్ను రక్షింతునని పల్కెను. నమ్మాళ్వారలు తనకుఁ బరమభక్తి రేఁగినప్పుడు మానసంబున యశోదావేషంబుఁ గైకొని భగవత్సన్నిధానంబుఁ గల్పించుకొని కృష్ణా! నాకడకురమ్ము. బాలురతో నాడి యలసినావు. పాలిత్తు నంగీకరింపుము. కాళీ దుర్గా ప్రభృతిశక్తులు చరించు సాయంసంధ్యలయం దొంటరిగానుండకుము. నీకు రక్షఁ గావింతు రమ్మని పల్కుచుండిరి. ఇది యిట్లుండఁగాఁ బాండ్యరాజుదేశములో భగవంతుఁడు సర్వచేతనులకు దర్శనమీయఁగాఁ బెరియాళ్వారు సేవించి శ్రీహరీ! మానవులు పరుల గొప్పతనము నోర్వలేని యసూయాపరులు, మహాదుష్టులిట్టి వారి లోచనంబుల కీవేల కానంబడితివి. నీదివ్యమంగళవిగ్రహమునకుఁ

గోట్లకొలఁదిసంవత్సరములవఱకు నేవిధమైన యుపాయంబు గలుగ కుండుఁగాక. నీకు మంగళాశాసన మొనర్చుటకు నేనును శాశ్వతుఁడనై యుందునుగాకయని పల్లాండు పాడిరి యివియెల్లను భక్తులకు భగవద్విషయంబున జనించు ప్రేమదశావిశేషంబులని యెంచుకొనుము.

సుశీలుఁడు

స్వామీ! శ్రీహరి కల్యాణగుణంబు లింకను వివరింపుఁడు. తదీయామృతంబుఁ బానంబుఁజేయుచున్న నాకింకను సౌహిత్యంబు లేకయున్నది. 1084

పరవరముని

వత్సా! శ్రీరామాయణంబున సర్వేశ్వరుని కల్యాణగుణంబు లనేకు లనేకవిధంబుల వక్కాణించియున్నా రెట్లంటివేని నారదుండు ప్రథమంబున భగవత్కల్యాణగుణంబుల వర్ణించి వాల్మీకికి నుపదేశించె నమ్మునీంద్రుఁడు రామాయణాయోధ్యాకాండంబున వర్ణించెను. దశరథు నుపన్యాసకాలంబునఁ గోసలప్రజలు వర్ణించిరి. మఱియు సౌమిత్రి భరతాంజనేయాదులును దండకాటవిలో మహామునులును మారీచాకంపన తారా మందోదరీ శూర్పనఖాదులును లంకాపురస్త్రీలును రావణవధానంతరంబున హర విరించన సునాసీరాది నిర్జర సార్వభౌములును పట్టాభిషేకావసరంబున సర్వభూతంబులును లవణాసుర సంహారకాలంబునఁ జ్యవనాది మునులును శ్రీరాముని కల్యాణగుణంబులు వర్ణించిరి తదీయ విషయంబులన్నియు రామాయణ కాలక్షేపసమయంబున నీకెఱింగింతుఁ గృష్ణ గల్యాణగుణంబులు భాగవత భారత హరివంశాదులు పఠించునప్పుడు వచింతు నిప్పటికిఁ దృప్తినొందుము. 1085

# భగవదుపకరణకథనము

సుశీలుఁడు

చిత్తము. భగవద్దివ్యాయుధ భూషణ ప్రకారం బెఱిఁగింపుఁడు.

వరవరముని

శ్రియఃపతికి నిరతిశయమై ప్రకాశించు కిరీటమును జూడావతంసమును మకరకుండలములు గ్రైవేయకములు హారములు కేయూరములు కటకములు శ్రీవత్సము కౌస్తుభము దామోదరబంధనము పీతాంబరము కాంచీగుణము నూపురములు మొదలైన దివ్యాభరణంబులును, శంఖము చక్రము కౌమోదకి శార్ఙ్గము నందకమునను పంచాయుధంబులును గలవు. 1087

సుశీలుఁడు

భూషణంబులు నాయుధంబులును సామాన్యరాజమాత్రులకెల్ల నుండు నిఁక సర్వేశ్వరునకుండుటలో విశేషమేమి? 1088

వరవరముని

క్షత్రియ నిశాచర నిర్జరాదులకుఁగల భూషణాయుధంబులు ప్రాకృతంబు లోకానొకకాలంబున నొకానొక హేతువుచే నొకానొక పనివల్ల నిర్మింపఁబడినవి. వానికి వెలలు పరిమితముగానుండును కర్తకు బలముతగ్గునప్పుడైనను దారిద్ర్యము వచ్చునప్పుడైనను స్వభావముగానైననుఁ గొంతకాలంబునకు నా యీ సాధనంబులు నశించును, సర్వేశ్వరుని మండనాయుధంబు లట్టివికావు. ప్రకృతిసంబంధము లేనివి శాశ్వతములైనవి సర్వేశ్వరునమోఘ సత్యసంకల్పంబుచే నిర్మింపఁబడినవేకాని యేకాలమందు నేపని వానిచేతను నిర్మితములుగావు. వానికి మూల్యపరిమితిలేదు. మెండియు నద్దివ్యసాధనంబులు నారాయణునకుఁ దక్క నితరుల కర్హంబులుగావు. యెత్తుటకును ధరించుటకు నుపయో

గించుటకును సాధ్యంబులుగావు. జీవేశ్వరుల కిద్దఱికి నాద్యంతంబు లెట్లు లేవో యట్లే భగవద్దివ్యమంగళవిగ్రహంబునకుఁ దదీయ పరికరంబులకు నాద్యంతములు లేవు. 1089

సు శీ లుఁ డు

సరే మంచిది. అప్పరికరంబులను గూర్చి విశదముగా సెలవిండు. 1090

వ ర వ ర ము ని

మన భగవద్రామానుజయోగీంద్రులు భగవద్దివ్య కిరీటమును బరిష్కారములలో ముందుగా వర్ణించిరి. ఇది సర్వేశ్వరున కనన్య సామాన్యమైన బిరుదము. ఇక్కిరీటము రంగేశ్వరునకు సమానాధికులు లేరని తెలుపుచున్నదని పరాశరభట్టరువారు వక్కాణించిరి కాని యీబిరుదము ధరించినవాఁడెల్లఁ బ్రభుండని యెన్నఁబడుచున్నాఁడు. నావిష్ణుః పృథివీపతిః = విష్ణ్వంశ లేనివాఁడు ప్రభువుకాడని శాస్త్రోక్తి గలదు. హేతువేమనఁగా హరి స్వాభావికముగా బ్రహ్మాండంబుల కేకచ్ఛత్రాధిపతి. కాబట్టి తదీయాంశచే జనించి తదీయచిహ్నముగల వాఁడే ప్రభువుగా నెన్నఁబడుచున్నాఁడు. శ్రియఃపతి కిరీట మనేక సహస్రసూర్యకాంతిచే విరాజిల్లుచున్నది. దానియందుండు సువర్ణముగాని రత్నంబులుగాని యప్రాకృతంబులు మఱియు నక్కిరీటము వాచామగోచరమై యున్నది. సర్వేశ్వరుని కిరీటము పరవ్యూహ విభవార్చావతారంబులయందు నెడతెగక యుండును. 1091

చూడావతంసము: చూడాయామవతంసమ్ చూడావతంసమ్; చూడయనఁగా జుట్టు, జుట్టునకలంకారముగా సమర్పింపఁబడినరత్నము చూడావతంసము. ఇది సర్వేశ్వరుని దివ్యభూషణములలో నొకటి. మకరకుండలములు అనఁగా మొసలినోటి యాకారముగల పోగులు. ఇవి సర్వేశ్వరుని రెండుచెవులయందును బ్రకాశించును. గ్రైవేయకములు: మెడ నంటుకొనియుండు కంఠెమొదలైనవి. హారములు:

అనఁగా గుత్సము, గుత్సార్ధము, గోస్తనము, మాణవకము, ఏకావళి యను నామధేయములచే మెడలోఁ వ్రేలాడు ముత్యాలసరములు.

కేయూరములు: అనఁగా భగవంతునిభుజశిరస్సులయందు విలసిల్లు బాహుపురులు. కటకములు: అనఁగాఁ గడియము లివి గోవిందుని హస్తపాదములనందుండును. ఊర్మికము: అనఁగా నుంగరములు జనార్దనుని చేతివ్రేళ్ళయందుఁ బ్రకాశించు పరిష్కృతులు. శ్రీవత్సము అనఁగా భగవంతుని భుజాంతరంబునఁ బ్రకాశించు రోమావర్తవిశేషము. కౌస్తుభము: అనఁగా భగవద్భుజాంతరంబునందుఁ బరిష్కారమై ప్రకాశించు మణి విశేషము. దామోదరబంధనము: యశోదాదేవి చేతి శుల్బముచే నులూఖలంబున బంధింపఁబడినప్పు డొరిపిడిచే నైన చిహ్నమిది నిరంతరము భక్తవాత్సల్యమును బ్రకటింపుచున్నది గనుక భూషణములలో నొకటిగా నెన్నఁబడుచున్నది. పీతాంబరము: అనఁగా బంగారునూలుచే నిర్మితమై బాలసూర్యునివంటి కాంతిగలిగి పచ్చిపసుపు వర్ణముగలిగి శ్రియఃపతి కటిప్రదేశమందును శరీరోర్ధ్వ భాగమునందును రెండుభాగములుగాఁ బ్రకాశించు దివ్యవస్త్రద్వయము. కాంచీగుణము: అనఁగా బంగారుచే నిర్మితమై నవరత్న ఖచితమైన మొలనూలు యిది సర్వేశ్వరుని మొలత్రాడు. నూపురములు: అనఁగా సువర్ణరత్నఖచితములై భగవత్పాదారవిందములయందుఁ బ్రకాశించు నందెలు. ఇదియంతయు భగవద్భూషణంబుల తెఱంగని యెఱుంగుము.

సుశీలుఁడు

భగవద్దివ్యాయుధంబుల సమాచారం బానతిండు. 1092

వరవరముని

శంఖము: అనఁగాఁ బాంచజన్యమను నామధేయంబుతో గోవిందుని దివ్యహస్తంబున విరాజిల్లుచుండు నిది కోటిచంద్రులతో మానంబగు ధవళకాంతిగలిగియుండును. వేదంబులన్నియు దీనియం

దమిషియుండుటచే నిది వేదమయంబని పల్కుదురు. ఈశంఖము ధ్రువుని కపోలంబు సోకినమాత్రంబున నదివఱకు విద్యాగంధంబెఱుఁగక బాలుండైన యారాజపుత్రుండు సర్వవిద్యాపారంగతుండై ముకుందుని స్తుతింపఁగలిగెను. వేయిమేఘంబు లొక్కసారి మొరసిన నీశంఖధ్వనికి సమానంబులుగావు. పురుషోత్తముఁడు దీని నొత్తినప్పుడెల్ల మహాధ్వనిగల్గును. తదీయారావంబుచే రాక్షసాంగనా గర్భస్థపిండంబు లదరి చచ్చును, మఱియు నీగంభీరస్వనంబుచే హరికిఁ బ్రతికూలురైనవారు దుఃఖింతు రనుకూలురు సుఖింతురు. శ్రీకృష్ణుండీ శంఖరాజమును భారతయుద్ధములో నొత్తినప్పుడెల్లఁ గౌరవులు చెల్లాచెదురై యల్లాడిరి పాండవసైన్యవీరులు విజృంభించి పగవారలఁ బీచం బడచిరి. వెండియు నిప్పాంచజన్యధ్వని చేసినప్పుడు భేరులు మృదంగంబులు ఢంకలు ఢక్కలు డోళ్ళు తప్పెటలు వేణువులు వీణలు తాళంబులు కోట్లకొలఁది నొక్కసారి మొరయించినను వినంబడక పాంచజన్యధ్వనిలో లీనంబగును. 1093

చక్రము: ఇది వేయివాదరలుగలిగి ముకుందుని శ్రీహస్తంబునఁ బ్రకాశించు దివ్యాయుధము. దీనికి సహస్రారమని, సుదర్శనమని, అరియని యనేక నామధేయంబులుగలవు. మఱియు నీహరిచక్రము విజృంభించినప్పుడు భయము నొంది తమకేమి కీడుమూడునోయని శంకించి భూమ్యాకాశంబులు వర్తులాకారంబులు ధరించి యో సుదర్శనమా! మేమును నీవంటి యాకృతి ధరించితిమి. నీవు బంధువులము రక్షింపుమని వేడుచున్నవి. మహాబలుండైన వాయుదేవుఁడు సుడిగాలియై చక్రాకారమును ధరింపుచున్నాడు. నీరములు సుడులు దిరిగి ప్రవహింపుచున్నవి. వైశ్వానరుఁడుసహిత మప్పుడప్పుడు గుండ్రముగా మండుచున్నాడు. తారా సూర్య శశాంకులు వర్తులాకారముఁ దాల్చి చరింపుచున్నారు. వీరందరిట్లు గుండ్రముగానుండి సుదర్శనాకారము ననుసరించి జీవింపుచున్నారు. ఈచక్రధారను నలవిగాని కఠోర

వస్తు వెక్కడనులేదు. వెండియు నీసుదర్శనకాంతి ప్రతికూలురకు సహ
స్రాగ్నులవలెఁ దాపంబుఁగలిగించు ననుకూలురకుఁ జంద్రకాంతివలెఁ
జల్లఁగానుండును. మఱియు నీ రథాంగరాజము మహాబలులై ప్రళయ
కాలసముద్రము మోకాలిబంటిగాఁ జరించు మధుకైటభులను సంహ
రించెను. నరక పౌండ్రక ముర చైద్య దంతవక్త్ర ప్రభృతి నిశాచరుల
కంఠంబులు తోఁటకూరకాడలభంగిఁ దఱిగెఁ గాశిరాజును వాని పత్త
నంబును మూఁడుమాసంబులు దహించె. దూర్వాసోముని గర్వభంగం
బొనరించి యంబరీషునిం గాపాడె నింతియేకాక యిప్పటికిని భాగవత
సంరక్షణార్థము హరిశాసనంబు వహించి యదృశ్యాకారంబుతో
లోకంబున సంచరింపుచున్నది. ఈరథాంగము భారతయుద్ధరంగంబునఁ
బాండవసేనా కరవాలాస్త్రంబులందావేశించి వైరినిర్మూలనంబాచరిం
చినది. ఇంతకుముందుఁ గూరనారాయణజీయరను వైష్ణవపండితుఁడీ
సుదర్శనమును నూఱుశ్లోకంబులతో నుతించి సుదర్శనశతకమను పేరు
వెట్టి దుష్కరకార్యమును నెఱవేర్చుకొనెను. వేదాంతదేశికులవారు
సుదర్శనస్తోత్రము రచించిరి. ఈసుదర్శన స్తవంబును విన్నచోట భూత
ప్రేత పిశాచ విప్రగ్రహ కూశ్మాండ నక్తంచరాదులు పలాయనమగును.
సుదర్శన షడక్షరీమంత్రరాజంబును బఠించువారలకు బలాయురారో
గ్యైశ్వర్యాదులు సంభవించి వృద్ధిఁజెందు నిది విష్ణుదేవునకు ముఖ్యా
యుధము. 1094

శార్ఙ్గము: అనఁగా నిది మధుసూదనుని ముఖ్య ధనుస్సు.
ఈదివ్యసాధనంబు సురాసుర గరుడ గంధర్వాది సమస్తభూతంబుల
కభేద్యంబై దృఢమైన మౌర్విగలిగి విరోధి భయంకరమై తనరారు
చుండు. దీనినధోక్షజుఁడు కేలఁదాల్చి టంకారధ్వని చేసినప్పుడు కోటి
పిడుగుల ధ్వనిగలిగి లక్షలకొలంది నమోఘబాణంబు లీనుచు రణరం
గంబునఁ బరిపంథుల సంహరించును, భక్తులకానందంబును వాసుదేవు

నకు జయంబును గలిగించు నిది భగవంతుని దివ్య కోదండంబని తలంపుము. 1095

కౌమోదికి: అనఁగా నిది గరుడవాహనుని గదాయుధంబు. రాలు కుండలఁబగిలించునట్లీగద శత్రుశిరంబుల నాయుధంబుల గంధర్వ గజోష్ట్ర రథపదాతులఁ బగులఁగొట్టు నిది హరి గదాయుధంబని యెఱుంగుము. 1096

నందకము: అనఁగాఁ బదునుగలకత్తి పారకాయలఁ గోసినట్లు జన్యరంగంబున నెదిర్చిన శత్రువుల శిరస్సులు ఖండించి జయంబొసంగు నిది పురుషోత్తముని కరవాలంబని భావింపుము. 1097

అనంతుఁడు: అనఁగా నాదిశేషుండు. ఈవిషయమునుఁగూర్చి,

శ్లో॥ నివాసశయ్యాసన పాదుకాంశు కో పధానవర్షాతపవారణాదిభిః
శరీరభేదైస్తవ శేషతాంగతై, ర్యథోచితం శేష ఇతీర్యతేజనైః

శ్రియఃపతి నివసించుటకు మందిరమైఁ శయనించునప్పుడు తల్పమై, కూర్చుండునప్పుడు సింహాసనమై నడచునప్పుడు పాదుకలై, ధరించునప్పుడు వస్త్రమై, తలక్రిందికి దిండై, వర్షాతపనివారణమునకు గొడుగై, సమయోచితముగా భగవద్దాస్య మొనర్చుచున్నందువలన శేషుఁడనియు, భగవచ్ఛేషత్వమొనర్చువారలలో మొదటివాఁడుగనుక యాదిశేషుఁడనియు జనులచేఁ గీర్తింపబడుచున్నా డయ్యనంతుండని యామునాచార్యులవారు వచించిరి. కావున నీశేషుండు సర్వేశ్వరు నకుఁ బ్రధానతల్పమై, యాదిమధ్యాంతరహితుఁడై, యప్రాకృతుఁడై వెలుంగుచుండు. మఱియు నితండు వేదవేదాంగములు సాకల్యముగా నెఱింగిన పండితశిఖామణి. ఇంతేకాక యాదియుగంబున ననంతుఁడై త్రేతాయుగంబున లక్ష్మణుండై ద్వాపరమున బలరాముఁడై కలియు గంబున రామానుజయోగీంద్రుఁడై శ్రియఃపతిని సేవించె నీశేషుండు కోటిచంద్రసమాన ధవళకాంతిచే నొప్పారుచుండు. మఱియు నితండు

పడగలయందు మితిలేని మాణిక్యంబులు గలిగి వైరాగ్య నిధిమై యస్పృష్ట సంసారగంధముగలవాఁడై విలసిల్లు నిది భగవచ్ఛయ్యావిధం బని యోజింపుము. 1098

వాహనము: అనఁగా గరుడాళ్వారు,

శ్లో॥ దాసస్సఖా వాహనమాసనం ధ్వజో
యస్తేవితానం వ్యజనంత్రయీమయః

శ్రీహరిసర్వవిధ సేవాసమయంబున దాసుఁడై కార్యాలోచన వేళ సఖుఁడై గమనవేళ వాహనమై కూర్చుండునప్పు డాసనమై ప్రయాణసమయంబున, ధ్వజమై సమయోచితముగా వితానమై వింజామరమై యేలినవారి పాదఘర్షణముచేఁగలిగిన శలాటువులే భూషణములుగాఁ గలవాఁడై వేదములే యవయవములుగలవాఁడై తనరారు గరుడునిపై వేంచేయు వాఁడాయని యామునాచార్యులవారు స్తుతించిరిగనుక యిది భగవద్దివ్య వాహనవృత్తాంతంబని భావింపుము. 1099

శ్లో॥ త్వదీయభుక్తోజ్ఝిత శేషభోజినా
త్వయానిసృష్టాత్మభరేణ యద్యథా
ప్రియేణ సేనాపతినానివేదితం
తథానుజానంత ముదార వీక్షణైః

ఓ విష్ణూ! నీభుక్తశేషమును నిరంతరము భుజించుట కర్హుఁడై నందున శేషాశనఖ్యాతి వహించినవాఁడును, నీయాజ్ఞచే విభూతిద్వయపాలనాభారము వహించినవాఁడును. నీ కటాక్షవీక్షణాసంజ్ఞచే నీయభిప్రాయమెఱింగి తదనుకూలముగాఁ బ్రవర్తించువాఁడును, సేనాపతియనగు విష్వక్సేనునితోఁ జేరి యుండువాఁడాయని యామునాచార్యులవారు స్తుతించిరిగనుక యిది విష్ణుదేవుని మంత్రిప్రభావంబని యెఱుంగుము. 1100

మఱియు సమస్తౌషధులకు నాధారమైన భూదేవినిఁ గటాక్ష మాత్రముచే నిఖలైశ్వర్యంబులిచ్చు లక్ష్మిని భార్యలుగాఁ బరిగ్ర

హించి శుద్ధసత్త్వానుకూల్యంబులగు సౌశీల్యాది కల్యాణగుణంబుల కాధారుఁడై యాశ్రితవిరోధుల వధించుటకుఁదగిన దివ్యాయుధంబులు ధరించి లీలానిత్యనామక విభూతిద్వయభారంబు విష్వక్సేనునియం దుంచి నిత్యముక్తానుభావ్యుఁడై బ్రహ్మాండముల కేకచ్ఛత్రాధిపతియై బ్రహ్మకుఁ దండ్రియై హర విరించన పాకశాసనాది సర్వదేవతాసార్వభౌమ వందిత చరణారవిందుండై సర్వభూతాంతర్యామియై విలసిల్లు నారాయణునిఁ ద్రికరణంబులచే నాశ్రయించి నిర్భయులై నిర్భరులై కొలుచు పరమభాగవతుల కనిష్టంబులుడించి యిష్టార్థంబులు సేకూరు నిందులకు సందియంబులేదు. 1101

## భగవదవతారవైభవము

సుశీలుఁడు

స్వామీ! సర్వేశ్వరుఁడగు నారాయణునకు సుఖదుఃఖములతోఁగూడిన రామకృష్ణాద్యవతారంబు లేలగలిగెనో వచింపుడు?

వరవరముని

ఆవిషయంబు సాకల్యంబుగా నానతిత్తు సావధానుండవై యాకర్ణింపుము. తొల్లి గీతాశాస్త్రోపదేశసమయంబున నే నీ శాస్త్రము పూర్వము సూర్యున కుపదేశించితినని శ్రీకృష్ణుండు నుడువఁగా నర్జునుండు సంశయించి భగవంతునితో దేవా! నీజన్మ మిప్పటిది సూర్యునిజన్మ మనేకయుగములనాటిది నీవు సూర్యున కుపదేశించితి నన్నమాట నెట్లునమ్మవచ్చునని ప్రశ్నింపఁ భగవంతుఁడిట్లనె. 1103

శ్లో॥ బహూనిమే వ్యతీతాని, జన్మానితవచార్జున
తాన్యహం వేదసర్వాణి నత్వం వేత్థ పరంతప

అర్జునా! యిప్పటికి నాకును నీకు ననేకజన్మములు గడచినవి. వాని నన్నింటి నేనెఱుంగుదు నీవెఱుంగ వక్కారణంబున నిట్లు ప్రశ్నించితివి. 1104

శ్లో॥ అజోపి సన్నవ్యయాత్మా, భూతానామీశ్వరోఽపిసన్
ప్రకృతింస్వామధిష్ఠాయ, సంభవామ్యాత్మమాయయా

నేను పుట్టుకలేనివాఁడనై నాశరహితుఁడనై భూతనియామకుఁడనయ్యును స్వకీయదివ్యమంగళవిగ్రహము నధిష్ఠించి మదీయసంకల్ప జ్ఞానముచేఁ బుట్టుచున్నాను. ఎప్పుడు పుట్టుచున్నానంటివేని.

శ్లో॥ యదాయదాహిధర్మస్య, గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య, తదాత్మానం సృజామ్యహమ్

ఎప్పుడెప్పుడు ధర్మమునకు హానియు నధర్మమునకు వృద్ధియుఁ గలుగుచున్నదో అప్పుడు నన్ను నేను సృజించుకొనుచున్నాను. అనఁగా స్వయముగాఁ బుట్టుచున్నాను. 1106

ఎందుకుఁ బుట్టుచున్నావంటివేని,

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చదుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ, సంభవామి యుగేయుగే
జన్మకర్మచమే దివ్య, మేవంయోవేత్తి తత్త్వతః
త్యక్త్వాదేహం పునర్జన్మ, నైతిమామేతిసోర్జున

సాధువుల రక్షించుటకును బాపాత్ములఁ జంపుటకును ధర్మము నిలఁబెట్టుటకును బ్రతియుగమందు నవతరింపుచున్నాను. ఇట్టిమదీయ జన్మకర్మములు ప్రాకృతములు కావని దివ్యములని యెవ్వఁడు యథార్థముగాఁ దెలుసుకొని నమ్ముచున్నాఁడో వాఁడు దేహము విడిచిన పిమ్మట నన్నుఁబొందుచున్నాడుచుమీాయని భగవానుఁడు పామరజన సంశయనివృత్తికొఱకు స్వయముగాఁ జెప్పియున్నాడు. 1107

సుశీలుఁడు

ఇంతకుఁ దేలినవిషయమేమి ? 1108

వ ర వ ర ము ని

పిపీలికాదిబ్రహ్మపర్యంత మందలి జీవాత్మలు నారాయణుం డొక్కఁడే పరమాత్మ. జీవులనేకులు, పరమాత్మయొక్కఁడు, జీవునకుఁ గర్మనిర్బంధముచే శరీరముగలుగును. పరమాత్మకు స్వకీయేచ్ఛచే శరీరముకలుగును. జీవశరీర మనేక మాలిన్యములతోఁ గూడిన ప్రాకృతము. పరమాత్మశరీర మప్రాకృతము. జీవునకుఁ బాపానుగుణముగా నరకము. పుణ్యానుగుణముగా స్వర్గము, పుణ్య పాప మిశ్రానుగుణముగా మర్త్యలోకము ప్రాప్తించును. అనఁగా జీవునకు దుఃఖానుభవము సుఖానుభవము, సుఖదుఃఖానుభవము మూఁడువనులకొఱకు జన్మముకలుగుచుండును. పరమాత్మకు సాధురక్షణము దుష్టధ్వంసనము ధర్మస్థాపనమను మూఁడువనులుగలిగియుండును. 1109

సు శీ లుఁ డు

విష్ణుం డవతారకాలంబునందు జ్ఞానశక్తి బలైశ్వర్య తేజస్సౌశీల్యాదులు గలిగియుండునా విడిచియుండునా ? 1100

వ ర వ ర ము ని

జనార్దనుఁడు సమస్తకల్యాణగుణంబులు కలిగియే ప్రవర్తించు నొకప్పుడును విడిచియుండడు కాని శరత్కాలమేఘములోఁ జంద్రుఁడు కొంతసేపు కనఁబడి కనఁబడకయుండునట్లు భగవంతుఁ డవతారవేళ జ్ఞానశక్త్యాదు లొకప్పుడు కనఁబర్చుచు నొకతఱి మఱుగుపరచుచుండును. 1111

సు శీ లుఁ డు

ఇట్లు దృశ్యాదృశ్యుఁడుగానుండుటకు హేతువేమి ? 1112

వ ర వ ర ము ని

ఒకానొకపండితుఁడు నాటకరంగమున కరిగి నిశాసమయంబున హరిశ్చంద్రవేషముధరించి నాటకమాడునప్పుడు కేవల హరిశ్చంద్రుఁడని చెప్పుచుఁ దదీయగాథానుసారంబుగా నటించినఁ బ్రేక్షకు

లానందింతునుకాని స్వకీయనామరూపములు ప్రకటించినచో నానందింపనుగదా యట్లే భగవానుఁ డవతారవేళ నొకప్పుడు స్వకీయ ప్రభావము మఱుగుపరచును. 1113

సుశీలుఁడు

భగవానుఁడు మఱుఁగుపరచి యట్లేయుండక మరలఁ బ్రకటించుట లెందుకు ? 1114

వరవరముని

హరిశ్చంద్రవేషముతో నాడుచుండువానియొద్దకు స్నేహితుఁడో సోదరుడో పుత్రుఁడో బాంధవుఁడోవచ్చి పనియున్నప్పుడు హరిశ్చంద్రాయని పిలువక దేవదత్తాయనియో యజ్ఞదత్తాయనియో నిజనామముతో రహస్యముగాఁబిలిచి కావలసివిషయము మాట్లాడిపోవును. వేషధారియుఁ దన్నుఁబిలిచినదాని కనుకూలముగా భాషించు నదేవిధంబున భగవంతుఁడు శరభంగ సుతీక్ష్ణ నారద వ్యాస శుకాదులతో సంభాషించు నప్పుడును దుష్కరకార్యము సాధించునప్పుడును స్వీయప్రభావము ప్రదర్శింపుచుండును. 1115

సుశీలుఁడు

శరీరధారులందఱుఁను దనకుఁ బరతంత్రులుగదా గోవిందుఁడు నారదాదిమునులకు బ్రహ్మరుద్రాది దేవతలకు నమస్కరించి పూజించుట లెందుకు ? 1116

వరవరముని

ఒకానొక నాటకరంగములో హరిశ్చంద్రవేషధారి బ్రాహ్మణుఁడు, విశ్వామిత్రవేషధారి శూద్రుఁడుగానుండెనైనను విశ్వామిత్రవేషధారికి నాటకమర్యాదననుసరించి హరిశ్చంద్రవేషధారి సాష్టాంగ నమస్కృతు లాచరింపవలయుంగాని కులమర్యాదననుసరించి నమస్కరింపనిచో నాటకము రసాభాసమగు నదేవిధంబున భగవంతుఁ

డవతారసమయంబున నారదాదిమునులను బ్రహ్మరుద్రాది దేవతలను లోకమర్యాదననుసరించి పూజింపుచుందును. వారిచేఁ బూజింపఁబడుచుందును. పరత్వకాలంబున వాచామగోచరుఁడనై యుందును. పైదానికిఁ దార్కాణముగా. 1117

శ్లో॥ నమేపార్థాస్తి కర్తవ్యం, త్రిషులోకేషు కించన
నానవాప్త మవాప్తవ్యం, వర్తఏవచ కర్మణి

శ్లో॥ యది హ్యహం నవర్తేయం, జాతుకర్మణ్యతంద్రితః
మమవర్త్మానువర్తంతే, మనుష్యాః పార్థసర్వశః

శ్లో॥ ఉత్సీదేయురిమే లోకా, నకుర్యాం కర్మచేదహమ్
సంకరస్యచ కర్తాస్యా, ముపహన్యామిమాః ప్రజాః

అర్జునా! నాకు ముల్లోకంబులందును జేయవలసిన దొక్కటియులేదు దిదివఱకుఁ బొందక ముందుఁ బొందవలసిన వాంఛితమొక్కటియులేదు. ఐనను గర్మమునందు వర్తింపుచునేయున్నాను. అనఁగాఁ జేయుచుంటిననుట. నేనొకప్పుడు బద్ధకములేనివాఁడనై కర్మముచేయక మానితినేని యన్నివిధముల జనులు నామార్గమునే యనుసరింతురు. నేను వైదికకర్మాచరణ మొనర్పకుంటినేని జనులందఱు చెడుదురు. సంకరమునకు నేనేకర్తనై చెఱిపినవాఁడనగుదును. 1118

(భగవద్గీత)

శ్లో॥ సక్తాః కర్మణ్యవిద్వాంసో, యథాకుర్వంతి భారత
కుర్యాద్విద్వాం స్తథాఽసక్త, శ్చికీర్షుర్లోక సంగ్రహమ్

పూర్ణజ్ఞానములేనివారు ఫలాపేక్షతోఁ గర్మము లెట్లు సేయుదురో యట్లు జ్ఞానియైనవాఁడు లోకులు తన్నుఁగాంచి నేర్చుకొనుటకు ఫలాసక్తివిడచి కర్మములొనర్పవలయునని శ్రీకృష్ణుఁడు వచించెను. దీనిచే భగవదవతారరహస్యము పూర్తిగా వెల్లడింపఁబడెను. కాబట్టి

భగవంతుఁ డవతారకాలంబులయందు విశ్వామిత్ర వసిష్ఠ సాందీపాదుల నాచార్యులుగా నంగీకరించుట, దశరథ వసుదేవ ధర్మరాజాదులకు నమస్కరించుట, కౌసల్యా కైకేయీ సుమిత్రా కుంతీ ప్రభృతికాంతల గౌరవించుట, వ్యాస నారద మార్కండేయాది మునులం బూజించుట, సూర్యోపాస్తి వైశ్వానరోపాస్తి శివోపాస్తి గాయత్రీమంత్రోపాస్తి గ్రహణస్నానము తీర్థస్నానము యాగాచరణము మొదలైనవి లోకసంగ్రహార్థమై చేసెనుగాని యవసరముండి చేయలేదు. 1119

సుశీలుఁడు

భగవంతుఁ డమోఘ సత్యసంకల్పుఁడుగదా (శ్రీ)వైకుంఠము నందే యుండి యేది యెట్లు కావలయునని సంకల్పించునో యది యట్లు నెఱవేఱును. తావన్మాత్రమున కీయవతారాది ప్రయాసలేల? 1120

వరవరముని

అది వాస్తవమేకాని సర్వేశ్వరుం డెప్పుడును బరమపదమందే యుండి భూలోకంబునకు రానిచోఁ బరాత్పరుఁ డున్నాడని యెవ్వరికిం దెలియదు. సత్పురుషులుసహితము నాస్తికు లౌదురు. వేదములు శాస్త్రములు నశించును. రామాయణ భారత భాగవత హరివంశ భగవద్గీతాది సత్యగ్రంథములు జనింపవు. హిరణ్యకశిపు రావణ సుయోధన వాలి ప్రముఖులు మంచివారో ప్రహ్లాద విభీషణ పాండవ సుగ్రీవాదులు మంచివారో తెలియదు. మనుష్యులు మనుష్యజన్మమెత్తినందులకుసార్థక్యమేమియుం గానరాదు. 1121

సుశీలుఁడు

ఆవిషయములో భగవదవతారములయొక్క ప్రయోజనమేమి?

వరవరముని

ప్రహ్లాదుఁ డఖండ విష్ణుభక్తుఁడు. హిరణ్యకశిపుఁడు మారణోపాయశతంబులచేఁ బ్రహ్లాదుని బాధించిన దుష్టుఁడు. సర్వేశ్వరుఁడు

సభాస్తంభంబున నుద్భవించి హేమకశిపుని సంహరించి ప్రహ్లాదుని
స్వకీయాంకమున నుంచుకొని లాలించి వాంఛితార్థంబులొసంగుటచేఁ
బ్రహ్లాదుఁడు మంచివాఁడనియుఁ దదీయమార్గంబు ననుసరించి భక్తి
చేసినవారు కృతార్థులనియు, భగవంతుఁడు భక్తవత్సలుఁడనియు
హిరణ్యకశిపుండు క్రూరుండనియు వానివలె నటింపరాదనియు, నటిం
చినచో నాపదవచ్చుననియు గ్రహించితి మట్లుగాక శ్రీహరి వైకుంఠం
బుననుండి హిరణ్యకశిపుండు చచ్చునట్లుసంకల్పించి చంపినచో నప్పుడా
రాక్షసుఁ డకాల మృత్యువుచేతనో, స్వభావముచేతనో, జరాభారము
చేతనో చచ్చెనందురుగాని పై నీతులన్నియు వెల్లడికావు. రెండియుఁ
బుండరీకాక్షుఁడు రావణ దుర్యోధనుల నపరివారంబుగా వధించి విభీ
షణ పాండవుల రక్షించుటవల్లను వాలినివధించి సుగ్రీవునిఁ బ్రోచుట
వల్లను రావణ సుయోధన వాలిప్రభృతులు దుష్టులనియు విభీషణ
పాండవ సుగ్రీవాదులు సజ్జనులనియు గ్రహింపఁగలిగితిమి. తక్కినవిష
యంబులన్నియు నిట్లేయూహింపవలయుఁగావున భగవదవతారంబులచే
నిట్టిప్రయోజనంబులు లక్షలుగలవుగాని చెప్ప శక్యముగాదు. 1123

సుశీలుఁడు

పరమపదంబు నొందినవారికిఁ బునరావృత్తిలేదుగదా? జయ
విజయులు భూలోకంబున జన్మించి రాక్షసులై యపకీర్తిఁగాంచుటకు
హేతువేమి ? 1124

వరవరముని.

జనార్దనుని పరవ్యూహస్థానంబులు నీకిదివఱకే కొంత యెఱిం
గించితిఁ బరమపదంబునకు నారద సనకసనందన విధి శివాదులుపోనం
జాలరు సరేకదా, వాక్కుచే నిట్టిదని చెప్పుటకును మనస్సుతో నిట్టి
దని యోజించుటకును శక్తులుగారని శాస్త్రంబులు వచింపుచున్నవి.
మన రామానుజయోగీంద్రులు వైకుంఠగద్యమునందట్లే వచించిరి.
మఱియుఁ బరమాకాశమునందు రాజస తామసంబులు లేక శుద్ధ

సత్త్వమేయుండుటవల్ల దుఃఖప్రదంబులగు శాపము లిచ్చువారును బొందువారు నచ్చోటలేరు. పరమవ్యోమమునందుండువా రింద్రియానుభవము నాత్మానుభవము వర్జించి కేవల భగవదనుభవపరులై యుందురేకాని,

శ్లో॥ మా ముపేత్యతు కౌంతేయ, పునర్జన్మ నవిద్యతే

అను భగవద్వచనానుసారముగాఁ బునరావృత్తినిఁ బొందరు గదా! అయితే నీచేఁ బ్రశ్నింపబడిన జయవిజయు లనిరుద్ధవ్యూహంబగు క్షీరసముద్రవాసులు విష్ణుదేవుండాదుగ్ధ వారాశిలో నొకవైకుంఠంబు నిర్మించి యనంత గరుడ విష్వక్సేనాదులతో శ్రీభూనీళాదులతో వంచేసియుండును. విధి శివ సనకాదులు నిర్జరులు తమకవసరమున్నప్పు డయ్యనిరుద్ధ వ్యూహంబునకేగి తన్నివాసుండగు హరితోఁ దమవిషయంబులు విన్నవింతురు, రామ కృష్ణాద్యవతారములకు వచ్చువాఁ డయ్యనిరుద్ధరూపియగు మాధవుఁడేసుమీ. వాసుదేవ వ్యూహము స్థలాంతరమందును బ్రద్యుమ్నవ్యూహము బ్రహ్మలోకమునందును, సంకర్షణ వ్యూహము పాతాళంబునందును, అనిరుద్ధ వ్యూహము క్షీరసాగరమునందును గలదని పెద్దలు వక్కాణింతురు కృష్ణార్జునులేగి వైదికపుత్రులఁదెచ్చినప్రదేశమే వాసుదేవవ్యూహమని కొందఱందు రింతేకాక గోలోకము సంతానలోకము కారణవైకుంఠము శ్వేతద్వీపము మొదలగు నామములతో విష్ణులోకంబు లెన్నియో కలవు. మొత్తముమీఁద విష్ణులోకంబులకేగినవారందఱు ముక్తు లగుదురు కాని పునర్జన్మమునొందరు. దాని నట్లుండనిమ్ము. సనకసనందనులొక్కతఱి భగవద్దర్శనాపేక్షచే దుగ్ధాకూపారంబున కరిగి రయ్యవసరంబున భగవానులు కార్యాంతరాసక్తులై యున్నారు. మీరు వెళ్ళఁ గూడదని జయవిజయు లమ్మునీంద్రుల నడ్డగించి రందుల కమ్మునులు కోపించి జయవిజయులను రాక్షసయోనింబుట్టుఁడని శపించిరి. నారాయణుండందుల కంగీకరించెను. 1125

సు శీ లుఁ డు

జయవిజయులు హరి శాసనానుసారంబుగా సనకసనందనుల నివారించిరి. అట్టిద్వారపాలకులు శాపగ్రస్తులగునప్పుడు భగవంతుఁడుదాసీనుఁడై వారిని రక్షింపకుండుటేల ? 1126

వ ర వ ర ము ని

భాగవతాపచారంబొనర్చినవారెంత మహానుభావులైన జయవిజయులరీతి దుఃఖములపాలగుదురని సూచించుటకప్పటి కుదాసీనుండై యుండి జన్మత్రయంబు గడచినమీఁదట సద్గావారికలకుఁ బరమపురుషుఁడు నిత్యవిభూతి నొసంగెను. 1127

సు శీ లుఁ డు

కమలాక్షుఁడు వామనాకారుఁడైనప్పుడు బలిచక్రవర్తిని మూఁడడుగుల దానంబడిగి కపటోపాయంబుఁబన్ని వదాన్యుఁడై సత్యవాదియైన బలిని బంధించి పాతాళంబున కనిపెఁగదా? యిది ధర్మమేనా ? 1128

వ ర వ ర ము ని

స్వర్గలోకము యజ్ఞభుక్కులగు దేవతలకుమాత్ర మర్హమైనది. తదితరశరీరుల కెంతమాత్రము నివసింప నర్హమైనదిగాదు. స్నానమొనర్చి పరిశుద్ధుఁడైనవాఁడే దేవాలయములోఁ బ్రవేశింప నర్హుఁడుగాని యస్నాతుండగువాఁడు జాతాశౌచములుగలవాఁడు నర్హుఁడు కాఁడు గదా! బలిచక్రవర్తి భుజబలముచే స్వర్గమునఁ బ్రవేశించి వేల్పుల వెళ్ళఁగొట్టి తానే పాలింపుచుండె నప్పుడు దేవతామాతయగు నదితి శ్రియఃపతినిఁగూర్చి తపంబొనర్చి యద్దేవునిదర్శించి స్వామీ! నాబిడ్డల కష్టంబులఁదొలంగించి రక్షింపుమని వరంబుఁగోరె నంతలకు భక్తాభీష్టఫలప్రదాయకుండగు మధుసూదనుం డంగీకరించి యదితిగర్భంబున వామనుఁడై జనియించి యిట్లనియోజించె నహో నేనిప్పుడు దేవకార్యార్థమై యవతరించితిని. కాని మదీయాంతరంగభక్తుండగు ప్రహ్లాదు

నను బలీంద్రుఁడు పౌత్రుఁడై యున్నాఁడు. ప్రహ్లాదునకు వరంబిచ్చు నప్పుడు నీవంశజులఁ జంపనని వరంబిచ్చితిని. తద్వరానుగుణ్యముగా బలిని వధింపరాదు. వధింపక రాజ్యంబురాదిప్పుడు కర్తవ్యమేమని వితర్కించి తాను లక్ష్మీవిభుండయ్యును సందేహింపక యాచకుండై బలి యజ్ఞవాటంబుఁజొచ్చి పదత్రయ దానంబుఁగోరి భూమ్యాకాశం బులు రెండును రెండడుగులుసేసి తృతీయపాదం బెచ్చటనుంతునని ప్రశ్నింపఁగా బలీంద్రుండు తాఱుమాఱుగాక తనమనంబున నిట్లని యాలోచించె. 1129

ఉ॥ వచ్చినవాఁ డథోక్షజుఁ డ,వాప్తసమస్త మనోరథుండు నే
నిచ్చిన నీయకున్నఁ గొఱ,తేమియులే దసురారికింతలో
నిచ్చినదాని నీయనని, యేననృతంబువచించి భూమిపై
లోచ్చువహించి ముందుఁ బర,లోకములో నరకంబుఁజెందనే.

ఉ॥ మేను సనాతనంబగుచు, మేలొనరింపదు, భోగభాగ్యముల్
దీనతఁజెందఁగన్పడవు. చెప్పకమానరు దేహబాంధవు
ల్కాన నసత్యముం బలుకఁ,గాదగ దచ్యుతుఁ డాశ్రయింపఁగా
దానమొసంగు టుత్తమవిధంబుగదా తలపోసిచూడఁగన్. 1131

ఉ॥ భవవిధి పాకజిద్వినుత,పాదుఁడు మంగళదేవతావధూ
ధవుఁడు సమస్త ధాన్య ధన,దాయకియై విలసిల్లు ధాత్రికీ
ధవుఁ డఖిలాంతరాత్ముఁ డిటు, దానమువేడిన నిత్తునంచు నే
నవిరళరీతిఁబల్కి వృష,లాడిన జన్మముమోఘమౌఁగదా. 1132

సీ॥ కర్మఫలములు సకలజీవులకునిచ్చు
నచ్యుతుపై వదాన్యత్వమొంది
గంగాభవమునకుఁ గారణంబగు విష్ణు
పాదంబు నానెత్తిమీఁదఁదాల్చి

గరిమ భక్తులకెల్ల నభయమిచ్చు సరోజ
నేత్రు స్తనములను నిలయమగుచు
లక్ష్మికుచములచే లాలింపఁబడు చక్ర
పాణి హస్తంబుపై పాణినుంచి
మెలగుదానికంటె మేలైనపని నాకుఁ
గలుగదంచు నెంచి బలి బిడాన
దానమిచ్చి హరిపదంబు నిజోత్తమాం
గంబుపైన మోపఁ గైటభారి. 1133

సంతోషించి వైరోచనిం గాంచి వత్సా! నీ యౌదార్యంబునకు మెచ్చితిని. ప్రహ్లాదుని పౌత్రుండనుటకుఁ దగియున్నావు. స్వర్గంబు దేవతల కొసంగి పాతాళంబునకుఁబొమ్మని పనిచి యాలోకంబున బలికి రాజ్యంబిచ్చి యతని వాకిట ద్వారికుండై యుండె నది మొదలు బలీంద్రుఁడు ముల్లోకంబులందును వదాన్యఖ్యాతివహించి పరమభాగవత కోటిలోఁ జేరి భావి మహేంద్రాధికారియై యున్నాడు కనుక కమలాక్షుండు బలిచక్రవర్తికి సర్వవిధ సౌఖ్యంబు లొసంగి తనభక్తులలో జేర్చుకొని యెనే కాని కష్టములపాలుసేయలేదు. ఇది తెలియని మూఢులు నోటికి వచ్చినట్లు వచింతురు. నీవట్టి పాపంబునకుఁ బాల్పడవలదు. 1134

సుశీలుఁడు.

స్వామీ! శ్రీరామచంద్రునిఁగూర్చి శక్తియని కొందఱు బ్రహ్మయని కొందఱు శివుండని కొందఱు మనుష్యమాత్రుండని కొందఱు చెప్పుచున్నారిం దేది సత్యము? 1135

వరవరముని

విపరీతజ్ఞానుల దుష్ప్రలాపంబులను మితిలేదు. వానిని మన మాకర్ణింపరాదు. ఇదియెట్లాయని యాలోచింపనురాదు. గ్రామసూ కరంబునుగాంచి యిది యమేధ్య మాహారంబుగాఁగొనుచున్నదే

యనియు మనుష్యులభూయిష్టంబగు దీనిశరీరమును గోసి కొంత మంది యెట్లుభక్షింతురాయనియుఁ జింతించి నందున నించుకయైనఁ బ్రయోజనంబు గలుగదుగదా ! ఇఁక రామతత్త్వం బెఱింగింతు వినుము. రావణ వధానంతరంబున శ్రీరాముని దర్శించి బ్రహ్మ రుద్రాదులు శ్లో॥ సీతా లక్ష్మీర్భవాన్ విష్ణుః = సీత మహాలక్ష్మి నీవు విష్ణుండవని స్తుతించినందువల్లను, పార్వతీశ్వరులు సదా రామమంత్ర జపంబానర్చుటవల్లను గాశిఁ మృతిఁబొందువారికి సదా శివుండు రామమంత్రోపదేశము సేయుటవల్లను రామాయణప్రతిపాద్యుండగు శ్రీరాముఁడు విష్ణువేకాని మఱియొకండుకాఁడు. 1136

సుశీలుఁడు

సీతాపతి పరబ్రహ్మమని వచించినవా రక్కాలంబున నెవ్వరైనఁగలరా? 1137

వరవరముని

దేశభాష లెన్నియున్నను విద్వాంసులకు దేవభాషయే ప్రమాణము. తత్సంస్కృతభాషయందు సహితము వాల్మీకిరామాయణ మొక్కటియే ప్రమాణము. ఎందుకనఁగా విరించనానుగ్రహంబుచే సరస్వతి వాల్మీకి మనస్సునఁబ్రవేశించి జ్ఞానంబునొసంగి వాక్కునందు నిలిచి శ్లోకనిర్మాణంబుఁగావించె నందువల్లనే శ్లో॥ క్వచిత్సత్యం వ్యాస వాక్యం సత్యం వాల్మీకినా స్మృతమ్ అని పండితులు వక్కాణించిరి.

సుశీలుఁడు

దేశభాషలయందేకాక సంస్కృతభాషయందుసహిత మనేక రామాయణములున్నవే యవియన్నియు నప్రమాణంబులేనా ?

వరవరముని

తక్కినరామాయణంబులన్నియుఁ గవులు వారి వారి మతాను సారంబుగాను భక్త్యనుసారంబుగాను రచించిరి. వాల్మీకిరామా యణం బట్టిదికాదు. విరించన శాసనానుగుణమై సరస్వతి కృపా

ప్రవాహసంకలితమై సర్వశాస్త్ర ప్రతిపాదకమై మంత్రశాస్త్ర ప్రతిపాదకమై గాయత్రీమంత్ర సంకలితమై నానాబీజ సంయుక్తమై తనరారుచున్నది. సంస్కృతభాషాభిమానులు లాదినుండి దీనింబఠించియే పండితులైరి. రామావతారకాలంబున రాముని సర్వేశ్వరుఁడని చెప్పిన వారిని వాల్మీకి రామాయణానుసారంబుగా నెఱింగింతు నాకర్ణింపుము 1 దేవసమూహము, 2 విశ్వామిత్రుఁడు, 3 అహల్య, 4 గౌతముఁడు 5 విరాధుఁడు, 6 కుబేరుఁడు, 7 దండకావాసులగు మునులు, 8 శరభంగుఁడు, 9 ఖరదూషణాది రాక్షసులు, 10 అకంపనుఁడు, 11 మారీచుఁడు, 12 జటాయువు, 13 శబరి, 14 కబంధుఁడు, 15 స్థూలశిరుఁడు, 16 తార, 17 సంపాతి, 18 నిశాకరముని, 19 సముద్రుఁడు, 20 అంజనాసుతుఁడు, 21 విభీషణుఁడు, 22 రావణ కుంభకర్ణులు, 23 మండోదరి, 24 బ్రహ్మరుద్రాదులు, 25 సనత్కుమారుఁడు, 26 చ్యవనాదిమునులు, 27 బ్రహ్మదత్తుఁడు, 28 అగస్త్యుఁడు వీరందఱు శ్రీరామచంద్రుఁడు పరబ్రహ్మమని చెప్పుటకు ముఖ్యసాక్షులైయున్నారు. నీకింతవఱకు వేదవేదాంతప్రతిపాదితుఁడగు విష్ణుని సర్వోత్కృష్టుండని వక్కాణించితి నిప్పు డవ్విష్ణుదేవుఁడే రాముఁడని నిర్ణయింతు నాలకింపుము. 1140

సుశీలుఁడు

వీరు రాముని పరబ్రహ్మత్వ మెట్లు నిర్ణయించిరో వక్కాణింపుఁడు ? 1141

వరవరముని

మొట్టమొదట నిలింపులు శ్రీవైకుంఠంబునకేగి నారాయణునిఁగాంచి దేవా! నీవు మనుజలోకంబున రామావతారమెత్తి రావణాది దుష్టరాక్షసులవధించి మాకు మేలొనర్పుమని ప్రార్థించుటచేతను, దశరథపుత్రకామేష్టిసమయంబున హవిర్భాగంబునకు వచ్చిన వేల్పులకు విష్ణువు సాక్షాత్కరించి మీవాంఛితంబు నెఱవేర్తు. దాశ

రథినిఁగాఁబోవుచున్నానని చెప్పుటవల్లను దేవతలద్వారా రామపర
త్వము వెల్లడింపఁబడెను. 1142

విశ్వామిత్రుఁడనేకపర్యాయములు స్వకీయ యాగభంగ
మొనర్చి నిలింపుల కజయ్యులైన రాక్షసుల నధింపలేక యయో
ధ్యకువచ్చి,

శ్లో॥ అహంవేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్

అని దశరథునితోవాదించి రామునిఁగైకొని వెళ్ళి యజ్ఞవిఘ్న
కరులగు రాక్షసులవధింపించి కార్యసాఫల్యముఁ గావించుకొన్నందువల్ల
గాధేయుఁడు రామపరత్వము వెల్లడించెను, 1143

అహల్యాదేవి రామ పాదధూళిచే శిలారూపంబు విడిచి స్త్రీ
రూపంబు ధరించినందువల్లను, నీశాపంబు భగవంతుండగు రామునిచే
నాశమొంది స్వరూపంబుఁ బ్రాపింతువని గౌతముఁడు శాపానుగ్రహ
సమయంబునఁ దీర్మానించినందువల్లను అహల్యాగౌతములు రామ
పరత్వము వెల్లడించినవారైరి. 1144

విరాధుఁడు రామునిచేఁ దనచేతులు నఱుకఁబడఁగా రామునిఁ
గాంచి దేవా నీప్రభావముఁ దెలిసికొంటిని, సీతమహాభాగ, లక్ష్మ
ణుఁడు మహాయశస్కుఁడు, నీచేఁజచ్చినప్పుడు మదీయ శాపవిమోచ
నంబగునని కుబేరుండానతిచ్చెంగావున నన్నుఁబాతిపెట్టుమని ప్రార్థించి
యట్లొనర్చినపిమ్మట శాపవిముక్తుఁడై తుంబురనామ గంధర్వుఁడయ్యె.
శాపములు పాపములు పోగొట్టుటకు సామాన్య దేహధారికి శక్యంబు
గాదు. భగవంతునకే సాధ్యమట్లగుటచే రామునిచే శాపంబుఁదొల
గించుకొనినందున విరాధుండును దదీయమర్మం బతనికిఁజెప్పిన
కుబేరుండును రామప్రభావంబు వెల్లడించినవారైరి. 1145

శరభంగమహామునీంద్రుఁడు తనకై యింద్రుఁడుదెచ్చిన స్వర్గ
లోకవిమానంబును ద్రిప్పి పనిచి సీతావల్లభునిదర్శించి స్వకీయ తపః

ఫలంబతనికి ధారవోసి రాముని యెదుట శరీరంబువిడిచి మోక్ష
మొందుటచే రామపరత్వము వెల్లడించెను. 1146

త్రిలోకకంటకులగు ఖరదూషణాది రాక్షసులఁ బదునాలుగు
వేలమంది నఱజాములో రథాదిపరికరంబులు లేకుండఁ బాదచారియై
శ్రీరాముఁడు వధించెఁగావునఁ బరాత్పరుఁడుగానిచో నింతమంది
బలాఢ్యుల నింత స్వల్పకాలములో నింతసులభముగా సంహరింపలేడని
తేలినదిగనుక రామపరతత్త్వము వెల్లడియయ్యెను. 1147

అకంపనుఁడు మొదట ఖరాదులలోనుండి చావుతప్పించుకొని
లంకకువెళ్ళి రావణుని సన్నిధియందు రాముని యప్రతిమాన ప్రభావ
మును దెలుపుటచేఁ దదీయపరత్వము వెల్లడించెను. 1148

మారీచుఁడు తన్ను సహాయము రమ్మనిపిలిచిన రావణునితో
శ్రీరాముఁడు ధర్మస్వరూపుఁడు సాధువు సత్య పరాక్రమాది గుణ
ములుగలవాఁ డప్రమేయ తేజస్వి వైరబుద్ధితో నతనిసమీపించితిమేని
నీవులేవు నేనులేను రాక్షసులులేరు లంకలేదు. నిష్కారణముగా నంద
ఱము నశించెదమని నిస్సంశయముగా వచించుటచే రామపర
తత్త్వముఁ దెలిపినవాఁడయ్యెను. 1149

పక్షియైన జటాయువు' నిషాదాంగనయైన శబరి రామునిచేఁ
మోక్షపదవిఁ బ్రాపించిరి.! మోక్షప్రదాయకుఁడు సర్వేశ్వరుఁడుగనుక
శబరీజటాయువులు రామపరత్వము వెల్లడించిరి. 1150

దండకావాసులైన మునులు ప్రపంచాతీతులై విరాగులై
దేహాభిమానవర్జితులై యుండియు నదివఱకెంత బలాఢ్యులైన ప్రభు
వులున్నను లెక్కింపక రామునిజూడఁగానే తమతపఃఫలం బీరూప
ముతో సాక్షాత్కరించెనని యెంచి రాఘవునకు శరణాగతిఁజేసి విరోధి
నాశనముఁగావించుకొని సీతాలక్ష్మణసహితుండగు శ్రీరామచంద్రు

నకు దినదినము విందులుగావించి యనేకవత్సరంబు లమ్మహాత్ము నారా ధించిరికాబట్టి రామపరత్వము వెల్లడించినవారైరి. 1150

రామునిచే బాహువులు నఱుకఁబడఁగాఁ గబంధుఁడు కావ రంబువిడిచి శరణాగతిసేసి స్వామీ! మచ్ఛరీరమును దహింపుము. స్థూలశిరుఁడనుఋషి నన్నుశపించి నీచే శాపవిముక్తియగునని పక్కా ణించెనని చెప్పి యట్లొనర్చినపిమ్మట దివ్యరూపమును ధరించెను. ముందు భగవంతుఁడు రామరూపియై నిన్ననుగ్రహించునని భవిష్య ద్వార్త నెఱింగి చెప్పినందున ముని రామపరత్వము వెల్లడించిన వాఁడయ్యెను. 1151

తార వాలిమరణానంతరము రాముని శపింపవలెనని సమీ పించి యమ్మహాత్ముని దివ్యమంగళవిగ్రహసౌందర్యమున కాశ్చర్యముఁ జెంది మోహించి రామా! ప్రత్యక్షానుమాన శాబ్దోపమానాది ప్రమాణములచేతసహా తెలిసికొనుట కశక్యుండవగుటచే నప్రమే యుండవు, శత్రుతిరస్కారమున కసాధ్యుఁడవగుటచే దురాసదుండవు, అధోక్షజుండవగుటచేతను హృషీకేశుఁడవగుటచేతను జితేంద్రియుం డవు, ధార్మికులలో నుత్తముఁడవని స్తుతించినందువల్ల రామపరత్వ మును లోకమున కెఱింగించెను. 1152

సంపాతి ప్రాయోపవిష్టులై సముద్రతీరంబుననుండు హనుమ జ్జాంబవదాది వానరులంగాంచి యయ్యలారా! పూర్వవృత్తాంతంబు సెప్పెదవినుండని యిట్లనియె. వృక్షచరులారా! చిరకాలంబుక్రిందట నొకానొకహేతువుచే నాఱెక్కలు గాలఁగా నిశాకరుండను మునిం ద్రునిఁగాంచి ఱెక్కలిమ్మని ప్రార్థించితి నమ్మునీంద్రుఁడు దీర్ఘముగా నాలోచించి పక్షీంద్రా! యిప్పుడు నీపక్షంబులిచ్చుటకు సమర్థుడనై యుండియు నీయనొల్ల నెందుకంటివేని రాఁబోవు త్రేతాయుగంబున రామకింకరులగు వానరు లీసముద్రతీరంబునకువచ్చి సీతావృత్తాంతం

చెఱుంగక చాన నిచ్చగింతు రయ్యవసరంబున వారిదుఃఖంబుఁ బాపుట కీవగ్నుండవై యుచ్చటనుండవలయును. పత్రంబు లిచ్చితినేని నెక్కడి కైనం బోవుదువు. దానిచే రామకార్యంబు చేయుదు. బహుకాలము ఱెక్కలులేకుండ నేనేల కష్టపడవలెనందువా నీవేకాదు దేవతలు మునులు బ్రాహ్మణులు మనుష్యుడు మొదలగువారును సర్వభూతములును రామకార్యము చేసితీరవలయు. నేనుకూడ చేయవలయునని యెంచితింగాని చిరకాలజీవినగుటచే నప్పటిదాఁక శరీరంబు నిల్పనోపనని చెప్పి నిశాకరముని స్వర్గంబునకేగెనని సంపాతి వానరులతోఁ నుడివెఁ గాబట్టి దేవాదిసర్వభూతంబులు రామకైంకర్యంబు నిర్వహింపవలెనని మునీంద్రుండు వచించుటచే సురాసురాది సర్వభూతసేవ్యుఁడు భగవంతుఁడేగనుక భవిష్యద్రామావతారుఁడు సర్వేశ్వరుఁడని చెప్పినందువల్ల నిశాకరముని రామపరత్వము వెల్లడించెను. 1153

సముద్రుఁడు రామబాణములచేఁ దల్లడిల్లి రాముని శరణుఁ జొచ్చి సేతుబంధనోపాయం బెఱింగించెను. దీనివల్లఁ దేలినదేమనఁగా బాణపరంపరలచే జలనిధిని శుష్కింపఁజేసి స్వాధీనుంగావించి సేతుబంధంబు నరించినవాఁడు సర్వశక్తుండగు భగవంతుఁడేయని నిర్ణయింపబడుటచే రామపరత్వము ప్రఖ్యాతిఁగాంచెను. 1154

హనుమంతుఁడు సముద్రమును లంఘించి లంకాపురంబుఁ జేరి సీతామహాదేవిని దర్శించి యశోకవనభంగంబుఁ గావించి వేలకొలంది రాక్షసుల వధించెను. దీనిచేఁ దేలిన దేమనఁగా శ్రీరామచంద్రుఁ డఘటనఘటనాసమర్థుఁడగు భగవంతుఁ డట్లుగానిచో వానరమాత్రుండగు రామదూత సముద్రముదాటుటకు వనంబుఁ బెకలించుటకు నక్షాది రాక్షసులవధించుటకు రావణుని ధిక్కరించుటకు లంకఁగాల్చుటకు సమర్థుఁడగునా యని యూహింపఁబడుటచే రామపరత్వము ప్రఖ్యాతిఁగాంచె. మఱియు హనుమంతుఁడు వాలవహ్నిచే దహింపఁబడక. లంకనుదహించి తమసరి లాంగూలాగ్నినిఁ జల్లార్చి యనసా

యుఁడై యుండుటచే సీతాప్రధానంబు తేటపడె నింతేకాక మహామతి రావణునిఁగాంచి,

శ్లో॥ బ్రహ్మాస్స్వయంభూ శ్చతురాననోవా
రుద్రస్త్రినేత్రస్త్రిపురాంతకోవా
ఇంద్రో మహేంద్ర స్సురనాయకోవా
త్రాతుం నశక్తాయుధిరామవధ్యమ్

నాలుగుముఖములుగలవాఁడై తనంతటఁదానే పుట్టినవాఁడైన బ్రహ్మగాని, అగ్నినేత్రముతో మూఁడునేత్రములుగలిగి త్రిపురాసుర వధఁగావించిన రుద్రుఁడుగాని మహేంద్రఖ్యాతినొంది ముప్పదిమూఁడు కోట్ల దేవతల కధిపతియైన యింద్రుఁడుగాని బహువచనముచే ముగ్గురు నేకీభవించిగాని రాముఁడు చంపెదనని తీర్మానించినవానిని రక్షింపఁజాలరని వచించె నిక్కారణంబుచే రామపరత్వ మాంజనేయులు నిరాఘాటముగాఁ దెల్పినవాడయ్యెను. 1155

విభీషణుఁడు లోకకంటకుండగు రావణునితోఁ గలహించి రావణుఁడే జయించునేమోయను సందేహము లేనివాఁడై తన్నుఁ గొట్టుట కుద్యోగించిన సుగ్రీవాది బలాఢ్యులకు భయపడక,

శ్లో॥ సర్వలోక శరణ్యాయ రాఘవాయ మహాత్మనే

సర్వలోకశరణ్యుఁడును మహాత్ముఁడునగు రాముని శరణుఁ జొచ్చితిననుటచే రామపరత్వమును వెల్లడించెను. 1156

మందోదరి రావణుండీల్గినప్పుడు వానిపైనఁబడి యేడ్చుచు ప్రాణనాథా నిన్నుఁగూల్చినవాఁడు మానవమాత్రుండుగాఁడు. శ్రీవత్సలాంఛనుండును శంఖ చక్రాది దివ్యాయుధధరుండగు భగవంతుఁడు నరాకారముతోవచ్చి వధించెనని చెప్పినందున రామపరత్వమును గొనియాడెను. 1157

రావణ కుంభకర్ణులిద్దఱు నారాయణునిచేఁ జచ్చునట్లు విధి యున్నందున వారిఁజంపిన రాముఁడు పరాత్పరుఁడని ప్రసిద్ధమైనది.

బ్రహ్మరుద్రేంద్రాది నిర్జరులు రావణవధానంతరంబున లంకకు వచ్చి శ్రీరామునిఁగాంచి శ్లో॥ సీతాలక్ష్మీర్భవాన్ విష్ణుః- సీత లక్ష్మి, నీవు విష్ణుండవని వేదాంతవాక్యంబులచే స్తుతించినందువల్ల రామ పరత్వముఁ బ్రకటించిరి. 1159

సనత్కుమారుఁడు రావణుం డొకానొకసమయంబున మోక్షార్థియై హిమాలయపర్వతమున నుండు సనత్కుమారునికడ కేగి మునీంద్రా శరీరధారియగువాఁ డెవ్వని నాశ్రయించి యెవ్వని నారాధించి యెవ్వని సంస్మరించి జనన మరణ ప్రవాహంబునకుఁ దొలఁగి ముక్తిఁజెందవచ్చు నెఱింగింపుమని యడుగఁగా నమ్మునిపుంగవుండు దశాస్యునివీక్షించి రావణా! నిరంజనుఁడు నిష్కలంకుఁడు నిరాఖ్యాతుండగు పరబ్రహ్మ మొకఁడు గలఁడు వాఁడే నారాయణ, గోవింద విష్ణు వాసుదేవాది శబ్దంబులచే విలసిల్లు నతని నారాధించి జీవుండు మోక్షంబుఁజెందునని యుపదేశింపఁగా నాలకించి దశాననుండు మరల నప్పారికాంక్షితో నిట్లనియె. ఋషివర్యా నేనాసుర ప్రకృతి గలవాఁడనగుటచే విష్ణునియందు ద్వేషంబు గల్గుచున్నదిగాని భక్తి గలుగదు. కాని సమరంబున హరిచేఁజచ్చినవానికి ముక్తిగలదా? ఎప్పటికైన నప్పురుషోత్తమునిచే మరణంబు గలుగునాయని ప్రశ్నింపఁగా నత్తాపసుండు సంతసించి దీర్ఘముగా నాలోచించి పౌలస్త్యునితో రావణా హరిచే మడిసినవారికిఁ దప్పకుండ నపవర్గము లభించుఁ ద్రేతాయుగాంతంబున రామరూపియైన పుండరీకాక్షుఁడు నిన్నువధించునని వచించినందున సనత్కుమారుఁడు రామపరత్వమును బ్రకటించెను.

చ్యవనాదిమునులు లవణాసుర సంహారార్థమై యయోధ్యకేగి దేవా! నీవు సర్వశక్తుండవు, సర్వేశ్వరుండవు మహాబలాఢ్యుండగు

లవణుని నీవుదక్క వధించువారులేరని స్తుతించుటచే రామపర త్త్వము ప్రసిద్ధిఁగాంచెను. 1161

బ్రహ్మదత్తుఁడు రామపాణి సంస్పర్శముచే స్వకీయ గృధ్రరూప శాపమును బోగొట్టుకొని రామపరత్వము ప్రకటించెను. 1162

అగస్త్యుఁడు స్వకీయ యాగకాలమందునువచ్చిన శ్రీరాముని సందర్శించి పూజించి యాగభోక్తవని వేదాంతవాక్యములచే నుతించి నందున రామపరత్వమును బ్రకటముఁగావించెను. బుద్ధిమంతులకీప్రమా ణంబులుచాలును. బుద్ధిహీనులగు నప్రామాణికులకు శాస్త్రంబు లతోఁ బనిలేదుగదా! 1163

సుశీలుఁడు

సీతామహాదేవి లక్ష్మీస్వరూపిణిగదా! మాయామృగమోహం బుచే రామవియోగ మెట్లుసహించెను? 1164

వరవరముని

భగవద్భక్తుండైనవాఁడు నిరంతరము భగవంతునినే ప్రేమింపు చుండవలయు నట్లుగాక వేఱొక గొప్పపదార్థము కలదని ప్రేమించి నచో నాపత్తును బొందునని లోకమున కట్లు బోధించెను. 1165

సుశీలుఁడు

భూపుత్రి మహాభక్తుఁడగు లక్ష్మణుని నిష్కారణముగా దూఱనేల? 1167

వరవరముని

ఎంత మహానుభావయైన నెట్టి సాధ్వీమణియైనఁ బరమభాగవ తుని దూషించినచో వెంటనే మహావిపత్తును బొందునని బోధించుట కట్లొనర్చెను. 1167

సుశీలుఁడు

లోకమాతయై శుచిర్భూతయై మహాతపస్విని యై యయోని జాతయైన సీతను డాఁకి యెత్తుకొనిపోయిన రావణుండప్పుడే భస్మము

కాకయుండుటకు హేతువేమి మైథిలిని రావణుండంకమున నిడుకొని పోయినట్లు రామాయణమునఁగలదుగదా ? 1168

వ ర వ ర ము ని

సీతాపహరణోద్యోగియై రావణుండు మారీచునిసహాయముఁ గోరినప్పుడమ్మారీచుఁడు దనుజేంద్రుఁగాంచి.

శ్లో॥ దర్శనాదేవరామస్య హతంమాముపధారయ,
ఆత్మానంచహతంవిద్ధి హృత్వాసీతాం సబాంధవమ్
ఆనయిష్యసిచేత్సీతా మాశ్రమాత్సహితోమయా
నైవత్వమసినాహంచ నైవలంకా న రాక్షసాః

రామదర్శనము చేతనే నన్నుఁ జచ్చినవానినిగా నిశ్చయింపుము సీతనపహరించి నీవును సబాంధవముగాఁ జచ్చితివని యెఱుంగుము. నాతోఁగూడి స్వాశ్రమమునుండి సీత నపహరించితివేని నీవులేవు నేను లేను లంక లేదు రాక్షసులు లేరు సుమీ. కావున నీయుద్యోగంబు మానుకొమ్మనఁగా మృత్యువుసమీపించుటచే రావణున కవ్వాక్యంబులు రుచింపవయ్యె నదియట్లుండఁగా నొక్కసమయంబునఁ బుంజికస్థలి యను దేవతాస్త్రీని బాధించిన రావణుంగాంచి రావణా నీవిం దుఁగామములేని స్త్రీని బలాత్కరించితివేని శిరస్సుపగిలి వెంటనే మరణింతువని శపించె నాశాపంబు రావణాశయములో బాధింపుచుండె. శ్రీరాముఁడే ప్రక్కనుండివచ్చి నిశాతబాణములతోఁ దన్నుఁజంపునో యను శంక పీడింపుచుండె. మారీచుని నీతివాక్యములు విరించిశాపము రామ బాణప్రయోగాపాయము బాధింపుచున్నను మూర్ఖుండగు రావణుండు మాయాసన్యాసివేషముతోఁ బంచవటికేఁగి,

శ్లో॥ జగ్రాహరావణస్సీతాం, బుధఃఖే రోహిణీమివ

సీతాతేజఃప్రభావంబును భావగాంభీర్య నిష్ఠురాలాపంబులను దర్శించి యాకసంబున బుధుండు స్వకీయమాతయగు రోహిణినిఁ

బట్టినట్లు దశాస్యుండు మాతృభావంబుతో సీతంబట్టె నక్కారణంబు ననే రావణుండు సద్యోమరణంబుం జెందలేదు. 1169

సుశీలుఁడు

మహాపాపుండగు రావణుని కామం బాసమయంబున నెట్లడంగెను. 1170

ప ర మ ర ము ని

ఆధివ్యాధులు అనఁగా మనోవ్యాధిగాని శరీరవ్యాధిగాని బాధించునప్పుడు శరీరికిఁ గామంబడంగియుండు నాహేతువుచే సీత నెత్తుకొన్నది మొదలు రావణుండు భయభ్రాంతచిత్తుండై ప్రపంచ విస్మృతిఁ జెందిపోవుచుండె నందువల్లనే స్వాంకమునుండు సీతాదేవి తన భూషణంబులొలిచి సుగ్రీవాదులకడ వైచునప్పు డెఱుంగడయ్యె నింతేకాక సంపాతిపుత్రుఁడు సుపార్శ్వుఁడు త్రోవ కడ్డమైయుండఁగా లంకకు మార్గంబెట్లని యడిగెను. స్త్రీజనులు మహానసంబున నుండు నప్పుడు నిప్పును హస్తముతోఁ బట్టి యావలఁ జెట్టునట్లు బహు త్వరిత గమనంబునఁ బోయి సీత నంతఃపురములోదించి ప్రార్థించి ఫలంబుఁ గానక నిరుత్సాహుఁడై యశోకవనంబునందుంచెను. దండకనుండి సీతతోఁ బ్రయాణమైన రావణుంగాంచి బ్రహ్మదేవుఁడు నవ్వి రావణుండు త్వరలో నీల్గు, దేవతల శరణాగతి ఫలించునని వక్కాణించె నిన్నియపాయంబులతోఁ దనపాలిటి కాళరాత్రియై మెడకుఁ గాలపాశమై యకాలమృత్యువగు సీతాదేవిని రావణుండు లంకలోనుంచెను. 1171

ఇఁక సీతావిషయంబుఁ జెప్పెద వినుము. లక్ష్మీదేవి పూర్వ మొక బ్రాహ్మణునకు జన్మించి వేదవతియను పేరుతో హిమాలయంబున శ్రీహరిం గూర్చి తపంబు సేయుచుండ దండయాత్ర కేగుచున్న రావణుం డవ్వేదవతిం గాంచి మోహించి తన్నుఁ బతిగాఁ గైకొనుమని ప్రార్థించి జడఁబట్టె నప్పనికి వేదవతి కోపించి రావణునితో నోరి రాక్షసాధమా! శ్రీహరిం గూర్చి తపంబు సేయుచున్న మద్దేహంబుఁ దాఁకితి

వికఁ నిర్దేహంబువిడిచి మఱుజన్మంబున విష్ణునిఁ బెండ్లియాడి యమ్మహాత్మునిచే నిన్ను సపరివారంబుగా సబాంధవంబుగా సంహారింపించెదనని శాపమిచ్చి యగ్నియందుఁ బడి కాలి రెండవజన్మంబున సీతయై నారాయణ స్వరూపుండగు రామునిఁ బెండ్లియాడినదిగనుక తచ్ఛాపము నెఱవేర్చుటకును రావణసంహారార్థము దేవతాప్రార్థనచే నవతరించిన రామావతారప్రయోజనము సాఫల్యమొందించుటకు, రావణ నిర్బంధముచేఁ జెఱసాలలోనుండు నిర్జరాంగనా సమూహంబుల విముక్తులఁ జేయుటకును యోజించి భూపుత్రి పంచవటియందే దశాస్యుని భస్మముచేయక లంకాపురంబునకరిగి ప్రాకృతస్త్రీచందమున దుఃఖింపుచుండెను. కాని మారుతి లంకాపురస్థుఁడై శింశుపావృక్షము నారోహించియున్నప్పుడు వేయిమంది భార్యలతో రావణుండు ప్రమదావనంబుఁ జేరి భూపుత్రికిఁ దనవాంఛితంబెఱింగించి ప్రార్థింపఁగా మైథిలి రాక్షసాధిపునిఁ దృణీకరించి తృణమును రావణునిఁగా భావించి యో దశాస్యా నాయందలి దుర్మోహంబును మానుము. రామపత్నినగు నన్ను నీవుదక్క మఱియెవ్వఁడైనను ముల్లోకంబులలో బ్రతుకఁగోరిన వాఁడు మోహింపఁడు పాపాత్ముఁడు ముక్తిఁగోరునట్లు నన్నుఁగోరుచున్నావు యిది నీకపాయకరము. నీవు గ్రామసూకరంబవు నీకునర్హంబులగు గ్రామసూకరంబులతో క్రీడింపుము. నేనాదిహంసను పురుషహంసయగు రామునితోఁ గ్రీడింతెద. రామబాణంబులచే నీశిరస్సులు తెగి భూమిపై దొల్లకమునుపే నీలంక శ్మశానప్రాయము కాకమునుపే రామునకు శరణాగతి సేయుమని నిశ్చయంబుగా దూషించి రామాజ్ఞలేమి నూరకుంటిఁ గలిగినచో నిన్నిప్పుడే భస్మముఁ జేయఁ జాలుదుంజుమీయని తిరస్కరింపఁగా దండతాడిత సర్పమేయంబుపగిది రావణుండు చేయునదిలేక నిరుత్సాహుండై స్వగృహంబుఁ జేరెను.

సు శీ లుఁ డు

ఇట్టి ధిక్కారవాక్యంబులువిని రావణుండెట్లు సహించెను.

వరవరముని

సహింపక చేయునదిలేదు. మున్ను హిరణ్యకశిపుండొనర్చిన మారణకర్మంబులు ప్రహ్లాదు నేమియుం జేయఁజాలక హిరణ్యకశిపునకే మృత్యువుఁగలిగించెను. విష్ణుభక్తుండగు బాలునిఁ బ్రహ్లాదుని నశక్తుని మహాబలాఢ్యుండగు హేమకశిపు డేమియుఁ జేయజాలకపోగా విష్ణుపత్ని యగు సీతను రావణుండేమి చేయఁగలఁడు చేయఁజాలకయే యామెను సమీపింపడయ్యెను. 1174

సుశీలుఁడు

సీతామహాదేవి స్వకీయ ప్రభావము నెప్పుడెప్పుడు ప్రకటించెనో వక్కాణింపుడు. 1175

వరవరముని

భూపుత్రి లంకలో శింశుపావృక్షమూలంబుననుండి కారాబాధ భరింపఁజాలక హనుమద్దర్శనమునకుముందు దుఃఖించి మహాత్సవంబులతోఁగూడిన లంకాపురంబు శ్మశానప్రాయంబుగాఁగాక సౌధప్రాకార మంటపాదులతోఁగూడిన లంకాపురంబు శీఘ్రకాలంబున దగ్ధమగుంగాక లంకాపురస్త్రీలు మృతినొందిన బాంధవ నామంబులఁ బేర్కొని శోకింతురుగాకయని శపింపఁగా ద్వితీయ దినంబున నట్టి కార్యంబులన్నియుం జరిగె. దనుజులు మారుతివాలంబునకు నిప్పు పెట్టఁగావిని వీతిహోత్రునింగూర్చి, శీతోభవ హనూమతః=పావని వాలమునందు శైత్యము వహింపుమనఁగా హనుమల్లాంగూలాగ్ని చందన పన్నీరంబులభంగి శైత్యమువహించె. లోకాపవాదనివృత్త్యర్థ మగ్నిలోఁజొచ్చి నిరపాయమై వెడలి వహ్నిచేఁ బొగడ్తఁగని దేవతా సమీపంబున రామునితోఁగూడెను. చరమకాలంబున నయోధ్యలో రామాశ్వమేధయాగాంతంబున భూబిలంబుఁజొచ్చి స్వీయసత్వాధిక్యంబును లోకంబున కెఱింగించె నంతేకాకుండ నత్రిమున్యాశ్రమములో ననసూయచే నిలింప దుర్లభంబగు నంగరాగంబుఁ బ్రాపించె నిది

యిట్లుండఁగా దండకాటవిలోఁ జరించునప్పుడు రామలక్ష్మణులు ముందుఁబోయి యొకవృక్షచ్ఛాయయందు దాహపీడితులై కూర్చుండి వెనుకవచ్చుచున్న జానకింగాంచి శ్రీరామచంద్రుఁడు నవ్వి ప్రాణనాయకీ వనవాసము కష్టప్రద మయోధ్యలోనే నిలువుమని నేను బోధింపఁగా నంగీకరింపవైతి నీనాఁడు స్నానపానంబులకెచ్చటను జలము లభింపలే దేమిచేయఁగలవని పరిహాసమాడఁగా భూపుత్రి మందహాసంబొనర్చి సహోదరులు దిగులుపడవలదని చెప్పుచుఁ జిన్నరాతిముక్క నెత్తి యొక శిలాఫలకంబుపైఁగొట్టె నంతభూమిలోనుండి నిర్మల శీతల మాధుర్యసహితంబగు జలప్రవాహంబు పైకివచ్చె నందులకు విస్మయమంది రామలక్ష్మణు లాప్రవాహంబునందు సీతాసమేతులై స్నానపానంబు లొనర్చి సుఖించిరి, సీతారాములు పదునొకండువేలవత్సరంబులు భూలోకంబుననుండి యేకాలంబున నేమేమి మహిమలు చూపించిరో యెవ్వఁడెఱుంగును. వాల్మీకిరచిత రామాయణస్థంబులగు విషయంబులుమాత్రమే యెఱుంగుదుముగాని సీతారాముల దినచర్య లెఱుంగఁజాలము. 1176

సు శీ లుఁ డు

సీతాదేవి నెడఁబాసినప్పుడు రాఘవుఁడు చెట్టుచెట్టు పుట్టపుట్ట దిరుగుచు నేడ్చెను. రావణుం డొక్కఁ డపరాధము చేసియుండఁగా బ్రమదాస్త్రమువేసి ముల్లోకంబుల దహింతునని బాణమెత్తె నిది యధర్మముకాదా ? 1177

వ ర వ ర ము ని

స్వాశ్రితులు తన్నెడఁబాసి యాపత్తునొందినప్పు డీప్రకారముగా నాకును దుఃఖముకలుగునని బోధించుటకు సీతంగూర్చి యేడ్చెను. తాను సర్వశక్తుఁడనని ప్రకటించుటకు జగన్నాశమున కుద్యోగించెనే కాని. సేయులేదుగదా! జగద్వినాశనమున కమ్మహానుభావుండు సాహసించినచో నడ్డగించువారెవ్వరు ! 1178

సుశీలుఁడు

రాముఁడు చెట్టుచాటునదాఁగి వాలిని వధించుట దోషము, నసామర్థ్యముకాదా ? 1179

వరవరముని

దీనివిషయములో నీయభిప్రాయమేమి ? 1180

సుశీలుఁడు

వాలికి నింద్రుఁడు కాంచనమాలికనిచ్చి యీమాలిక నీమెడలో నుండునప్పుడు నీతో సంగరమొనర్చువాని బలములో నీకు సగమువచ్చును. నీసహజబలము నీకేయుండునని వరమిచ్చెననియు నీహేతువుచే వాలి యుద్ధమునకేగునప్పుడెల్ల నీమాలను ధరించుననియు గోలభమాయావి దుందుభుల వధింపఁగలిగెననియు రావణు నోడింపజాలెననియుఁజెప్పుదురు. ఈవరప్రభావంబు సుగ్రీవుని చేవిని దాశరథి జడిసి యిట్లుసేసెనని మతాంతరు లాక్షేపింతురు. 1181

వరవరముని

ఇంద్రుఁడట్టివరంబు వాలికిచ్చినది నిశ్చయంబెకాని యవ్వరంబు గోలభరణాదుల జయించెంగాని సర్వశక్తుండగు రాముని వారింపఁ జాలదు. 1182

సుశీలుఁడు

శ్రీరామునకట్టి భయంబులేనిచో వాలి నెదిరించి చంపరాదా?

వరవరముని

ఎదిరించి చంపినచో నింద్రునివర మబద్ధంబగు నవ్వరం బసత్యమైనతోడనే వాసవునకువృజినాపయశస్సులు వాటిల్లు నింద్రుని విపత్తుఁ దొలంగింపనెంచి రావణసంహారార్థ మవతరించిన రామప్రభు వింద్రునకపఖ్యాతి సంపాదింపరాదనియట్లుండఁగా రామునిఁగాంచినతోడనే వాలి కిష్కింధకుఁ బాఱిపోవును. 1184

సుశీలుఁడు

కౌసలేయుఁడు వాలి వెంటఁబడియైన చంపరాదా? 1185

వరవరముని

పదునాలుగుసంవత్సరములవఱకు జానకీవల్లభుఁడు పత్తనములో బల్లెలలోఁగాని ప్రవేశింపరాదు. 1186

సుశీలుఁడు

పదునేనవయేట వధింపవచ్చునే! 1187

వరవరముని

పదునాలుగేడులు దాటకముందే రామునిఁజూడనిచోఁ బ్రాణములు విడుతునని శాబ్దిసేసిన భరతునకు నందిగ్రామములో ముప్పు వాటిల్లును. 1188

సుశీలుఁడు

ఈలోఁగా వెళ్ళి భరతస్వామి నూరార్చి మరలఁ గిష్కింధకు రావచ్చునే. 1189

వరవరముని

రావణుఁడు రెండుమాసములు గడువుపెట్టు నీలోఁగా రాములవారు రావణసంహారంబు సేయకున్నఁ బ్రాణములు విడుతునని భూపుత్రి నిశ్చయించుకొనియున్నది. 1190

సుశీలుఁడు

రావణునివధించి జానకీదేవిచెఱసాలవదలించి తరువాత వాలిని వధింపరాదా? 1191

వరవరముని

వాలినివధించువఱకు వానరసైన్యము సుగ్రీవున కధీనముగాదు. సైన్యహీనుఁడైన సుగ్రీవునివల్లఁ బ్రయోజనములేదు. 1192

సుశీలుండు

సుగ్రీవునివిడిచి వాలితో స్నేహమొనర్పరాదా ? 1193

వరవరముని

వాలితో స్నేహించినచో వాలి రావణుల కగ్నిహోత్ర సాక్షిగాఁ జేసికొన్న స్నేహవిషయప్రతిజ్ఞ యున్నది. తత్కారణంబున వాలి రావణులు జీవించియుండఁగాఁ బరస్పర వైరంబున కుద్యోగింపరు. వాలి రామునితో స్నేహించినప్పుడే రావణునిసహా శరణాగతునిఁ జేయును. రావణుఁడు శరణాగతుఁడు కాఁగానే రాముఁడు సంపనొల్లడు. రామావతారప్రయోజనంబు నిరర్థకంబగును. 1194

సుశీలుండు

వాలి సుగ్రీవులకు సంధికుదర్పరాదా ? 1195

వరవరముని

తమ్ముని భార్యను శిష్యజాయను కుమారికను గామించినవాఁడు వధ్యుడని ధర్మశాస్త్రప్రమాణమున్నది. సుగ్రీవపత్నియగు రుమతో వాలి భోగింపుచుండుటచే వాలి వధ్యుఁడు వధ్యుని బ్రతుకనీయుతా దవధ్యునిఁ జంపరాదు. కావుననే వాలి వధింపఁబడెను.

సుశీలుండు

వాలి యింద్ర నందనుఁడు. వాలికి రావణుఁడు లోబడి యున్నాడు. సునాసీరునకు దశాననుఁడు విరోధియై యున్నాడు. శక్రుఁడు వాలితోఁజెప్పి రావణు నేల చంపింపకుండెను. 1197

వరవరముని

ఆప్పని సాధ్యముగా దెట్లంటివేని లంకాపురంబునకు వాలి వెళ్ళి రావణునిఁ జంపనుంకించినచోఁ దదీయసైన్యంబులన్నియు వాలిని ముట్టడించును. కాంచనమాలాప్రభావం బొక్కనితో నెదిరించి నప్పుడు వాలికి జయమిచ్చునుగాని బలుమంది డీకొన్నప్పు డేమియుఁ

జేయఁజాల దదియట్లుండఁగా నింద్రజిత్ప్రయుక్త బ్రహ్మాస్త్రంబుచే వాలి తల్లడిల్లు. వాలి వారాశిపై సేతువునిర్మించి స్వకీయసైన్యంబుల నడపింపఁజాలఁడు. నాగపాశబంధంబుల సడల్పఁజాలఁడు. వెండియుఁ గుంభ నికుంభ కుంభకర్ణాతికాయాదు లజేయులు. అట్టి కర్కశనిశాచరుల వానరులు రామానుగ్రహంబుచేఁ జంపఁజాలిరి. వాలివంటి బలాఢ్యులు సహస్రసంఖ్యాకులైన నేమియుం జేయఁజాలరు. వీని నన్నిటిని మనస్సులోనుంచుకొని ముందేమి విపత్తు రానున్నదో యని యెంచి వాలి రావణునితో స్నేహించెను. దీని నెఱింగి నిలింపపతి రావణసంహారమునకు వాలిం బ్రేరింపఁడయ్యె. వాలి యుదాసీనుండై యూరకుండె. రామునకు వానరసేనాసాహాయ్యము నిమిత్తమాత్రమే కాని జయార్థముగాదు. రాముఁడు కోపించినచో రావణాదులనే కాక ముల్లోకములను క్షణకాలములో వధించును. దీనికిఁ దార్కాణముగా విభీషణుఁడు శరణాగతుఁడైనప్పుడు భయమొందిన సుగ్రీవుఁడు రాఘవునితో దేవా యివ్విభీషణుఁడు క్రూరుఁడు ముందు మనకపకారమొనర్చు నిప్పుడే వీనివధింపవలెనని పట్టుపట్టఁగా రామచంద్రుఁడు మందస్మితము సేసి సుగ్రీవునితో,

శ్లో॥ తతశ్శుభతరం వాక్య ముువాచ హరిపుంగవమ్
సుదుష్టో వాప్యదుష్టో వా కిమేష రజనీచరః
సూక్ష్మమప్యహితం కర్తుం మమాశక్తః కథంచన
పిశాచాన్ దానవాన్ యక్షాన్ పృథివ్యాం చైవ రాక్షసాన్
అంగుళ్యగ్రేణ తాన్ హన్యామిచ్ఛన్ హరిగణేశ్వర

సుగ్రీవా! యీరాక్షసుఁడు దుష్టుఁడుగానీ మంచివాఁడుగానీ నాకు నెప్పుడైనను గొంచెము కీడైనం జేయంజాలఁడు. జీవహింసాపరులై భూమియందుండు పిశాచములను దానవులను యక్షులను రాక్షసులను వ్రేలికొనతోనులిమి చంపుదు నయ్యాలస్యమునహా నీవుసహింప

వేని సంకల్పమాత్రముచే వధింతును భయమొందకుమని రవిపుత్త్రు నాజడించి విభీషణుని రక్షించెను. వింటివా రాముని సామర్థ్యము.

సుశీలుఁడు

మేఘనాదుఁడేసిన నాగపాశములచే లక్ష్మణసహితుఁడైన శ్రీరాముఁడు దేహావిస్మృతిం జెంది పడియుండెఁగదా! యప్పుడతని సర్వశక్తి యేమైనది? 1199

పరవరముని

'నాగపాశములచే శ్రీరాముఁడు మానుషత్వము వెల్లడింపుచుఁ గొంచెముసేపుండి వెంటనేలేచె నటుపిమ్మట వైనతేయ దర్శనముచే సర్పపాశములు నశింపఁగా రామలక్ష్మణులు నిర్వ్రణులై తేజస్వంతులై విలసిల్లిరి. దీనివల్లఁ బెరుమాళ్లు లోకమునకు బోధించిన నీతియేమనగా నాగపాశములు జయమొసంగినవి, ఇఁక మోసములేదని సంతోషించిన రావణుండు సకుటుంబ పరివారముగా మడియుటచే దుష్టునకు సిద్ధమై చేతికందినఫలమైనను విఫలమై వాఁడు నశించుననియు మృతప్రాయులై పడియున్న రామలక్ష్మణులులేచి విరోధులవధించి కార్యసిద్ధిఁ బ్రాపించిరిగనుక మహాత్ములకెంతవిపత్తు 'సంభవించిన నవ్విపత్తును తృణప్రాయముగాదాఁటి కృతార్థులగుదురనియు బోధించెను. మఱియు నీనాగపాశములను సంకల్పమాత్రముచే సడలింతు నంతమాత్రమైన నవరసములేకుండ మదీయభృత్యుండగు గరుడునిచే నశింపఁజేసితి. నాగపర్యంకశాయినైన నాకీవి యసాధ్యమాయని శ్రీరాముఁడు స్వశక్తిప్రభావమును లోకంబున కెఱింగించెను. వెండియు సంసారాబ్ధిలోఁబడి తల్లడిల్లుచున్న ముముక్షువు కొంతకాలమునకు భగవత్కృపచే ముక్తుండగుననియు బోధించె నింతేకాని చక్రవర్తి తిరుమకనాగు లశక్తులై పడియుండలేదు. 1200

సుశీలుఁడు

రాత్రియుద్ధంబున మేఘనాధ ప్రయుక్తాస్త్రములచే గోలాంగూల భల్లూక వానరసేన లఱువదికోట్లు మూర్ఛాగతులైపడియుండిరి.

వారితోఁ సమానముగా రామలక్ష్మణులును మూర్ఛాగతులైరి. తరువాత నాంజనేయులవారు దెచ్చిన సంజీవిచే లబ్ధసుఖులైలేచి రప్పుడు రాముని శౌర్య మేమయ్యెను. 1201

ప ర ప ర ము ని

మేఘనాదుండెప్పుడు రణంబునకువచ్చినను మేఘముల మాటునేసి కొని దొంగతనముగా వచ్చుచుండెను. ప్రత్యక్షముగా వచ్చినచో రామునిచే నెప్పుడో చచ్చును. ఇట్లువచ్చుచు నొక్కఁడేయి బ్రహ్మాస్త్రంబు ప్రయోగించె నయ్యవసరంబున లక్ష్మణుండు రావణికృత బ్రహ్మాస్త్రమునకుఁ బ్రతీకారము చేయఁబూనఁగా రాముండు సౌమిత్రింగని,

శ్లో॥ మన్యేస్వయంభూర్భగవానచింత్యో
యస్యైతదస్త్రం ప్రభవశ్చయోఽస్య
బాణావపాతాం స్త్వమిహాద్యధీమన్
మయా సహోవ్యగ్రమనాస్సహస్వ

లక్ష్మణా యియ్యస్త్రమున కెవ్వఁడు కారణభూతుడో యట్టి స్వయంభువును భగవంతుఁడైన బ్రహ్మ మహానుభావుఁ డమ్మహాత్మ్ముని గౌరవించుటకై యీపద్యాయమునకుఁ బ్రతీకారము చేయక సహింపుము. నేను నట్లేసహింతును. పిమ్మట నిద్దనుజుని వధింతమని చెప్పెను. దీనిచే నింద్రజిత్పరాక్రమము రామున కెంతసులభముగా నుండెనో గ్రహింపుము. కాఁగా లక్ష్మణుఁడొక్కఁడే యింద్రజిత్తుని వధించెనుగదా ! 1202

సు శీ లుఁ డు

లక్ష్మణుఁడు మహాపరాక్రమశాలియయ్యు నింద్రజిత్తునితో మూఁడహోరాత్రములు పోరనేల ? మొదటిదినమందే వధింపరాదా ?

వ ర వ ర ముని

ఇంద్రజిత్తును బ్రథమదినముననే వధించినచో లోకమున కింద్ర జిత్పలము గోచరింపదు. బలహీనుఁడనియే తెలియును. బలహీనునిఁ జంపిన లక్ష్మణుని పరాక్రమము ప్రసిద్ధిఁజెందదను కారణంబున స్వపరాక్రమ విఖ్యాతికై కాలవిళంబన మొనర్చెను. 1204

సుశీలుఁడు

రావణుశక్తిచే లక్ష్మణుఁడు మూర్ఛిల్లనేల ? 1205

వ ర వ ర ముని

మయుఁడు రావణునకు శక్తిబాణము నిచ్చునప్పుడు దశాననా యిది యమోఘం బెవ్వనిమీఁదఁ బ్రయోగింతువో వానినప్పుడే వధించును, బలవద్విరోధిపై బ్రయోగింపుము. బలహీనునిపై నేసినచో నిన్నే చంపునని చెప్పియుండుటచే నింద్రజిత్తుని జంపినవాఁడు మహాబలాఢ్యుండని యెఱింగి రావణుండాశక్తిని సౌమిత్రిపై బ్రయోగించెను. దానిని నిర్మూలింపనెంచియు సీతాపతి పరునితో ఒన్యమొనరించువాని బాణంబును దానుత్రుంపరాదను ధర్మమాలోచించి యోశక్తి వ్యర్థముగమ్మని పల్కెను. రామవాక్యంబుచే నాశక్తి వ్యర్థమై సౌమిత్రికిఁ గొంతవిపత్తుఁగలిగించి తొలంగె నటుపిమ్మట సంజీవిచే లక్ష్మణుఁడు మూర్ఛదేఱిలేచి తేజఃపరాక్రమాదులుగలవాఁడయ్యెను. దీనిచే దేలిన పర్యవసానమేమనఁగా నమోఘమైన శక్తి వ్యర్థమగుటయు లక్ష్మణుఁడు నిరపాయస్థితి నుండుటయు రామ ప్రభావంబుచేతనని యెఱుంగుము. 1206

సుశీలుఁడు

స్వామీ ! దేవరవారొసంగిన సమాధానంబులు భగవద్వైభవ విరోధులకు వాగ్బంధనమొనర్చుచున్నవి. ఇఁకఁ గృష్ణావతారమును గూర్చి ప్రశ్నింతు. దేవరవారు చక్రవర్తి తిరుమకనారులమీఁది ప్రేమనాపి యశోదానందనునిపై నిలుపుఁడు. 1207

వరవరముని

అందులకు సిద్ధుఁడనై యున్నాను. గోపాలకృష్ణ పరబ్రహ్మము నందు నీకు నేమేమి సందేహములుగలవో వానినిఁ బ్రశ్నింపుము. సమాధానమిచ్చెద. దేహికి జ్ఞానసంకోచముచే సందేహములు గలుగును. జ్ఞానవికాసముచే యాథార్థ్యము గోచరించును. విపరీతజ్ఞాని కెన్నటికిని యథార్థము గోచరింపదు. దీనికిఁ దార్కాణముగా భగవద్గీతయందు 1208

శ్లో॥ అవ్యక్తం వ్యక్తిమాపన్నం, మన్యంతే మామబుద్ధయః
పరంభావ మజానంతో, మమావ్యయమనుత్తమమ్

అర్జునా! యుక్తాయుక్తములను నిర్ణయించునది బుద్ధి. యట్టి బుద్ధి యేమాత్రము లేనివారు నిరతిశయమై నాశరహితమైన నాపరత్వము నెఱుఁగలేనివారై, ఇదివఱ కెక్కడనున్నది తెలియఁబడక యిప్పుడు జన్మించుటచే సందటికి గోచరింపుచున్న నొక రాజపుత్రుని వలెఁ నన్నుఁ దలంపుచున్నారు. 1209

శ్లో॥ అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్
పరంభావ మజానంతో మమభూతమహేశ్వరమ్

సర్వశరీరి సంరక్షణార్థమై మహా దయాసౌశీల్య సౌలభ్యములతో మనుష్యాకారమును బొందిన నన్నుఁగాంచి సర్వభూత మహేశ్వరుండనగు నాపరతత్త్వమును దెలియక మూఢులు సామాన్యమనుష్యునిగా భావించి నిందింపుచున్నారు. 1210

శ్లో॥ మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః
రాక్షసీ మాసురీంచైవ ప్రకృతిం మోహినీం శ్రితాః

రాక్షసి ఆసురి మోహినియను విపరీతజ్ఞానసంబంధమగు బుద్ధి నాశ్రయించి పుట్టిన దురాత్ములు నాయవతారముల దూషింతు రట్టి

వారి యాశలన్నియు వ్యర్థమగును వారిపుణ్యకర్మములు నిష్ఫలము లగును. వారిజ్ఞానములన్నియు వ్యర్థములగు నింతేకాక యచేతనము లను వారికి భేదముండదు. వెండియు వారి పాపంబు లక్షయంబు లగునుచుమిాయని భగవంతుఁడు సెప్పియున్నాడు. 1211

సు శీ లుఁ డు

దేవరవారు జన్మించినదాది భగవత్కృపాపాత్రులై విరాజిల్లు చున్నారు. నేనిక్కాలమునకు మీకృపకుఁ బాత్రుండనైతి నక్కారణంబునఁ బెరుమాళ్ళయందుఁగాని తదవతారములయందుఁగాని నాకు సంశయ మెంతమాత్రమునులేదు. కాని దుర్మతస్థులనూయాపరులై సర్వేశ్వరుని దూషించు దుర్వాక్యములకు సహింపలేకయు సమాధాన మియలేకయు సర్వజ్ఞులగు దేవరవారిచేవిని కృతార్థుఁడనగుట కిట్లడుగుచున్నాను. 1212

వ ర వ ర ము ని

పెరుమాళ్లయం దేవిదో దోషములున్నట్లు నేను సరిసేసినట్లు కుమతాగ్రేసరు లాలోచింతురు. నాయభిప్రాయ మదికాదు. సూర్యునిపై దుమ్మువోయఁగా గాలిచే దిరిగి పోసినవాని కన్నులలోఁబడినట్లు దోషరహితుఁడైన సర్వేశ్వరునియందు దోషారోపణ మొనర్చి మనుష్యుఁడు మనుష్యత్వమును వ్యర్థముచేసుకొని జన్మపరంపరలపాలై నరకాగ్ని కర్హుఁడు కాఁగూడదను హేతువుచే నిట్టికార్యమున కుద్యోగించితి నీకఁజాలును. ప్రశ్నలుమానుము. నేనునుఁ దూష్ణింభావమును వహింతు నందఱమేకీభవించి భగవద్గుణానుభవము చేసికొందము.

సు శీ లుఁ డు

మీరట్లు విసుకుఁజెందరాదు. పూర్వము ధర్మనందనునిఁగాంచి యక్షరూపియగు సమవర్తి లోకమునకు దిక్కెవ్వరని యడుగఁగా జ్ఞానులే దిక్కని వక్కాణించె నిప్పుడీలోకమున నాస్తికులై కొందఱు జీవులగు వివిధదేవతల నారాధించి కొందఱు, అచలపరిపూర్ణులై

కొందఱు, నవైదిక సిద్ధాంతంబునంబడి కొందఱు చెడుచున్నారు, మీఁబోటి పరమహంసలు భగవత్తత్త్వమును బూర్ణముగా నెఱింగింపనిచో మాబోటి స్వల్పజ్ఞాను లీగంగలోఁ గలియవలయును. ముందు రాఁబోవు భాగవతుల కుజ్జీవనమార్గమెట్లు. కావున మీరు శ్రమపడి బోధింపవలయునేకాని నిర్విణ్ణులు కాఁగూడదు. 1214

పరవరముని

శిష్యజనాగ్రేసరా,

శ్లో॥ యుక్తి యుక్తం వచోగ్రాహ్యం బాలాదపి శుకాదపి

యనునట్లు నీవాక్యములకు సంతోషించితి. మఱియు నేను సంసారవ్యాపారమునువర్జించి యత్యాశ్రమమును స్వీకరించియున్నాను.

శ్లో॥ యతిర్నారాయణం స్మరేత్ అనునట్లు సన్యాసియగువాఁడు సదా నారాయణుని స్మరింపవలె నట్లుచేయనిచో శ్వపచునికంటె నధముఁడని శాస్త్రోక్తిగలదు. కావున భగవద్విషయమును గూర్చి పట్టుదలతోఁ బ్రశ్నించు. భవాదృశచ్ఛాత్త్రుఁడు లభించినందువల్లఁ గృతార్థుండనైతి. భగవద్విషయ మాకర్ణించువార లున్నచో నెంతకాలమైన బోధింతు నెన్నిరాత్రులైన నిద్రను వర్జింతు నితరకార్యంబు లన్నియు మానుకొందు. శుకయోగి పరీక్షిద్భూవరు లేడహోరాత్రంబులు నిద్రాహారంబులువర్జించి భగవద్గుణానుభవముచేఁజొక్కి కృతార్థులైరి. ఇంతయేల భర్తనుఁబూజింపని మానిని గురుశుశ్రూషచేయని శిష్యుఁడు భగవత్సేవకంటె సంసారము నెక్కువగా భావించు భాగవతుఁడు భగవద్గుణ వర్ణనమునందు విసుకుఁజెందు బోధకుఁడు తడిలేని విత్తనంబు గతిఁ దఱిలోఁజేయని వ్యవసాయంబుభంగి నిష్ప్రయోజకు లగుదురు.

సుశీలుఁడు

చిత్తము చిత్తము ప్రభూ! భగవదవతారంబు లనంతంబు లందులో రామ కృష్ణావతారంబులు రెండును శ్రేష్ఠంబు లయ్యవతారద్వయంబునందు వ్యత్యాసమున్నచో నెఱింగింపుఁడు. 1216

### పరపరముని

పుత్రా! రామ కృష్ణావతారంబులు రెండును లోకోద్ధారకములే గనుక వ్యత్యాస మేమియుంగానరాదు. ఇంతకుఁ దదవతారతత్త్వము విధి శివ సనకాది యోగులకును బూర్తిగా గోచరింపదు. గోచరించి నప్పైనఁ దారతమ్యమునుగూర్చి చెప్పనచ్చునుగాని గోచరింపనివానిఁ గుఱించి యేమియుంజెప్పుటకు వీలులేదు. భగవదవతారానుభవ యుక్తులగు భక్తులలోఁ గొందఱు రామావతారము గొప్పదనియుఁ గొందఱు కృష్ణావతారము గొప్పదనియు వచింతురు. నాకుగోచరించిన దాని నెఱింగింతు నాకర్ణింపుము. 1313

(ఇక్కడ రెంటికివైచిన అంకెలప్రకారము చూడవలెను. తెలియును.)

| శ్రీ రామచంద్రస్వామి | శ్రీ కృష్ణస్వామి |
|---|---|
| 1 మాయామనుష్యుఁడు | 1 లీలామనుష్యుఁడు |
| 2 ఏకపత్నీకుఁడు | 2 బహుపత్నీకుఁడు |
| 3 ధనుర్ధరుఁడు | 3 పంచాయుధధారి |
| 4 సూర్యవంశజుఁడు | 4 చంద్రవంశజుఁడు |
| 5 సర్వదా తెలిసియుఁ దెలియనట్లు నటించువాఁడు | 5 కొంతసేపు సర్వజ్ఞత్వము కొంత నడి దంభాజ్ఞత్వము ప్రకటించువాఁడు |
| 6 బోయదాని యెంగిలిపండ్లచేఁ దృప్తిఁజెందినవాఁడు | 6 ద్రౌపదీశాకలవముచేతను విదురాన్నము చేతను గుచేల పృథుకములచేతను దృప్తిఁజెందినవాఁడు |
| 7 రావణునితో నొంటరిగాఁబోరి వచ్చిన సుగ్రీవునిఁగాంచి యిట్టి సాహసకృత్యము చేయకుము. నీకపాయము కలిగినచో సీత | 7 రాయబారమునాఁడు సుయోధనునితోఁ బాండవ దూతనని యును బాండవులు నాబహిఃప్రాణంబులని చెప్పినవాఁడు |

**శ్రీ రామచంద్రస్వామి**

తోను నిజశరీరముతోను బని లేదు. నీవు నాప్రాణతుల్యుఁడవని యాదరించినవాఁడు

8 ఒక్కసారి శరణాగతుఁడైన వానికి సర్వభూతముల వల్ల నభయమిత్తునని వ్రతము పూనినవాఁడు

9 భరతునకు రాజ్యమిచ్చి తానరణ్యమునకేగినవాఁడు

10 వానరులను ప్రభావసంపన్నులఁజేసినవాఁడు

11 స్వయముగా వైదికధర్మంబుల ననుష్ఠించిచూపినవాఁడు

12 దుష్టుల నిగ్రహించి శిష్టులరక్షించినవాఁడు

13 తండ్రిమాటకై రాజ్యంబువిడిచినవాఁడు

14 సత్యవాక్యధురంధరుఁడు

15 పవిత్రగృహమేధి

16 భరతుని శాబ్దికైగడువులోగా నయోధ్యకుఁజేరినవాఁడు

**శ్రీ కృష్ణస్వామి**

8 ధర్మములన్నియు విడిచినన్నొక్కనినేశరణుఁజెందినచో సర్వపాపములనుండి విడిపింతుననినవాఁడు

9 ఉగ్రసేనునకు రాజ్యమిచ్చి తానుప్రతినిధిగానుండిన వాడు

10 గోపీగోపార్భక గోపాలీగోపాలకులఁప్రభావసంపన్నులఁజేసినవాఁడు

11 వైదికధర్మంబులన్నియు గీతాశాస్త్రంబుచేబోధించినవాఁడు

12 మహా బలాఢ్యుల నందఱిని వధించి భూభారముఁదొలంగించినవాఁడు

13 భక్తుడగు భీష్ముని మాటకై ప్రతిజ్ఞవిడిచినవాఁడు

14 రసికజనాగ్రేసరుఁడు

15 అస్ఖలిత బ్రహ్మచారి

16 అర్జునశాబ్దికై సూర్యాస్తమయములోఁగా సైంధవునిఁగూల్పించినవాఁడు

## శ్రీ రామచంద్రస్వామి

17 ధనుర్భవబాణంబులచే సము
ద్రోదకమును ఛీల్చినవాఁడు

18 నీటిపైఁ గొండలఁ దేలించిన
వాఁడు

19 నిరుపేదయగు త్రిజటునకపా
రైశ్వర్యము నిచ్చినవాఁడు

20 పాదరజస్సుచే నహల్యా శాప
ముఁదొలఁగించి సురూప మొ
సంగినవాఁడు

21 పక్షియైన జటాయువునకుని
షాదస్త్రీయగుశబరికి మోక్ష
మొసంగినవాఁడు

22 బ్రహ్మాదత్తనృపాలశాపము
నడచినవాఁడు

23 ఖరదూషణాదుల వధించున
ప్పుడును రావణమూలబలము
లనుఱుమాడునప్పుడును వేన
వేలరామరూపములు కనపఱచి
నవాఁడు

24 రావణవధానంతరంబున నడివ
ఱకు మృతులైనవానరసమూ
హంబులఁబ్రతికించినవాఁడు

25 స్వకావతార నిదర్శనార్థము

## శ్రీ కృష్ణస్వామి

17 ములుకోలచలనకోలలఁ బట్టి
అష్టాదశాక్షౌహిణుల సేనం
గూల్చినవాఁడు

18 కొనగోటితో గోవర్ధనగిరినెత్తి
నవాఁడు

19 నిరుపేదయగు కుచేలున కపా
రైశ్వర్యమునిచ్చినవాఁడు

20 హస్త స్పర్శముచేఁ గుబ్జ
కురూపముఁదొలంగించి మహా
సౌందర్య మొసంగినవాఁడు

21 గోపీగోపాల పూతనాశిశుపాల
కంసాదులకు మోక్ష మొసం
గినవాఁడు

22 నృగావనీశ శాపముఁ దొలఁ
గించినవాఁడు

23 గోకులంబున యశోదాదేవికి
యమునానదియం దక్రూరు
నకు నుభయసేనామధ్యంబునం
దర్జునునకు విశ్వరూపంబుఁ
జూపించినవాఁడు

24 సాందీపని పుత్రుని వైదిక
పుత్రుల నుత్తరాకుమారుని
బ్రతికించినవాఁడు

25 స్వకావతారనిదర్శనార్థ ముద్ధ

| శ్రీ రామచంద్రస్వామి | శ్రీ కృష్ణస్వామి |
|---|---|
| హనుమద్విభీషణుల చిరకాలజీవులుగానుంచినవాఁడు | పుని బదరికాశ్రమంబున నుంచినవాఁడు |
| 26 విరోధియగు మారీచునకునిరంతరము రామాకారసహస్రంబును బ్రదర్శించినవాఁడు | 26 విరోధియగు కంసునకు నహర్నిశము కృష్ణాకార సహస్రంబును బ్రదర్శించినవాఁడు |

మున్ను మొత్తముమీఁద రామ కృష్ణావతార ద్వయంబునందును మాహాత్మ్యము సమానముగానే ప్రకటించెను. కాని కొంచెము వ్యత్యాసముండిన నుండవచ్చును. రామావతారకాలంబున నేకాదశ సహస్రవర్షంబులు భూమిపై నుండెను. కృష్ణావతారసమయంబున వింశత్యుత్తర శతసంవత్సరంబు లుండెను దక్కినవిషయంబులు పాఠకులు నిశ్చయించుకొందురుగాక. 1218

సుశీలుఁడు

రామకృష్ణుల శరీరములు పాంచభౌతికములా పంచోపనిషన్మయంబులా ? 1219

వరవరముని

జీవులకుఁ బుణ్యపాప కర్మానుగుణముగాఁ బ్రాకృత శరీరంబులు వచ్చుచున్నవి. పరమాత్మకు స్వేచ్ఛానుగుణముగా శరీరములు వచ్చునుగనుక రామ కృష్ణుల శరీరంబులును మత్స్య కూర్మ వరాహ నారసింహాద్యవతారంబులును పంచోపనిషన్మయంబులేగాని భౌతికసంబంధ తుచ్ఛశరీరంబులుగావు కాఁబట్టియేకదా గోవర్ధన మందరగిరులు మోచునప్పుడును విలయకాలమందుఁ బాతాళగతమైన భూమి నుద్ధరించునప్పుడును బహువిధ రాక్షస సంగరములలో ననేక శస్త్రాస్త్ర హతులఁ బ్రాపించినప్పుడును భగవద్దివ్యదేహమున కీష

దపాయము సంభవింపలేదు. ఇంతేకాక సీతామహాదేవి లంకలో నుండుతఱిఁ బదిమాసంబులు నిద్రా నీరాహారంబులు మానియు శరీరము నిరపాయముగాఁ గాపాడెను. సౌమిత్రి వనస్థుఁడై బహుకాలము నిద్రాహారంబులుమానియు బడలికఁజెందక మేఘనాదాతికాయాదుల వధించెను. భగవత్సంబంధుల శరీరము లాప్రకారముగానుండఁగా భగవచ్ఛరీర మెంత ప్రభావముగలదో యాలోచించి సంతోషింపుము.

సుశీలుఁడు

రామకృష్ణుల శరీరములలోఁ గొన్నియుద్ధంబులయందు నప్పుడప్పుడు రక్తముకారుచున్నట్లు పూఁచిన తంగేడుచెట్లువలె నున్నట్లు కావ్యములయందు వినుచున్నాముగదా? 1221

వరవరముని

నికషముచే నొరసినకొలఁది బంగారమునకుఁ గాంతి హెచ్చునట్లును సానఁబట్టినకొలంది రత్నము తేజస్వంతమగునట్లును జన్యరంగంబున వైరి బాణపాతముల కధీనమైనప్పుడు భగవద్దివ్యమంగళవిగ్రహమునందుఁ గాంతి వృద్ధిఁజెందు నది ప్రాకృతమనుష్య నేత్రములకు రక్తమువలెఁ గాన్పించు దివ్యదృష్టిగలవారి కున్నదున్నట్లు గోచరించు నక్కారణంబునఁ బెరుమాళ్ళకు బాధకలైనేయని దుగిళింపరు.

సుశీలుఁడు

ఖర రావణాదులతో సర్వేశ్వరుఁడు పోరునప్పుడు ముని నిలింపులు భగవంతునిఁగాంచి తాలుమాలైనట్లు గ్రంథములలోఁ గనుపట్టుచున్నదే! 1223

వరవరముని

పెరుమాళ్లు రణకర్కశులగు రాక్షసుల వధించునప్పుడు వారి ధైర్య శౌర్యములు కుంచుటకై మిక్కిలి భయంకరాకారము ధరించు నయ్యాకారము దర్శింపలేక ముని నిలుంపులు పరితపించెదరుగాని భగవంతునకుఁ గష్టము గలిగెననికాదు. 1224

సుశీలుఁడు

భగవదాకారము ప్రతికూలురకు భయంకరముగా నుండుట సహజముగాని యనుకూలురకుసహా యట్లేయుండునా ? 1225

వరవరముని

పరిమితముగానున్నప్పుడు భగవదాకారము విరోధులకసహ్యమై భక్తులకు సహ్యమైయుండును నపరిమిత తేజస్సహితమైనప్పు డందఱికి సహింపరానిదై యుండును. దీనికిఁదార్కాణముగా హిరణ్యకశిపుని-జంపినప్పుడు నరసింహుని బ్రహ్మరుద్రాదులు సహితము దర్శింప-జాలరైరి. శ్రీకృష్ణ విశ్వరూపమును సహింపలేక యదృశ్యము చేయుమయ్యాయని నరుండు మొఱబెట్టెను. శ్వేతద్వీపవాసుఁడగు నారాయణుని దర్శింపలేక నారదుండు మూర్ఛిల్లెను. గోవత్స గోపార్భకుల నంతర్ధానముసేసినబ్రహ్మ బృందావనంబున గోచరించిన యశోదా సుతుని దర్శింపలేక తబ్బిబ్బు జెందెనుగదా ? 1226

సుశీలుఁడు

శ్రీకృష్ణుఁడు గోపకన్యావస్త్రాపహరణం బొనర్చుటయుఁ బరస్త్రీలగు గోపికలతో సంభోగముచేయుటయు దోషంబుగాదా ? 1227

వరవరముని

గోపకన్యామణులు చిరకాలమునుండి సర్వసంగ పరిత్యాగం బొనర్చికృష్ణుని మోహించి యప్పురుషోత్తముఁడు మగండగుంగాక యని వ్రతంబుసల్పి వస్త్రంబులు నదీతటంబునందుంచి స్నానమొనర్చుచుండి రయ్యవసరంబున భక్తపరాధీనుండును దయాసముద్రుండు నగు నందనందనుఁ డేకాకియై యచ్చటికివచ్చి గోపాంగనలభక్తి తనయందు నిశ్చలమై యున్నదా లేదాయని పరిశీలించుట కంబరంబులు హరించి భక్తి నిర్మలముగానుండు టెఱింగి వరంబొసంగె. 1228

సుశీలుఁడు

వారిని దిగంబరులఁజేసి మ్రొక్కించుకొని మర్మస్థానంబులు వీక్షింపవచ్చునా ? 1229

వ ర వ ర ము ని

భగవంతునకు సంతర్బహిర్విషయంబులు లేవు. గారడివిద్య చూచువానికి నద్భుతముగానుండును చేయువానికిఁ లేదుగదా! గోపికల కప్పటికి లోకాభిమాన దేహాభిమానములు వర్జించి రా లేదా యని పరీక్షించుటయే కృష్ణునికార్యము. 1229

సు శీ లుఁ డు

పరాంగనాసంయోగంబు ధర్మమేనా? 1230

వ ర వ ర ము ని

నారాయణునకు స్వకీయ పరకీయులు లేరు. సర్వమున కతం డీశ్వరుం డతని కిష్ట వినియోగార్హముగాని వస్తు వీజ్జగంబున లేదు. అవాప్త సమస్తకాముండగుటచే నతనికిఁ గామంబు లేదు. స్వాశ్రితుల కామంబులు నెఱవేర్చుటయే యతని యుద్యోగము. బాలుండు స్వకీయ ప్రతిబింబముతో నాడుకొనునట్లు కృష్ణుండు తన్నువలచిన గోపికలతో రమించి వీర్యస్ఖలన మొనర్పక వారివాంఛితంబుఁ దీర్చి భక్త పరాధీనత్వము వెల్లడించెను. వాసుదేవునితో భోగించిన వల్లవాంగనలు పరమపవిత్రలై త్రిలోకపూజ్యలై వైష్ణవ, పాద్మ, భాగవత, హరివంశాదులయందు మునిస్తుతప్రభావలైరి. వెండియు వైరాగ్యనిధియు మహాయోగియునగు శుకుండు పరీక్షిద్భూవరునకుఁ జరమదినంబున గోపికా కృష్ణలీలా మాహాత్మ్యంబు వినిపించి ముక్తికనిచెను. గోపికలయందుఁగాని కృష్ణునియందుఁగాని దోషారోపణచేయువారు నరకాగ్నియం గూలుటకాకదుఁ దదుపరి క్రిమి కీటకాది జన్మములెత్తి బాధ లొందుదు రిందులకు సందియంబు లేదు. 1231

సు శీ లుఁ డు

భర్తనువిడిచిన లేమకు దుర్గతికలుగునందురుగదా! కుల గోత్ర పుత్ర సహోదర బంధువర్గములవిడిచిన గోపాంగనలకు మంచిగతి యెట్లుకలిగెను? 1232

వ ర వ ర ము ని

జననీ జనక సహోదరాదులును పుత్రవర్గంబులును భార్యకు భర్తయు భర్తకు భార్యయుఁ బూర్వకర్మానుసారముగా నొకరికొకరు లభింతురు. నదీప్రవాహంబునఁబోవు దారువులు నీటిసుడిలో నేకీభవించి మరలఁ దేనిత్రోవ నది పోయిన తెఱంగునఁ గాలప్రవాహమున కధీనులగు శరీరులు సంసారమను సుడిగుండములో నేకీభవించి కొన్నాళ్ళ కెవరిత్రోవను వారుపోవుదురు. ఇంటిపైవేసిన వాసములకుఁ బెండెలకు నన్యోన్య సంబంధము కుదురుటకై యినుపమేకులతో బిగించినట్లు సర్వజ్ఞుండగు భగవంతుఁడు, మనుష్యులు లోకంబున సంసారసుఖంబు లనుభవించుటకై తల్లి దండ్రులయందుఁ గుమారుఁడు నన్నలయందుఁ దమ్ముఁడు, భర్తయందు భార్యయు నుపాధ్యాయుని యందు విద్యార్థులును భయ భక్తి విశ్వాసములుగలిగి సేవింపవలెననియు జననీజనకులు పుత్రాదులయందు నగ్రజులు కనిష్ఠులయందు భర్త భార్యయందు ననురాగముగలిగి పోషింపవలెననియుఁ గొన్నిధర్మములు విధించెను. ఈధర్మంబు లీలోకసుఖంబును స్వర్గలోకసుఖంబు నిచ్చు మోక్షమీయఁజాలవు. కాబట్టియే వివాహకాలంబున దంపతుల నగ్నిహోత్రసాక్షిగా బాసఁజేయించునప్పుడు ధర్మేచ, అర్థేచ, కామేచ, నాతిచరామి—అనఁగా ధర్మార్థకామములయం దొకరి నొకరతిక్రమింపఁగూడదని చెప్పించినారుగాని మోక్షవిషయము నుచ్చరింపలేదు. ధర్మార్థకామములకుఁ ద్రివర్గమని పేరు. ఈ త్రివర్గము సామాన్య ధర్మము. మోక్షోపయోగ సాధనము విశేషధర్మము. సామాన్యధర్మమును విశేషధర్మము గెలుచును, విశేషధర్మమును సామాన్యధర్మము గెలువఁజాలదు. సామాన్యధర్మ మచ్యుతుని సమీపింపఁజాలదు. విశేషధర్మము మాధవునిఁ గాచుకొనియుండు. పరస్పర విరోధము లేనప్పుడు రెండింటి ననుష్ఠింపవచ్చును. విరోధముకలిగి నప్పుడు సామాన్య ధర్మమును విసర్జింపవలయు నందువల్లనే

ప్రహ్లాదుఁడు భక్తి విరోధియైన తండ్రి ననాదరించెను. విభీషణుఁ డన్నను, గోపికలు భర్తలను విడిచి మధుసూదనుని నాశ్రయించిరి.

సుశీలుఁడు

సర్వకాల సర్వావస్థలయందు రక్షించిన భర్తను భార్య విడువ వచ్చునా ? 1234

వరవరముని

పురుషుఁడు వంశవృద్ధికొఱకును గాను సౌఖ్యముకొఱకును భార్యనుఁ బరిగ్రహింపుచున్నాడు. భార్యయుఁ దనసౌఖ్యమునకై భర్త నాశ్రయింపుచున్నది. భార్య చిరకాల రోగముచేఁ బీడింపఁబడుచుం డఁగాఁ బురుషుఁడు ద్వితీయ వివాహమునకు యత్నింపుచున్నాడు. భర్త నిష్ప్రయోజకుఁడైనప్పుడు పెండ్లాము నిర్లక్ష్యముసేసి దూషించి విడుచుచున్నది. దీనికుదాహరణముగా నిన్నువిడవనని పెనచుకొని యున్న దమయంతిని నలుండు నట్టడవిపాలుసేసి స్వేచ్ఛానుసార ముగాఁబోయెను. మహాసభలో ద్రౌపదీ వస్త్రాపహరణం బానర్చు చుండఁగా భర్తలైదుగురు చిత్రప్రతిమలభంగిఁ గాంచుచుండి రయ్య వసరంబున నిరుపాధికబంధువగు నారాయణుండేగదా రక్షకుఁడైనాడు. కావున భగవద్రుచి కలుగకముందు సామాన్యధర్మవర్జనము మోస మగుంగాని భగవదాశ్రయము దొరకినపిమ్మట లౌకికధర్మములువిసర్జిం చినచోఁ గొఱంత లేకపోగా మహాప్రభావ మాపాదిల్లునుగావున గోపాంగనలు లౌకికధర్మంబులువిడిచి ముక్తిప్రదుఁడగు శ్రీకృష్ణు నాశ్రయించి ధూతకల్మషలై పూతచరిత్రలై యోగినులై యోగి వంద్యలై కవిస్తుత్యలై యపవర్గముఁబ్రాపించిరి, వెండియు జ్ఞాన భక్తి వైరాగ్యములు గోపాంగనారూపంబులు ధరించెనని యెఱింగి నమస్క రింపుము. పెరియాళ్వారు గోపికనై హరింగొల్వనైతినని చింతించిరి. విష్ణుచిత్త తనూజయగు గోదాదేవి గోపికావేషము ననుసరించి తిరు ప్పావు పాడెను. నమ్మాళ్వారు గోపికావేషము మానసికముగాధరించి హరిపైఁ బాటలువాడెను. 1235

సుశీలుఁడు

శ్రీకృష్ణుండు కాముకుండుగానిచో నెనిమిదిమంది పట్టమహిషులను బదియాఱువేల రాజకన్యలను భార్యలుగాఁ బరిగ్రహింపనేల?

పరమముని

దేవకీనందనుఁడు కాముకుండుకాఁడుగాని భక్తపరాధీనుండని యిదివఱకే నొక్కి వక్కాణించితి. ప్రతిరాజకన్యామణియు గోవిందుని మోహించి యుత్తరములు వ్రాయఁగా రుక్మిణీ సత్యభామాది కాంతల నెనిమిదిమందిని మాత్రముపట్టమహిషులుగఁ బరిగ్రహించె. దేవకీనందనుఁడు నరకాసురుని వధింపఁగా నంతకుఁ బూర్వ మయ్యసురునిచేఁ గారాగృహమునందుంచఁబడిన షోడశసహస్రాంగనలు బంధవిముక్తలై నందనందనుని మోహించి ప్రార్థింపఁగా నమ్మహాపురుషుఁడు నాకవసరములేదు మీమీనివాసస్థలములకుం బొండని బోధించెంగాని రాజాంగన లప్పలుకులకులికి దేవకీసుతునితో నిట్లనిరి. నాథా బహుకాలము క్రిందట దురాత్ముండగు నరకాసురుండు మమ్ములమోహించి యిచ్చోటికిఁదెచ్చి తన్ను మే మంగీకరింపకున్నఁ గోపించి యంగీకరించువఱకిందుండుడని చెఱసాలలోవైచి కారించె నదిమొదలు, 1236

సీ॥ ప్రసవించి బాములువడి మమ్ముఁ బెంచిన
జననుల గారాముఁ బనవి పనవి
తరుణంబులో మమ్ముఁ దగినవరులకీయఁ
దలపోయు జనకులఁ దలఁచి తలఁచి
సదయాత్ములై మమ్ముఁ గదిసి లాలించెడు
నన్నదమ్ములమాటలెన్ని యెన్ని
వరులతోఁ గూడి కాఁపురములొనర్చు తోఁ
బుట్టులేమలసొంపుఁ బొగడి పొగడి

నిద్ర లేక మంచినీరంబుఁ గ్రోలక
బువ్వఁ దినక మిగుల నెవ్వలొంది
యేడ్చుచున్న మమ్ము నీనాఁడు చెఱఁదొలం
గించి ప్రోచినావు కృష్ణదేవ. 1237

శా॥ కారాగారముఁ బాసినామిఁకను సౌ,ఖ్యంబబ్బెనంచున్ నిజా
గారావేశన మాచరించిన మముం, గన్నారవీక్షించి మా
వారైనం బెరవారలైనఁ గృపతో, వర్ణించి లాలింప రె
వ్వారో వీరని దీర్ఘకాలమగుటన్, వామాలతాంతాంబకా.

శా॥ మా వారాదరణంబు సూపినను స,న్మానించి రాజాత్మజుల్
దేవా! పెండిలిఁ జేసికొందురె పరా,ధీనత్వ మేపారఁగా
రావాసంబొనరించినారు మునుపీ, రామాచయంబంచు సం
సారంబెక్కడ సౌఖ్యమెక్కడిది మా,జన్మంబు లింకేటికిన్

చ॥ నరకుని యింటనున్న నొక,నాఁడును దోషమెఱుంగమైతి ని
ప్పరమరహస్య మెవ్వరికి, భావ్యముగా దఖిలాంతరాత్ముఁడై
పరగెడు నీకుఁ దక్క మము, భార్యలఁగాఁ దలపోసి ద్వారకా
పురికి బిఱానఁ దీసికొని,పోయి వివాహముఁ జేసికొమ్మికన్.

ఉ॥ ఈ లలనాకదంబకము, లెక్కుడు దుఃఖముఁ జెందినారు మా
పాలిటి మృత్యువీ దనుజ,పాలకుఁడంచును నేటిదాఁకఁ, ని
క్కాలమునందు నీసొబగుఁ,గాంచి సుఖించినదాది చేసెబో
మేలు ధరాసుతుండనుచు, మిక్కిలి సన్నుతిసల్పి రచ్యుతా 1241

ఉ॥ చిన్నది! నీసురూపమును, జేరికనుంగొనుటాఁడిగాఁగ మా
కన్నులు చన్నులున్ మృదుల,కాయములున్ సుకపోలముల్ తొడల్
సన్నని మధ్యముల్ విపుల, సంభ్రమమొందెను దాఁకఁగోరి వి
ద్వన్నుత కౌఁగిలింపుము ని,వారణ చేయుము మన్మథవ్యథన్ 1242

చ॥ నరకునిఁగాంచుచుండిన దినంబుల నెంతటికష్టమబ్బెనో
సరసిజనాభ నిన్గనిన,సావియు నంతటిసౌఖ్యమొందె ని
ర్భరతవహించినామిఁకను బాయక రోయక డాయనిచ్చి మా
గురుతర వాంఛఁదీర్పు మొనఁ,గూడను గిరితి నీకధోక్షజా. 1243

సీ॥ గర్భనరకమందు దుర్భరంబుగఁ గొంత
కాలంబు వడినట్టి గాసిదోలఁగ
వరుసగా శైశవావస్థయందు మలిన
తనులమై పొందిన తాపముడఁగ
నవయౌవనమునందు ధవులులేకిన్నినా
ళ్ళనుభవించిన మన్మథార్తి డిందఁ
గాఁపురంబున భావికాలంబునందు రాఁ
బోవుకొఱంత లిప్పుడె నశింపఁ

గానఁబడితివీవు కల్పవృక్షముభంగి
విడువవలదు మమ్ము విడిచితేని
వపువులెల్లవీడి వచ్చుజన్మములందు
నిన్నుఁబొందఁగలము నీరజాక్ష. 1244

ఉ॥ ముద్దులమూటఁగట్టు నవ,మోహనవిగ్రహుఁడైన నిన్ను మే
మిద్దినమందుఁగాంచి యుర,హిం దరిఁజేరియు మాటలాడియుం
గ్రద్దన నూరకేగుదుమె, కాదనకీనవలాలనెల్ల ని
రొద్దకుఁజేరఁదీసి మద,నోత్సవలీలల నాదరింపుమా. 1245

మ॥ ధరకుం ధారుణివై యనంగునకుఁ గందర్పుండవై లక్ష్మికిం
దిరవై హేళికి హేళివై శుచికి సం,దీప్తాగ్నివై యామినీ
కరబింబంబునకుం సుధాకరుఁడవై, కన్పట్టు నిన్నే మనో
హరుగానెంచితి మన్యుఁగోరమిఁక మా,యారాటముం బాపుమా

వ॥ అని బహుభంగులఁ బ్రార్థించిన సరోజనాభుం డంగీకరించి యారాజకన్యల ద్వారవతికిఁ దెచ్చి పదియాఱువేల మేడలు గట్టించి పదియాఱువేల పురోహితులఁ బిలిపించి పదియాఱువేల కృష్ణాకారంబులు ధరించి యొక్క శుభలగ్నంబునఁ బదియాఱువేల రాజకన్యలం బెండ్లియాడెను వింటివా నందనందనుని నిష్కామవ్యాపారమును నతని మోహించివచ్చిన తరుణీలలామంబుల సంభ్రమంబును. 1247

సుశీలుఁడు

శ్రీకృష్ణుం డింతమందిని స్వీకరించినాఁడుగాని నిధువనాదులచే సంతోషపఱచి సౌహిత్య మొందింపఁజాలినాఁడా ? 1248

వరవరముని

దీనికి సమాధానముగా నొక్క కథను వక్కాణింతు నాలకింపుము. తొల్లి దశాననుండు పదివేలభార్యలను, దశరథుండు మూఁవందలభార్యలను సంపాదించి వారికామంబుఁ దీర్పఁజాలక కావలియందుంచి బాధ పెట్టుచు దినమున కొక్కభార్యతోఁ గాలంబుఁ గడపిరి. కలియుగంబున భర్తృహరి యను కవీశ్వరుఁడు దినమున కొకతెగా నుంపవలయునని మూఁడువందల యఱువదిమంది భార్యలను బరిగ్రహించి వారికామంబుఁ దీర్పలేక యపకీర్తికి భాజనుండయ్యెను. వెండియు ననేకకాముకులిట్లే వ్యర్థులైరి. మన గోపాలకృష్ణుండట్టి వ్యర్థుండుగాఁడు. ఎనిమిదేండ్ల ప్రాయంబు మొదలు పదియేను వర్షంబుల వయస్సువఱకు బృందావనంబునందు గోపికలు మోహింపఁగా నొక్కొక్క గోపాంగనకు నొక్కొక్క కృష్ణుఁడై మూడులక్షల యేబది వేలమందితో నేకకాలంబున భోగించె నట్టితఱి వల్లవీరత్నంబు లచ్యుతునిఁ గాంచి దేవా! సంసారవ్యాపారంబులుమాని నీసన్నిధిఁ జేరితిమి. నీవీర్యం బమోఘంబుగావున సంతానవృద్ధిఁ గావించు నది లేకుండ భోగముమాత్రము ప్రసాదింపుమని నుతింపఁగా నందసుతుం డట్లగుంగాకయని యంగీకరించి వీర్యస్ఖలనమొనర్పక వ్రజాంగనలతో రమించి

సాహిత్యమొందించి యానందింపఁ జేసెను. ఇట్టి యద్భుతంబెచ్చటనైన వింటివా! అదియట్లుండ నిమ్ముద్వారకాపురంబున దేవకీనందనుఁడు షోడశ సహస్రాష్టోత్తరశతజాయామణులతోఁ గూడి సుఖించుచుండఁగా నమ్మహిమంబుఁ జూడవలయునని నారదుం డొక్కనాటి సాయంకాలంబున ద్వారవతిడాసి రుక్మిణీమందిరంబునకరిగె నమ్మందిరంబున హేమపర్యంకంబున హంసతూలికాతల్పంబుపై గోవిందుండు కూర్చుండియుండెను. రుక్మిణీదేవి చేటీసమూహ పరివృతయై హరికి వింజామరంబు వేయుచుండె నత్తరుణంబున జనార్దనుండు పర్యంకంబునుండి దిగ్గన డిగ్గి నారదుని పాదంబులు గడిగి తదీయతీర్థంబును శిరస్సున ధరించెను. కాని యెవ్వాని పాదోద్భవియైన గంగానది త్రిలోకంబులు పవిత్రము చేయుచున్నదో యట్టి పురాతన లోకగురుండగు మధుసూదనుండు తనపాదతీర్థంబును స్వీకరించినందులకు నారదుండు లజ్జసహితుండై యుండఁగాఁ గమలాక్షుం డమ్మునింగాంచి పారికాంక్షీ! నీకేమి కావలెనని సవినయంబుగా బ్రశ్నించె నప్పలుకులకలరి దేవముని దేవదేవునితో దేవకీపుత్రా! నీవీ లోకంబున జనించి సుజనుల వేధించు దుష్టులనధించి ధర్మసంస్థాపన మొనర్చి భక్తులఁ గాపాడుచుంటివి కాబట్టి నేను గోరవలసినదేదియు లేదు. కాని కమలభవ భవశచీధవాది నిర్జరవరండ కోటీరమణిగణ ఘృష్టిత శబల వర్ణయుతంబును, దురంత దుస్తర సంసార పారావార తరణోపాయంబునగు నీపాదారవిందయుగళంబు మదీయహృదయంబునఁ బదిలంబుగా నుంపుమని ప్రార్థించి మఱియొక సౌధంబునకరిగె నయ్యవసరంబున. 1249

సీ॥ గజరథంబులమీఁద గంధర్వములమీద
నెక్కిపోవు మురారి నొక్కచోట
పౌరాణికులతో సభాస్థలంబున మోద
మొందు పంకజనాభు నొక్కచోట

సూతుండ్ర నల్లుండ్రఁ గూరిచి ధనరాసు
లొసఁగు రాజీవాక్షు నొక్కచోటఁ
గోడండ్ర నింటికిఁ గొనివచ్చి సుతులతో
నోనఁగూర్చు కంసారి నొక్కచోట

గానవిద్యాప్రవీణుఁడై మానులలర
నారిమతోఁ బాడు గోవిందు నొక్కచోట
నుద్ధవాన్వితుఁడగు హరి నొక్కచోటఁ
గాంచె సురమౌని కన్నుల కఱవుదీఱ. 1250

సీ॥ ఒక్కసౌధంబునం దువిదతో సరస సం
భాషణంబు లొనర్చు పద్మనాభు
మఱియొకగీములో మానినీహారము
ల్సవరింపుచున్న రక్షస్సపత్ను
వేఱొకయింటిలో వెలఁది చెక్కునఁ జెక్కు
మోపి ముద్దిడు జగన్మోహనాంగు
నొండొకనట్టులో నుత్తమాంగనతో ర
హస్యవాక్యములాడు నాదిదేవుఁ

బరఁగ నొక సద్మమున నిజభామతో ల
తాంతవనిలోన విహరించు కంతుజనకు
నొక్కగృహమున బలునితో నుండు కృష్ణుఁ
గాంచె సురమౌని కన్నుల కఱవుదీఱ. 1251

సీ॥ స్వీయాంకమున నొక్క చిగురుఁబోఁడిని నిల్పి
రొప్పుగా జడయల్లుచున్నవానిఁ
గాఁగింట నొకనాతిఁ గదియించి మితిలేని
సౌఖ్యంబుఁ గూర్మి నొసంగువానిఁ

చక్కిలిగింతచే సరసిజాక్షి నొకర్తు
వేడుకమీఱ నవ్వించువానిఁ
బరిహాసమున నొకభామాలలామంబుఁ
జీరి సంతోషింపఁజేయువాని
బాలి నొకలేమ చాచులు పట్టువాని
మించి యొక పూవుఁబోఁడి లాలించువాని
నఖిలలోకైకగురుని రమాధినాథుఁ
గాంచె సురమౌని కన్నుల కఱవుదీఱ. 1252

వ॥ ఇవ్విధంబునఁ బదియాఱువేల నూటయెనిమిది గృహంబులందు విరామములేకుండఁ గాంతామణుల లాలింపుచున్న పుండరీకాక్షుని నొక్కమందిరంబైన విడువక యోగబలంబుచే వీక్షింపుచున్న నారదుం గాంచి చరమగృహంబున శ్రీకృష్ణుండో దేవమునీంద్రా యిది నాయోగమాయాప్రభూతంబైన లీలగాని సంసారబంధంబుగాదు. భగవంతుఁడు కాముకుండయ్యె నేమాయని దుఃఖించి మోసపోవకుమనినఁ గలహాశనుండు రుక్మిణీపతి కిట్లనియె. 1253

ఉ॥ కాముకులైనవారలు జగంబున లేరె యనేకమర్త్యులే
కాముకుఁడైనఁ గామిని కొకానొకకాలమునందునైన నా
తామసగృహాంబరాభరణ, రత్నధనాదులచేతఁ దీర్చెనే
కామము మన్మథాశుగ వికారమడంచెనె తృప్తిఁగూర్చెనే. 1254

చ॥ ధవపరలై నెలంతలు వృథా మదనార్తివహించి పూరుషుల్
దినదిన మొక్కచోఁగలిసి, తీఱని మోహముచేఁ జరించి గ్ర
ద్దన చెడఁబాయుచుందురుగదా విపులామయపీడితాత్ములై
ధనకనకాంబరాభరణ, ధాన్య గృహాదులులేక దీనులై. 1255

ఉ॥ వేలకొలందిభార్యల వి,వేకముతో నిటఁ జేరఁదీసి యే
వేళలనైన మోదమొద,వింపుచు నెట్టికొలంతలేని చం
దాల మెలంగఁజేయుచు స,దా గృహధర్మము నాచరించు నీ
లీల లెఱుంగఁజేసెద ని,లింప మునీంద్రులకు న్నరాళికిన్. 1256

వ॥ కృష్ణా యెంతకాలమునకైన నీపరతత్త్వంబును దేహధారు లెఱుంగఁజాలరని యీలోకంబున మానుషదేహంబుతో నవతరించి యనేకవిధంబులగు లీలలు ప్రకటింపుచున్నా విట్టి లీలాప్రపంచంబును సన్నుతించువారు వినువారు లిఖించువారు కృతార్థులగుదు రగుదురని వినుతించి నారదుండు యథేచ్ఛంజనియె నిదియిట్లుండఁగా,

శ్లో॥ కృష్ణోభోగీ శుకస్త్యాగీ నృపౌ జనకరాఘవౌ
వసిష్ఠః కర్మకర్తాచ, పంచైతేజ్ఞానినస్సమాః

మహాభోగియైన కృష్ణుఁడు మహాయోగియైన శుకుఁడు నృపులగు జనక రామచంద్రులు కర్మయోగియగు వసిష్ఠుఁడు నీయైదుగురు సమానజ్ఞానులని పండితులు తీర్మానించిరి. 1257

వ ర వ ర ము ని

మనుష్యులైన జనక వసిష్ఠులతోఁ బరబ్రహ్మ స్వరూపులగు రామ కృష్ణుల సరిచేయవచ్చునా? 1258

వ ర వ ర ము ని

ఒకస్త్రీముఖము పద్మమునుబోలియున్నదనఁగాఁ బద్మముభంగి నచేతనమని యర్థముగాక ముఖవికాసమున కర్థమైనట్లు శుకాదులు భగవంతునితో జ్ఞాన శక్తి బలైశ్వర్య తేజస్సులయందు సమానులని కాదు సర్వసంగ పరిత్యాగియైన శుకునితో మహాభోగులైన రామ కృష్ణులు సమానజ్ఞానులనుటచే గొప్పతనమే స్ఫురింపుచున్నది. 1259

సు శీ లుఁ డు

సరేగాని శ్రీకృష్ణుఁడు శిఖండినడ్డుపెట్టి భీష్మునిఁ జంపించె ననియు ధర్మరాజుచే నబద్ధమాడించి ద్రోణవధఁ జేయించెననియు

రథచక్రము భూమిలోఁగ్రుంగఁగాఁ జిక్కుపడియున్నప్పుడు కర్ణునిఁ జంపించెననియు మతాంతరులాక్షేపించుచున్నారు దీనికిసమాధాన మేమి? 1260

వరవరముని

నీవుచెప్పినముువ్వురి చావునకుఁగారణములు వేఱుగానున్నవి శ్రీకృష్ణుఁడుచేయించిన యన్యాయమేమియులే దెట్లంటివేనిఁ బూర్వముకాశిరాజపుత్రియగు నంబయనునది యొకానొకవిరోధంబున భీష్మునిఁజంపెదనని శాబ్దిఁజేసి ద్రుపదునకు జనించి సిద్ధమైయుండె నింతేకాక ద్రుపదుఁడు శివునిఁగూర్చి తపంబొనర్చి భీష్మద్రోణులఁ జంపుకుమారులను ఫల్గునుని వశపఱచు పుత్రికయుఁ గావలయునని వేడఁగా నట్లే యద్దేవుండువరంబొసంగి యుండె నిదియిట్లుండఁగా భారతయుద్ధములోఁ దొమ్మిదవ నాఁడోటుఁజెంది యారాత్రి గాంగేయునాశ్రయించి నిన్ను జయించుట కుపాయంబుఁ జెప్పుమనఁగా నతండు ధర్మజునితో బిడ్డా! రేపటియుద్ధంబునశిఖండినిఁ దెచ్చి నాకెదురుగా నిల్పుము నేనురణంబు మానుకొందునప్పుడు నన్ను వధింపుడని చెప్పఁగా నర్జునుండు రెండవదినంబున భీష్మశాసనముననుసరించియే భీష్ముని వధించె నంతకుఁ బూర్వముగంగాశాసనముచే హంసరూపధరులగు మునులువచ్చి గాంగేయా! నీశకంబు మాఱినది సమరంబుఁ జాలింపుమని వక్కాణించిరి శాంతనవమరణంబున విధియిట్లుండఁగా శ్రీకృష్ణుండేమిచేసెనో తెలియరాదు బుద్ధిహీనులాడు దురాలాపంబులకు సమాధాన మీయవలసిన పనిలేదు 1261

సుశీలుఁడు

ఇఁకద్రోణుని సమాచారమెట్లు? 1262

వరవరముని

ఉభయసేనామధ్యమందు రథస్థుండైన ఫల్గునుండువిశ్వరూపధరుండగు కృష్ణునివీక్షించి యోకృష్ణా! 1263

ఉ॥ వేలకొలందిభార్యల వివేకముతో నిటఁజేరఁదీసి యే
వేళలనైన మోహమొదవింపుచు నెట్టికొలంతలేని చం
దాల మెలంగఁజేయుచు సదా గృహధర్మము నాచరించు నీ
లీల లెఱుంగఁజేసెద నిలింప మునీంద్రులకున్ నరాళికిన్. 1256

వ॥ కృష్ణా యెంతకాలమునకైన నీపరతత్త్వంబును దేహధారులెఱుంగఁజాలరని యీలోకంబున మానుషదేహంబుతో నవతరించి యనేకవిధంబులగు లీలలు ప్రకటింపుచున్నా విట్టి లీలాప్రపంచంబును సన్నుతించువారు వినువారు లిఖించువారు కృతార్థులగుదు రగుదురని వినుతించి నారదుండు యథేచ్ఛంజనియె నిదియిట్లుండఁగా,

శ్లో॥ కృష్ణోభోగీ శుకస్త్యాగీ నృపౌ జనకరాఘవౌ
వసిష్ఠః కర్మకర్తాచ, పంచైతేజ్ఞానినస్సమాః

మహాభోగియైన కృష్ణుఁడు మహాయోగియైన శుకుఁడు నృపులగు జనక రామచంద్రులు కర్మయోగియగు వసిష్ఠుఁడు నీయైదుగురు సమానజ్ఞానులని పండితులు తీర్మానించిరి. 1257

వరవరముని

మనుష్యులైన జనక వసిష్ఠులతోఁ బరబ్రహ్మ స్వరూపులగు రామ కృష్ణుల సరిచేయవచ్చునా? 1258

వరవరముని

ఒకస్త్రీముఖము పద్మమునుబోలియున్నదనఁగాఁ బద్మముభంగి నచేతనమని యర్థముగాక ముఖవికాసమున కర్థమైనట్లు శుకాదులు భగవంతునితో జ్ఞాన శక్తి బలైశ్వర్య తేజస్సులయందు సమానులని కాదు సర్వసంగ పరిత్యాగియైన శుకునితో మహాభోగులైన రామ కృష్ణులు సమానజ్ఞానులనుటచే గొప్పతనమే స్ఫురింపుచున్నది. 1259

సుశీలుఁడు

సరేగాని శ్రీకృష్ణుఁడు శిఖండినడ్డుపెట్టి భీష్మునిఁ జంపించె ననియు ధర్మరాజుచే నబద్ధమాడించి ద్రోణవధఁ జేయించెననియు

రథచక్రము భూమిలోఁ గ్రుంగఁగాఁ జిక్కుపడియున్నప్పుడు కర్ణునిఁ జంపించెననియు మతాంతరు లాక్షేపించుచున్నారు దీనికిసమాధాన మేమి? 1260

వ ర వ ర ము ని

నీవుచెప్పినముగ్గురి చావునకుఁగారణములు వేఱుగానున్నవి శ్రీకృష్ణుఁడుచేయించిన యన్యాయమేమియులే దెట్లంటివేనిఁ బూర్వము కాశిరాజపుత్రియగు నంబయనునది యొకానొకవిరోధంబున భీష్మునిఁజంపెదనని శాబ్దిఁజేసి ద్రుపదునకు జనించి సిద్ధమైయుండె నింతేకాక ద్రుపదుఁడు శివునిఁగూర్చి తపంబొనర్చి భీష్మద్రోణులఁ జంపుకుమారులను ఫల్గునుని వశపఱచు పుత్రికయుఁ గావలయునని వేఁడఁగా నట్లే యద్దేవుండువరంబొసంగి యుండె నిదియిట్లుండఁగా భారతయుద్ధములోఁ దొమ్మిదవ నాఁడోటుఁజెంది యారాత్రి గాంగేయునాశ్రయించి నిన్ను జయించుట కుపాయంబుఁ జెప్పుమనఁగా నతండు ధర్మజునితో బిడ్డా! రేపటియుద్ధంబునశిఖండినిఁ దెచ్చి నాకెదురుగా నిల్పుము నేనురణంబు మానుకొందునప్పుడు నన్ను వధింపుడని చెప్పఁగా నర్జునుండు రెండవదినంబున భీష్మశాసనమునను సరించియే భీష్ముని వధించె నంతకుఁ బూర్వముగంగాశాసనముచే హంసరూపధరులగు మునులువచ్చి గాంగేయా! నీశకంబు మాఱినది సమరంబుఁ జాలింపుమని వక్కాణించిరి శాంతనవమరణంబున విధియిట్లుండఁగా శ్రీకృష్ణుండేమిచేసెనో తెలియరాదు బుద్ధిహీనులాడు దురాలాపంబులకు సమాధాన మీయవలసిన పనిలేదు 1261

సు శీ లుఁ డు

ఇఁక ద్రోణుని సమాచారమెట్లు? 1262

వ ర వ ర ము ని

ఉభయసేనా మధ్యమందు రథస్థుండైన ఫల్గునుండువిశ్వరూపధరుండగు కృష్ణునివీక్షించి యోకృష్ణా! 1263

శ్లో॥ అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావనిపాల సంఘైః
భీష్మో ద్రోణస్సూతపుత్ర స్తథాఽసౌ
సహాస్మదీయైరపి యోధముఖ్యైః
వక్త్రాణి తే త్వరమాణా విశంతి
దంష్ట్రాకరాళాని భయానకాని
కేచిద్విలగ్నా దశనాన్తరేషు
సందృశ్యన్తే చూర్ణితైరుత్తమాంగైః

ఈ ధృతరాష్ట్రసూనులగు దుర్యోధనాదులందఱు సర్వావనినాథులతోఁ గూడిన భీష్మద్రోణకర్ణాదులు మదీయ సైన్యమునందలి యోధముఖ్యులు త్వరపడి భయంకరములగు నీ ముఖములందుఁ బ్రవేశింపుచున్నారు. కొందఱు తలలు చూర్ణముగాఁగా నీదంతముల సందునఁజిక్కి వ్రేలాడుచున్నారు. 1264

శ్లో॥ యథా నదీనాంబహవోంబువేగాః
సముద్రమేవాభిముఖా ద్రవంతి
తథా తవామీ నరలోకవీరా
విశంతి వక్త్రాణ్యభివిజ్వలంతి
యథాప్రదీప్తం జ్వలనం పతంగా
విశంతి నాశాయసమృద్ధవేగాః
తథైవనాశాయ విశంతి లోకా
స్తవాపివక్త్రాణి సమృద్ధవేగాః

సలిలప్రవాహముగల నదులు సముద్రమునుగూర్చి పోయినట్లే నరలోకవీరులు నీముఖములను బ్రవేశింపుచున్నారు. మండుచుండు వహ్నిజ్వాలలయందు మిడుతలు ప్రవేశించినరీతి నీలోకులు ప్రజ్వలింపు

చున్న నీముఖములను బ్రవేశించి నాశమగుచున్నారుసుమీ యని ఫల్గునుఁడు వచించెను.

(భగవద్గీత)

శ్లో॥ ద్రోణంచ భీష్మంచ జయద్రథంచ
కర్ణంతథాన్యానపియోధవీరాన్
మయాహతాం స్త్వంజహిమావ్యథిష్ఠా
యుధ్యస్వజేతాసిరణే సపత్నాన్

భీష్మ ద్రోణ జయద్రథ కర్ణాది సమస్త యోధవీరుల యాయుస్సు లిదివఱకే తుంచియున్నాను. నీవు నిమిత్తమాత్రముగా యుద్ధమొనరింపుము జయమునొందుదువని శ్రీకృష్ణుండు చెప్పెను.
(భగవద్గీత)

దీనినిఁబట్టిచూడఁగా సర్వేశ్వరుండు భూభార నివారణార్థమవతరించి యనేకుల నిదివఱకే వధించియుండె. మిగిలినవారిని వధింపనెంచి భారతయుద్ధంబున కరుదెంచె నట్టిలోకాధిపతికి భీష్మద్రోణాదులఁ జంపుట ముఖ్యావసరమైయున్నది. మరల ధర్మజునిచే సబద్ధమాడించి చంపించవలసినపని యేమాత్రము కానరాదదియట్లుండఁగా ధర్మనందనుఁడు జన్యారంభములో భీష్మునికడకేగి వరంబుఁదీసుకొని తదుపరి ద్రోణునికడకరిగి గురువర్యా రణమున నాకుజయముకలుగునట్లు వరమిమ్మని వేడగాఁ గుంభసంభవుండు ధర్మరాజుంగాంచి రాజేంద్రా. 1266

శ్లో॥ ధ్రువస్తేవిజయో రాజన్, యస్య మంత్రీహరిస్తవ
అహంత్వా మభిజానామి, రణేశత్రూన్ విజేష్యసి
యతోధర్మస్తతః కృష్ణో, యతః కృష్ణస్తతోజయః
యుధ్యస్వగచ్ఛ కౌంతేయ, పృచ్ఛమాం కిం బ్రవీమి తే

శ్రీకృష్ణుఁడు నీకు మంత్రియైయుండుటచే జయము తప్పక కలుగును. రణమున వైరుల జయింతువు. యెచ్చట ధర్మముండునో

యచ్చట గృష్ణుఁడుండును, కృష్ణుడున్నచోట జయము సిద్ధించును. సమరమొనర్పుము ఇంకనేమికావలయునో యడుగుము చెప్పెదననగాఁ యుధిష్ఠిరుం డతనితో నిట్లనియె. 1267

శ్లో॥ పృచ్ఛామిత్వాం ద్విజశ్రేష్ఠ, శృణుమే యద్వివక్షితమ్
కథంజయేయం సంగ్రామే' భవంతమపరాజితమ్

నేనుచెప్పఁదలఁచిన మాటను సెప్పుచున్నాను వినుము. జన్యమునఁ బరాజితుఁడవుగాని నిన్ను నేనెట్లుజయింతును ! 1268

శ్లో॥ హంతతస్మాన్మహాబాహో, వధోపాయం వదాత్మనః
ఆచార్య ప్రణిపత్యైవ పృచ్ఛామిత్వాం నమోఽస్తుతే

అహో మహాబాహూ నీవధోపాయమును నీవేచెప్పుము గురువర్యా నమస్కరించి యడుగుచున్నానుచుమీ యనఁగా ద్రోణుం డిట్లనియె. 1269

శ్లో॥ నతేఽస్తి విజయోరాజన్, యావద్యుధ్యామ్యహం రణే
మమాశు నిధనేరాజన్ యతస్వసహసోదరైః

శ్లో॥ నశత్రుంతాత పశ్యామి యోమాం హన్యాద్రణేస్థితమ్
యుధ్యమానం సుసంరబ్ధం శరవర్షౌఘవర్షిణమ్
ఋతేప్రాయగతం రాజన్ న్యస్తశస్త్ర మచేతనం
హన్యాన్మాం యుధియోవీరః సత్యమేత ద్బ్రవీమితే
అస్త్రంచాహంరణేజహ్యాం శ్రుత్వా సుమహదప్రియమ్
శ్రద్ధేయవాక్యాత్పురుషా త్సత్యమేతద్బ్రవీమితే

ఎంతకాలము నేనుజన్యమొనర్తునో యంతకాలము నీకుజయము గలుగదు. సోదరులతోఁగూడి నాచావునకై త్వరగా యత్నింపుము.

ప్రాయోపవిష్టుఁడనుకాకుండ విజృంభించి శరవర్షముసుగురియుచు రణంబొనరించునప్పుడు నన్ను వధించు పగవాఁడొక్కఁడును లేడు.

అస్త్రసన్న్యాస మొనర్చి యచేతసముభంగి నుండునప్పు డొక వీరుఁడు
నన్నుఁజంపవచ్చును. నమ్మఁదగిన పురుషుఁడు నాకప్రియమైన మాట
చెప్పినచో నేనువిని యస్త్రసన్న్యాస మొనర్తు నిది నామరణంబున
కుపాయ మట్లుచేయుమని ద్రోణుఁడు ధర్మరాజుతో నొక్కి వక్కా
ణించెను. 1270

(మహాభారతము. ద్రోణపర్వము)

వెండియు ద్రోణుం డాగ్రహాగ్రస్తమనస్కుండై బ్రహ్మాస్త్రమును బ్రయోగించి దివ్యాస్త్రజ్ఞానమేమియు లేనివారినిఁ గుప్పతెప్పలుగాఁ జంపుచుండఁగా నట్టిసమయంబున విశ్వామిత్ర జమదగ్ని భరద్వాజ గౌతమ వసిష్ఠవాలఖిల్యాదిమహామును లనేకులు యుద్ధభూమికి వచ్చి యితరులకుఁ గనిపించకుండ ద్రోణునకుమాత్రము గోచరించి,

శ్లో॥ త ఏన మబ్రువన్ సర్వే ద్రోణమాహవశోభినమ్
అధర్మతః కృతంయుద్ధం సమయో నిధనస్య తే
న్యస్యాయుధం రణే ద్రోణ సమీపేత్యాస్మా నిహస్థితాన్
నాతః క్రూరతరం కర్మ పునః కర్తుంత్వ మర్హసి
వేదవేదాంగ విదుషః సత్య ధర్మ పరస్య తే
బ్రాహ్మణస్య విశేషేణ తవైతన్నోపపద్యతే
న్యస్యాయుధ మమోఘ స్త్వం, తిష్ఠవర్త్మని శాశ్వతే
పరిపూర్ణస్తు కాలస్తే వస్తుంలోకేఽద్యమానుషే
బ్రహ్మాస్త్రేణ త్వయాదగ్ధా అనస్త్రజ్ఞా నరాభువి
యదేతదీదృశం విప్రకృతం కర్మనసాధుతత్
న్యస్యాయుధం రణేక్షిప్రం ద్రోణ మాత్వం చిరంకృథాః
మాపాపిష్ఠతరంకర్మకరిష్యస్త్వం పునర్ద్విజ

ఓద్రోణుఁడా! నీకు మరణకాలము సమీపించె నిట్టితటి నధర్మ
యుద్ధ మొనర్పకుము. ఇచ్చోటికి వచ్చియున్న మమ్ములనీక్షించి

యాయుధమును విడువుము. పునఃపునః క్రూరకర్మ మొనర్చుట తగదు. వేదవేదాంగవిదుఁడై సత్యధర్మపరుఁడైనవానికి నందులో బ్రాహ్మణుఁడవైన నీకీదుష్టత్వము తగినదికాదు. శస్త్రమునువిడిచి మోహము వర్జించి సనాతనధర్మమున నిల్వుము. లోకమున జీవించుటకిఁక నీకుఁ గాలములేదు. దివ్యాస్త్రజ్ఞానములేనివారిని బ్రహ్మాస్త్రముచే దగ్ధము చేయుచున్నావు. విప్రునకిది మంచిదికాదు. శస్త్రము విడువుము, కోపముమానుము, మరల పాపిష్టికార్యములు సేయకుమని బోధించిరి. మహాపండితుఁడగు ద్రోణాచార్యున కమ్మునివాక్యంబులు పూర్తిగా విశ్వాసముఁగూర్చెను. జీవితంబిఁక హేయమని తోఁచెను.

(మహాభారతము, ద్రోణపర్వము)

సుశీలుఁడు

స్వామీ! ద్రోణుని మరణంబునకై యాదినుండే ధృష్టద్యుమ్నుఁడు పుట్టియుండెను. శ్రీకృష్ణ విశ్వరూప సందర్శనకాలంబున ద్రోణాదులు హతులైనట్లే ఫల్గునుండు హరితోఁజెప్పెను. జన్మారంభ కాలమందుఁ దనచావున కుపాయము ద్రోణుఁడే చెప్పియుండెను. సమరాంతమున వసిష్ఠాది మునులువచ్చి ద్రోణునితో నీకు మరణముసమీపించినది శస్త్రంబు మానుమని చెప్పిరి. ఈవార్తలన్నియు నెఱింగిన కృష్ణుండు ద్రోణవధకొఱకు నసత్యమాడుమని యుధిష్ఠిరున కేల బోధించెను? 1273

వరవరముని

ద్రోణుఁడు శ్రీకృష్ణునకు బహిర్భక్తుఁడుగాఁ గనపడకున్న నంతరంగభక్తుండగు నక్కారణంబున నతనికీర్తి మాయకుండుట కట్లు గావించె నెట్లంటివేని ధర్మరాజు అసత్యమాడినందున నీల్గెంగాని లేకున్న ద్రోణుఁడు సచ్చునాయను వాక్యమే కీర్తిప్రదమైయున్నది.

సుశీలుఁడు

భీష్ముండు విష్ణుభక్తుండనుట ప్రసిద్ధమేకాని ద్రోణుండుసహిత మట్టివాఁడని యిదివఱకు వినలేదే! దీనికిఁ బ్రమాణమేమి? 1275

వరవరముని

శ్లో॥ తథోక్త్వా యోగమాస్థాయ, జ్యోతిర్భూతో మహాతపాః
పురాణంపురుషం విష్ణుం జగామ మనసాపరమ్

అంత్యకాలమున ద్రోణుఁడు యోగమునాశ్రయించి జ్యోతిర్మయాకారుఁడై మనస్సుచేఁ బురాణపురుషుండగు విష్ణునిఁ బొందెను.

(భారతము, ద్రోణపర్వము)

సుశీలుఁడు

సంగరరంగంబున భీష్మునిమీఁదికి రెండుసారులు శ్రీకృష్ణుండు దుముకుటకుఁ గారణంబేమి ? 1276

వరవరముని

భారతయుద్ధంబున నాయుధంబు పట్టనని శ్రీకృష్ణుండు ప్రతిజ్ఞఁ జేసె నదివిని భీష్ముండొకప్పుడు జనార్దనా! మదీయ బల ప్రతాపములు పూర్ణముగాఁజూపి పాండవుల నోడించి నీచే నాయుధంబుఁ బట్టింతునని శాబ్దిఁజేసియుండె నక్కారణంబుచే మధుసూదనుం డొక్కనాడు రణంబున నర్జునుఁడు లొంగుటయు భీష్ముండు విజృంభించుటయు నిరీక్షించి భీష్మార్జునులిద్దఱు నాకు మహాభక్తులి త్తరుణంబున ఫల్గునోత్సాహంబును గాంగేయు శాబ్దినిం గాపాడుట ముఖ్యంబని సుదర్శనముధరించి దేవవ్రతుని పైకుఱికెను. రెండవసారి శిథిలీభూత పాండవసైన్యోత్సాహంబును బూరించుటకునుఁ గౌరవసేనకు భయము పుట్టించుటకును శాంతనవునివంటి పరాక్రమశాలి వేఱొకఁడు లేడు నాకుఁదక్క నితరునకు లొంగడని చూపించుటకును గోవిందుఁడు గాంగేయుని పైకి దుమికెను. 1277

సుశీలుఁడు

శ్రీకృష్ణుండు పుట్టినప్పుడు ప్రాకృతబాలునిరీతి జడిసి వ్రేపల్లె కేగనేల ? మధురలోనేయుండి కంసుని వధింపరాదా ? 1278

వరవరముని

అప్పటికిఁ గంసునకుఁ బ్రారబ్ధము నశింపనందున మరణ మాసన్నము కాలేదు. నంద యశోదలకు విరించి వరప్రకారము కొంత ముద్దు చూపవలసియున్నది. గోగణ గోపీ గోపాలురకు మితిలేని యానంద మీయవలసియున్నది. బృందావనమును బవిత్రముసేసి కీర్తిఁ జెందింపవలసియున్నది. ఇంక ననేక కార్యములున్నవి. ఇన్నిహేతువులాలోచించి వాసుదేవుండు మంద కేగెను. 1279

సుశీలుఁడు

జరాసంధుఁడు పదునెనిమిది పర్యాయంబులు తనమీఁదికి జన్యంబునకురాగా జయింపలేనట్లు నందనందనుఁడు పాఱిపోవనేల?

వరవరముని

ధర్మనందన రాజసూయార్థ దిగ్విజయకాలంబున జరాసంధుని భీముని చేఁజంపింపవలసిన యవసరమున్నందున భవిష్యత్కాలవేదియైన శ్రీకృష్ణుండు పాఱిపోవుటయేగాక యొకసారి బలరాముండు జరాసంధునిఁబట్టి చంపఁబోగా నివారించి విడిపించెను. 1281

సుశీలుఁడు

కాలయవనుఁడు వెంటఁబడి తఱుముచుండఁగా రణభీరువువలె దేవకీనందనుండు పాఱిపోవనేల? 1282

వరవరముని

ముచుకుందుఁడను సూర్యవంశపురాజు దేవరాక్షసయుద్ధంబున దేవతలకు సాయముపోయి రాక్షసులవధించి తన్నుమెచ్చిన నిర్జరులఁ గాంచి మోక్షమిమ్మని వాంఛింపఁగా నిర్జరు లయ్యా మాకదిసాధ్యంబు గాదు విష్ణుదేవుండొక్కఁడే మోక్షప్రదాత. అతండు ద్వాపరయుగాంతంబునఁ గృష్ణుండై భూలోకంబున నవతరించు నంతవఱదాఁక జీవించునట్లు నీకాయువునొసంగెద మారిసు మయ్యవసరంబున నవ్వార్ష్ణేయునకుఁ బురుషకారముసేసి మోక్షమిప్పింతుమనిరి. ముచుకుందుఁ

దప్పులుకులకుఁ గొంతసంతసించి వేల్పులఁగాంచి ఇంద్రులారా! యిప్పుడు కృతయుగంబు జరుగుచున్నది. లక్షలసంవత్సరంబులు గడచినంగాని భగవంతుండవతారమెత్త దప్పటివఱకు నేనెట్లు కాలంబుఁ ద్రోయుదు నూరక యుండఁజాల నిద్రనొసంగి నన్నునిద్రనుండిలేపిన వాఁడునాకంటిమంటలచే భస్మమగునట్లు వరంబొసఁగుడని యవ్వరంబుఁగైకొని మధురాపురసమీపంబున నొక్కకొండగుహలో నిద్రింపుచుండె నటులిమ్ముటద్వాపరయుగాంతంబునఁ గమలాక్షుండు కృష్ణావతారమెత్తి పలాయనవ్యాజంబునఁ గాలయవనునచ్చటికిఁ గొనిపోయి భస్మముచేయించి ముచుకుందుని వాంఛితంబునెఱవేర్చి నిలింపుల పురుషకారము ఫలింపఁజేసె నంతియేకాని యవనునకుభయపడి కృష్ణుండు పాఱిపోవలేదు 1283

సుశీలుఁడు

మహామునులు యాదవనాశనార్థము ముసలంబుపుట్టునని శాపంబీయఁగాగోవిందుఁ డశక్తునిభంగినూరకుండెను. గాని ప్రభాసతీర్థంబున సహోదరపుత్రపౌత్రాదులు పరస్పరకలహంబుచే మరణింపుచుండగా దప్పింపలేఁడయ్యెనేమి? 1284

వరవరముని

శ్రీకృష్ణునకు మనవలె బంధువులు విరోధులునులేరు భూభారనివారణార్థమమ్మహాపురుషుఁ డవతరించెనని మునుపేచెప్పితి నదియట్లుండఁగా యాదవులందఱు మహాబలాఢ్యులై మహోన్నతులై దేవతలకజయ్యులైయుండిరి కృష్ణునకవతార సమాప్తికాలము సమీపించినది కలియుగంబు రాఁబోవుచున్నది యాదవక్షయంబుగానిచో భూభారంబడంగదిన్ని హేతువులచే మునిశాపంబు నివారింపలేదు సరేగదా తదీయశాపంబున కమ్మహాత్ముఁడు కారణంబైననుకావచ్చును 1285

సుశీలుఁడు

శ్రీకృష్ణుఁడు వేఁటకానిబాణము లఁబకాలియందు గ్రుచ్చుకొనుటచేఁ బ్రాణములు విడిచెనని చెప్పుదురే యదినిశ్చయమేనా, 128౬

వరవరముని

నీవుచెప్పిన చందంబున మహాభారతంబునఁగలదు కానియదినిశ్చయమనితోఁచదెందువల్లననఁగా భారతరచనాకాలంబున వ్యాసుఁడు బుద్ధికాలుష్యముచే దుఃఖింపుచుండగా నారదుండచ్చోటికివచ్చి వ్యాసునాఁఅడించి వ్యాసా! నీవురచించిన భారతమంతయు మనుష్యకథయగుటచేతనుఁగర్మప్రభావప్రతిపాదకమగుటవల్లను భగవత్ప్రీతికరముకాలేదు దానిచే నీమనంబున దుఃఖంబుకలిగె తద్దుఃఖవినాశనార్థమై భగవత్కథా ప్రపంచంబగు భాగవతంబు రచింపుమని యుపదేశింపఁగా కృష్ణద్వైపాయనుండదివఱకున్నలోపంబులన్నియు సవరింపుకొనుచు భాగవతంబు రచించి కృతార్థుడయ్యె నట్లగుటచే సాత్వతేయుఁడు ముందు రచించిన భారతమునకుఁదరువాత రచించిన భాగవతమునకు విరోధమైనచో భాగవతమునే సత్యమని విశ్వసింపవలె నింతేకాక

శ్లో॥ క్వచిత్సత్యం వ్యాసవాక్యం సత్యంవాల్మీకినాస్మృతమ్

అనఁగా వ్యాసవాక్యము కొంతసత్యము వాల్మీకివాక్యమంతయుసత్యమనియున్నది గనుక భారతమునందుఁగల భగవదపచారవాక్యమును ద్రోసిపుచ్చి భాగవత ప్రమాణమాకర్ణింపుము.

శ్లో॥ లోకాభిరామాంస్వతనుం, ధారణాధ్యానమంగళమ్
యోగధారణయాగ్నేయ్యా,దగ్ధ్వాధామాఽవిశత్స్వకమ్
దివిదుందుభయోనేదుః,పేతుస్సుమనసశ్చఖాత్
సత్యంధర్మోధృతిర్భూమేః,కీర్తిశ్రీశ్చాఽపితంయయుః
దేవాదయోబ్రహ్మముఖ్యా న విశంతంస్వధామని
అవిజ్ఞాతగతింకృష్ణందదృశుశ్చాతివిస్మితాః

ధారణాధ్యానమంగళములకు నాస్పదమైనదియు లోకాభిరామమైనదియు నగు స్వకీయదేహమును నాగ్నేయమగు యోగధారణచేత దహింపకయే స్వకీయమగు వైకుంఠమునకు శ్రీకృష్ణుఁడేగ నప్పుడు నింగిపై దుందుభులు మొఱసెను పుష్పవర్షమాకసమునుండి కురిసెను ధరణియందుండు సత్యము ధర్మము కీర్తి లక్ష్మి మొదలైనవి కృష్ణునితో నేగెను ఎవ్వరికిఁ దెలియకుండ స్వకీయధామమున కేఁగు శ్రీకృష్ణునిఁ గానలేక బ్రహ్మాది దేవతలాశ్చర్యముతో నుండిరని భాగవతమునందుఁ గలదు. యిదియే సత్యమని తలంపుము 1287

సుశీలుఁడు

ప్రాణసమానుండగు ఫల్గునునకైనం జెప్పకుండ నందనందనుండు పరమపదంబున కేఁగుటకు హేతువేమి? 1288

వరవరముని

దేవకీనందనుండర్జునునకు విశ్వరూపంబుఁ జూపినను నిరంతరము నుదన్నుఁ దనవారినిఁ గంటికిఱెప్పవలె రక్షింపుచున్నను గోవిందుఁడే సర్వరక్షకుండని విశ్వసింపక కొంతసేపు తనకుఁదానే స్వతంత్రుండని యెంచుచుసాయంకాలము తప్పక శివపూజసేయుచు నప్పినాకియందు భక్తిగలవాఁడై యుండెనకారణంబున భర్తయగువాఁడుపరపురుషానురక్తిగలభార్యసేవగించునట్లు ఫల్గునునకుఁ జెప్పకుండఁ బురుషోత్తముఁడు స్వధామంబున కేగెనుగాని యేకాంతభక్తుండగు నుద్ధవునకన్ని విషయంబులుసెప్పినాడుగదా, కాఁబట్టియేభగవద్భక్తుఁడగువానికి నన్యశేషత్వము స్వాతంత్ర్యము దేవతాంతర ప్రతిపత్తిస్వరూప విరుద్ధమనిపూర్వాచార్యులు సాయించిరి 1289

సుశీలుఁడు

ప్రభూ! పూర్వభవంబు నందును నారాయణసఖుండైనకవ్వడికి నట్టివిపరీతజ్ఞానమేలకలిగెను? 1920

వరవరముని

పూర్వము బదరికాశ్రమంబున నారాయణ సఖుండైన నరుండను మునీంద్రుఁ డొకఁ డుండె నన్నరుండీజన్మంబునఁ బార్థుండై జన్మించె నతని యందు నింద్రాంశము విష్ణ్వంశమునను రెండంశములేకీభవించె శ్రీకృష్ణుండంతర్హితుండైన పిమ్మట నర్జునస్థంబగు విష్ణ్వంశము కృష్ణునితో నేగె నక్కాలంబునఁ ద్రిలోకంబులు జయించిన సవ్యసాచి బోయలకుఁ జాలడయ్యె 1291

సుశీలుఁడు

వసుదేవనందనుండు పరబ్రహ్మమనుటకుఁ గొన్ని నిదర్శనంబులు వక్కాణింపుడు 1292

వరవరముని

భగవంతుఁడు కృష్ణావతారకాలంబునందొనర్చిన యమానుషకృత్యంబులు సాకల్యంబుగా వివరింప బ్రహ్మకుశక్యంబుగావు నరేకదా తనకునుసాధ్యంబుగాదని యొకప్పుడా శ్రీకృష్ణుండే వచించె నట్లుండగా మానవుండేమి వచింపఁగలఁడైనను గంగానదియందు దోసెడుజలము న్నదన్నట్లు శ్రీకృష్ణవిలాసంబులుదోఁచినంతవఱకు విన్నవింతునాకర్ణింపుము శ్రీకృష్ణుండు స్తనంధయుండగు సమయంబున పూతనను వధించి మోక్షంబొసంగె శకటాసుర తృణావర్తులఁ బరిమార్చె గాళిందీహ్రదంబుననుండు కాళియసర్పంబును మర్దించి తఱిమి యమునాహ్రదసలిలంబులనిర్విషంబుఁగావించె నర్ధరాత్రంబున వ్రేపల్లెను ముట్టడించిన దావాగ్నినిఁద్రావె గోటికొనతో గోవర్ధనాద్రినెత్తిఘోషవాసులనేడు దినంబులింద్రప్రయుక్తవృష్టి బాధఁదొలంగించి రక్షించె నిర్జీవదేహంబుతో భూమిపైఁబడిన పరీక్షిత్తును బ్రతికించెను. సంయమనీ నగరంబున కేగిన సాందీపనిపుత్రునిఁదెచ్చియిచ్చెను. పరలోకస్థులగు వైదిక నందన నవకంబును దెచ్చియిచ్చెను. మృద్భక్షణవ్యాజంబున యశోదాదేవికి యమునాజలంబులం దక్రూరునకును దిరుత్తేరుతట్టియం దర్జునునకు విశ్వరూపంబుఁ జూపించెను. పశ్చిమసముద్రములో ద్వారకనిర్మించి

మధురాపుర సంస్థితప్రజల సంముఁజేర్చి చిరకాలంబు ప్రావీణ్యముతోఁ బాలించెను. ముల్లోకంబుల వేధించిన నరకాసురుని సంహరించెను. జరాసంధునిఁజంపించి తదీయకారాగారంబులనుండు క్షత్రియసమూహంబుల బంధవిముక్తులఁజేసెను. మహాబలాఢ్యులగు శిశుపాల దంతవక్త్ర సాల్వ కంసాసురుల మడియించెను. ఎవ్వరిచేఁ జావులేని వరంబొందిన హంసడిభకులను, స్వకీయపురంబులోనికి గాలియైనఁజొరకుండఁజేసిన వజ్రనాభ సునాభులను సంహరించెను. మూడుకోట్ల బలాఢ్యులఁగూడి యెదిరించిన కాలయవనును నకారణవైరంబుఁబూనిన పౌండ్రకుని మఱియు లోకకంటకులగు ననేకరాక్షసుల ననాయాసంబునఁ గూల్చెను. కురుక్షేత్రంబున రాజులకుఁ బరస్పరకలహంబులు గల్పించి డెబ్బదిమూడుకోట్ల సేనల వధించె. దుర్యోధనాదుల నంతకపురి కనిచె. స్వర్గలోకస్థంబగు పారిజాతంబుఁదెచ్చి సత్యభామా నిష్కుటంబునం బ్రతిష్ఠించె నెనిమిదిమంది పట్టమహిషులను బదియాఱువేల రాజకన్యలను జాయలుగాఁ బరిగ్రహించి కొఱంతలేని మహాభోగంబులొసంగి నింతమందితో భోగించియు నస్ఖలిత బ్రహ్మచారియను విఖ్యాతివడసెను. గోవర్ధనోద్ధరణ వ్యాజంబున నింద్రుని శిక్షించెను. సృష్టికర్తృత్వగర్వంబుచే గోవత్సార్భకులనంతర్ధానముచేసిన బ్రహ్మకు శృంగభంగమొనర్చెను. మృత్యువునకు మృత్యువగు రుద్రుని జయించి బాణాసుర బాహువులనఱికెను గోపీగోపాలమాహాగణ పక్షి మృగతరుగుల్మలతాదులకు మోక్షంబొసంగెను త్రివక్రయగు కుబ్జకపార సౌందర్యంబొసంగెను. ద్రౌపదికక్షయాంబరంబులొసంగి రక్షించెను. పాండవుల నహర్నిశముఁగాపాడెను. మూడులక్షలయేబదివేల గోపికలతో నేకకాలంబునరమించి రాసక్రీడాదులచే మోదమొందించెను. షోడశ సహస్రాష్టగృహంబుల నేకకాలంబునఁగ్రీడించు మాహాత్మ్యంబు నారదునకుఁ గనపరచెను. కుచేలునకపారైశ్వర్యంబొసంగె నిట్టి మహిమంబు లెన్నియో నందనందనుఁడు లోకంబునకుఁ బ్రదర్శించినను

దైవసంబంధబుద్ధిగలవారికి ముక్తిదాయకంబులయ్యెంగాని యాసుర స్వభావులకు నుపయోగింపలేదు. వారిప్రారబ్ధము నేమని చెప్పనగును.

సుశీలుఁడు

భగవంతుని జన్మకర్మములలో రామ కృష్ణావతార మహిమంబులు మాత్రము ప్రస్తావవశమున వచించితిరి. తక్కినయవతారముల సమాచారమును వక్కాణింపుడు. 1294

వరవరముని

నారాయణుని దివ్యావతారంబులు నాలుగువిధంబులని మున్నె చెప్పితిని. మరల వచించుట చర్వితచర్వణంబగునుగాని పూర్ణావతారంబులగు మత్స్యాదులసంగతి సంగ్రహంబుగాఁ జెప్పెద నాకర్ణింపుము. ఆదియుగంబున సోమకాసురుండను దానవుండు బ్రహ్మను గొట్టి వేదంబులు దొంగిలించి మున్నీటడాగె నటుపిమ్మట సృష్టికి భంగము వచ్చెగదాయని నీరస్థుండగు వానింజంపుటకు జలచరమే కావలయునని యెంచి జనార్దనుండు వేయికోటల మత్స్యంబై సోమకునిఁద్రుంచి శిథిలమైన వేదభాగములన్నియు హయగ్రీవరూపంబుతోఁ బూరించి విరించి కిచ్చెను. ఇది మత్స్యావతారము. 1295

సురాసురు లేకీభవించి పాలసంద్రంబుఁ దరచుటకై పదునొకండువేలామడల విరివిగల మందరపర్వతము నందులోఁ బడఁద్రోసి రయ్యవసరంబున నగ్గిరి మునిగిపోయె నంతట దేవదానవులు నిష్ప్రయోజకులైయుండుట వీక్షించి శ్రియఃపతిలక్షయోజనవిశాల కూర్మరూపంబుధరించి మందరగిరినిఁ దనమూపునమోపి తేలంబట్టి సురాసురలచే సముద్రమును మథింపఁజేసి సుధను బుట్టించి సుధ మాకే కావలయు ననియు మీకు భాగములేదనియు నిర్జరుల ధిక్కరింపుచున్న రాక్షసులఁ బాఱఁద్రోలి విష్ణుం డయ్యమృతంబు దేవతలకిచ్చె నిది కూర్మావతారము. 1296

సు శీ లుఁ డు

సురాసురులు సమానముగాఁ గష్టించి మథించిన పీయూషంబును నిశాచరుల కీయక నిలింపులకుమాత్ర మిచ్చుట కేశవునకు ధర్మమేనా ? 1298

వ ర వ ర ము ని

నిశాచరులు క్రూర సర్పములవంటివారు. వారికిఁ బీయూషంబు దక్కనిచ్చినచో లోకంబునంగల భూతంబులన్నియు నొక్క నెలలో నాశనంబగు నసురులైన నాజన్మంబువదలి మానవాది జన్మంబులెత్తి పుణ్యకార్యంబు లొనరించి స్వర్గంబున కేగినప్పు డమృతంబుఁ ద్రావవచ్చు నేజన్మమందునైనఁ బుణ్యంబా సర్చినవారు దేవలోకంబున కేగుచుండు రప్పుడప్పుడు పీయూషంబుఁ ద్రావుదురు. సుధారసంబు పుణ్యాత్ములైన దేవతల కర్హమేగాని పాపాత్ముల కర్హంబుగాదని సర్వేశ్వరుఁడు విధించినాఁడుగనుక ధర్మమేగాని యధర్మముగాదు.

మున్ను శ్రీహరి యజ్ఞవరాహంబై పాతాళంబునందు భూమినిఁ జాపగాఁ జుట్టుచున్న హిరణ్యాక్షుని వధించి ప్రళయోదధి మగ్నమైన భూమి నుద్ధరించి నీటిపైనిల్పి సృష్టికి నాధారముఁ గల్పించినాఁడు. ఇది వరాహావతారంబు. 1300

దురితాత్ముండగు హిరణ్యకశిపుండు పరమ భాగవతుండైన వివిధోపాయంబులచేఁ జంపఁగోరుచుండ నారాయణుఁడాస్థానమంటపంబునందు నృసింహాకృతితో నవతరించి హిరణ్యకశిపునిఁ ద్రుంచి ప్రహ్లాదుని రక్షించె నిది నరసింహావతారము. 1301

ప్రహ్లాదుని మనుమండగు బలిచక్రవర్తి సర్వవిభావరీచర నాయకుండై దేవరాజ్యము నాక్రమింపఁగా విష్ణుండు ముందు వామనుండై తరువాతఁ ద్రివిక్రముఁడై పదత్రయ వ్యాజంబుచే బ్రహ్మాండంబుఁ గొలిచి బలిని జయించి స్వర్గంబు దేవతలకిచ్చె నిది వామనావతారంబు. రామకృష్ణావతారంబుల సంగతు లిదివఱకే వక్కాణించితిని.

దుష్టక్షత్రియులు వృద్ధిఁజెంది లోకములఁ గాఱింపుచుండఁ బుండరీకాక్షుండు పరశురాముఁడై గండగొడ్డలి దీసికొని యిరువది యొక్కమాఱు దుష్టులగు భూపతుల వధించె నిది యావేశావతారము.

బలరామరూపము కృష్ణునకు సహాయముగా నవతరించిన యంశావతారము. కల్క్యవతారము పూర్ణము. బుద్ధావతారము తామసజన మోహనోపయోగముగనుక యావేశావతారమనియే చెప్పవచ్చును. 1304

సుశీలుఁడు

శివుండొకానొకసమయంబునఁ గోపించి విష్ణునిఁగాంచి నీవుదశావతారంబు లెత్తుదువుగాకయని శపించెననియు నట్లే దుర్వాసుండు శపించెననియు నక్కారణంబున నారాయణుండు బహువిధావతారంబులెత్తి సుఖదుఃఖంబు లనుభవించెననియుఁ గొందఱు చెప్పుచున్నారు. వెండియు హరిప్రేరణముచేఁ జక్రాయుధంబు భృగుపత్నిని వధింపఁగా నమ్మునీంద్రుండు కుపితుఁడై తనభార్యను గూల్చినవాఁడు తనవలెఁ బత్నీవియోగంబుఁ జెందుఁగాకయని శపింపఁగా భగవంతుఁడు రామావతారకాలంబునఁ గొన్నాళ్లు సీతావియోగదుఃఖ మనుభవించె ననియుఁ జెప్పుదురు యీవాక్యంబులకు సమాధానమేమి ? 1305

వరవరముని

ఈ నీరసవాక్యంబులకు జవాబీయవలసినపనిలేదు. కాని శంకాపిశాచంబు నిన్నుబాధింపుచున్నదిగాన వచింతునాకర్ణింపు మెట్లంటివేని భగవంతుఁడు రాఘవుండైనప్పుడు పాదధూళిచే నహల్యా శాపంబు వాపి సురూపంబొసంగెను. గృధ్రంబైన బ్రహ్మదత్తుని శాపంబుఁ దొలంచి చక్రవర్తినిఁజేసెను. కబంధ విరాధాదుల శాపంబు లడంచెను. శ్రీకృష్ణుండు బ్రాహ్మణశాపంబుచే నృగుం డూసరవెల్లియై యచేతనంబుభంగిఁ బడియుండఁగా హస్తస్పర్శచేఁ బవిత్రునిఁ జేసి

స్వర్గంబునకుఁ జేర్చెను సుదర్శనుఁడను గంధర్వుని సర్పరూపంబుఁ దొలం
చి సురూపంబొసంగెను మఱియు మధుసూదనుండు రామకృష్ణాద్యవ
తారంబులయందు శాపంబుల రూపుమాపిన చరిత్రంబులు వేనవేలు
గానున్నవి లెక్కింపసాధ్యముకాదు భర్గుండు భగవద్రామకృష్ణావతారం
బుల నుపాసించి స్తోత్రముచేసినట్లు భారత భాగవత రామాయణ హరి
వంశాదులయందుఁ గానఁబడుచున్నది తనశాపమునల్లవచ్చిన మాట
నిక్కమైనచో భవానీపతి భగవదవతారంబులనెట్లు పూజించునింతే
కాక శివాశివాభక్తులు రామ మంత్రోపాసకులని శాస్త్రంబులు
ఘోషింపుచున్నవి సూరివర్యులు నట్లే చెప్పుచున్నారు ఇదియిట్లుండఁ హం
సడిభకులను రాక్షసులు దుర్వాసుని మర్దింపఁగా నతండేడ్చుచుం
బోయి రాక్షసవధార్థమై కృష్ణునకు శరణాగతి చేయఁగా నప్పురుషోత్తము
ఁడంగీకరించి యద్దనుజులవధించి మునిదుఃఖంబార్చెను మఱియు నద్దు
ర్వాసుండంబరీషుని కెగ్గొనరించి హరిచక్రముచే భయంబొంది యంబరీ
షుని శరణొందెను పాండవుల విషయంబున నయ్యత్రిసుతుండపకారము
చేయనెంచి కృష్ణుని ప్రభావంబుచే వ్యర్థుండైపోయె నట్టి యల్పముని
భగవంతునెట్లు శపించెను తదీయశాపంబు గోవిందునేమి చేయఁగలదు
ఇట్టి తుచ్ఛవాక్యంబులకేమని సమాధానంబిత్తును వెండియుఁ బది
యాఱువేలమంది మునిపుంగవు లొక్కచోటఁ జేరి త్రిమూర్తులలోఁ బర
బ్రహ్మమెవ్వఁడని శంకించి పరీక్షించిరమ్మని భృగుమహర్షిని బంపఁగా
నతండరిగి యట్లొనర్చి తిరిగివచ్చి కర్మందిజనులతో నయ్యలారా
రుద్రుండు తమోగుణప్రధానుఁడు విరించి రాజసుఁడు శుద్ధసత్త్వగుణుం
డగు నారాయణుండొక్కఁడే పరాత్పరుఁడని చెప్పఁగా నమ్మునిపుంగ
వసహస్రంబులు సూతపౌరాణికు నూతగాఁగొని నారాయణార్పణము
గా వేయివర్షంబులు దీర్ఘసత్రయాగంబుఁ గావించి ముక్తినొందిరి. యిది
యిట్లుండఁగా దాశరథి బాల్యమునందె హరధనుర్భంగమొనర్చెను
రుద్రశిష్యుండగు పరశురామునోడించెను, కృష్ణుండు వైష్ణవజ్వరముచే

మైనవ్యాజంబునుమచ్చుమాసి శూలినిమూర్ఛిల్లఁజేసి బాణాసుర బాహు
పరంపరల ఖండింపగాఁ బినాకి కృష్ణునిఁ బ్రార్థించి బాణునిరక్షింపించెను
శాపదోషంబులుకర్మబద్ధులగు శరీరులయందుఁ బ్రసరించి గజిబిజిచేయు
నుగానినిత్యముక్తుల నంటఁజాలవు. భగవత్కృపాపాత్రులగు నిత్యము
క్తులనంటని శాపంబులు పాపంబులుభగవంతునెట్లుబాధించునుస్వకీయా
చార్యుండగు ద్రోణుని, మహాభక్తుండగు భీష్ముని,జ్ఞాతులగు దుర్యోధ
నాదులను. వివిధబాంధవులను సంహరించిన పాండవులకు గృష్ణానుగ్ర
హంబుఁచే బాపంబు సంభవింపఁ దయ్యె నింతేకాక గోవత్సార్భకులనం
తర్ధానముసేసిన విరించియు బాణాసురుని విషయములో రుద్రుండను
బారిజాతాపహరణవేళ నింద్రుండును బ్రత్యక్షముగా డీకొని కృష్ణుని
జయింపఁజాలరైరి శాపంబుచేఁ గస్తినొందింపఁగలరా వివేకములేనివా
రిట్టికల్పనా కథలునచింపుచుందురు బుద్ధిమంతులు విశ్వసింపరాదు. ని
వాస్తవమేమోయనిశంకింపనురాదు, 1306

సుశీలుఁడు

భృగుమహర్షి విష్ణునిశపించినట్లు రామాయణోత్తరకాండంబున
నున్నది. గాంధారి శ్రీకృష్ణునిశపించినట్లు భారతంబునగలదుగదా 1307

వరవరముని

అట్టిశాపంబులు లీలాగృహీత దివ్యదేహుండగు కేశవుండు
ధర్మసంస్థాపనార్థముగా నవతరించియుండుటచే సాధ్వీ దేవముని ప్రభా
వంబులు వెల్లడింపనెంచి యంగీకరించినట్లు నటించి వారివారికన్నిరు
మథుచు నింతేకాని కర్మబద్ధులమాడ్కి జనార్దనుం డనుభవింపవల
సినదిలేదు. అవాఙ్మానసగోచరుండగు మాధవుని పరస్వరూప మెవ్వరి
కిని గోచరింపదు. హరవిరించనాదిదేవతలకు నారద వ్యాసాదిమునిపుంగ
వులకు భక్తులకుజ్ఞానముకొలఁది తెలుసుకొని శక్తికొలఁది నుతించు
టకు భగవదవతారంబులే సౌభాగ్యంబులై యున్నవి. పరబ్రహ్మము
రామ కృష్ణాద్యవతారంబు లెత్తనిచో లోకము అజ్ఞానాంధకారాస్ప

త్వమై శరీరధారు లచేతనప్రాయులై నశింతురు, వెండియు దేనివల్లఁ జావులేకుండ వరంబుఁగైకొన్న రావణ హిరణ్యాక్షాదులవధించి బ్రహ్మ రుద్రాదుల వరంబులు వ్యర్థంబొనర్చిన కమలాక్షున కన్యదేవతల శాపంబు లేమిచేయును! దీనిఁబట్టియే, 1308

శ్లో॥ జన్మ కర్మచ మేదివ్య, మేవంయోవేత్తి తత్త్వతః
త్యక్త్వా దేహం పునర్జన్మ, నైతిమామేతిసోఽర్జున

అర్జునా! మదీయావతారంబులు నాయవతారంబులయందొనర్చిన పనులు ప్రాకృతములుగాక దివ్యములని యెఱింగినవాఁడు దేహము విడిచి మోక్షముఁజెంది పునర్జన్మము నొందడని గీతాచార్యులవా రానతిచ్చిరి. భగవద్దూషకులొందు దుర్గతియు నిదివఱకే చెప్పితిని. దాహాతురుండు భాగీరథీనదినిడాసి నీరంబుఁ గ్రోలఁజాలకయు క్షుదా తురుండు మృష్టాన్నంబుఁబ్రాపించి తినలేకయు మృతినొందిన చందంబున మాంసనేత్రముల కత్యంత దుర్లభుండును మోక్షప్రదాతయు నగు శ్రీమన్నారాయణుండు మహాదయతోఁ జేతనుల నుద్ధరింప నీలోకంబున జనింపఁగాఁ గన్నులారఁ గాంచి చేతులారఁ బూజించి నోరార నుతించి మనసారధ్యానించి శాశ్వత సుఖప్రదంబైన ముక్తి నార్జింపఁజాలక కుయుక్తులు నన్ని కల్యాణగుణ సముద్రుండగు కేశవుని నిందించి కలుషాత్మకులై చరించు వారినిఁ గ్రూరదండనములచేఁ యముండు దిద్దుబాటు సేయఁగలయునేకాని పండితులచేతఁగాదు. చరణాయుధంబు కాలితో నెట్టివేసినను రత్నంబు మూల్యంబు నెడఁబాయదు. సూర్యునిపైకిఁ జిమ్మ యత్నించినచో నాదుమ్ము విహాయసమున కేగక చిమ్మువారిపైఁ బడఁగలదు. దురాత్ములట్లే భగవదవతార దూషణ మొనర్చి చెడుటయేకాని రమాపతికిఁ గొఱంత కొదా అడిల్లుము.

# హరిహర తారతమ్యము

సుశీలుఁడు

విష్ణువు లోకారాధ్యుఁడై సర్వేశ్వరుఁడై సర్వనియంతయై సృష్టిస్థితి సంహారకర్తయై యుండఁగా రుద్రుండు త్రిపురాసురుల వధింపనేల?

వరవరముని

ముందుగా మునినిలింపులు గంగాధరునికడకరిగి త్రిపురాసురవధఁ గావింపుమని ప్రార్థించి ఫలంబుగానక హరికడకేగి మొఱఁబెట్టఁగా వల్లెయని యంగీకరించి గోవిందుఁడు బౌద్ధావతారమెత్తి త్రిపురాసురాంగనల పాతివ్రత్యంబుపాయంబుచే నశింపఁజేసి యుద్ధసమయంబున శివునకు విష్ణువు బాణముగానుండి యవ్విభావరీచరుల వధింపఁజేసెను. 1311

సుశీలుఁడు

విష్ణుం డయ్యసురులఁ దానే యేల వధింపఁగూడదు ? 1312

వరవరముని

నారాయణుని సృష్టిస్థితిసంహారములు రెండు విధములుగా నుండు నెట్లంటివేని, అద్వారకసృష్టి, సద్వారక సృష్టి, అద్వారకస్థితి, సద్వారక స్థితి, అద్వారకసంహారము, సద్వారకసంహారము, వానిలో నితరులు లేక స్వయముగా జేయునది అద్వారకమనఁబడును. బ్రహ్మరుద్రేంద్రాదులయం దంతర్యామిగానుండి చేయించునది సద్వారకమనంబడును. భగవంతుఁడు స్వకీయ నాభీకమలంబున బ్రహ్మను సృష్టించి వేదము లతనికొసంగి ప్రళయోదధిమగ్నమైన భూమి నుద్ధరించె నది యద్వారకసృష్టి. బ్రహ్మచేఁ జేయించినది సద్వారకసృష్టి. ధ్రువ బలి విభీషణాదులకు రాజ్యంబు లొసంగినది యద్వారకస్థితి.

బ్రహ్మేంద్రాదులచేఁ గుబేరాదుల కిప్పించిన యైశ్వర్యాదులు సద్వారకస్థితి మధు కైటభ హిరణ్యాక్ష హిరణ్యకశిపు రావణ కుంభకర్ణాదుల వధించినది యద్వారక సంహారము నముచి పాక బల వృత్రాదుల నింద్రుని చేతను, తారకాసురాదులఁ గుమారుని చేతను, గజాసుర త్రిపురాసురాదులను శివుని చేతను జంపించినది సద్వారకసంహారము.

సుశీలుఁడు

భగవంతుఁడీ యద్వారక సద్వారక కృత్యము లెప్పు డేవిధముగాఁ జేయును ? 1314

వరవరముని

సర్వేశ్వరుఁడు పైఁజెప్పఁబడిన కృత్యములు దేశ కాల పాత్రానుగుణముగా స్వేచ్ఛానుసారముగాఁ జేయుచుండును 1315

సుశీలుఁడు

సర్వేశ్వరుఁడు సర్వశక్తుండై యుండియు బ్రహ్మ రుద్రాదుల చేతఁ జేయించుటకుఁ గారణంబేమి ? 1316

వరవరముని

మిక్కిలి బుద్ధిమంతుఁడగు గృహస్థుఁడు తానుదిను పదార్థములను స్వకీయ దార పుత్ర భృత్యాదులకు నిచ్చును. తానుక్రుంకెడు తీర్థంబులకు వారింగొనిపోయి గోభూహిరణ్యాది దానంబులు వారిచేతఁ గూడఁ జేయించు నదే ప్రకారముగా భగవంతుఁడు సృష్టి స్థితిలయంబులు సంకల్పమాత్రముచేఁ జేయఁజాలియు స్వకీయులగు బ్రహ్మ రుద్రాదులకుఁ గీర్తిలీయంగోరి విలాసముగా వారిచేఁ గొన్నిపనులు సేయించును. రావణసంహారకాలమునఁ గొంత యద్వారకముగాఁ జేసి కొంత సద్వారకముగా జేయించెను. భారతయుద్ధకాలంబున నంతయు సద్వారకముగానే చేయించెను. అది పరమాత్మ యిచ్ఛ ననుసరించి యుండునుగాన నిది యిట్లేల జరిగె నిదియేల జరుగలేదని యడుగుట కెవ్వరికైనను నావకాశముగాని యధికారముగాని లేదు. 1317

సుశీలుఁడు

దేవతలకుఁ బ్రాణాపాయముఁ గలిగించిన హాలాహలమును శివుఁడువచ్చి భక్షించినదాఁక విష్ణు వచ్చోటనేయుండి యేమియు జేయఁజాలఁడయ్యె నప్పు డతని సర్వశక్తి యేమయ్యెను ? 1318

వరవరముని

హాలాహలంబుపుట్టగానేపూర్ణజ్ఞానములేని నిలింపులు కొందఱు పార్వతీపతి నాశ్రయింపఁబోయిరి. ఇంతలో హాలాహలముచే ననేకులు సచ్చుచుండిరి. నారాయణుం డవ్విపత్తునుగాంచి సర్వశక్తుండుగనుక గరళమంతయు భక్షించి రుద్రునకుఁ గోపమురాకుండఁ గొంచెముంచె నింతలో హరుం డరుగుదెంచి యాస్వల్పక్ష్వేడము భక్షించి వెంటనే మైకమునొంది పడిపోయె నటుపిమ్మటఁ బార్వతివచ్చి ప్రత్యనయనము నంపును నారాయణనామములచే నభిమంత్రించగా విషదోష రహితుఁడై శివుండు సుఖించె నందువల్లనే కంఠమునుండి గరళము క్రింది భాగమునకు దిగలేదు. గరళము పూర్ణముగాఁ గ్రోలుటవల్లనే విష్ణు వదివఱకు హంసావతార హయగ్రీవావతారాదులయందు ధవళశరీరుఁడైయుండి తరువాత నీలమేఘవర్ణుఁడయ్యె నిక్కథ పురాణాంతరంబునఁగలదు. 1319

సుశీలుఁడు

విష్ణువు మోహినీరూపము ధరించినప్పుడు శివుండు మోహినిం బట్టుకొని రమించెననియు నప్పుడు కాలభైరవుఁడను కొడుకుపుట్టె ననియు నందువల్ల వాసుదేవుండు స్త్రీప్రాయుఁడనియు శివుఁడు మహా పురుషుఁడనియు శైవులు సెప్పుచున్నారే ! 1320

వరవరముని

పూర్వము రామానుజులవారికాలంబునఁ జోళరాజసభకు మన కూరత్తాళ్వారింబిలిపించి రాజాజ్ఞచే శైవపండితు లిట్లే ప్రశ్నించిరికాని

శ్రీవత్సాంకమిశ్రు లొంటరిగా వెళ్ళినను వారికా శైవసభ శ్రీరామ
చంద్రస్వామికి ఖరదూషణాది రాక్షసులవలె నతిసులభముగానుండె
నటుపిమ్మటఁ దత్త్వవిదగ్రేసరుండగు కూరేశుండా శైవులంగాంచి శైవు
లారా! మీరిచ్చిన ప్రశ్నవల్లనే మీ శివపరత్వము శుష్కించినది.
ఎట్లనఁగా శ్రీమన్నారాయణుఁ డనాదిపురుషుండగుటయేగాక పురు
షోత్తముఁడని వేదములు సాటింపుచున్నవి. పుంస్త్వ మతనికేఁ దక్క
నెవ్వరికిలేదు. దీనికుదాహరణముగా,

శ్లో॥ సఏవ వాసుదేవోఽయం సాక్షాత్పురుష ఉచ్యతే
స్త్రీప్రాయమేతత్సర్వం జగద్బ్రహ్మ పురస్సరమ్

వాసుదేవుఁ డొక్కఁడే పురుషుఁడని చెప్పఁబడుచున్నాడు.
బ్రహ్మదేవునితోఁగూడిన జగత్తంతయు స్త్రీప్రాయమని చెప్పఁబడుచున్న
దని విష్ణుపురాణమునందుఁ బరాశరమునీంద్రులు తీర్మానించి రట్టి
విష్ణువు వేషముమార్చినంతమాత్రమునఁ బుంస్త్వముపోయి స్త్రీత్వ
మెట్లువచ్చె నొకసౌందర్యవంతుఁడగు పురుషుఁడు మీసాలుగొరిగించి
హారిదళమువేసి చీరఁగట్టి రవికఁ దొడిగినమాత్రమున నదివఱకున్న
పురుష చిహ్నములుపోయి స్త్రీ చిహ్నములు రావుగదా? రాత్రికాల
మున నాటకరంగమున నంగనా వేషము ధరించినవాఁడు తెల్లవారఁ
గనే పురుషుఁడుగానేయుండి పెండ్లానికి మగండగుచున్నాడేగాని మగ
నికిఁ బెండ్లామగుటలేదుగదా? రాక్షస మోహనార్థము మాధవుండు
మోహినీరూపంబుధరించి సురలకమృతంబుఁ బంచియిచ్చినమాటవిని
హరుం డొక్కతఱిం గేశవునిఁగాంచి దేవా! రాక్షసు లజ్ఞులుగనుక
నీమోహినీరూపంబుచే మోసపోయిరిగాని నేనట్లగుదునాయని గర్వీం
చఁగా నంతటఁ గైటభారి మోహినీరూపంబుఁజూపె. వాస్తవస్త్రీయని
భ్రమించి శర్వుండు వెంటఁబడియె నింద్రియస్ఖలనంబుగాఁగాఁ దెలివి
నొంది శ్రియఃపతికి నమస్కరించి యపరాధ క్షమాపణ చేసికొనియె
నని భాగవతంబునంగలదు. ఇదియిట్లుండఁగా నంగనావేషధారియగు

పురుషునిఁగాంచి యంగనయని భ్రమించువాఁడు సామాన్యులలో నధముఁడని చెప్పఁబడుచున్నాఁడు. అట్టిజ్ఞానహీనుఁడు పరబ్రహ్మము కాఁజాలఁడు. వాస్తవాంగనను మోహించువాఁడైన నింద్రియకింకరుఁ డగుటచేఁ బరాత్పరుఁడు కాఁడు. శైవులారా మీరిచ్చిన ప్రశ్నము వల్లనే మీశివపరత్వము కొట్టుపడినది యిఁక నేమిచేయుదురనఁగా శైవులు నిరుత్తరులై పంక్తికిలించిరి. 1321

## సుశీలుఁడు

పురుషున కంగనాత్వము రాదని చెప్పితిరిగదా? ఋక్షవిరజుఁ డొక్కకొలంకులోమునిగి స్త్రీయై విహరింపుచుండఁగా రవి శక్రులు మోహింపఁగా రవివీర్యము గ్రీవాస్థానంబునంబడఁగా సుగ్రీవుఁడుపుట్టె ననియు నింద్రుని రేతస్సు పృష్ఠభాగంబునఁబడఁగా వాలిపుట్టెననియు దమపరి మగవాఁడై వారిద్దఱినిఁ బోషించెననియు రామాయణోత్తర కాండంబుననున్నది. వెండియు నిలుండు మొదలగువారు కొంతకాలము స్త్రీలై బిడ్డలఁగనినట్లు మరలఁ బురుషులైనట్లు వినుచున్నాము గదా? నారాయణుఁ డంగనారూపముధరించినప్పు డంగనాత్వ మేల పొందఁగూడదు? 1322

## పరవరముని

కర్మబద్ధులైన జీవులకు నేశరమైనను నిల్కడగానుండక కర్మాను సారముగా దేవ తిర్యగ్మనుష్య స్థావరశరీరములు వరుసగా సంభవించుచుండును. అందులో స్త్రీత్వము పుంస్త్వము నపుంసకత్వము కలుగుచుండును. సర్వేశ్వరుఁ డట్టివాఁడుకాఁడు. కావుననే గీతా శాస్త్రమునందుఁ బురుషోత్తమ ప్రాప్తియోగములో, 1323

శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే, క్షరశ్చాక్షర ఏవచ
క్షర స్సర్వాణి భూతాని, కూటస్థోఽక్షర ఉచ్యతే
ఉత్తమ పురుష స్త్వన్యః, పరమాత్మేత్యుదాహృతః

యోలోకత్రయమావిశ్య, బిభర్త్యవ్యయ ఈశ్వరః
యస్మాత్క్షరమతీతోఽహం, మక్షరాదపిచోత్తమః
అతోఽస్మిలోకేవేదేచ, ప్రథితఃపురుషోత్తమః

లోకమునందు క్షరుఁడని యక్షరుఁడని యిద్దఱు పురుషులు గలరు. సర్వభూతసమూహము క్షరుఁడనఁబడును. కూటస్థుఁడనఁగా ముక్తపురుషుఁడు. వాఁడే అక్షరుఁడనఁబడు పురుషుడు ఈక్షరాక్షర పురుషులిద్దఱికంటె నన్యుఁడు ముల్లోకముల నావేశించి రక్షించుచు నవ్యయుఁడై నియామకుండై యుండువాఁడు పరమాత్మయని చెప్పఁబడుచున్నాఁడు. నేను క్షరునతిక్రమించి యక్షరునికంటె నుత్తముఁడనైనందువల్లనే లోకమునందును వేదమునందునుఁ బురుషోత్తముఁడని ప్రసిద్ధిఁజెందితినని భగవానుఁడుసెప్పెను. దీనిచేమధుసూదనునకు వికారములేదని తెలివదియింతేకాక,

శ్లో॥ కఇతిబ్రహ్మణోనామ, ఈశోఽహంసర్వదేహినాం
ఆవాంతవాంగసంభూతౌ, తస్మాత్కేశవనామవాన్

క, అనఁగా బ్రహ్మ సర్వశరీరులకుఁ బ్రభుండనగు నేనీశుండను. మేమిద్దఱము నీదేహమునందుఁ బుట్టితిమి తత్కారణంబున నీవు కేశవనామధేయుండవైతివని శివుఁడుగోవిందుని నుతించెను, 1324

సుశీలుఁడు

తరువాతఁ గూరేశులేమిచేసిరి ? 1325

పరపరముని

శైవులు సమాధానము సెప్పలేక నిరుత్తరులైన పిమ్మటగూరేశులు చోళభూపతింగాంచి రాజా నీవుసంపాదించిన శైవపండితులందఱు వాదమున నోడిపోయిరి శాస్త్రపరిచయము లేనందువల్ల నీకా వార్త తెలియదు తెలియునట్లుసెప్పెదనాకర్ణింపు మెట్లంటివేని కాలుసాచినవాఁడొకఁడు సాచినకాలుకడిగినవాఁడొక్కఁడు కడిగిననీరు శిరస్సున

ధరించినవాఁడొకఁడు ఈమువ్వురిలో గొప్పవాఁడెవఁడని యడుగఁగాఁ చోళపతి కూరేశునిఁగాంచి యయ్యా కాలుసాచినవాఁడు గొప్పవాఁడు కడిగినవాఁడు రెండవవాఁడు తత్తీర్థమును శిరస్సునధరించినవాఁడు ఇద్దఱికంటెఁ దక్కువవాఁడు సరేకాని యిప్పుడీ ప్రస్తావనయెందుకని పలికెనప్పుడు శ్రీవత్సాంకమిశ్రులు రాజుతో రాజేంద్రా బలిచక్రవర్తికై శ్రీహరిత్రివిక్రమావతారముఁ దాల్చి బ్రహ్మాండమును గొలుచునప్పుడు బ్రహ్మాండకర్పరమునుఁ బాదముచేఁ దాటింపఁగా నదిపగిలెదానినుండి యావరణజలము వెలికివచ్చుచుండఁగా నండసంస్థితశరీరుల కపాయమని యెంచి విరించి యాజలముచే హరిపాదంబుఁ బ్రక్షాళించి యాపవిత్రజలమును కమండలువునందుంచి కర్పరరంధ్రమును మూసె నటుపిమ్మట గమండలుజలమును భగీరథునికాలంబున భూలోకంబునకు విడిచె నాగంగానదిని శివుండుత్తమాంగంబున ధరించి పావనుండయ్యె విష్ణుప్రభావంబు శైవులగు మీకు దెలియకున్నను మీశివునకు బూర్తిగాఁ దెలిసియున్నదని చోళపతిని నోరుమూయించి గూరత్తాళ్వారు శ్రీరంగంబున కేగిరి.

## సుశీలుఁడు

ఒకానొకసమయంబున రుద్రుండొక్కచోటఁ గూర్చుండి విష్ణుబ్రహ్మలఁ బిలిచి తనశిఖను జూచి రమ్మని బ్రహ్మను పాదములుసూచి రమ్మని విష్ణునిఁ బంచె నటుపిమ్మటఁ గమలాసనుం డనేకసంవత్సరములు పైభాగమునకుఁ బోయి తదీయశిఖనుఁగాన లేక విసికి తనవలె దురవస్థజెందివచ్చుచున్న కామధేను కేతకీపుష్పములతో దురాలోచనచేసి వచ్చి శిఖనుఁగాంచితినని బ్రహ్మపలికెను కేతకీసుమము కామధేనువు నీధాత నీశిఖనుఁగాంచిన మాటవాస్తవమని పల్కుచుండఁగా సురమాహావాలము వట్టిదని పల్కెననియు వీరుమువ్వురబద్ధమాడినందున శివుండుకోపించి బ్రహ్మకు లోకములోఁ బూజలేకుండఁబోవునట్లును మొగలిపూవు దేవతాపూజకర్హముకాకుండునట్లును కామధేనువు నోటితో నబద్ధమాడి తోఁకతో సత్యమాడినందున ముఖము ప్రభాత

దర్శనసౌభాగ్యము కాకుండుననియు తోఁకమాత్రము సౌభాగ్యమనియు
శపించెనట తరువాత విష్ణువు బహుకాలంబునకు వచ్చి నిపాదంబు నెన్ని
వేలసంవత్సరము లన్వేషించిననాకుఁ గనపడలేదని చెప్పఁగా హరుండు
సంతోషించి హరికి లోకపూజ్యుండవగుమని వరంబిచ్చెనఁట యిది
సత్యమేనా? 1327

వరవరముని

శివుండు తనపాదములు చూచుటకును హరిని శిఖనుఁగాంచు
టకు బ్రహ్మను పోయిరమ్మని చెప్పినాఁడంటివి దేనితోఁ జెప్పెను 1340

సుశీలుఁడు

నోటితోనే చెప్పెను 1328

వరవరముని

నోరెక్కడనుండెను 1329

సుశీలుఁడు

తలకుఁ గ్రింది భాగములో నోరుండెను 1330

వరవరముని

నోటిపైన శిరముకానఁబడుచుండఁగా బ్రహ్మదేవుఁడనేక వర్షం
బులు వెదకవలసినపనియేమి తలకుసరిపడునట్లు కరచరణాద్యవయవము
లుండునుగాని కొంచము విశాలమగు నోటిపైని లక్షయోజనముల దీర్ఘ
మగుశిరస్సెట్లుండునుండినచో దేహధారియెట్లు మోవఁగలఁడు మోచుట
లట్లుండఁగా నెంత వికారముగానుండునది యట్లుండఁ నేబదికోట్లయో
జనముల పరిమితిగల బ్రహ్మాండమునుఁ బాదముతోఁ గొలిచిన కేశవు
నకు నడచిపోయి శివునిపాదము వెదకవలసిపనియేమి? ఈకథ యెంతస్వార
స్యముగానున్నది తామసపురాణములన్ని యిట్లేయుండును దీనినిఁ
దామసులువిశ్వసింతురేగాని సాత్వికవిశ్వసనీయముగాదు బ్రహ్మాండ
గర్భుఁడగు వాసుదేవుఁడు వెదకవలసిన దేమున్నది 1331

సుశీలుండు

కాశీ మరణాన్ముక్తిః=కాశిలోఁజచ్చినవారికి మోక్షమున్నదను శాస్త్రోక్తిచే శివుండు మోక్షప్రదాయకుఁడని తోఁచుచున్నదే!

వరవరముని

దానికిఁ గారణములేకపోలే దెట్లంటివేనిఁ బూర్వ మొకప్పుడు కాశీవిశ్వేశ్వరుఁడు వేయిసంవత్సరములు శ్రీరామునిఁగూర్చి తపస్సు చేయఁగా నద్దేవుండు ప్రసన్నుండై వరంబుఁగోరుమనఁగా దుర్గాపతి సంతసించి స్వామీ! కాశీ పంచక్రోశమధ్యమునందుఁ జచ్చువారికి ముక్తినిమ్మని ప్రార్థించె నప్పలుకులకు రాఘవుండలరి శివా! నీవిది వఱకే మదీయ రామ షడక్షరీమంత్రజపంబుచే సిద్ధినొందియున్నావు. శరీరుల కవసానకాలంబున నమ్మంత్రం బుపదేశింపుమని శాసించి సీతా వల్లభుం డంతర్హితుండయ్యె నదియాదిగా నింతవఱకు భర్గుం డప్పని చేయుచున్నాఁడు, ఈరహస్యంబెఱింగి మతాంతరు లంత్యకాలంబునఁ గాశికేగుదురు. మనకది యవసరంబులేదు. భగవద్రామానుజ సిద్ధాంతంబునందుఁ బ్రవేశించి తదీయ చిత్తానుసారంబుగా ద్వయానుసంధాన పరులమైతిమేని మోక్షము కరతలామలకమైయుండును. 1333

సుశీలుండు

అయ్యా! విష్ణువు నృసింహావతారమెత్తినప్పుడు రుద్రుఁడు శరభ రూపియై నృసింహుని జయించెనని శైవపురాణంబులయందున్నది అది సత్యమయ్యెనేని వాసుదేవుండు సర్వోత్కృష్టుండెట్లగును? 1334

వరవరముని

శ్లో॥ బ్రహ్మాణమింద్రంరుద్రంచ, యమంవరుణమేవచ
నిగృహ్యహరతేయస్మాత్తస్మాద్ధరిరిహోచ్యతే

బ్రహ్మను దేవేంద్రుని రుద్రుని యముని వరుణుని నిగ్రహించి స్వాధీనము చేసికొన్నందువల్ల విష్ణువునకు హరియనునామము సార్థకం బయ్యెనని శాస్త్రోక్తికలదు అట్టినారాయణునెవ్వఁడు జయింపఁగలుగు

హిరణ్యకశిపునిఁ జంపి మహోగ్రరూపంబుతో నుండు నృసింహ తేజస్సు సహింపలేక వేల్పులు స్తోత్రము సేసి ఫలంబుగానక సింహంబునకు వైరి శరభంబుగావున శరభరూపంబుతో నెదిర్చి వారింపుమని రుద్రునిఁ బ్రార్థించిరి రుద్రుండు శరభరూపియై నృసింహునిఁ డీకొనియె నయ్యవసరంబున

శ్లో॥ తతస్స్ఫురంతమాదాయ, రుద్రం శరభరూపిణం
విదదార నఖైస్తీక్ష్ణైః హిరణ్యకశిపుం యథా

నృసింహుండు హిరణ్యకశిపునిఁ జీల్చినట్లు తీక్ష్ణములగు నఖములచే శరభరూపియగు రుద్రునిఁ జీల్చెను, 1335

శ్లో॥ పతితం భీమమత్యుగ్రం గతాసుం ద్రష్టుమాగతాః
ఋషయో దేవగంధర్వాః, యత్ర శేతే హతో హరః
తం దృష్ట్వా పరమం జగ్ముః, విస్మయం తే దివౌకసః
ప్రశశంసు స్తథా కర్మ, నారసింహస్య చాద్భుతమ్

నృసింహునిచే నిహతుండై గతాసుండగు రుద్రునిఁ గాంచి ఋషులు దేవగంధర్వాదులు నరసింహుని యద్భుత కృత్యమును నుతించిరి 1336

ఇట్టిప్రమాణంబు లనేకములు గలవు విస్తర భీతిచే మానితి నింక నడుగఁ దలఁచిన దాని నడుగుము 1337

సుశీలుఁడు

రామకృష్ణుల విషయములో రెండు సందేహములు బాధింపుచున్నవిగాని యవి భగవదపచార వాక్యంబులగుటచే రసనేంద్రియంబు భయపడుచున్నది 1338

కురంగసోమయాజి

వారి కా విషయములో భయముగానున్నవట నేనడుగ వచ్చునా 1339

వరవరముని

స్వామీ మీపేరేమండి? 1340

కురంగసోమయాజి

నాపేరు కురంగసోమయాజియని జనులాహ్వానింతురు. 1341

వరవరముని

మీసిద్ధాంత మేమి? 1342

కురంగసోమయాజి

నేనద్వైతినండి! 1343

వరవరముని

మీసిద్ధాంతప్రకారము ప్రపంచమంతయు మిథ్యగదా? మీరడుగవలసినది నేనుసెప్పవలసినదేమున్నది? 1344

కురంగసోమయాజి

అయ్యో మాకుఁ బారమార్థికమందు మిథ్యగాని వ్యావహారికమందంతయు సత్యమేగదా మాకును లింగపూజ విగ్రహపూజ స్నానము జపము దానము తీర్థసేవ మొదలైన వన్నియునున్నవిగా!

వరవరముని

అట్లైనచో నడుగండి 1346

కురంగసోమయాజి

శ్రీరామచంద్రుఁడు పరాత్పరుఁడైనచో రావణవధానంతరము బ్రహ్మహత్యాదోషో పశాంతికై శివలింగ ప్రతిష్ఠ యేలచేసెను 1347

వరవరముని

మీరేగ్రంథములఁ జూచియుంటిరి 1348

కురంగసోమయాజి

గ్రంథముల మాటలటుండనిచ్చి మాపెద్దవారు పరంపరగా నాడుకొను వాక్యములచే వినియున్నాను 1349

పరవరముని

బ్రహ్మానందప్రభావముచే దివ్యదృష్టిని సంపాదించి యథార్థరామచరిత్రమును రచించినవాఁడు వాల్మీకి వాల్మీకిరామాయణ మాదికావ్యము దానికిముందు గద్యకావ్యములే కాని పద్యప్రబంధములు లేవు వాల్మీకిరామాయణము గురుముఖమున నభ్యసించి పఠించి బహుజనులు పండితులై కవీశ్వరులైరి యుక్తాకారణంబున రామచరిత్రమునకు వాల్మీకికృత రామాయణమే ముఖ్యప్రమాణము ఇదిగో వాల్మీకి రామాయణము దీనిలో మీరన్నవాక్యము చూపించండి 1350

కురంగసోమయాజి

శ్లో॥ అత్రపూర్వమ్మహాదేవః ప్రసాదమకరోత్ప్రభుః

అనఁగా నింతకుఁబూర్వము ప్రభువైనమహాదేవుఁడు నాయందనుగ్రహముచేసెనని రాముఁడు సీతామహాదేవికిఁజెప్పెనుగదా 1351

పరవరముని

శివుండు రామునను గ్రహించినది సేతుబంధన కాలమునందా పునరాగమనకాలమునందా? 1352

కురంగసోమయాజి

సేతుబంధనకాలమునందే 1353

పరవరముని

సేతుబంధన-కాలమునందే సీతాపతి శివలింగప్రతిష్ఠచేసెనంటివి అప్పటికి రాములవారు రావణునిఁ జంపలేదుగదా బ్రహ్మహత్య యెట్లువచ్చెను? 1354

కురంగసోమయాజి

కాదు కాదండో పొరపాటువల్లఁ దప్పుచెప్పితిని రావణసంహారముచేసి మరలివచ్చునప్పుడు శివలింగప్రతిష్ఠఁజేసెను 1355

వరవరముని

పునరాగమనకాలమునందు లింగప్రతిష్ఠచేసినట్లైన నత్రపూర్వ
మ్మని యేలచెప్పెను 1356

కురంగసోమయాజి

ఓహో దీనికిట్లువచ్చినదా సంకటము అయితే పూర్వకల్ప
రామావతారమందని యర్థముచేసికొననచ్చును 1357

వరవరముని

పూర్వకల్ప రామావతారచరిత్రముగాని మఱియేగ్రంథములు
గాని యిప్పుడులభింపవు. యిప్పటిమాదిరిగా నీలంక యేయుండి యీరా
వణవధాదులేజరిగెనని చెప్పఁజాలము అప్పటికి నిట్లేజరిగియున్నచో
సేతువ్రసహా అప్పటిదేయుండును మరలసేతునిర్మాణమేల 1358

కురంగసోమయాజి

కాలబాహుళ్యముచే నశించిన సేతువును జీర్ణోద్ధారణచేయించె
నేమో? 1359

వరవరముని

శ్రీరాముని బాణాగ్నిచే బడలి శరణాగతుఁడైన సముద్రుఁడు
పూర్వసేతువు విషయమును జెప్పలేదు సరేగదా ప్రస్తుతము దశ
యోజనవిస్తృతము స్వకీయజలమును గట్టిపరచెదననియు దానిపైవారి
ధిఁగట్టించి వానరసేనతో నవ్వలికేగుమనియుఁ జెప్పెనదియట్లుండఁగా
సనకసనందన శాపముచే రావణకుంభకర్ణులైపుట్టియున్న జయవిజయుల
క్రూరజన్మములఁ దొలంగించుట కౌసలేయునకు ననుగ్రహమేకాని
నిగ్రహముకాదు ఇంతకుమున్ను రావణుండు మోక్షార్థియై హిమవద్గి
రియందున్న సనత్కుమారునియొద్దకేగి ప్రాణికి మోక్షము గల్గుమా
ర్గమెద్దియని ప్రశ్నించిన నప్పలుకులువినియమ్మునీశ్వరుండు రావణునితో
రావణాజగన్నియామకుండును మోక్షప్రదాయకుండును శ్రీహరియే
కానిమఱియొకండు లేడనినుడువఁగా మునీంద్రా నేనాసుర ప్రకృతినై

యింద్రియకింకరుఁడనగుటవల్ల భక్తిచే గోవిందు నుపాసింపఁజాలనతనిచే మృతిఁబొందు నుపాయంబొసఁగిమ్మనిరావు సంపులకమ్మునింద్రుండు సంతోసించి మరలదశాస్యునితో నిశాచరా! త్రేతాయుగంబున నారాయణుండు సూర్యాన్వయంబున రామాఖ్యతో నుద్భవించి యొకానొక హేతువుచే నిన్నువధించునని చెప్పగా రావణుండు లంకకేగి యొక్కనాఁడు రహస్యస్థలమందుండి యిట్లని వితర్కించె నక్కటా నేనిన్నాచిన దాదిగాఁబదివేల వత్సరంబులు బ్రహ్మనుగూర్చి తపస్సుసేసితిని. నవకోటిమహాలయంబులయందుఁ బ్రతిష్ఠించి శివునిఁ గొల్చుచుంటి నీయుద్ధతివల్లను ముక్తిగలుగునని తత్త్వవిదుండగు సనత్కుమారుని చెప్పకపోగా విష్ణువే మోక్షప్రదాయకుండని చెప్పె నేనింతవఱకమ్మహాత్మ్ముని నామోచ్చారణమైనఁ జేయనైతినైన నప్పురుషోత్తమునిచే మృతిగల్గుననియు నపవర్గము గలుగుననియు మునివక్కాణించె నట్టిపుణ్యకాలంబెప్పుడు వచ్చునాయని యెదురుసూచుచున్న రావణునకు రామకృతవధమ్ముసమ్మతమైయున్నది, యింతేకాక రావణునకు బ్రహ్మత్వములేదెట్లంటివేని రావణుండు పులస్త్యబ్రహ్మశాపముచే జనించిన విశ్రవసునకుఁ బుట్టినందున బీజమువల్లను రాక్షసియగు కైకసికిఁబుట్టినందుచే క్షేత్రమువల్లను నసురసంధ్యావేళ జనించినందువల్ల జన్మకాలమువల్లను బుణ్యస్త్రీలఁ గారాగృహంబులనుంచి దేవమునుల బాధించినందువల్ల వృత్తివల్లను రావణునకు బ్రహ్మత్వము కొంచెమైనను లేదు. బ్రాహ్మణుఁడు కాని దుష్టునిసంహరించి లోకములకు మేలొనర్చిన రఘుపతికి నపార పుణ్యము రావలసియుండఁగాఁ బాప మెట్లువచ్చు! నెంతమాత్రమును రాదు. దానినట్లుండనిమ్ము రావణవధానంతరము లంకకువచ్చిన బ్రహ్మాది దేవతలు రామునిఁగాంచి దేవా! నీవీరాక్షసుని వధించుటచే సర్వ లోకంబులుసుఖించె. మహోపకారం బొనర్చితివి. నీవు నారాయణుండవు, సీత లక్ష్మియని స్తుతించిరిగాని నీవు మనుష్య మాత్రుండవు

బ్రహ్మహత్యకలిగినది తద్దోషపరిహారమునకై లింగప్రతిష్ఠ చేయుమని
యెవ్వరును సెప్పలేదు కావున, 1374

సీ॥ అఖిలదేవతల కపాయదమైన శాదంబు
చెలఁగి మృత్కుటంబుఁ జెఱపఁగలదె
బలు జిడ్డుగలిగినవస్త్రమైనను విహా
యసమున నెప్పుడైన నంటఁగలదె
పొదలు వస్తువులసొంపుఁ దోలంచు చెదలు పు
ర్వగ్నిహోత్రునిమీఁది కడరఁగలదె
సాంద్రమైపొల్చు విస్తారాంధకారంబు
కమలబాంధవునిపైఁ గవియఁగలదె
యట్లె సంసృత్యుదధితారకాభిధేయ
వాచ్యుఁడై యజపార్వతీవామదేవ
మానసధ్యేయుఁడైన రామప్రభునకు
హత్యగలుగదు మీరట్లులనుటతగదు. 1375

కురంగసోమయాజి

అట్లైనచో మహాదేవశబ్దమున కర్థమేమి ? 1376

వరవరముని

శ్రీరామచంద్రునకుఁ బ్రసన్నుఁడై సేతుమార్గమును జూపిన వాఁడు సముద్రుఁడగనుక మహాదేవశబ్ద మతనికే చెల్లుచున్నది. దీనికుదాహరణముగా

శ్లో॥ స్నేహం స్నిహ్యం మహచ్ఛద్ధం వారుణం సర్వతోముఖమ్

అని వైజయంతీనిఘంటువులో నున్నదిగనుక మహచ్ఛబ్దము జలపర్యాయమని మహాదేవుఁడనఁగా సముద్రుఁడని మీమహేశ్వర తీర్థులు వ్యాఖ్యానముచేసియున్నారు కావున మహాదేవశబ్ద మిక్కడ 1377
సము[illegible]మేకాని శివపరముగాదు.

సుశీలుఁడు

శ్లో॥ సేతుమధ్యే మహాదేవ మీశానం కృత్తివాస సం
స్థాపయామాసవైలింగం, పూజయామాస రాఘవః

సేతుమధ్యమునందు రాఘవుఁడు కృత్తివాసుఁడగు నీశానుని స్థాపించి లింగపూజసేసెనని కూర్మపురాణమునందును,

శ్లో॥ రామః పుష్పకాదవరుహ్య మహాదేవం ప్రతిష్ఠాపితవాన్

అని పద్మపురాణమునందునుంగలదు. ఇంతేకాక శ్రీరామాష్టోత్తర శతనామములలో శివలింగ ప్రతిష్ఠాతాయని యుండెను. దీనికి సమాధానమేమి ? 1378

వరవరముని

వామన పురాణంబునందును బద్మ పురాణమునందును శ్రీరామచంద్రుఁడు శివప్రతిష్ఠచేసెననియున్నదిగాని హత్యాదోషాప శాంత్యైకై చేసినట్లు లేగ్రంథంబునందును లేదుగదా ? తన భక్తుండైన ధర్మరాజును ధర్మపరిపాలనకై సింహాసనంబుననిలిపి యుధిష్ఠిరప్రతిష్ఠాత యని ప్రసిద్ధిఁగాంచిన శ్రీకృష్ణునిభంగి స్వకీయ సేతుసంరక్షణకై నిజ భక్తుండగు శివునిఁబ్రతిష్ఠించి శివలింగప్రతిష్ఠాతయని శ్రీరాముఁడు పూర్వయుగంబున ఖ్యాతిఁగాంచెఁగాని యనిష్టనివారణకుఁగాని యిష్ట ప్రాప్తికిఁగాని కాదు. 1379

కురంగసోమయాజి

మాపరమశివుఁడు రామభక్తుఁడా ! ఎంత విస్మయము ! 1380

వరవరముని

సోమయాజిగారూ మీరెంతపిచ్చివారండి, శివుండు రామ భక్తుండైన సమాచారమే యెఱుఁగరైతిరి. అధ్యాత్మ రామాయణ మంతయు శివుండు పార్వతి కుపదేశించె నిప్పటికిఁ గాశిలో మరణ కాలంబున దేహధారులకు రామమంత్ర ముపదేశింపుచున్నాడు. రుద్రుండొక్క రామావతారోపాసకుఁ డగుటయేకాక భగవదవతారము

లన్నియు నుపాసించిన విష్ణుభక్తుఁడు సందియములేదు. సరేగాని మీరు దేవుఁడెవరండి ? 1382

కు రం గ సో మ యా జి

మాకా,

శ్లో॥ శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవేనమ

అని యున్నది. శివ కేశవులిద్దఱు సమానులే. మేమిద్దఱిని సమానముగాఁ బూజించి ధ్యానింతుము. 1383

వ ర వ ర ము ని

ఇద్దఱిలో మీరెవరిని ముందుగా ధ్యానించి యెవరిని వెనుక ధ్యానింతురు ? 1384

కు రం గ సో మ యా జి

ముందుగా శివునిధ్యానించి పిమ్మట విష్ణునిధ్యానింతుము. విష్ణుని ధ్యానించినతరువాత శివునినైనను ధ్యానింతు మింతేకాక మాకుఁబంచాయతనపూజనహా కలదు. 1385

వ ర వ ర ము ని

పంచాయతనపూజయనఁగా నర్థమేమి ? 1386

కు రం గ సో మ యా జి

శ్లో॥ ఆదిత్యమంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరం

సూర్యుని నంబికను విష్ణువును గణేశ్వరుని శివుని నీయైదుగురుని నేకపీఠమందుఁజేర్చి పూజింతుము. 1387

వ ర వ ర ము ని

శాస్త్రిగారూ! మీరాచమనము గావించునపు డేదేవతను స్మరింతురు ? 1388

కు రం గ సో మ యా జి

మేమా!

అచ్యుతాయనమః అనంతాయనమః అచ్యుతానంత గోవిందాయనమః

అని యాచమనమొనర్తుము. 1389

వరవరముని

ప్రతిదినమును ప్రాతఃకాలంబున స్నానమొనర్చి సంకల్ప మేమని చెప్పుదురు ? 1390

కురంగసామయాజి

హరిః ఓమ్ శ్రీగోవింద గోవింద గోవింద మహావిష్ణోరాజ్ఞయా యని యారంభింతుము. 1391

వరవరముని

సంధ్యావందనములోనో ? 1392

కురంగసామయాజి

కేశవాది ద్వాదశనామంబులే జపింతుము. 1393

వరవరముని

వివాహకాలమునందు నేదేవతాచిహ్నంబు ధరింతురు ? 1394

కురంగసామయాజి

విష్ణుచిహ్నంబగు నూర్ధ్వపుండ్రంబును కుంకుమముతో ధరింతుము. 1395

వరవరముని

ఇట్లెంతకాలమువఱకు ? 1396

కురంగసామయాజి

పదియాఱురోజుల పండుగ వెళ్లువఱకు, 1397

వరవరముని

ఉపనయనసమయమునం దేచిహ్నమును ధరింతురు ? 1398

కురంగసామయాజి

కుంకుమముతో నూర్ధ్వపుండ్రమును బదియాఱుదినములవఱకు ధరింతుము. 1399

వరవరముని

గర్భాధానకాలమున నేమిసెప్పుదురు ? 1400

కురంగసోమయాజి

"విష్ణుర్యోనిం ప్రకల్పతే" యని చెప్పుదుము. 1401

వరవరముని

శ్రాద్ధకాలంబున నే దేవతను స్మరింతురు? 1402

కురంగసోమయాజి

"శ్రీమహావిష్ణు ప్రీతయే" యని యారంభించి "శాశ్వతవిష్ణులోకావాప్త్యర్థమ్మ"ని ముగింతుము. 1403

వరవరముని

శ్రాద్ధకాలంబునం గర్తచే వరింపంబడు స్థానంబులెన్ని? 1404

కురంగసోమయాజి

పితృస్థానము, విశ్వేదేవస్థానము, విష్ణుస్థానము. 1405

వరవరముని

శ్రాద్ధమునందు విష్ణుస్థానముగాక రుద్రస్థానముం సహా కలదా?

కురంగసోమయాజి

విశ్వేదేవస్థానమనంగా రుద్రస్థానమని మావారు కొందఱు చెప్పుచున్నారే! 1406

వరవరముని

విశ్వేదేవతలు పదుమువ్వురు. వారిలో రుద్రున కేమిసంబంధము లేదు. ఏకాదశరుద్రులలో మాత్రము శివుండొకండై యున్నాడు. సరే కాని. శ్రాద్ధకాలంబున నేలాంఛనంబు ధరింపవలయును. 1407

కురంగసోమయాజి

మహామతస్థులందఱు శూన్యలలాటముతో నాచరింతురు.

వరవరముని

శాస్త్రిగారూ! మీకు మాకు శ్రుతిప్రమాణ మొక్కటియే గనుక యాశ్రుతి కర్థము సెలవీయండి.

దేవపితృ కర్మాణ్యారభమాణః
తయానిత్య మూర్ధ్వపుండ్రం భిభృయాత్
మంత్రైః కేశవాదీనాం
చైతద్రహితం కర్మవిఫలం రక్షాంసి గృహ్ణీయుః

కు రం గ సో మ యా జి

దేవ పితృ కార్యారంభమునందు నిత్యము కేశవాదిద్వాదశ మంత్రములతో నూర్ధ్వపుండ్రములను ధరింపవలెను. లేనిచో నాక ర్మము విఫలమగును. లేదా తత్ఫలమును రాక్షసులు తీసికొందురని యాశ్రుతి చెప్పుచున్నది. 1394

వ ర వ ర ము ని

శ్రుతిః ఆనందక్రియామృతత్వ ఫలోదయ మూర్ధ్వపుండ్రవిధిః
ఏవం విదిత్వాయోధారయతి
సవైదికో భవతి ససర్వ కర్మార్హో భవతి
కాయికాత్పాతకాత్పూతో భవతి విష్ణుసాయుజ్యమాప్నోతి
ఈశ్రుతి కర్థము సెలవీయండి.

కు రం గ సో మ యా జి

ఈ యూర్ధ్వపుండ్ర మానందక్రియామోక్షఫలములనిచ్చునది. ఇట్లు తెలిసికొని యెవ్వఁడూర్ధ్వపుండ్రమును ధరించుచున్నాడో వాఁడు వైదికుఁడగుచున్నాడు., పుణ్యకర్మములొనర్ప నర్హుఁడగుచున్నాడు. శరీరపాతకము వదలి పవిత్రుఁడగుచున్నాడు. విష్ణుసాయుజ్యమును బొందుచున్నాడని యర్థము. 1409

వ ర వ ర ము ని

శ్లో॥ త్రిసంధ్యాసుముదా విప్రో, యాగకాలేవిశేషతః
శ్రాద్ధేదానే తథాహోమే స్వాధ్యాయే పితృతర్పణే
శ్రద్ధాలుమూర్ధ్వపుండ్రాణి భిభృయాద్ద్విజసత్తమః
దీనికర్థము సెలవీయండి. 1410

కురంగసోమయాజి

త్రిసంధ్యలయందు నందును విశేషించి యాగ శ్రాద్ధ దాన హోమ స్వాధ్యాయ పితృతర్పణములయందు బ్రాహ్మణోత్తములు శ్రద్ధాయుక్తులై యూర్ధ్వపుండ్రమును ధరింపవలయును. 1411

వరవరముని

నభస్మధారయేద్విప్రః పరమాపద్గతోఽపివా
మోహాద్వైర్బిభృయాద్యోవై ససురాపోభవేద్ధ్రువమ్

విప్రుఁడు గొప్పవిపత్కాలంబునసహా భస్మము ధరింపఁగూడదు. మోహముచే నట్లుధరించినచో సురాపానముచేసినవాఁడగు నిది నిశ్చయము అని వృద్ధహారీత స్మృతియందుఁగలదు. ఇట్టిప్రమాణంబులు వందలకొలఁది గలవు. విస్తరభీతి మానితిని. మీరిప్పుడు శాస్త్ర విరుద్ధమైన తిర్యక్పుండ్ర మేలధరించితిరి. 1412

కురంగసోమయాజి

వివాహోపనయనాదు లేవియు లేవుగనుక స్వీయమతాను సారముగా ధరించితిని. మాకు శివ కేశవు లిద్దఱు సమానులే కాబట్టి సమరసోచితముగా నేలాంఛనమైన ధరింతుము. 1413

వరవరముని

ఓ హో! మీకిద్దఱా పరబ్రహ్మలు? 1414

కురంగసోమయాజి

నామ రూప భేదములచే నిట్లుసెప్పుచున్నామేగాని హరిహరు లిద్ద ఱొక్కటే తత్త్వమైయున్నది. మీరును వామన నృసింహ రామ కృష్ణాద్యవతారంబులను బరవ్యూహాదులను సెప్పి యన్నియు నొకటే తత్త్వమని చెప్పుచుండలేదా? 1415

వరవరముని

మేము పరవ్యూహ విభవాంతర్యామ్యర్చావతారంబులగు నైదువిధంబులుగా నున్నాడు పరమాత్మయని చెప్పుటశాస్త్రనమేగాని

ఐదురూపములలో నొకదానికొకటివిరోధము లేదు, అనఁగా రామావ
తారకాలంబునఁ గృష్ణావతారంబులేదు, నృసింహావతారకాలంబున
వామనుండు లేడు, అవతారపురుషు లొకరితో నొకరు కలహించలేదు
ఒకరినొకరు స్తోత్రము చేయలేదు. ఒకరికిఁగలిగిన యనిష్టము నొకడు
తొలగించలేదు. పరస్పర లాంఛనభేదంబులేదు. పరస్పర భేదమును
వర్ణించు గ్రంథంబులులేవు. మీ రేకతత్త్వమని చెప్పు శివకేశవుల కనేక
భేదంబులున్నవి. యెట్లంటివేనిఁ దిర్యక్పుండ్రము. త్రిశూల ధార
ణము గజ చర్మధారణము దిగంబరము విరూపాక్షత్వము
శుక్లవర్ణము వృషభవాహనత్వము, శక్తిపతిత్వము మొదలైనవి
శివలాంఛనంబులు కస్తూరిమిళితోర్ధ్వ పుండ్రము శంఖ చక్రాది
పంచాయుధధారణము పుండరీకాక్షత్వము పురుషోత్తమత్వము కనక
చేలధారణము లక్ష్మీపతిత్వము నీలమేఘవర్ణము గరుడ వాహన
త్వము మొదలైనవి విష్ణులాంఛనములు వీరిద్దఱు పరస్పరము స్తుతించి
నట్లు కలహించినట్లనేకప్రదేశములలోఁ గానంబడుచున్నది యింతేకాక
శివార్చకుఁడు విష్ణుపూజకర్తఁడుగాడు నారాయణార్చకుఁడు శివపూజ
నంగీకరింపఁడు తిర్యక్పుండ్రధారులు విష్ణ్వాలయంబునఁ బ్రవేశించినుతిం
తురు శ్రీవైష్ణవులు శివాలయంబున కేఁగరు పాశుపతాగమ ప్రకారము
శివలింగమునుఁ బ్రతిష్ఠింతురు పాంచరాత్రాగమప్రకారము విష్ణువిగ్ర
హమును స్థాపింతురు శివునిఁబూజించువారైనను శివనిర్మాల్యమునుఁ
గైకొనరు విష్ణునిర్మాల్యమును సర్వమతస్థులంగీకరించి శిరసావహించి
పూజింతురు హరిహరైకతత్త్వ మొక్కటియెట్లగును. 1416

కు రం గ సో మ యా జి

చిహ్నభేదములు రామకృష్ణాదులకును గల విధేప్రకారము
శివకేశవులకుఁగల వంతియేకాని తత్త్వమొక్కటే మీభేదవాదముతో
మాకుఁబనిలేదు 1417

వ ర వ ర ము ని

భేదములేనట్లు మీకు బాగుగానమ్మకమేనా 1418

కురంగసోమయాజి

మాకు సందేహమేమియులేదు 1419

వరవరముని

శాస్త్రిగారూ! శివకేశవులకుఁ భేదములేదంటిరి యిరువురేక తత్వమంటిరి రామునకు బ్రహ్మహత్యతగులగా శివలింగార్చనచేసి పోగొట్టుకొనియెనంటిరి శివలింగార్చకుఁడగు రాముఁడెవఁడు తదీయ పూజనంగీకరించిన శివుండెవఁడు 1420

కురంగసోమయాజి

ఈవిషయము మాగురువుగారి నడిగితేగాని తెలియదు వారి నిచ్చటికిఁ గొనివచ్చెదనని చెప్పి తీసుకొనివచ్చి చూపింపఁగా నతనిఁ గూర్చుండఁబెట్టి వరవరమునీంద్రుండిట్లనియె 1421

వరవరముని

అయ్యా మీపేరేమండి 1422

భైరవశాస్త్రి

నాపేరు భైరవశాస్త్రియని చెప్పుచున్నారు 1423

వరవరముని

మీరేమేమి శాస్త్రములు చదివితిరి యీకురంగసోమయాజికి మీకేసంబంధముగలదా 1424

భైరవశాస్త్రి

మీమాంసాన్యాయవ్యాకరణ శిక్షావేదాంత శాస్త్రము లన్నియుఁ బఠించితి నీకురంగసోమయాజి నాముఖ్యశిష్యుఁడు వీనిం గూర్చి మీరెద్దియో ప్రశ్నించినారని వినివచ్చితిని మీయుద్దేశమును బ్రకటించండి 1425

వరవరముని

మీరు సమస్తశాస్త్రములు చదివితిరిగదా సర్వజగన్నియామకుండైన పరబ్రహ్మమెవ్వఁడని నిశ్చయింపఁబడినది 1426

భైరవశాస్త్రి

శాస్త్రములకేమిలెండి చాలాగలవు. కాని పరస్పరవిరుద్ధముగా నున్నవి యెట్లంటిరేని కొన్ని గ్రంథములలో శివుఁడే పరబ్రహ్మమని కొన్నిటిలో వినాయకుఁడని కొన్నిటిలో సూర్యుఁడని కొన్నిటిలోఁ జతుర్ముఖుఁడని కొన్నిటిలో విష్ణువని కొన్ని గ్రంథములలో శక్తియే పరమాత్మయని యున్నది. కొన్నిటిలో నిరీశ్వరప్రసంగమున్నది. ఇన్నింటిలో నేది యెక్కువదని ప్రశ్నించినచోఁ గటూవేసి చూచినవారు లేరు. కన్నులారఁ జూచినవారు లేరు. 1427

సామాజికులు

ఓహో! గురువుగారికిఁ గురంగపామయాజిగారికి సంబంధ మేమాత్రము లేదే! 1428

సుశీలుఁడు

ఈమాయావాదుల మతమంతయు నిదేపద్ధతిగా నుండును. నేను కాచి వడపోసినాను. వీరికి మొదటిలో ననేక పరబ్రహ్మలు కొంతదూరముపోగాఁ బంచాయతన పూజావిధానముచే నైదుగురు పరబ్రహ్మలు వెండియుఁ గొంతదూరముపోగా నామరూపక్రియాశూన్యుఁడగు పరబ్రహ్మ మొకఁడు, తరువాత జరమదశయందు నెవరికి వారే పరబ్రహ్మము, మనకుఁ గర్మ జ్ఞాన భక్తి ప్రపత్తులచే నందరానివాఁడై పరాత్పరుఁడు దుర్లభుఁడైయున్నాఁడుగాని మాయావాదులు బహుసులభముగాఁ బరబ్రహ్మలగుచున్నారు, విస్మయము, విస్మయము 1429

వరవరముని

మీరు వచించు విషయమెల్లను సంశయముగానున్నది

శ్లో॥ అజ్ఞశ్చాశ్రద్ధధానశ్చసంశయాత్మావినశ్యతి

అజ్ఞుఁడు శ్రద్ధలేనివాఁడు సంశయాత్ముఁడు నశించునని గీతాచార్యులవారు చెప్పియున్నారు! నిస్సందేహముగా మీకుఁబరమాత్మ కలఁడా! లేఁడా! 1430

భైరవశాస్త్రి

బ్రహ్మవిష్ణుమహేశ్వరుల నతీతుండగు పరమాత్మ యొకండు కలడనియు నతండు నిర్గుణుండై నిరంజనుండై నిరాకారుండై నిర్విశేషుండై యున్నాడని మాసిద్ధాంతమండీ 1431

వరవరముని

మీ శిష్యుండగు కురంగసోమయాజి శివకేశవనామధేయ పరమాత్మ యొకఁడు కలఁడని చెప్పుచున్నాడే 1432

భైరవశాస్త్రి

వానిముఖము వానికేమి తెలియు నుపనిషద్భాష్యమైనను జక్కఁగాఁ జదువలేఁడు వీఁడా సభలో మీబోటి పెద్దలతో వాదించువాఁడు 1433

కురంగసోమయాజి

(భైరవశాస్త్రింగాంచి) గురువుగారూ బ్రహ్మవిష్ణుమహేశ్వరుల కతీతుండగు పరమాత్మ యొకఁడున్నాడని మీ రెప్పుడు చెప్పరైతిరి శివకేశవులనేగా మన మెప్పుడు ధ్యానించునది 1434

భైరవశాస్త్రి

(గుసగుస మాటలతో) ఓరి వెధవా కొంచెముసేపు నిదానింపుము ఉఱుతకెందుకురా యూరిలో వార్తలన్నట్లు లేనిపోని తద్దినము తెచ్చిపెట్టితివి, వైష్ణవముండాకొడుకు లంటే సామాన్యులు కారు, చాటున మన మెన్ని యేడ్పులేడ్చినను సభలో నారాయణ పరత్వ మొప్పుకొని తీరవలెను 1435

వరవరముని

అయ్యా శాస్త్రిగారూ భగవద్గీతాశాస్త్రము మీకుఁ బ్రమాణమేగా 1436

భైరవశాస్త్రి

అయ్యో ప్రమాణ మెందుకు కాదండీ మా శంకరాచార్యుల వారంగీకరించిన ప్రస్థానత్రయములో నొకటిగదా 1437

పరపరముని

ఈ శ్లోకములు పఠించి యర్థము సెప్పుండి

శ్లో॥ మహాత్మానస్తుమాంపార్థ, దైవీంప్రకృతిమాశ్రితాః
భజన్త్యనన్యమనసో, జ్ఞాత్వాభూతాదిమవ్యయమ్
అహంక్రతురహంయజ్ఞః స్వధాహమహమౌషధమ్
మంత్రోహమహమేవాజ్య, మహమగ్నిరహంహుతమ్
పితాఽహమస్యజగతో, మాతాధాతాపితామహః
వేద్యంపవిత్రమోంకార, ఋక్సామయజురేవచ
గతిర్భర్తాప్రభుస్సాక్షీ, నివాసశ్శరణంసుహృత్
ప్రభవప్రలయస్థానం, నిధానంబీజమవ్యయమ్

దైవసంబంధ బుద్ధినాశ్రయించి పుట్టినమహాత్ములు భూతముల కాదియు నవ్యయుఁడైన నన్ను భజింపుచున్నారు. అశ్వమేధాది యజ్ఞములు పంచమహాయజ్ఞములు పితృదేవతలకిచ్చు స్వధ ఔషధము, మంత్రము, ఆజ్యము, అగ్నిహోత్రము నేనే యీజగత్తునకుఁ దండ్రి తల్లి తాత మొదలగువారు వేదవేద్యమైనవస్తువు, పవిత్రము ఓంకారము, ఋగ్వేదము సామవేదము యజుర్వేదము నేను మఱియు నీజగత్తునకు గతి భరించురక్షకుఁడు నియమించు ప్రభువు సర్వము చూచుచుండు వాఁడు, నిలయము, రక్షకము, సుహృత్తు, ఉత్పత్తి స్థితిలయములకు స్థానము, నిధానము, అవ్యయమైనబీజము నేను 1438

శ్లో॥ యత్కరోషియదశ్నాసి, యజ్జుహోషిదదాసియత్
యత్తపస్యసికౌంతేయ, తత్కురుష్వమదర్పణమ్

శ్లో॥ శుభాశుభఫలైరేవం, మోక్ష్యసేకర్మబంధనైః
సన్యాసయోగ యుక్తాత్మా, విముక్తో మాముపైష్యసి

అర్జునా ! దేనిని దేనిని చేయుదువో దేనినిఁ దినుచున్నావో దేనిని హోమముచేయుచున్నావో దేనిని దానమిచ్చుచున్నావో

దేనిని దపస్సుచేయుచున్నావో దానిని నాకు సమర్పింపుము, ఇట్లు నాయందు సర్వకర్మములు సమర్పించి యోగయుక్తుఁడవై యుంటి వేనిఁ బుణ్య పాప విముక్తుండవై నన్నేపొందగలవు. ఈ శ్లోకములు చక్కఁగా వింటిరా! ఎందులోనివి ? 1439

భైరవశాస్త్రి

ఇవి గీతాశాస్త్రమునందలి నవమాధ్యాయములోనివి. ఇది వఱకు నాకుఁబరిచయమైనవే. 1440

వరవరముని

శ్లో॥ యాన్తి దేవ వ్రతా దేవాన్, పితౄన్ యాంతి పితృవ్రతాః
భూతాని యాంతి భూతేజ్యా. యాన్తి మద్యాజినోఽపిమాం

దేవతలఁగూర్చి వ్రతములొనర్చువారు దేవలోకమును బొందుదురు, పితృదేవతలనుగూర్చి వ్రతములుసేయువారు పితృలోకమును బొందుదురు, భూత ప్రేతముల భజించువారా యా లోకములఁ బొందుదురు, నన్నుభజించువారు నన్నేపొందుదురు. 1441

(భగవద్గీత, నవమాధ్యాయము)

శ్లో॥ ఆబ్రహ్మ భువనాల్లోకాః పునరావృత్తినోఽర్జున
మాముపేత్యతు కౌంతేయ, పునర్జన్మనవిద్యతే

అర్జునా! బ్రహ్మలోకమువఱకుండు సర్వలోకములు జీవులకుఁ బునరావృత్తినిఁ గలిగించును, నన్నుఁబొందినవానికిఁ బునర్జన్మములేదు.

(భగవద్గీత, అష్టమాధ్యాయము)

శ్లో॥ అహమాదిర్హి దేవానాం మహర్షీణాంచ సర్వశః
యోమామజమనాదించవేత్తి లోక మహేశ్వరమ్
అసమ్మూఢస్సమర్త్యేషు, సర్వపాపైః ప్రముచ్యతే

దేవతలకు మహర్షులకు నన్నివిధములచే నాదినై యున్నాను: ఎవ్వఁడు నన్నుఁ బుట్టుక లేనివానిగా ననాదిగా గొప్ప ప్రభునిగా

నెఱుఁగుచున్నాడో వాఁడు మనుష్యులలో జ్ఞానియై సర్వపాపములచే విముక్తుఁడగుచున్నాడు. 1442

(భగవద్గీత, దశమాధ్యాయము)

శ్లో॥ జన్మకర్మచమేదివ్య. మేవంయోవేత్తితత్త్వతః
త్యక్త్వాదేహం పునర్జన్మ,నైతిమామేతి సోఽర్జున

అర్జునా! మదీయావతారములు నవతారకృతచేష్టలు ప్రాకృతములుగావని దివ్యములని యథార్థముగా నెవ్వఁడెఱుఁగుచున్నాడో వాఁడు దేహమునువిడిచి పునర్జన్మమును బొందక నన్నే పొందుచున్నాడు. 1443

(భగవద్గీత, చతుర్థాధ్యాయము)

శ్లో॥ యదాదిత్యగతంతేజో, జగద్భాసయతేఽఖిలమ్
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ, తత్తేజోవిద్ధిమామకమ్
గామా విశ్యచభూతాని, ధారయామ్యహమోజసా
పుష్ణామి చౌషధీస్సర్వా స్సోమో భూత్వారసాత్మకః
అహం వైశ్వానరో భూత్వా, ప్రాణినాం దేహమాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః, పచామ్యన్నం చతుర్విధమ్

అర్జునా! యేప్రకాశము సూర్యునియందుండి సమస్త జగత్తును బ్రకాశింపఁజేయుచున్నదో, చంద్రాగ్నులయం దేతేజస్సు గలదో యది నాదియని తెలియుము. నేను భూమినావేశించి నాబలముచేత సర్వభూతములను ధరింపుచున్నాను. రసాత్మకుఁడగు చంద్రుఁడనై సర్వౌషధులను బోషింపుచున్నాను. జఠరాగ్నిరూపముతోఁ బ్రాణులదేహము నాశ్రయించి చతుర్విధాహారములను బచనము చేయుచున్నాను. 1444

శ్లో॥ సర్వస్యచాహం హృదిసన్నిష్టో, మత్తః, స్మృతిర్జ్ఞాన మపోహనంచ
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః, వేదాన్తకృద్వేదవిదేవచాహమ్

సర్వభూతముల హృదయమునందు నేనున్నాను. వారికి జ్ఞాపకశక్తి జ్ఞానము నూహ నావల్లనే కలుగుచున్నది. వేదములచే నెఱుఁగఁదగినవాఁడను వేదాంతములు సేసినవాఁడను వేదంబు లెఱింగినవాఁడను నేనే. 1445

(భగవద్గీత, పంచదశాధ్యాయము)

శాస్త్రిగారూ! యీశ్లోకములు సాకల్యముగా వింటిరా! దేనిలోవి? 1446

భైరవశాస్త్రి

మీరిప్పుడు వాక్యానించిన విషయమంతయు భగవద్గీతా శాస్త్రమే నేనిదివఱకుఁ జదివినదే యిందుకు సందేహములేదు.

వరవరముని

దీనివల్ల మీకు మనస్సులో లెస్సగాఁదోఁచినయభిప్రాయమేమి?

భైరవశాస్త్రి

శ్రీకృష్ణావతారుండగు విష్ణువే సర్వోత్కృష్టుండని వేదాంతవేద్యుఁడని సర్వదేవతా సార్వభౌముఁడని ముముక్షుజనాశ్రయుండని మోక్షప్రదాతయని నిస్సమానాధికుఁడని స్థిరపడినది విష్ణువున కతీతుఁడైన పరబ్రహ్మ మొకఁడున్నాడని తలంచుట లజ్ఞానమని తోఁచినది కాని యీసంగతి యట్లుండనిచ్చి యొక్కసందేహ మడుగుచున్నాను సమాధానమీయండి. 1449

భారతము మీకుఁబ్రమాణమేగా? 1450

వరవరముని

ఒకభారతమన్నమాటయేమి శ్రుతిస్మృతీతిహాస పురాణంబులన్నియు మాకుఁబ్రమాణమే. మా భగవద్రామానుజయోగీంద్రులు వీనినన్నిటిని సమన్వయముచేసి రాజస తామస పురాణంబులుమాత్ర మాదరణీయంబులుగావని తీర్మానించినారు. భారత భాగవత రామాయణంబులు లేనిచో హిందూదేశమునకు హిందూమతంబునకు నాధా

ఠంబు లేదుగదా ? భారతానుసారముగా నేను ప్రశ్నింపనెంచితిరో దానిని వచింపుము. 1451

భై ర వ శా స్త్రి

అశ్వత్థామ పాండవులపైఁ బ్రయోగించిన నారాయణాస్త్రము కృష్ణునిచే వ్యర్థమైనప్పుడు ద్రౌణి వ్యాసునిఁగాంచి మునీంద్రా మనుష్యులగు కృష్ణార్జునులచే మదీయ నారాయణాస్త్రంబు వ్యర్థం బగుటకుఁ గతంబేమని యడుగ వ్యాసుం డతనింగాంచి భూసురేంద్రా! నారాయణుండు శివునింగూర్చి యనేకవత్సరంబులు తపస్సుచేసి ప్రస న్నుండగు శివునిఁగాంచి దేవా చరాచరంబులచే సార్ద్రశుష్కంబు లచే మరణంబులేని వరంబిమ్మని యాచించె నప్పుడు గంగాధరుండు సంతసించి కేశవా నీవుకోరిన వరంబిచ్చితి. ముల్లోకంబులలో నెవ్వరి వల్లను దేనిచేతను మరణంబు నీకు లేకుండుఁగాక. కోరికయున్నచో నన్నైనను జయింపుమని వరంబు సంగె నవ్వరప్రభావంబుచే నరసఖుం డగు కృష్ణుండు నీయస్త్రంబును నివారించెనని చెప్పఁగా నశ్వత్థామ దుఃఖంబు వీడెనని భారత ద్రోణపర్వంబుననున్నది. విష్ణువు సర్వశక్తుం డైనచో శివునిఁగూర్చి యఱువదివేల వర్షంబులు తపంబేలచేసెను?

వ ర వ ం ము ని

శాస్త్రిగారూ! మీరురచించినగ్రంథము మీకర్థమగునా ?

భై ర వ శా స్త్రి

నాకు సులభముగా నర్థమగును. ముందర్థమునకుమున్నుకొనిగదా గ్రంథము రచింపవలయు. లోకములో నెవ్వరైన నంతేగదా ! 1454

వ ర వ ర ము ని

అశ్వత్థామకు నారాయణాస్త్ర మెట్లులభించెను ? 1455

భై ర వ శా స్త్రి

పూర్వము మాతండ్రి విష్ణువునారాధించి యియ్యస్త్రంబునుఁ బడసి నాకిచ్చెనని యశ్వత్థామ దుర్యోధనునితోఁ జెప్పెఁగావున విష్ణు దత్తమై యతనికి లభించె నయ్యస్త్రంబున కధిదేవతయు విష్ణువే.

వరవరముని

అశ్వత్థామ ప్రయోగించినది నారాయణాస్త్రము. నారాయణాస్త్రమున కధిదేవత నారాయణుఁడు. నారాయణదేవతాకంబును నారాయణదత్తంబునైన నారాయణాస్త్రము నుపసంహరించుటకు నారాయణుండగు శ్రీకృష్ణునకు సాధ్యమా, దుస్సాధమా! 1457

భైరవశాస్త్రి

మనమురచించినగ్రంథము నన్వయించుట మనకు నెంతసుకరమో స్వీయాస్త్రంబును శాంతింపఁజేయుట శ్రీకృష్ణున కంతకంటె సులభము. 1458

వరవరముని

అంతమాత్రపుఁబనికి శ్రీకృష్ణునకు శివవరప్రదానబలమెందుకు? 1459

భైరవశాస్త్రి

నిష్ప్రయోజనముగా దోఁచుచున్నదికాని వ్యాసులవారట్లేల చెప్పిరి? 1460

వరవరముని

భారతకథయందు మీకు లెస్సగాఁ బరిచయమున్నదా? 1461

భైరవశాస్త్రి

నాకుఁ బూర్ణ ప్రవేశమున్నది. 1462

వరవరముని

భగదత్తుఁ డర్జునునిపై వైష్ణవాస్త్రమును బ్రయోగించినప్పుడు వాసుదేవుఁ డేమిచేసెను? 1463

భైరవశాస్త్రి

హయంబుల పగ్గంబులు ముడిచి లేచి నిలుచుండి వక్షస్థలంబు సాచి వైష్ణవాస్త్రంబును మాయఁజేసి ఫల్గును నూఱడించెను. దీనిం బట్టి చూచినను గోవిందునకు శివానుగ్రహంబు నిరర్థకంబుగాఁ దోఁచుచున్నది. 1464

వరవరముని

పూర్వము విష్ణుద్వేషియు శివోపాసకుండునగు నీలకంఠావధాని భారతమునకు వ్యాఖ్యానము వ్రాయుచు గ్రంథమధ్యమునందు నఱువది వేల సంవత్సరంబులు హరి శివునిం గురించి తపంబు జేసెనని వ్యాసుం డశ్వత్థామకుం జెప్పినట్లు కథను గల్పించి కొన్ని శ్లోకంబులు నిర్మించెనుగాని యది కథకు నసందర్భంబగుటచే దొంగతనము బైటంబడెను. దీనిం బోలిన కథ హరివంశంబున నొకటిగల దెట్లంటివేని దేవకీసూనుండు కైలాసంబునకరిగి సంతానార్థియై రుద్రునిం గూర్చి తపంబ నరింపంగా నతండు ప్రత్యక్షుండై శ్రీకృష్ణుని జగదేకకారణుండవని నుతించి కృష్ణా సంతానార్థివై నన్నుం గూర్చి తపంబొనర్చితివి మన్మథుం డిదివఱకే పట్టమహిషియగు రుక్మిణీదేవియందు జన్మించియున్నా డింక నేనీయవలసినదిలేదని పంపించినట్లున్నది. ఈకథ యెంతసమంజసముగా నున్నదో చూడుము తామసులు విష్ణువునందుం గల్పించు నపవాదంబు లన్నియుం బూర్వోత్తరవిరుద్ధంబుగా నుండును. 1466

భైరవశాస్త్రి

ఇంతకు విష్ణుండు రుద్రు నారాధించినది సత్యమా, లేక యబద్ధమా ? 1465

వరవరముని

ఆరాధించినది వాస్తవమేకాని తనకు దుర్లభంబులగు వాంఛితార్థంబులు నడయుటకుంగాదు. కారణము వేఱుగానున్నది. దానిని వివరింతు వినుము. ఇప్పుడు నీవు నన్నడిగినట్లే జ్ఞాననిధానమగుపార్వతి భర్తయగు రుద్రునింగాంచి స్వామీ కపాలమాలికాస్థి భస్మ తిర్యక్పుండ్రములు వేదవిరుద్ధంబులుగదా మీరేల ధరించితిరని యడిగె నమ్మాటలకు గంగాధరుం డిట్లనియె: సాధ్వీమణీ ! దీనికొక రహస్యంబుగల దాకర్ణింపుము. తొల్లి నముచిప్రభృతి రాక్షసులు వైదికవృత్తి దానశౌచములుగలిగి తపస్సంపన్నులై నిర్జరులజయించి స్వర్గలోకము నాక్రమింపంగా నవ్వేలుపులు పలాయితులై విష్ణుదేవుని సన్నిధిలో

శరణాగతులై చెప్పుకొని రటుపిమ్మట జనార్దనుండు దీర్ఘముగాలోచించి శివా నీవు భస్మాస్థికపాలమాలికలు ధరింపుము. తామస శాస్త్రంబులు నిర్మింపు మవతారకాలంబుల నేనుకూడ నిన్నర్చింపు చుందు నప్పుడు నీవు పరాత్పరుండవని యెంచి నిశాచరులు నిన్ను భజింతు రయ్యవసరంబున నద్దుష్టుల నేనువధించి నిలింపుల గాసి మాన్పుదుననిన నేను భయమొంది వాసుదేవుంగాంచి దేవా! యీతామసవేషంబు ధరించినచో నపవిత్రుండనుగానాయన నమ్మహా పురుషుండు నన్నుద్దేశించి దుర్గాపతీ! నీవు లోకోపకారార్థమై మదీయశాసనంబువహించి యీరూపంబు వహించినందున నపాయంబు రాదు. లోపల మదీయ రామషడక్షరీమంత్రంబు జపింపుచు మనులయం జావేశించి పామరజన మోహనార్థముగాఁ దామసశాస్త్రంబులు నిర్మింపుము. 1467

శ్లో॥ అహమప్యవతారేషు, త్వాంచ రుద్ర మహాబల
తామసానాం మోహనార్థం, పూజయామి యుగేయుగే

మహాబలుండగు నోరుద్రా తామసజనమోహనార్థము ప్రతి యుగమునందు నవతారకాలములయందు నిన్ను నేనుపూజింతునని విష్ణువు తనతోఁజెప్పెనని రుద్రుండుసెప్పగా నుమాదేవి హరుంగాంచి ప్రాణనాధా తామస శాస్త్రంబు లెవ్వరు నిర్మించిరి, వాని పేరేమని యడుగఁగా భవుం డిట్లనియె. 1468

శ్లో॥ శ్రుణుదేవి ప్రవక్ష్యామి, తామసానియథాక్రమాత్
తేషాం శ్రవణమాత్రేణ, పాతిత్యంజ్ఞానినామపి

శ్లో॥ ప్రథమం హి మయాప్రోక్తం శైవపాశుపతాదికం
మచ్ఛక్త్యావేశితైర్విప్రై స్సంప్రోక్తాని తతఃపరం

శ్లో॥ కాణాదేనతుసంప్రోక్తం, శాస్త్రంవైశేషికంమహత్
గౌతమేనతథాన్యాయం, సాంఖ్యంచకపిలేనవై

శ్లో॥ ధిషణేన తథా ప్రోక్తం, చార్వాకమతి గర్హితమ్
దైత్యానాం నాశనార్థాయ, విష్ణునా బుద్ధరూపిణా

శ్లో॥ బౌద్ధశాస్త్రమసత్ప్రోక్తం, నగ్ననీలపటాదికం
మాయావాద మసచ్ఛాస్త్రం, ప్రచ్ఛన్నం బౌద్ధముచ్యతే

శ్లో॥ మయైవ కథితం దేవి, కలౌ బ్రాహ్మణరూపిణా
అపార్థం శ్రుతివాక్యానాం, దర్శయన్ లోకగర్హితమ్

శ్లో॥ కర్మస్వరూపం త్యాజ్యం య, దత్రవై ప్రతిపాద్యతే
బ్రహ్మణోగి పరమం రూపం, నిర్గుణం వక్ష్యతే మయా

శ్లో॥ సర్వస్య జగతోఽప్యత్ర, మోహనార్థం కలౌయుగే
వేదార్థవన్మహాశాస్త్రం, మాయావాద మవైదికమ్

శ్లో॥ మయైవ వక్ష్యతే దేవి, అసతాం నాశకారణాత్
ద్విజన్మనా జైమినినా, వేదశాస్త్ర మపార్థతః

శ్లో॥ నిరీశ్వరేణ వాదేన, కృతం శాస్త్రం మహత్తరమ్
శాస్త్రాణీమాని గిరిజే, తామసాని నిబోధమే

(పద్మపురాణము)

ఓ దేవీ! ప్రాణనాయకీ! క్రమము తప్పకుండ వినుము. తామస శాస్త్రములు విన్నమాత్రాన బతితత్వము సంభవించును. ముందుగా శైవ పాశుపతాది శాస్త్రంబులు నాచే నిర్ణీతంబులయ్యె మదీయావేశంబుగల విప్రులచే రచింపఁబడిన శాస్త్రంబు లెఱింగించెదఁ గణాదునిచే వైశేషికంబును గౌతమమునిచేఁ దర్కశాస్త్రంబును గపిలునిచే సాంఖ్యశాస్త్రంబును బృహస్పతిచే నతినిందితంబగు చార్వాక సిద్ధాంతంబును రాక్షసనాశనముకొఱకు బౌద్ధరూపియగు విష్ణునిచే దిగంబరత్వము కృష్ణపటధారణముఁ దెలుపు బౌద్ధశాస్త్రంబును రచింపఁబడియెఁ గలియుగంబున నేనొకబాడబుండనై ప్రచ్ఛన్న బౌద్ధమాయా

వాదంబులను పేరులుగల నిరర్థక శాస్త్రంబులు రచించెద. తదీయ శాస్త్రంబులందు వేదంబుల కపార్థంబులు వచింతు జగన్నిందితంబగు కర్మపరిత్యాగంబు వక్కాణింతు జీవబ్రహ్మైక్యవాదంబు నిర్మింతు. సమస్త కల్యాణగుణపరిపూర్ణుండగు పరాత్పరునియందు నిర్గుణత్వంబు నిర్మించెద జైమినియను భూసురుం డీశ్వరుండు లేడను శాస్త్రం బొక్కటి రచించు నివియావత్తు తామస శాస్త్రంబులని యెఱుంగుమని శివుండు పార్వతి కుపదేశించె నింతేకాక.

శ్లో॥ నారాయణంపరం యాని వదంతి జగదీశ్వరమ్
తానిసర్వాణి శాస్త్రాణి, సాత్వికానిమతానివై

పరుఁడును జగదీశ్వరుఁడునగు నారాయణునిఁగూర్చి యేశాస్త్రములు సెప్పుచున్నవో యాశాస్త్రములన్నియు సాత్వికములు. 1469

శ్లో॥ చతుర్ముఖం కృశానుంచ, తథాదేవీం సరస్వతీం
పరత్వేనవదేచ్ఛాస్త్రం, రాజసం తత్ప్రచక్షతే

సరస్వతీ విరించనాగ్ని హోత్రుల పరత్వమునుజెప్పు శాస్త్రము రాజసమనఁబడును. 1470

శ్లో॥ మల్లింగ దుర్గా విఘ్నేశ కుమార ప్రముఖాన్ సురాన్
ప్రశంసతిచయచ్ఛాస్త్రం, తత్తామస ముదాహృతమ్

నాలింగమును దుర్గా వినాయక కుమార ప్రముఖ సురలను గూర్చి చెప్పుశాస్త్రము తామసమని చెప్పఁబడును. 1471

శ్లో॥ తామసం దుర్గతిందత్తే, రాజసం స్వర్గదంభవేత్
సాత్వికం మోక్షసామ్రాజ్య,ధౌరంధర్యందదాత్యహో

తామసశాస్త్రము నరకమును రాజసశాస్త్రము స్వర్గమును సాత్వికశాస్త్రము మోక్షసామ్రాజ్యము నిచ్చుచున్నవి. 1472

(పాద్మపురాణము)

శ్లో॥ ఊర్ధ్వంగచ్ఛన్తి సత్త్వస్థాః, మధ్యేతిష్ఠంతి రాజసాః
జఘన్యగుణవృత్తిస్థా, అధోగచ్ఛన్తి తామసాః
(భగవద్గీత)

పైనఁజెప్పిన ప్రకారముగా శివుండు భవాని కుపదేశించి యున్నాఁడు. సందేహమున్నవారు పాద్మపురాణముఁ జూడవచ్చు. రుద్రునకుఁ బూర్వముపదేశించినచందంబున నవతారకాలంబులయందు విష్ణువు శివునిఁబూజించెంగాని యనిష్ట నివృత్తికైగాని యిష్టప్రాప్తి కొఱకైగాని పూజింపలేదు. 1473

భైరవశాస్త్రి

అయితే ఆచార్యులుగారూ మీరుపదేశకాలమందు నినుప సాధనములతో భుజములు గాల్చుచున్నారెందుకండి? 1474

వరవరముని

ప్రతికూలురగు రాక్షసులు విష్ణుచక్రముచే నఱకఁబడి పవిత్రులై మోక్షముఁజెందిరి. అనుకూలురగు భక్తులు తప్త సుదర్శన స్పర్శచే ముక్తినొందుచున్నారు. దేహధారులందఱు హరిచక్రస్పర్శముచేఁగాని పునీతులుగాజాలరు. బ్రాహ్మణ్యమునకు నుపనయన మెట్టిదో వైష్ణవమునకును జక్రాంకితమట్టిది. దీనిని మేము చక్రాంకితమని పంచసంస్కారమని సమాశ్రయణమని గౌరవవాచకములతో వాడుకొందుము. మీరగౌరవముగా మాట్లాడితిరి. ఇదిమూర్ఖలక్షణము.

భైరవశాస్త్రి

మీరు భుజములు గాల్చుకొనునది వాస్తవమేగనుక మేమడుగుచున్నాము. యథార్థమునకుఁ గోపమెందుకండి! 1456

వరవరముని

నేను మీవిషయములో నున్నది యున్నట్లు వచించెద నొప్పుకొందురా? 1477

భైరవశాస్త్రి

ఏమలకంగీకరించనండి సెలవీయండి ! 1478

వరవరముని

నీయమ్మా మగనిపేరేమి, వాఁడును నీవలె బూడిదెబూచాయు వాఁడేనా ? 1479

భైరవశాస్త్రి

నీవశ్లీలములు మాట్లాడుచున్నావు నేను జవాబీయను.

వరవరముని

మీయతీశ్వరులందఱు ముండలేగా ? 1481

భైరవశాస్త్రి

ఇది మఱియు గర్హితముగాన నసలేభాషింపను. 1482

వరవరముని

యథార్థవాదముచే నాకుఁగోపములేదంటివి. పూర్తిగాఁ గోపముందితివి. నీశాంతి యిప్పుడే బయటఁబడినది. మీనాయన పేరేమి ? ఆయన నీవలె విభూతి ధరించునా యనుదాని మఱియొకవిధముగాఁ బల్కితిని. మీయతులు శిఖా యజ్ఞోపవీతములు లేనివారుగనుక ముండలంటిని. ఇది మీకెంత నీచముగానున్నదో భుజములు గాల్చు కొందురన్న మీమాట మాకంత గర్హితముగానున్నది. కావున నిఁక మీఁదఁ జక్కఁగా భాషించండి. 1483

భైరవశాస్త్రి

విష్ణువునకుఁ జక్రాయుధము శివుండిచ్చెనని మాపెద్దలు సెప్పుచున్నారే ! 1484

వరవరముని

మీపెద్దలకు విద్య యున్నదిగాని వివేకము లేదు. వివేకము లేనప్పు డెంత పాండిత్యమున్నను నిష్ప్రయోజన మెందుకంటివేని

మీవారు శివకేశవు లేకతత్త్వమని కొంతసేపు శివుఁడెక్కుడని కొంత సేపు విష్ణువే సర్వోత్కృష్టుఁడని కొంతసేపు శక్తియేపరబ్రహ్మమని కొంతసేపు తామే పరబ్రహ్మలమని కొంతసేపు చెప్పుదురు కావునసే
శ్లో॥ అంతశ్శాక్తంబహిశ్శైనం సభామధ్యేతువైష్ణవమ్
అని మీమతము విఖ్యాతిఁ డసెను 1485

భైరవ శా స్త్రి

పోనీ శైవులన్నారని యెంచి సమాధానమీయండి 1486

వ ర వ ర ము ని

శైవము పాషండము గనుక వారికి సభాతాంబూలములేదు వారి ప్రశ్నములకు సమాధానమీయవలసినపనిలేదు. మీవారిలోసహా తెలిసినవారొప్పుకొనరు. మీమత నిర్వాహకులగు శంకరాచార్యుల వారు యతీశ్వరులు గనుక శ్లో॥ ‚యతిర్నారాయణం స్మరేత్,, త్తను శాస్త్రోక్తి ననుసరించి శివ సహస్రనామములలో నారాయణ శబ్దము లేనందున, శివసహస్రనామమునకు శివగీతకు భాష్యము చేయ లేదు భగవద్గీతా విష్ణుసహస్రనామములకు భాష్యముసేసినారు. యింతేకాక,
శ్లో॥ గేయం గీతానామ సహస్రం, ధ్యేయం శ్రీపతి రూపమజస్రమ్

అని భజగోవింద శ్లోకములలోఁ జెప్పియున్నాడు. పాశుపతాగమమును ఖండించినాడు చరమకాలమునఁ దనతల్లిని విష్ణులోకము నకుఁ బొమ్మని బంచినాడు. దీనింబట్టి మీరు శంకరమతావలంబకులై గురుద్రోహులుగానిచో విష్ణుపరత్వమునకు వ్యతిరిక్తముగాఁ బ్రశ్న వేయరాదు. ఐన నడిగితిరిగావునఁ జెప్పెద నాకర్ణింపుడు. శివుండు విష్ణుదేవునకుఁ జక్రమిచ్చుటకల్ల. రుద్రుఁ డష్టదిక్పాలకులలో నొక్కఁడు ఏకాదశరుద్రులలో నొక్కఁడు మఱి శ్లో॥ రుద్రాణాం శంకరశ్చాస్మి= రుద్రులలో శంకరుఁడు నావిభూతియని గీతాశాస్త్రములో భగవంతుఁడు సెప్పియున్నాడు. విష్ణుదేవుం డనాదిపురుషుఁడు బ్రహ్మారుద్రుల

సృష్టించి శాసించువాఁడు, నారాయణుని పంచాయుధంబులు స్వయంభువులు, వాని కాద్యంతములులేవు. వెండియు నప్రాకృతంబులు. అంబరీషునివిషయములోఁ జక్రాయుధమునకు డీలుపడి దుర్వాసుఁడు బ్రహ్మ రుద్రులకు శరణాగతుఁడై యీగండమును దప్పింపుమని వేడగా నశక్తులై మావల్లగాదని చేతులుమోడ్చిరి. ఇంతేకాక సుదర్శనాయుధము పౌండ్రకునిఁజంపి తదీయ పుత్రనిర్మితంబైన కృత్తినిఁ బౌండ్రకపుత్రుని సపరివారంబుగాఁజంపి కాశీపురంబును మూఁడు మాసంబులు దహించఁగా భవుం డడ్డగింపలేడయ్యె. దేవకీసుతుండు శివాగ్రభాగంబున బాణునిచేతులు తొమ్మిదినందల తొంబదెనిమిది ఖండించినఁగాంచి రెండుచేతులుంపుమని హరుండు హరింబ్రార్థింపఁగా దక్కినవి. బాణాసురజన్యంబున శివుండు శైవజ్వరంబుఁ గృష్ణునిపైఁ బ్రయోగింపఁగాఁ గృష్ణుండు వైష్ణవజ్వరంబు బ్రయోగించె నటుపిమ్మట శైవజ్వరంబు వైష్ణవజ్వరంబునకోడి దెబ్బతిని కేశవుని శరణుఁజెంది బ్రతికె నిన్నిపర్యాయంబులు రుద్రున కసాధ్యంబైన చక్రంబును శివుండు విష్ణువునకిచ్చెననుమాట యెంత నిస్సారముగా నున్నదో గమనింపుము. 1487

భైరవశాస్త్రి

కేవలము విష్ణువునర్చించువారు విష్ణుపాషండులని శివోపాస్తి మాత్రమే చేయువారు శివపాషండులని మీవారు చెప్పుదురే.

వరవరముని

వేదవేద్యుండైన నారాయణుని భజించువారు వైదికులేగాని వేదబాహ్యులైన పాషండు లెన్నటికినిఁగారు. శివోపాస్తిచేయువారు శివపాషండులని చెప్పుచు మీరు శివచిహ్నములుధరింపుచు శివోపాస్తి చేయుచు లింగధారులభంగి లింగము నారాధింపుచున్నారు గనుక మీరు పాషండులుగాని వైష్ణవాగ్రేసరుల కట్టి దురాచార మెన్నటికిని లేదు. 1489

భైరవశాస్త్రి

మీచక్రాంకితము వైష్ణవమేనా ! 1490

పరవరముని

దానికిఁ బ్రమాణంబులిచ్చెద నాకర్ణింపుము. 1491

శ్లో॥ వైష్ణవా మునయస్సర్వే, విష్ణుచక్రేణముద్రితాః
తేషాం దర్శనమాత్రేణ, మహాపాతకనాశనం

వైష్ణవులు మునులు చక్రాంకితులైరి వారిదర్శనమాత్రముచే మహాపాతకములు నశించును. 1492

శ్లో॥ సుదర్శనేన యస్యాంగం, లాంఛితంతు భవేత్సదా
దేహే తస్యవసేన్నిత్యం, శ్రియాయుక్తస్స్వయంహరిః
చక్రాంకితభుజంవిప్రం, యోభూమావభివాదయేత్
లలాటే పాంసుసంఖ్యాని, విష్ణులోకేమహీయతే

శ్లో॥ చక్రాంకితస్య విప్రస్య, పాదప్రక్షాళితంజలమ్
పీత్వాపాతక సాహస్రైర్ముచ్యతే నాత్రసంశయః

శ్లో॥ నారాయణాయుధైర్నిత్యం, చిహ్నితో యస్యవిగ్రహః
పాపకోటి శతందగ్ధం, తస్మిన్ దృష్టే భవేత్సదా

శ్లో॥ శంఖచక్రాంకితంవిప్రం, దృష్ట్వాయోహ్లాదితోభవేత్
పరమంపదమాప్నోతి, కిం పునస్త్వైహికం సుఖమ్

శ్లో॥ చక్రాంకితభుజాస్సర్వే, ప్రహ్లాదేనధ్రువేనచ
విభీషణేన బలినా, రుక్మాంగద శుకేనచ

శ్లో॥ మాంధాత్రాహ్యంబరీషేణ, మార్కండేయ ముఖైస్తథైః
శంఖాది చిహ్నితంస్సర్వైస్స్వీకృతం దేహం నసంశయః

ఎవ్వనిశరీరమునందు సదా చక్రలాంఛనముగలదో వానిదేహంబున లక్ష్మీసహితుండగు విష్ణువు వసించును. చక్రాంకిత భుజుండగు విప్రునకు భూమియందుఁబడి నమస్కరించువాని లలాటంబున

భూరేణువు లెన్నియుండు నన్నివర్షంబులు వాఁడు విష్ణులోకంబున నుండును. చక్రాంకితుండగు విప్రపాదప్రక్షాళిత జలంబుఁ గ్రోలువాఁడు వేనవేలపాతకంబులచే విడువంబడు నిందుకు సందియంబులేదు. నారాయణాయుధ చిహ్నిత విగ్రహుండగువానిం గాంచినచోఁ గోటిపాపంబులు నశించును. చక్రాంకితుండగు విప్రునిఁగాంచి యానందించువాఁడు పరమపదమును బొందు నిహసుఖవిషయమై చెప్పవలసినదేమున్నది! ప్రహ్లాద ధ్రువ విభీషణ బలి రుక్మాంగద శుకమునీంద్రులును మాంధాత్రంబరీష మార్కండేయాది పండితులను చక్రాంకితులైరి.

శ్లో॥ అంగనా వైశ్యశూద్రైశ్చ క్షత్రియైశ్చ ముముక్షుభిః
చక్రాదిలాంఛనంచోర్ధ్వ, పుండ్రంధార్యం నసంశయః
శ్లో॥ స్త్రియశ్చండాల విశ్వస్తా, యేఽపిచాన్యేకులాధమాః
శ్రీచూర్ణసహితంపుండ్రం, ధృత్వాఫాలేతరంతివై

స్త్రీలు వైశ్యులు శూద్రులు క్షత్రియులు మొదలగు ముముక్షువులు అనఁగా మోక్షాపేక్షగలవారు, చక్రాదిలాంఛనంబు నూర్ధ్వపుండ్రంబును ధరింపవలెను. స్త్రీలు చండాలురు విధవలగు నంగనలు నింక నధమకులసంభూతులు శ్రీచూర్ణ సహితంబగు నూర్ధ్వపుండ్రంబును ఫాలభాగంబున ధరింపవలయునని హారితాది స్మృతులయందును బాద్మ వామనాది పురాణంబులయందును స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. 1494

సు శీ లుఁ డు

ఇంతకుఁబూర్వము పాషండులని సెలవిచ్చితిరే వారెట్టివారంకి?

వ ర వ ర ము ని

శ్లో॥ అన్యందేవంపరత్వేన, వదంత్యజ్ఞానమోహితాః
నారాయణాజ్జగన్నాథా, త్తేవైపాషండినస్స్మృతాః

ఎవ్వారజ్ఞానముచే మోహితులై జగన్నాథుండగు నారాయణునకంటె మఱియొకపరాత్పరుఁడగు దేవుఁడున్నాడని చెప్పుదురో వారు పాషండులు 1495

శ్లో॥ ద్వేష్టారో విష్ణుభక్తానాం, యేచావైష్ణవసంశ్రయాః
పాషండిభిశ్చసంయుక్తా, స్తేనైపాషండినః స్మృతాః

విష్ణుభక్తుల ద్వేషించువారును విష్ణుభక్తులుకానివారి నాశ్రయించువారును పాషండులతో సాంగత్యముసేయువారునుపాషండులు.

శ్లో॥ సత్వశాస్త్రోక్తమాచారం, యస్తునాచరతేద్విజః
సపాషండీతివిజ్ఞేయ, స్సర్వలోకేషుగర్హితః

సాత్విక శాస్త్రమునందుఁ జెప్పబడిన కర్మమునాచరింపని ద్విజుఁడు సర్వలోకగర్హితుఁడగు పాషండుడు 1498

శ్లో॥ సమస్తయజ్ఞభోక్తారం, మవిదిత్వాచ్యుతంహరిమ్
ఉద్దేశ్యదైవతాన్యైవ, జుహోతిచదదాతియః

సర్వయజ్ఞభోక్తయు నచ్యుతుఁడునగు హరి నెఱుంగక తానుద్దేశించిన దేవతకొఱకు హోమదానాది కర్మము లొనర్చువాఁడు పాషండుడు 1499

శ్లో॥ యస్తునారాయణంబ్రహ్మ, రుద్రాద్యైశ్చైవదైవతైస్సహ
సమత్వేనైవవత్యేత, సపాషండీభవేద్ధ్రువమ్

ఎవ్వఁడు నారాయణుని బ్రహ్మరుద్రాది దేవతలతో సమానుఁడని చెప్పునో వాఁడు పాషండుడు 1500

శ్లో॥ అవస్థాత్రితయేయస్తు, మనోవాక్కాయకర్మభిః
వాసుదేవంనజానాతి, సపాషండీభవేద్విజః

ఏ బ్రాహ్మణుఁడు మూఁడవస్థలయందును త్రికరణములచే వాసుదేవు నెఱుంగఁడో వాఁడు పాషండుడు 1501

శ్లో॥ కిమత్రబహునోక్తేన, బ్రాహ్మణాయేఽప్యవైష్ణవాః
తేవైపాషండినోజ్ఞేయాః, సర్వలోకేషుగర్హితాః

అనేక వాక్యములచేఁ బ్రయోజనములేదు యే బ్రాహ్మణులు విష్ణుభక్తులు కారో వారు సర్వలోకనిందితులైన పాషండులని తెలియవలెను 1502

శ్లో॥ అవైష్ణవాస్తు యేవిప్రాశ్చండాలాదధమాస్స్మృతాః
తేషాంసంభాషణస్పర్శాన్, ప్రమాదేనాపివర్జయేత్

ఏవిప్రులు విష్ణుభక్తులుకారో వారు చండాలునకంటెను నీచులు ప్రమాదముచేతనైన వారిసంభాషణస్పర్శములు వర్జింపవలెను 1454

ఇవ్విధంబున హరిహరతారతమ్యంబెఱింగి ముముక్షువులగు వారు శ్రీవైష్ణవచిహ్నంబులు ధరించి మోక్షప్రదాతయగు నారాయణు నాశ్రయించి శాశ్వతానందముఁ జెందుదురుగాక 1503

**గద్యము:** ఇది శ్రీ సీతావల్లభ ప్రసాద సమాసాదిత కవితాప్రవీణ
వేదాల సీతారామాచార్య కృపాలబ్ధ మంత్ర రత్నానుసంధాన
పవిత్రాంతరంగ నిఖిల దుర్మత శిలోచ్చయ దంభోళీ భూత
సముద్రాల లక్ష్మణాచార్యానుగ్రహ బోధిత విశిష్టాద్వైత
రహస్యార్థ ధురంధర శఠగోప యతిరాడ్వర వరయోగి
ప్రభృతిపూర్వాచార్య చరణ సరోజ భ్రమరాయ
మాన కృష్ణమాంబా కృష్ణార్య తనూజ
శ్రీవైష్ణవవిధేయ వేంకటదాస నామధేయ
ప్రణీతంబైనజ్ఞానసూర్యోదయమునందుఁ
ద్వి తీ య భా గ ము
సం పూ ర్ణ ము

శ్రీమతే రామానుజాయనమః

# జ్ఞానసూర్యోదయము

## చ తు ర్థ భా గ ము

## భా గ వ త ప్ర భా వ ము

గురుకులాంభోధిచంద్రా భగవంతునియందు భక్తిగలుగుటకు
గారణంబును భగవద్భక్తిచేఁ జేతనుఁడు పొందెడి ఫలంబును భాగవత
ప్రభావంబును విశదముగా దెలుపుడు, 1504

వ ర వ ర ము ని

చేతనునకు భక్తిజనించుటకు భగవత్కటాక్షము కారణమని
కొన్నిగ్రంథములయందును బూర్వపుణ్యంబు కారణంబని కొన్నిటి
యందునుగానఁబడుచున్నది యెట్లనగా 1505

శ్లో॥ సూర్యస్యైవతుయోభక్త, స్సప్తజన్మాంతరంనరః
తస్యైవతుప్రసాదేన, విష్ణుభక్తఃప్రజాయతే

ఏమనుష్యుఁడు సూర్యునుపాసించి భక్తిచేయునో వాడాసూర్య
ప్రసాదముచే నెనిమిదవజన్మంబున విష్ణుభక్తుఁడగుచున్నాడు 1506

శ్లో॥ శంకరస్యతుయోభక్త, స్సప్తజన్మాంతరంనరః
తస్యైవతుప్రసాదేన, విష్ణుభక్తః ప్రజాయతే

ఏమనుష్యుండేను జన్మంబుల శంకరు ను పాసించునో వాఁడు తదీయానుగ్రహంబుచే విష్ణుభక్తుఁడగును 1508

శ్లో॥ జన్మాంతరసహస్రేషు, తపోధ్యానసమాధిభిః
నరాణాంక్షీణపాపానాం, కృష్ణేభక్తిఃప్రజాయతే

వేలకొలఁది జన్మములయందుఁ దపస్సు ధ్యానము సమాధి మొదలగు పుణ్యము లొనర్పఁగాఁ బాపంబులు క్షీణించు నట్టివారికిఁ గృష్ణునియందు భక్తిజనించును. 1508

శ్లో॥ యేషాంత్వంతగతంపాపం, జనానాం పుణ్యకర్మణాం
తేద్వంద్వమోహనిర్ముక్తాః, భజంతేమాంధృడవ్రతాః

నరు లెవ్వరు పుణ్యకర్మములచేఁ బాపములు పోఁగొట్టుకొందురో వారు సుఖదుఃఖాది ద్వంద్వములచే విడువఁబడి దృఢవ్రతులై నన్నుభజింతురని భగవంతుఁడు సెప్పెను. 1509

శ్లో॥ బహూనాంజన్మనామంతే, జ్ఞానవాన్మాంప్రపద్యతే
వాసుదేవస్సర్వమితి, సమహాత్మాసుదుర్లభః

బహుజన్మములయం దార్జింపఁబడిన పుణ్యముచే జ్ఞానియైన వాఁడు నన్నుపాసింపుచున్నాఁడు. అట్టివాఁడు లభించుటరుదు. 1510
(భగవద్గీత)

ఇంతవఱకిప్రమాణములచేఁ బూర్వపుణ్యముచే భక్తి గలుగు నట్లు సిద్ధించినది. 4311

శ్లో॥ జాయమానంహి పురుషం, యంపశ్యేన్మధుసూదనః
సాత్వికస్సతువిజ్ఞేయః, సవైమోక్షార్థచింతకః

జన్మించునపు డేనరుని మధుసూదనుఁడుకటాక్షించునో వాఁడు మోక్షార్థియగును. దీనివల్ల భగవత్కటాక్షముచే భక్తి కలుగునని యేర్పడుచున్నది. 1512

సుశీలుఁడు

అయ్యా! మీరిప్పుడు సాధించినది పరస్పర విరోధముగా నున్నది. మదీయమనంబు కల్వరపడుచున్నదిగనుక నేకరీతిగావచించి మనోమాలిన్యముఁ దొలఁగింపుడు. 1513

వరవరముని

అన్యోన్య విరోధమేమియులేదు. పూర్వపుణ్యంబును భగవదను గ్రహంబు నీరెండును భక్తికిఁ గారణంబులేయగు నెట్లంటివేని బంగారము కావలయును దానినిఁ గరఁగించుటకు నగ్నియుఁ గావలయు నదే విధమునఁ బూర్వపుణ్యము బంగారువంటిది భగవంతుఁ డగ్నివంటి వాఁడు సదాచార్యుఁ డగసాలివంటివాఁడు. బంగారు మగ్నిచేఁగరఁగి పనివానిచే భూషణంబగునట్లు పూర్వపుణ్యము భగవత్కటాక్షముచే బక్వమైనప్పుడు శరీరికి భక్తిగలుగు సదాచార్యసంబంధమున గురుండు దిద్దుబాటుసేసి మోక్షమార్గ ముపదేశించును. 1514

సుశీలుఁడు

అట్లైనచో భగవత్కటాక్షము సహేతుకంబయ్యెంగాని నిర్హేతుకము కాలేదే! 1515

వరవరముని

జీవుండు దేహధారి యైనప్పుడు దేహమే యాత్మ యను భ్రమతోఁ గూడియున్నాఁడు. వాఁడు సాధించు పుణ్యమచేతనమైయున్నది. దేహాత్మభ్రమయను విపరీతజ్ఞానముగల శరీరి భగవద్భక్తి సంపాదించుకొనఁజాలఁడు. అచేతనంబగు పుణ్యంబును భక్తి నీయంజాలదు. సర్వజ్ఞుఁడు సర్వశక్తుండగు భగవంతుఁడట్టి చేతనునియందు దయగలవాఁడై చేతనుని పుణ్యంబున కశాశ్వతఫలంబు లొసంగక స్వకీయ భక్తిఁ గలిగించి మోక్షార్థినిఁ జేయుట నిర్హేతుకమేయగును. పూర్వపుణ్యము నిమిత్తమాత్రంబగుచున్నది. అంతమాత్రము వ్యాజంబులేనిచో సర్వేశ్వరుం డందఱి నేల కటాక్షింపఁడను నాక్షేపమువచ్చును. 1516

సు శీ లుఁ డు

పుణ్యము లేనట్టివారికందఱికి భగవంతుఁడు కటాక్షించి స్వకీయ భక్తినొసంగునా? 1517

వ ర వ ర ము ని

కొన్నిపుణ్యములకు స్వర్గాదిఫలంబు లొసంగును. కొన్నిటికి నైశ్వర్య విద్యాబలాయురారోగ్యాదు లొసంగు నేపుణ్యము భక్తికి యోగ్యమై యుండునో దానికిమాత్రమే స్వకీయ భక్తినొసంగును. 1518

సు శీ లుఁ డు

భగవంతుఁడు దయాసముద్రుఁడుగనుక నిమిత్తములేకుండ భక్తి దేహికిఁ గలిగింపరాదా? 1519

వ ర వ ర ము ని

నిమిత్తమైన లేకుండఁ గటాక్షించినచో నందఱినిఁ గటాక్షింపవలయు నట్లనుగ్రహించినచో సర్వేశ్వరుఁడు వివేకికాకపోవును. పాపపుణ్యంబులు శుభాశుభము లేర్పడవు. శాస్త్రములు నిష్ప్రయోజనమగును. గురు శిష్య న్యాయ మనవసరంబగును. చదువని విద్యార్థి కెంత పండితుఁడైన విద్యనేర్పలేడు. పూర్ణాజీర్ణరోగికి నెంత ప్రేమగలవాఁడైన నన్నము రుచింపఁజేయఁజాలఁడు. మూర్ఖుని నెంతచతురుండైన సన్మార్గమున నడిపింపఁజాలఁడు. అదేవిధంబునఁ బూర్వపుణ్య మేమియు లేనివానికి భక్తిఁగలిగించుటకు నారాయణునకు శక్యంబుగాదు. 1520

సు శీ లుఁ డు

పూర్వపుణ్యముచే భగవత్కటాక్షమును భగవత్కటాక్షముచే భక్తియు దానిచే మోక్షంబును గలుగునని వచించితిరి. సరేగాని దేహికి హఠాత్తుగాఁ బుణ్యాభిలాష యెట్లుగలుగును? 1521

ప ర వ ర ము ని

బంధుభావముచేఁగాని స్నేహంబుచేఁగాని సత్సాంగత్యము గలుగును. దానిచేఁ బుణ్యాభిలాష జనించు నెట్లంటివేని పదిమందికలిసి

తీర్థసేవ సేయుచుండఁగా వారిలో నొక్కనికి స్నేహితుండగువాఁడు మూర్ఖుండైనను స్నేహభావముచే వారితోఁ జేరి శ్రీరంగాది క్షేత్రములయందుండు భగవద్వైభవము ననుభవించును. పుణ్యుండగు వాఁడు భాగవతాది గ్రంథములఁ బురాణము సెప్పించుచుండఁగా దుర్మార్గుఁడు సహితము బంధుభావముచే నచ్చోటికరిగి భగవత్కథాప్రపంచము నాకర్ణించును. పదిమందికలిసి భగవన్నామసంకీర్తనచేయుచుండఁగా నొకదురాత్ముండు వారిలోఁ జేరి కీర్తనలుపాడు నొకానొక పుణ్యుం డనేకభాగవతుల కన్నముపెట్టుచుండఁగా నిరుపేదలగువా రనేకు లయ్యింటఁ బ్రవేశించి నేయివడ్డించి యన్నము విస్తరాకులఁ బెట్టి మంచినీరిచ్చి భాగవతపరిచర్యసేయుదురు. ఇట్టిపుణ్యంబులన్నియు నొక్కటిగాఁ జేర్చి హితకారియగు నారాయణుండు దానికిఫలముగా స్వకీయ పాదభక్తి గలిగించును. ఇదియే శరీరికి ముందుగా భక్తిబీజంబు హృదయంబున నాటుకొనుటకు మార్గము. 1522

సుశీలుఁడు

అట్టి విష్ణుభక్తి శరీరి కేకాలంబున నేప్రాయంబున నుద్భవించును? 1523

వరవరముని

ఎవ్వరి కేకాలంబున నేవిధంబున విష్ణుభక్తి లభించునో చెప్ప నలవిగాదు. ఈభక్తి శుకప్రహ్లాదులకు జన్మముతోఁ గలిగెను. గజేంద్రునకు మకరపీడాకాలంబునందును ఖట్వాంగాజామిళముచుకుందాదుల కంతిమదశయందును సంభవించెను. మఱియు ద్రౌపదికి వస్త్రాపహరణసమయంబునందును విభీషణునకు రావణకృత పరాభవకాలమునందును భీష్మున కంత్యకాలమునందును విష్ణుభక్తి విజృంభించెను. గోపికలకుఁ గృష్ణకృత వేణునాద శ్రవణకాలంబున నక్రూరునకుఁ గృష్ణాహ్వాననిమిత్తకాలంబున వసిష్ఠ వ్యాస నారద వాల్మీకి పరాశరాదులకుఁ దపఃపరిపక్వతరుణంబున నీభక్తియోగము సిద్ధించెను. సరో

భూత కాసార మహదాహ్వయాద్యాళ్వారులకు శఠగోపనాథ యామున రామానుజాది పూర్వాచార్యులకు సర్వకాలములయందు నీభక్తి యోగము ధారక పోషక భోగ్యములైయుండెను. 1524

సుశీలుఁడు

ఈభక్తి కలిగినవెంటనే నిలిచి మోక్షంబొసంగునా లేక మాఱుచుండునా ? 1525

వరవరముని

భగవత్కటాక్షముచేఁ గలిగిన భక్తికి మోక్ష ప్రాప్తివఱకు విచ్ఛిత్తిలేదు. శాస్త్రశ్రవణ గురూపదేశాదులవల్లఁ గలిగినభక్తి నిలుచుటయు మార్పుఁజెందుటయుఁగలదు. 1526

సుశీలుఁడు

అట్టిమార్పెవరికిఁ గలిగినదో వచింపుడు. 1527

వరవరముని

పూర్వ మింద్రద్యుమ్నుఁడను ద్రావిడదేశపు రాజు విష్ణుభక్తుఁడైయుండియు నగస్త్యునిశాపముచేఁ గరీంద్రుఁడయ్యెను. భరతుఁడను మహాయోగి భగవద్భక్తి చేసిచేసి లేడిపిల్లయందలి మోహంబుచేఁ జచ్చి తదీయజన్మమెత్తెను. సౌభరి మత్స్యసాంగత్యముచే స్త్రీలోలుఁడయ్యె నక్రూరుఁడు శతధన్వుని సంసర్గముచే భగవదపచారమొనర్చె నింక ననేకు లనేకప్రకారంబులఁ బూర్వయుగంబులయందు సైతము మార్పుఁజెంది మరలఁ బాటునఁబడిరి. 1528

సుశీలుఁడు

గురుశిఖామణీ ! భగవద్భక్తియందుఁ బ్రవేశించినవాఁడు భగవత్ప్రభావ మాకర్ణించి భగవన్నామము లుచ్చరించి భాగవతసాంగత్య సల్లాపసుఖం బనుభవించి చిత్తమాలిన్యముఁ బోగొట్టుకొని ప్రపంచమును దృణప్రాయంబుగారోసి యానందవార్ధి నోలలాడుచుండును గదా ! యట్టివాఁడు భక్తివదలి విషయసుఖంబుల కెట్లుపాల్పడును.

వరవరముని

మనుష్యుండు మేల్కొనియున్నప్పుడు తనయాస్తిలో నొక్క రవ్వయైన నితరుల కీయనొల్లఁడు. నిద్రించునప్పుడంతయు దోఁచుకొని పోయిన నూరకుండు నదేవిధంబున భక్తుఁడు జ్ఞానముతో నున్నంత కాలము క్షణకాలమైన వ్యర్థముగాకుండ భగవంతు నారాధించు నజ్ఞాన మావరించినప్పుడు స్మరింపనే స్మరింపఁడు. 1530

సున్నలుఁడు

కొంతకాల మఖండభక్తి చేసి మానినవాఁడు మరలఁ ద్రోవకు వచ్చునా? 1531

వరవరముని

ఈప్రశ్నయే పెరుమాళ్ళనుగూర్చి ఫల్గునుండు

శ్లో॥ అయతిశ్శ్రద్ధయోపేతో, యోగాచ్చలితమానసః
అప్రాప్యయోగసంసిద్ధిం, కాంగతిం కృష్ణగచ్ఛతి

శ్లో॥ కచ్చిన్నోభయ విభ్రష్టః, ఛిన్నాభ్రమివనశ్యతి
అప్రతిష్ఠోమహాబాహో, విమూఢో బ్రహ్మణఃపథి

శ్లో॥ ఏతంమే సంశయం కృష్ణ, ఛేత్తు మర్హస్యశేషతః
త్వదన్యస్సంశయస్యాస్య, ఛేత్తానహ్యుపపద్యతే

యోగభ్రష్టుఁడైనవాఁడు యోగసిద్ధినిఁ బొందఁడుగదా! వాఁడే గతినిఁబొందును. స్వర్గసాధనమైన కర్మఫలమునకు మోక్షమార్గమైన యోగమార్గమునకుఁ దప్పినవాఁ డుభయమునకుఁజెడిన మబ్బుతునక వలె నశింపకుండునా! ఈ నా సంశయమును దొలఁగించుటకు నీవే యర్హుండవు, నీకంటె నితరుఁడు సమర్థుఁడు కాడని యడిగె నంతటఁ బెరుమాళ్ళు కిరీటింగాంచి, 1532

శ్లో॥ పార్థనైవేహనాముత్ర, వినాశ స్తస్యవిద్యతే
నహికల్యాణకృత్కశ్చిత్, దుర్గతింతాతగచ్ఛతి

ఓయర్జునా! యోగభ్రష్టుఁడైనవాని కీలోకమునందైనను బర లోకమునందైనను నాశనములేదు. తండ్రీ! మంచిచేసినవాఁడొకప్పు డును దుర్గతినిఁబొందడు. 1533

శ్లో॥ ప్రాప్యపుణ్యకృతాం లోకా,నుషిత్వా శాశ్వతీస్సమాః
శుచీనాం శ్రీమతాంగేహే, యోగభ్రష్టోఽభిజాయతే

యోగభ్రష్టుఁడైనవాఁడు మిక్కిలి పుణ్యాత్ములు పొందెడు లోకమునుబొంది యచ్చట బహుసంవత్సరములుండి తరువాత సదాచార సంపన్నులగు శ్రీమంతుల గృహంబునఁ బుట్టుచున్నాడు.

శ్లో॥ అథవాయోగినామేవ, కులేభవతి ధీమతాం
ఏతద్ధి దుర్లభతరం, లోకే జన్మ యదీదృశమ్

అట్లుగానిచో జ్ఞానవంతులగు యోగుల గృహమునఁ బుట్టు చున్నాడు. లోకములో నిట్టిజన్మము దొరకుట దుర్లభముగదా.

శ్లో॥ తత్రతంబుద్ధి సంయోగం, లభతే పౌర్వదైహికం
యతతే చ తతోభూయ, స్సంసిద్ధౌకురునందన
పూర్వాభ్యాసేన తేనైవ, హ్రియతేహ్యవశోపిసః

అచ్చట నప్పుడు పూర్వదేహసంబంధమైన బుద్ధియోగమును బొంది యోగసిద్ధికై యత్నింపుచున్నాడు వాఁడు బలాత్కారముగాఁ బూర్వముచేయఁబడిన యోగాభ్యాసముచేత లాగబడుచున్నాడు 1536

కావునఁ దీవ్రముగా భక్తియోగమును జేయువాఁ డాజన్మమునఁ జెడినను మఱుసటి జన్మమునందో మూడవజన్మమునందో తప్పకముక్తి నొందును. భరతయోగి మూడవజన్మమునందు నింద్రద్యుమ్నుఁడు గజేంద్రుఁడై రెండవజన్మంబునందును ముక్తినొందిరి. సౌభర్యశ్రీరామ భక్తాంఘ్రిరేణు లదేజన్మంబునఁ బొరపాటుదిద్దుకొని మోక్షంబుఁజెం దిరి, విష్ణుభక్తిస్వల్పముగాఁ జేయఁబడినదైనను ఘోరపాపంబుల రూపు

మాపునుగాని పాపములచే బద్ధుపడడు సాంసారిక వ్యాపారంబులలో నుండియైనను హరిభక్తి చేయుచున్నచో నాభక్తి సంసార దుర్గంధము నశింపఁజేసి తాను పైకెక్కును జీవునకు వాసుదేవునిపై భక్తిజనించుట దుర్లభంబు కాని యట్టిభక్తిజనించిన మీఁద కష్టపడవలసిన పనిలేదు ధనంబు లుద్యానవనంబులు భవనంబులు గజ హయ పుత్ర మిత్రకళ త్రాదులు భోగంబులు క్రమంబుగా నశించును విష్ణుభక్తి చెడదు, విష్ణుభక్తుఁడైనవాని శరీరంబు బంగారువంటి కాంతికలిగి శస్త్రాస్త్రంబుల కభేద్యంబైయుండును నతనిమనంబు శుద్ధస్ఫటికంబు భంగినిర్మలంబై యుండు మఱియు హరిదాసుండగువాని వాక్యమాధుర్యయుక్తంబై తనరారు, నట్టివాని మొగంబున వైష్ణవతేజంబుప్పతిల్లుచుండు విష్ణు దాసునెవ్వరును దిరస్కరింపఁ జాలరు మేరుమందరపర్వతంబు లఱచేత బగులఁగొట్టుటకు సముద్రమునింకించుటకు నెట్టులలవిగాదో యట్లె విష్ణుభక్తులఁ బరాభవింప నేరికిని శక్యంబుగాదు 1537

సుశీలుఁడు

శుచిర్భూతుండైన విష్ణుభక్తునకు రాగద్వేషములచేఁదనభక్తి చెడుచుండఁగా దుఃఖకరముగానుండునుగదా యతండెట్లొప్పుకొని యుండును 1538

పరవరముని

నిర్జనంబగు ఘోరకాంతారంబున నడచునప్పుడు దొంగలు బలాత్కారముగా ధనమపహరింప బాటసారి యేమియుఁ జేయఁజాల కూరకయుండునుగదా యిదియిట్టులుండ వాడిగల సూదిమోపినంత స్థలంబైనఁబాండవులకీయనన్న సుయోధనుఁడు పరివారములన్నియు నశించునప్పుడు స్వయముగాఁదొడలు విఱిగిపడియున్నప్పుడేమి చేసెను, పదియాఱువేలకన్నియలఁ జెఱలోనుంచిన నరకాసురుండక్కన్యామ ణులు కృష్ణుని వరించినప్పుడేమి చేసెను లంకాపురము దగ్ధమగుచుండగా త్రిలోకకంటకుండగు రావణుండేమి చేసెను యాజ్ఞసేని వస్త్రము

లూడ్చుచుండఁగా బాండవులేమి చేసిరి అదేవిధంబున భగవద్భక్తిని విడిచిమనస్సు చెడిపోవునప్పుడు మూఢుండు తెలియఁజాలడు జ్ఞాని తెలిసి యునశక్తుండగుటచే నిలుపుకొనజాలడు 1539

సు శీ లుఁ డు

అయ్యా! తన్నునమ్మినవానిభక్తి చెడిపోవుచుండఁగా సర్వజ్ఞుఁడు సర్వశక్తుఁడునగు భగవంతుఁ డెట్లూరకయుండును? 1540

వ ర వ ర ము ని

అనుభవనీయమైన ప్రారబ్ధము కడిసినప్పుడు తప్పింపవీలుగాక భగవంతుఁడుసహితము పరితాపముతో వీక్షించుచుండును. 1541

సు శీ లుఁ డు

అట్లులైనచో సామాన్యునకు భక్తునకుఁ దారతమ్యం బేమి కలదు? 1542

వ ర వ ర ము ని

సామాన్యుని ప్రారబ్ధ మెంతకాలమునకుఁ దఱుగనిదై భావికాలానుభవనీయమైన దుష్కర్మములు చేయించును. భగవద్భక్తుని ప్రారబ్ధము కొండంతదైన గోరంతగా నశించి యుత్తరకాలానుభవమునకు శేషముండదు సరేగదా యాగామిసంచితములు నశించును. సామాన్యునకుఁ బ్రారబ్ధముభంగి నాగామిసంచితములుకూడ ననుభవనీయములైయుండును. 1543

సు శీ లుఁ డు

భగవద్భక్తి చెడుటకుఁ గారణంబులేవి? 1544

వ ర వ ర ము ని

దారిద్ర్యముతోనుండి భగవద్భక్తి చేయువానికి నైశ్వర్యము కలిగినచో నదివఱకుండు కష్టములుపోయి సుఖంబులు ప్రాప్తించును సుఖమెట్టిదో యెఱుంగనివానికి సుఖము కలిగినతోడనే యుప్పొంగి

మైమఱచి భగవంతుని విడుచు నైశ్వర్యసంతాపమునకుఁ గొంచెము లేమి వచ్చెనేని భరింపఁజాలనివాఁడై యిదివఱకు లేని కష్టము లీభక్తివలనఁ గదా ప్రాప్తించెనని తలంచి భగవంతుని వదలును. ధనము లేని వాఁడు రోగములు విపత్తులు లభించినప్పుడు తబ్బిబ్బుఁజెంది భక్తిని విడుచును. వీని కన్నిటికంటె భక్తిచెడుటకు దుస్సాంగత్యము ప్రబలమైనది దుస్సాంగత్యముచే భగవద్రుచి నశింపఁగా దుర్విషయరుచి వృద్ధిఁజెందును, వ్యాధిగ్రస్తుఁడైన వానికజీర్ణదోషముచే నన్నశాకసూపాపూపాదు లసహ్యమైనట్లు దుర్విషయాభిలాష గలవానికి భగవద్భక్తిరుచింపదు కృషీవలుఁడు సస్యము ఫలించువఱకుఁ బశుపక్షిమృగాదుల కందకుండఁ గలుపువేయకుండఁ గాపాడునట్లు భక్తిస్థిరముగా నిలుచువఱకు శిష్యులనాచార్యుండు కాపాడవలయు నెవరిబాగు వారెఱుంగరాయని బద్ధకించి యుదాసీనముగా నుండరాదు [illegible] భక్తాంఘ్రిరేణుల భక్తి దుస్సాంగత్యముచే సంకోచించి మరల భాగవతకృపాలబ్ధిచే వికసించెను 1545

సందేహము

అభ్యాసకుఁడు భక్తిలోఁ జేరినది మొదలు తీవ్రముగాఁ జేయ వచ్చునా లేక క్రమముగా హెచ్చింపవలయునా 1546

సమాధానము

అభ్యాసకుఁడైన భక్తుఁడు ప్రథమంబుననే తీవ్రంబుగా భక్తిచేయరాదు యెందులకంటెనేని మానవేంద్రియంబు లనాదినుండియు మాయకులోనై నిద్రాహారభయమైథునాదుల యందలవాటు పడియున్నవి భగవద్భక్తి రుచి నెన్నఁడు ననుభవించియుండలే దకాలంబున విషయానుభవము కొంచెము కొంచెముగాఁ దగ్గించుచు భగవద్భక్తినలవాటు చేయవలయునట్లుగాక యొకేసారి తీవ్రముగా భక్తిచేయుట కారంభించినచో దుష్టేంద్రియంబులు దానిఁ జేయకొనక విషయానుభవము ముఖ్యమనియు భక్తియనవసరంబనియు బోధించి చేతనునిఁ జెడఁగొట్టు నటు

పిమ్మట నామూఘుండెన్ని జన్మంబులకైన భగవద్రుచి నెఱుంగఁజాల
సంసారాంధ కూపంబునంబడునిట్లు చెడినవారినసేకుల నేనెఱుంగుదు

సుశీలుఁడు

భాగవతు లనగానర్థమేమి? 1548

వరవరముని

భగవత్సంబంధులైన వారు భాగవతులనఁబడుదురు భగవత్సం
బంధమనఁగా 1549

శ్లో॥ యేకంఠలగ్నతులసీనలినాక్షమాలాః
యేబాహుమూలపరిచిహ్నితశంఖచక్రాః
యేవాలలాటఫలకేలసదూర్ధ్వపుండ్రాః
తేవైష్ణవాభువనమాశుపవిత్రయంతి

తులసీనలినాక్షమాల లెవ్వరుకంఠమున ధరింతురో బాహు
మూలముల యందెవ్వరు శంఖచక్రచిహ్నములు గలిగియుందురో
లలాట ఫలకమునం దెవ్వరూర్ధ్వపుండ్రమును ధరింతురో వారువైష్ణ
వులు లోకమును శీఘ్రముగాఁ బవిత్రము చేయుదురు 1550

సుశీలుఁడు

ఈలక్షణములున్న మాత్రముననే వైష్ణవులగుదురా 1551

వరవరముని

వైష్ణవులనఁబడుదురుగాని యంతమాత్రమున వైష్ణవత్వప్రాప్తి
కాలేదు ఈచిహ్నంబులు గలవారు సత్కారయోగ్యులనియు నివికలి
గియు నర్థపంచకజ్ఞానంబుగలవారు సహవాసయోగ్యులనియుఁ బైరెం
డును గలిగి యాసక్తులై "సర్వంవిష్ణుమయ"మ్మను వారు సర్వజనపూజ్యు
లనియు నిట్లు వైష్ణవులను మూఁడు తెగలుగా నంబిళ్ళగారు నిర్ణయిం
చిరి కనుక శరీరమున విష్ణుచిహ్నములు మనస్సునందు విష్ణుపాదధ్యా
నంబును వాక్కున భగవన్నామోచ్చారణము భగవద్గుణ వర్ణనము

విషయ విరాగమెవరికిఁగలదో వారు వైష్ణవులనియు భాగవతులనియుఁ జెప్పఁబడుదురు 1552

సుశీలుఁడు

శ్రీవైష్ణవులనఁగా నర్థమేమి? 1553

వరవరముని

శ్రీః అనగా లక్ష్మీదేవి, యామె భక్తులచే నాశ్రయింపఁబడి భగవంతు నాశ్రయించుటవల్ల శ్రీ యను నామంబుఁ జెందుచున్నది. విష్ణువనఁగా సర్వేశ్వరుఁడు, లక్ష్మి జీవులకుఁ బురుషకార భూత, లక్ష్మి పురుషకారముచే విష్ణువు రక్షించువాఁడు, శ్రీ సహితుండగు విష్ణువు నాశ్రయించువారు శ్రీవైష్ణవులు వారికే భాగవతులనియుఁ బరమ భాగవతులనియు నామధేయంబులుఁగలవు దేవతాంతర మంత్రాంతర సాధనాంతర ప్రయోజనాంతర పరులు శ్రీవైష్ణవాహ్వయంబునకు లక్ష్యంబుగారు 1554

సుశీలుఁడు

విష్ణుభక్తుండైనచో నేజాతివాఁడైనను వైష్ణవుండగునా 1555

వరవరముని

ఉపాధ్యాయ పదవిలోఁ బ్రవేశించిన వాఁడేకులమువాఁడైన నుపాధ్యాయుఁడనంబడు రాజ్యము సంపాదించిన వాఁడేజాతి వాఁడైనను రాజనంబడును. అట్లే నిఖిలంబున శ్రియఃపతి నాశ్రయించి రామానుజ సిద్ధాంతంబునఁ బ్రవేశించి తదీయ నిర్ణయానుసారంబుగా బ్రవర్తించు నట్టైన నేజాతివాఁడైన శ్రీవైష్ణవుండనంబడుఁగు శ్రీవైష్ణవనామము మత సంబంధ వాచకమేగాని జాతివాచకముగాదు 1556

సుశీలుఁడు

దేవరవారు బ్రాహ్మణోత్తములగుటవలన భాగవత ధర్మంబెఱింగింతురో సంశయింతురోయని భయంబు పొడముచున్నది 1557

వరవరముని

భయపడనలసిన యవసరంబులేదు నీయిష్టానుసారముగా ప్రశ్నింపుము యథార్థము నెఱింగింతు 1558

సుశీలుఁడు

యథార్థవాదీ లోకవిరోధీ యనునట్లు దేవరవారు బ్రాహ్మణులైయుండి యథార్థమునెఱింగించినచో బ్రాహ్మణులు మీపైనఁ గోపింతురు మీకు వారివల్ల బాధగలుగు నక్కారణంబున నేను గురుద్రోహినగుదునేమో 1559

వరవరముని

పరవాలేదు నీవు తెలియక పొరపాటుగా నడిగినను సమర్థించి శాస్త్రానుసారంబుగావచింతు శాస్త్ర ప్రమాణములతో వచించిన దానికిఁ గోపించిన వారివల్లమనకు భయంబులేదు వారులోకాభిమానము దేహాభిమానము నాభాసబాంధవలౌల్యముగలవారు, భగవన్నిగ్రహంబుచే దుఃఖము భగవదనుగ్రహంబుచే నానందమును గలదు కాని జ్ఞానహీనుల కోపప్రసాదముల వల్లమనకేమియుఁ గీడుమేల్లుగలుగనేరవు కాబట్టి ప్రశ్నింపుము 1560

సుశీలుఁడు

ప్రథమంబున జాతులెన్ని 1561

వరవరముని

శ్లో॥ చాతుర్వర్ణ్యంమయాసృష్టం, గుణకర్మవిభాగశః

గుణకర్మ విభాగముచే బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులను నాలుగుజాతులు నాచేసృజింపఁబడెను 1562

శ్లో॥ శమోదమ స్తపశ్శౌచం, క్షాంతిరార్జవమేవచ
జ్ఞానవిజ్ఞానమాస్తిక్యం, బ్రాహ్మంకర్మస్వభావజమ్

శమము, దమము, తపస్సు, శౌచము, ఓర్పు, ఆర్జవము

జ్ఞానము విజ్ఞానము, ఆస్తిక్యము, యీగుణములు బ్రాహ్మణునకు సహజము 1533

శ్లో॥ శౌర్యంతేజోధృతిర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనమ్
దానమీశ్వరభావశ్చ, క్షాత్రంకర్మస్వభావజమ్

శౌర్యము, తేజస్సు, ధైర్యము, దాక్ష్యము యుద్ధమునఁ బాఱి పోకయుండుట, దానము, ఈశ్వరభావము యీగుణములు క్షత్రియునకు సహజములు 1534

శ్లో॥ కృషిగోరక్షణవాణిజ్యం. వైశ్యంకర్మస్వభావజమ్
పరిచర్యాత్మకంకర్మ, శూద్రస్యాపిస్వభావజమ్

కృషిగోరక్షణ వాణిజ్యములు వైశ్యునకుఁ బరిచర్యశూద్రునకు సహజకర్మములుఁ అనియిట్లు గీతాచార్యుండగు భగవంతుఁడానతిచ్చుటచే మానకోటిలోఁ బ్రధానమైనవి నాలుగుజాతులనియు వారివారికి దగినగుణకర్మములివియనియుఁ దేలినది 1535

సునీలుఁడు

వీరిలో నెచ్చులొచ్చులుగలవా, అందఱుసమానులేనా 1536

వరవరముని

బ్రాహ్మణులు మొదలు శూద్రులవఱకు నొకరికంటె నొకరు తక్కువయని చెప్పుదురు 1537

సునీలుఁడు

ఈవర్ణ విభాగము పుట్టుకతోవచ్చునా వృత్తివల్లనేర్పడునా దీనికి మీయభిప్రాయమేమి 1538

వరవరముని

జన్మముచేతనే వర్ణవిభాగము. చేయఁదలంచినచో జన్మము శుక్ల శోణితములచే సంభవించును. శుక్ల శోణితములే ప్రధానమైనచో జాతివిరుద్ధములగు దుష్టకార్యము లొనర్చునప్పు డట్టివాని నిందించి

సంఘబహిష్కారము చేయుచున్నారు. ఇంతేకాక ప్రమాణవిరోధము కలుగుచున్నది. ఎట్లంటివేని విశ్వామిత్రమహర్షి దేవవేశ్యయగు మేనకతో భోగింపఁగా దానికి శకుంతల జన్మించె నక్కన్నియ చంద్రవంశజాతుండగు దుష్యంతునిఁ బెండ్లియాడి భరతుఁడను కుమారుని గాంచి క్షత్రియాంగనగాఁ బరిగ్రహింపఁబడెను. ఉపరిచరవసుమహారాజ వీర్యముచేఁ జేపగర్భమందు జనించిన మత్స్యగంధికిఁ బరాశరుని వల్ల జన్మించిన వ్యాసుండు బ్రాహ్మణుండయ్యె నట్టివ్యాసునకు జనించినవారిలో ధృతరాష్ట్రపాండురాజులు క్షత్రియులైరి విదురుఁడు శూద్రుఁడయ్యెను. బీజముప్రధానమనినచో ధృతరాష్ట్రపాండువిదురులు బ్రాహ్మణులు కావలయును. క్షేత్రముప్రధానమనినచో వ్యాసుండు శూద్రుండు కావలెను. అట్లుకాలేదు కనుక నిర్ణయింపనలవికాకయున్నది. గుణమేప్రధానమనినచో నేవిరోధములేదు కాని యాభిజాత్యముగలవారొప్పుకొనరు. ఇదియిట్లుండఁగా నహల్యా మందోదరీ తారా ద్రౌపదీ తారలనువారలయోనిజాతలైనను. అహల్య గౌతమునిఁబొంది బ్రాహ్మణియయ్యె, మందోదరి రావణపత్నియై రాక్షసస్త్రీయయ్యె, నొకతార బృహస్పతినిఁబొంది నిర్జరియయ్యె, నొకతార వాలినిఁబొంది వానరాంగనయయ్యె, ద్రౌపది క్షత్రియస్త్రీయయ్యెఁగనుక శరీరికి గుణమేప్రధానమన్నచోఁ గొంచెము వీలుగానున్నది. మన యాళ్వార్లలోఁ గొందఱు కులముచే గొప్పవారు కాకున్నను భగవద్భక్తిచే లోకపూజ్యులైయున్నారు. వెండియు జాతుల హెచ్చులొచ్చులు లోకవ్యవహారమున కుపయోగించునేగాని భగవద్విషయములోఁ బనిచేయవు దీనినిగుఱించి, 1539

శ్లో॥ నాహందేవో నమర్త్యోవా, నతిర్యక్స్థావరోఽపివా
జ్ఞానానందమ యస్త్వాత్మా, శేషోహి పరమాత్మనః

నేను దేవ మనుష్య తిర్యక్‌స్థావరములలో నొకండనుగాను.
జ్ఞానానందమయుండనై పరమాత్మకు శేషభూతుండనై యున్నానని
మహాయోగియగు జడభరతుండు చెప్పెను.
(విష్ణుపురాణము)

శ్లో॥ నాహంవిప్రోనచనరపతిర్నాపి వైశ్యోనశూద్రో
నోవావర్ణీనచ గృహపతిర్నో వనస్థోయతిర్వా
కిం తుశ్రీమద్భువన భవనస్థిత్యపాయైక హేతో
ర్లక్ష్మీభర్తుర్నరహరితనోర్దాసదాసస్య దాసః

నేను బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులలోను బ్రహ్మ
చారి గృహస్థ వానప్రస్థ సన్యాసులలో నొకండనుగాను లోక సృష్టి
స్థితిలయములకు హేతువై లక్ష్మీపతియైన నరసింహుని దాసదాసుండ 1570
నని ప్రహ్లాదుడు వచించెను.

శ్లో॥ ఏకాన్తీ వ్యపదేష్టవ్యో, నైవగ్రామ కులాదిభిః
విష్ణునావ్యపదేష్టవ్య, స్తస్యసర్వంసఏవహి

విష్ణువునందేకాంతభక్తిగలవాడు గ్రామ కులాములచేత నిర్దే
శింపబడడు. వానికి సర్వస్వము విష్ణువేగనుక వైష్ణవుడని నిర్దే 1571
శింపబడును.

శ్లో॥ నద్యాస్తస్యైవనామాని, ప్రవిష్టాయా యథార్ణవమ్
సర్వాత్మనా ప్రపన్నస్య, విష్ణుమేకాంతినస్తథా

సముద్రమునందు ప్రవేశించిన నదులనామములుపోయి సము
ద్రనామమే నిలుచునట్లు విష్ణువునందేకాంతభక్తిగలవారి గ్రామ
కులాదులుపోయి విష్ణుసంబంధమే నిలుచును. అనగా వైష్ణవులని 1572
చెప్పబడుదురనుట.

శ్లో॥ దేహాత్మ జ్ఞానకార్శ్యేన, వర్ణభేదేన కిం ఫలమ్
గతిస్సర్వాత్మనాం శ్రీమన్నారాయణ పదద్వయమ్

సర్వాత్మలకు నారాయణ పదద్వయము రక్షకమైయుండఁగా దేహమే జీవుండను విపరీత జ్ఞానకార్యమగు వర్ణభేదముచే ఫలమేమి 1573

శ్లో॥ విష్ణుదాసావయంయూయం, బ్రాహ్మణావర్ణధర్మిణః
అస్మాకందాసవృత్తీనాం, యుష్మాకంనాస్తిసంగతిః

మేము విష్ణుదాసులము మీరు బ్రాహ్మణధర్మముగలవారు భగవద్దాస్యవృత్తిగల మాకును దేహాత్మాభిమానముగల మీకును సాంగత్యముకుదరదు 1575

శ్లో॥ నాస్తిసంగతిరస్మాకం, యుష్మాకంచపరస్పరమ్
వయంతుకింకరావిష్ణోః, యూయమింద్రియకింకరాః

విష్ణుకింకరులమైన మాకు నింద్రియకింకరులైనమీకును బరస్పర సాంగత్యమెన్నటికినిఁగలుగదు 1576

శ్లో॥ అద్యప్రభృతిహేలోకాః, యూయంయూయంవయంవయం
అర్థకామపరాయూయం, నారాయణపరావయమ్

మీరర్థకామపరులరు మేమునారాయణపరులము యిదిమొదలు మీరు మీరే మేము మేమేయని యొక భాగవతుఁడుచెప్పెను 1578

శ్రీవిల్లిపుత్తూర్ గపర్

ఈశ్లోకములవల్లఁ దేలిన విషయమేమనఁగా గర్మానుసారముగా జీవులకు లభించిన కనచప్రాయ శరీరములు చూచుకొని యుప్పొంగిన మాత్రమునఁ బ్రయోజనములేదనియు సర్వజగత్కారణుఁడగు విష్ణునందు భక్తిగలవాఁడు శ్రేష్ఠుఁడనియుఁభక్తికిఁగుల గ్రామ ధన ధాన్యములచే నుపయోగము లేదనియు మోక్షప్రదాతయగు హరి నాశ్రయించనివాడు జీవుఁడు నిష్ప్రయోజకుఁడై బాధపడుననియు జీవులను సంబంధమునుబట్టియే నిర్ణయింప వలయుంగాని

వేఱొక సంబంధమునుబట్టి నిర్ణయింప నలవిగాదనియుఁ దోఁచు
చున్నది. 1579

సుశీలుఁడు

స్వామీ. భగవదారాధనపరులగు భాగవతులను బూజింప
వలయునేగాని గ్రామకులాదులఁబట్టి తిరస్కరింపరాదని సెలవిచ్చితిరి.
అట్టిభాగవతప్రభావము నింకను వక్కాణింపుడు. 1580

పరవరముని

భాగవత మహిమంబును దానివల్లఁగలుగులాభంబునుఁ దదీయ
తిరస్కారంబుచే వచ్చు నపాయంబును వక్కాణింతు వినుము. 1581

శ్లో॥ శ్వపచోఽపిమహీపాల, విష్ణుభక్తో ద్విజాధికః
విష్ణుభక్తి విహీనస్తు, యతిశ్చశ్వపచాధమః

అనఁగా కుక్కమాంసము దినువాఁడైనను విష్ణుభక్తుఁడు
బ్రాహ్మణునికంటె నధికుఁడగును. బ్రాహ్మణుఁడై యుత్తమాశ్రమ
స్వీకృతుండైన యతియైనను విష్ణుభక్తుఁడు కానిచో శ్వపచునికన్న
నధముఁడని యభిప్రాయము. 1582

శ్లో॥ న శూద్రా భగవద్భక్తా, విప్రా భాగవతాస్స్మృతాః
సర్వవర్ణేషు తేశూద్రా, యేహ్యభక్తా జనార్దనే

భగవద్భక్తులు శూద్రులుకారు విప్రులని భాగవతులు చెప్పఁ
బడుదురు. హరిభక్తిలేని సర్వజాతులవారు శూద్రులు. 1583

శ్లో॥ శూద్రంవా భగవద్భక్తం, నిషాదంశ్వపచంతథా
వీక్షతే జాతిసామాన్యా, త్సయాతి నరకం నరః

భగవద్భక్తుఁడగు శూద్రునిఁగాని కిరాతునిఁగాని శ్వపచునిఁ
గాని జాతిసామాన్యముచే నగౌరవించువాఁడు నరకమునఁబడును. 1584

(శ్రీరామాయణము)

శ్లో॥ విప్రా ద్ద్విషడ్గుణయుతాదరవిందనాభ
పాదారవింద విముఖా చ్ఛ్వపచం వరిష్ఠం
మన్యే తదర్పితమనోవచనేహితార్థ
ప్రాణంగి పునాతి సకలం నతుభూరిమానః

కులోచితమగు పండ్రెండు మంచిగుణములుగలిగి విష్ణుభక్తిలేని బ్రాహ్మణునికంటె హరిభక్తిగల శ్వపచుడు శ్రేష్ఠుఁడగును. మనస్సు వాక్కు పురుషార్థము ప్రాణము భగవదర్పణ మెవ్వఁడుచేయు నట్టి వాఁడు సకలమును బవిత్రము చేయుచున్నాఁడని ప్రహ్లాదుల వారు చెప్పిరి. 1585

శ్లో॥ యః పశ్యతి శుభాచారం, వైష్ణవం వీతకల్మషమ్
యస్మిన్ కస్మిన్ కులేజాతం, ప్రణమేద్దండవద్భువి

మంచియాచారముగలిగి కల్మషములు పోగొట్టుకొని సదా విష్ణుభక్తుండైనవానిం గాంచినంతట జాతివిమర్శనము చేయక భూమి యందుఁబడి నమస్కరింపవలెను. 1586

(లింగపురాణము)

మఱియు సర్వేశ్వరుఁడు దేవతిర్యగాది జాతులయం దవతరించి నట్లే తదీయులగు భాగవతులుకూడ సమస్తజాతులయం దవతరింతురని పురాణాంతరంబునందుఁగల దదియట్లుండఁగా శ్రీమన్నారాయణుండు స్వకీయ భక్తుల ప్రభావం బనేకపర్యాయములు ప్రకటించియున్నా డెట్లంటివేని. 1587

శ్లో॥ నాహంవసామి వైకుంఠే, నయోగిహృదయేరవౌ
మద్భక్తా యత్రగాయంతి, తత్రతిష్ఠామి నారద

ఓనారదా! వైకుంఠమునందుఁగాని యోగుల హృదయము నందుఁగాని సూర్యబింబమునందుఁగాని నేనులేను నాభక్తులు నన్నె చ్చటఁ కీర్తింతురో యచ్చటనున్నాను. 1588

శ్లో॥ మద్భక్తాన్ శూద్రసామాన్యా, దవమన్యంతియేనరాః
నరకేష్వవతిష్ఠంతి, వర్షకోటిర్నరాధమాః

ఎవ్వరు నాభక్తుని శూద్రసామాన్యునిఁగాఁనెంచి యవమానింతురో యానరాధములు కోటివత్సరంబులు నరకంబునఁబడియుందురు.

శ్లో॥ చండాలమపి మద్భక్తం, నావమన్యేత బుద్ధిమాన్
అవమానాత్పతత్యేవ, రౌరవే నరకేషుచ

నాభక్తుఁడు మాలవాఁడైనను బుద్ధిమంతుఁడు వాని నవమానింపరాదు. అట్లవమానించువాఁడు రౌరవనరకంబులఁబడును. 1590

శ్లో॥ మద్భక్తం శ్వపచం వాపి, నిందాంకుర్వంతియేనరాః
పద్మకోటి శతేనాపి, న క్షమామి వసుంధరే

ఓభూదేవీ! నాభక్తుఁడు శ్వపచుఁడైనను వానినేనరులు నిందింతురో వారినిఁ బద్మకోటిశతసంవత్సరములైనను క్షమింపను. 1591

(వరాహపురాణము)

శ్లో॥ మద్భక్తజనవాత్సల్యం, పూజాయాంచానుమోదనం
స్వయమభ్యర్చనంచైవ, మదర్థే దంభవర్జనమ్

నాభక్తులయందు వాత్సల్యము నావిషయమున నొకరుచేయు పూజ ననుమోదించుట స్వయముగా నన్నర్చించుట నావిషయమున దంభములేకుండుట. 1592

శ్లో॥ మత్కథాశ్రవణేభక్తిః, స్వరనేత్రాంగవిక్రియా
మమానుస్మరణంనిత్యం. యశ్చమానోపజీవతి

మదీయకథలు వినుటయందు రుచి, గద్గదస్వరము, నానందబాష్పములు మొదలగు నంగవికారములుగల్గుట. నిత్యము నన్ను స్మరించుట, నన్నువిడిచి బ్రతుకలేకపోవుట. 1593

శ్లో॥ భక్తిరష్టవిధా హ్యేషా, యస్మిన్ మ్లేచ్ఛేపివర్తతే
సవిప్రేంద్రో మునిశ్శ్రీమాన్, సయతిస్సచపండితః
తస్మైదేయం తతోగ్రాహ్యం, సచపూజ్యో యథాహ్యహమ్

ఈయెనిమిదివిధములైనభక్తి యేమ్లేచ్ఛునియందున్నను వాఁడు విప్రశ్రేష్ఠుఁడు వాఁడేముని, వాఁడే శ్రీమంతుఁడు, వాఁడే యతి, వాఁడే పండితుఁడు వానికీయవచ్చును వానివల్ల గ్రహింపవచ్చును. వాఁడు నావలెఁ బూజ్యుఁడని యిట్లు భాగవతమహిమను భగవంతుఁడు పెక్కుచోట్ల నొక్కినక్కాణించెను. 1594

(గరుడపురాణము)

మెండియు, 1595

శ్లో॥ యోమాంపశ్యతి సర్వత్ర, సర్వంచమయిపశ్యతి
తస్యాహం న ప్రణశ్యామి, సచమే నప్రణశ్యతి.

ఎవ్వఁడు సర్వప్రపంచంబునందు నన్నును నాయందు సర్వము నుండునట్లు చూచునో వానికి నేనునశింపను, నాకు వాఁడునశింపఁడు.

శ్లో॥ ప్రియోహి జ్ఞానినోత్యర్థమహం సచమమప్రియః
జ్ఞానికి నేను మిక్కిలి ప్రియుఁడను, వాఁడును నాకుఁబ్రియుఁడు.

శ్లో॥ జ్ఞానీత్వాత్మైవమేమతమ్
జ్ఞాని నేనేయని నాయభిప్రాయము. 1598

శ్లో॥ సంతుష్టస్సతతంయోగీ, యతాత్మాదృఢనిశ్చయః
మయ్యర్పిత మనోబుద్ధిర్యో మద్భక్తస్సమేప్రియః

సదా సంతోషియై యోగియై మనోనిగ్రహము దృఢనిశ్చయము గలిగి మనోబుద్ధులు నాకుసమర్పించిన భక్తుఁడు నాకు మిక్కిలి ప్రియుఁడు. 1599

శ్లో॥ యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చయః
హర్షామర్ష భయోద్వేగై ర్ముక్తో యస్సచ మే ప్రియః

ఎవనివలన లోకము భయపడదో, లోకమువలన నెవ్వడు భయపడడో హర్షామర్ష భయోద్వేగములు విడిచినవాడెవ్వడో వాడు నాకు మిక్కిలి ప్రియుడు. 1600

శ్లో॥ అనపేక్ష శ్శుచిర్దక్ష, ఉదాసీనో గతవ్యధః
సర్వారంభ పరిత్యాగీ, యో మద్భక్త స్సమే ప్రియః

అపేక్షలేనివాడై శుచియై నేర్పరియై ఉదాసీనుడై మనోవ్యధలేనివాడై సర్వారంభములు మానిన నాభక్తుడు నాకు ప్రియుడు 1601

శ్లో॥ కౌంతేయ ప్రతిజానీహి, న మే భక్తః ప్రణశ్యతి

ఓ యర్జునా! నాభక్తుడు చెడడని నీవు ప్రతిజ్ఞచేయుము అని భగవంతుడు చెప్పెను. 1602

(భగవద్గీత)

శ్లో॥ అర్చావతారోపాదానం, వైష్ణవోత్పత్తిచింతనం
మాతృయోని పరీక్షాయాం, తుల్యమాహుర్మనీషిణః

భగవద్విగ్రహముగాంచి యిది యేలోహమని విచారించుటయు భగవద్భక్తుల జాతిని విచారించుటయు మాతృయోని పరీక్షించుటయు నివి సమానపాపములని పండితులు చెప్పిరి. 1603

శ్లో॥ పశుర్మనుష్యః పక్షీవా, యేచ వైష్ణవ సంశ్రయాః
తేనైవతే ప్రయాస్యంతి, తద్విష్ణోః పరమంపదమ్

పశువులుగాని పక్షులుగాని మనుష్యులుగాని విష్ణుభక్తు నాశ్రయించినచో వారతనితోగూడి వైకుంఠమునుం బొందుదురు.

శ్లో॥ యంయం స్పృశతిపాణిభ్యాం, యంయం పశ్యతి చక్షుషా
స్థావరాణ్యపిముచ్యంతే, కిం పునర్బాంధవాజనాః

విష్ణుభక్తుఁడైనవాఁడు దేనినిఁ జేతులతోఁదాఁకునో దేనినిఁ గంటితో గటాక్షించునో యవి స్థావరములైనను ముక్తిఁజెందును. బాంధవులవిషయము సెప్పవలయునా! 1605

శ్లో॥ సంసారవిషవృక్షస్య, ద్వేఫలే హ్యమృతోపమే
కదాచిత్కేశవేభక్తిః, తద్భక్తైర్వాసమాగమం

సంసారమను విషవృక్షమునకు నమృతోపమగు రెండుఫలములు గలవు. అప్పుడప్పుడు కేశవునియందు భక్తిసేయు టొకఫలము. తదీయభక్తులతో సాంగత్యమొనర్చుట రెండవఫలము. ఈవిధంబున భాగవతప్రభావం బనేకప్రదేశంబులయందుఁ జెప్పఁబడియున్నది. 1606

సుశీలుఁడు

దేవా! సమస్తలోకైశ్వర్యములకు భూదేవి లక్ష్మీదేవి మూలమైయున్నారు. వారికి శ్రీహరి భర్తయై యున్నాడు. హరిభక్తులలోఁ గొందఱు ధనహీనులై కష్టపడుచున్నారెందువల్ల! 1607

వరవరముని

శ్లో॥ యాచితోఽపి సదాభక్తైర్నాహితంకారయేద్ధరిః
బాలమగ్నౌపతంతంతు, మాతాకింననివారయేత్

అగ్నిలోఁబడుచున్న బాలునిఁ దల్లి నివారించునట్లు సదా కోరుచున్నను భక్తులకు నైశ్వర్యము భగవంతుఁ డీయడన్నట్లు, రాజుగారు దాసదాసీజనములకు సమస్తపదార్థములిచ్చి లంకనములువడిన కుమారునకుఁ బథ్యవస్తువులుమాత్రమిచ్చు నవిధంబున సర్వేశ్వరుఁ భ్యాసయోగములోనుండు భక్తుల భోజన పానాదులకు సరిపోవు పదార్థము లిచ్చుచుండును. 1608

సుశీలుఁడు

భగవద్భక్తులకుఁ గష్టంబు లెక్కువగాఁ గలుగుచుండుటకు కారణంబేమి ? 1609

వరవరముని

శ్లో॥ హరిర్దుఃఖానిభక్తేభ్యో, హితబుద్ధ్యా కరోతివై
శస్త్రక్షారాగ్ని కర్మాణి, స్వపుత్రాయ యథాపితా

కుమారుని వ్రణబాధ నివర్తించుటకు శస్త్రక్షారాగ్నికర్మము లాచరించు తండ్రివలె భగవంతుఁడు సంసారవిరక్తి కలుగుటకు భక్తులకుఁ గష్టములు గలిగించును. 1610

సుశీలుఁడు

భగవంతునకు భక్తాభీష్టఫలప్రదాయకుఁడను ప్రతీతి కలదు దానికిఁదగినట్లు ధ్రువ ప్రహ్లాద బలి విభీషణాదులకు నపారైశ్వర్య మిచ్చియున్నాఁడే ! 1611

వరవరముని

ప్రభువైనవాఁడు విద్యార్థియై చిన్నతనములోనుండు కుమారునకు స్వల్పద్రవ్యమిచ్చి చెడుకార్యములకుఁ బోకుండ శిక్షించును. బుద్ధిమంతుఁడైనపిమ్మట రాజ్యమేయిచ్చు నదేవిధంబున

శ్లో॥ ఆయురారోగ్య మర్థాంశ్చ, భోగాంశ్చైవానుషంగికాన్
దదాతిధ్యాయతాం నిత్య, మపవర్గ ప్రదోహరిః

ఆను శాస్త్రవిధి ననుసరించి భగవంతుఁడు భక్తి స్థిరపడిన పిమ్మట దాసునకు నాయురారోగ్యైశ్వర్యములొసంగి తుదకు మోక్షమిచ్చును భాగవతునకుఁ బరభక్తి పరమభక్తి కలుగునటులు భగవత్సేవ పచ్చికాయ కొఱికినట్లుండును. పై రెండువిధములైన భక్తికుదిరినప్పుడమృతమువలెనుండును. 1612

సుశీలుఁడు

పరభక్తి పరమభక్తియనఁగా నర్థమేమో సెలవింతు! 1613

వరవరముని

ద్రవ్యము సంపాదింపఁగోరి వర్తకము చేయువానికి మొట్ట మొదటఁ గొంతద్రవ్యము కావలసియుండు నట్లే భగవద్భక్తి నార్జింపఁ గోరువానికి ముందుఁ గొంతభక్తి కావలయు నెట్లంటివేని శాస్త్రశ్రవణముచేసి సదాచార్యు నాశ్రయించి తదీయబోధచే సంసారమునందుఁ గల యనర్థకమును భగవంతునిచేఁ దనకుఁగలుగు మేలును గ్రహించి క్రమముగా సాంసరిక వ్యాపారంబులఁదగ్గించి భగవత్సేవ నెక్కువగా నొనర్చుట సాధనభక్తియనంబడును. పరభక్తియనఁగా మనుష్యునకాకలిగల్గినప్పు డన్నము నెట్లు ధ్యానించునో దాహము కలిగినప్పుడు మంచినీరము నెట్లుదలంచునో యవ్విధంబున భగవత్సేవ చేయునఱకు నిలుపోపలేకుండుట, భగవత్సేవాప్రాప్తి స్వర్గమువలెను అదిలేనప్పుడు నరకమువలెనుండుట పరమభక్తి యనఁబడు నిది సాధనభక్తిచేఁ బాపము నశింపఁగా మనోనైర్మల్యము గలిగినప్పుడు లభించును. గర్భిణీస్త్రీకిఁ బ్రసవించువఱకు బాధగానుండి సుఖప్రసూతియై బిడ్డను గనినప్పు డత్యంతానందము కలుగును. భగవద్దాసునకు, బరమభక్తి గలుగుపర్యంతము గండముగానుండు నటుపిమ్మట బ్రహ్మానందము కలుగును. 1614

సుశీలుఁడు

సర్వశక్తుండగు శ్రీహరి నాశ్రయించినవానికిఁగూడ గండము లుండునా? 1615

వరవరముని

ఆశ్రయించినవానికి గండములేదు. భక్తికిమాత్రము గండ
... భగవద్దాసునకు భక్తి ముందుగా నారంభించి చెట్టు
నుండు నట్టిసమయంబున గొఱ్ఱెలు మేకలు పశువులు మేసి

పోవకుండ యజమానుఁడు కాపాడునట్లు లేతభక్తిలోనుండు వానిని సదాచార్యుఁడును పరోపకార పరాయణులైన భాగవతులునుఁ గాపాడ వలె నటుపిమ్మట నభ్యాసకుని భక్తివృక్షమై ఫలించును దానికేపరమ భక్తియనిపేరు 1716

సుశీలుఁడు

భక్తుని దీర్ఘకాలము గురుండు రక్షింపవలెనని చెప్పుచుంటిరి గురువులేకుండ మోక్షముఁ జెందవచ్చునని కొందఱు వచింపు చున్నారే 1617

వరవరముని

అంతమూఢులెవ్వరును లేరనియెంచు మెందులకనఁగాఁ తండ్రి లేక కుమారుండు జనింపఁడు, వహ్నితప్తమైనను వెలిగారములేక బంగారు కరుగదు వైద్యుండులేక రోగి కౌషధంబులభింపదు, రాజులేక రాష్ట్రమర్యాదలు జరుగవు కాపరిలేక గోష్టాలు జీవింపవు గృహపతి లేక కుటుంబము జీవింపదు, ఉపాధ్యాయుఁడులేక విద్యార్థులకు విద్య ప్రాప్తింపదు సదాచార్యు నాశ్రయింపక ముముక్షువులకు ముక్తి దొరకదు 1618

సుశీలుఁడు

గజేంద్రుండు గురువు నాశ్రయింపకయే మోక్షముఁ జెందినాఁడుగదా 1619

వరవరముని

కరిరాజు పూర్వమొక మనుష్యరాజై గురువు నాశ్రయించి విష్ణుభక్తిచేసి యగస్త్యునిశాపముచే దంతావళమై జనించెను కాని యే తజ్జన్మంబున శాస్త్రాధికారములేదు దేశికు నాశ్రయించుటకును వీలు లేదు పూర్వజన్మంబునఁ జేసిన భక్తిప్రాబల్యముచేతనే మోక్షముఁ జెందినాఁడు నరుండొక్కసారి యుపాధ్యాయుని యొద్దచదివి మఱచి పోయినప్పుడు పుస్తకముచూచిన సరిపోవునుగదా యదియట్లుండఁ

బూర్వజ్ఞానులగు గురువు నాశ్రయింపని వారులేరు, జనక భూపతి
యాజ్ఞవల్క్యపంచశిఖులను బ్రహ్మ శ్రీమన్నారాయణుని బరశు
రాముఁడు పార్వతీపతిని గురువులుగా నెన్నుకొనిరి సాక్షాత్పరబ్రహ్మ
మగు విష్ణువు రామావతారంబున వసిష్ఠ విశ్వామిత్రులను కృష్ణావ
తారంబున సాందీపని దేశికులఁగా నంగీకరించెను భగవంతుఁడు
జగద్గురువైయుండి గురువుల నాశ్రయించుట లోక సంగ్రహార్థంబని
యెఱుంగుము 1320

సుశీలుఁడు

భగవద్భక్తుండుకూడఁ బూర్వకృత కర్మమును సాకల్యముగా
ననుభవింపవలసినదేనా 1321

వరవరముని

దీనికి నెంతయు మూఁడుదాహరణంబులు సూపించి వివరింతు నాల
కింపుము, తొల్లిమన గురుపరంపరా భూషణుండగు యామున ముని
ప్రముఁడు మన సిద్ధాంత రాజ్యమునుఁ జక్కఁగాఁ బాలించె, నట్టిపండితుఁ
డుగాని యోగిగాని భక్తుండుగాని మఱియొకఁడుండలేడు మఱియు
నమ్మహాత్మునకు నాళందారను శర్యాయనామంబుగలదు వేదాంతము
నందమ్మహాపురుషుఁడు హయగ్రీవావతారము వెండియు నాసూరి
వర్యుండు గీతార్థమును గొలది శ్లోకములతో వెల్లడించెను చరమ
శ్లోకార్థంబునుఁ దిరుక్కోట్టియూరినంబిగారికి, రామాయణ విశేషార్థం
బులు తిరుమలనంబిగారికిఁ దిరువాయిమొళి మొదలగు ద్రావిడ వేదం
బులు మాలాధరునకు దెలిపెను. పెరియనంబిగారికిఁ దిరుక్కచ్చినంబి
గారికిఁ గొన్నియర్థంబు లెఱింగించెను. స్తోత్రరత్నంబను గ్రంథంబునందు
నుపనిషదర్థంబులన్నియుఁ బ్రకటించెను ఇక్కోవిదుండు పంద్రెం
డేండ్లవయస్సులో సర్వవిద్వజ్జన కోలాహలునోడించి పండితులబాధలు
దొలఁగించెను. కుదృష్టిసిద్ధాంతంబులను రూపుమాపి వైదిక సిద్ధాంతం
బును వృద్ధిఁజెందించెను పరవాదుల నోడించుటచే వాదిమత్తేభసిం
హుండని ప్రఖ్యాతిఁగాంచెను ఆళ్వారాచార్యులకీర్తులు భూమిపైఁ

ప్రసరింపఁజేసె నారా! యిమ్మహాత్మ్యుని దలంచునప్పుడెల్ల వైష్ణవుఁడైన వానికిఁ గన్నులవెంట నానందబాష్పంబులు గారుచుండు రామానుజయోగీంద్రున కీసూరివర్యుఁడు మార్గదర్శకుఁడు, యామున రామానుజుల నిద్దఱిని భగవంతుఁడే కీభవింప నిచ్చినచో మనకుఁ బరమపదము కరతలామలకమైయుండును. యామునమునీంద్రుల కొక్కసారి మేనరాచ వ్రణంబుపుట్టె నమ్మహాత్ముఁ డనుష్ఠానకాలంబున నా వ్రణంబును ద్రిదండమునకుఁ దగిలించి తరువాత శరీరంబున నుంచి యనుభవింపుచుండఁగా శిష్యులుసూచి సహింపలేక దాని నుపశమింపఁజేయుమని భగవంతునకుఁ బ్రపత్తిచేసి రది యెఱింగి యామున మునీంద్రుఁడు శిష్యులఁగాంచి పుత్రులారా ప్రారబ్ధంబుచే నీవ్రణం బనుభవనీయమై నాకుం బ్రాప్తించె భగవత్ప్రార్థనచే నిది నశించునుఁగాని పునర్జన్మమునకు హేతువై యుండును కావున నట్లు చేయకుఁడని మానిపించి దేహావసానమునఁ దా ననుభవించి మారనేరినంబికిచ్చి తాను వైకుంఠంబున కేగెను రామానుజ మునీంద్రుఁ డయ్యార్యసంబును రూపుమాపి మారనేరికి మోక్షంబ నంగెను 1622

సూక్తము

వ్రణమునుఁదీసి వేఱొక చోటునుంచు నట్టి సామర్థ్యముగల యామున మునివరల దానింబరిగ్రహింపనేల . 1623

వరవరముని

భక్తులందఱు యామునాచార్యుల నంటి వారేయుండరు కాన నప్పుండ్మను వారు పరిగ్రహింపనిచో, దరువాత నచ్చుభాగవతులు ప్రారబ్ధము మేమేల యనుభవింపవలెను దీనినను భవింపవలసియుండు నప్పుడు భగవంతుని నమ్మి ప్రయోజనమేమని భక్తిమానుకొందురు యామునాచార్య లట్లనుభవించినందున, నట్టి మహాత్మునకే ప్రారబ్ధమనుభవ నీయమైయుండఁగా వారిపాద ధూళినైనంబోలని మనకెట్లు దప్పునని మనస్సమాధానము చేసికొందురు కావున నమ్మహాత్ముఁడ

ట్లునటించెను. ఇది యిట్లుండఁగా మనయాళ్వారులప్రియశిష్యుండగు తిరుక్కచ్చినంబినిఁగని యొక్కదినంబున వరదరాజిట్లనియె. వత్సా! నీవికాంచీపుర దేవాలయంబున నన్నుఁజిరకాలమునుండి సేవింపుచుంటివి. నేనును నిన్నుఁగాపాడుచుంటిని. కాని రేపటిదినము మొదలు నిన్నుఁ బ్రారబ్ధానుసారముగా శనిగ్రహ మాక్రమించి యేడువత్సరములపై నాలుమాసములు ద్రవ్యనష్టము చేయుననినఁ దిరుక్కచ్చినంబి స్వామింగాంచి దేవా! యది ధనాఢ్యులకు భయంబుగాని నిర్ధనుండనై నీపాదారవిందసేవకుండనగు నాకేమి భయంబనియె నమ్మాటవిని తేవప్పెరుమాళ్ళు నవ్వి పుత్రా! యెన్ననికేది ధనమో దానినే శని నిర్మూలించుననియె నప్పలుకులకులికి నంబిగారు గడగడవడంకి హరి పాదంబులఁబడి దేవా! నీచరణసరసిజములకు దూరుండనై బహువర్షంబు లెట్లుజీవింతును. పోయినభక్తి మరలఁ బ్రాప్తించునా దీనినెట్లునఁ దొలఁగింపుమని ప్రార్థింపఁగా జనార్దనుండు ప్రసన్నుండై భాగవతాగ్రణీ! యేడుమాసంబు లనుభవింతువా యని ప్రశ్నించె. నంబిగారు దానికి సమ్మతింపక యోసర్వేశ్వరా! యేడు మాసంబులుగాని యేడు దినంబులుగాని సైరింపఁజాలననియె నప్పుడు సరోజాక్షుండనుగ్రహించి యేడుగడియలు తప్పదుపొమ్మనియె నటుపిమ్మట నంబిగారుతనమనంబుననారాయణుండుండమనకేమిభయంబని ధైర్యముతో నింటికేగినిద్రించెను. తెల్లవారినపిమ్మట దేవాలయపు తలుపులుదీసిచూడఁగా నర్చకులకు వరదరాజస్వామిసన్నిధిలో స్వామివారు పాలారగించు బంగారుగిన్నె కానిపింపదయ్యె నంతట నర్చకులు భయంబుఁజెంది ప్రభునిచెంతకేగి సమాచారంబుదెలిపి యీపాత్ర యర్థరాత్రంబున నిరాఘాటంబుగాఁ బెరుమాళ్ళసన్నిధికేగుచున్న తిరుక్కచ్చినంబిగారి వల్ల జరిగెనని చెప్పిరి. యుక్తాయుక్త పరిజ్ఞానములేని యబ్భూపతి వెంటనే నంబిగారినిఁ బిలిపించి దండనాయకులచేఁ గొట్టింపుచుండఁగా నేడున్నరగడియకాలంబు కడచె నయ్యవసరంబున

భక్తవత్సలుండగు వరదరాజొక వైష్ణవబాలుండై యచ్చోటికివచ్చి యప్పని. నాపించి రాజప్రభృతిజనంబులనుఁ గోవెలకుఁగొనిపోయి పెరుమాళ్ల వస్త్రపుఁ గుచ్చిళ్ళక్రిందనుండు బంగరుగిన్నెను జూపించి యదృశ్యుఁడయ్యె నటుపిమ్మట రాజుగారునుఁ దక్కిన జనంబులును నంబిగారి పదంబులకు మ్రొక్కి యపరాధ క్షమాపణంబు చేసికొని పోయిరి నంబిగారును హరి చరణ సరోజ ధ్యానపరుఁడై యుండెను.

సుశీలుఁడు

శ్రీవైష్ణవాగ్రేసరా! నొక్కసంగతి నడిగెద క్షమింపుడు. కర్మ జ్ఞాన భక్తియోగంబులు నవతార రహస్యజ్ఞానము పురుషోత్తమ విద్య, భగవన్నామసంకీర్తనము దివ్యక్షేత్రవాసము, దేవారాధనము, పుష్పమాలాకైంకర్యము నివి ప్రపన్నున కవసరంబులేదనియుఁ జక్రాంకితుఁడై మంత్రోపదేశమునుఁబొంది బుద్ధిపుట్టినప్పుడు "శ్రీమతే నారాయణాయనమః" అని స్మరించి నేను ప్రపన్నుఁడ ననుకొన్న మాత్రమున మోక్షముఁ జెందవచ్చుననియుఁ జరమ శ్లోకార్థంబునఁ బిళ్ళలోకాచార్యులవారు వివరించిరని చెప్పుచు వైష్ణవము పుచ్చుకొన్నవారనేకులు భగవద్విషయమున శ్రమపడుటమాని యేనుంగుల వలెఁదిని పీనుంగులమాదిరి పండుకొనుచున్నారిది ధర్మమేనా? 1625

వరవరముని

పిళ్ళలోకాచార్యులవారు భగవదవతారపురుషులు, వారెన్నటికి నసత్యముచెప్పరు కాని,

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య, మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో, మోక్షయిష్యామి మాశుచః

సమస్తధర్మములువిడిచి నన్నొక్కనినే శరణుఁజెందుము. నేను నిన్ను సర్వపాపములనుండి విడిపింతును సుఖింపుమని పెరుమాళ్ళు ఫల్గునునకు వచించిరి. పదునెనిమిది యధ్యాయంబులుగల భగవద్గీతా

శాస్త్రంబు విని పూర్వోత్తరసందర్భము నెఱుంగలేక దుఃఖింపుచున్న పార్థునూఱడించు సందర్భములో నీశ్లోకమును భగవానుపదేశించెను, దీని యర్థమును జ్ఞాననిధులగు పిళ్ళలోకాచార్యులవారు వ్రాయుచుఁ గర్మజ్ఞానభక్త్యాదు లచేతనంబులుగాన వానికి స్వయముగా ముక్తినిచ్చునట్టి శక్తిలేదు. భగవదర్పణములైనప్పుడే సార్థకతఁ జెందును కావున సర్వేశ్వరుఁడు సిద్ధోపాయము త్రికరణంబు లన్యవిషయంబునఁ బోనీకుండ భగవంతునియందుసమర్పించి దేహపతనము వఱకు నమ్మాళ్వారివలెఁ బరబ్రహ్మానుభవనిష్ఠులై యుండవలయు నట్టి వారికిఁ బైనఁజెప్పిన విషయంబు లవసరంబులేదని పిళ్ళలోకాచార్యుల వారు తీర్మానించినారుకాని రాగద్వేషాదులలోఁబడి క్షణకాలమైనఁ బెండ్లామును వదలలేని యింద్రియకింకరులఁగూర్చి చెప్పలేదు. అట్లు చెప్పినచో నది నాస్తిక్యమేయగును. బుద్ధి పక్వదశకు రాని వారికిఁ జరమార్థ ముపదేశింపరాదనిగదా తిరుక్కోట్టియూరి నంబిగారు రామానుజులంతవారినిఁ బదునెనిమిదిపర్యాయములు త్రిప్పి యెన్నియో కట్టుదిట్టములుచేసి యుపదేశించిరి. రామానుజులవారును గూరత్తాళ్వారికి మాసోపవాస ముంచియు దాశరథిని గుల విద్యా మదరహితునిఁ జేసియు నుపదేశించిరి, చరమశ్లోక ప్రదాతయగు పెరుమాళ్లుసహా తరువాతిశ్లోకములో,

శ్లో॥ ఇదంతేనాతపస్కాయ, నాభక్తాయకదాచన
న చాశుశ్రూషవేవాచ్యం, న చమాంయోఽభ్యసూయతి

ఈరహస్యమునుఁ దపస్సుచేయనివానికి, భక్తిలేనివానికి, గురుశుశ్రూష చేయనివానికి నాకల్యాణగుణములయందు దోషారోపణము చేయువానికి నెప్పుడును చెప్పఁగూడదని పెరుమాళ్లు క్రిడికుపదేశించిరి

సుశీలుఁడు

గురుకులసార్వభౌమా! ముముక్షువైనవాఁడు సదా కాలయాపన మెట్లుచేయవలయునో చెప్పుడు! 1627

వ ర వ ర ము ని

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి, యజ్జుహోషి దదాసి యత్
యత్తపస్యసి కౌంతేయ, తత్కురుష్వ మదర్పణమ్

ఓ యర్జునా ! నీ వేమి చేయుచున్నావో దేనినిఁ దినుచున్నావో దేనిని హోమము చేయుచున్నావో దేనిని దానము చేయుచున్నావో దేనినిఁ దపస్సు చేయుచున్నావో దాని నాకు సమర్పింపుము 1628

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో. మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి యుక్త్వైవ, మాత్మానం మత్పరాయణః

నాయందు మనస్సుగలవాఁడవగుము, నాయందు భక్తి చేయుము, నన్నుఁబూజింపుము, నన్నుఁ గూర్చి నమస్కరింపుము, నాయందుఁ బ్రీతిఁగలవాఁడవగుము, నాయందు మనస్సునుంచితివేని నన్నే పొందగలవు. 1629

శ్లో॥ సతతం కీర్తయంతో మాం, యతంతశ్చ దృఢవ్రతాః
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే

దృఢవ్రతులైనవారు సదా నన్నుఁ గీర్తింపుచు నాపనులకై యత్నము చేయుచు నన్నుఁ గూర్చి నమస్కరింపుచు నాతో నిత్యసంబంధముగలవారై యుపాసింపుచున్నారు. 1630

శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణా, బోధయంతః పరస్పరమ్
కథయంతశ్చ మాం నిత్యం, తుష్యంతి చ రమంతి చ

నాభక్తులు నాయందు మనస్సునుఁ బ్రాణములను సమర్పించి నామహిమ నొకరికొకరు చెప్పుకొనుచు నన్నువిడనాడి బ్రతుకలేని వారై యున్నారు. 1631

శ్లో॥ తేషాం సతతయుక్తానాం, భజతాం ప్రీతిపూర్వకమ్
దదామి బుద్ధియోగం తం, యేన మా ముపయాంతి తే

నాతో నిత్యసంబంధముకలిగి నన్నే భజించునట్టివారికి నన్నుఁ బొందునట్టి జ్ఞానయోగమును నేనేయిచ్చుచున్నాను. 1632

శ్లో॥ చేతసా సర్వకర్మాణి, మయి సన్యస్య మత్పరః
బుద్ధియోగ ముపాశ్రిత్య, మచ్చిత్తస్సతతంభవ

సమస్తకర్మములను మనస్సుచే నాయందర్పించి జ్ఞానయోగము నాశ్రయించి సదా నాయందు మనస్సుగలవాఁడవగుము. 1633

శ్లో॥ మచ్చిత్త స్సర్వదుర్గాణి, మత్ప్రసాదా త్తరిష్యసి
అథచేత్త్వమహంకారా, న్నశ్రోష్యసి వినంక్ష్యసి

నాయందు సదా మనస్సుగలిగి యుంటివేని నాయనుగ్రహముచే దుస్తరములగు దుఃఖములనుదాఁటి ముక్తిఁగాంతువు నామాట వినక యహంకారముచే నీయిష్టప్రకారము నడచితివేని నశింతువని భగవానులు చెప్పిరి. 1634

(భగవద్గీత)

సదా నన్నుభజించుచుండెనేని ముముక్షునగువాఁడు ముక్తిఁ గాంచుననియు నట్లుగానిచో నశించుననియు మోక్షప్రదాతయగు సర్వేశ్వరుఁడే సాయించెనుగాని చక్రాంకితుఁడై మంత్రోపదేశమునుఁ బొంది తరువాత స్వేచ్ఛతోఁ బ్రవర్తించువానికి ముక్తికలుగునని గీతాశాస్త్రమునం దెచ్చటను వచింపలేదు. వెండియు రామానుజయోగీంద్రులు నిరంతరము భగవదారాధనపరుండు కావలెనని శ్రీభాష్యాదులయందు వచించినదిగాక భగవత్కల్యాణగుణము విడతెగక బోధింపుచుఁ దాము భగవదనుభవపరులైయుండిరి. కూరత్తాళ్వారు నిమిషకాలంబైన ధ్యానానుసంధానం విడతెగక చేసిరని పెద్దలుచెప్పుచుందురు. అప్రాకృతులైన నమ్మాళ్వారు తింత్రిణీకోటరంబున నున్నంతకాలము భగవదనుభవపరులై సమాధినిష్ఠతోనుండిరని వినుచున్నాము

శ్రీహా! నీభక్తికి వ్యతిరిక్తమైనచో, నాదేహమునుఁ బ్రాణములను సర్వజను లభిలషించు సుఖమును నాత్మను పుత్ర మిత్ర కళత్రాదులలో దేనిని సహింపనని యామునాచార్యులవారు ప్రతిజ్ఞచేసిరి. ఆలస్యములేని భక్తిచే నారాయణునారాధింపుమని కులశేఖరాళ్వారు వచించిరి. ఈవాక్యములవల్లఁ దెలిసవిషయమేమనఁగా ముముక్షువగు వాఁడు భగవంతునాశ్రయించి జనకునివలెఁ గర్మయోగమో ప్రహ్లాదునిభంగి భక్తియోగమో భరతయోగిరీతి జ్ఞానయోగమో భరతలక్ష్మణాంజనేయులపోల్కిఁ గైంకర్యమో నారదునిమాడ్కి భగవత్ప్రభావోపదేశమో శత్రుఘ్నునిమాడిరి భాగవతకైంకర్యమో తిరుమంగయాళ్వారివగ భగవద్భాగవత కైంకర్యమో పెరియాళ్వారు తొండరడిప్పొడియాళ్వారులక్రియఁ బుష్పకైంకర్యమో తిరుప్పాణియాళ్వారిభాతి తిరునామసంకీర్తనమో కైనవారియాండాళాదులచెన్నునాచార్యకైంకర్యమో లస్సగా నాచరించువాఁడే మోక్షాధికారి యగును కాని ప్రపన్నుండనియు వైష్ణవుండనియు నామమాత్రముఁ దాల్చి యేనుంగువలెఁదినుచు సారమేయమువలె నఱచుచుఁ గోఁతివలెఁదిరుగుచుఁ దేనెటీగలగతి సొమ్ము సంపాదించువానికి భగవదనుగ్రహ మెప్పటికినిఁగలుగదు యిందుకు సందేహములేదు. 1635

సుశీలుఁడు

తృణీకృత భగవదితరపదార్థసంచయా! కరుణింపుము మఱియొక విషయంబడిగెద నెట్లంటిరేనిఁ గొందఱు "ఖేచరి, భూచరి, షణ్ముఖి, శాంభవి" యను ముద్రలు సాధించినచో ముక్తి గలుగుననియు, (యాలపాట) "పుట్టమీఁదఁ జెట్టుపుట్టెభూమినెల్లఁ దీగపాఱెఁ గాశిలోనఁ గాయగాచెరా, ఓయాగంటిలింగా పర్వతానఁ బండుపండెరా" యని యిట్టిపాటలు పాడుచు, వెండియుఁ దిక్కుముక్కు లేని పక్షి రేయిపగలు తపసునట్టి యొక్కచెఱువు నీరన్ని యొకటె త్రాగెరా, కాళ్ళుచేతులు లేనివాఁడు కడవముంతఁ జేతఁబట్టి యొక్కబావినీళ్లన్ని

రొకఁడు చేవెరా" యని చెప్పుచుఁ గొంద ఱానందింపుచుండఁగాఁ జూచితిని యిది మోక్షమార్గమేనా ? 1636

వరవరముని

నీచేఁ జెప్పఁబడినవార లివి తత్త్వములని వాడుచుందురు. ఇంతేకాక వేద శాస్త్ర పురాణగాథలు వెఱ్ఱిమాటలని నక్షేపింపు దురు. వారికిఁ బాండిత్య మేమాత్రములేదు. వారికి వేమనగారి పద్యములు, బ్రహ్మంగారి కాలజ్ఞానసూక్తులు, శుద్ధ నిర్గుణ తత్త్వ కందార్థములు ప్రమాణశాస్త్రంబులు. మఱియు వారు తత్త్వములని చెప్పుదురుగాని తత్త్వశబ్దమున కర్థమెఱుంగరు సంస్కృతభాష యందుఁ దత్త్వమనఁగాఁ బరమాత్మకును భావమునకునుఁ బంచవింశతి తత్త్వములకును యాథార్థ్యమునకునునర్థము. వేదాంతమనఁగా "వేదానామంతః వేదాంతః" వేదముల చివరభాగమని యర్థము. వేదము నందు బూర్వమీమాంస, ఉత్తరమీమాంసయని రెండుభాగములు గలవు. వానిలోఁ బూర్వమీమాంస యాగాది కర్మకాండము ఉత్తర మీమాంస భగవద్విషయము. నీవడిగిన వేదాంతము శ్రుతి స్మృతీతిహాస పురాణములయం దెచ్చటనుఁ గానరాదు. మహామునులకాలంబున నిట్టి కుదృష్టి సిద్ధాంతము నెవ్వరు స్మరించియుండలేదు. విద్యావిహీనులై యింద్రియకింకరులై తిండిపోతులై పొట్టపోసుకొను పండితమ్మన్యులు గురుపదవి నధిష్ఠించి చేయు మిథ్యావాదంబని యెఱుంగుము. సుక్షేత్ర సంస్థితంబగు పైరులోఁ గలుపెట్టిరో వీరలట్టివారని తలంపుము. 1637

సుశీలుఁడు

ఈసిద్ధాంతంబున మనుజులు వేనవేలుగాఁ బ్రవేశింపుచున్నారే

వరవరముని

అట్లుప్రవేశించుటకుఁ గారణంబేమనఁగా దానియందుఁ బుణ్య కర్మములు చేయవలసిన పనిలేదు, తైలధారవలె నవిచ్ఛిన్నమైన భక్తి

చేయవలసిన నిర్బంధములేదు, ఇంద్రియంబుల జయించి ధ్యానయోగ
మవలంబింపవలసిన బాధలేదు, ప్రపన్నుఁడై దేహాత్మభారములు భగవం
తునియందుంచవలసిన చిక్కులేదు, సదాచారము, తీర్థగమనము దుష్టా
హారనిషేధము దుష్కార్యవిసర్జనము మొదలైనవి యవసరంబులేదు
యేదియైనఁదినవచ్చు నేమియైనఁద్రావవచ్చు నేపనియైనం జేయవచ్చుఁ
గల్లుదుకాణమునకు నాగవాసమునకు ద్యూతనిలయమునకుఁ బోవు
నంతజనము దేవాలయాదులకుఁ బురాణగోష్ఠికిరాదుగదా 1639

సుశీలుఁడు

వారికి ఫలమేమైనంగలదా 1640

వరవరముని

ఫలములేనికార్యము లోకమునందెద్దియులేదు. ఈరిక్తవేదాం
తులు వేదవిరుద్ధాచారముచే లోకులఁజెఱచి తామునుఁజెడుచున్నారు
కాన వారు చిరకాలనరకవాసమో నికృష్టజన్మపరంపరాప్రాప్తియో
తప్పకపొందుదురు. ఆనాస్తికాధముల సంగతి నట్లుండనిచ్చి భగవత్సం
బంధులనాకర్ణింపుము 1641

సుశీలుఁడు

చిత్తము సెలవిండు జన్మసాఫల్యంబగు భాగవతకథకంటె వేఱు
విషయంబులతోఁ బనియేమి 1642

వరవరముని

జనకభూపతి విషయము—:

శ్లో॥ కర్మణైవ హి సంసిద్ధి, మాస్థితాజనకాదయః

అని భగవంతుఁడు గీతాశాస్త్రమునందుఁ బ్రశంసించుటచేతనే
జనకమహారాజు మాహాత్మ్యము తెలియుచున్నది కాని యింకను
జెప్పెద నాకర్ణింపుము. విదేహంభూవిభుండష్టైశ్వర్యములు గలిగి ప్రభు
త్వము చేయుచుండియు మహాజ్ఞానము సంపాదించె నప్పుణ్యఫలంబు

వల్లనే సాక్షాల్లక్ష్మీస్వరూపిణియగు సీతామహాదేవి కూతురై శ్రీరామ
చంద్రుండల్లుఁడయ్యెను ఇంతే కాక వేదాంతికానివాఁడు తనపురం
బుననుండఁ గూడదని యాజ్ఞాపించి పాలింపుచుండె నిట్లుండఁగొంత
కాలమునకు వేదవ్యాసుండు తీక్ష్ణవిరాగియగు శుకయోగింగాంచి
జ్ఞానసందేహానివృత్తికై జనకుని కడ కేగుమని పంచెను అంతటశుక
యోగీంద్రుఁడు మిథిలాపుర బహిఃప్రదేశంబున కరిగి యొకబావి
యొద్ద యిసుక తలద్రిండుగాఁ జేసికొని యొమ్ము మొగము భూమిపై
నానించి దిగంబరుఁడై పరుండియుండెనింతలో నప్పురనివాసినులగుఁతోడి
కోడంద్రు ముప్వురచ్చటికివచ్చి శుకునిని రీక్షించి సంతోషించి వారిలో
నొక్కతె తక్కినవారలతో నిట్లనియె నమ్మలారా! యితండుమహా
యోగియేకాని బోరగిల్లిపండుకొనుటఁ జేసి సిగ్గును, సైకతము దిండుగా
జేసినందువల్ల సుఖమును వదలలేదని చెప్పి నీళ్ళుంగైకొని పోయి మరలి
వచ్చువఱకు వాలుకోపధానము తీసివేసి యూర్ధ్వముఖముగా శయ
నించియుండె మరల వారిలో నొక్కకోమలాంగి శుకునింగాంచితక్కిన
చెలువలతో నక్కలారా! యిందాక మానము నిందించితిమని యుప
ధానము విసర్జించి యూర్ధ్వముఖముగా శయనించినాడు, అహంకా
రమునహా వదలలేదనె. శుకుండంతట లజ్జించితిరిగిపోయి కొంతకాలము
తపస్సుచేసి మరల బయలుదేఱి హుటాహుటిజనకుని సమీపించె
నప్పుడా రాజేంద్రుఁడు శుకునకు సాష్టాంగ నమస్కృతులాచరించి
యర్ఘ్యాసనంబునఁగూర్చుండఁబెట్టి పసిండిహారివాణంబునఁ బాదప్రక్షాళ
నంబొనర్చి యప్పారికాంక్షి మనస్సందేహంబులు వేదాంతవాక్యంబుల
చేఁదీర్చె నంతట నక్కర్మందియిట్లని వితర్కించె నక్కటా యిబ్భూపతి
నేనడిగిన వాక్యంబులకెల్ల నెన్నగాఁ బ్రత్యుత్తరంబులిచ్చినాఁడు కాని
రాజ్యాంగ తంత్రంబులందు మునింగి భోగియైయున్నాఁడు ఇతనిమాట
లెట్లంగీకరింపవచ్చునని నీరసభావంబుతోనుండె, నింతలో నొక్కకాపు
వాఁడు తనచేనిలో జొన్నకంకులు దొంగిలించిన విప్రునొక్కనిఁగొని

వచ్చి రాజునకప్పగించె జనకుండును శుకాభిప్రాయంబుఁ దెలిసికొని యుండెంగావున నతనిసందియంబుఁ బాపనెంచి పచ్చికుండలోనీరు పోయించి దొంగవిప్రునిశిరంబునఁ బెట్టించి నీరుపోయినచో దండింతు ననిచెప్పి యితనినూరేగించి తెండనిభటులకాజ్ఞాపించె నబ్భటులుమేళ తాళములతోనట్లుగావించి మరల రాజసన్నిధియందునిలిపిరి జనకుండు భూసురుంగాంచి నీవూరేఁగునప్పుడు నీతోనేమైనవచ్చెనని ప్రశ్నింపనా వెంటనెవ్వరురాలేదు నేనేవెళ్ళివచ్చితిని కుండలోనీళ్లుమాత్రముతొనక లేదనె నంతట రాజేంద్రుఁడు నీభావమెక్కడనుండెననియడుగగా నవ్వి ప్రుండయ్యా కుండపగిలినచో నీవు నన్నుదండింతువను భయంబున నామనంబు దానియందేనిలిచియుండెనని వక్కాణించి సెలవుగొని భూసురుండరిగె నప్పుడు శుకుండంతరంగంబున నాహా! జనకుండు నాసందేహంబెఱింగి యిప్పనిఁగావించె నెట్లనినగుండమీఁదఁగలభయంబుచే నూరిలోజరిగిన సమాచారంబులు బ్రాహ్మణునకెట్లు దెలియవో యట్లే జనకుండు రాజ్యాంగతంత్రము నందున్నను నతనిమనంబు విషయంబుల నంటక భగవంతునియందు నిలిచియున్నదని నాకుబోధించెనని మనస్సమాధానముచేసుకొని శుకుండరిగె 1643

ఇదియిట్లుండగాఁ వైదేహుండొక్కతటి నరకలోకంబున కేఁగగా నతనిమేనిగాలిసోఁకుచే బాధలు వీడిపోవగా నరకస్థులువచ్చి జనకుని ముట్టడించి వెళ్ళవలదని స్తుతింపుచులడిరి యింతలో సమవర్తి వచ్చి రాజేంద్రా నీవంటిపుణ్యాత్ములిచ్చోటికి రాగూడదు నీరాకచే నాకెంతయో నష్టంబు సంభవించెఁ బొమ్ము పొమ్మని మందలించె నారకులు గోలపెట్టుచునుండుమని ప్రార్థించిరి. తదుపరి జనకుండు యముని యిష్టానుసారంబుగాఁ గొంతపుణ్యంబుధారవోసి పదివేలమందినారకుల విడిపించి యథేచ్ఛంజనియె. వేదాంతకాలక్షేపసమయంబున యాజ్ఞవల్క్యుఁ డెల్లప్పుడు జనకుని మొగంబుచూచి చెప్పుచుండె నందులకుఁ గొందఱుశ్రోత లసూయఁజెంది జనకుఁడు రాజనుమాటయేగాని

జ్ఞానమునందు మాయందఱికంటె గొప్పవాఁడాయని తలంపుచుండిరి. ఏతద్వృత్తాంతము జనక యాజ్ఞవల్క్యుల కిద్దఱికిఁ దెలిసిన నూరకుండిరి. ఇట్లుండఁగా గొంతకాలంబునకు మిథిల కాలిపోవుచున్నది మనకోటమీఁదికి వచ్చుచున్నదని భటులు విజ్ఞాపించిరి. బ్రహ్మవేత్తలందఱు తమతమగీములు కాపాడుకొనవలయునని పరుగెత్తిరి. జనకుండు మాత్రము లేవక యాజ్ఞవల్క్యునితో మునీంద్రా! నశ్వరంబగు పాంచభౌతికపదార్థంబులు కాలిపోవుచున్నవి వానింగూర్చి మనము శోకింపవలసినదిలేదు మదీయజ్ఞానము చెడినప్పుడుగదా నేను దుఃఖింపవలయు నది చెడ లేదుగనుక భగవద్విషయము ప్రసంగింపుమనుచుండె నింతలో నగ్నిహోత్ర ముపశమిల్లె జనకుని కోటయు గృహంబులును సురక్షితమ్ముగానుండె వేదాంతులందఱు లజ్జించి జనకునిఁ గొనియాడిరి. 1644

మఱియొకసారి సులభయను బ్రాహ్మణాంగన ముప్పదేండ్లవయస్సులో యోగసిద్ధినిఁ బొంది జనకునిఁ బరీక్షింపనెంచి తదీయసదనంబుఁ బ్రవేశించి జనకునిచేఁ బూజింపఁబడి యుచితాసనంబునఁ గూర్చుండి యోగబలముచే జనకుని మనంబునఁ బ్రవేశించి కామంబు గలిగించెను జనకుం డదియెఱింగి సులభతోఁ జిన్నదానా! నీవు బ్రాహ్మణివి నేను క్షత్రియుండను మనమిద్దఱము గలియుట లోకనిందకుఁ గారణము. నీకిది ధర్మముగా దూరుకొమ్మనియె నంత నాసులభ సభవారింగాంచి సభ్యులారా! చూచితిరా జనకుని యాగడము. నాకాలుగాని చేయిగాని యేయంగముగాని యితనిందాఁక లేదు నిష్కారణముగా వదరుచున్నాడు చూడుఁడని పైపైమాటలు సెప్పుచు మఱింత కామము గలిగించె నటుపిమ్మట జనకుం డోచిన్నదానా నేను పంచశిఖుండను ముని శిష్యుఁడనై కత్తితో నఱకువానియందు గందముపూయువానియందు సమానభావముతో నున్నాను నన్ను నీవు చలింపఁజేయలేవని చెప్పె నింతలో సూర్యాస్తమయమగుటచే నాసభ యెల్లట్లో

ముగిసెఁ దెల్లవారినపిమ్మట సులభ మరల సభకువచ్చి జనకుని చేయి పట్టుకొని సభవారు వినుచుండ నతనితో నిట్లనియె జనకా నిన్నుఁ దీక్ష్ణముగాఁ బరీక్షించితిఁ బరుషవాక్యము లాడితి నైనను నీమనస్సు చలింపలేదు. నీకు రాజ్యమునందుంచు నైనను సంగములేదు దేవతల యందును మునులయందును వివిధ భోగములయందును భవాదృశుండు లేడు. మదపరాధంబులు క్షమింపుమని ప్రశంసించి చనియెఁ. తెలిసి కొంటిరా జనకుని జ్ఞానాధ్యవసాయము. 1345

భరతయోగివిషయము:

జడభరతుండను భగవద్ధ్యానం బారంభించిన మూఁడవజన్మంబున బ్రాహ్మణుండై పుట్టి బాల్యప్రభృతి లోకమునుఁ దృణీకరించి విష్ణుపదారవింద ధ్యాననిరతుండై పిచ్చివానివలెఁ బిశాచంబుభంగిఁ దోఁచుచుండ సోదరు లతని నిర్జనంబగు వనంబునందు జొన్నచేనికాపుద్దఁ గావలి యుంచి రిమ్మహాత్ముం డచ్చటనేయుండి సోదరదత్తంబులగు తెలిక పిండి తవుడు సంకటి మొదలైనవి భుజించుచుఁ గేశవధ్యాననిరతుండై యుండె నట్టియెడ సృపలకులుండగు తస్కరాగ్రేసరుం డొకఁడు తనకు బుత్త్రుండుపుట్టిన భద్రకాళికి నరబలి యిత్తునని మ్రొక్కి యదిసఫలంబు కాగా సాధింగాంచి యెచ్చటనైన నొక నరబలి సంపాదింపుమనఁగా నతండు పదిమంది దొంగలతో బయలుదేఱి నానాదేశంబులు దిరిగి యెచ్చటను నరపశువునుఁ బ్రాపింపలేక యర్ధరాత్రంబున నిర్జనస్థలంబున భగవద్ధ్యానపరాయణుఁడై యున్న భరతుని నిరీక్షించి సంతోషించి యతనిం బట్టుకొనిపోయి రాజునకు నివేదించె. అతం డమందానం దముఁజెంది పురోహితునిద్వారా భరతుని స్నానము చేయించి గంధము పూయించి పుష్పమాలికలువైచి కాళికాగ్రభాగంబున నిలిపి కూర్చుండఁబెట్టి ధూపంబువైచి నఱుక నుద్యోగించి వయ్యవసరంబున భరతయోగియందుండు వైష్ణవతేజస్సు జ్వలింపఁగాఁ దానుమాత్రై

కాళి వృషలులను వృషలరాజును ఖడ్గంబుచే ఖండించి తదీయ రక్త పానంబుసేసి తలకాయపుట్టెలచే బంతులాడి భరతునకు నమస్కరించె నంత నబ్బరతుండు కాళికను ఖడ్గంబును వృషులులను విష్ణువిభూతు లుగానెంచి స్వస్థానముంజేరి సమాధినిష్ఠతోనుండెను. మఱికొన్ని దినంబులకు రహూగణుండనురాజు కపిలునియొద్దకు జ్ఞానోపదేశార్థ మేగుచు శిబిక నారోహించి యచ్చోటికివచ్చి వాహకులలోనొక్కఁడు వ్యాధిపీడితుఁడుకాగా భరతునిశిబిక మోయుటకు నియమించి గమ నము వ్యత్యాసమగుచుండ భరతుంగాంచి ఓరీజీవన్మృతుఁడా మదాం ధుఁడా దండించి చక్కనడిపింతునని దూఱుచుండె నంత సయోగీం ద్రుఁడు చాలాసేపూరకయుండి రాజుతో నిట్లనియె భూవరా నీవు రాజుననియుఁ దక్కినవారందఱు శేషభూతులనియుఁ దిరస్కరించి పల్కుచుంటివి. నీవెక్కడిరాజవు నీకును నాకును సమస్త భూత కోటికిఁ బరమేశ్వరుఁడు శాసకుఁడైయున్నాడు. ఆతండు నియమించిన పని నెవ్వరైనం దప్పక చేసితీరవలయును. నీవు నన్ను దండింపనెంచి నాకు విరోధియగు శరీరంబును దండింతు వది నాకుమేలుసుమీయని పలుకు వాక్యంబులువిని రహూగణుండు భయంబుఁజెంది శిబికనుండి యుఱికి భరతుని పాదంబులఁబడి స్తుతించి తదీయాజ్ఞచే నరిగె నటు మీఁదఁ భరతయోగి నారాయణ చరణకమల ధ్యానపరుఁడై స్వల్ప కాలంబున శరీరంబువిడిచి విష్ణులోకంబున కేగె. 1643

నారదునివిషయము:

నారదుండు పూర్వజన్మంబున దాసీపుత్రుండైయుండి విష్ణు భక్తులగు యోగుల భుక్తశేషంబు భుజించి వారికిఁ బరిచర్యఁజేసి వారు పరస్పరముగాఁ జెప్పుకొనుచుండు విష్ణుకథల ను విని విష్ణుభక్తి నారంభించితిననియు నప్పుణ్యంబుచే బ్రహ్మకు జన్మించి యింతవాఁడ నైతిననియు స్వయముగా వ్యాసునితో నారదుఁడే వచించెనుగదా !

కావున నద్దేవముని విష్ణుభక్తాగ్రేసరుఁడు, మహాయోగి, గానవిశార
దుఁడు, యుగములనాటనుండి భగవన్మహాత్మ్యకీర్తనముచేఁ బుని
తుఁడైన మహానుభావుఁడు, సురాసుర గరుడ గంధర్వ కింపురుష
నర వానరాది సర్వభూత సేవిత పదాంబుజుఁడు, జగదాచా
ర్యుఁడు, మఱియు నితండు చేతితో స్పృశించి నోటితో నెవ్వనికి
మంత్ర ముపదేశించునో వాఁడెల్ల సిద్ధపురుషుండై వైష్ణవోత్తముం
డగు. వెండియు నిమ్మునీంద్రుఁడు యుగయుగంబులందును భగవదవ
తారంబుల సేవించిన పుణ్యపురుషుఁడు, విష్ణుభక్తికి నిక్షేపము
బోరా! యితని యుపదేశంబువల్లనే ప్రహ్లాదుండు భక్తులకు మార్గ
దర్శియయ్యె, ధ్రువుండచిరకాలంబున భగవద్దర్శనంబుఁ బ్రాపించి
యిప్పటికి నూర్ధ్వలోకంబున శాశ్వతరాజ్యం బేలఁగలిగె నితని
యుపదేశబలంబుచేతనే వాల్మీకి శ్రీరామాయణంబు నిర్మించి కవి
ప్రథముఁడై తపఃఫలంబులకు నాచార్యుండయ్యె నీతనిచ్చిన వాక్యంబు
చేతనే వేదవ్యాసుండు నిర్మూలితాఖిల సంశయుండయ్యె నిదియిట్లుం
డఁగా నొకప్పుడు దక్షుండు పదివేలమంది కొడుకులఁ బుట్టించి
వారితోఁ దపంబొనర్చి ప్రజావృద్ధి చేయుఁడని పంపించగా వారొక్క
పుణ్యాశ్రమంబుఁ జేరి తపంబొనర్చుచుండి రయ్యవసరంబున నారదుం
డచ్చటికరుగుదెంచి దక్షపుత్రులఁగాంచి బిడ్డలారా! యశాశ్వతంబై
బంధవర్ధకంబగు ప్రజాసృష్టితో మీకుఁ బ్రయోజనంబులేదు నారా
యణు నాశ్రయింపుఁడని తదీయ ప్రభావంబెఱింగించి చనిన నప్పది
వేలమంది విరక్తులై హరిస్మరణముచేసి ముక్తినొందిరి. దక్షుండు
దుఃఖించి మరల శబళాశ్వులను వేయిమంది పుత్రుల జనింపఁజేసి
ప్రజావృద్ధి చేయుండని నియమించిన వారలొక పుణ్యతీర్థంబున కరిగి
తపంబొనర్చుచుండ నారదుం డచ్చోటికి విచ్చేసి వారితో నయ్య
లారా! మీకీప్రజాభివృద్ధిచే నేమి లాభము మీపూర్వులు పోయిన
మార్గము మంచిది కావున విష్ణుభక్తిచేసి కృతార్థులుకండనఁగా వారి

లట్లొనరించి ముక్తిఁజెందిరి. రెండుసారులు నారదుండు తన వాంఛను విఫలము చేసినందులకు దక్షుండుకోపించి నారదునకు నివాసస్థానంబొక్కెడను లేకుండుఁగాకయని శపించె. దేవముని మరల శపింపఁగల వాఁడయ్యును భగవత్సేవారతుండు గావున శాంతివహించి ప్రతిశాపమీయక యూరకుండె నారా యిట్టిహరిదాసుం డేలోకంబున నేకాలంబునఁ గానరాడయ్యెగావున భాగవతుండగువాఁడెన్ని కష్టంబులకైన నోర్చి భగవన్ముఖోల్లాసంబునకై బోధచేసి పరుల నుజ్జీవింపఁజేయ వలయునని తెలుచున్నది. 1647

వేదవ్యాసునివిషయము:

వేదవ్యాసమునీంద్రుండు పూర్వము రాశీభూతంబులైయున్న వేదంబులను నాలుగుగావిభజించెను. వేదార్థంబుల నైదువందలయేఁబ వదినాలుగు బ్రహ్మసూత్రంబులలో నిమిడ్చి చెప్పెను. పదునెనిమిది పురాణంబుల రచించెను. పంచమవేదంబగు భారతంబును సపాద లక్ష శ్లోకంబులచే నిర్మించెను. భగవత్ప్రభావ ప్రతిపాదకంబగు మహాభాగవతంబు పదునెనిమిదివేల శ్లోకంబులచే రచించెను. "వ్యాసోచ్ఛిష్టం జగత్రయమ్మ"ను కీర్తిని సంపాదించెను. జైమిని వైశంపాయనాది శిష్యులమూలకముగా లోకమునకు జ్ఞానోపదేశంబు చేయించెను. వ్యాసునివంటి పండితుండుగాని కవీశ్వరుఁడుగాని తపోనిధిగాని సత్యవాదిగాని భగవదవతార రహస్యవేదిగాని మఱియొకండు లేఁడు. నారాయణాంశ సంభూతుండగుటచే నితండిట్టి సామర్థ్యము గడించెను. భాగవతుండు పండితుండైనచో భగవత్ప్రభావ సంయుతంబులగు రమణీయ గ్రంథంబుల రచించి లోకోపకారము చేయవలయునని స్ఫురింపుచున్నది. 1648

పరాశరమునివిషయము:

శిష్యా ! పరాశరమునీంద్రుఁడు పురాణరత్నంబగు విష్ణుపురాణంబు రచించిన తత్త్వవేత్త. ఈపురాణంబునందుఁ జిత్తు అచిత్తు ఈశ్వరుఁడు నను తత్త్వములు మూఁడును విశదముగాఁ జెప్పియున్నాఁడు. దీనివల్ల భాగవతుఁడు చిదచిదీశ్వర తత్త్వప్రతిపాదకంబగు రామానుజ సిద్ధాంతమునఁ బ్రవేశించి గోవిందుని భజింపవలయునని బోధింపఁబడుచున్నది. 1649

శుకునివిషయము:

పుత్రా ! వ్యాసనందనుండగు శుకయోగీంద్రుండు జన్మవిరాగి. స్త్రీపురుష విభాగ జ్ఞానములేని యవధూత. ధ్యానయోగముచే నిరంతరము హృదయకమలమునందు విష్ణుని బంధించిన యోగీశ్వరుఁడు. భగవదితరపదార్థములఁ దృణీకరించిన బ్రహ్మవిదగ్రేసరుఁడు. లోకులు తన్నుఁ బిచ్చివాఁడని నిందింపుచుండగా లోకమెంత మూఢత్వములోనున్నదిరా! యని లోలోన నవ్వుచుండు సుజ్ఞాని. భగవదవతార రహస్యంబుచేఁజొక్కి దేహేంద్రియ ప్రపంచంబులు మఱచియుండు బ్రహ్మానంద భరితుఁడు. తానిట్టివాఁడయ్యు శాపగ్రస్తుఁడైన పరీక్షిన్మహారాజుకొఱకు హస్తిపురంబున నేడుదినంబులు వసించి భగవత్కథామృతముచే సభాసదుల నోలార్చి యుత్తరానందనునకు మోక్షంబొసంగిన పుణ్యనిధి. కృష్ణావతార మాహాత్మ్యంబు నెఱింగిన వారలలో నితం డగ్రేసరుండు. విదేహపతియగు జనకుండితని మనస్సందేహము నివర్తింపఁజేసి జ్ఞానియను ఖ్యాతింజెందెను. 1650

వాల్మీకిఋషి:

ఈమహాముని స్వర్గలోక సరస్వతిని భూమికిడించి ఛందోబద్ధముగా రామాయణమును రచించి వేదార్థము నయ్యాదికావ్యమునందు

నిషేవించిన ప్రథమకవి. ఇక్కవీశ్వరుని కవితామాధుర్య మెందునుఁ గానరాదు. వెండియు నితనిరామాయణము చదువుచున్నకొలఁది నాలుకయం దమృతముపుట్టి నోరుపట్టక సెలవులవెంటఁగారి సమీపస్థిత శ్రోతలపైఁజింది వారివీనులను దోసిళ్ళగుండా హృదయకమలములఁ బ్రవేశించి సంసారతాప మార్చి యానందశైత్య మిచ్చును. మఱియు నీరామాయణము సామాన్య సంస్కృతజ్ఞానము గలవారికి సహా తెలియుచుండును. మహాపండితులకైనను సందేహము గలిగించును. ఇరువదినాలుగువేలశ్లోకములపరిమితిగల యీరామాయణము ద్రాక్షాపాకముతోనుండును. ఒక్కొక్కశ్లోకంబున ననేకార్థంబులు స్ఫురించుచుండును. గీర్వాణభాషయం దిప్పటికి నలువది రామాయణంబు లున్నను వాని నెడమకాలఁదన్ని వాల్మీకిరామాయణము ప్రభుత్వము చేయుచున్నది. దీనియందు నర్థపంచకము, తత్త్వత్రయము, కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తులవిషయము, శరణాగతి, శరణాగత, శరణ్యుల వైభవము చక్కగా విశదీకరింపఁబడియున్నది. ఇంతేకాకుండ నియ్యితిహాసంబునందు సీతారాములప్రధానము, రామనామమహాత్మ్యము, భగవద్దివ్యమంగళ విగ్రహ వర్ణనము, భగవత్కల్యాణగుణ వర్ణనము, లక్ష్మణాది భాగవత మాహాత్మ్యము లెస్సగా వివరింపఁబడియున్నవి. శ్రీరామాయణ పయః పారావారమునందు మనపూర్వాచార్యులగు యామున రామానుజాదులు విశేషార్థములను రత్నములను సంపాదించి మనకొఱకిచ్చిరి. మనమారత్నముల నధీనము చేసికొంటిమేని వానిని వెలగానిచ్చి పరమపదంబునఁగోరి నంతస్థలమునుఁ గొనవచ్చు నిన్నాకుభవుని వైభవంబంతయు రామనామోచ్చారణముచేత గలిగినదని యెఱుంగుము. 1651

సుశీలుఁడు

అయ్యా! మొత్తముమీఁద భాగవతు లెంతమందిగలరో వక్కాణింపుఁడు. 1652

వరవరముని

భాగవతు లసంఖ్యాకులు గలరు. వారిని లెక్కింప నెవ్వరికిని సాధ్యంబుగాదు, మనపూర్వాచార్యులగు యామున రామానుజాదులు నాళ్వారులును మహాభాగవతులని యెఱుంగుము. వారి ప్రభావం బిదివఱకే నీకెఱింగించితిని యుగములనాటి భాగవతులు కోట్లసంఖ్యాకులుగలరు వారిలో నూటికిఁ గోటి కొక్కరుమాత్రము గ్రంథములయందెక్కిరి గ్రంథస్థులైనవారినైనను సాకల్యంబుగా వక్కాణింపఁ దరంబుగాదు. నీభక్తి దృఢపడుటకై కొలఁదిగా వచించితిని.

సుశీలుఁడు

భాగవతునకుండవలసిన ముఖ్య గుణంబులేవి ? 1654

వరవరముని

జ్ఞాన భక్తి వైరాగ్యములుమూఁడు ముఖ్యముగా నుండవలయు నందులో జ్ఞానభక్తులవిషయ మిదివఱకే చాలావఱకునుడివితిని. ఇంకను దెలిపెద వినుము. అజ్ఞానము, అన్యథా జ్ఞానము, విపరీత జ్ఞానము మొదలైనవి విసర్జించి సద్గురూపదేశముచే నార్జించినవానిదే నిర్మల జ్ఞానము. అట్టిజ్ఞానము ప్రకృతిబద్ధుఁడైన జీవుని నిజతత్త్వము, భగవంతుని ప్రభావము యథార్థముగాఁ దెలుపును. భక్తిసర్వేశ్వరు నీడ్చి తెచ్చి తనయెదుట నిలుపఁబెట్టును, వైరాగ్యము, అద్దమునందుఁగల మాలిన్యమును వస్త్రముతుడిచినట్లు జ్ఞానమునకు భక్తికిగల మాలిన్యము తుడిచిబాగుజేయును. 11655

సుశీలుఁడు

ఈమూఁటిలోఁ బ్రధానమైనదెద్ది ? 1656

వరవరముని

మూఁడునుఁ బ్రధానములేయైనను సర్వేశ్వరుని దర్శింపఁజేసి తదీయానుగ్రహము సంపాదించునది గనుక భక్తియే శ్రేష్ఠమైనది.

తక్కినరెండును దానికి సహాయకారులు. భక్తిముదిరినచోఁ బ్రపత్తి రూపమునుఁ జెందుచున్నదని చెప్పవచ్చును. ఎందుకనగా దేహయాత్రా జీవయాత్రా భారములు భగవంతునియందర్పించి తదీయ గుణానుభవ కైంకర్యములతోఁ బ్రొద్దుపుచ్చుచు నిర్భరుఁడై నిర్భయుఁడై యుండుటయని కొందఱు పూర్వాచార్యులు సాయించిరికాని యర్థపంచకజ్ఞానము లేనప్పుడు భగవంతుని బ్రేమించునట్టి భక్తి యెట్లు కలుగు నట్టివిశ్వాసము లేనప్పుడు భరన్యాస మెట్లుచేయును. భరన్యాసము లేనివానికి గుణానుభవకైంకర్యము లెట్లుసిద్ధించు నకారణంబున భక్తియే యన్నిటికి మూలమై యున్నది. భక్తిప్రపత్తుల రెంటికీ మూల మొక్కటిగానున్నది. ప్రపత్తియనునది మనతోమనము రహస్యముగాఁ జెప్పుకొనవలసినదేకాని పరమతస్థులముందఱ నిల్వదు. ఒకవేళ నహంకార నిరసనపూర్వముగా నాదెద్దియులేదు, అంతయు భగవంతునిదే యందుమేనిఁ జిక్కువచ్చు నెట్లంటివేని భగవదపచార భాగవతాపచారాసహ్యాపచారంబు లొనర్చిన చేతనుండు చేసిన వన్నియు భగవదర్పణమనుచు మరలమరలఁ జేయుచున్నచో భగవంతుఁ డనుగ్రహింపఁడుగదా ! కావున భాగవతుఁడు సర్వేశ్వరునిపై భరన్యాస మొనర్చియు భక్తిఁ జేయుచుండవలెను. కనుకనే రామానుజ యోగీంద్రులు శ్రీభాష్యంబున భక్తియోగంబునే లెస్సగాఁ బ్రకటించినారు. నవీనులుకొంద ఱుపాసనావిధానమునుఁ గొట్టివేసినందువల్ల విశిష్టాద్వైతులందఱు పంచసంస్కారమాత్రంబునఁ బ్రపన్నుల మైతిమని చెప్పుచు దినమునకుఁ బదిమాఱులు ద్వయానుసంధానమైనం జేయక యనుష్ఠానపరులంగాంచి వీరు సాధనాంతరపరులని యెగతాళి చేయుచు సంసారకార్యమగ్నులై తిరుగుచున్నారు. రానురాను రామానుజ సిద్ధాంతము నాస్తిక్యముక్రిందఁ దేలుచున్నది. ఏవిధమునన్నైన భగవదారాధనము చేయువాఁడు భగవదనుగ్రహపాత్రుండగుఁగాని జ్ఞానముచే భోగలాలసను, కర్మముచే ధనాభివృద్ధిని భక్తిచేఁ బుత్ర మిత్ర కళ

త్రాదులనుఁ బోషించుచు గాలికిఁబోవు పేలపిండి భగవదర్పణమన్నట్లు రిక్తప్రపత్తి క్రియనొసఁగి కల్పించినచో సంతోషింపఁడు. సంతోషించుట కతండు వివేకహీనుఁడు కాఁడు. పూర్వాచార్యులందఱు సంసారత్యాగముచేసి యేదో లౌకికవిధముగా నెడతెగక భగవదారాధన చేసినవారే. ఎట్లంటివేని నమ్మాళ్వారు జనించినదాది ప్రకృతిసంసర్గంబు వదలి చింతతోఁబుట్టఁగో ననేకసంవత్సరములు భగవదనుభవముచేసి వైకుంఠంబున కేగిరి. నాథమునీంద్రులు, కురుకహోలప్పు మొదలగువారు యోగనిష్ఠచే గోవిందు నజస్ర మారాధించిరి. శ్రీయాళ్వందారులు మహాభక్తులై వైకుంఠుని భజించి పంచమంబులను మహానుభావులఁ జేసి పంచమజాతీయుఁడగు మారనేరి నంబిని లోకసంపూజ్యునిఁ జేసిరి. ఇంతేకాక దర్శన స్పర్శనములచే జనులకు సంసారబంధంబులు దొలంగించిరి. రామానుజులవారు పదియాఱవయేట సన్న్యాసము పుచ్చుకొని తరువాత నూటనాలుగు వర్షంబులు కంటికినిద్ర కాలికిసుఖము లేకుండ సంచరించి దివ్య దేశ కైంకర్యంబులు దిద్దుబాటుచేసి చేతనోద్ధారణ గావించిరి. కూరత్తాళ్వారు పెదవులాడకుండ ద్వయమంత్రోచ్చారణము సదా చేయుచుండిరని పెద్దలు చెప్పుదురు. పరాశరభట్టరువారు అపార నిష్ఠాగరిష్ఠులై భగవంతుని వశీకరించి చేతనోద్ధరణ మొనర్చిరి. నంజీయరు రంగరాజస్వామిచే సన్న్యాస దానము ప్రాపించిరి. నంబిళ్ళ కేశవానుగ్రహంబుచే మత్తకి మోక్షంబొసంగి పరమపదములోఁ బత్రిక చెల్లించిరి. శ్రీకృష్ణపాదదేశికులవారు వారి తిరుక్కుమారులగు పిళ్ళలోకాచార్యులవారు అళగియ మణవాళప్పెరుమాళ్ళ నయనారాచార్యులవారు మదీయాచార్యులగు తిరువాయిమొళిపిళ్ళగారు వీరందఱు నిరంతర భగవదనుభవపరులేగాని విషయానుభవ లేశమున నవకాశమిచ్చినవారు కారు కావున ముముక్షువగువాఁడు భగవదనుభవనిష్ఠుఁడు కావలయును. 1657

సుశీలుఁడు

స్వామీ! కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తులయందు శక్తిలేనివాఁడేమి చేయవలెను? 1658

వరవరముని

జ్ఞానానుష్ఠానంబులుగల విష్ణుభక్తుని గురువుగా నెన్నుకొని యతనికిఁ బరిచర్య చేయవలయు. దీని కుదాహరణంబుగాఁ గొన్ని వృత్తాంతంబు లెఱింగింతు నాకర్ణింపుము. శబరి బోయకులంబున జనించి మతంగమహాముని నాశ్రయించి ప్రపంచవిషయంబు నీసడించి సదా పరిచర్య చేయుచుండఁగా నమ్మునీంద్రుఁ డామెతో నిన్ను భగవంతుఁ డనుగ్రహించువఱ కిచ్చటనే యుండుమని వైకుంఠంబునకరిగె నంతఁ గొన్నినాళ్లా శబరి గురుధ్యానంబు చేయుచుండఁగా శ్రీరామచంద్రుండు లక్ష్మణసహితుండై తదీయాశ్రమంబునకు వెళ్ళి కిరాతికృతార్చన లంగీకరించి పరమపదంబున కామె ననిపెంగావున గురుభక్తి గలవారి చెంతకు సర్వేశ్వరుండు స్వయముగా వచ్చి రక్షించునని యెఱుంగుము. మఱియు దైవవారియాండాను యామునమునీంద్రుల శిష్యులలో నొక్కండు యామునాచార్యులవారొక్క సమయంబున శిష్యులనందఱిని శ్రీరంగంబునందుండ నియమించి యనంతశయనంబున కరిగి యాపెరుమాళ్ళను సేవింపుచుఁ గొన్నిదినంబులుండిరి ఇంతలో దైవవారి యాండాను గురువియోగంబు సహింపలేక దిగులుజెంది పండుజిల్లేడాకువలెఁ బాండురదేహుండై కృశింపుచుండె నంతలో నతని బంధుగులా సమాచారంబెఱింగి యతని నుయ్యాలతొట్టిలో నుంచుకొని యనంతపద్మనాభంబునకుఁ బ్రయాణమై పోవుచుండిరి వారలయ్యూరు సమీపించుచుండ నంతలో నాళవందారు రెండుక్రోసుల దూరంబున కెదురుగావచ్చె నప్పుడు దైవవారి యాండాను దాహపీడితుం డమృతాపగను గాంచినట్లు సంతోషించి యామున మునీంద్రుని పాదంబులంబడియె నయ్యవసరంబున నాచార్యవర్యుండు

కోపించి యిట్లనియె నోరీ! శ్రీరామచంద్రుండు స్వతంత్రుండు శౌర్యవంతుండుగాన నుంచినచోటనే భరతస్వామి యుండె నట్టి స్వతంత్రతా శౌర్యంబు లిద్దాసునకు లేవనియుండా నీవు మదీయాజ్ఞ నుల్లంఘించి వచ్చితివనియె నమ్మాటలు పలికి యాండా నరోత్తమా! గురుని సేవించుట కార్తితో వచ్చితిని గురాజ్ఞమీరుటకై ద్రోహినగుట నెఱుంగనైతి స్వరూపహానిఁ దెచ్చుకొంటినని పరవశుండై పడియుండఁగా నాళ్వందారు శిష్యునిఁగాంచి నాకు శూరత్వము స్వాతంత్ర్య మీయఁదలంచితివా యనఁగా దదీయచ్ఛాత్రుండు లేచి బద్ధాంజలియై యెవ్వ నప్పుడు సన్నిధినుండుస్వాములాళ్వందారులఁగాంచి ప్రభూ! నీకతఁడు లక్ష్మణుండుగాని భరతుండుగాఁడు. భరతులంద అచ్చోటననేయుండిరనిరి. యవ్వాక్యంబులకు గురుసార్వభౌముం డుప్పొంగి శిష్యునిఁ గౌఁగిలించి వత్సా! తల్లినెడఁబాసిన స్తనంధయునివలెఁ గృశించితివని కన్నీరువిడిచి యిట్లనియెఁ బుత్రా యనంతపద్మనాభము డాయవచ్చితివి, అద్దేవదేవుని దర్శించితివమ్మనఁగా నాండాను గురునితో దేవేంద్రా! నీకన్నుల పద్మనాభప్పెరుమాళ్ళు గలఁడు కాని నన్నెడుకొన్న నీవే నాకు సర్వేశ్వరుండవు. ఇతరదైవము నెఱుంగననియె నప్పలుకులకు గురుండలరి పుత్రా! నీగురుభక్తి యద్వితీయమని కొనియాడి హరిభక్తి చేయు నవసరంబులేదని వచించి శిష్యసహితుండై శ్రీరంగంబునకరిగె నాచార్యభక్తియం దితం డాతిశేజన ఘనుండు. 1659

వడుగనంబి:

ఇతం డగసాలి రామానుజయోగీంద్రుని శిష్యుండు. ఉడైవరు లొకప్పుడు దారి కేగుచుఁ గాలువయడ్డము రాఁగా నీటిలోబడ్డనఁ బాదుకలు విడిచి నీళ్ళలోఁ దిగిరి. అప్పాదుకలు వడుగనంబిగా రందుకొని తిరువారాధన దేవపేటికపైనుంచి కుల్యదిగి యవ్వలిగట్టు చేరఁగా నుడైవరులు పాదుకలు దెమ్మని యతని కార్యంబెఱింగి పెరుమాళ్ళ

శిరస్సునఁ బాదుకలుంచితివేమిరా దురాత్మాయని గద్దించె నంతట నాంధ్ర పూర్ణులు గురువుగారితో దేవా! నీదేవుండు నాశిరస్సునవెక్కఁగా నాదేవుం డెక్కడనుండును. తనకుమించినధర్మంబు లేదుగదా యనఁగా భాష్యకారు లుప్పొంగి తదీయ గురుభక్తికి సంతోషించిరి. 1660

మధురకవియాళ్వారు:

వీరు బదరికాశ్రమంబునందుండి కురుకాపురంబునఁ దింత్రిణీకోటరంబునంగల శఠారాతి దివ్యాంగ తేజస్సుంగాంచి రాత్రిప్రయాణంబులచే నచ్చటికేగి యోగసమాధిలోనుండు శఠగోపుని దర్శించి కోవెల గోపురాదులు కట్టించి సేవింపుచు నొక్కనాఁడు కాహళంబు లూదింపుచుండఁగా నచ్చటికొక మాయావాదివచ్చి మధురకవింగాంచి అయ్యా! మాగురువుగారుమహాప్రాజ్ఞులున్నారు. మీరుగాని మీగురువుగారుగాని మదీయదేశికునితో వాదించి జయించువఱకు నీకాహళంబు లూఁదరాదని యడ్డగించె నదివిని మధురకవి తిరువాయి మొళిలోని పాశురంబొకటి తాటియాకుపై వ్రాసి మీగురువుగారికిఁ బ్రత్యుత్తరంబిచ్చుటకీపత్రంబు చాలునని యియ్యగా నమ్మాయావాది దానిం గైకొనిపోయి గురువుగారుకూర్చున్న బల్లమీఁదనుంచి వృత్తాంతం బెఱింగించె నంతలో నత్తాళపత్రము గురువును గురునితోనుండు రెండు వేలమంది శిష్యులనుఁ గ్రిందఁబడద్రోసి తాను బల్లపైనుండెను. అంత నయ్యద్వైతగురుండు విస్మయంబొంది యప్పని చేసినందులకు శిష్యుని దండించి సమస్త శిష్యులతోఁగూడి యాపత్రంబు శిరసావహించి కురుకాపురంబునకరిగి నమ్మాళ్వారిని దర్శించి నమస్కరించి దేశిక శిఖామణీ! లోకంబునంగల కృతిసహస్రంబులన్నియు నీయొక్కపద్యంబునకుఁజాలవనిస్తుతించి మధురకవింగొనియాడి స్వస్థానంబునకుం జనియె. శఠరిపు సదృశదేశికుండును మధురకవి సమానశిష్యుండును లోకంబున సంభవించుటరుదని తలంపుము. 1661

మారనేరినంబి:

ఇతండు పంచమకులజుండు. యామునాచార్యులవారు చరమదశలో శిష్యులందఱిని బిలిపించి మదీయ రాచప్రణంబింకను బహుకాల మనుభవనీయమైయున్నది కాని నాకు లోకమునందు వైరాగ్యంబు కలుగుటచే వైకుంఠంబున కేగుచుంటి నీవ్రణం బెవ్వరైన ననుభవించినచో నాకు మేలుచేసినవారగుదురని వచింపుచుండఁగా శిష్యులందఱు పాఱిపోయిరి. మారనేరి నంబిమాత్రము నిలిచి గురుపుంగవా యీ వ్రణరూపమహాప్రసాదంబు నాకుదయచేయుమని యాచింపఁగా నట్టులొసంగి యతని యోగక్షేమంబు లరయుటకుఁ బెరియనంబిగారిని నియమించి యాళ్వందారు పరమపదమున కరిగిరి. తరువాతఁ గొలఁది కాలంబు మారనేరినంబిగారు గురుప్రసాద మనుభవింపఁగా రామానుజ యోగీంద్రు లమ్మహాత్మునకు మోక్షం బొసంగిరి. పెరియ నంబిగారు చరమకైంకర్య మానంబిగారికిఁ గొనర్చిరి. 1662

సందేహము

భాగవతులు భగవంతున కెట్టివారుగా నుందురు? 1663

సమాధానము

పూర్వము శిష్యులీప్రశ్నమే యడుగఁగా నంబిళ్ళైగా రిట్లు చెప్పిరి. ఆవార్త వింటివేని నీసంశయంబు తొలంగు నెట్లంటివేని

శ్లో॥ యథాహి పాండవాస్సర్వే, సుమిత్రానందనో యథా
యథాసీతా యథాంగాని, తథాభాగవతాహరేః

పాండవులును లక్ష్మణుండును సీతాదేవియు నెట్టిప్రీతిపాత్రులో రసనానేత్రపాదాది స్వకీయాంగము లెట్టి ప్రీతికరములో యట్లే భగవంతునకు భాగవతులు ప్రీతిపాత్రులు. 1664

సుశీలుఁడు

ప్రభూ! పరమభాగవతు లనేకులుండఁగా నంబిళ్ళగారు వీరిని మాత్ర మెత్తిన కారణమేమి? 1665

వరవరముని

సర్వేశ్వరునకట్టి ప్రీతికరు లింకొకరులేమిచే నట్లువచించిరి. పాండవులన్నప్పుడు ద్రౌపదినిఁ జేర్చుకొని యుందుము. పాండవులు శ్రీకృష్ణ ప్రియంకరులగుటకు వారికది బహుజన్మ సహస్ర సంచిత తపఃఫలంబని యెంచవలెను. వారు రాజులై రణశూరులై భోగార్హులయ్యునుఁ బ్రాభవంబును లెక్కింపక భగవంతునే సర్వవిధ బంధువుగా నత్యనసింపుచుండిరి. వనవాసాజ్ఞాతవాసంబులచే విపత్పరంపరలు పొందినప్పుడును ద్రౌపది కనేకపరాభవంబులు సంభవించినప్పుడును భారతరణంబున నభిమన్యు ప్రభృతి కుమారులు మరణించినప్పుడును చాంచల్యములేని మనస్సుతో శ్రీకృష్ణు నారాధింపుచుండిరి. ఇంతేకాక రాజసూయాశ్వమేధయాగంబులు శ్రీకృష్ణార్పణంబుగాఁ జేసిరి. వెండియుఁ దదీయ యాగకాలంబున వాసుదేవున కగ్రపూజగావించిరి. ఇదియిట్లుండగాఁ బాండవులకు భగవంతునియందుఁ గల యధ్యవసాయము వేఱుగా నెఱింగింతు నాకర్ణింపుము. 1666

సహదేవుఁడు:

రాజసూయాధ్వరసమయంబున సభాపూజితుండైన గోవిందునిఁ గాంచి సహింపలేక శిశుపాలుండవాచ్యంబులచే దూషింపుచుండె నయ్యవసరంబున నుదాసీనులైయుండు సభాసదులంగాంచి సహదేవుం డిట్లనియె నోసభాస్తారులారా! కృష్ణునకు మేమగ్రపూజఁ గావించినందులకు సహింపనివా రెవ్వరెవ్వరుగలరో వారిశిరస్సున మదీయవామ పాదంబు మోపితినని తలంపుడనియె నప్పుడు దేవతలు సహదేవునిపైఁ బుష్పవృష్టిఁ గురియించిరి, జగదాచార్యుండగు నారదుండులేచి వీణ వాయింపుచు సహదేవుని నిరీక్షించి పుత్రా! నీవంటిజ్ఞాని ముల్లోకం

బుల లేదు. శ్రీకృష్ణపరతత్త్వం బెఱింగినవారే జ్ఞానులు. తక్కినవా రజ్ఞాన విపరీతజ్ఞానా న్యథాజ్ఞానపరీతచిత్తులు. మఱియు వారు శవముల వంటివారు. వారినీక్షించిన సచేల స్నాన మాచరింపవలయుననె నప్పుడు మునులు, పండితులు, చక్రవర్తులు తప్పుదిద్దుకొని జ్ఞానమార్జించి చైద్యునినిందించి వాసుదేవుని స్తోత్రముసేసిరి. ఇది సహదేవుని భగవదధ్యవసాయము. 1637

నకులుఁడు:

దేవకీనందనుండు కౌరవసభకు రాయబారముకొఱ కేగుచుండఁ బాండవులంద ఱన్ని తెఱంగుల స్వకీయాభిప్రాయంబు తెఱింగించిరి. నకులుండుమాత్ర మచ్యుతు నిరీక్షించి నమస్కరించి దేవా! నన్న డుగవలసినపని లేదు. మాసమాచారము మునుపే యెఱింగి మారక్షణ భారము వహించియున్నావు. కౌరవసభయం దెట్లు భాషించవలయు నట్లు వచించిరమ్ము. తదుపరి నీదాసులమగుమమ్ము యథావిధి నడిపింపుమని భరన్యాసముచేసె నిది నకులుని భగవదధ్యవసాయమని యెఱుంగుము

అర్జునుడు:

ఇతండు జనార్దనుని జనని జనక గురు దైవ దాతృ వయస్య భావంబులతో భజించుటయేకాక భగవత్సాన్నిహిత్యము నడసి భగవద్గీతోపదేశమునుఁబొంది భగవద్దివ్య విశ్వరూపమును దర్శించిన పుణ్యాత్ముఁడు. వెండియు భగవదవతార సమాప్తకాలంబున ధర్మపుత్రునితో దనపరితాపం బనేకవిధంబుల నెఱింగించి తరువాత నన్నయ్యా! నాప్రాణేశ్వరుండగు శ్రీకృష్ణుండు నన్నువిడిచిపోయినందున గాండీవాది దివ్య సాధనంబులు వ్యర్థంబులయ్యె నేను విగవనైతినని దుఃఖించె నిది యర్జునుని భగవదధ్యవసాయము. 1639

భీముఁడు:

పాండవు లుపప్లావ్యంబున నుండగా రహస్యంబు చెడకుండ హరిని మన్నింపవలెనని రుక్మిణీవరుం డెద్దియో పనిఁగల్పించుకొని యప్పురంబునకరిగి విరాటునిచేఁ బూజితుండై సభాసదుల కన్నుల కఱవుదీర్చుచుండ ధర్మరాజార్జున నకుల సహదేవులు జనార్దనుని దర్శించి సాంకేతిక సల్లాపంబులచేఁ బరస్పర మానందింపుచుండిరి. ఇంతలో నొకవంటలవాఁడు భగవంతునిదర్శించి మహానసంబునకుబోవ భీముం డాతనిగద్దించి దుర్మతీ! నీవింతసేపు వంటపనిచేయక యెచ్చట నుంటివని మర్దింపఁబోవ నతండు కేలుమోడ్చి స్వామీ! లోకోత్తర పురుషుండగు శ్రీకృష్ణుం డిప్పురంబునకువచ్చి మనరాజసభయందుం డఁగాఁ గన్నులున్నందుకు ఫలంబిదియని జనులు వీక్షింపుచుండిరి నేను నట్లేనిరీక్షించి తనివిదీరనివాఁడనయ్యును దేవరవారి భయంబుచే వచ్చితినన మారుతి కోపంబుడిగి గోవిందునిరాకకచ్చెరువొంది పొయ్యి మీఁదనున్న క్షీరాన్నపుగుండిగ దించి పరమభక్తి తలకెక్కఁగా నదభ్రోష్ణక్షీరాన్నము కృష్ణార్పణమని వచించి ముకుందదర్శనార్థము పరుగెత్తె నంతలో వాసుదేవుండు ప్రయాణమగుచుండ విరాట ధర్మరాజాదులు సాగనంపుచుండిరి. మరుత్సుతుఁడు చేరంబోయి నమస్కరించెను మాధవుండు వడముడిని సంతోషపెట్టఁదలంచి క్రిందఁబడెను విరాటాదులు లేవనెత్తి స్వామీ! పడుటకు గారణంబేమని ప్రశ్నించిరి రాధాపతి వారలం గాంచి వయస్యులారా! వానియిల్లు నేలఁగట్టి యెవ్వఁడో మిక్కిలి వేడిపాయసము సమర్పించినాఁడు దానిచే బ్రేవులు మాడుచున్నవని చెప్పఁగా నందఱు విస్మయంబందిరిగాని యథార్థం బెఱుంగరైరి జనార్దనుండు యదృచ్ఛంజనియె వాయునందనుండు గోవిందుని సర్వజ్ఞత్వభక్తవాత్సల్యంబులకు విస్మయానందములు వహించె నిది భీముని భగవదభ్యవసాయము 1670

ధర్మరాజు:

ఇతండుపప్లావ్యంబుననుండి సౌభద్ర వివాహానంతరము బాంధవులందఱు స్వదేశంబుల కరుగుచుండఁగాఁ గొంతదూరము సాగనంపి పుండరీకాక్షుని నిలిపి దైత్యాంతకా మేముబాలురమైయుండు తఱిఁబాండురాజు పరలోకగతుండగుచు నీవుమాకురక్షకుండవైయుండు నను ధైర్యముచే దిగులుజెందలేదని విన్నవించెను రాయబారమున కేగునప్పుడు శ్రీకృష్ణుని సర్వశక్తిమత్వ మెఱింగియుండియు దేవా దుర్యోధనుడు మాన్యుడు తదీయులగు కర్ణదుశ్శాసనాదులతిదుష్టులు, నీవచ్చుటికి నొంటరిగాఁ జనుటొప్పదు సహాయకారులతోఁ జనుము నీకు గించిదవమానంబు కలిగె నేనిఁద్రిలోకాధిపత్యంబైనను నేనొల్లనని పలికెను, భారత రణాంతంబున శ్రీకృష్ణుండు ద్వారకకుఁ బోవలయు నని ధర్మజుని సెలవడుగఁగా నతండు కన్నీరువిడిచి న్యాయితో

శ్లో॥ మాంగా ఇత్యపమంగళం వ్రజసఖే స్నేహేన హీనం వచః
తిష్ఠేతి ప్రభుతా యథారుచి కురుష్వేష హ్యుదాసీనతా,
కింకర్తవ్యమతః పరం యదుపతే త్రైలోక్యనాథ ప్రభో,
స్మర్తవ్యా నయమాదరేణ భవతా యావత్పునర్దర్శనమ్

వెళ్ళవలదంటి నేని మంగళము కాదు పొమ్మనుట స్నేహములేని వాక్కు నిలువుమని గద్దించుటకు నీపై ప్రభుత్వము నాకులేదు ఓయదుపతీ త్రైలోక్యనాథా వెళ్ళితే వెళ్లుము ఉండేయుండుమనుట ఉదాసీనత్వము. అదియును మంచిదికాదు మఱేమంటే పునర్దర్శనమగునంతకుఁ బాండవు క్షేమెఱాయని తలంపుమని ప్రార్థించెను. ఇది ధర్మనందనుని భగవదధ్యవసాయము. 1671

ద్రౌపది:

ఈమె మహాభక్తురాలు. కురుసభలో దుర్జనులగు దుశ్శాసనాదులు మానభంగము చేయఁదలంపగా భర్తలగు పాండవులకు

శరణుఁజెందక భీష్మద్రోణాదులనైన లెక్కచేయక వాసుదేవుని శరణుఁజెంది స్వకీయ మానంబుఁ గాపాడుకొని దుర్యోధనాదులకు లజ్జయుఁ బాండవుల కానందంబునుఁ గీర్తియుఁ గలిగించెను. ఇది ద్రౌపది భగవదధ్యవసాయము. ద్రౌపదీ పాండవులిట్టివారు గనుకనే యంత్యకాలంబున గగనమార్గంబునకెగసి భూప్రదక్షిణంబుఁగావించి దేవతాసంచారభూములందు శరీరంబు లంతర్ధానంబుగా విడిచి భగవత్ప్రాప్తిఁ జెందిరి. ద్రౌపదీ పాండవు లఖండ విష్ణుభక్తి నవలంబించి నవారగుటచే భక్తిక్రీతుండగు భగవంతుండు సర్వదా రక్షించి దుర్యోధనునియొద్ద శ్లో॥ మమప్రాణాహి పాండవాః, అనియుఁ బాండవదూతననియు వక్కాణించెను. 1672

లక్ష్మణుఁడు:

ఇతండు మహామహుఁడు, పుణ్యశీలుఁడు, భోగస్థాన భోగోపకరణ, భోగసామగ్రు లపారముగనుండియు రామునియందు నచిద్వత్పారతంత్ర్యమును వహించిన పవిత్రుఁడు. సీతారాముల పరిచర్య వనవాసంబునఁ బదునాలుగేండ్లు తదేకనిష్ఠతోఁ జేసినదిగాక రాజ్యమునకుఁ జేరినప్పుడు పురద్వారంబున దౌవారికుండై రామకైంకర్యమొనర్చెను. సీతారాములు సాక్షాల్లక్ష్మీనారాయణులను జ్ఞానముగలవాఁడై నిశ్చలభక్తితో సేవించిన భక్తాగ్రగణ్యుఁడు యితండిట్టివాఁడు గనుకనే రామచంద్రుఁ డిమ్మహాత్ముని విశ్లేషము క్షణకాలమైనను సహింపడు. లక్ష్మణుండు రావణశక్తిచే మూర్ఛిల్లినప్పుడు శ్రీరామచంద్రుం డతనిఁ గౌఁగిలించి యతనిముఖంబున ముఖంబుఁ జేర్చి కన్నీరువిడుచుచు లక్ష్మణా! నీవు నాకొఱకై యుద్ధంబునఁబడితివి. నీఋణం బెన్నిజన్మంబులనైనం దీర్పఁజాల. దేశదేశములందు భార్యలను సంపాదింపవచ్చును. ధన ధాన్య తపనీయ రత్నంబుల నార్జింపవచ్చును. బాంధవుల నార్జింపవచ్చును కాని నీవంటిసోదరు నెట్లు సంపాదింతును.

మదీయ విశ్లేషము సహింపలేక భోగంబులు వర్జించి యరణ్యంబు నకు వచ్చితివి. ఇప్పుడు నీతో నేను పరలోకంబునకు రావలయుననిన విభీషణునకు రాజ్యంబిచ్చుట యసత్యంబగు నింతేకాక వనవాస శేషముముగింపక యెట్లువచ్చితివని మనతండ్రిగారడిగిన నేమని ప్రత్యుత్తరంబిత్తు తండ్రీ! నీవులేని యీలోకంబున జీవితంబుగాని సుఖంబుగాని రాజ్యంబుగాని రావణాది శత్రుసంహార జనిత జయంబుగాని సీతాప్రాప్తిగాని ప్రయోజనంబులేదని తలంచెదనని బహువిధంబుల విలపించి సంజీవిచే నతండు బ్రతికినప్పుడు లక్ష్మణా! నాభాగ్యవశంబున జీవించితివి యికనేను రావణసంహారంబు చేసినవాఁడనైతిని సీతను బొందినవాఁడనైతినని సంతోషించెను ఇవ్వాక్యంబులచే లక్ష్మణునకు - సీతారాముల యందుఁగల భక్తియు సౌమిత్రియందు రామునకుఁగల వాత్సల్యమును దేటపడెనుగదా 1378

సీతామహాదేవి:

ఈమె యయోనిజ యోగీశ్వరుండగు జనకచక్రవర్తి తనూజ శ్రీరామచంద్రునకు భార్యయైనది మొదలు రత్నమును కాంతి, బంగారమును మూల్యము, సూర్యుని తేజస్సు, చంద్రునిఁ జంద్రిక, పుష్పమును బరిమళము విడువకయుండు తెఱంగున రాముని సేవించిన మహాసాధ్వి త్రిలోకకంటకుండగు రావణునిఁ గీటకంబునుబోలెఁ దృణీకరించిన ప్రభావనిధి మారుతివాలాగ్నిని మాటచేఁ జల్లార్చినతపస్విని దేవతాస్త్రీల చెఱలు విడిపించుటకై కారాగృహంబుననుండిన దయాస్వరూపిణి లంకా నిర్మూలనకారణభూత, వహ్నిలోకమునకే పన్నీరంబున దేలినట్లు తేలి ముల్లోకంబులకు స్వకీయపాతివ్రత్యంబెఱింగించిన పవిత్రచరిత్ర, గర్భిణియైనప్పుడరణ్యంబున వాల్మీకాశ్రమంబు నందుండి రామ పారతంత్ర్యంబునుఁ జరమశాబ్దిచే రామానన్యార్హ శేషత్వంబునుఁ బ్రకటించిన మహాదేవి, సాక్షాల్లక్ష్మీ స్వరూపిణి, యిట్టిది

గనుకనే శ్రీరామచంద్రుఁడు సీతాదేవికై శివధనుర్భంగంబు గావించెను పరశురామ గర్వధ్వంసమొనర్చెను విరాధకబంధ ఖరదూషణాది బలవద్రాక్షసుల వధించెను. వాలినిసంహరించి సుగ్రీవునకు రాజ్యంబిచ్చెను వారాశిని బంధించెను రావణకుంభకర్ణేంద్రజిదాదుల వధించెను.

శ్లో॥ నజీవేయంక్షణమపివినాతామసితేక్షణామ్

సీతనువిడిచి క్షణకాలమైనను జీవింపనని దుఃఖించెను, కావున భగవంతుఁడు పాండవులయందును సీతాలక్ష్మణులయందును నెట్టి వాత్సల్యముకలిగి యెట్టిదుష్కరకార్యము లొనర్చెనో స్వకీయఃజహ్నా నయన పాదాదులయందెట్టి ప్రీతిగలదో త్రికరణశుద్ధిగలిగి దేవతాంతర మంత్రాంతర సాధనాంతర ప్రయోజనాంతరంబుల వర్జించి తన్ను భజించు భక్తుల నట్లుకాపాడునని ప్రపన్నాగ్రేసరులగు నంబిళ్ళగారు వచించిరి. 1674

# భగవదపచారము

## వరవరముని

భగవదపచారమునుఁ గూర్చివచింతు నాకర్ణింపుము. భగవదపచారమనఁగా, భగవద్గౌరవమును దెలిసికొనలేకయుఁ దెలిసికొని పాటింపకయు దూషించువారు విపరీతజ్ఞానులు వారిసమాచారము పండితులును భగవంతుఁడును విశదముగాఁ దెలిపియున్నారు. యెట్లంటివేని జనించిన మానవులలో సజ్ఞానులని విపరీతజ్ఞానులని జ్ఞానులని మూఁడు తరగతులుగానుందురు వారిలో నిద్రాహార భయమైథునములను నాలుగు వృత్తులు దక్క నితరవిషయమేమియు నెఱుంగని మూఢులజ్ఞానులనంబడుదురు వీరు పుట్టంధులవంటివారు. విపరీతజ్ఞానులనఁగా నొకవస్తువు నింకొకవస్తువుగా భ్రమించువారు, యెట్లంటివేని ధర్మము నధర్మముగా నధర్మమును ధర్మముగా, సత్యము నసత్యముగా నసత్య

మును సత్యముగా నొకటిరెండుగా రెంటినొకటిగా భగవదవతారముల
మనుష్యసామాన్యములుగా జీవులను బరమాత్మలఁగా దలంచువారు,
జ్ఞానులనఁగా ధర్మమును ధర్మమునుగా గుణమును గుణముగా దోష
మును దోషముగా నెఱింగి తదేకనిష్ఠతో మెలంగువారు, వారిలో
నజ్ఞానులు తామసులు, విపరీతజ్ఞానులు రాజసులు, జ్ఞానులు సాత్త్వి
కులు దీనికిఁబ్రమాణము 1675

శ్లో॥ ప్రవృత్తించ నివృత్తించ, కార్యాకార్యే భయాభయే,
బంధంమోక్షంచయావేత్తి, బుద్ధిస్సాపార్థసాత్త్వికీ

ప్రవృత్తిమార్గమును నివృత్తిమార్గమును చేయఁదగిన కార్య
మునుఁ జేయగూడని నిషిద్ధమును, దేనివల్లబంధము ప్రాప్తించునో
దేనివల్ల మోక్షముగల్గునో దానిని యథార్థముగా నెఱుంగు బుద్ధి
సాత్త్వికియనంబడును అట్టిబుద్ధిగలవారు సాత్త్వికులు 1676

శ్లో॥ యయాధర్మమధర్మంచ, కార్యంచాకార్యమేవచ,
అయథావత్ప్రజానాతి, బుద్ధిస్సాపార్థరాజసీ

ధర్మము నధర్మముగాఁ జేయవలసినపనిఁ జేయరానిదిగానిట్లు
విపరీతముగాఁ దెలియు బుద్ధి రాజసి యనఁబడు నాబుద్ధిగలవారు
రాజసులు 1677

శ్లో॥ అధర్మంధర్మమితియా, మన్యతేతమసావృతా
సర్వార్థాన్విపరీతాంశ్చ, బుద్ధిస్సాపార్థతామసీ

అజ్ఞానముచేనావరింపఁబడి యేబుద్ధి ధర్మముగాని యధర్మము
గాని బంధముగాని మోక్షముగాని గ్రహింపలేక స్తబ్ధమైయుండునో
యాబుద్ధి తామసి యనంబడు నదిగలవారు తామసులనంబడుదురు
(భగవద్గీత 18 అధ్యాయము)

వ॥ మఱియు నీవిపరీతజ్ఞానులంగూర్చి 1623

శ్లో॥ నమాందుష్కృతినోమూఢాః, ప్రపద్యంతేనరాధమాః
మాయయాపహృతజ్ఞానా ఆసురంభావమాశ్రితాః

అర్జునా! మూఢులు, నరాధములు, మాయాపహృతజ్ఞానులు, అసురస్వభావులు, అను నాలుగు తెగల పాపాత్ములు నన్నుభజింపరని భగవంతుఁడు వచించెను. 1679

(భగవద్గీత సప్తమాధ్యాయము)

సుశీలుఁడు

ఈ నాలుగు తెగలవారి సమాచారమును విశదముగా నాన తీయండి. 1670

వరవరముని

మూఢులనఁగా సద్గ్రంథపఠనము చేయుచోటికివచ్చి గ్రంథకర్త నోటినుండివచ్చు ధ్వనిమాత్ర మాలకించి భావమును గ్రహింపలేక వచ్చినత్రోవ నేగువారు. 1681

నరాధములనఁగా— శ్రీరామాయణ భారతాది సద్గ్రంథములు చదివి పండితులు ప్రసంగించునప్పుడు విని యివియెల్ల సత్యమేనా? ఎవరు చూచివచ్చిరి? ధనికుల ధన మపహరించుటకుఁ బనిపాటలేనివా రిట్లు వ్రాసియుంచిరి. నూఱుమాటలైన బొక్కెడు కొఱ్ఱలుగావెందుకు వచ్చిన గోలయని యీసడించి లేచిపోవువారు. 1682

మాయాపహృతులు అనఁగా వీరికి జ్ఞానముండియు మాయాపహృతమై మాలిన్యయుక్తమైనందువల్ల భగవత్ప్రభావసహితగ్రంథంబులు విన్నప్పుడు తెలియునుగాని యజీర్ణరోగికి నన్నము మొదలగు నాహార పదార్థములు చూచినప్పుడు అసహ్యముగాఁదోఁచునట్లు విపరీతజ్ఞానులకు భగవత్ప్రభావ శ్రవణసమయంబున భక్తికలుగుటకుమాఱుగా ద్వేషము జనించును. దానిచే రాముఁడు దేవుఁడైనచోఁ బడరాని బాధ లేందుకుఁబడును! విభీషణుఁడు మంచివాఁడైనచో నన్న నేల విడుచును! శ్రీకృష్ణుఁడు పరాత్పరుఁడైనచోఁ బాండవపక్షపాత మేల పాండవులు ధర్మాత్ములైనచో జ్ఞాతులనధించి రాజ్యమపహరింప నేల

యని విపరీతవాక్యంబులు వచించి సజ్జనుల మనస్సునొప్పించి తేచి పోవుదురు, 1683

అసురస్వభావులు, వీరును మాయాపహృత జ్ఞానులవంటివారే, లేఁబ్రాయమున నున్నప్పుడు మాయాపహృతజ్ఞానులన బడుదురు దుష్టత్వము ముదిరినచో నాసురస్వభావులనంబడుదురు, వీరు భగవంతుని ద్వేషించుటయేకాక భగవద్దూషణోపన్యాసములు చెప్పి భగవద్దూషణగ్రంథములు రచించి పలుమందిని చెడఁగొట్టి దుర్గతికిఁ బంపింతురు ఈనాలుగు తరగతులవారు చిరకాలము భగవల్లీలావిశేషంబును భోషించుచుందురు, 1684

సుశీలుఁడు

వారలట్లగుటకుఁ గారణమేమైయుండును 1685

వరవరముని

శ్లో॥ అవజానంతిమాంమూఢా, మానుషీంతనుమాశ్రితమ్
పరంభావమజానంతో, మమభూతమహేశ్వరమ్

అర్జునా ! సర్వభూతములకు నేకచ్ఛత్రాధిపతినగు నేను ధర్మసంస్థాపనాదులకై మనుష్యజన్మమెత్తగా మూఢులు నాపరబ్రహ్మస్వరూపము నెఱుంగక మనుష్య సామాన్యునిగా నెంచి నిందింపుచున్నారు 1686

శ్లో॥ మోఘాశా మోఘకర్మాణో, మోఘజ్ఞానావిచేతసః
రాక్షసీమాసురీంచైవ, ప్రకృతింమోహినీంశ్రితాః

రాక్షసి, ఆసురి, మోహిని, యనునీమూటి సంబంధమైన బుద్ధి నాశ్రయించి పుట్టిన దుష్టులు నన్ను దూషింతురు దానివల్లవారికి ఫలమేమనఁగా వారేమేమిసౌఖ్య పదవులు పొందఁదలంచిరో తదీయాశలు వ్యర్థమగును వారొనర్చు పుణ్యకర్మములకు ఫలములేదు అచేత

నములకు వారికి భేదముండదు వారి మనస్సులోఁగల జ్ఞానము వ్యర్థము 1687

శ్లో॥ అహంకారంబలందర్పం, కామంక్రోధంచసంశ్రితాః
మామాత్మపరదేహేషు, ప్రద్విషంతోభ్యసూయకాః

అర్జునా, అసురు లహంకారము బలము దర్పము కామము క్రోధము నాశ్రయించినవారై తమదేహమునందు నన్యులదేహంబు నందుండి కాపాడు మదీయోపకారము నెఱుంగక నాకల్యాణ గుణం బులయందు దోషారోపణము చేయుచున్నారు 1688

శ్లో॥ తానహంద్విషతఃక్రూరాన్, సంసారేషునరాధమాన్
క్షిపామ్యజస్రమశుభా, నాసురీష్వేవయోనిషు

దుర్మార్గులై నన్ను ద్వేషించి దూషించు నరాధములను భయంకర సంసారములో నసురయోనులయందుఁ బడఁజిమ్ము చున్నాను. 1689

శ్లో॥ ఆసురీం యోని మాపన్నా, మూఢాజన్మనిజన్మని
మామప్రాప్యకౌంతేయ, తతోయాంత్యధమాంగతిమ్

మూఢులై నన్నుదూషించువారు జన్మ జన్మంబునందును మోక్షదాయకుండగు నన్నుబొందక యటుపిమ్మటగూడ నరకకూప ములందుఁ బడుచున్నారని భగవంతుఁడు గీతాశాస్త్రమునందు వక్కాణించెను. 1690

మెండియు సర్వేశ్వరుఁడు, బద్ధజీవులు దేవతలనియు నసురు లనియు రెండుతెగలుగా నుండురనియు దేవతలు శాస్త్రవశ్యులై తన్ను భజింతురనియు నసురులు శాస్త్రమునాదరింపక తన్నుదూషిం తురనియు రెండుతెగలవారు నైశ్వర్యవంతులైయుందురనియు నసుర సంపద బంధమునకును దైవసంపద మోక్షమునకునుఁ గారణం బనియు వచించెను. 1691

సుశీలుఁడు

ఈ రెండుతెగ లెల్లప్పుడుండునా లేక కలియుగమందు
మాత్రమేనా ? 1692

వరవరముని

ఈదైవాసుర సంఘంబులు కృతయుగమాదిగాఁ గలియుగాంతమువఱకు నెడతెగకయుండును. దేవతలఁగాంచి యసురులు ద్వేషింతురు. అసురులంగాంచి దేవతలు భయపడుదురు. శ్లో॥ నాదైత్యోవింద తేబలమ్ అనునట్లు అసురులకు దేహబల మెక్కువగానుండును. దేవతలకు మనోబల మధికముగానుండును. అసురులకు స్వకీయ సంపత్సనా బాహుబలమే యాధారము. దేవత లసురులచేఁ బ్రస్తుతము బాధింపఁబడుచుందురు. అసురులు పాప పరిపక్వకాలమందు సర్వేశ్వరునిచే బాధితులగుదురు. దేవతలకు నారాయణుఁడేదిక్కు. కృతయుగమునాటి యసురులయందు నాధునికాసురులకుఁ బ్రేమజనించునట్లే యుగయుగమునాటి దేవతలయం దిప్పటి దేవతలకు నభిమానము జనించు. ఈయిద్దఱికిఁ బరస్పర కలహం బెప్పటికి నిలిచియుండును. దేవతలు భగవదనుగ్రహపాత్రులై నిత్యవిభూతికేగి సుఖింతురు. అసురులు భగవల్లీలాపాత్రులై ప్రకృతిబద్ధులై యల్లాడుదురు. 1693

సుశీలుఁడు

సర్వేశ్వరుఁడు దేవతలనుమాత్రమే సృష్టించి యసురులను
మానరాదా? 1694

వరవరముని

కృషీవలుఁడు పైరుపెట్టునప్పుడు కలుపుకూడా పుట్టవలయునని కోరకున్నను కలుపే ముందుగాఁ బెరుగును. వస్త్రధరించువాఁడు కోరకున్నను చెమ్మటపట్టును. తిండిపోతగువాఁడు కోరకున్న నజీర్ణవ్యాధి కలుగును. అట్లే భగవంతుఁడు సృష్టిచేయునప్పుడు దుష్టులుకూడ జన్మించవలయునని తలంపకున్నను జనింతురు. లోకద్రోహులగు

నాదుష్టులను మరల భగవంతుఁడే వధింపవలయుఁగాని యన్యులకు సాధ్యంబుగాదు. 1695

సుశీలుఁడు

భగవంతుఁడగు నారాయణునితోఁడి వైరంబుసహా మోక్షప్రాప్తికి సాధనమందురే సత్యమేనా ? 1696

వరవరముని

సర్వేశ్వరునియందుఁ జేయు వైర మన్నమువంటిది. భక్తి బంగారు వంటిది. యన్నము వండినపూట భుజించినచోఁ బుష్టినిఁ దృప్తినిచ్చును నిల్వయుంచినచో రెండవనాటికిఁ బాసిపోయి రోగమునిచ్చు నట్లే భగవద్వైర మాజన్మమందే పరిపక్వమైనచో మోక్షమునిచ్చు, నట్లుగాక రెండవజన్మమునకు నిల్వయున్నచో జీవికి రౌరవాదినరకంబులును క్రిమికీటకాది జన్మంబులును సమకూర్చును. కంసశిశుపాల మారీచఖరదూషణాదులు ముల్లోకంబులు జయించినవారగుటచే నెవ్వరివల్లం జావక సర్వేశ్వరు నెదిరించి పోరి చచ్చి ముక్తింగనిరి. కొందఱు భగవద్వైరంబు మాత్రము సంపాదించి దూషింపుచు నితరులచేతఁగాని స్వభావమరణముచేతగాని శరీరంబులు విడిచి దుర్గతిం జెందిరి. భక్తి బంగారమువంటిదిగనుక యాజన్మమందైన బహుజన్మంబులకైనం జెడక వృద్ధిఁ జెంది మోక్షంబు నొసంగును. భగవద్వైరంబునకు భగవద్భక్తికిని గల తారతమ్యం బిదియని యెఱుంగుము. 1697

సుశీలుఁడు

భాగవతులు శాస్త్రానుసారంబుగా నటింపుచు నెవ్వరికి నేవిధమైనఁ గీడుచేయరు సరేకదా వీలైనంతలోఁ బరోపకార పరాయణులై యుందురు. వారిపై నసురులు కోపించి బాధింపుచుందురు హేతువేమి

వరవరముని

వనములలోనుండు పక్షులు జింకలు నీటిలోనుండు మత్స్యంబులు పొలమున మేయుచుండు మేకలు గొఱ్ఱెలు బోయల కేమియు

నపకారంబు చేయకున్నను వారు నిష్కారణముగా నాయాజంతువుల వధింపుచుండలేదా, యట్లే యాసురప్రకృతులు భాగవతుల బాధింతురుకాని · తదుపరి భగవన్నిగ్రహమునకుఁ బాత్రులై పరిమితిలేని దుఃఖంబనుభవింతురు. దీనికిఁదార్కాణంబుగాఁ జిరకాలము మారీచ సుబాహులు విశ్వామిత్ర యాగభంగంబొనర్చియు ఖరదూషణాదులు దండకామునుల వేధించియు మనరాఘవునిచేత వధింపఁబడిరి. 1699

సుశీలుఁడు

జ్ఞానులైనవారికిఁగూడ నాసురసంబంధబుద్ధి యెప్పుడైనఁ గలుగునా ? 1700

వరవరముని

భగవన్మాయామోహితులైన కాలంబున జ్ఞానులకు సహితమాసురస్వభావము గలుగుచుండు నయ్యవసరంబున నిస్సందేహముగా భగవదపచారము చేయుదురు. తొల్లి శ్రీకృష్ణుండు భారతరణాంతంబున హస్తిపురినుండి ద్వారవతి కరుగుచు మార్గంబుననుదంకుండను మునినిలయంబున కేగ నక్కాలంబున నమ్మునివరుండు సర్వేశ్వరు నెదుర్కొని యర్ఘ్యపాద్యాదులఁబూజించి యుచితాసనంబునఁ గూర్చుండఁబెట్టి కుశలంబడిగి యిట్లనియెఁ గృష్ణా! నీవు పాండవపక్షపాతివై మహాబలాఢ్యుల వధించి కురుక్షయం బొనర్చి యధర్మంబాచరించితివి. దానికిఁ బ్రతీకారంబుగా నిన్నుశపింతునని కన్నుఱెఱ్ఱఁ జేయఁగా రుక్మిణీకాంతుండు నవ్వి మునీంద్రా! నీవజ్ఞుండవు. నీతపంబు స్వల్పంబు. నీతపంబు నశించుటేకాని నీశాపంబు నాయందుఁ బని చేయదు. మదీయతత్త్వంబు వ్యాస నారదాదు లెఱుంగుదు రట్టి జ్ఞానంబు నీకొసంగెద నాప్రభావంబుఁ గాంచుమని లోకరక్షణాసక్తంబగు స్వకీయ శ్రీహస్తంబతని మొగంబునఁ బెట్టుటయు నుదంకుండు కల్మషరహితుండై దివ్యజ్ఞానసహితుండై హరి పాదంబులఁ బడి లేచి దేవాదిదేవా సర్వలోకశరణ్యా మదీయాపరాధంబులు క్షమింపుము.

నేను బ్రాహ్మణుండనై తపంబొనర్చియు నీ పరతత్త్వంబెఱుంగక దూషించి వ్యర్థుండనైతి నైనను నీవు దయాసముద్రుండవగుటచే నన్ను నరకకూపంబునఁ బడకుండ నుద్ధరించితివి. నావంటి విపరీతజ్ఞాను లెందఱీలోకంబునఁ బాడుగావలయునో తెలియలేను. నీపాదభక్తి నాహృదయంబునఁ బదిలంబుగా నిల్చునట్లనుగ్రహింపుమని వేడగా మధుసూదనుం డట్లగుంగాకయని కోరినవరంబులిచ్చి ద్వారవతికరిగెను. వెండియుఁ గృష్ణావతారకాలంబున నమ్మహాత్మునిఁ బరీక్షింపఁదలంచి బ్రహ్మదేవుఁడు గోవత్సార్భకుల దాఁచుటయు దేవేంద్రుఁడు రాలవానగురియుటయు రుద్రుండు బాణునిఁ గానందలంచి గోవిందునితో సమరంబొనర్చుటయు విపరీతజ్ఞానఫలంబని యెఱుంగుము. ఇది మిక్కిలి భగవదపచారము 1701

మఱియు శ్రీరామచంద్రుం డరణ్యంబున భూపుత్రిని వెదకుచు దుఃఖించుచుండఁ గైలాసముననుండు పార్వతి శివునింగాంచి నీవు సర్వజ్ఞుండవయ్యు మనుష్యమాత్రుండగు జ్ఞానశూన్యుండగు రాముని పరబ్రహ్మమని వక్కాణించితివి. నేనును సత్యంబని విశ్వసించితిని. సీతకై యిప్పు డెట్లు లేడ్చుచున్నాడో నిరీక్షింపుమన నప్పరమశివుండు మందహాసంబుతో గిరిపుత్రీ నీవిప్పు డతనిం బరీక్షించి రమ్మనఁగా నంతట దుర్గాదేవి వెడలి సీతారూపమును ధరించి రాఘవుండేగు త్రోవలో నొకలతాగృహంబున నిలిచి చెక్కిటఁ జేయిఁజేర్చి రామా రామాయని రోదనంబొనర్చుచుండె నటుపిమ్మట దాశరథి తదీయరూపంబు వీక్షించి శైలపుత్రీ నన్నుఁ బరీక్షింపఁదలఁచి వచ్చితివి కాని సమయంబుగాదు పొమ్మని మందలించె నంతట భవాని లజ్జించి లేచి కైలాసంబునకరిగి పినాకికి వృత్తాంతంబుఁ దెలిపి దేవా! రాముండు పరాత్పరుండని తెలిసికొంటిని సందేహంబు తీఱెననియె నంతట భవుండు కినిసి సంతోషింపక నాతల్లియగు సీతారూపంబు ధరించి భగవదపచారం బొనర్చితివి నిన్నిప్పుడు భార్యగాఁ బరిగ్రహింప వీలుగాదు.

ఈశరీరంబువిడిచి మఱుజన్మంబునఁ గలియఁగవచ్చునని చెప్పఁగాఁ బార్వతి దుఃఖించి రెండవ జన్మంబున ననేకవేల వర్షంబులు తపంబొనర్చి దోషంబు నివారించుకొని శివునింగలిసి సుఖించెను. 1702

సుశీలుఁడు

బ్రహ్మరుద్రేంద్రాదులును భవానియు భగవదపచారంబొనర్చుటచే నట్టియాపదలు పొందియుండఁగా నిప్పుడప్పునికిఁబూనిన సామాన్యులగతి యేమికావసియున్నదో! 1703

వరవరముని

ఆవిషయము సర్వకర్మఫలదాయకుండగు నారాయణునకే తెలియును మనము నిర్ణయింపఁజాలము. 1704

వెండియు నారాయణు నన్యదేవతలతో సరిగాఁ బోల్చుటయు భగవదర్చావతారంబును లోహంబనియెంచుటయు లక్ష్మిని సామాన్యస్త్రీగాను దిరుఃష్టాక్షమంత్రమును వాక్యసామాన్యముగాను దిరుమణిని మృత్సామాన్యముగాను శ్రీచూర్ణమును పసుపుసామాన్యముగానుఁ దలంచుట భగవదపచారమని యెఱుంగుము. భగవదపచారంబుచే ననేకు లనేకబాధల నొందిరి. 1705

## భాగవతాపచారము

సుశీలుఁడు

గురువర్యా! భాగవతులనఁగాఁ నెట్టివారో, భాగవతాపచారమనఁగా నెట్టిదో యెఱింగింపుము! 1706

వరవరముని

భగవంతుఁడను శబ్దము యోగముచేతను రూఢముచేతను షడ్గుణైశ్వర్యసంపన్నుండగు నారాయణునకుఁ జెల్లును. తక్కిన దేవతల

యందును మునులయందును ప్రశంసాపరముగానుండు ననఁగా నేతి హాసికాయ బెల్లముకొండవలెఁ బ్రసంగుననని భావము. కావుననే శ్రీకృష్ణుండు వచించిన గీతాశాస్త్రమునకు భగవద్గీతయను ప్రసిద్ధిగలిగెను. తక్కినగీతలకు సూర్యగీతలని శివగీతలని చెప్పినవారి పేరేవచ్చినది. భగవన్నామము విష్ణునిదేగనుక భాగవతులనఁగా విష్ణుభక్తులని యెఱుంగుము. భాగవతులకు శ్రీవైష్ణవులనియు నామధేయంబు గలదు. వాక్కుచే విష్ణునామోచ్చారణముచేయుచు విష్ణుప్రభావంబు వర్ణించి యితరులకుం జెప్పుచు మనస్సులో భగవద్దివ్యమంగళవిగ్రహంబు వర్ణింపుచు నకృత్యకరణ, కృత్యాకరణ, భగవదపచార, భాగవతాపచార, అసహ్యాపచారంబు లోనర్పక, దేవతాంతర, మంత్రాంతర, సాధనాంతర, ప్రయోజనాంతరంబుల రోసి కాలంబు గడపువారు భాగవతనామంబునకు లక్ష్యమౌదురు. భాగవతులు శరీర కైంకర్యంబునహో భగవంతునికే చేయవలయును. శ్రీసమేతుండగు విష్ణుదేవుని భక్తులందఱు శ్రీవైష్ణవు లనంబడుదురు. రామానుజ సంబంధులుకాని విష్ణుభక్తులందఱు వైష్ణవులగుదురేకాని శ్రీవైష్ణవులు కాఁజాలరు. ముందు నేనుచెప్పఁబోవు భాగవతవిషయంబంతయు రామానుజీయ వైష్ణవపరంబని యెఱుంగుము. 1707

సుశీలుఁడు

భాగవతాపచారంబెట్టిదో యెఱింగింపుఁడు. 1708

వరవరముని

జన్మపరిశీలనము, వయఃపరిశీలనము, దేహపరిశీలనము, అవయవ పరిశీలనము, వాసపరిశీలనము, ఆశ్రమపరిశీలనము, బంధుపరిశీలనము, వృత్తిపరిశీలనము మొదలైనవిచేసి తిరస్కరించుట భాగవతాపచారంబనంబడును. 1709

సుశీలుఁడు

ఒక్కొక్కదానికిఁ బ్రత్యేకముగా నర్థము సెలవిండు. 1710

## ప ర వ ర ము ని

జన్మపరిశీలనము:

అనఁగా భాగవతునిఁ గాంచినప్పుడు వానిజాతిని విచారింప గూడదు. విచారించి తెలుసుకొన్నను భగవత్సంబంధమునుఁబట్టి గౌర వింపవలయునే కాని కులమునుబట్టి తిరస్కరింపరాదు. స్పర్శవేధిచే నినుము బంగారమైనపిమ్మట నా బంగారము నినుముధరకుఁ గొనఁ జాలముగదా !

శ్లో॥ శూద్రంవా భగవద్భక్తం, నిషాదం శ్వపచంతథా
వీక్షతే జాతిసామాన్యా త్సయాతి నరకంనరః

భగవద్భక్తుఁడైన శూద్రునిఁగాని బోయనుగాని జండాలునిఁ గాని జాతిసామాన్యమునుఁబట్టి తిరస్కరించిన నరుఁడు నరకమును బొందును

శ్లో॥ నశూద్రా భగవద్భక్తాః, విప్రా భాగవతాస్స్మృతాః
సర్వవర్ణేషు తే శూద్రా, యేహ్యభక్తా జనార్దనే

భగవద్భక్తులు శూద్రులుకారు, విప్రులని భాగవతులని చెప్పఁ బడుచున్నారు. జనార్దనునియందు భక్తిలేనివారు సర్వవర్ణములవారుం దును శూద్రులగుచున్నారు.

శ్లో॥ యః పశ్యతి శుభాచారం, వైష్ణవం పీతకల్మషం
యస్మిన్ కస్మిన్ కులేజాతం, ప్రణమేద్దండవద్భువి

ఆచారవంతుఁడై కల్మషరహితుఁడైన వైష్ణవుం డేజాతివాఁడై నను వానికి దండవత్ప్రణామము చేయవలయునని యనేక శాస్త్ర ప్రమాణములు కలవు కనుకనే శాస్త్రవశ్యులగు యామునమునీంద్రు లొకానొక మాలవానిం జేరఁదీసి మారనేరి నంబియను పేరువెట్టి శ్రీవైష్ణవశిఖామణిం జేసి వారి చరమకైంకర్యమునకు బ్రాహ్మణోత్త

ములగు మహాపూర్ణులవారిని నియమించిరి. దానికి సహింపని బ్రాహ్మణపుంగవుల శ్రీరంగనాథుండు శిక్షించె నిదియిట్లుండఁగా రామానుజయోగీంద్రుడు విద్యాగురుండగు యాదవప్రకాశుని మతాంతరుండని నిరసించి బేరికోమటియగు కాంచీపూర్ణులు భగవద్భక్తుండగుటచే వారిని సేవించి తదీయోచ్ఛిష్టమును వాంఛించెను. వెండియుఁ బంచమయోనిసంభూతులకు యాదవాద్రి భగవదాలయములో సంవత్సరమునకు మూడుదినములు నిరాఘాటముగాఁ దీర్థ ప్రసాద స్వీకారమునకు భగవద్దర్శనావాప్తికిని బూర్ణాధికారమిచ్చెను. మాల మాదిగ చెంచు యేనాది నడ్డె యుప్పర్లు మొదలగువారికి వైష్ణవాచారంబు గలిగించెను. పాణియోగి నాళ్వారులలోఁ జేర్చి దేవాలయము లందుంచెను. శూద్రజాతీయదంపతులగు పొన్నాచ్చి ధనుర్దాసులను లోకపూజ్యులఁ గావించెను. దీనింబట్టి చూడఁగా జగద్గురువులగు యామున రామానుజాదులు శరీరులను జాతినిఁబట్టి తిరస్కరింపక భగవత్సంబంధమునుఁబట్టి గౌరవించిరి. అట్లుగౌరవింపక కులమునుఁ బట్టి నిరాకరించుట జన్మపరిశీలనాపచారము. 1711

వయఃపరిశీలనము:

అనఁగా బాలుండగు ప్రహ్లాదుండు భగవద్భక్తిచేఁ ద్రిలోకకంటకుండగు హిరణ్యకశిపుని జయించె నాఱేండ్లప్రాయంబుగల ధ్రువుండు వాసుదేవునిఁగూర్చి తపంబొనర్చి యాఱుమాసములలో నప్పురుషోత్తముని దర్శించి రాజ్యముసంపాదించి సవతితల్లియగు సురుచికి గర్వభంగంబొనర్చెంగావున భాగవతప్రభావం బత్యద్భుతంబైయుండు నట్టి భాగవతుని బాల్యంబునఁగాంచి వీఁడాఱేండ్లవాఁడేగదా వీఁడెనిమిదేండ్లవాఁడేగదాయని నిర్లక్ష్యంబుగాఁ దలంచి ఓరియని, రారాయని పిలుచుచు భగవద్భక్తినిఁబట్టి గౌరవింపక ప్రాయమునుఁబట్టి ధిక్కరించుట వయఃపరిశీలనాపచారము. 1712

దేహపరిశీలనము:

అనఁగా ననంతునిది సర్పశరీరము గరుడ జటాయువులది పక్షి శరీరము సుగ్రీవాంజనేయాదులది వానరశరీరము గజేంద్రునిది పశు శరీరముగదా యని నిరాకరింపక అనంతాళ్వారు గరుడాళ్వారు జటాయు మహారాజు సుగ్రీవమహారాజు ఆంజనేయులవారు గజేంద్రాళ్వార్లని మహాగౌరవదృష్టితోఁ జూడవలయు నట్లుచూడకపోవుట దేహపరిశీల నాపచారము. 1713

అవయవపరిశీలనము:

అనఁగా భాగవతులు పూర్వకర్మానుసారముగా భగవదిచ్ఛ ననుసరించి భిన్నావయవులుగా భూమియందవతరింతురు. అట్టివారిం గనినప్పుడు వీరుగ్రుడ్డివారని, గూనివారని, కుంటివారని నిందింపక భగవద్భక్తినిఁ బ్రధానముగాఁ దీసికొని వారిం బూజింపవలయు నట్లు పూజింపకపోవుట అవయవపరిశీలనాపచారము. 1814

వాసపరిశీలనము.

అనఁగా నొకానొకకుగ్రామమందుండు భాగవతునిఁ గాంచినప్పు డయ్యో! వీఁడు శ్రీరంగాది దివ్యక్షేత్రంబులందుండిన బాగుండు నీనికృష్టదేశమందుండి చెడిపోవుచున్నాఁడే యని వాపోవుట వాసపరిశీల నాపచారము. దీనికి లక్ష్యంబుగా నొక్క కథఁ జెప్పెద నాకర్ణింపు మెట్లంటివేనిఁ బూర్వము గరుడాళ్వారు కార్యార్థియగుచు గాలవుండను స్నేహితు నంసభాగంబున వహించి యస్తాద్రికేగి యచ్చటఁ దించి విహారంబు సలుపుచు నప్పర్వతంబున నొక్క పురంబుఁ గాంచె నప్పత్తనంబు పాషండజన నివాసంబై యుండె నన్నగర మధ్యంబున నొకకోటలో నిల్లుగట్టుకొని శాండిలినియను శూద్రస్త్రీ విష్ణుభక్తిఁ జేయుచుండె నైన దేయుం డమ్మహిళారత్నంబుఁ గాంచి దుఃఖించి యయ్యో! యీమె

నీపాపిష్ఠ స్థలంబున నుంచుటకన్న వైకుంఠంబునఁ జేర్చుట యుక్తంబని తలంచునంతలో గరుడుని ఱెక్కలుగాలె నప్పుడు గరుడ గాలవులు చేయునదిలేక దిగులుసెంది కొండగవిలోనుండు మునీంద్రు నొకని దర్శించి జరిగినవార్త నెఱింగించి యీవిపత్తునకు గారణంబేమని యడిగిరి. తదుపరి యమ్మహర్షి దీర్ఘముగా నాలోచించి పన్నగాశనుని నిరీక్షించి ఖగేశ్వరా! యిగ్గిరిపైనుండు శాండిలిని, మహాతపస్విని, భాగవతబృందములో మేలుబంతి, యామెవల్ల నప్పురంబుననుండు పాపంబు లేనాటికైన నెవ్వరైన నైష్ణవులగుదురేమోయని భగవంతు డాశాండిలి నచ్చోటనుంచె నామెకు మోక్షము కరతలామలకమైయున్నది. ఈపాపిష్ఠస్థలంబున నీమెనుంచఁగూడదని నీవు స్థలదూషణ చేసితివి. తదీయ నివాసంబు శ్వేతద్వీపతుల్యంబు. వాసనిరూపణము చేసినందున నీపక్షంబులు గాలెనని చెప్పఁగా విష్ణురథుండు శాండిలిని దర్శించి సల్లాపంబొనర్చి యపరాధక్షమాపణ చేసికొనఁగా మరల ఱెక్కలు మొలిచె నటుపిమ్మట నాగాంతకుండు గాలవునిఁగూడి యథేచ్ఛం జనియె. నిత్యసూరిప్రధానుండగు గరుడాళ్వారి నట్లొనర్చిన భాగవతాపచార దోషం బన్యుల దహింపకుండదుగదా! 1715

ఆశ్రమపరిశీలనము:

అనఁగా బ్రహ్మచారి, గృహస్థ వానప్రస్థ, సన్న్యాసంబులను నాలుగాశ్రమంబులయందును భాగవతులు గలరు. భాగవతులేయాశ్రమమందుండినను నాశ్రమ నిరూపణముచేసి దూషింపరా దెట్లంటివేని, బ్రహ్మచారింగాంచి వీఁడెంతభక్తుఁడైన నేమిలాభము వీనికిఁ బెండ్లామా, బిడ్డలా! గొడ్డువోతు ముండాకొడుకని కొందఱు దూషింతురు. గృహస్థు నీక్షించి వీను భార్యా పుత్ర పౌత్రాదులతో సకాముఁడై జీవింపుచున్నాఁడు. రాగ ద్వేషాదులు వీని కేనాటికి వదలవు. వీనిభక్తి యొకలెక్కలోనిది కాదని కొందఱు నిందింతురు. వానప్రస్థునిఁగాంచి

వీఁడు మానవుండై యుండియుఁ గందమూలాదులు నాకలంబులు దిని మృగంబువలె బ్రతుకుచున్నాడు. వీనికిఁ బుణ్యమున్నచో నాకులు దిను మేకలకుండదాయని కొందఱధిక్షేపింతురు. యతీశ్వరు నిరీక్షించి వీఁడు నిరాధారుఁడై పరకష్టార్జిత ధనంబుచే జీవింపుచున్నాడు. వీని భక్తి సార్థకంబు కాదని కొంద ఱాక్షేపింతురు. భాగవతు లేయాశ్రమంబున నుండినను భగవదనుగ్రహమే ముక్తి హేతువగుంగాని యాశ్రమ ధర్మంబు లట్టివికావు. కావున నాశ్రమ నిరూపణచేసి దూషింపరాదు. బ్రహ్మచారులగు భీష్మాంజనేయులును గృహస్థులగు ప్రహ్లాద బలి విభీషణాదులును నవధూతలగు సనకసనందనాదులును యతీశ్వరులగు నారద పరాశరాదులును ఆశ్రమధర్మముచేఁగాక విష్ణు భక్తిచేఁ బరమపవిత్రులై జగదాచార్యులైరి. కావున భాగవతుల నాశ్రమ నిరూపణముచేయక భగవత్సంబంధమునుఁబట్టి గౌరవింప వలయు నట్లుగౌరవింపకపోవుట ఆశ్రమపరిశీలనాపచారము. 1716

బంధుపరిశీలనము:

అనఁగా వీఁడు పడ్డకుఁడనికాని బావమఱఁదియనికాని తుదకు గుమారుఁడనికాని మఱియొక బంధువనికాని లోకసామాన్యభావముతోఁ జూడక దండవత్ప్రణామాదు లాచరించి సత్కరింపవలయు నట్టు సత్కరింపకపోవుట బంధుపరిశీలనాపచారము. 1717

వృత్తిపరిశీలనము:

అనఁగా బరమభక్తులగువారింగాంచి యితండు మహాదరిద్రుఁడు వీఁడు కూరగాయలమ్మి జీవింపుచున్నాడు వీఁడు పసులకడ సేవకుఁడై యున్నాడు వీఁడు నాగలిదున్ని బ్రతుకుచున్నాడని వృత్తి నిరూపణముచేసి దూషింపక భగవత్సంబంధమునుఁబట్టి పూజింపవలయు నట్లుపూజింపకపోవుట వృత్తిపరిశీలనాపచారము. 1718

బ్రాహ్మణుండై తపస్వియై బహుమంత్రసిద్ధిఁ బొందినదుర్వాసుం డంబరీషునకపకారంబు చేయఁదలంచి భగవన్నిగ్రహంబుచేఁ బరాభవంబుఁ జెందెను. మహాభాగవతులగు సనకసనందనులకు నపరాధంబు నర్చిజయవిజయులు రాక్షసయోనిం బుట్టి బలుబాములు బడిరి. పరమభాగవతుండును నిరంతరపరిచర్యాపరుండునగు సౌమిత్రిని దూషించుటం జేసియుఁ జెఱసాల బ్రాప్తించెననియు మరల రామానుగ్రహంబుచేఁ దొలంగించుకొని రామప్రాప్తినిఁ గాంచెననియు భూపుత్రి లోకంబునకు బోధించెను. రామలక్ష్మణులు సుగ్రీవనివాసంబున కేగినప్పుడు రవిసుతుండు రామునిసన్మానించి లక్ష్మణునవమానించినందున మొదటిసారి వాలిచే దెబ్బలుదిని విఫలమనోరథుండయ్యెను. రావణుండు జటాయువును సంహరించి సీతాదేవినిఁ జెఱఁ గొనుంచి విభీషణుని దూషించి తన్ని వెడలఁగొట్టెను. దశముఖుండిన్ని భాగవతాపచారంబు లొనర్చుటచే విరించి వరదత్తప్రభావంబును నవకోటి శివలింగ పూజాఫలంబును నశింపఁగాఁ బుత్ర మిత్ర పౌత్రాదులతో నేకకాలంబున మరణించె. హిరణ్యకశిపుండు ప్రహ్లాదుని బాధించి తదీయ భాగవతాపచార దోషంబుచేఁ నృసింహరూపుండగు హరిచే మడిసె. శకుని కర్ణ దుర్యోధన దుశ్శాసనాదులు బాల్యప్రభృతి మహాభాగవతులగు పాండవుల వేధించి తుదకు భగవంతుండగు శ్రీకృష్ణుని నిరాకరించి భగవద్భాగవతాపచారంబులచే ఇహపరదూరులై చచ్చి దుష్కీర్తి భాజనులైరి. 1710

ఇదియిట్లుండఁగా నొకానొక కాలంబున శ్రీరంగములో వైకుంఠోత్సవంబు జరుగుచుండగాఁ బరమభాగవత శిఖామణియగు కూరత్తాళ్వారు దేవాలయంబునఁ గలయంపి చల్లుచుండఁగా నాజలంబు దైన

వశంబున నొక వైష్ణవయువకుని మీఁదఁబడెను నింతలో శ్రీవత్సాంక మిశ్రు లయ్యువకుంగాంచి మిమ్ముఁలఁజూడక చేసిన యపరాధంబు సహింపుఁడని ప్రార్థించెను. కాని యయ్యువకుండు సమ్మతింపక కూర కులోత్తమునిఁ బరుష వాక్యంబులచే ధిక్కరించి తదీయ పాపంబుచేఁ జచ్చి యమలోకంబునకేఁగ నంతట నతనింగాంచి సమవర్తి యిట్ల నియె నోరి దురాత్మా! భగవత్ప్రాణపదంబగు శ్రీవత్సాంకమిశ్రుల దూషితి వక్కారణంబున నీకీలోకంబున డెబ్బదిరెండువేల నరకంబుల యందును జోటులేదు నీపాపం బీనరకానుభవమునకు మించియున్నది నాకేమియుం దోఁచలేదు మరల భూలోకంబునకుఁబొమ్ము శ్రీరంగ రాజస్వామివారు విచారింతురని పనిచె నంత నాజీవుండు సూక్ష్మ శరీరంబుతో స్వకీయ గృహంబునకువచ్చి చూడఁగా ముక్తపూర్వ కళేబరంబు దహింపఁబడెను నంతట నాజీవి దుఃఖించి సకాలలబ్ధం బగు మృత కపోత దేహంబునఁ బ్రవేశించి రామానుజాది యోగిజన మధ్యంబున సుఖాసీనుండగు కూరేశుని పాదంబులఁబడెను నంత నాసూరివర్యుండు త్రోసివేయుచుండఁగా మరల దిరిగి పాదంబులఁబడు చుండె దానింగని సర్వజ్ఞులగు రామానుజులవారు కూరేశునితో మహాత్మా! కపోతంబునుఁ ద్రోసిపుచ్చక తప్పుక్షమించితినని ముమ్మా ఱుచ్చరింపుమన వారలట్లుగావించునంతలో గగనంబున నొక్క పుణ్య కోటివిమానంబు సాక్షాత్కరించె దానియందొక్క ముక్తపురుషుండు కూర్చుండి యచ్చటనున్నవారితో సుధీమణులారా! నావృత్తాంతంబు వినుఁడు, నిన్నటిదినంబునఁ గూరేశుని దూషించి తదీయపాపంబుచే యమలోకంబునకరుగ నయ్యముండు నన్నుఁగాంచి దుష్టాత్మా పరమ భాగవతాపచారంబుచే నాయువు నశింపఁగా నీలోకంబునకు వచ్చితివి.

ఇచ్చటి నరకంబులు నీపాపంబునకుఁ జాలకున్నవి. తిరిగి భూలోకంబునకుఁ బొమ్మనఁగా వచ్చితినిగాని పూర్వదేహంబు కాల్పఁబడినందున మృతకపోత శరీరధారినై కూరేశుని పాదంబులంబడియు సర్వజ్ఞులగు రామానుజులవారి దయచేతఁ గూరత్తాళ్వారి పాదస్పర్శమువల్లఁ బునితుండనై నిత్యవిభూతి కరుగుచుంటినని యదృశ్యుండయ్యెను. భాగవతాపచారంబుచే దుర్గతిఁజెందిన జీవుండు భాగవతానుగ్రహంబుచే ముక్తుండయ్యెను. తదీయ వృత్తాంతంబు వినినవారంద అత్యంతాశ్చర్యమగ్నులై కూరేశ రామానుజ ప్రభావంబును వేనోళ్ళంగొనియాడిరి.

మఱియు రామానుజయోగీంద్రులు దర్శనస్థాపకులై యుండు కాలంబునఁ జోళదేశములో నొకదురాత్ముండుజన్మించి సప్తవర్షప్రాయంబునఁ బ్రభుత్వము వహించి తనరాజ్యంబునఁ బాషండమతంబు ప్రవర్తింపఁజేసి వైదికశిఖామణులగు వైష్ణవులదండించి తదీయ జీవనధనంబు లపహరించి తిరుమణిశ్రీచూర్ణధారులకుఁ బన్నువైచి నారాయణపరత్వంబును దూషించి వైష్ణవసిద్ధాంత పరిపాలకులగు మహాపూర్ణుల కన్నులుడీయించి కూరత్తాళ్వారిని దండించి యేతద్వృజినంబుచేఁ గంఠంబునఁ బురుగులువడఁగాఁ జోళభూపాలుండు మురిగి చచ్చెను. తదుపరి పెరియనంబిగారు పరమపదంబునకరిగిరి, రామానుజ ప్రార్థనచే వరదరాజస్వామివారు కూరేశునకుఁ గన్నులొసంగిరి. భక్తాపచారము మహాక్రూరమైనది. భాగవతాపచారపాపాగ్నిచేఁ జేతనుండు కాలినగుడ్డవలె నగును.తరువాత భగవన్నిగ్రహవాయువుచేఁ జల్లాచెదురగును, ఇది సత్యంబు కావున నీవెన్నఁడును భక్తాపరాధంబుఁ జలుపక యట్టివారు లభించినప్పుడు మజ్జన భోజన శయ్యాసనాదుల వారినాద

రించి పూజింపుము. రాజునకుఁ గానుకలిచ్చుటకంటె రాజసముఖం బునఁ దదీయపుత్రుని సత్కరించినచో రాజుగారానందించునట్లు భాగవత సత్కారంబుచే భగవంతుఁడు సంతోషించును సందేహములేదు.

**గద్యము:** ఇది శ్రీ సీతావల్లభ ప్రసాద సమాసాదిత కవితాప్రవీణ
వేదాల సీతారామాచార్య కృపాలబ్ధ మంత్ర రత్నానుసంధాన
పవిత్రాంతరంగ నిఖిల దుర్మత శిలోచ్చయ దంభోళి భూత
సముద్రాల లక్ష్మణాచార్యానుగ్రహాబోధిత విశిష్టాద్వైత
రహస్యార్థ ధురంధర శఠగోపయతిరాడ్వర వరయోగి
ప్రభృతి పూర్వాచార్య చరణ సరోజ భ్రమ
రాయమాన కృష్ణమాంబా కృష్ణార్య తనూజ
శ్రీవైష్ణవవిధేయ వేంకటదాస నామధేయ
ప్రణీతంబైన జ్ఞానసూర్యోదయము
నందు చతుర్థ భాగము
సంపూర్ణము

శ్రీమతే రామానుజాయ నమః

# జ్ఞానసూర్యోదయము

## పంచమ భాగ ప్రారంభము

### అనుష్ఠానావశ్యకము

వరవరముని

పుత్రా ! వైష్ణవుండైనవాఁడు జ్ఞానానుష్ఠానంబులను రెండు ఱెక్కలు సంపాదించి యా పక్షములతో నెగిరి పరమపదంబు జేరవలెను.

సుశీలుఁడు

జ్ఞానానుష్ఠానంబులనఁగా నర్థమేమి ?

వరవరముని

అర్థపంచకజ్ఞానము, తత్త్వత్రయజ్ఞానము లెస్సగా సంపాదించి మంత్రాంతర సాధనాంతర ప్రయోజనాంతర దేవతాంతరంబులవర్జించి సర్వేశ్వరుండును సర్వశక్తుండును సర్వనియంతయు సర్వాంతర్యామియు సర్వదేవతా సార్వభౌముండునగు శ్రీమన్నారాయణుని గుణానుభవ కైంకర్యంబులొనర్చుచుండినచో వైష్ణవుండు పరమపదంబుఁ జెందు నితర కార్యములయందు నితర వ్యవహారంబులయందుఁ జేరుటకు మనస్సున కెడమీయఁగూడదు.

సుశీలుఁడు

సుమవర్యా! యిప్పటివారుకొందఱు తేలి చెప్పుచున్నారనఁగా పంచసంస్కారసహితుఁడై వైష్ణవము పుచ్చుకొని యొక్కసారి మానసిక ప్రపత్తి చేసినచో మోక్షముగలుగుననియు జపము తపము దీపారాధనము భజనము మొదలైనవి సాధనాంతరములనియుఁ జెప్పుచుఁ దృష్టిగాఁ బోసేసి వ్యవహారకార్యమగ్నులగుచుఁ జీట్లపేక లాడుచు సినిమాలకుఁ బోవుచు డ్రామాలు నిరీక్షింపుచు వన్నెలాడుల నెన్నుచుఁ మన్నీడుల నుతింపుచు ధనవంతులంగొనియాడుచు నర్థపరాయణులై భోగలాలసులై విఱ్ఱవీగుచున్నారు ఇంతేకాక, 1

సీ॥ సరసిజాక్షుని కథాశ్రవణంబునకుఁ బిల్వ
వాంఛతోఁ జనుదెంచువారు లేక
రామకీర్తనఁ జేయరమ్మంచు యాచింప
సాయమొనర్చు సజ్జనులు లేక
దనుజారి దర్శనంబునకుఁ బోవుదమన్న
దేవళంబెనయు సాత్వికులు లేక
నలినాక్షు గుణవర్ణనంబు చేయుదమన్నఁ
దోడుగావచ్చు సాధువులు లేక
జగము శూన్యమైనచందానఁ బాపభూ
యిష్ఠమై చెలంగ నిట్టిచోట
నిలిచియుండునెట్లు నిలువక యెచ్చోటి
కేగవచ్చుఁ జెప్పవే గుణాఢ్య. 2

వ॥ పూర్వము రాత్రికాలంబున ననేకు లొక్కచోటఁ జేరి భారతభాగవత రామాయణాది సద్గ్రంథంబులు పండితులచే వీధిపురాణముగాఁ జెప్పించి వినుచుందురు. కొందఱు జ్ఞానులు కాకున్నను రామన్న రాముఁడోయి రామగోవిందాయని సహజముగా భయభక్తి

విశ్వాసములతో హరిభజన మొనర్చుచుందురు. మెండియు రామ దండను నామముతో జనసహస్రంబులు సమాజములుగా బయలు దేఱి ప్రతిగ్రామము దిరిగి రామభజన మొనర్చెడువారు. ఇవియెల్ల నసు గంటిపోయినవి సరేగదా మనవైష్ణవులుసహా పంచసంస్కారమాత్రం బున మోక్షంబు సిద్ధించునని చెప్పుచు నాస్తికులభంగి ననుష్ఠానరహితులై యున్నారు యిది మంచిమార్గమేనా ? 3

పరవపము ని

అది మంచిమార్గమని జ్ఞాను లెవ్వరును వచింపరు. 4

సీ॥ జాహ్నవిదరిఁజేరి జలముఁగాంచినయంత
దీరునే దాహ మెవ్వారికైన
రామకగుణము నాగసి యొఱుంగుటచేత
సమయునే మర్త్యుని జఠరశూల
భక్ష్య భోజ్యాదు లేర్పడ నిరీక్షింపంగ
నడఁగునే క్షుత్తు తదాతురునకు
ధనవంతులగువారి దర్పంబు వినినచో
నిరుపేదకబ్బునే పురుధనంబు

లట్లె పేరికి వైష్ణవుండై మురారి
పాదసేవమొనర్పక పందిరీతిఁ
దిని వలీముఖమట్లు వర్తించువాని
కబ్బునే మోక్ష మేజన్మమందునైన. 5

సీ॥ తగినవప్రమున విత్తనము వేసినఁగాని
పండునే పైరు కాపాడకున్నఁ
బాఠశాలకుఁబోయి పదివాళ్ళు చదువంగఁ
బాండిత్యమబ్బునే బాలకునకు

వెసఁ బాత్రశోధించి వెసరు వెట్టినయంత
సమరుసేబున్న బియ్యంబులేక
పప్పుల నగ్నిహోత్రమును నిరీక్షింప
సమయునే వడకించు శైత్యబాధ

తద్విధంబున వైష్ణవత్వము వహించి
లౌకికక్రియలందు నుల్లంబుఁ జేర్చి
కూర్మి శ్రీరామ కల్యాణగుణగణాను 6
భవ మొనర్పని వాడెట్లు పరముఁగాంచు

సీ॥ ఏడహోరాత్రంబు లిందిరావరుగాథ
లాలించి యుత్తరాబాలకుండు
వేయేండ్లు హరినామ రసంబు విడువక
నల్లించి మదదంతి వల్లభుండు
రామనామంబు విరామంబులేక య
ర్నిలిమై జపించి వల్మీకభవుఁడు
సత్రయాగమున వేసంవత్సరములు కే
శవ కథలాలించి శౌనకాది

మునులు భగవత్కటాక్షంబుఁగనిరిగాని 7
తిండిదిని మృదుశయ్యపైఁబండి రేపు
మాపు శబ్దాదివిషయముల్ మరగువార
లందనేర్తురె గరుడధ్వజానుకంప.

సీ॥ శుకయోగిచందాన శ్రోతలసమకూర్చి
శ్రీకృష్ణకథలు వచింపవలయు
బాదరాయణిరీతి భగవత్ప్రభావ సం
స్థిత కావ్యములను రచింపవలయు

నారదుభంగి శ్రీనారాయణశ్లోక
గానంబుచే పాడఁగడపవలయు
సనకాదులట్లు శ్రీజానిపాదంబులు
నిశ్చలభక్తి ధ్యానింపవలయు
సన్నిగతులనైన నందున నొక్కొక్క
పగిదినైన రామభద్రుసేవఁ
జేయవలయుఁగాని శ్రీవైష్ణవుఁడు వృథా
పుచ్చరాదు కాల మిచ్చగించి.

సీ॥ రహి తింత్రిణీ కోటరమునందు యోగియై ౮
కేశవు ధ్యానింపడే శఠారి
తనకంటె కెవరుదోచిన మాధవుండని
నతులొనర్చి నుతించె నాథమౌని
శిష్యుల కెడలేక శ్రీరామమహిమంబు
లానతిచ్చి భజించె యామునముని
బద్ధజీవులను శ్రీపతిఁజేర్చు పనియందు
నవధిలేదయ్యె రామానుజులకుఁ
బూని కూరపతి యనూనద్వయాను సం
ధాన నిరతుఁడయ్యెఁ గానదీని
నెఱిఁగి వైష్ణవుఁడు రమేశుని సేవచే
జరుపవలయు బ్రతుకుసమయ మెల్ల.

సీ॥ ఆఱువేలేండ్లు ఘనాష్టాక్షరీమంత్ర ౯
జపముచేసెను భక్తి సారయోగి
సుమమాలికలచే నసురవైరి మెప్పించె
ననవరతము పెరియాళ్వారు

శ్రీరంగ కైంకర్య సిద్ధిచే నుప్పొంగ
గాఁ జేసె హరిఁ బరకాలమౌని
విషయసౌఖ్యంబెల్ల విడిచి పంకజనాభు
భజనంబొనర్చడే పాణయోగి
వారలట్లొనర్చి వారిజాతాక్షుని
కరుణఁజెందియుండ నరులు విష్ణు
చిహ్నధారణంబు చేసినమాత్రాన
నందగలరె ముక్తి మందమతులు. 10

సుశీలుఁడు

స్వామీ! ఖట్వాంగరాజు రెండు గడియలుమాత్రమే హరి భజనంబొనర్చి ముక్తిఁజెందెనని వినుచున్నాము. అజామిళుండు ముమ్మాఱు నారాయణనామ ముచ్చరించి కృతార్థుండయ్యె. మనము నిరంతరము భగవన్నామ ముచ్చరించినంగాని మోక్షమురాదని చెప్పుచుంటిరి కారణంబేమి? 11

వరవరముని

ఖట్వాంగరాజు రెండుగడియలలో ముక్తిఁజెందుటకుఁ గారణ మున్న దెట్లంటివేనిఁ జఠమకాలంబున నబ్జాభపతి భగవన్మహిమంబు పెద్దలవల్ల విని, 12

సీ॥ వాయువేగముగల వాహనంబుల మహీ
ధరములఁబోలు దంతావళముల
ధన వస్త్ర మాణిక్య కనక రూప్య క్షేత్ర
ముఖ పదార్థంబులిమ్ముల ధరాసు
రానీకములకుఁ గృష్ణార్పణంబుగనిచ్చి
బహుధనంబులు వనీపకుల కొసఁగి

నిరుపేదలగువారి కరసి విత్తమొసంగి
          చీకుచింతల సంతసింపఁజేసి
తత్ఫలంబులెల్ల దైత్యారికర్పించి
యితరవాంఛలెల్ల నిరసించి
రాజ్యభోగముల విరాగంబుఁ గైకొని
చరమకాలమందు సంగమేడి. 13

వ॥ త్రికరణంబుల నేకీభవింపఁజేసి గాఢభక్తితో మధువైరి నారాధించెను. పైనఁజెప్పిన ధనవ్యయ మంతయుఁ గైంకర్యముగాఁ బరిణమించె నింతియేకాక,

శ్లో॥ అంతకాలేచ మామేవ, స్మరన్ముక్త్వా కళేబరమ్
     యః ప్రయాతి స మద్భావం, యాతి నాస్త్యత్ర సంశయః

అంత్యకాలమున నన్ను స్మరింపుచు నెవ్వఁడు కళేబరంబు విడుచునో వాఁడు నాస్వభావమునుఁబొందు నిందులకు సంశయము లేదని భగవంతుఁడు గీతయందుఁ జెప్పియుండుటచేత ఖట్వాంగునకు నంత్యకాలమునఁజేసిన భగవత్కైంకర్యములవల్లను నంతిమ స్మృతివల్లను మోక్షము సిద్ధించెను. కాని యజామిళుఁడు నారాయణ నామోచ్చారణముచే నప్పటి యమదండనముమాత్రము తప్పించుకొని తదుపరి గంగాతీరంబునకేగి నూఱేండ్లు హరింగూర్చి తపంబొనర్చి యపవర్గంబుఁ బ్రాపించె నదియట్లుండఁగా శాస్త్రప్రమాణంబుల నాధారముచేసికొని భక్తుండగువాఁడు దినమునకు రెండుమాఱులుమాత్రము భగవంతునిఁ దలంచి యూరక తినుచుండుట కెట్లున్నదనఁగా నొకం డిల్లుగట్టవలయునని పునాదులు త్రవ్వింపుచుండఁగా నదివఱకెవ్వరో పూడ్చియుంచిన తూమెడు వరహాలుగల బిందె దొరకినందున నతండు ధనవంతుఁడయ్యెను. దానింగని యూరివారు కొందఱు ధనార్జనవృత్తులన్నియు మాని దొడ్లయందుఁ దోఁటలయందు గృహంబులయందుఁ ద్రవ్వఁద్రొ

ధనంబుగానక న్యర్థులెరల్లే ఖట్వాంగు నుపమానముగాఁగొని సోమరు లైన ముముక్షువులు వ్యర్థులౌదురు. మఱియు,

శ్లో॥ నియతం కురు కర్మ త్వం, కర్మ జ్యాయో హ్యకర్మణః
శరీరయాత్రాపిచతే, నప్రసిద్ధేదకర్మణః

అర్జునా! నియమింపఁబడిన పనిని చేయుము. ఏపనియుఁ జేయని వానికి శరీరయాత్రకూడ సిద్ధింపదనియు,

శ్లో॥ నహికశ్చిత్ క్షణమపిజాతుతిష్ఠత్యకర్మకృత్
కార్యతే హ్యవశఃకర్మ సర్వఃప్రకృతిజైర్గుణైః

అర్జునా! యెుక్కఁడైనను క్షణమైన నొకప్పుడైనను పనిచేయని వాఁడు లేడు. ప్రకృతిసంబంధమగు గుణములచేఁ బ్రేరింపఁబడి నిరంతరము చేతనుఁడు పనులొనర్చుచున్నాడని భగవానుఁడు చెప్పెను గనుక యెుప్పుడు నెడతెగక పనులుచేయుచుండు మానవుండు భగవత్కార్యము లొనర్చుట శ్రేయస్కరముగదా! 13

సుశీలుఁడు

దేవా! బుభుక్షు వెవవాఁడే ముముక్షువగుచున్నాడు. సర్వకాలము భగవంతునిపనియందుండువానికి నన్నపానాదులెట్లు జరుగును?

వరవరముని

నీవడిగినప్రశ్నమునకు సమాధానముగా,

శ్లో॥ అనన్యాశ్చింతయంతో మాం, యే జనాఃపర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం, యోగక్షేమం వహామ్యహమ్

ఇతరచింతలులేనివారై యేజనులు నన్ను లెస్సగా నుపాసింపుచున్నారో యట్టి నాతో నిత్యసంబంధముగలవారి యోగక్షేమములను వహింపుచున్నానని శ్రీకృష్ణుఁడు వచించెను. 15

సుశీలుఁడు

యోగ క్షేమములనఁగా నర్థమేమి ? 16

వరవరముని

బ్రతికినకాలములో భక్తునకు లేని జీవనధనంబు లిచ్చుట యోగము, వాని నితరుల కందకుండఁగాపాడుట క్షేమము, జీవుండు దేహము వదలినపిమ్మట మోక్షమిచ్చుట యోగము, పునరావృత్తి లేకుండఁ గాపాడుట క్షేమము. ఇవిరెండు భగవంతుఁ డనన్యభక్తులకు నిచ్చును. దేవతాంతర ప్రయోజనాంతర సాధనాంతరపరుల కీయఁడు.

సుశీలుఁడు

మీరు చెప్పినది నిశ్చయమైనను గావచ్చును గాని యొక్కసందియంబు నన్ను బాధింపుచున్నది.

సీ॥ ఎసరుపెట్టి జలంబు మసలఁగ్రాఁగినవేళఁ
దంపులాల్వేయునే దైత్యవైరి
దుగ్ధంబుగాచునే తోడువేయునె దధి
మజ్జిగఁజేయునే మధువిరోధి
సూపంబుమెదపునే సురుచిరశాకము
ల్పచ్చళ్లుచేయునే లచ్చిమగఁడు
విస్తళ్లుగుట్టునే వివిధపదార్థము
లొడ్డించునే పచ్చనల్వదారి
నిత్యకృత్యములను నెరవేర్చి హరిని భ
జింపవలయునో యశేషకార్య
ములను మాని కొల్వవలయునో నాకెఱిం
గింపుమయ్య భూరికీర్తిధుర్య. 18

పరపరముని

నీవిప్పుడడిగిన ప్రశ్నంబులు పరిహాసాస్పదంబులు నిరర్థకంబులైనను సమాధానమిచ్చెద మన కసాధ్యమైనపని గోవిందునిపైఁ బెట్టవలయుంగాని సాధ్యమైన దేహసంస్కారాదులు మనమేచేసికొనవలయునుగాని పురుషోత్తమునిపై మోపుట భగవదపచార మది యట్లుండఁగా,

శ్లో॥ శతంవిహాయ భోక్తవ్యం. సహస్రం స్నానమాచరేత్
లక్షం విహాయదాతవ్యం, కోటింహిత్వా హరిం భజేత్

అనఁగా నూఱుపనులువిడిచి భోజేయవలెను, సహస్రమువిడిచి స్నానమాచరింపవలెను, లక్షవిడిచి దానముచేయవలెను, కోటిపనులు విడిచి హరిని భజింపవలెనని యున్నదిగనుక యెన్నిపనులైన విడిచి రాముని భజించినచో మనకార్యములన్నియు నతండు సంకల్పమాత్రమున నెఱవేర్చును. వైష్ణవుండు ప్రాణధారణోపయోగ పదార్థంబులు సంపాదింపవలసిన దేకాని భోగలాలసుఁడు గాఁబనికిరాదు. ఈతుచ్ఛభోగంబు లాసించినవానికి విష్ణునియందు మనంబునిల్వదు. అట్టిపాపికిఁ బరలోకసౌఖ్యంబురాదు. మరలమరల నరకాదులను క్రిమి కీటకాది నికృష్ట జన్మపరంపరలనుం బొందును. లౌకికకార్యంబు లెడతెగక చేయువానికి మహా ప్రయాసఁ గలిగించును. ఫలకాలమందుఁ గొంచెము సుఖమును మిక్కిలి దుఃఖమునుఁ గలిగించు. లౌకికపదార్థములెల్ల నితరాధీనమై ధనసాధ్యమైయుండును. కేశవభజనం బట్టిదిగాక చేసినకొలంది యత్నకాలమందే సుఖమునిచ్చి ఫలకాలమందు శాశ్వతానందమునిచ్చును. 19

చ॥ కలఁగినవేళ రోగములు క్రమ్మిననాఁడు విపత్తులెన్నియో
మలసినసావి నింటికడ, మార్గమునందు వనంబులందుఁ బె
ల్లలసినవేళ డీలుపడునప్పుడు వాక్కుననిల్చి పాపముల్
తొలచి సుఖంబులిచ్చునది, తోయజనాభుని నామమేకదా. 20

మ॥ హరి కానంబడకున్న దాసులకుఁ బ్రత్యక్షంబుగాఁ దోఁచి కా
పరియై ధీరతరమై సుధాసదృశమై, బంధూత్కరంబై మహా
త్తర సంతోష నిధానమై వెలయుఁగా, దా కృష్ణ గోవింద భూ
ధరరామాచ్యుత వాసుదేవ యను నా ధన్యాత్మ నామంబులే.

ఉ॥ దాశరథీ ముకుంద నర,దా జగదీశ్వర శంకజేతరా
కేశవ వాసుదేవయని, కీర్తనఁజేయఁ దదీయ నామముల్
పాశములై జనార్దనుని, భక్తుని చెంగట బ్రిచ్చి తెచ్చు దం
తీశుని గాథవిన్న నిది, యెంతయుఁ దెల్లమగున్ గుమారకా. 22

మ॥ అల భీష్మాదుల ధిక్కరించి పతులం, దాసక్తి వర్జించి గొం
గల లెక్కింపక యాజ్ఞసేసి ముఁజ, త్కంద్రమాఖ్య వల్లింప న
జ్జలజాక్షాహ్వయశక్తిచే విమలవస్త్రంబుల్ సహస్రంబులై
వెలసెన్ ద్రోవదిమేనఁ జెప్పఁదరమే, విష్ణ్వాహ్వయోత్కర్షముల్.

వ॥ వెండియు,

శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం, సఖ్యమాత్మ నివేదనం

అనఁగా శరీరియగువాఁడు విష్ణుదేవుని కథలనవరతము వినుట, కీర్తించుట, పదేపదే స్మరించుట, పాదసేవ చేయుట, పూజించుట, సాష్టాంగ నమస్కారము లొనర్చుట, దేవాలయాదులయందు భగవద్దాస్య మొనర్చుట భగవంతునితో స్నేహము చేయుట, ఆత్మసమర్పణము నను తొమ్మిదివిధములైన భక్తి చేయవలయునని ప్రహ్లాదాళ్వారు తీర్మానించిరి. 24

శ్లో॥ మద్భక్తజనవాత్సల్యం, పూజాయాంచానుమోదనం
స్వయమభ్యర్చనంచైవ, మదర్థే దంభవర్జనమ్

యత్ర కథాశ్రవణే భక్తిః, స్వాంగ నేత్రాంగ విక్రియా
మమానుస్మరణం నిత్యం, యచ్చమానోపజీవతి
స విప్రేంద్రో ముని శ్శ్రీమాన్, స యతిస్సచ పండితః
నమే పూజ్యశ్చతుర్వేదీ, పూజయ న్భక్తివర్జితః
సమేపూజ్యస్సదాచాసౌ, మద్భక్తః శ్వపచోపియః
తస్మై న్నదేయం తతోగ్రాహ్యం సచ పూజ్యో యథాహ్యహమ్

నాభక్తులయందు వాత్సల్యముగలవాడగుట యితరులు నాకుఁ జేయు పూజకు ననుమోదించుట, తాను స్వయముగా నన్నుఁబూజించుట, నన్ను సేవించువిషయములో లోకాభిమాన దేహాభిమానము లతోఁగూడిన డంభమును వర్జించుట. మదీయకథ లత్యంతప్రీతితో నాకర్ణించుట. తత్సమయంబున గద్గదస్వరము రోమాంచము శిరః కంపము గలిగియుండుట, తైలధారావద విచ్ఛిన్నస్మృతి నాయందుఁ గలిగియుండుట, నన్నువిడిచి బ్రతుకలేకపోవుట—ఈ యెనిమిదివిధము లైన భక్తిగలవాడెట్టివాఁడైనను వాడే విప్రశ్రేష్ఠుఁడు వాఁడే ముని వాఁడే యతి వాఁడే పండితుఁడు చతుర్వేదములు తెలిసిన విప్రుడైనను నాయందు భక్తిలేనివాఁడు పూజ్యుఁడుకాఁడు. పైఁజెప్పిన యష్టవిధ భక్తులు గలవాఁడు కుక్కనుదిను చండాలుఁడైనను పూజ్యుఁడు వాని కీయవచ్చును వానివల్లగ్రహింపవచ్చునని సాక్షాద్భగవంతుఁడు వచించి యున్నాడు. పైశ్లోకములచేఁ దేలిన విషయమేమనఁగా భక్తుఁడైనవా డెడతెగక కేశవుని భజింపవలయుననియు నట్లు భజించువాఁడే ధన్యుఁ డనియు నట్లుభజించువానికి నవవిధమార్గములుగలవని ప్రహ్లాదుండును అష్టవిధమార్గములుగలవని భగవంతుండును చెప్పిరి. కాని యిన్నివిధము లైన భక్తులలో దేనినిఁజేయనివాఁ డుత్తమకులజుండైన నధముం డని విష్ణువు వచించెను.

సుశీలుఁడు

దేవా! అష్టవిధభక్తు లటుండనిచ్చి ప్రహ్లాదులవారు వచించిన వివిధభక్తు లాచరించినవా రెవ్వరైనఁగలరేమో తెలుపుఁడు. 26

వరవరముని

భగవంతుఁడు వచించిన యష్టవిధభక్తులు నవవిధభక్తులలో నంతర్భూతములై యున్నవిగనుక నవవిధభక్తిమార్గంబు లుదాహరణంబులతోఁ దెలిపెద నాకర్ణింపుము. శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము అనునవిగదా నవవిధభక్తులు. వాని గాథాంబుఁజూపెద సావధానుండవగుము. తొలుతొల్త నయోధ్యాపురవాసులు కుశలవులచే రామాయణం బాకర్ణించిరి. పరీక్షిన్మహారాజు శుకునిచే భాగవతంబును జనమేజయుండు వైశంపాయనునిచే భారతంబును నాకర్ణించిరి. ఇది శ్రవణభక్తి. తుంబుర నారదాదులును గంధర్వులలోఁ గొందఱును గీర్తనచే విష్ణువను ముదంబుఁగూర్చిరి. ఇదికీర్తనభక్తి. స్మరణమనఁగా నొకవస్తువునందు మనస్సులయింపఁగా నితరము మఱచి మనస్సునందుఁగలదాని నెడతెగక తలంచుట. శూర్పణఖ జనస్థానంబున రామునింగాంచి మోహించి ఫలంబుగానక నాసాకర్ణములు పోగొట్టుకొనియు యావజ్జీవము రామాంగ సౌందర్య ప్రవాహనిమగ్న గాఢమోహంబుచే దానవదేహంబు విడిచి ద్వితీయ జన్మంబునఁ గంసదాసియై జనించి పూర్వసంస్కారంబుచే శ్రీకృష్ణునిఁబొంది సుఖించెను. మారీచ కంస శిశుపాలురు భయంబుచేతను ద్వేషముచేతను నిరంతరము గోవిందునిఁ దలంపుచుండిరి. ఇది స్మరణభక్తి. రుక్మిణీ సత్యభామా ప్రభృత్యష్టభార్యలును షోడశ సహస్రాంగనలును వల్లవీసంఘంబును భగవంతునకు సంభోగసుఖ మిచ్చుటగాక పాదసంవాహనాదు లొనరించిరి. ఇది పాదసేవనభక్తి. బహులాశ్వశ్రుతదేవ విదురాక్రూరోద్ధవాదులు మజ్జన భోజన శయ్యాసనాదులచే

లెస్సగా హరింబూజించిరి. ఇది అర్చనభక్తి. హరిభక్తులును మహాత్ములు దేవతలు బ్రహ్మ రుద్రాదులు సాష్టాంగనమస్కారము చేయువారే కనుక ఇది వందనభక్తి. దాస్యమన్నను కైంకర్యమన్న నొక్కటియే. యట్టి భగవత్కైంకర్యంబునందు లక్ష్మణస్వామివారగ్రేసరులు ద్వితీయు లాంజనేయులవారు నింక ననేకులుగలరు. ఇది దాస్యభక్తి. ముకుందునితోఁ బాండవులు సర్వవిధ సఖ్యంబొనర్చి తదాజ్ఞను శిరసావహించి సేవించిరి. ఇది సఖ్యభక్తి. భరతస్వామి రామపారతంత్ర్యము వహించి దేహసంస్కారముసహా మాని యాత్మసమర్పణ మొనర్చెను. వానరులు తర్జనభర్జనలుసేసి కొట్టవచ్చినను బెదరక రామ శరణాగతి యందు నిలుచుటచే విభీషణుఁ డాత్మసమర్పణ మొనర్చెను. భూపుత్రికై ప్రాణంబులువిడిచి జటాయువు రామున కాత్మసమర్పణ మొనర్చెను. ఇది యాత్మ సమర్పణభక్తి. పైఁజెప్పిన కోందటియం దన్ని భక్తులు గలవు. ఎవ్వరేది ప్రధానముగా నాచరించిరో. వానిని నిక్కాణించితి నట్టివారట్టి కష్టంబులకుఁ బాల్పడి నిరంతరము భగవత్సేవచే కృతార్థులైరి కాబట్టి యిప్పటివారైన నట్లుచేయవలసినదే. 27

సు శీ లుఁ డు

గురువర్యా! మీమాటలువిని లెస్సగా భగవత్సేవ నాచరింత మన్నచోఁ గామ క్రోధాదు లడ్డగింపుచున్నవి మాతలం పెట్లు సిద్ధించును? 28

ప ర వ ర ము ని

ప్రకృతి బద్ధులైనవారిలోఁ గామ క్రోధాదులు లేనివారులేరు. యావజ్జీవమవి బాధింపుచుండును. రాత్రియందుఁ జీకటి పోయిన పిమ్మట దీపము వెలిగింతమన్న సాధ్యముకాదు. దీపము వెలిగించి నప్పుడే చీకటి నశించును. సూర్యుఁ డుదయించినప్పుడే ప్రపంచసంస్థిత పదార్థంబులన్నియు గోచరించును. అట్లే కామాదులుడిగినపిమ్మట నారాయణుని భజింతమన్న వీలులేదు. వాసుదేవుండు హృషీకేశుండు

గనుక క్రోధాదులు వానికి సమర్పించినచో సతంతము మనలఁ బునీతులఁ జేయు నది యెట్లంటివేని, 29

సీ॥ వనితయై హరిఁబొందవలెనను కామ మిగా
కొన జేటికోయను క్రోధమాని
కాలమెల్లను వృథాకడచెఁ గేశవుఁడు గ
న్పడఁ డాయెననెడు లోభంబుఁదాల్చి
వనజాక్షు సౌందర్యమున మోహమును రమా
ధరు భక్తిసంపన్మదము వహించి
యెల్లభక్తుల వాంఛలిడి చక్రి నాకీయఁ
జాలఁడేమనెడు మాత్సర్యమొనసి
షడరివర్గంబు మిత్రసంచయముఁ జేతఁ
దనకు మేలొనరింప నెన్నని భజింప
నలయు జీవితకాలంబు వైష్ణవుండు
గోపసతులిట్లుగాదె కైకొనిరి ముక్తి. 30

సుశీలుఁడు

మీరుచెప్పినట్లు సదా భగవన్నామములుచ్చరించినచో దౌడల నొప్పిపుట్టును నాలుకయందాయాసము జనించును శిరస్సు చిట చిటలాడును శరీరమునందత్యుష్ణముగల్గు నాపై నేమిచేయవలయును?

వరవరముని

అట్లని మౌనముద్ర వహించినవారెవ్వరును లేరు.

శ్లో॥ గీతాశాస్త్రవినోదేన, కాలోగచ్ఛతి ధీమతాం
వ్యసనేనతు మూర్ఖాణాం, నిద్రయాకలహేనచ

గీతావిచారణచేతను శాస్త్రవిచారణచేతను బండితులకాలము గడచుచున్నది. మూర్ఖులకాలము వ్యసన నిద్రా కలహములచే జరుగు

చున్నదని శాస్త్రోక్తిగలదు. దీని కొకగ్రామమున దృష్టాంతము చూచితి నెట్లనఁగాఁ గులకాంతలిద్దఱు కలహించి మూఁడహోరాత్రములు దిట్టుకొని గొంతులు పొడివోవఁగా భాషించు శక్తిలేక వీధిలో నెదురుగా నిలుచుండి పరస్పరక్రోధాగ్ని చల్లారక లోపల నేమేమో నూహించుచుఁ బైకి చేతులూఁగించుచుండఁగా నాశ్చర్యమొందితి నట్టివారు జీవితకాలములో నాలుగైదుసారులైనను రామ కృష్ణనామంబు లుచ్చరింపఁజాలరనరే గదా యిప్పుడు నీవడిగినట్లేవచింతురు. వెండియు.

సీ॥ ఉద్యోగములో నర్ప నంకించి యిహలోక
సంబంధవిద్యలు సదువువారు
వీధిలోపల వేనవేలుగా సమకూడి
వ్యవహారభాషలు పలుకువారు
బాహువులెత్తుచుఁ బరస్పర కలహంబుచే
నధిక పారుష్యంబు లాడువారు
పాపపుణ్యంబులు పరలోకమును బర
బ్రహ్మంబు లేడని పలుకువారు
కలరు జగమున సర్వయుగముల నట్టి
క్రూరులకు నెన్నఁడో దవని నోరినొప్పి
మాధుకీవాక్యములచేత మధువిదారి
సన్నుతించెడివారికే జాడఁగలుగు. 33

సీ॥ ఆహారనిద్రలో యత్నమాని పెరవారి
వృత్తములెన్నుచు వినెడువారు
కూర్చున్నచోటనే గడ్డలు చెదలంటు
కీడెఱుంగక మాటలాడువారు

తొందరిపనులేవి దొరకినవారితో
ముచ్చటింపుచుఁ బ్రొద్దుపుచ్చువారు
నీవంటి నావంటి నేర్పరుల్జగతి లే
రని పరస్పర వక్తలైనవారు
పాటలాటలచేఁ బట్టుపడినవారు
కామినీవాక్యములచేతఁ గరఁగువారు
కలరుగాని రమేశు నాఖ్యలను నోరు
నొవ్వఁగా వినుతించువారెవ్వరయ్య. 34

సీ॥ చెంచులక్ష్మివేషముంచె నొక్కఁడు వానిఁ
గనుగొన్నవానిదే జననమనుచు
నంకమ్మకథ సెప్పె నాహాహా యొకఁడది
విన్నవానిదిగదా పున్నెమనుచుఁ
జాగయ్య కేసులో జరిగినహింసను
నహా వినుతిసేయవలయు ననుచు
నేయూరిలో వాన లే దేశమునఁ బంట
లెట్లున్నవని విచారించువారు
లౌకికోక్తులను వెలారించు సత్రము
ల్చదువువారు నుతులు సలుపువారు
కలరుగాని విష్ణుకమనీయ నామముల్
నోరునొవ్వఁ జెప్పువార లెవరు. 35

సుశీలుఁడు

విరామంబులేక విష్ణునామంబు లుచ్చరించినచో విసుగు జనించునుగదా తరువాత నేమిచేయవలయును ? 36

వరవరముని

జగత్తునంగల విషయంబు లాలోచింపక యిట్లు ప్రశ్నింపుచున్నావైనం జెప్పెద నాకర్ణింపుము. 37

సీ॥ కడువేడ్కఁ బొగచుట్టఁ గాల్చువానికి వత్స
రములెన్ని చన్న విరక్తిగలదె
తప్పకుండఁ బ్రసన్నఁ ద్రావువానికినెంత
ధనముపోయిన నిరుత్సాహమున్నె
వ్యభిచారవృత్తిచే నలరువానికి నెన్ని
రోగములుప్పుట్టిన రోఁతగలదె
జూదరియై సదా చొక్కువానికి బను
లెన్ని మోఘంబైన ఖిన్నుఁడౌనె

చౌర్యపరునకు నెన్నిశిక్షలువిధించి
ఖేదమొందింపుచున్న నిర్వేదమున్నె
యట్టికష్టాత్ములకును లేనట్టి విసుకు
జలజనేత్రుఁ నుతించు ధీరులకునేల. 38

ఉ॥ చేసినచేఁతలే మరలఁ, జేయుచుఁ బల్కినపల్కులే యనా
యాసముతో వచింపుచును, నాడట మెక్కినకూరలన్నమే
వేసటలేక మెక్కుచును, విన్నవుడుల్ వినుచున్ విరక్తిలే
కాసవహించు మానవుల, కచ్యుతనామ విరాగమేటికిన్. 39

ఉ॥ దారనిరాకరించిన సు,తా సుతు లార్తిఁగసంగఁజేసినన్
ఘోరరుజల్ కలంచినను, గోడలు దెప్పిన బంధువర్గముల్
సారెకునీసడించినను, సంసృతిపై విసుగొందలేక సం
సారి పవిత్రనామరుచి,యందు గసంగతమేమి మానవుల్. 40

సుశీలుండు

దేవా! సాంసారికకృత్యంబులయందు శీఘ్రకాలంబున ఫలంబు కనంబడుచున్నది. హరినామస్మృతియందట్టి దెద్దియు లభించుటలేదు. దానివల్లనే లక్షకొక్కరైన హరిస్మృతి చేయుటలేదు. 41

వరవరముని

నీవుచెప్పినది చాలపొరపాటు. హరిభజనంబునకు ఫలంబులన్నగా గోచరింపుచున్న వెట్లంటివేని,

సీ॥ కోరి వేదాద్రిపై నారసింహునిఁగొల్చి
సంతానమొందరే కొంతమంది
శేషాచలమునందు శ్రీనివాసునిఁగొల్చి
సంతాపముడుగరే కొంతమంది
వెళ్ళి రాఘవుఁ దిరువళ్ళూర సేవించి
కొనరె యారోగ్యంబుఁ గొంతమంది
కడువేడ్కతోఁ బానకాలరాయనిఁగొల్చి
కొఱఁతలువాయరే కొంతమంది
మ్రొక్కి తనుఁగన్నమాత్రానఁ బెక్కుచోట్ల
జనములకు సౌఖ్యములఁ గూర్చు చక్రపాణి
జ్ఞానులై సంతతముఁగొల్చువాని కేల
శ్రీయు నాయువు నారోగ్య మీయకుండు. 42

ఉ॥ అక్షయపాత్ర మూర్ధమున, నాదటనిల్పి భుజస్థలంబులన్
దక్షతమీఱ మీటుచును, దాళమువేయుచు రామ కృష్ణ కం
జాక్ష సరోజనాభయను, నాఖ్యలు వల్లియవేయువానిపై
నక్షయమైన కూర్మినిడ, రా జనులెవ్వరు లెందులంబులన్ 43

సీ॥ రామాలయమునఁ దన్నామంబువల్లించు
గాయకులకు ఘనసౌఖ్యము లభించు
హరికథాదక్షులైనట్టివారికి సభా
స్థలముల బహుపదార్థములువచ్చు
రామాయణాది సద్గ్రంథముల్ వినిపించు
పౌరాణికులకు సంపదలుసేరుఁ
బరులకు హరిమంత్ర ఫలనంబునేర్పు దే
శికులకుఁ బ్రాప్తించు సిరులు కరుల

శేష సౌఖ్యంబు లిట్లుండ శ్రీనివాసుఁ
గొలుచువారికి ఫలమేల కలుగకుండు
భుక్తినిచ్చుటగా కష్టంబులు దొలంచి
పరమపదమిచ్చు వేణుగోపాలకుండు. 44

వ॥ మఱియు హరిదాసులుపొందిన వైభవంబు సంగ్రహంబుగా 45
నానతిత్తు నాకర్ణింపుము.

సీ॥ యామునాచార్యుండు భూమీశ్వరులచేతఁ
బ్రాపింపలేదె సంపత్తులెల్లఁ
జక్రవర్తులనేలి సకలకైంకర్యముల్
చేయఁడే యతిరాజు శ్రీవరునకు
భట్టరాచార్యుండు భూపతుల కతీతమా
సిరులచే సౌఖ్యంబుఁ జెందలేదె
భక్తిరాజ్యమునకు భర్తయై నంబిళ్ళ
రాజిల్లఁ జేయఁడే రంగపదము

పూర్వగురువుల్ల నీకీర్తి భూమియందు
సంపదలఁగాంచి జనులకై సార్వభౌమ
పదముఁ బ్రాపించి వైకుంఠపదముఁ జేరి
రచ్యుతునిఁగొల్చిరాదె భక్తాగ్రగణ్య. 46

సీ॥ తొళసిపూసల రత్నములనెసి సిద్ధుని
శంకదీర్చిన భక్తిసారయోగి
పాండ్యరాట్సభ నద, బ్రసన్యాసచేయు మా-
ర్గింపడే శ్రీవిష్ణుచిత్తసూరి
విప్రనారాయణు వేశ్యకల్పింపడే
మొనలేని ధనము రంగేశ్వరునకు
తిరుమంగయాళ్వారధికవిత్తమునఁగూర్చి
పాలింపడే మహాభాగవతుల
సిరులచే మించి గదకులశేఖరార్య
మణి సపర్యలుగావించె మాధవునకుఁ
గాన హరిదాసులొందగలేని ధనము
పామరులు పెందనేర్తురే భక్తవర్య. 47

వ॥ అది యట్లుండె. 48

శా॥ శ్రీరంగంబున యాదవాచలముపై, శేషాద్రిపై దేవరా
ట్సారాగారముపైన భూతపురిలో, సమ్యక్కృతిద్వేషణా
దార స్థానమునందుఁ దోతగిరిమీఁ,దంబాల్ల్బ సంపత్తు లా
రారా భక్తులకైకదా నిలిచె న,య్యంభోజనాభుండొగిన్. 49

వ॥ తక్కిన దేహాలమైశ్వర్యంబులన్నియు నిశ్రేయని యూహింపవలయు నింతేకాక తిరుమలను వేనవేల మానవు లనుగొంచి

లక్షలకొలంది ద్రవ్యంబు భగవదర్పణ మొనర్చుటయేకాక విటణివిఘుల యందు ధనంబు వెచ్చింపుచుండఁగా. 50

సీ॥ సుద్దంబులైపోల్చు సూపవస్తువులన్ని
పెరుగు పాల్మజ్జిగ బియ్యమన్ని
తిరుమణ్ శ్రీచూర్ణ సరసిజమాలిక
ల్తొళసిపూసలు పాత్ర లెలమినన్ని
కొయ్యబొమ్మలు మంచి కూరగాయలనన్ని
విమలకర్పూరంబు విక్రయించి
పంచదార గుడంబు పటము లద్దంబులు
వివిధపదార్థము ల్విక్రయించి
ధనములార్జించి పౌరు లుదాత్తజీవ
నములు ప్రాపించి బ్రతుకుచున్నారుకాదె
యిట్టివృత్తులకెల్లను హేతువెన్న
వేంకటేశ్వరుఁడేగాక వేఱుగలదె. 51

సుశీలుఁడు

స్వామీ! దేవరవారుచెప్పినది వాస్తవమైనను విష్ణుభక్తులలోఁ గొందఱు గృహస్థులు ధనాభావంబుచేఁ దల్లడిల్లుచున్నట్లు కనుచున్నాము కారణంబేమి? 52

వరవరముని

పూర్వజన్మంబున గృహస్థులై సత్పాత్రదానంబు చేయక స్వల్పముగా విష్ణుభక్తి చేసినవారీజన్మంబున దరిద్రులయ్యును పూర్వవాసనచే హరిభక్తి చేయుచుందురు. అట్టివారిప్పుడైనను సత్పాత్రదానంబు చేయుచు భక్తిఁగావించిరేని జనార్దనుండు గోరంతదానిఁ గొండంతగా నొనర్చి యైశ్వర్యాదు లొసంగి పిమ్మట మోక్షంబిచ్చును. 53

సుశీలుండు

లేమిచేఁ దల్లడిల్లువాఁడు దానంబెట్లు చేయును! దారిద్ర్యంబు తొలంగుటెట్లు? 54

వరవరముని

అందువల్లనే జనార్దనుండవాప్తసమస్తకాముండయ్యును లేని వారినిగురించి,

శ్లో॥ పత్రం పుష్పం ఫలంతోయం, యోమేభక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత, మశ్నామి ప్రయతాత్మనః

పత్రముగాని, పుష్పముగాని, ఫలముగాని, నీరముగాని యెవ్వఁ డిచ్చుచున్నాఁడో పరిశుద్ధాత్ముఁడగు భక్తునిచే నీయఁబడినదానిని నేను తినుచున్నాననియును' 55

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి, యజ్జుహోషి దదాసియత్
యత్తపస్యసి కౌంతేయ, తత్కురుష్వ మదర్పణమ్

దేనినిఁ జేయుచున్నావో దేనినిఁదినుచున్నావో దేనిని హోమము చేయుచున్నావో దేనిని దానముచేయుచున్నావో దేనిని తపస్సు చేయుచున్నావో దానిని నాకుసమర్పింపుమనియును గీతాచార్యుం డర్జునునకు బోధించెను. 56

సుశీలుండు

పైరెండుశ్లోకంబులు గోవిందుండు లేనివారికొఱకే బోధించెనా యేమి? 57

వరవరముని

కాదుకాదు సర్వచేతనులకును జెప్పినట్లని తలంపుము. కాని లడ్డుకము పులిహోర చక్కెఱపొంగలి మొదలగు పదార్థములును కనకరత్నాభరణములును సమర్పింపుమని కృష్ణుండు వచించినచో దరిద్రులు నిరాశఁజెంది భగవంతుని సేవింపరు. వీరలకు సాధ్యమైన దానిం జెప్పినచో శ్రీమంతులు నిరుత్సాహ మొందవలసినది లేదు

గదా! మఱియుఁ బత్రపుష్పాదు లన్నాదులుమీయఁని ధనాఢ్యుఁడు ధనంబు లౌకికకార్యములను వినియోగించి తానుమాత్రము గ్రాసమూకరముగ లేఁదిని కొండచిలువకీతిఁ బండుకొనక తనకుఁ గలిగిన వానిలో నమూల్యపదార్థంబులు నన్ను వాహనాభరణంబులు నర్పించ తానుండఁగు హారికర్పింపుచు నుపయోగించుకొననలయును. మఱియు భగవంతుండిట్లువచించుటచే భక్తుండైనవాఁడు శాస్త్రీయపదార్థంబులచేఁ గేశవునిఁ బూజింపవలయు. భగవత్సంబంధంబుచే నాయాపదార్థంబు లభివృద్ధిఁగాంచి దాసుల దారిద్ర్య ధ్వంసము చేయునుకనుకనే బ్రహ్మవిదగ్రేసరుండగు రామదాసుగారు.

చ॥ తరువులుపూచి కాయలగుఁ దత్కుసుమంబులు పూజగా భవ
చ్చరణముసోఁకి దాసులకు, సారములై ధనధాన్యరాసులై
కరి భట ఘోటకాంబర నికాయములై విరజానదీస ము
త్తరణ మొసర్చుఁ జిత్రమిది. దాశరథీకరుణాపయోనిధీ,

కరుణాసముద్రుండగు నోరామా! చెట్లు పూచి కాయలై కొలఁదికాలములో రాలిపోవును. కాని యాపువ్వులు పూజారూపంబుచే నీపాదములు సోఁకినచో దాసులకు సారవంతములగు ధనధాన్యరాసులై కరి భృత్య హయ వస్త్రసమూహంబులై యిహంబున రక్షించి తమపరి విరజానదిదాటించి పరమపదమునఁ జేర్చు నిదియాశ్చర్యముగదాయని వచించిరి. మఱియు,

శ్లో॥ ఆయురారోగ్య మైశ్వర్యం, భోగాంశ్చైవానుషంగికాన్
దదాతిధ్యాయతాం పుంసా, మపవర్గప్రదోహరిః

విష్ణువు మోక్షదాయకుండైనను దన్ను ధ్యానించువారికి నాయురారోగ్యైశ్వర్యాది ప్రస్తుత భోగంబు లొసంగునను శాస్త్రోక్తి కలదు. మఱియొకసంగతి. చక్రవర్తియగువాఁడు దాస దాసీజనంబులకు భోగపదార్థంబు లవ్యాదిగా నొసంగుచు రోగియైన కుమారునకుఁ

భక్ష్యవస్తువులుమాత్ర మిచ్చుచుండునట్లే శిలాపాత్రులగు జనులకుఁ గర్మానుసారముగా భోగ్యపదార్థంబులిచ్చి దయాపాత్రులగు భక్తులకు జీవనోపయోగవస్తుసామగ్రినిఁ గొంతలేకుండ నిచ్చును. 58

సుశీలుండు

అట్లైనచోఁ గుచేలుని బహుకాలము లేమిచేఁ దల్లడింపఁ జేయనేల? 59

వరవరముని

దానికిఁ గారణము లేకపోలేదు వినుము. కుచేలుండు పూర్వజన్మంబున విష్ణుభక్తిమాత్రము చేయుచు ద్రవ్యముండియో లేకయో సత్పాత్రదానముగాని భగవదర్పణముగాఁ బుణ్యకార్యంబులుగాని చేయనిలోపంబున నీజన్మంబున దరిద్రుండయ్యెను. కాని పూర్వవాసనచే వాసుదేవ పదారవింద ధ్యానపరుండై యుండెఁ గుచేలుని పేదతికంబుఁ దలంచి భక్తవత్సలుండగు కృష్ణుండు తనమనంబున నయ్యో! యీకుచేలుని కష్టంబున కెట్లుసహింతు నితండు గతజన్మంబున నైశ్వర్యహేతువగు కార్యం బొక్కటియైనం జేయలేదు. విత్తనంబులులేని కృషీవలునకు ధాన్యంబు లభించనట్లు వీనికి ధనంబిచ్చుటకు వీలులేదయ్యెనని పలుమాఱు చింతించి తుదకొక్క యుపాయంబూహించి తాను హృషీకేశుండగావునఁ గుచేలుని మనస్సునఁ బ్రవేశించి ద్వారకకు రప్పించుకొని బలాత్కారముగా నతనిచంకలోనుండు నటుకుల నాకర్షించి మహాప్రీతితో భుజించి యమర్త్యదుర్లభంబగు నైశ్వర్యం బీవిప్రునకు లభించుఁగాకయని సంకల్పించి పంపె నంత నాకుచేలుండు స్వనివాసంబున కేగి చూడఁగా నాస్థలంబు విశాలోన్నత ప్రాకార పరివేష్టితంబై నానాతరు సమాకీర్ణోద్యానవనంబులతో సౌగంధిక హల్లక కైరవేందీవర కోకనద పుండరీకషండపూరితంబులును మరాళరథాంగ సారసజలేభ జల కుక్కుటకారండవాది ఖగసంయుక్తములునగు కాసారంబులతో బాడియావులతోఁ బాడిబఱ్ఱెలతో దాసదాసీజనంబులతో ధన

కనకవస్త్ర రత్న భూషాద్యములతో మహావైభవంబుతో నొప్పుచుండు భవనంబునఁ బ్రవేశించి భార్యా పుత్రాదులు హర్షింపఁగా బంధు మిత్రాదులు పరివేష్టింపఁగా దాస దాసీ జనంబులు సేవింపఁగా భోగంబుతో నారోగ్యంబుతోఁ ద్యాగంబుతో యోగంబుతో హరిపదానురాగంబుతోఁ గాలంబుఁ గడపి పరమపదంబుఁ జేరెను. 60

సుశీలుఁడు

అట్లైనచో భగవత్సంబంధమగు పనులు భక్తుం డెడతెగక చేయుచుండవలసిన దేనా ? 61

పరమార్థముని

తప్పక చేయవలయు నట్లు భగవత్సేవ మానినచో నింద్రియంబు లూరకుండనేరక దుర్విషయంబులయందుఁ బ్రవర్తించును. అభ్యాసవశంబున నిరంతరము భగవత్సేవ చేయువాఁడు మాని నిల్వఁజాలఁడు. చేసిచేసి మానినవాఁడు మగలఁ జేయనోపఁడు. కావున

సీ॥ అరఘట్టముచే మహాగాధజలము లా
కర్షించి సస్యంబుఁ గాచునట్లు
చావునకోడక జలధిలోనమునింగి
తీపారుఁ రత్నము తీసినట్లు
గవిలోఁ బ్రవేశించి కండకీఁగలకోర్చి
చెలఁగి మరంద మార్జించినట్లు
తోడరి శీతాతపాదులకోర్చి వృత్తుల
డీకొని ధనము గడించినట్లు

సాత్వికుండగువాఁడు కష్టములకోర్చి
హరిని వినుతించి హరియందు నమరియున్న
చిత్రమహిమంబు లెల్ల వశీకరించి
ధన్యుఁడగుఁగాదె విష్టపత్రయమునందు. 62

హాలాహలంబు జనించి బాధించినను గణింపక చిరకాలంబు సముద్రమథనంబొనర్చిరికదా నిలింపు లమృతంబుఁబడసిరి. 63

సుశీలుఁడు

అన్నిసరేగాని విష్ణుభక్తులకుఁ గష్టంబులు మెండుగానుండు నక్కారణంబున భక్తిలోఁ బ్రవేశించి కొందఱు మానుకొనుచున్నారు. సర్వానిష్ట నివారణార్థము సకలేష్ట ప్రాప్త్యర్థముగదా భగవంతునాశ్రయింపుచున్నాము. దానికి వ్యతిరిక్తముగా నారాయణుఁడు భక్తులను వేధింపనేల? 64

వరవరముని

భక్తులకష్టంబులకు జనార్దనుండు కారకుఁడు గాడుగాని భగవద్భక్తిలోఁ బ్రవేశించినది మొదలు చేతనునకుఁ గొంతకాలమునకు బాధలుకలుగుచుండు నెందులకంటివేనిఁ బరులయొద్ద ఋణముచేసినవాఁడు ఋణ మెగవేయఁదలఁచి యాస్తిని దస్కరింపఁదలఁచినప్పుడు ఋణదాతలందఱు నొక్కపర్యాయ మేకీభవించి ఋణస్థునియొద్ద ధనంబు వసూలుచేయుదురు. అట్లె మానవుండు భగవద్భక్తిలోఁ బ్రవేశించినప్పుడు తదీయపూర్వకృతపాపంబు లన్నియొక్కుమ్మడి పైఁబడిబాధింపుచుండును. భక్తిమానినచో వీఁడెప్పుడైన మనవాఁడేగదా యిప్పుడే కల్వరపెట్టనేలయని పాపంబులు నిదానించును. మూఢుండగు భక్తుడు తనభక్తిచేఁ బాపంబులు నశింపఁబోవుచు గలగుండువెట్టుచున్నవని తలంపలేక హరిభక్తిచేఁ గష్టంబులు ప్రాప్తించె నదిమానుటచే సుఖించితినని సంతోషించును. 65

సుశీలుఁడు

పాపంబులు పైకొని వేధించునప్పుడు వానిని నాశనఁజేసి విష్ణుదాసులంగాపాడరాదా. 66

వరవరముని

ఉపాధ్యాయుఁడు పాఠశాలకు వచ్చిననాడే బాలునిఁ బండితునిఁ జేయునా. వైద్యుఁడు మందుఁదిన్ననాడే రోగి కారోగ్య మొసఁగునా

న్నునా. కాలయాపనమునగదా వాగువారు వారివారి లాలసలు నెఱ వేర్తురు. అట్లే చేతనుండు ముముక్షువైనదాది విఘ్నంబులను నిర్వ హింపక బాధలను లొంగక గోవిందుని సేవింపుచున్నచో ననిష్టంబులు తమంతటఁదామే తొలంగును. శుభంబు లావిర్భవించును. ప్రకృతి కృతబాధలు సహించి భక్తిచేయువాని లక్ష్మీపతిస్వీకరించి లోకోత్తర సౌఖ్యంబులు గౌరవ ప్రతిష్ఠలు నొసంగును కాని సంసారవిరక్తి కలు గుటకై దాసుని నారాయణుఁడే దండించుటయుంగలదు. 67

సుమ్ములుఁదు

అట్టిబాధకని విడిచినచో సుఖింపనచ్చునే ! 68

పరవరముని

సృష్టి స్థితి లయములకుఁగారణభూతుండగు నారాయణునివదలి సుఖింమటకు జీవున కెంతమాత్రము వీలులేదుసరేకదా, అప్పురుషోత్త మునితోఁ గలహించుట కసలేవల్లలేదు. భూమిపై గమనించువానికిఁ బాదములు తడఁబడినప్పుడు జారిపడఁగా దెబ్బ తగులును. వాఁడది యాదిగా భూమితో నాకుఁబనిలేదనినచో నెక్కడనిలుచుండు నెక్కడఁ గూరుచుండు నెచ్చోట సంచరించు నెక్కడ శయనించు నెద్దియులేదు గదా ! నీటిప్రవాహములో నీది బాధపడినవాఁడు దరిఁజేరినపిమ్మట జలముసువర్జించినఁ బ్రాణాధారము లేదుగదా ! హోమముచేయు నప్పుడు చేయికాలినవాఁ డగ్నినిఁ దిరస్కరించినచో హవ్యకవ్యంబు లెట్లుజరుగును, ఝంఝూప్రభంజనంబుచే నిల్లుకూలినవాఁ డిఁక మీఁద గాలితో నాకుఁబనిలేదనిన శరీర మెట్లునిలుచును ! నిరాధారమైన బయలులో శీతవాతాతపంబులచే బడలినవాఁడు విహాయసంబును నిరాకరించిన గగ్గోలుపెందునుగదా! భగవత్సృష్టిలోగల పంచభూతము లనే నిరాకరించి బ్రతుకలేని మేతాల్పులు జగదీశుని విడిచి జీవించుటెట్లు ! 69

సీ॥ ఉప్పునీరంబునం దుండ చేలని మీమిం
గిలము వారాశిపైఁ గినుకఁ దాల్చ
యుఱుములు మెఱుపుల కోర్చి కుట్టని చాత
కము వారివాహసాంగత్యము విడి
జాలరి వారిందు సంచరించెదరంచు
బకము తటాకసంబంధ మెడల
మృగయులీస్థలమందు మెలఁగెదరని మృగ
సంఘ మరణ్యావాసంబు మాని

చెడినచందాన మనుజుండు శ్రీనివాసు
నఖిలలోకైకరక్షకు నాశ్రయించి
వరము లీలేదు తనకని వదలెనేనిఁ
దల్లి విడినశిశువట్లు తల్లడించు. 70

సుశీలుఁడు

గురువర్యా! మనుష్యునకు భగవదారాధనమునందు సాహాయ్య
మొనర్చువానిలో ముఖ్యమైన దెద్ది? 71

వరవరముని

భగవద్విషయమున సాయ మొనర్చువానిలోఁ గాలము ముఖ్యమై యమూల్యమైయుండును.

ఉ॥ పోయినరత్నజాలములు పోయిన హాటక భూషణంబులుఁ
బోయిన వస్త్ర దంతి హయ భూములు కోటులు కూర్పవచ్చుఁ జూ
మ్మాయువు లోనఁబోవు గడెయైన గడింప వశంబుగాదు ని
శ్శ్రేయస వాంఛితుండు వృథ చేయుట లొప్ప దమోఘ కాలముల్

భగవంతుఁడు మహాకృపతో జీవునకుఁ గరణకళేబరంబులిచ్చుటయే కాకుండ నమూల్యమగు నాయుఃకాలంబు నొసంగియున్నాఁడు. కా

లంబు త్రిలోకాధిపత్యంబునకంటె విలువగలిగినదని చెప్పారు నట్టి కాలంబు నెట్లుపయోగించుకొనవలయునో యోచింపక శిశ్నోదర జిహ్వోపరాయణుండై కోటిన్వృత్తులందు వ్యయించి యమవశ్యుండై నరకాప్తుఁడగు చున్నాడు. భగవద్దత్తాయుస్సమయంబు కొంత శరీరపోషణార్థ ముపయోగించి మోక్షసాధనంబగు భగవదారాధనంబున కుపయోగించవలయు నాయుస్తరుణంబును కొంద ఱిహలోక సౌఖ్యార్థముగా వ్యయింపుచున్నారు. కొందఱు లోక వినోదమునందునుఁ గొందఱు నాస్తిక్యమునందునుఁ గొందఱు నిరీశ్వరవాదమునందును వినియోగింపుచున్నారు. కొంద ఱకృత్యకరణ కృత్యాకరణ భగవదపచార భాగవతాపచా రాసహ్యాపచారముల కుపయోగింపుచున్నారు. వారందఱు యమవశ్యులగుట నిక్కంబు. లుబ్ధుండగువాఁడు ధనంబునుఁ బతివ్రత పాతివ్రత్యంబును, శూరుండు శౌర్యంబు, వదాన్యుండు దాతృత్వంబును గాపాడునట్లు వైష్ణవుండగువాఁడు కాలంబును వృథా పుచ్చక భగవదారాధనచేఁ గడుంగడు జాగరూకతతో నడుపవలయును.

సీ॥ కొలిచిన శ్రీరాముఁ గొల్వంగవలయు వీ
క్షించినఁ గృష్ణు వీక్షింపవలయుఁ
పాడిన గోవిందుఁ బాడంగవలయుఁ దా
నాడిన హరిఁ గొనియాడవలయు
వలఁగొన్నఁ జక్రికి వలఁగొనవలయు వ్రా
సిన రామకోటి రచింపవలయుఁ
దలఁచిన వెన్నునిఁ దలపోయవలయును
నిలువఁ గేశవుచెంత నిలువవలయుఁ
గాచిన ముకుందుసన్నిధిఁ గాచియుండ
వలయు సబ్బంగిఁ జేసిన వానికాల
మెల్ల బంగారమై రమాధీశు లోక
మునకుఁ జేర్చి మహాసౌఖ్యములనొసంగు.

వ॥ కాలప్రవాహం బధికవేగంబునం బోవుచుండుఁ గనుకనే యీకాలంబు నిమేషంబులై జాములై మాసంబులై వత్సరంబులై యుగంబులై కల్పంబులై కడచిపోవుచున్నది. నిల్కడలేని కాలప్రవాహంబునంబడి కొట్టుకొనిపోవుచుండు జీవులు సంసారమను సుడిగుండమునంగూడి మరల కొన్నాళ్ళ కెన్నిరత్రోవను వారరుగుచున్నారు. భగవద్భక్తుఁడుమాత్రము భగవన్నామోచ్చారణసేతువుచే నిలిచి సుఖమొందుచున్నాఁడు. విష్ణునామసహస్రంబులు మహామాధుర్యమై లేనరారుచుండును. జంబూ ద్రాక్షా మోచా కపిత్థ రసాలాది ఫలంబులైనను దధి ఘృత మకరంద పాయసాపూప సూప శాక గుడ శర్కరాది పదార్థంబులైనను నారాయణనామ మాధుర్యంబునకు సమానంబులుగావు. మాధుర్యముకలిగియు లౌకికపదార్థంబులు రోగాతురుని నాలుకకు విషతుల్యంబులగును. రామ కృష్ణ విష్ణు గోవిందాది నామంబులురుజాగ్రస్తుని రసజ్ఞకు నమృతప్రాయంబులై సుఖంబు లిచ్చును. 74

సుశీలుఁడు

దేహము దృఢముగానున్నప్పుడు భగవత్సేవఁ జేయవచ్చును గాని రోగబాధలచేఁ దల్లడిల్లునప్పు డేమిచేయవలయును ? 75

వరవరముని

పాంచభౌతిక దేహంబునకు రోగంబులు సహజముగా నాహార వ్యత్యాసముచేతనుఁ బూర్వజన్మకృతాఘంబులచేతనుఁ బ్రాప్తించును. తదీయ రుజా విధ్వంసనార్థము కేశవుఁ డనేకౌషధంబులు నిర్మించి యున్నాఁడు. కాబట్టియే "శ్లో॥ మంత్రోహ మహమౌషధమ్" అని హరి గీతాశాస్త్రంబునందుఁ జెప్పినాఁడు. వివిధాహారంబులెట్లు శరీర పుష్టివర్ధకంబులో మందులు నట్లే యారోగ్యప్రదంబులని నిశ్చయించు కొనుము. ఆహారవ్యత్యాసముచేవచ్చిన వ్యాధులు మందులచే నశించును. కాని ప్రారబ్ధానుసారముగాఁ గలిగిన రుజలు నశింపవు. భగవ

దారాధనముచేఁ దప్పక శమించును. భవరోగధ్వంసనంబులును ముక్తిప్రదంబులునగు నారాయణనామాభిధానంబులకు దేహరోగంబు లక్ష్యగింపవు.

సుశీలుఁడు

సూర్యనమస్కారాదులచే వ్యాధులు నశించునని చెప్పుచుందురది వాస్తవమేనా ? 77

వరవరముని

అన్యదేవతారాధనముచే రోగములు నశించిన నశించునుగాని వ్యాధికి బీజంబగు ప్రారబ్ధము నశింపదు. పునర్జన్మంబున కారోగంబు వేచియుండును. 78

సుశీలుఁడు

శివుండు భక్తుల కైశ్వర్యం బవ్వారిగా నిచ్చుననియు విష్ణుదాసులు దరిద్రులై నానాకష్టంబు లనుభవింతురనియుఁ గొందఱు చెప్పుచున్నారే. 79

వరవరముని

శివుండు మోక్షప్రదానశక్తిలేనందున ధ్యాతలకు రాగద్వేషంబులతోఁగూడిన సంపద లిచ్చును. తత్సంపత్తులు రావణ బాణాసురాదులకుంబోలెఁ గలిపయ కాలంబునకు నపాయకారణంబులగును కాని విష్ణువు భక్తులకేకాక సర్వశరీరులకు నైశ్వర్యంబిచ్చి పోషించుటకు ధనదాయకియగు లక్ష్మీదేవిని ధాన్యదాయకియగు భూదేవిని జాయలుగాఁ బరిగ్రహించియున్నాడు. మఱియు నతండు హృషీకేశుండగుటచే శ్రీమంతులగు భక్తులకుసహితము రాగద్వేషాదులు కలుగనీయడు. విక్రేత క్రయికునకుఁ గోరినప్పుడు రస విష గంధక పాషాణాదులైన నిచ్చును. జనకుండైనవాఁడట్లీయక మంచి వస్తువులుమాత్రమే యిచ్చు నదేవిధంబున బ్రహ్మరుద్రాదులు తమ్ముఁగొల్చువారికెట్టిదుష్టవరంబులైననిత్తురు. కాని లక్ష్మీపతి తనవారికిఁ గాంక్షించినను

దుర్వారంబులీయక నిరపాయకరంబులగు భోగ మోక్షంబులొసంగును. దీనికిఁ దార్కాణముగా విదురాక్రూర కుచేలమాలాకార శ్రుత దేవ త్రిజట భూసురాదులకు భుక్తి ముక్తి ప్రదాయకుండయ్యెను. సుగ్రీవ విభీషణ, బలి ప్రహ్లాద ధ్రువాంబరీష రుక్మాంగదార్జునాదులకు రాజ్యాధికార మోక్షాధికారంబులొసంగె నాంజనేయునకు భావి బ్రహ్మాధిపత్యమిచ్చెను ఇంతయేల పశు పక్షి. మృగ వృక్ష లతా గుల్మాదులకు నపవర్గంబిచ్చెను. 80

సీ॥ నారాయణాహ్వయోచ్చారణ ప్రభవాధి
కారంబు ధర్మాధికారమిచ్చుఁ
బర వాసుదేవుని పదములకిడు నమ
స్కారంబు విత్తాధికారమిచ్చు
చక్రిపాదాంబుజ స్పర్శన పూజాధి
కారంబు భోగాధికారమిచ్చుఁ
దలఁపులోఁదోఁచు దైత్యధ్వంసి సుందరా
కారంబు ప్రకృతి వికారమడఁచు

నంత్యమునడాయు గరుడధ్వజానుయాను
కంప శాశ్వతమోక్షాధికారమిచ్చు
శ్రితజనములకు సర్వార్థసిద్ధి దాయ
కుండు సీతావిభుండుకాకొండుగలడె. 81

## సర్వరక్షకనిర్ణయము

శిష్యుఁడు

గురువర్యా! చిదచిత్తులకు ముఖ్యరక్షకుం డెవఁడో వక్కాణింపుఁడు. 82

పరవరముని

నచింత్యు సావధానమతివై యాకర్ణింపుము.

శ్లో॥ భూమిరాపోనలోవాయుః ఖం మనోబుద్ధిరేవచ
అహంకార ఇతీయంమే భిన్నా ప్రకృతిరష్టధా

భూమి, నీరము, వహ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము అని యెనిమిదివిధములుగా విభజింపఁబడియున్న ప్రకృతి నాది.

శ్లో॥ అపరేయమితస్త్వన్యాం, ప్రకృతింవిద్ధి మే పరాం
జీవభూతాం మహాబాహో, యయేదం ధార్యతేజగత్

ఈ చెప్పఁబడిన ప్రకృతికంటె వేఱదిప్రధానమైనదో దేనిచేత నీజగత్తు ధరింపఁబడుచున్నదో యాజీవప్రకృతియు నాదేనని గీతాచార్యులవారు చెప్పినందువల్లఁ జడ చిత్తులకు రెంటికి నారాయణుఁడే రక్షకుఁడైయున్నాఁడు. చిదచిత్తులను సమాసమునందు జీవుండు ముందుగాఁ జెప్పఁబడినను జీవునకు భోగ్య. భోగోపకరణయోగ్యంబైన యచిత్తునకు భగవంతుఁడు రక్షకుండైనవిధం బానతిచ్చెద నాలింపుము. ఎట్లంటివేని దాన ధర్మ తపో యజ్ఞ జపస్వాధ్యాయ తీర్థాదులన్నియుఁ జైతన్యాభావంబుచే నచిత్తులైయున్నవి. అట్టిపుణ్యకార్యములకు సర్వదా విష్ణువే రక్షకుఁడైయున్నాఁడు. ఎట్లంటివేనిఁ బూర్వయుగంబున నృగుఁడను భూపతి గోదాన భూదాన హిరణ్యాదిదానంబులు కోట్లకొలఁది కావించి యొకానొకదానముచేఁ గలిగిన దోషంబుచే నూసరవెల్లియై పుట్టి చిరకాలము బాధలనుభవించి శ్రీకృష్ణ దర్శనంబుచేఁ బవిత్రుఁడై దానఫలంబనుభవించుటకు స్వర్గంబున కరిగెను. బ్రహ్మదత్తుండను రాజు నూటయెనిమిదివర్షంబులు గౌతమముని కన్నదానంబుసేసి నరమాంసభక్షణవ్యాజంబున ముని శపింపఁగా గ్రద్దయైజన్మించి దుఃఖమనుభవించి శ్రీరామచంద్ర దర్శన స్పర్శనంబులచేఁ బుణ్యలోకం

బున కేగెను. ఈప్రమాణములచే దానఫలప్రదాతయు దానరక్షకుం డును విష్ణువేయగును.

శ్లో॥ ధర్మస్య ప్రభు రచ్యుతః=ధర్మమునకుఁ బ్రభు వచ్యుతుండను శాస్త్రోక్తివల్లను,

శ్లో॥ ధర్మసంస్థాపనార్థాయ, సంభవామి యుగేయుగే = ధర్మసంరక్షణార్థము ప్రతియుగమునం దవతరింతునను భగవతూక్తిచేతను,

రామో విగ్రహవాన్ ధర్మః=రామవిగ్రహమే ధర్మస్వరూపమని మారీచుండు వచించుటచేతను,

శ్లో॥ కృష్ణం ధర్మం సనాతనం=కృష్ణుని సనాతన ధర్మముగా నెఱుంగుచున్నామను నారోక్తివల్లను నారాయణుఁడే ధర్మస్వరూపుఁడై ధర్మరక్షకుఁడై యున్నాడు. రుద్రునిచే ధ్వంసింపఁబడిన దక్షయాగంబును వాసుదేవుఁడు పూర్తిచేయుటవల్లను రామావతారకాలంబునం దనేక యాగంబులు స్వయముగాఁజేయుటవల్లను సుబాహు ప్రభృతి విఘ్నకరుల సంహరించి విశ్వామిత్రయాగంబునుఁ గాపాడుటవల్లను పాండవకృత రాజసూయాశ్వమేధ ప్రముఖసవనంబులు నిర్విఘ్నంబుగా నెఱవేర్చుటవల్లను శౌనకాది షోడశ సహస్రమునులు వేయివర్షంబు లొనరించు దీర్ఘ సత్రయాగంబునుఁ బరిసమాప్తి నొందించుటవల్లను జనార్దనుండు యాగభోక్తయై యాగఫలప్రదాతయై యాగరక్షకుండై యున్నాడు. సీతాపతి ఖరదూషణాదుల వధించి దండకారణ్యమున మునికృత తపస్స్వాధ్యాయంబులు సిద్ధింపఁజేసినందువల్లను శరభంగ సుతీక్ష్ణాదుల తపస్సు నుదకధారాపూర్వకముగాఁ బరిగ్రహించినందు వల్లనుఁ బురుషోత్తముఁడు తపస్స్వాధ్యాయ రక్షకుండై యున్నాడు.

శ్లో॥ యజ్ఞానాం జప యజ్ఞోస్మి=యజ్ఞములలో జపమనుయజ్ఞము నా విభూతియని గీతాచార్యులవారానతిచ్చుటచే జపసంరక్షకుండు నచ్యుతుండని యెఱుంగవలయును. శ్రాద్ధకాలంబున విష్ణుపాత్ర నుంచుట చేతను, శంఖ చక్ర గదాధరాయ, గరుడవాహనాయ, శ్రాద్ధ సంరక్ష

కాను యని నుతించుటచేతను, "శ్రీమహావిష్ణుప్రీతయే, శాశ్వతవిష్ణులోకా వాప్త్యర్థమ్మ"నిముగించుటచేతను, శ్రాద్ధసంరక్షకుండు మఖుం డుండని తెలియవలయును. ఆసేతు సీతాచలపర్యంత బ్రాహ్మణులు ప్రతిదినము స్నానానంతరము,

"హరిః ఓమ్ శ్రీ గోవింద గోవింద గోవింద మహావిష్ణోరాజ్ఞయా" యని సంకల్పము చేయుటచేతను,

"అచ్యుతాయనమః, అనంతాయనమః అచ్యుతానంత గోవిందాయ నమః"అని యాచమన మొనర్చుటవల్లను, కేశవాదిచతుర్వింశతినామం బులతో సంధ్యావందన మొనర్చుటవల్లను, సంకల్పాచమనసంధ్యావంద నాది వైదిక కార్యంబులకుఁ బుండరీకాక్షుండే రక్షకుండు. మఱియు బ్రాహ్మణులు వివాహోపనయనంబులయందు విష్ణు చిహ్నంబగు నూర్ధ్వ పుండ్రము ధరించి,

శ్లో॥ శుక్లాంబరధరంవిష్ణుం, శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే

శుక్లాంబరధరుండును, శశివర్ణుండును, చతుర్భుజుండును' ప్రసన్నముఖుండగు విష్ణుని సర్వవిఘ్నోపశాంతికొఱకు ధ్యానింప వలయును.

శ్లో॥ లాభస్తేషాం జయస్తేషాం కుతస్తేషాం పరాభవః
యేషామిందీవరశ్యామో, హృదయస్థో జనార్దనః

ఇందీవరశ్యాముఁడగు జనార్దనుం డెవరిహృదయంబునఁగలఁడో వారికి లాభమును జయమునుఁగలదు. పరాభవములేదు.

శ్లో॥ తదేవలగ్నం సుదినం తదేవ, తారాబలం చంద్రబలంతదేవ
విద్యాబలం దైవబలం తదేవ, లక్ష్మీపతే తేంఘ్రియుగం స్మరామి

లక్ష్మీపతీ! నీపాదయుగళంబును స్మరింపుచున్నా నెందుకనఁగా నదియే లగ్నమై సుదినమై తారాబలమై చంద్రబలమై విద్యాబలమై దైవబలమై యొప్పుఁగాకయని పఠించుటచే వివాహోపనయన సంతతుండు రమానాథుండై యున్నాఁడు. 83

సుశీలుఁడు

మీరు పైనవచించిన శశివర్ణుఁడు శుక్లాంబరుఁడను శ్లోకము సందిగ్ధముగానున్నది. ఎందుకనఁగా మేఘశ్యాముఁడు కనకాంబరుఁడైన భగవంతు నట్లు చెప్పుటకు హేతువేమి? 84

వరవరముని

పూర్వము భగవానుఁడు కొంతకాలము శుక్లాంబరుఁడై శుక్లవర్ణుఁడై యున్నాఁడు కనుకనే హంసావతార హయగ్రీవావతారముల యందు శ్వేతవర్ణుఁడై యున్నాఁడు. కాని క్షీరసముద్ర మథనకాలంబున హాలాహలము జనింపఁగాఁ దన్నివారణార్థము కొందఱు వేల్పులు శివునిం బ్రార్థింపఁబోయిరి. తక్కిన వేల్పులు విషాగ్నిచే దగ్ధ లగుచుండిరి. ఇంతలో భక్తవత్సలుండగు సరోజాక్షుఁ డా హాలాహలంబును గ్రసించి శివునకుఁ గోపము రాకుండఁ గొంచెముంచగా దానిని గ్రసించి కంఠమునం దుండఁగా రుద్రుండు మూర్ఛిల్లె నింతలోఁ బార్వతి కేశవనామోచ్చారణముచే గంగాధరునిఁ దేర్చె నక్కాలంబున విషగ్రహణము పూర్తిగాఁ జేసినందువల్ల నిదివఱకు శ్వేతవర్ణుడై యుండిన విష్ణువు మేఘశ్యాముఁడయ్యెను. 85

సుశీలుఁడు

చిత్తము పైభాగమునకుఁ జనుఁడు. 86

వరవరముని

దనుజులచే శిథిలములైన వేదభాగములనుఁ బూర్తిచేసి తానే విధి కిచ్చుటచేతను,

శ్లో॥ వేదైశ్చ సర్వైరహమేవవేద్యః, వేదాంత కృద్వేద విదేవచాహం

సర్వవేదములచేఁ దెలియఁదగినవాఁడను నేను వేదాంతములను జేసినవాఁడను వేదము నెఱింగినవాఁడనని గీతయందుఁ దానే వచించుటచేతను వేదవేదాంత వేద్యుఁడు వేదరక్షకుఁడు కేశవుఁడని తలంపుము. మన్వాది ధర్మశాస్త్రములు నారాయణ మహాత్మ్యము వెల్లడించుటచేత గోవిందుఁడే ధర్మశాస్త్రరక్షకుఁడై యున్నాఁడు. మఱియు రమాపతి వ్యాస వాల్మీకాది . మహాత్ములయం దావేశించి రామాయణ భారతాది యితిహాసంబులను భాగవత వైష్ణవ పాద్మాది పురాణంబులను రచింపించి వానిచేఁ బ్రతిపాదింపఁబడి కాపాడుచున్నాఁడుగనుక సరోజాక్షుఁడే యితిహాస పురాణరక్షకుఁడై యున్నాఁడు. తర్క వితండాది వాదంబులెల్ల నావిభూతియని గీతాచార్యుఁడు సాధించినందున సర్వశాస్త్రరక్షకుండు మధుసూదనుండని నిశ్చయింపుము. వేదాదుల సమాచారంబు లట్లుంచి లోకానుభవంబుచే విష్ణుప్రభావంబెఱింగింతు నాలకింపుము. యెట్లంటివేని వాసుదేవుం డెట్లు సర్వవ్యాపకుండై యుండెనో యట్లే తదీయ నామంబులును జగద్వ్యాపకములై తనరారుచున్నవి. "రామరామా యనునంతకాలము రాజ్యమేలుదుమా"యని యొకండు పల్కుచున్నాఁడు. పంటభూములంగని నప్పు డొకఁడు "బలే బలే యీస్థలము సీతారాములఁ గోరుచున్నదిరా" యనుచున్నాఁడు. కలరా మసూచికాది వ్యాధులు దేశమున వ్యాపించినప్పుడు రామభజనముచే నివారింపుచున్నారు. వారిసోదరులు రామలక్ష్మణులంబోలి యున్నారనియు, నెండలో నుండువారిని "రామరామ"యని కృపఁదలఁచవలయుననియు, నేసీయేను పుస్తకములో "శ్రీరామ" పెట్టలేదనియు, నన్యాయకార్యముఁ గనినప్పుడు "రామ రామా యిది న్యాయమేనా" యనియుఁ బ్రజాసమూహమునుఁ గాంచినప్పుడు "రాముని దాడిగా నున్న"దనియు, నీకుట్టి వాఁడు "రామబాణమువంటివాఁ"డనియుఁ, నీవిచ్చలవిడి

రామరాజ్యమైనదా యనియు "నన్నేమో రామచంద్రా" యనియు, "రామా, కృష్ణా" యనుటదక్క నాకేమియు రాదనియు, లోకులు లోకోక్తులుగా భగవన్నామము లుచ్చరించుచున్నారు. ఎద్దియైన వ్రాఁతఁ బ్రారంభించునప్పుడు "(శ్రీ)రాములు" అని మున్నాళు లిఖించి వ్రాఁత నారంభించుచున్నారు, "నీవు చేయు విష్ణుచక్ర మేమిటిరా" యనియుఁ "జక్రధరునితో నున్నదిగాని నీతో నేమున్నదిరా" యని జనులు వచింతురు. మఱియు శవమును మోచువారు శ్మశానమునకుఁబోవుటకు నారాయణనారాయణయని యుచ్చరింతురు. కాశిలోఁజచ్చువారికి శివుండు రామమంత్రమంత్య కాలంబునఁ జెప్పుచున్నాఁడని పెద్దలు వచింతురు. ఇదియిట్లుండఁగా గ్రామశక్తులకు జాతరలు సేయునప్పుడు సుద్దులుసెప్పువారు "ఓరామ రామా"యని మకుటము వేయుదురు. దేవతావేశముగలవారు "రామరామగోవిందా"యని మోదుకొందురు. "జయసీతారామ, జయసీతారామ" యని బైరాగులు వచింతురు. "దీపముపెట్టే దిక్కు లేదయా బొబ్బిలికోటాకు" నని యొకండు పాడుచుండఁగా "రామరామ(శ్రీ)రామా రామారామరఘురామ" యని రెండవవాఁడు మకుటము వేయుచున్నాఁడు. జంగమకథలో "చంద్రవంశపావనులు పాండురాజేంద్రుని నందనులు" అని యొకండనుచుండఁగా, "(శ్రీ)గోపాలా రాధాలోలా శ్రితజనపరిపాలా" యని రెండవవాఁడు మకుటము వేయుచున్నాఁడు. జనులకు విపత్తులు సంభవించినప్పుడును పురిటింటిల్లలోను మోటువారు

మల్లెతోఁటలమీఁద నారాయణా, మలయుచునున్నావు నారాయణా
మొగలితోఁటలమీఁద నారాయణా, మోజుతోనున్నావు నారాయణా
అరటితోఁటలమీఁద నారాయణా, యూఁదుకొనియున్నావు నారాయణా

అని పిచ్చిగా వెచ్చిగాఁ బెల్లవాళ్లు నారాయణనామము నుచ్చరింతురు. భిక్షుగాండ్రలోఁ గొంతమంది,

ఒకముద్దైయ్యమ్మ నారాయణా, బొజ్జల్లుడొస్తాడు నారాయణా
బొజ్జల్లుడొస్తాడు నారాయణా, బంగారుదోసెడే నారాయణా
యని నిరంతరము పాడుచున్నారు.

కామమ్మపుట్టంగఁ గఱవువచ్చింది రామరామా
అమ్మరో ఓయమ్మ మాలచ్చిమమ్మా రామరామా

యని కొందఱు కథకులు రామశబ్దము మకుటముగా వాడుచున్నారు ఈచెప్పెడువారికిఁ బైశబ్దములు శాస్త్రాభ్యాసమువల్లను గురూపదేశము వల్లను వచ్చినవి కావు. తల్లిదండ్రులు యేభాషనుచ్చరింతురో తదీయభాష వారిపుత్రులకు నతిసులభముగా వచ్చును. కావుననే బ్రహ్మ మొదలు పిపీలికల పర్యంతము సమస్త దేహధారులకు నారాయణుఁడు తండ్రి గనుక వానినామంబులు శరీరులకు సహజముగానే నోటవెడలుచున్నవి దానింబట్టి బుద్ధిమంతులు వాసుదేవుఁడే సర్వవ్యాపకుఁడని సర్వరక్షకుఁడని యెఱుంగవలయును. 87

చరణాయుధంబులు తెల్లవాఱుజామున లేచి "క్కొక్కొరోక్కో" యని కేకలువేయుటచే "నొక్కఁడేరో" యని కూయుచున్నవని భావము. కాకులు "కః, కః" యని కూఁతవెట్టుచున్నవి. చిలుకలు "రామః రామః" యనుచున్నవి. కుక్కలు "ఔ నౌ నౌ" నని మొఱగుచున్నవి. వీనివల్లఁ దేలిన పారమార్థిక మేమనఁగా కుక్కుటంబు లొక్కఁడేరో యనుటవల్ల సృష్టి స్థితి లయ కారణుండగు భగవంతుఁడొక్కఁడే సుమీయని పల్కుచున్నవి. కాకులు "కః, కః" యనుటవల్ల వాఁడెవ్వఁడని ప్రశ్నింపుచున్నవి. చిలుకలు "రామః రామః" యనుటవల్ల రామావతారుండగు నారాయణుండే సుమీ యనుచున్నవి. గ్రామసింహంబులు "ఔ నౌ న"ని సాక్ష్యమిచ్చుచున్నవి. గరుడపక్షి కృష్ణాయని నుడువుచున్నది. హేతువేమనఁగా నెన్నఁడు కృష్ణునిఁ దలంపని జనులఁగాంచి ఓహో పామరులారా

మాటలయందు నైపుణ్యములేని తిర్యగ్జంతువగు నేను కృష్ణా! యను
చుండఁగా శాస్త్రాధికారులగు వీరేల భగవన్నామోచ్చారణ చేయరని
బోధింపుచున్నది. గోవు లంభారవమొనర్చు కారణమేమనఁగా అం=
అనఁగా నకారవాచ్యుఁడగు విష్ణుదేవుని, భా=అనఁగా భార్గవి-
అన,గా లక్ష్మియాశ్రయించినది వీరేల యాశ్రయింపరని జనులకు
బోధింపుచున్నవి. 87

సుశీలుఁడు

పశు పక్షి మృగాది తిర్యగ్జంతువులకు సద్విజ్ఞానమున్నదా? 88

వరవరముని

లేదనుటకు వీలులేదు. పొలమునమేయు పశువులు మేకలు మొదలైనవి సూర్యాస్తమయసమయంబున నెవ్వరివి వారియింటికే వచ్చును. అభ్యాసవశంబున నొకరికిపాలిచ్చు బఱ్ఱెగొడ్డు వేఱొకరిని మూచూచి తన్ని వెళ్ళగొట్టును. పోట్లగొఱ్ఱొక్కనికెదిరిచి చెప్పినట్లు నడచును. ఇవియెల్ల జ్ఞానలక్షణంబులేకదా! ఇంతేకాక గజేంద్రుఁడు వేయివర్షంబులు భగవంతుని నుతించెను. జటాయువు రామకార్యార్థమై శరీరంబు విడిచెను. ఇదియిట్లుండఁగా వానరులు సేతువుఁగట్టు సమయంబున నొక్కయుడుత సాయముచేయనెంచి మున్నీటి నీటిలో మునింగి యిసుకపైఁబొరలి సేతువుపై దులుపుచుండఁగా సౌశీల్యనిధి యగు శ్రీరామచంద్రుఁడు వీక్షించి తదీయభక్తి కచ్చెరువొంది మూఁడువ్రేళ్ళతో నిమిరి మోక్షమొసంగెను. తరువాత రాముని హస్త చిహ్నము చిక్రోడములయందు నిప్పటికిఁ బ్రకాశింపుచున్నది. ఇంతే కాక రాఘవుం డొకానొకప్పు డరణ్యంబుననేగుచు శరణాగతిచేసిన గృధ్రోలూకంబుల తగవుదీర్చి రక్షించెను. అయోధ్యయందొక్కసారమేయము శరణాగతిచేయఁగా శ్రీరాముఁడు దానింగాపాడి తద్విరో

థిని దండించెను. సీతా వల్లభుని కన్నికార్యంబులొనర్చి పునీతులైన వారు తిర్యక్కులగు వానరులేకదా. 90

ఇంతేకాకుండ శ్రీకృష్ణుఁడు కాళియునిదండించి యమునా నదీహ్రదంబునుండి వెడలుమని చెప్పఁగా గోవిందునితో నాసర్ప మిట్లనియె, దేవా గరుడునకు నాకుఁ బూర్వవైరంబుగలదు వైనతేయుండీమడుగునకు రా వీలులేదని సౌభరి శపించుటవల్లఁ జిరకాలం బిచ్చటదాగి బ్రతికితిని మరలరమణకద్వీపంబున కేగితినేని ఖగేశ్వరుండు నన్ను వధించును, నేను జీవించుటెట్లని యడుగగా నందనందనుండు కాళీయునితో నోరి నీశిరస్సున మదీయ పాదచిహ్నంబులుండుటచే గరుడుండు నిన్ను దండింపడు సరేగదా యిదిమొదలు మచ్చరణ లక్షణంబులు నీకులము వారెందఱుందురో యందఱి శిరంబులయందుం డునని వరంబొసంగెఁగావున నుడుతలయందు రామహస్తచిహ్నంబులు త్రాఁచుఁబాములయందుఁ గృష్ణాంఘ్రిలక్షణంబులు నిప్పటికి గోచరింపుచున్నవి కాబట్టి దేవ తిర్యఙ్మనుష్య స్థావరములకుఁ దమతండ్రి యగు నారాయణునిఁ గాంచినప్పుడు జ్ఞానము ప్రజ్వలించును. 91

సుశీలుఁడు

గురూత్తమా! సముద్రమువల్ల లోకమునకుఁ బ్రయోజనంబేమి భగవంతుఁడు దానినేల సృజించెను? 92

వరవరముని

మేఘుఁడు సముద్రజలము-ద్రావి భూమిపై వర్షింపుచున్నాఁడు. లోకోపయోగమునకుంబోగా మిగిలినజలంబు మరల వారాశిలోఁ బ్రవేశింపుచున్నవి. నదీనదప్రవాహములు సముద్రమునఁ బ్రవేశింపుచున్నవి. లేనిచో నొక్కనాఁడే జగత్తునకుఁ బ్రళయము పుట్టును.

ఇంతేకాక సముద్రుఁడు తిమి తిమింగిలాద్యనేక జంతువుల కాధారభూతుఁడై యున్నాఁడు. మఱియు, వజ్ర వైడూర్య, నీల, గోమేధిక, పుష్యరాగ, మరకత, మాణిక్య ముక్తాఫలాది రత్నంబులనిచ్చు రత్నాకరుఁడని ప్రసిద్ధిజెందినాఁడు. సముద్రుఁడిట్టి మహోపకారి గనుకనే మనజనార్దనుండు క్షీరవారాశిపై వైకుంఠమునిర్మించి లక్ష్మీసహితుఁడై వసించియున్నాఁడు. ఇచ్చట ననిరుద్ధాఖ్యతో రామకృష్ణాద్యవతారములకు మూలకందమై యుండును. బ్రహ్మరుద్రాది దేవతలచ్చటికి బోయి వారి వారి కార్యంబులు విన్నవించుకొని పోవుదురు, కాని పరమాకాశంబునకుం బోనఁజాలరు. నిత్యవిభూతియుఁ బరవాసుదేవుండును విధి శివ సనకాదుల కవాఙ్మనసగోచరుండని శాస్త్రములు వక్కాణింపుచున్నవి. మఱియు గరుడధ్వజుం డంభోధియం దమృతమునుఁ బుట్టించియుఁ గల్పక చింతామణీ కామధేనువులను నిర్మించియు నలువదికోట్ల దివ్యాప్సరసల సృష్టించియు దేవతల కొసంగి వారాశి కీర్తిఁబ్రకటించెను. మఱియు నప్పురుషోత్తముఁడు రామావతారకాలంబున స్వరూప విరుద్ధమని తలంపక స్వాతంత్ర్యమునువిడిచి మూఁడుదినంబు లుపవాసముండియు సముద్ర ధిక్కారంబు సహించి శరణాగతుండగు ననధిం జంపనొల్లక దానిపై సేతువుమాత్రము నిర్మించి కార్య సాఫల్యానంతరము దానిఁ దెగఁగొట్టి భారమడంగించెను. కృష్ణావతార సమయంబున నప్పారావారంబుపై ద్వారకనిర్మించి తనవారితోను లాతివారితోను బహుకాలము వసించెను. ప్రళయ కాలాంభోధిలో వటపత్రశయనుఁడై మార్కండేయ సత్యవ్రతాది భక్తులంగాపాడెను. ఇవియెల్లఁ బర్యాలోచింపఁగా రాజీవాక్షుఁడు సముద్ర శాసకుఁడై సముద్ర రక్షకుఁడై యున్నాఁడు. 93

సుశీలుఁడు

గంగానది విష్ణుపాదమునందు జనించుట నిక్కమేనా? 94

వరవరముని

సందేహములేదు. గంగానది విష్ణుపాదోద్భవియని శ్రుతి స్మృతీతిహాస పురాణంబులు ఘంటాపథంబుగాఁ జాటింపుచున్నవి సరేగదా రాజు రంగన్న యెల్లయ్య. పుల్లయ్య కామమ్మ కనకమ్మ యానన్నండి యెఱింగిన సమాచారమే. భగవంతుఁడు బలిచక్రవర్తి యొద్ద బ్రహ్మాండమును గొలుచుట కుద్యోగించి యూర్ధ్వంబునకుఁ గాలుసాచగా నప్పాదము సర్వలోకంబులు దాఁటి బ్రహ్మలోకంబుఁగడచి బ్రహ్మాండకటాహమునుఁ దాటించె నయ్యవసరంబునఁ గటాహంబు పగులగా విరించి విస్మయంబొంది నిరీక్షించి సర్వరేఖాలంకృతంబైన తత్పాదంబు తన తండ్రిదని యెఱింగి యాపవిత్రజలంబును స్వకీయ కమండలువునందుంచెను. భగీరథకాలంబున నయ్యుదకంబు హిమాలయమునుండి భూమికిదిగి భాగీరథీ జాహ్నవీ నామంబులతోఁ బ్రవహించి సగరపుత్రుల నఱువదివేలమందిని స్వర్గలోకంబున కనిచెను. అదియేమందాకినీ నామంబుతో స్వర్గంబునందును భోగవతీ నామంబుతోఁ బాతాళంబునందునుఁ బ్రవహింపుచున్నది. ఏతత్తీర్థంబుచే ఘోర విరించనులు పునీతులైరి. శ్రీహరి పాదతీర్థంబగు నీజాహ్నవి త్రిలోకపావనియై తీర్థరాజంబై మకరందవాహినియై భూతసమూహంబులు తనలోమునిగినప్పుడు పవిత్రులఁజేయుచున్నది. కావునఁ దీర్ఘపాదుండును తీర్థరక్షకుండును వాసుదేవుండేసుమీ. 95

సుజ్ఞలుఁడు

ముప్పోకలాను పర్వతముల నేల సృజించెను ? 96

వరవరముని

భగవంతుఁడొక పర్వతములనేకాదు జీవకోటిని దేవ తిర్యఙ్మనుష్య స్థావరములుగాను అండజములుగా నుద్భిజములుగా స్వేదజములుగా జరాయుజములుగా సృష్టించి వానిలోఁ గొన్నిటి నన్యోన్యమిత్రులుగానుఁ బరస్పర శత్రువులుగాను సృజించె నా యా సృష్టి

కార్యోపయోగమును మనము తెలుసుకొనఁజాలము. లీలా రసానుభవాభిలాషియును జగద్వ్యాపారియు నగు శ్రీహరికే వేద్యమైయున్నది. అప్పురాణపురుషుండు ముందుగాఁ బృథివ్యాది పంచభూతముల నిర్మించి భూమి కాధారముగా నుండుటకొఱకు శిలోచ్చయంబులనుఁ బాతాళము మొద లూర్ధ్వ లోకంబులవఱ కుండునట్లు నిర్మించెను. అక్కారణంబున మహీధ్రంబులు సర్వలోకంబులనుఁ గాపాడుచున్నవి. గిరివర్గంబునే కాకుండ నాదిశేషుని నాదివరాహంబును అష్టదిగ్గజములను ఆదికూర్మంబును అధోభాగంబుననుంచి సర్వేశ్వరుఁడు పైవానికన్నిటికి స్వీయామోఘ సత్య సంకల్పము నాధారముసేసి రక్షించుచున్నాఁడు. మఱియు నప్పుండరీకాక్షుండు మేదినియందు ధన ధాన్య రత్నాంబరాది నిర్మాణ చాతుర్యంబును వహనశక్తిని నీరంబులందు శైత్యాగాధత్వ పోషణశక్తులను వహ్నియందు దహన, పచన, హవ్య, కవ్య, రక్షణ శక్తులను వాయువునందు సమస్త భూత ప్రాణాధార సామర్థ్యంబును విహాయసంబునందు మేఘోత్పాదనావకాశ, ప్రదాన నైపుణ్యంబును నిలిపి రక్షించుచున్నాఁడు. నదులయందుఁ బ్రవాహంబును శిలోచ్చయంబులయందుఁ గాఠిన్యమును జాహ్నవియందుఁ ద్రిలోక పావన ప్రభావంబును సింధురంబులయందుఁ దురంగంబులయందును మద జవంబులును సింహంబునందు మృగపతిత్వము శార్దూలమునందు శౌర్యమును ఈగలయందు మకరంద సంచయ విధాన నైపుణ్యంబునుఁ బంకంబునందు రాజీవ నిర్మాణంబును మృత్కీటకంబునందుఁ గర్దమాలగ్నతా నైపుణ్యంబును మయూరంబులయందుఁ జిత్రవర్ణంబును హంసలయందు నీర క్షీర విభాగ సామర్థ్యమునుఁ గీరంబులయందు భాషించు నేర్పునుఁ భ్రమరంబులయందు మాధుర్య గానంబునుఁ గురంగంబునందుఁ గస్తూరియు మార్జాలంబునందు సాంకవంబునుఁ గాకోదరంబునందు గరళంబును నిర్మించి

యా యా జంతువులయందు నా యా గుణంబులు గల్పించి యెప్పటికిఁ జెడకుండ రక్షించువాఁడు మధుసూదనుండని యెఱుంగుము. 97

సుశీలుఁడు

పైసమాచార మట్లుండనిచ్చి శరీరధారులకు లిబ్బి ముఖ్య రక్షకముగా నున్నది. దాని నార్జించుటకుఁ గోటి మార్గంబులు గలవు. ధనముచేతఁ గాని కార్యము లేదు.

సీ॥ భక్ష్య భోజ్యాపూప పరమాన్న శర్కరా
గుడ శిగ్రువుల సమకూర్పవచ్చు
సుందరీమణుల భాసుర చేల దాస దా
సీ సౌధపాళి నార్జింపవచ్చు
గంధర్వ శృంగిణీ గజ మంజు లోద్యాన
భర్మ భూషణములఁ బడయవచ్చుఁ
బుష్పానుబోధ తాంబూల పన్నీరాది
సురభి వస్తువులచే సొగయవచ్చుఁ
జేరిన వనీపకులనుఁ బోషింపవచ్చు
బంధుగులఁగూడి హర్షంబుఁ జెందవచ్చు
ద్రవ్య మబ్బిననాఁడు విత్తమునకంటె
రక్షకము లేదు గాదె విరాగివర్య ! 98

వరవరముని

ధనము భోగసాధనమనుట నిక్కంబె కాని రక్షకమను వాక్య మసత్యము,

సీ॥ రోగంబులంటి నిరోధించునప్పుడు
సాయమై యారోగ్య మీయఁగలదె
భార్యాసుతులు దన్నుఁ బరిభవించిననాఁడు
వేచి సపర్యఁ గావింపఁగలఁదె

బహువిధాపత్పరంపర క్రమమ్మునప్పుడు బో
ధించి సంతోష మొందింపఁ గలడె
లోకాపవాదముల్ డీకొన్నవేళ మా
యించి భూరియశస్సు నీయఁగలడె
ఘోరమై దేహమున జరాభార మొదవ
నప్పు డార్తిఁ దొలంచి యూరార్పఁగలడె
యట్టిధనమున రక్షకమను తలంపు
కలుగునే జ్ఞాననిధి మనసికమలమందు.

సీ॥ ధనమునకై ప్రయత్నముసేసి మునుపున్న 99
రిక్థ మూఱఁగ దేవురించువారు
కలవిత్తమెల్ల సుతుల కధీనముగాఁగ
నిచ్చలు సిద్ధింప కేడ్చువారు
కైతవాదులకు రొక్కము పోవఁగాఁ దరు
వాతఁ గూటికిలేక వగచువారు
సంచిత ధనము వెచ్చించిరే తనకుటుం
బము వారలని దిగుల్పడెడువారు
చోరతతిచేఁ బ్రభుత్వము వారిచేత
ధనముఁగోల్పోయి వగపుఁ జైకొనెడువారు
కానఁబడుచుందు రెల్ల జగంబునందు
లిబ్బి రక్షకమనుట లేలీలఁ బొసఁగు 100

ఆ॥ ద్రవ్యమైనఁగాని దైవంబు తోడైన,
చో లభించు లేనిచోటరాదు
వర్షమున్నచోటఁ బండును సస్యముల్ 101
నఱపు కలుగునేనిఁ గఱవువచ్చు.

సుశీలుఁడు

కని పెంచిన జననీ జనకులు బిడ్డలకు రక్షకులుగారా? 102

వరవరముని

దురాత్ముండగు హిరణ్యకశిపుండు సద్గుణ గరిష్ఠుండగు ప్రహ్లాదునిఁ జంప నుద్యోగించెను గాన జనకుండు రక్షకుండు గాఁడు. కైక నిష్కారణముగా లోకారాధ్యుఁడగు రాముని వనవాసంబునకుఁ బనిచెను. కద్రువ స్వకీయపుత్రులను జనమేజయ యాగకుండంబునఁ జచ్చునట్లు శపించెను. దానిచేఁ దల్లి రక్షకముగాదు. తల్లిదండ్రులు శునశ్శేఫుని యాగపశువుగా విక్రయించిరిగనుక జననీ జనకు లిద్దఱు నేకీభవించియు రక్షకులు గారు. 103

సుశీలుఁడు

సహోదరు లొకరి కొకరు రక్షకులు గాఁగూడదా? 104

వరవరముని

సుందోపసుందులు పరస్పరము సమరంబొనర్చి యొకరిచే నొకరేక కాలంబున మరణించిరి. వాలి జీవించినంతవఱకు సుగ్రీవుని దండించెను. రావణుండు హితబోధకుఁడగు విభీషణుని నిందించి వెడలఁగొట్టెను. ఈకారణముచే సోదరు లన్యోన్య రక్షకులు గారు. 105

సుశీలుఁడు

పుత్రులు జననీ జనకుల రక్షింపలేరా? 106

వరవరముని

సగరచక్రవర్తి కుమారు లఱువదివేలమంది దుష్టాత్ములై తండ్రి కపకీర్తిఁ దెచ్చుటచేతను దుర్యోధనాదులునూర్గురు కుమారులు దురాత్ములై ధృతరాష్ట్రుని దుఃఖమునకుఁ గారణభూతు లగుటచేతను కంసుఁ డుగ్రసేనుని కారాగృహమందుంచుటచేతను యదువు యయాతిని ధిక్కరించి శాపమొందుటచేతనుఁ గుమారులు తండ్రికి రక్షకులు గారు. 107

సుశీలుఁడు

ఏది యెట్లున్నను భార్యకు భర్త సర్వదా రక్షకుఁడై యుండుట నైజమేకదా ? 108

వరవరముని

సాంసారిక వ్యాపారంబులుజరుగుటకుభార్యకు పారతంత్ర్యమునుఁ బెద్దలు విధించిరేగాని భర్త రక్షకుండనియు నిశ్చయంబుగా తోఁచదు. ఎట్లంటివేని రాజ్యము పోయినపిమ్మట వదలకుండఁ దన్ను వెంబడించి వచ్చు దమయంతి నర్ధరాత్రంబున నట్టడవిలో విడిచి నిర్దయాత్ముఁడై నలుండు స్వేచ్ఛంబోయెను. జమదగ్ని స్వల్పదోషంబునకై రేణుకను నఱికించెను. కౌరవులు మహాసభలో యాజ్ఞసేనిం బరాభవింపుచుండఁగా సమర్థులగు పాండవులు నిరీక్షింపుచు నూరకయుండిరి. కాబట్టి భర్త భార్యకు రక్షకుఁడు కాఁజాలఁడు 109

సుశీలుఁడు

భార్య భర్తను రక్షింపరాదా ? 110

వరవరముని

మూఁడువందల యేఁబది మందిభార్యల నీసడించి తన్నే ప్రేమింపు చున్న దశరథునకుఁ గైకేయి దుఃఖహేతువయ్యెను. దీర్ఘతముఁడు నిద్రింపుచుండఁగా నతనిపత్నియగు ప్రద్వేషిణి తన మగండగు దీర్ఘ తముని దారువులపై నిల్పి నీటంబడఁద్రోయించెను. ఈ హేతువులచే జాయలు మగలకు రక్షకులుగారు. 111

సుశీలుఁడు

షడ్డక జామాతృ స్యాల శ్వశ్రూ శ్వశురస్వస్త్రీయాది బాంధవులు రక్షకులు గారా ? 112

వరవరముని

సీ॥ మొల్లంబు గలనాఁడు పిల్ల నొసఁగి కట్న-
మిచ్చెదమంచు నేమేమొ చెప్పి
నట్టింటఁ గూర్చుండి నానాపదార్థముల్
మెక్కు కాలమునఁ బ్రేమించి పొగడి
నిరుపమానాంబరాభరణంబు లిచ్చుచో
నినుఁబోలుదాత లేడని నుతించి
బహుకార్యములఁ దోడుపడువేళ నాపాలి
వేల్పు వీవని చాల వినుతిఁ జేసి
చేతులొగ్గిన బంధుగణు లీస్ధరించి
లెక్కచేయరు లేమిచే బొక్కువాని
నట్టిచుట్టాలు రక్షకులని తలంచు
వాఁడు మూర్ఖుండుగాక యెవ్వాఁడు గలఁడు 113

సుశీలుఁడు

అట్లైనచో నారోగ్యప్రదుండగు సూర్యుని నమృతదాయకుం డగు చంద్రుని ధనదాయకుండగు నగ్నిహోత్రుని భజించినచో శరీరికి వారు రక్షకులుగారా ? 114

వరవరముని

శ్లో॥ యదాదిత్య గతం తేజో, జగద్భాసయతేఽఖిలమ్
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ, తత్తేజో విద్ధిమామకమ్

ఏ తేజస్సు సూర్యునియందుండి ప్రకాశింపఁ జేయుచున్నదో యేది చంద్రునియందుండి వెన్నెలఁ గాయుచున్నదో యేది వహ్నియం దుండి దహింపుచున్నదో యాతేజస్సు నాదియని యెఱుంగుమని గీతాచార్యులవా రానతిచ్చిరిగనుక వారి కాశక్తి సొంతము కాదు. వారు దేహధారులకు రక్షకులుగారు. 115

సుశీలుఁడు

సృష్టికర్తయగు విరించిని నణిమాద్యష్టైశ్వర్యములుగల గంగాధరునిఁ జింతామణికల్పకాదులుగలిగి మేఘవాహనుఁడై త్రయస్త్రింశత్కోటి దేవతలకుఁ బ్రభువగు నింద్రుని నారాధించినచో రక్షకులు గారా ? 116

వరవరముని

బ్రహ్మచే వరంబులొందిన హాటకకశిపు త్రిపురాసురాదులు మృతిఁ బొందునప్పుడును రుద్రునిచే వరంబులఁగొన్న బాణాసురాదులు బాధలొందునప్పుడును బ్రహ్మరుద్రులచే వరంబు లొందిన రావణాదులు నశించునప్పుడును దిక్కులేనివారై విలపించిరి. ఇంద్రు నారాధించి స్వర్గస్థులైనవారు పుణ్యాంతంబునఁ దలక్రిందుగా భూమియందుఁ బడుచు నేడ్చుచున్నారు. ఈప్రమాణంబులచే హర విరించి శక్రాదులు రక్షకులు గారని యెఱుంగుము. 117

సుశీలుఁడు

నేనెత్తిచెప్పినవారినందఱిని మీరు నిరసించితిరి. ముఖ్య రక్షకుఁ డెవ్వఁడో యానతిండు. 118

వరవరముని

రక్షకుండైనవానికి జ్ఞానము, శక్తి, దయా, వాత్సల్యంబులను నాలుగు గుణంబు లుండవలయును. వానివల్లఁ బ్రయోజనంబేమనఁగా శరీరి శరణాగతి చేసినప్పుడు వీఁడెందులకుఁ జేయుచున్నాఁడా, వీని కనిష్ట నివృత్తియు, నిష్టప్రాప్తియుఁ గలిగించు టెట్లోయని విచారించునది జ్ఞానము. జ్ఞానానుసారముగాఁ బనిచేయించునది దయ. విఘ్న పరంపరలఁ దొలఁగించి విరోధుల నిర్మూలించునది శక్తి. దోషములను భోగ్యములుగాఁ దోపించునది వాత్సల్యము, ఇవిగలవాఁడే శరణాగతులఁ దప్పక రక్షింపఁగలఁడు. లేనిచో రక్షింపఁజాలఁడు. మన యిష్ట

లకుఁ గష్టములు వచ్చునప్పుడు దయగలవారమయ్యును శక్తిహీనుల మగుటచే రక్షింపఁజాలకున్నాముగదా! పై నాలుగు గుణంబులును సమస్త కల్యాణ గుణ పరిపూర్ణుండగు నారాయణునియందే యున్నవి. వెండియు నారాయణునియందుఁ బుండరీకాక్షత్వము, పురుషోత్తమత్వము, లక్ష్మీపతిత్వము, శుద్ధ సత్త్వగుణాశ్రయత్వము ననునవి యనన్యసాధారణములై పొలుపారుచున్నవి. రమాధీశుఁడు కృష్ణావతారకాలంబున నెనిమిదేండ్ల వయస్సునఁ బృందావనంబున మూఁడు లక్షల యేబదివేలమంది గోపికలతో నేకకాలంబున భోగించి వారినిఁ దనివిఁ జెందించి వారికి సంతానము కలిగినచో సంసారబంధంబు హెచ్చునని యోజించి స్వకీయామోఘ వీర్యస్ఖలనము కానీయలేదు. ఈసామర్థ్య మతనికిఁదక్క రెండవవారి కెవ్వరికిని లేదు. మఱియుఁ గృష్ణుండు పదియాఱువేల రాజకన్యలను రుక్మిణీ సత్యభామా ప్రముఖాష్ట సాధ్వీమణులను భార్యలుగాఁ బరిగ్రహించి వారికందఱి నన్నిసౌధంబులం దుంచి రాత్రికాలంబునఁ బదియాఱువేల యెనిమిది కృష్ణాకారంబులు ధరించి వారితో భోగింపుచుండెను. ఇంతమందిభార్యలకుఁ గలహంబు లేకుండ సమర్థించుటచే దక్షిణ నాయకుండై పురుషోత్తమత్వము ప్రకటించెను. 119

ద్వారకయందు ముప్పదిమూఁడుకోట్ల పుత్ర పౌత్ర మిత్ర భ్రాతృ పరిజన బాంధవజన సమూహంబుల నేకొఱంతయు లేకుండ సౌధ ప్రాకార మజ్జన భోజన శయ్యాసనాదు లొసంగి రక్షించి లక్ష్మీపతిత్వమును వెల్లడించె నది యట్లుండఁగా వరాహావతారమెత్తి యొంటికోఱతోఁ బాతాళగతమైన భూమి నుద్ధరించి స్వస్థానంబున నిలిపి భూతముల కాధారము చేసెను. విలయకాలసముద్రంబున నల్లాడుచున్న మార్కండేయునిఁ జేరఁదీసి పునఃసృష్టివఱకు గర్భంబుననుంచి కాపాడెను. గజేంద్రుఁడు వేయివర్షంబులు మకరితోఁబోరాడి జయింపలేక దిక్కుఁగానక శాస్త్రాధికారము లేనందున సర్వేశ్వరుం డెన్నఁ

డైనది తెలియక లోకంబు లెవ్వనిచే జనించు నెవ్వనిచే జీవించు నెవ్వనిచే లయించునో యని, పరత్వ బిరుదంబులు వహించు సత్త్వ మధ్యమ పురుషుల విడిచి కేవల ప్రథమ పురుషాలాపంబులచే స్తుతింపఁగానే తద్వాక్యంబులు విని హరి పరించిన శక్రాదులు (నారాయణం నవయం) మేముగాము, మేముగామని యూరకుండిరి. ఏకత్ర సమయంబున దేవీ సహస్ర పరివేష్టితయగు లక్ష్మితో సరస సల్లాప సుఖంబొందుచున్న జనార్దనుండు దంతినాయకుని దీనాలాపంబు లాకర్ణించి తదీయబిరుదంబులు తనకుఁదక్క నితరులకు లేవని నిశ్చయించి సర్వేశ్వరత్వము సంతోషమున కంతరాయము కలిగించెనేయని చింతించియు హృషీకేశుండగుటచే శృంగార రస సంస్థితంబగు మనస్సును మరలించుకొని భక్తవత్సలుండగుటచే వైకుంఠంబునుండి దిగ్గన లేచి శ్రీదేవికిం జెప్పక గరుడునిపై నారోహింపక పరంపరగాఁ జేయుచున్న నిలింపుల నమస్కారంబు లంగీకరింపక కొలంకుడాసి మకరింద్రుంచి గజేంద్రునికి మోక్షంబొసంగెను. దీనిచే విష్ణుని పరాత్పరత్వమును రక్షకత్వమును వెల్లడియైనది. 120

ఇంతేకాక మాధవుండు విలయకాలంబున స్వకీయ నాభీకమలంబునందు బ్రహ్మను సృజించె నవ్విరించి హరింగూర్చి నూఱు దివ్య సంవత్సరంబులు తపంబొనరింపఁగా నచ్యుతుం డతనికి సాక్షాత్కరించి సృష్టి విధానంబు కొంత నేర్పి వేదంబు లిచ్చెను. మధు కైటభులను దానవు లవ్విధిం గొట్టి వేదంబు లపహరింపఁగా నప్పురుషోత్తముఁ డయ్యాదిమ రాక్షసుల రూపుమాపి హయగ్రీవావతారమెత్తి యఖిలమైన వేదభాగంబులఁ బూరించి బ్రహ్మ కిచ్చెను గనుక చతుర్ముఖునకు విష్ణువే రక్షకుఁడై యున్నాడు. హరున కసాధ్యమైన త్రిపురాసుర సంగరమునందు విష్ణువు శిలీముఖమై యయ్యసురుల సంహరించెను రుద్రుండు వృకాసురునిచే విపత్తుఁ గాంచినప్పు డన్నిశాచరుని వధించియు బ్రహ్మ శిరంబు ఖండించి తదీయ హత్యాపీడితుఁ డైనప్పు

దాహత్యను నశింపఁజేసియు హాలాహలంబుఁ ద్రావి మూర్ఛిల్లినప్పు
డవ్విషబాధ నెడఁబాపియు బాణాసురార్థమై సమరంబొనర్చి యోడి
శరణాగతుండు కాఁగా క్షమించియు స్వకీయ శ్రీపాద తీర్థంబగు
గంగచేఁ బవిత్రునిఁ జేసియుఁ బినాకినిఁ గాపాడినందున శివునకును
వాసుదేవుఁడే రక్షకుండై పొలుపారుచున్నాడు. బలవద్వైరులగు
హిరణ్యకశిపు రావణ మేఘనాద నరక వృత్రాది యామినీచరులచేఁ
గలగుండు పడినప్పు డా యా దైత్యుల వధించియు విశ్వరూపునిఁ
జంపి తదీయ హత్యాపీడితుఁడైనప్పు డా హత్యను నశింపఁజేసియు
బలిచక్రవర్తి నుపాయంబుచేఁ దొలంగించి స్వర్గరాజ్యము నధీనము
సేసియు నింద్రునిఁ గాపాడినందువల్ల నద్దివిజపతికిని రాజీవాక్షుఁడే
రక్షకుఁడై యున్నాడు. దుష్టులగు దైత్యులఁబాఱఁదోలి యమృతము
దేవతలకిచ్చుటచే వేల్పులకును జనార్దనుడే రక్షకుండని యెఱుంగుము
దండకాటవిలోఁ జతుర్దశ నక్తంచరుల వధించి మునీంద్రుల పీడ లడం
గించినందున మునీశ్వరులకును గేశవుఁడే రక్షకుండని తలంపుము.
తుచ్ఛుండగు రావణుని సంహరించి తదీయ కారాగారస్థలగు దేవ
కాంతా సముదయంబును విడిపించినందువల్లను నరకాసురుని మడి
యించి షోడశ సహస్ర కన్యాలలామంబులఁ జెఱ విడిపించినందు
వల్లను గౌతమ వధూ శాపంబునుఁ దొలంగించినందువల్లను ద్రౌపదీ
వస్త్రప్రదానంబువల్లను గోపాలాంగనలకు మోక్షదాయకుండగుటచే
తనుఁ గంసదాసికి సౌందర్య ప్రదాయకుండగుటచేతనుఁ బద్మనా
భుండు మానినీజన రక్షకుండని తలంపుము. పరశురామరూపంబుచేఁ
గార్తవీర్యార్జునాది దుష్ట క్షత్రియుల వధించి భూముల బ్రాహ్మణుల
కర్పించుటచేఁ జక్రపాణి బ్రాహ్మణ రక్షకుండని తెలిసికొనుము.
జరాసంధుని వధింపించి తదీయ కారాగార పీడితులగు భూపాలక
బృందంబుల విడిపించినందువల్ల శార్ఙ్గధరుండే క్షత్రియ రక్షకుఁడై
వెలుంగుచున్నాడు. 12

మఱియు నుత్తరాబాలక సాందీపనిపుత్ర వైదికపుత్రాదులను బ్రతికించినందువల్ల శిశురక్షకుండు గోవిందుఁడని యెన్నవలయును. శబరీ గుహాదులం బ్రోచుటచే నాటవికజన రక్షకుండును గజేంద్రునకు మోక్షమిచ్చుటచేఁ బశువులకును జటాయువునకు ముక్తిదాయకుండగుటచేఁ బక్షులకును వనచరులకు ధర్మాది చతుర్విధ పురుషార్థంబు లొసంగుటచే వృక్షంబులకును శకటంబు నాదరించుటచే గ్రామ్య జంతువులకునుఁ జక్రోడంబునుఁ గాపాడుటచేఁ గీటకంబులకును నింత యేల సర్వ చరాచర భూతంబులకును నారాయణుండే సర్వవిధ రక్షకుఁడని యోజింపుము.

శ్లో॥ యత్ర యత్ర చతుర్వక్త్రం, త్రిమూర్త్యైక్యంచ తుల్యతాం
శివ కేశవయోరైక్యం, సమత్వం పావకం రవిం
వదంతియాని శాస్త్రాణి రాజసాని చతాని వై

ఏ ఏ పురాణములు బ్రహ్మనుఁగూర్చియుఁ ద్రిమూర్తు లేక తత్త్వమనియు లేక సమానులనియు శివ కేశవు లేకతత్త్వమనియు లేక సమానులనియుఁ జెప్పునో యగ్నిహోత్రుని సూర్యుని జెప్పునో యవి రాజస పురాణములు గాన ముముక్షువుల కాదరణీయములు గావుఁఅని స్కాందపురాణము. 122

# సర్వశాసకనిర్ణయము

సుశీలుఁడు

రక్షకునిఁగూర్చి వక్కాణించితివి. కాని శాసించువాఁడు లేనిచో నెవ్వరైన నేపనియైనం జేయఁజాలరు. సర్వ శరీరధారులకు శాసకుం డెవ్వఁడో యెఱిఁగింపుడు. 1

వరవరముని

శాసకుఁడనఁగా వారివారి కర్మానుసారముగా శాసించువాఁడే కాని తన యిచ్ఛానుసారముగా నెవ్వరిని శాసింపనొల్లఁడు. ఈకారణ

ముచే వానికిఁ బక్షపాతాది దోషములు లేవు. అట్టి శాసనుఁ డెవ్వరనఁగా,

శ్లో॥ మేఘోదయస్సాగర సన్నివృత్తి
రిందోర్విభాగః స్ఫురితాని వాయోః
విద్యుద్విభంగో గతి రుష్ణరశ్మే
ర్విష్ణో ర్విచిత్రాః ప్రభవంతి మాయాః

శ్రుతిః॥ ఏతస్యవా అక్షరస్య ప్రశాసనేగార్గి
సూర్యా చంద్రమసౌ విధృతౌ తిష్ఠతః
(బృహదారణ్యకోపనిషత్తు)

శ్రుతిః॥ భీషాస్మాద్వాతః పవతే
భీషోదేతి సూర్యః భీషాస్మా దగ్నిశ్చేంద్రః
(తైత్తిరియోపనిషత్తు)

అను శ్రుతి ప్రమాణమునలన విష్ణుదేవుఁడే సమస్త చరాచర భూతంబులను శాసింపుచున్నాడు. అవ్వాసుదేవుని శాసనమునకు భయపడి భూమి యెంతభారమైన సహింపుచున్నది. సస్యములఁ బెంచి ధాన్యములొసంగి జీవులంగాపాడుచున్నది. పాదపంబులనిర్మించి వృద్ధిఁ జేసి మధురఫలంబులు మకరందంబుల నొనఁగూర్చుచున్నది. ఘాసంబుచే గోవులఁ బోషించి క్షీరంబు లిప్పించుచున్నది. ఎద్దుల నోమి వ్యవసాయమున కుపయోగపరచుచున్నది. మేఘ జలమును భరించి పైరుల కొసంగి మిగిలినదానిని సముద్రమునకు విడుచుచున్నది. కేశవోగ్రశాసనంబునకు వెఱఁగంది జలంబులు శైత్యంబును మాధుర్యంబును ధరించి స్నాన పాన ప్రక్షాళనంబుల కుపయోగింపుచున్నవి. హవ్య కవ్యంబులఁ బచనముచేయుచు యజ్ఞ యాగంబుల నిర్వహింపుచున్నవి. జప తప స్వాధ్యాయపరులకు మహోపకార మొనర్చుచున్నవి. మాధవాజ్ఞచేతనే పీతిహోత్రుఁడు మందు

చున్నాడు. హవ్యకవ్యంబులకు యాగాదులకు రక్షకుండై యున్నాడు. వైశ్వదేవాదులకు నుపయోగింపుచున్నాడు. జీవులేని శరీరములను దహించి భూభార మడంగింపుచున్నాడు. హోమద్రవ్యంబు లాకర్షించి వేల్పులకిచ్చి బ్రహ్మముఖుం డగుచున్నాడు. నిదాఘకాలంబున నరణ్యముల దహించియు రూపుమాపలేక యున్నాడు. వాసుదేవుని నియోగమును శిరసావహించి వాయువు సర్వప్రాణుల శరీరములందు నిలిచి హృదయమునఁ బ్రాణమై గుదమునం దపానమై నాభియందు సమానమై కంఠమున నుదానమై సర్వదేహమునందు వ్యానమై రక్షింపుచున్నది. మఱియు నిర్మారుతము నాగమై మూర్ఛింపుచుఁ గూర్మమై నేత్రములు మూయించుచుఁ గృకరమై తుమ్ములిచ్చుచు దేవదత్తమై యావులింపఁ జేయుచు ధనంజయమై మృతిఁజెందిన పిదప కొంత కాలముండుచు రక్షింపుచున్నది. ఈ దశవిధవాయువులలో మొదటివి ప్రాణములు ద్వితీయంబు లుపప్రాణంబులు. ఇంతేకాక యాశ్వసనుఁడు వేసఁగియందు వడగాడ్పులై భూమియందును భూతములందుఁగల దోషంబులఁ బీల్చి బాగుఁ జేయుచున్నాడు. మలయమారుతమై శరీరుల సంతోష మొందింపుచున్నాడు. భగవన్నియమము ననుసరించి విహాయసము మేఘముల నుద్భవింపఁ జేయుచున్నది. వానలఁ గురియింపుచున్నది. అవకాశమునకు హేతువై యున్నది. సస్యములకు భూరుహములకు సర్వభూతములకు నవకాశ మిచ్చుచున్నది. ప్రాణుల పొట్టలో నవకాశముండుట చేత నీరాహారంబులిముడి పుష్టి నిచ్చుచున్నది. ఇది యంతయు భగవన్నియమనమని యెఱుంగుము. 124

సూర్యచంద్రులు వేళ నతిక్రమింపకుండఁ దూర్పున నుదయించుట, పశ్చిమంబున నస్తమించుట భాస్కరుం డెండఁగాయుట, సోముండు వెన్నెలఁగాయుట, నక్షత్రంబులు ప్రకాశించుటయు భగవదాజ్ఞచేతనని తలంపుము. మఱియు భగవచ్ఛాసనము విస్తృతమైనప్పుడా యా దేశములయందు, 125

సీ॥ మేదిని కంపించి మీఁదనుండు చరా చ
రములనుగడియఁలో సమయఁజేయుఁ
బానీయపూరం బపారమై జంతు సం
తతి ముంచి మరణమొందఁగఁజేయు
నగ్నిహోత్రుఁడు తేఁగి యాహారవస్తు సం
ఘములను లోగిండ్లఁ గాల్చుచుండు
శ్వసనుండు ఘోర ఝంఝామారుతంబైఁ స
మస్త భూతములను మడియఁజేయు

ఖపదమతి వృష్ట్యనావృష్టిఁ గలితమగుచు
కాటకముచేత దేహుల గీటడంచు
నట్టి భగవంతు నిగ్రహ మరయలేక
యేడ్చుచుందురు మనుజు లేమేమొతలఁచి. 126

సీ॥ ప్రాణాపహారమై పసమీఱు గరళంబు
కోఱలఁగలుగు కాకోదరములు
తొండంబుచేత జంతువుల నాకర్షించి
యవలీలఁగూల్చు మహాగజములు
తులలేని యాలఁబోతులనైనఁ దునుమాడి
హాలాయముగ మెక్కు కోలుపులులు
నానామృగంబులపైనఁ బ్రాభవమొంది
ఠీవిఁగైకొన్న కంఠీరవములు

వాయువేగంబుగలుగు వాతాయువులు వి
హాయసంబునఁ దిరుగు విహంగమములు
లోకులకుఁ బట్టువడుట ముష్వోకలాని
శాసనంబని యోజింపుమో సుశీల. 127

సీ॥ ఎన్ని రోఁతలనైన నెన్నక శిశువుల
లిప్పతో సతులు లాలించుటయును
నోరెఱుంగని బాలు రారాటమునఁ దల్లి
పాలు పుట్టిననాఁడె క్రోలుటయునుఁ
దులువతనంబుచేఁ బలుమాఱు కలహించు
దంపతుల్ మైత్రిచేఁ దనరుటయునుఁ
బాలింతలై కష్టిపడినసంగతినేది
కోమలుల్ రతికేళిఁ గోరుటయును

బాంధవము మానుకొని పరస్పర విరోధ
మూని తరువాత సౌహార్ద మొందుటయునుఁ
జిత్రలీలాధుర్యుఁడైన రాజీవనేత్రు
శాసనంబని తలపోయుమో సుశీల. 158

సీ॥ గ్రహణవేళలఁ జంద్ర కమలాప్తులిద్దఱు
బడలి రాహువుచేతఁ బట్టువడుట
సర్వజ్ఞులై సభాసదుల రంజిలఁజేయు
పండితుల్లేమిచే బెండువడుట
సర్వదా శత్రు విజయ ధుర్యులై మించు
శూరు లొక్కొకచో నష్టులగుట
సమధికైశ్వర్య ప్రశస్తులౌవా రల్ప
కాలంబులో లేమిఁ గని వగచుట

బలముగల్లువారు బలహీనులగుట దు
ర్బలు లమోఘ శక్తిగలిగి మనుట
సరసిజాక్షుఁడైన చక్రపాణి గరిష్ఠ
శాసనంబుగాదె యో సుశీల. 129

సీ॥ ఒకదేశము సుభిక్ష మొందఁగా దుర్భిక్ష
సహితమై యొక్క దేశము కృశించు
నన్నగారధిక ధనాఢ్యుఁడై విలసిల్లుఁ
దమ్ముండు లేమిచేఁ దల్లడిల్లు
బ్రహ్మవిదుండైన పండితునకు నక్ష
ర మెఱుంగలేని పేరజుఁడు పుట్టు
పచ్చినంజుడు మొక్క పాపాత్మునకు సదా
చార సంపన్నుండు సంభవించు

గీ॥ మూఢులేనివాని కొంపలో బలుమంది
పిల్ల లుద్భవింతు రెల్లగతుల
సౌఖ్యమొందువాఁడు సంతానమొందఁడు
నలిననేత్రు శాసనంబువలన. 130

సీ॥ క్షురకర్మమునకొక్క నరునిఁ బాల్పడఁజేసి
చాకలిపనికొక్క జనునిఁగూర్చి
కుండలు నిర్మించుకొఱ కొక్కని నమర్చి
యునుఁ బాకిపనికి నొక్కని నొనర్చి
మందులిచ్చుటకొక్క మనుజునిఁజేసి క
మ్మర మొనర్చుటకొక్క మనుజునుంచి
వండ్రంగమునకొక్క వర్ధకినునిచి యం
బరనిర్మితికి నొక్కనరుని నిలిపి

గీ॥ కోటివృత్తులు గల్పించి కొఱఁతలేక
వారి శాసించి లోకోపకారమందు
దీక్షఁదాల్చిన పుండరీకాక్షు మహిమ
నరయ నెవ్వారికైన శక్యంబుగాదు. 131

సీ॥ సింహాసనమున వేంచేసి యొక్కరుండుండ
సంతోషమున సేవఁజలుపు నొక్కఁ
డాందోళికారూఢుఁడై యొక్కఁడు వసింపఁ
గడు మోద మొప్ప నొక్కఁడువహించు
దధి ఘృతాదుల నొక్క ధన్యుండనుభవించుఁ
దినమాని యొక్కండు తెచ్చియిచ్చుఁ
బనులు సేయించుకొనినవాఁడు కూర్చుండు
వడకుచుఁ గూలి దబ్బడఁగు నొక్క
డొకఁడు దూషించి దండింపుచుండ నొకఁడు
సోలి మన్నింపుమని బ్రతిమాలుచుండు
వారి వారికిఁ గర్మానుసారముగ ని
శాచరారి విధించు శాసనముగాదె. 132

సీ॥ గంధ సింధురములు కంఠీరవములొక్క
విపినంబునందు జీవింపుచుండు
శార్దూలసంఘంబు సారంగములు నొక్క
వాఁగులో నుదకంబుఁ ద్రాగుచుండుఁ
జినచేపలును వానిఁదిను విసారములొక్క
వారాశిలోపలఁ జేరియుండు
సరవినుందురులు మార్జాలంబు లొకయింటఁ
దర తరంబులదాఁకఁ బెరుగుచుండుఁ
గాని వైరుల చేత నంగడమడంగు
నట్టిజంతువులేవు దైత్యారి దివ్య
శాసనముగాక వేఱు రక్షకుఁడు గలఁడె
నరుఁ డెఱింగిన నిడుమలఁ బాయకుండు. 133

సీ॥ స్వతను హృషీకవి స్మృతిఁగాంచి ప్రతియామి
నీవేళలో నిద్రఁబోవువారిఁ
గనులకుఁ జొరవీని కటికి చీకటియందు
నంచితంబుగ గమనించువారి
శార్దూల హర్యక్ష సైరిభాదులుగల్గు
కానలోఁ బశువులఁ గాచువారి
గవులలోఁ బొదలలో గాటంపు ముండ్లలోఁ
జెలఁగి నిత్యము పనుల్సేయువారి

మించి వల్మీకములపై నటించువారి
యేటి జలపూరములయందు నీదువారి
ఘాతుక మృగాదులేవియుఁ గదిసివచ్చి
చంపలేకుంట హరి దివ్య శాసనంబు. 134

సీ॥ కాముకుండయ్యు నొక్కం డొంటిగానేగు
ఘన పతివ్రతఁగాంచి చెనకలేడు
చోరుఁడై యొకఁ డన్య శుద్ధాంతమునఁ బ్రవే
శించి కాసైన హరించలేడు
బలవంతుఁడై యొకం డలఁతి మానిసితోడ
నెదిరించి పోరి జయింపలేడు
పండితుండయ్యు నొక్కండు సభాస్థలిఁ
జేరి యొక్కపుడు భాషింపలేడు

ధనికుఁడై యొకండు తఱియందు రువ్వయు
నమరకుంట దీనుఁడై కృశించు
వారలట్టులౌట సీరేజనయనుని
శాసనంబుగాదె యోహో సుశీల.

సీ॥ పురిటింటిలో నొక్కండు మరణించు నూతన
    గృహావసంబున నొక్కఁడంత మొందు
నడిపాయమందు నొక్కఁడసచ్చు జాయచే
    సుతులఁగాంచి యొకండు మృతముఁజెందు
నురిగొని యొక్కండు గరళంబుదిని యొక్కఁ
    డగ్నిచే నొకఁడు దేహంబువిడుచు
వనమునందొకఁడు జీవననిధిలో నొక్కఁ
    డడవిలో నొక్కండు మడియుచుండుఁ

ఉండిదినువేళ నొకఁడు నిద్రించుసావి
నొకఁడు మార్గంబునందు వేరొకఁడు గడయు
మాటలాడుచు నొక్కండు గీటడంగు
నన్నియును జక్రి శాసనమనుట నిజముఁ 136

సీ॥ బహుజాగరూకుఁడై పథ్యంబు చేయువాఁ
    డెన్నాళ్ళ కారోగ్య మెనయకుండుఁ
దినరానివస్తువు ల్తినువాని కొకవేళ
    గద నశింప సుఖంబు గలుగుచుండుఁ
బెల్లుగా నిరతంబు వల్లించువానికిఁ
    బద మొక్కటియును రాక పలవరించు
వేడ్కతోఁ బొత్తంబు వీక్షించువానికి
    సకలవిద్యలు ముఖస్థ మగుచుండు

మృదులతల్పమందు మెలఁగువానికి నిద్ర
రాకయుండు గులకరాలమీఁదఁ
బండుకొన్నవాఁడు పడయును స్వాపంబు
చక్రపాణి దివ్య శాసనమున. 137

శ్లో॥ శ్రుతి స్మృతి ర్మమైవాజ్ఞా=శ్రుతులు ధర్మశాస్త్రములు నా శాసనంబులని భగవంతుఁడు సెప్పియున్నాడు. 138

ఇంతేకాక,

శ్లో॥ యః శాస్త్ర విధిముత్సృజ్య,వర్తతే కామకారతః
న ససిద్ధి మవాప్నోతి, న సుఖం న పరాంగతిం

ఎవ్వఁడు శాస్త్రవిధిని వదలి యిష్టానుసారముగా నడచుచున్నాఁడో వాఁడు సిద్ధినిఁగాని సుఖమునుఁగాని ముక్తినిఁగాని పొందడనియు,

శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్య వ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మకర్తు మిహార్హసి

అర్జునా! చేయవలసిన పని చేయుటకునుఁ జేయఁగూడని దానిని మానుటకును నీకు శాస్త్రమే ప్రమాణము. కావున శాస్త్ర విషయమును లెస్సగానెఱింగి కర్మము చేయుమనియు గీతాచార్యులవా రానతిచ్చిరి. కనుక వేదశాస్త్రములు భగవచ్ఛాసనంబులనియు వానిప్రకారము నడచువానికి నిహ పర సుఖంబులు గలుగుననియు వానిం దిరస్కరించి నడచువానిని భగవంతుఁడు దండించుననియుఁ దేలినది. 139

శా॥ ఎన్నోరాత్రులు నిద్రమానుకొని యె,న్నెన్నో నిశాంతంబులం
దెన్నోసారులు లాఁతివిత్తమును హా,యింగూర్చి చోరుండు సం
పన్నుఁడై నవిధానఁదోఁచి తుద కా,పత్తుల్ విజృంభింపఁగాఁ
జిన్నంబోయి నశించు లేమఁగని ల,క్ష్మీనాథు ఘోరాజ్ఞచేఁ,

మ॥ వ్యవహారంబులయందు నాకు సముఁ డె,వ్వాడంచు గర్వించి మా
నవులన్ మోసమొనర్చి వారికడ న,న్యాయంబుగాఁదీయు వి
త్తవరండంబులచేతఁ బొంగి తుదకా, ద్రవ్యంబుఁగోల్పోయి పే
దవడున్ మర్త్యుఁడొకండు దుఃఖమునదై,త్యధ్వంసిఘోరాజ్ఞచేఁ

ఉ॥ జూదరియై యొకండు పెర, జూదరులన్ జతఁగూడి విత్త మా
హ్లాదముతో వ్యయించి తన, యాదులఁ బెండ్లమునీసడించి మ
ర్యాదలమాని పానయుతుఁ,డై తరసంబు భుజించు మత్తుఁడన్
ఖేదముఁ జెందు లేమిఁగని, కృష్ణ భయంకర శాసనంబునన్. 141

శా॥ జారుండై యొకఁ డన్యకామినులతోఁ సాంగత్యముం జేసి వి
స్తారంబైన ధనంబు వారికిడి మో, దంబందుచుండంగ దు
ర్దారిద్ర్యంబు భగందరాది వ్రణము, ల్దర్పించి వేధింప దే
హారోగ్యంబు నశింప నేర్పఁగద దైత్యారాతి ఘోరాజ్ఞచేన్.

శా॥ ఏదీపాపము పుణ్యమేది నరకం, బేదీ దివంబేది యే
డీ దేవుం డెటులుండునంచుఁ బలుమా, ఱీరీతి నిందించి నా
నా దుష్టాత్ములు రోగము ల్భయము దైన్యంబుల్ విజృంభింప స
త్యాదుక్ నిశ్చయమంచు నమ్ముదురు దై,త్యారాతిఘోరాజ్ఞచేన్

సీ॥ ఘస్మరుఁ డొకఁడు దీర్ఘ శరీరుఁ డొక్కఁడు
వామనుం డొకఁడు ఖల్వాటుఁ డొకఁడు
కమనుఁ డొక్కఁడు హృషీకస్తోమ జేత యొ
క్కండును సుందరాకారుఁ డొకఁడు
శాలీనుఁ డొకఁడు లజ్జాశీలుఁ డొకఁడు వ
దాన్యుఁ డొక్కండు కదర్యుఁ డొకఁడు
సహనుఁ డొక్కండ దమార్షణుఁడు వేఱొకఁడు వి
శ్వాసి యొక్కండ దవిశ్వాసి యొకఁడు
శ్లక్ష్ణుఁ డొక్కఁ డదభ్రవాచాలుఁ డొకఁడు
సాధు వొక్కఁడు బహుదురాచారుఁ డొకఁడు
కానఁబడుచుండు నెల్ల జగంబునందు
దనుజ పరిపంథి చిత్రశాసనమువలన, 145

సీ॥ భార్యచెప్పినమాటఁ బాటించి తలిదండ్రి
నన్నదమ్ములఁ దూలనాడు నొకఁడు
కల్లుకై నిజవధూగళ సంస్థితంబైన
మంగళసూత్రంబు మార్చునొకఁడు
పసిపిల్ల లేడ్వంగఁ బయనంబుచాలించు
కొని హారి నాడింపఁగోరు నొకఁడు
సరవి నప్పులుదెచ్చి సౌధముల్కట్టించి
యన్నంబుదొరక కల్లాడు నొకఁడు

కొంపపైఁ గప్పులేకున్న గుడ్డలేక
సతి సుతులు దుఃఖమొంద సంచిత ధనవ్య
యంబు చేయఁ డొకండు కర్మానుకూల
ఫలమొసఁగు చక్రి శాసనబలమువలన. 143

సీ॥ వీధిపోట్లాటకు వెనుదీయ కొరులనుఁ
గెరలి దూషించు శంకిని యొకర్తు
మగవారిఁగనినచో మఱుగుఁ జేరక సిగ్గుఁ
గొనక వాదించు చిత్తిని యొకర్తు
తనువుమాత్రము పెంచి పనులుచేయక భర్త
కనుకూలపడని హస్తిని యొకర్తు
పతికి భోగముఁగూర్చి, బాంధవయాచకా
తిథుల. బోషించు పద్మిని యొకర్తు

మగని లాలింపుచును ఱంకుమగనిఁగూడి
సావిఁ దూలించు సంకరజాతి యొకర్తు
పుట్టుచుందురు జగతిపైఁ బూవుఁబోండ్లు
చక్రధారి విచిత్ర శాసనమువలన. 147

సీ॥ పూతనాంగన లేనఁ బురిటిండ్లలోఁ జేరి
శిశుహత్య లెన్నిరొ చేయువారు
సురుచిపోలికి మహాత్తర పుణ్యుఁడైన సు
తుని నరణ్యమునకుఁ బనుచువారు
ప్రద్వేషిణి విధానఁ బతి నిద్రఁగొనుసావి
నట్టేటఁ ద్రోయించునట్టివారు
చుప్పనాకనుఁ బోలి సోదరులగువారిఁ
జేరి దుర్వ్యథలు చేయువారు

తాటకాంగనచందాన బాటలందుఁ
జేరి పాంథులఁ బట్టి హింసించువారు
కానఁబడుదురు పూర్వాఘ కర్మ పక్వ 148
సమయ ఫలమిచ్చు విష్ణు శాసనమువలన.

సీ॥ అనసూయచందాన నాయసచణకంబు
లభ్యాష మొనరించునట్టి సాధ్వి
మైథిలిగతిఁ బావమాని వాలముఁగాల్చు
నగ్ని శీతలుఁ జేయు ననఘశీల
సావిత్రిపోలికి సమవర్తి మెప్పించి
ప్రాణేశునోమిన పడతినిన్న
దమయంతి మర్యాద దాసి బాధించిన
బోయ భస్మముఁ జేయు పూవుఁబోడి

వర యరుంధతి గతినెల్ల వారిచే న
మస్కృతులుగాంచునట్టి రామామతల్లి 149
కలియుగమునందుఁ బుట్టరు కంజనేత్రు
శాసనములేనికతమున సాధునర్య

సీ॥ నడిసముద్రమునందుఁ బడిమునింగియుఁ గొంత
సేపున కొడ్డుపైఁ జేరునొకఁడు
పులివాతఁబడియు గొబ్బునఁ దప్పుకొని మేనఁ
గాయమొందక మేలుఁగాంచునొకఁడు
ఫణిదంష్ట్రిచేఁ గాటువడి కొంతసావి ని
ర్విణ్ణుఁడై మరల జీవించునొకఁడు
పర్వత శిఖరంబుపైనుండి జారి త
ల్పస్థునట్లు విపత్తుఁ బడయఁడొకఁడు
కిత్తు దేహంబు నంటంగఁ దత్తఱమున
బాధపడి కొన్నినాళ్ళకు బ్రతుకు నొకఁడు
కారణంబేమనఁగ వారిఁగడిసి మ్రింగ
దపుడు మిత్తి సరోజాక్షు నాజ్ఞలేమి. 150

సీ॥ పుట్టపైనెక్కి గొబ్బునఁ గాలుజారంగఁ
బడనప్పుడే మేనువిడుచునొకఁడు
చుంచుకాటునకు నొచ్చుచు దేహ ముబ్బరిం
పంగఁ బ్రాణంబులఁబాయు నొకఁడు
ములుకాటుమేవ్రణంబునకు హేతువుగాఁ గృ
శించి కాలునిచెంతఁ జేరునొకఁడు
పురుగూడినపుడు వాపునకు మేనగ్గమై
సన్నఁగిల్ల బిఱానఁ జచ్చునొకఁడు
శాదగర్తంబునందునఁ బాదమూది
లేవఁజాలక తనువుఁజాలించు నొకఁడు
గండమెట్టిదైన మృత్యువక్కాలమందు
నలముచుండును వారిఁ గృష్ణాజ్ఞవలన. 151

సుశీలుఁడు

స్వామీ ! మృత్యువునకు భగవదాజ్ఞ ననుసరించి నడువ వల
సినదేనా ? 152

వరవరముని

మృత్యుదేవత గోవిందునకు గణింపఁదగినదికాదు. పూర్వము జముండు కృష్ణాజ్ఞను శిరసావహించి సాందీపని పుత్రునిఁదెచ్చియిచ్చె నింతేకాక ముకుందుఁడు వహ్నికి వహ్నియై సూర్యునకు సూర్యుఁడై సరస్వతికి సరస్వతియై లక్ష్మికి లక్ష్మియై మృత్యువునకు మృత్యువై యమునకు యముఁడై యున్నాడు. అప్పురుషోత్తముని నియమనంబుచే విరించి సృష్టియు రుద్రుండు సంహారంబును జేయుచున్నాడు. స్థావర జంగమాదులలో నతనియాజ్ఞను లోఁగని దొక్కటియు లేదు.

వ॥ దీనికిఁ దార్కాణముగా,

సీ॥ మందరాచలమును మంథానముగఁ జేసి
మించి మున్నిటఁ ద్రిప్పించలేదె
గోవర్ధనాద్రినిఁ గొనగోటితో నెత్తి
నింగిపై గొన్నాళ్ళు నిలుపలేదె
కడఁగి సేతు ద్వారకలు రచించువేళఁ
జెలఁగి పయోధి శాసింపలేదె
పాతాళగతమైన భూత ధాత్రినిఁ దెచ్చి
మనుజ విష్టపమునందునుపలేదె

త్రావడే దానవహ్ని బృందావనమున
మఱుఁగుచేయఁడే దినరాజమండలంబు
చక్రమున సైంధవు వధించు సావి నేరి
కైన లంఘింపవశమె నారాయణాజ్ఞ. 153

సీ॥ సాంద్రమై పొల్చు గర్జనలచే మానినీ
జలదస్థపిండము ల్జారిపడఁగ
విద్యుల్లతా ప్రభావిజృంభణమున ద్రష్ట
లగువారి కనుచూపు లాగిపోవ
ధారాధరోద్భూతవారి ధారలు కుమ్మ
రించు బిందెల నీటికీతిఁ దోఁపఁ
బుంజంబులై పునః పునరుద్భవంబులౌ
పిడుగులచే లోకు లడలిపోవ

తాలనీనునట్టి గాలివాన బిత్తాన
నాపి కాచె ఘోషయందు జనుల
నట్టి కృష్ణదేవు నాజ్ఞ నుల్లంఘించు
ఘనులు లేరు ముజ్జగంబులందు. 155

సీ॥ యామినీకాలంబునందు నదభ్రవి
కాసంబుఁజెందునే కమలసమితి
భాస్కరుం డమితాతపముచే వెలుఁగువేళఁ
గాంతిమంతములౌనె కైరవములు
శీతభీరుఖ్యాతిఁ జెందిన మల్లెపు
వ్వులభించునె మంచుసావియందు
వర్షాగమమునందు వాంఛించి వెదకినఁ
బ్రాప్తించునే చూతఫల చయంబు

పగటియందుఁ జకోరముల్ సొగయురాత్రి
కాలమునఁ జక్రవాకముల్కనవుసుఖము
ధర్మమేదవుబుభుక్షువు లుద్దండమైన
చక్రిశాసనమునఁ జేసి సాధుచర్య

సీ॥ దీపంబు రాత్రి నుద్దీపించి మేల్సేయుఁ
బగటిలో వ్యర్థమై పరఁగుచుండు
బగలు నిద్దుర వోవఁ బనిచెడు యామిని
యందు లేకున్నచో హానిగలుగు
గమ్మగాడుపు నిదాఘమున మోదముఁ గూర్చు
చలికాలమందగ్ని సౌఖ్యమిచ్చు
శిశిరవసంతముల్ శీతోష్ణములను స
మంబుగా నొసఁగి సేమంబుఁ గూర్చు

ధ్వాంతమెచ్చైనసావి సాధ్వసముగలుగుఁ
జంద్రికాదీప్తిచే సంతసము లభించుఁ
గాలమీ రీతి గమనించు కారణంబు
వనజనాభుని దివ్యశాసనము గాదె 157

సీ॥ ముట్టదెన్నడు పాము కుట్టఁజాలదు తేలు
కొట్టనేరదు దంతి పట్టిలాగి
యెలుఁగు డాయదు పెద్దపులి పైకి రాదు కో
తులు డీకొనవు సింగములముకొనదు
కుక్క చీరదు కొంక నక్క తాఁకదు పంది
కొక్కు మీటదు దంష్ట్రి త్రొక్క దొరసి
నేలక్రుంగదు నీరుచాలి ముంపదు వహ్ని
కీల కాల్పదు గాలి సోలనీదు

చీమలును దోమ లీగలు చెనక లేవు
నల్లి కుట్టదు గీఱదు పిల్లి యైన
మానవావళి నెపుడైన శ్రీనివాసు
నాజ్ఞఁ జెందక, గుహ్యామిట్లరయవలయు 158

సీ॥ పైరుపండదు పాలుచేపెడీయదుగోవు
గౌరవింపదు పరివారమైన
సతులుమెచ్చరు సొంతసుతులులొంగరు ధరా
పతులుప్రోవరు పెక్కుపన్నులంది
గదలుహెచ్చికలంచుఁ జదువులొచ్చెముఁజెచ్చుఁ
బాదలునాపదలు సంపదలడంగు
నోరెముండదు మంచికూరలుండవు కట్టు
చీరలబ్బవు హితుల్చేరిరారు

క్షుత్పిపాసలుహెచ్చు హెచ్చునుఋణంబు.
గీముపడిపోవు వైరులుగెరలుచుంద్రు
కర్మఫలములొసంగు శ్రీకాంతునాజ్ఞ
మానవునియందు విపరీతమైననాడు 159

సీ॥ తనకాంతి లవమిట్లు పెనుపొందునని తెల్ప
నిన బింబమున దీప్తి నునిచినాడు
తన నిగ్రహంబు బట్టి పనిచేయుననుమాడ్కి
శుచిలో దహనశక్తిఁ జొనిపినాడు
తనబలంబున నైక మొనఁగూడునిట్లంచు
నిలకు ధారణశక్తి నిచ్చినాడు
తన దయాలేశమిట్లు నటించునని తెల్ప
మిహకాంశుఁ జల్లగా మెలపినాడు

ప్రాణికోటికి నే సార్వభౌముఁడనని
చెప్పుటకు వాయుదేవు సృష్టించినాడు
దానినేగద గీతలో భాను పావ
కాది తేజస్సు మామకంబనియెఁజక్రి. 160

సీ॥ సురయుక్తుఁడై శంబధరుఁడైన శక్రుని
వాజి నాయకుఁ డీఁకతో జయించెఁ
త్రైలోక్యవైరియగు దశకంఠుని పురంబు
వాలాగ్నిచే గాలి చూలికాల్చె
ఖాండవవనన దాహ కాలమందునఁ గ్రీడి
పడుచున్నపిశాచునుఁ బట్టిపిసికె
డాసి సాత్యకి శకట వ్యూహమున ద్రోణు
నోడించి నరునకుఁ దోడుపడియె

ఘనసుమార్గము తోఁజేటి కడుపు మేటి
మాణిభద్రాది యక్షుల మడియఁజేసె
వారలాకీతిఁ గీర్తివిస్తారులగుట
లచ్యుతుని దివ్యశాసనం బందికాదె. 161

సీ॥ అష్టదిగ్గజములం దాదిశేషునియందు
నాదికచ్ఛప వరాహంబులందు
దిక్పాలకులయందు దినకరాదులయందు
సుర మర్త్య యామినీచరులయందు
మృత్యుదేవతయందు మృత్యుంజయునియందుఁ
గాలచక్రమునందుఁ గాలునందు
పంచభూతములందుఁ బంచబాణునియందు
బ్రహ్మాండములయందు బ్రహ్మలందు

ఖ్యాతిఁగాంచిన యుభయ విభూతులందు
నచ్యుతుని శాసనంబు నిరంకుశముగఁ
జెల్లుచుండును దీనియోజించి నమ్ము
వారికి విపత్తురా దపవర్గమబ్బు. 162

**గద్యము:** ఇది శ్రీసీతావల్లభ ప్రసాద సమాసాదిత కవితాప్రవీణ
వేదాల సీతారామాచార్య కృపాలబ్ధ మంత్ర రత్నాను సంధాన
పవిత్రాంతరంగ నిఖిల దుర్మత శిలోచ్చయ దంభోళీ భూత
సముద్రాల లక్ష్మణాచార్యానుగ్రహ బోధిత విశిష్టాద్వైత
రహస్యార్థ ధురంధర శఠగోప యతిరాడ్వర వరయోగి
ప్రభృతి పూర్వాచార్య చరణ సరోజ భ్రమ
రాయమాన కృష్ణమాంబా కృష్ణార్య తనూజ
శ్రీవైష్ణవవిధేయ వేంకటదాస నామధేయ
ప్రణీతంబైన జ్ఞానసూర్యోదయము
నందుఁ బంచమ భాగము

సంపూర్ణము

శ్రీమతే రామానుజాయనమః

# జ్ఞానసూర్యోదయము

## షష్ఠ భాగ ప్రారంభము

## అర్థపంచకనిర్ణయము

సుశీలుడు

స్వామీ! సర్వోపనిషత్ప్రతిపాదకమగు నర్థపంచక విషయము సాకల్యముగా వక్కాణింపుడు. 163

వరవరముని

శిష్యా! దేహధారికిఁ గావలసిన భోగ మోక్షముల రెంటిని సాధించుటకు నర్థపంచకజ్ఞాన మత్యంతావశ్యకమైయున్నది. రసాతల ప్రభృతి బ్రహ్మలోకమువఱకు శరీరి చేయు హృషీకానుభవమునకు భోగమని పేరు. నిత్యవిభూతియందుఁ జేయు భగవదనుభవమునకు మోక్షమని నామము. 164

సుశీలుడు

పూర్వాచార్యులందఱు మోక్షసాధనమున కర్థపంచకజ్ఞానమవసరమని సాధించిరి. దానిని మీరు లౌకికవైదికమనియుం జెప్పుచున్నారు ఇది నవీనవాక్యముగా నున్నదిగదా? 265

వరవరముని

ముందు లౌకిక మెఱింగినంగాని వైదికము తెలియదు కాబట్టి లౌకికముగా నర్థపంచక మెఱింగించి తరువాత ముక్తికారణం బెఱిం

గింతు నాకర్ణింపుము. ప్రతిమనుష్యుఁడు పరిశుద్ధాహారార్థము కోటి వృత్తులలోఁ బ్రవేశింపుచున్నాడు. వృత్తులన్నిటిలో వ్యవసాయము ముఖ్యమైనది. కృషీవలుఁడు ముందుగా క్షేత్రము నాగేండ్లు బండ్లు యెద్దులను సంపాదించి కృషికుపక్రమింపగాఁ గొన్నినాళ్ళకు ధాన్యము పండుచున్నది. పిమ్మట ధాన్యముచే నగు నన్నము భుజించి సకుటుంబ పరివారముగా జీవించుచున్నాడు. దీనివల్లఁ దేలిన పర్యవసాన మేమనఁగాఁ గృషీవలుఁడు స్వస్వరూపము హలశకట వృషభాదులు, ఉపాయస్వరూపము, ధాన్యము పరస్వరూపము, అతివృష్టి, అనావృష్టి, అశ్రద్ధ మొదలగునవి విరోధిస్వరూపము, అన్నపానాదులు పురుషార్థస్వరూపముగా యోజింపుము 166

సుశీలుఁడు

ఇప్పుడు తెన్నగాఁ దెలిసినది యిఁక మోక్షవిషయమున కుపక్రమింపుడు. 167

వరవరముని

అర్థపంచకమనఁగా స్వస్వరూపము, పరస్వరూపము, ఉపాయస్వరూపము, విరోధిస్వరూపము, పురుషార్థస్వరూపమునని యైదువిధంబులు. స్వస్వరూపమనఁగా జీవస్వరూపము. జీవులు, నిత్యులు, ముక్తులు, కేవలులు, బద్ధులు, ముముక్షువులు నని పంచవిధములుగా నుందురు. 168

పరస్వరూపమనఁగాఁ బరత్వము, వ్యూహము, విభవము, అంతర్యామిత్వము, అర్చావతారము నని యైదువిధములుగా నుండును.

ఉపాయస్వరూపమనఁగాఁ గర్మము, జ్ఞానము, భక్తి, ప్రపత్తి, ఆచార్యాభిమానము నని యైదువిధములుగానుండును. 170

విరోధిస్వరూప మనఁగా స్వరూపవిరోధి, పరత్వవిరోధి, ఉపాయవిరోధి, పురుషార్థవిరోధి, ప్రాప్తివిరోధియని యైదు విధములుగా నుండును. 171

పురుషార్థస్వరూప మనఁగా ధర్మము, అర్థము, కామము, కైవల్యము, భగవత్ప్రాప్తి యని యైదురీతులుగానుండును. 172

సుశీలుఁడు

ఒక్కొక్కదానిని విశదముగా వక్కాణించుండీ. 173

వరవరముని

స్వస్వరూపమనఁగా జీవస్వరూపమేకనుక జీవులలో నిత్యులనఁగా భూత భవిష్య ద్వర్తమాన కాలంబులయందును బ్రకృతి వశ్యులుగాక జన్మ మరణాద్యవస్థ లెఱుఁగక స్వయంప్రకాశమానులై నిరంతర భగవదనుభవపరులై యుండు ననంత గరుడ విష్వక్సేనాది నిత్యసూరులు. వీరు పుట్టినదాదిగా మాలిన్యములేక వెలుఁగు ఫణి మూర్థస్థ మాణిక్యమువంటివారు. 174

ముక్తులనఁగా నీలోకంబున జనించియు శాస్త్రాభ్యాస సదుపదేశ సాధు సాంగత్యాదులచే భగవద్భక్తులై దేహత్యాగానంతరము విరజాస్నానముచే సూక్ష్మశరీర వాసనారేణువులు పోఁగొట్టుకొని పరమపదముఁజేరి నిత్యసూరులతోఁగలిసి యానందించువారు. వీరు గనిలోనుండితీసి సానఁబట్టిన మాణిక్యమువంటివారు. 175

కేవలు లనఁగా జ్ఞానయోగంబుచే జీవోపాసనఁజేసి సాక్షాత్కరించి పాపరహితులై విరజానదీ స్నానంబుచేఁ బ్రకృతిబంధ వినిర్ముక్తులై పరమపదంబునకు వెలివాడగతినుండు కైవల్యంబుఁ జెంది యాత్మానుభవము చేయువారు. వీరు నవవయస్సౌందర్యాంబరాభరణంబులు గలిగియు భర్తనువిడిచిన కోమలాంగివంటివారు. 176

బద్ధులనఁగా దేహాత్మభ్రాంతిచే స్వస్వరూప పరస్వరూపములు మఱచి పురీష మూత్రభాజనంబగు కళేబరమును నిత్యముగాఁ దలంచుచు శిశ్నోదర జిహ్వాపరాయణులై కష్టంబులయందు సుఖభ్రాంతి నొందుచు నదీప్రవాహంబునఁబోవు దారువులభంగి కాలప్రవాహాన

నులై జన్మపరంపరానిఘ్నులై దుఃఖించువారు. వీరు మంటికుండచే 177
మూయఁబడిన దీపమువంటివారు.

ముముక్షువులనఁగా 'ప్రపంచము విష్ణుమాయాసంభూతంబని జీవికి సంసారము కారాగృహంబని యెఱింగి నిర్హేతుక భగవత్కటాక్ష సంజనిత జ్ఞానంబుచే సదాచార్యు నాశ్రయించి శాస్త్రార్థములయందు మహావిశ్వాసమునొంది సంసారుల సాంగత్య సల్లాపములు వర్జించి నిరంతరము భగవద్భాగవతాచార్య కైంకర్యపరులై యుండువారు, వీరు రాజ్యాధికారముఁగోరి యహర్నిశము విద్యాభ్యాసము చేయువారి వంటివారు.

పరస్వరూప మైదువిధములలోఁ బరత్వమనఁగాఁ గోటిసూర్య ప్రకాశమానుఁడై శ్రీనీళాభూ సమేతుఁడై హేమ పీతాంబరుఁడై శంఖ చక్రాది దివ్యాయుధ ధరుఁడై హార కిరీటాది దివ్యాభరణ భూషితుఁడై గరుడానంత విష్వక్సేనాది నిత్యసూరులచేతను ముక్తులచేతను సేవింపఁబడుచు సత్త్వగుణాశ్రయుఁడై పరమపదంబున నపరిమితానంద భరితుండై జగద్వ్యాపారమును విష్వక్సేనునిపై నుంచి వేంచేసి యుండువాఁడు. 179

వాసుదేవవ్యూహమనఁగా మున్ను శ్రీకృష్ణుం డర్జునునిలోఁ గూడి తదీయ ప్రతిజ్ఞా నిర్వహణార్థము వైదికపుత్ర నవకంబునుఁ దీసికొనివచ్చినస్థానము వాసుదేవవ్యూహమని సూరులు వచింతురు. 180

ప్రద్యుమ్నవ్యూహమనఁగా బ్రహ్మలోకంబునవసించి బ్రహ్మచే బూజింపఁబడుచుఁ దద్దేశవాసుల రక్షింపుచుండువాఁడు ప్రద్యుమ్న దేవుఁడు. 181

సంకర్షణవ్యూహమనఁగా పాతాళంబున వసించి బలి ప్రహ్లాదుల పూజ లంగీకరించి తద్దేశవాసులఁ గాపాడుచుండు వేలుపు సంకర్షణుఁడు. 182

అనిరుద్ధవ్యూహమనఁగా క్షీరసాగరంబున నొక వైకుంఠమునిర్మించి లక్ష్మీసహితుఁడై వసించుస్థితి. ఇదియే మత్స్య కూర్మ వరాహ నారసింహ వామన రామకృష్ణాద్యవతారములకు మూలకందమై తనరారు హర విరించన శక్రాది దేవతలు సనకసనందనాది మునీంద్రులును దద్దేశంబునకేగి వారివారి కొఱంతలు నివారించుకొనిపోవుచుందురు.

విభవములనఁగా రామ కృష్ణాద్యవతారములు. ఈయవతారములు లోకమునందు ధర్మమునకు హాని యధర్మమునకు వృద్ధిగలిగినప్పుడు భగవంతుఁడు సాధుపరిత్రాణ దుష్కృత వినాశన ధర్మసంస్థాపనంబులకై భూలోకంబున నవతరించుట. వానిలోఁ గొన్ని గౌణములు, కొన్ని పూర్ణములై తనరారు. మత్స్య కూర్మ వరాహ నారసింహ వామన రామ కృష్ణాద్యవతారంబులు పూర్ణంబులు. పరశురాముఁడావేశావతారము. బౌద్ధుఁడు పామరజన మోహనావతారము. విధి శివార్జున వ్యాసాదు లంశావతారంబులు. పూర్ణావతారంబులుదక్క దక్కినవి ముముక్షుజనసేవ్యంబులుగావు. 184

అంతర్యామిత్వమనఁగా నెఱ్ఱగాఁగాల్చిన యినుపగుండునందుండు నగ్నివలె సర్వచరాచరంబులందు వ్యాపించియుండుట. ఈవ్యాపనము లేనిచో నేభూతంబైనం గదలుట మెదలుట లేక కుడ్యస్థిత చిత్రప్రతిమవలెనుండును. పరమాత్మ సర్వభూతములయందు నాత్మచే వ్యాపించి వానివానిప్రవృత్తికి నాధారభూతుఁడైయుండు టొకవిధము. లక్ష్మీసహితుఁడై దివ్యమంగళ విగ్రహుఁడై భక్తుల హృదయమందు నిలిచి యానందింపఁజేయుట రెండవవిధము. 185

అర్చావతారమనఁగా బంగారు వెండి రాగి యిత్తడి మొదలగు లోహములచేతను నానావిధ పాషాణ దారువులచేతను విగ్రహరూపుఁడై యవతరించి దేవాయతన భక్త గృహంబులలోఁ బూజితుఁడై యారాధకులిచ్చిన ప్రసాదంబు లారగింపుచు వస్త్రంబులు

ధరింపుచు వారికి మనోహరంబుగా సేవ సాయింపుచు మఱియు వారి కనిష్టనివృత్తి యిష్టప్రాప్తిం గలిగించుచు జ్ఞాన శక్తి బలైశ్వర్యాదులతోఁ గూడియుండునది అర్చావతారము. భగవద్రూపము లన్నిటిలో నిది భక్తులకు సులభమైనది. ఎందుకనఁగా బ్రహ్మాండ కటాహంబున కవ్వలనుండు నావరణ జలంబులు మనకెట్లు లభింపవో యట్లు పరమపదవాసుండగు భగవంతుఁడు కనిపించడు. క్షీరాబ్ధి పానీయంబుల భంగి వాసుదేవాది వ్యూహ మూర్తులును స్వర్లోక మందాకినీ నీరంబు పోల్కి రామకృష్ణాది విభవంబులును, త్రవ్వనిచోట భూగత జలంబులంబోలె నంతర్యామిత్వంబును, ఆరాధకులకుఁ గోరినప్పుడు కోరినచోటఁ బ్రాప్తించవు. స్వగ్రామ సంస్థిత తటాక కూపోదకంబులకైవడి నర్చావతారుండగు పుండరీకాక్షుండు మహోపకారియై భక్తులకు స్వాధీనుఁడై వాంఛితంబులు సిద్ధింపఁజేయును. 186

ఉపాయస్వరూప మెదువిధములలోఁ గర్మమనఁగాఁ గృచ్ఛ్రాంద్రాయణాది వ్రతంబులును, గో భూ హిరణ్యాది దానంబులు రాజసూయాశ్వమేధ పౌండరీకాది యాగంబులు, జప హోమాగ్నిహోత్ర వైశ్వదేవ తపస్స్వాధ్యాయంబులు, తీర్థసేవా ప్రభృతి కర్మంబులు భగవదర్పణముగాఁ జేసినచోఁ ముక్తికి సాధనంబులగును. 187

జ్ఞానమనఁగా జ్ఞానముచే యోగము సాధించి యోగబలముచే పీతాంబరధరుండును చక్రాది దివ్యాయుధ పాణియు, హారకిరీటాది దివ్యాభరణ భూషితుండునగు వాసుదేవుని హృదయకమలమందో సూర్యమండలమందో సాక్షాత్కరించి ధ్యానించుట. 188

భక్తియనఁగా నరుండు సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందుఁ దైలధారావదవిచ్ఛిన్నస్మృతిగలిగి భగవంతుని సేవించుటయు భార్యా పుత్ర బంధు మిత్రాదులయందును, సౌధారామక్షేత్ర ధన కనక వస్తు వాహన చందన కుసుమ తాంబూల కస్తూరీ ప్రబోధనాదులయందును

దధి సర్పిః పీయూష పాయసా పూపాన్న మకరందాదులయందును జంబూ గోస్తనీ చూత రసాలాది ఫలంబులయందునుంగల ప్రీతిని భగవంతునియందుంచవలయు నింతయేల పుంశ్చలి శ్వశ్రూశ్వశుర బాంధవాదులకుఁ బరిచర్యచేయునప్పుడును మనస్సును విటునియందే చేర్చి నిశాకాలంబున రహస్యంబుగాఁ బ్రియుని బొంది తనివిఁ జెందించినట్లు భక్తుండైనవాఁడు చిత్తమును మాధవునియందుఁజేర్చి తీరినప్పుడు పురుషోత్తమునితో నేకీభవించవలెను. 189

ప్రపత్తి యనఁగాఁ బైనఁజెప్పఁబడిన కర్మ జ్ఞానాదులయందు శక్తిలేనివారికిని యిది సులభమైయుండును. దేహరక్షణభారము ఆత్మరక్షణభారము శ్రియఃపతియందుంచి తదీయ గుణానుభవ కైంకర్యంబులచేఁ బ్రొద్దుపుచ్చవలెను. 190

ఆచార్యాభిమానమనఁగా జ్ఞానానుష్ఠాన సంపన్నుండగు సదాచార్యు నాశ్రయించి నిరంతరము పరిచర్యచేయుచు వీఁడుమనవాఁడు వీనికి మోక్ష మొసఁగూర్పవలయునని దేశికుని మనస్సునం దభిమానము గలిగించుకొనుట. ఇట్టినిష్ఠగలవారిలోఁ బూర్వయుగంబున శబరి యిక్కాలంబున మారనేరి నంబి దైవవారి యాండాను వడుగనంబి మధురకవియాళ్వారు గొప్పవారు. 191

విరోధిస్వరూప మైదువిధములలో స్వరూప విరోధి యనఁగా శరీరమే జీవుండను దేహాత్మాభిమానము, ఇతర దేవతలకు దాసుడనను నన్యశేషత్వము, భగవంతుఁడు గొప్పవాఁడైన నగుఁగాక వానితో నాకుఁ బనియేమను స్వాతంత్ర్యము మొదలైనవి. 192

పరత్వ విరోధియనఁగా, సర్వదేవతా సార్వభౌముఁడగు శ్రీమన్నారాయణుని నితరదేవతలతోఁ సమానంబుగాఁ బోల్చుట, బ్రహ్మవిష్ణు మహేశ్వరులను సమానంబుచే ముగ్గురు నేకతత్త్వమనుట, సమానులనుట శివకేశవు లేకతత్త్వమనుట, సమానులనుట, రామకృష్ణాద్యవ

తారమూర్తులను మానవమాత్రులనుట, అర్చావతారమున చేతనమని నిరాకరించుట. 193

పురుషార్థవిరోధియనఁగా, మోక్షముదక్క నన్యభోగంబులం గోరుట, భగవత్కైంకర్యమే ముఖ్యపురుషార్థంబని తలంపకుండుట, శాస్త్రీయంబులుగాకుండ దనకిష్టమైన కైంకర్యంబులచేఁ గేశవునిసంతుష్టి జెందింపవలెనని తలంచుట 194

ఉపాయ విరోధియనఁగాఁ బురుషోత్తమునియందుఁ బ్రపత్తి చేసితినికాని యింతమాత్రమునకే మోక్షమువచ్చునాయను నిరుత్సాహంబునుఁ బాపంబులచేఁ బరిపూర్ణుండగు నన్ను నిరంకుశప్రభుండగు రమాపతి క్షమించునాయను భయంబును భగవంతుడేఁ సిద్ధోపాయంబను విశ్వాసము లేకుండుట యివియావత్తు నుపాయ విరోధి యనంబడును. 195

ప్రాప్తివిరోధియనఁగా నకృత్యకరణ కృత్యాకరణ భగవదపచార భాగవతాపచారాసహ్యాపచారంబు లన్నియుంగలిసి ప్రాప్తి విరోధి యనంబడును. 196

పురుషార్థస్వరూప మైదువిధములలో ధర్మమనఁగా భగవంతుండు శాస్త్రమూలముగా నేధర్మము విధించెనో తదీయధర్మము మనుజుండు లెస్సగాఁ దెలిసికొని యనుష్ఠింపవలెను. పరులకుఁ గీడు చేయక హింసాకార్యంబు లొనరింపక సర్వభూత దయాపరుండై చరింపవలెను. 197

అర్థమనఁగా ధనములేనివానికి జీవయాత్ర గడవదు. ఏకార్యంబును సిద్ధింపదు కనుక నరుండైనవాఁ డిరువది వర్షంబుల ప్రాయమాదిగా ధనార్జనంబున కుపక్రమించి యేవృత్తిలోనైనం బ్రవేశించి వంచనకృత్యంబులు మాని న్యాయంబుగా ధనంబుఁగూర్చి భార్యా పుత్ర మిత్ర బాంధవాతిథి వనీపకాదులఁ బోషింపుచుఁ గన్యంబుచే

పితృదేవతలను హవ్యంబుచే వేల్పులనుఁబూజించి దేశ కాలపాత్రంబు లెఱిఁగి ధనవ్యయంబొనర్చుచు జీవయాత్ర గడపుట. 198

కామమనఁగా భోగము. కామ మీలోకంబున నరుండు జననీ జనక భార్యా పుత్ర బాంధవాదులతోఁగూడి ధన ధాన్యాదు లనుభవించుట. శయ్యా మజ్జనాసన సుగంధ వస్తు తాంబూలాదులచేతను వస్త్రాంబరాభరణాదులచేతను సుఖించుట. స్వర్గమునందు మందాకినీ స్నానంబుచేఁ బునీతుండై దేవత్వంబునుఁ బొంది సుధాపానం బొనర్చి జరా క్షుత్పిపాసాదులచేఁ బీడింపఁబడక రంభాదికాంతలతో భోగింపుచు నందనవనాదులయందు విహారంబు సల్పుచుఁ గాలంబు గడపుట. 199

కైవల్యమనఁగా శరీరి యీలోకంబున నుండునప్పుడు జీవోపాసనచేసి యోగసిద్ధిచే శరీరంబువిడిచి విరజాస్నానంబుచే స్వస్వరూపంబునొంది నిరుపేదయగువాఁడు సూపాన్నము లభించినప్పు డింతకంటె భోగ మింకేమి కావలెనని తనివిఁజెందినట్లు స్వస్వరూపము నొందిన కేవలుండు ప్రకృతిబంధవిముక్తుఁడై నంతమాత్రమున నింతకంటె గొప్పపదవి లేదని నిశ్చయించి భగవదనుభవంబుఁగోరక కైవల్యముఁజేరి యాత్మానుభవము చేయుట. 200

పరమపదమనఁగా ముముక్షువైన జీవుం డర్చిరాది మార్గంబునఁబోయి విరజాస్నానంబుచే నిరువదినాలుగు తత్త్వంబులతోఁ గూడిన సూక్ష్మశరీరంబువిడిచి స్వస్వరూపంబునొంది యమానవకరస్పర్శంబుచే నపూర్వ సుఖంబుఁగాంచి పంచోపనిషన్మయ శరీరమును ధరించి లక్ష్మీపతిని దర్శించి తదీయానుగ్రహంబుచే శాశ్వతానందభరితుఁడై భగవదనుభవము చేయుట. 201

## రామానుజప్రభావము

సుముఖుఁడు

గురువర్యా! సర్వజంతు మోక్షప్రదాయకుండును మన సిద్ధాంతకర్తయు నగు శ్రీరామానుజయోగీంద్రుని ప్రభావం బాకర్ణింపఁ గుతూహలంబు పొడముచున్నది యెఱింగింపుఁడు. 202

వరవరముని

శిష్యా! మంచిప్రశ్న మడిగితివి. దీనిచే వక్తయగు మదీయ జన్మంబును శ్రోతవగు భవజ్జన్మంబును ధన్యంబగును. సర్వజగత్కారణుండగు లక్ష్మీపతికి లీలారసానుభవయోగ్యంబైనది లీలావిభూతి. భోగానుభవయోగ్యంబైనది నిత్యవిభూతి. ఈ రెంటిమధ్యంబున విరజానది పొలిమేరయైయుండును. లీలావిభూతికంటె నిత్యవిభూతి మూడంతలెక్కువగానుండుటచే దానికిఁ త్రిపాద్విభూతియని పేరు. తద్విభూతి సంస్థితంబగు వైకుంఠపట్టణమునందుఁ దిరుమామణి మంటపములో శేషతల్పంబునందు శయనించియున్న నారాయణునకుఁ బాదసంవాహనంబొనర్చు శ్రీదేవి దుఃఖించి యప్పురుషోత్తమున కిట్లనియెఁ బ్రాణనాథా లీలావిభూతిలో నుండువారును నిత్యవిభూతియందుండువారును వారు వీరననేల. పంచవిధజీవులును మనబిడ్డలైయున్నారు. కాని యీవిభూతియందుండువారు పతనభయంబులేని నిరవధికానంద మనుభవించుచున్నారు. లీలావిభూతిలో భూలోకవాసులందఱు నీమాయకు లోఁబడి దేహాత్మభ్రమఁజెంది స్వరూపవిరుద్ధంబులగు భగవదపచార భాగవతాపచారాసహ్యాపచారము లొనరించువాని కనుగుణముగా మితిలేని నరకబాధలును గర్భనరకబాధలు ననుభవింపుచుఁ బశు పక్షి మృగ సర్ప కీటకాది యోనుల జన్మించి దరిగానక దుఃఖించుచున్నారు. వారందరు నిత్యసూరులతోఁ గలసి మేల సౌఖ్యమనుభవింపరాదో వచింపుమని రమాదేవి ప్రశ్నించె. 203




విశిష్టాద్వైత సిద్ధాంతకర్త

ఉడైవరులు

పుండరీకాక్షుం డవ్వాక్యంబు లాకర్ణించి భార్గవీదేవితో నిట్లనియెఁ బ్రాణేశ్వరీ! లీలావిభూతిస్థులగు జీవులపై ననురాగము నాకు లేకపోలేదు. విలయకాలంబున జీవు లేపురుషార్థమున కర్హులుగాక ఖద్యోతంబులభంగి నల్లాడుచుండగా వారిం గృతార్థులఁ జేయఁదలంచి కరణ కళేబరంబులిచ్చితింగాని వారలు కలుపుదీయుటకిచ్చిన కత్తితోఁ గన్నులు పొడుచుకున్నరీతి విషయానుభవంబున కుపయోగించిరి నేనంతటితో విసుకొందక జీవులకు మోక్షమార్గంబులగు శ్రుతి స్మృతీతిహాస పురాణంబు లొసంగితిని. వానిం గొంతమంది శక్తిలేక చదువరైరి. పఠించినవారు విశ్వసింపకయుఁ గొందఱు విపరీతార్థంబులు వచించియు వ్యర్థులైరి. నేనంతటనైన విరక్తిఁజెందక గంగా యమునా సరస్వతీ కావేరీ ప్రముఖ పుణ్యతీర్థంబులను, అయోధ్యా మధురా మాయా కాశీ కాంచ్యవంతికాది పుణ్యక్షేత్రంబులును నిర్మించి పునీతులగుటకై సేవింపుమంటిని. కొంద ఱవిశ్వాసముచే సేవింపరైరి కొందఱు భక్తితోఁగాక వేడుకార్థము సేవింపఁదొడంగిరి. నేనప్పటికిని నిర్వేదమొందక రామావతారమెత్తి నానావిధాద్భుత మహిమంబులు చూపితిఁ దత్త్వవిదులుకొంద ఱెఱింగి నన్నాశ్రయించి కృతార్థులైరి. తక్కిన ప్రజాసమూహంబులు నన్నాశ్రయింపకపోగా రాముఁడు పరాత్పరుఁడైనచో సీతావియోగ దుఃఖంబేలయని దూషించి పాడైరి. ఇదికాదని కృష్ణావతారంబెత్తి ముందుగా గొల్లపల్లెలోఁజేరి సర్వసులభుఁడనై విచిత్రప్రభావంబులు చూపితి నప్పుడైనను నారద శుక పరాశర విశ్వామిత్ర మార్కండేయాది మునులును, హర విరించన శునాసీరాది నిర్జరులును విదురాక్రూరోద్ధవ పాండవాది భక్తులును దెలిసి సేవించిరిగాని తక్కినమూఢులు గొల్లపిల్లండగు కృష్ణునితోఁ బ్రయోజనం బేమని యూసడించిరి. నేను బహుప్రయత్నములుసేసి జీవుల బాగుఁజేయఁజాలక దుఃఖించి తూష్ణీంభావముతోనుంటిని నాదుఃఖంబునుఁగాంచియే కోసలవాసులు దశరథునితో,

శ్లో॥ వ్యసనేషు మనుష్యాణాం, భృశం భవతి దుఃఖితః
ఉత్సవేషుచ సర్వేషు, పితేవ పరితుష్యతి

శ్రీరామచంద్రుఁడు మనుష్యుల దుఃఖమునుఁగాంచి దుఃఖింపుచున్నాఁడుఁ వారిసంతోషకాలమునఁ దండ్రివలె సంతోషింపుచున్నాఁడని జాలిపడి వర్ణించిరి. ఇఁక నేనేమిచేయవలెనో చెప్పుమనఁగాఁ లక్ష్మి నిరుత్తరయయ్యెను. 204

సుశీలుఁడు

సర్వేశ్వరుఁడు నావంటి యశక్తునివలె వ్యసనమొందనేల? సర్వజీవుల కొక్కసారిగా మోక్షమియ్యరాదా? 205

వరవరముని

ఔరా! ముండాకొడకా!! బలేయుపాయము సెప్పినావు సరే గాని నీవు నీపిల్లల మలమూత్రములతో మాఁగిన బట్టలు ధరింతువా! నీభార్య ఋతుమతియైన కోకను కప్పుకొందువా! కృషికినుపయోగింపని యెద్దును పాలీయని బఱ్ఱెను పనిచేయని భృత్యుని పోషింతువా! వారియందు నీకు దయయున్నను పైవిషయంబుల కెట్టులొప్పుకొనవో యట్లు తనకభిముఖులుగాని శరీరులనుఁ బునీతులఁజేసి ముక్తినిచ్చుటకు వీలులేదు. 206

సుశీలుఁడు

ప్రాతచెప్పుతోఁ గొట్టితిరి యిఁక చాలును కథాభాగంబునకుఁ జనుడు. 207

వరవరముని

గుదప్రక్షాళన ముఖప్రక్షాళనంబులు లేనివానిని దేవాయతనంబున నర్చన కెట్లు నియమింపరాదో, త్రాఁగుబోతును వేదికపై నిలిపి యజ్ఞవిధానాధికారం బెట్లియరాదో గోమాంసభక్షకుని స్వాధ్యాయునిఁ జేయుట కెట్లు వీలులేదో అదేవిధంబున నింద్రియకింకరులైన శరీరులకు నపవర్గం బీయరాదు, భగవంతుఁడు దయాసముద్రుఁ

డనుగదా నాకేమని నీవుచెప్పినట్లు పాపులందఱి కొక్కసారి మోక్ష మిచ్చినచో వేదాధ్యయనంబులు సన్నగిల్లును పుణ్యక్షేత్ర తీర్థంబులు మొఱ్ఱోయని యేడ్చును. కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తి వైరాగ్యంబులు రూపఱిపోవును. భగవంతుఁ డజ్ఞానియగును. తాపసోత్తము లగౌర వంబుఁగాంతురు. 208

సుశీలుఁడు

ఇంతదూర మాలోచింపక ప్రశ్నించిన మదీయ దోషంబు క్షమింపుడు. 209

వరవరముని

భగవంతుఁడు సమాధానము సెప్పుటయు లక్ష్మి నిరుత్తరయగు టయు వీక్షించి శయ్యగానుండు శేషుండు లేచి జననీజనకులకుఁ గల హాంబు సంభవించెనే దీని నెట్లైన నివారింపవలయుననితలంచి లేచి నిలు చుండి కరములు దోయిలించి నారాయణునితో దేవా మీ దివ్య దంపతులు దిగులుపడవలదు నేను భూలోకంబున మనుష్య రూపం బుతో జనించి మనుష్యకోటికి జ్ఞాన భక్తి వైరాగ్యంబులు గలిగించి యాలోకంబున కనిచెద నుత్తరు విమ్ము లీలావిభూతియందును నిత్య విభూతియందును నామాట నంగీకరించితివేని యిప్పని సిద్ధించుననగా రమాదేవి జగదీశునితో నిట్లనియె. దేవదేవా చేతనోద్ధారణమొన రింపఁదలంచినచో మమపుత్రు నాజ్ఞాపించి యతని వాంఛితానుసారం బుగానుండుమని వరంబిమ్మనియె. ముకుందుండు కొంతసేపాలోచించి లక్ష్మీదేవితో నిట్లనియె. 210

ప్రాణసఖీ! యీ యనంతుండు మనకు మహోపకారియై సర్వవిధ కైంకర్యము లొనర్చుచున్నాడు. ఇంతేకాకుండ మన కాది నుండి శేషత్వము వహించుటవల్ల నాదిశేషఖ్యాతి వహించియున్నాడు. వెండియుఁ ద్రేతాయుగంబున లక్ష్మణుఁడై వనవాస సమయంబునఁ

మనాలుగేండ్లు మన కితండొనర్చిన పరిచర్యకు ఋణపడియుండి యా ఋణంబు దీర్పఁగోరి ద్వాపరయుగంబున బలరామునిగా మదంశతో జనింపఁజేసి కృష్ణరూపంబుతోఁ గనిష్ఠుఁడనై సేవించితింగాని దివిటీ ముందఱ దీపంబునలె నేనుండునప్పు డితని ప్రభావంబు రాణింపదయ్యె నిప్పు డితండు కోరిన వరంబు మదాశయంబున కనుకూలమై యొప్పుచున్నదని సిరితోవచించి శేషునిఁగాంచి వత్సా! భూలోకంబున కేగుము నీవు బద్ధమానవుల నుద్ధరించునప్పుడు సర్వవిధంబులఁ దోడయ్యెద నుభయ విభూతులయందు నీమాటఁజెల్లించి నీకీర్తినిఁ బ్రకటింతునని చెప్పగా వల్లెయని కాకోదరాధిపతి లక్ష్మీనారాయణులకు సమస్కరించి భూలోకంబునందు భూతపురిలో నాసూరివంశంబున గాంతిమతీ కేశవాచార్యులను దంపతులకు జగతీసుర వంశంబున జన్మించె నటుపిమ్మట వారిమాతులుండగు శ్రీశైలపూర్ణు లచ్చోటికివచ్చి చౌలోపనయన పంచసంస్కారాదులు సాయించి లక్ష్మణాచా
ర్యులను నామధేయంబొసంగి వెళ్ళిరి. 211

తరువాత లక్ష్మణాచార్యులవారు వేదవేదాంగ తర్కవేదాంతంబులయందుఁ బండితులై పదియాఱవయేట వివాహంబు చేసుకొనిరి. తరువాతఁ గొలఁదికాలములోఁ గేశవాచార్యుండు పరమపదించెఁ దదుపరి లక్ష్మణాచార్యుండు జనయిత్రిని భార్యనుఁ దీసుకొని కాంచీపురంబునకేగి నివాస మేర్పరచుకొని దేవప్పెరుమాళ్ళను సేవింపుచుఁ గాంచీపూర్ణులద్వారా సిద్ధాంతోపయోగంబులగు నాఱువార్తలు వరదునిచే నెఱింగి యాదవప్రకాశుండను నద్వైతిచే నద్వైతభాష్యంబు జదువుచుఁ గప్యాస యనుశ్రుత్యర్థమువల్లఁ గలహంబురాగా దురాత్ముండగు యాదవప్రకాశుఁడు రహస్యముగా శిష్యులతో నిట్లనె శిష్యులారా! లక్ష్మణాచార్యుండను వైష్ణవుండు నాయొద్దఁజదువుచు శ్రుతులకు నేనువచించు నర్థములొప్పుకొనక యద్వైతమునుఖండించి విశిష్టాద్వైతపరంగా నర్థముచెప్పుచున్నాడు. అతని పాండిత్యమహిమ

మేమో గాని వినినప్పుడు నామనస్సుకూడ మాఱిపోవునట్లున్నది. వీనిం జంపు నుపాయం బేమనఁగా నంతేవాసు లతనితో గురువర్యా! కాశీ ప్రయాణము నిర్ణయించి యితనిం గడలింపుమనిరి. 213

అంతట యాదవప్రకాశుఁడు కాంతిమతియొద్దకేఁగి యమ్మా! నేను కాశికిఁ బోవుచున్నాను. నీకుమారుం డిచ్చటనున్నచోఁ బాఠంబులు సెడిపోవును. నీకుమారుని నావెంటఁబంపుమని సమ్మతింపఁజేసి రామానుజులంగొని శిష్యులతో బయలుదేఱి కతిపయ దినంబులు మార్గంబున నడచి వింధ్యారణ్యంబుఁ బ్రవేశించి యచ్చట లక్ష్మణాచార్యులను మడియింపఁదలఁచిరి గాని రామానుజు లెట్లో తెలుసుకొని తప్పించుకొనెను. సశిష్యుండగు యాదవప్రకాశుఁడు నిరాశఁ జెంది కాశికిఁబోయె నింతలో వరదరాజస్వామి పెరుందేవితోఁగూడి నిషాదవేషంబుతో లక్ష్మణాచార్యునకు సాక్షాత్కరించి భయంబు వాపి తెల్లవాఱువఱకు నమ్మహాత్మునిఁ గాంచీపురంబుఁ జేర్చెను రామానుజుండు యాదవవృత్తాంతము తల్లికెఱిఁగించి గృహంబున నుండెను. యాదవప్రకాశుఁడు తీర్థసేవ ముగించుకొని కాంచీపురిఁ బ్రవేశించి కాంతిమతిం జేరి తల్లీ! నీకుమారుఁడు వింధ్యారణ్యంబునఁ జీలిపోయెను. నీతో నేమి చెప్పుదునాయని చాలా చింతిల్లితిని. కాని దైవయోగంబుచే సురక్షితుఁడై యున్నాడు సంతోషించితిని. మరల భాష్యంబుఁ బఠింపింతుఁ బంపుమని సమ్మతిపరచి తీసుకొని పోయి చదివింపుచు నొక్కనాడు రామానుజులతోను దక్కిన శిష్యులతోను గలిసి హస్తిగిరికిఁ బ్రదక్షిణంబొనర్చుచుండిరి. యానాడే యామునముని సశిష్యుండై యగ్గిరికి వలఁగొనుచుఁ గాంచీపూర్ణునితోఁ బుత్రా! యాదవప్రకాశుని సంఘములో మనరామానుజు లెవ్వరని

యడిగి తెలుసుకొని యయ్యో! యీమహాత్మునితో నేనిప్పుడు సంభాషింపరాదు. భాషించినచో నద్వైతభాష్యంబు సాకల్యంబుగాఁ బఠింపడు. పఠించినంగాని జీవబ్రహ్మైక్యవాదంబు ఖండింపరాదుగదా యని తిరుకచ్చినంబితోఁ జెప్పి తేవప్పెరుమాళ్ళ కెదురుగా నిలువంబడి చేతులుజోడించి దేవాదిదేవా యీరామానుజుని మాసిద్ధాంత సార్వభౌమునిగా ననుగ్రహింపుమని ప్రపత్తి చేయఁగా వెంటనే మీ ప్రపత్తి నంగీకరించితి నట్లేచేయుదునని యశరీరవాణితోఁ దేవప్పెరుమాళ్ళు పలికిరి. యామున మునీంద్రులు కాంచీపూర్ణులు విని యానందించిరి. 214

తదుపరిఁ గాంచీపురంబున నొకయింటిలో నొక కన్యామణిని బ్రహ్మరాక్షసి పట్టి బాధింపుచుండఁగా నాయింటివారు యాదవప్రకాశునిఁ దీసుకొనివెళ్ళిరి. అప్పండితుం డక్కన్యనుఁ డాసి రక్షోఘ్నంబులగు మంత్రంబు లుచ్చరింపుచుండ బ్రహ్మరాక్షసియుం జదివి యాదవప్రకాశునితో నిట్లనియె నోరి దుర్మతీ! పూర్వభవంబున నీవొక తొండవై మధురాంతక తటాక తటస్థంబగు పొదలోనుండి స్వాములారగించి పాఱవైచిన విస్తరిలోనుండు యెంగిలిభుజించి యాపుణ్యంబున బ్రాహ్మణ పండితుండవైతివి. నేనొకదోషంబుచే విప్రజన్మం బెడఁబాసి రాక్షసినైతి నీమంత్రంబులకు లొంగను, రామానుజులు వచ్చి పొమ్మనినచోఁ బోయెదననఁగా యాదవప్రకాశుఁడు లజ్జనొంది సదనంబున కరిగెను. తరువాతఁ గన్యాబంధువులు ఇలయాళ్వారింగొని పోయిరి. అటుపిమ్మట బ్రహ్మరాక్షసి రామానుజులంగని నమస్కరించి వారిపాదధూళి శిరసావహించి కృతార్థినైతినని కన్యను వేధించుట మాని రాక్షసత్వంబుఁ దొలంచుకొని యథేచ్ఛనరిగె నంత లక్ష్మణగురుండు స్వసద్మంబుఁ డాసియుండఁగా నొక్కనాఁడు దేవప్పెరుమాళ్ళు యాదవప్రకాశుని స్వప్నంబునఁ దోసి విప్రోత్తమా నీవు

మనుష్యమాత్రుఁడవు. రామానుజులు నిత్యసూరి నీవహంకారబుద్ధి విడిచి యమ్మహాత్ముని శిష్యుఁడవైనచో ముక్తిం గాంతువని చెప్పఁగా యాదవప్రకాశుండు మేల్కాంచి భగవదుపదేశప్రకారముగా నభిమానంబు వర్జించి లక్ష్మణార్యున కంతేవాసియై యద్వైతంబువిడిచి వైష్ణవుండయ్యెను. 215

అటుపిమ్మట నిలయాళ్వారొక్కసారిఁ గాంచీపూర్ణులచే నుపదేశముఁ బొందవలయుననియుఁ దదుచ్ఛిష్టాన్నము భుజింపవలయుననియుం దలంచెంగాని నంబిగా రంగీకరింపకపోవుటచే నప్పని జరుగదయ్యె. రామానుజుండు మూఁడుతప్పులు సూచి భార్యను విసర్జించి యామునమునీంద్రుని పాదంబులు స్మరింపుచు వేగవతిలో మజ్జనమాచరించి సన్యాసముపుచ్చుకొని కొన్నినాళ్ళకుఁ బెరియనంబి నాశ్రయించి పంచసంస్కారంబులు ప్రాపించెను. తరువాత శ్రీరంగంబున యామునముని ముక్తినొందినపిమ్మట నతని చరమ విగ్రహంబు నుడైవరులు దర్శించి పైఁబడియేడ్చి స్వామీ! మీరుజీవించియుండఁగా నేమేమి వేదాంతవిషయంబు లడుగందలంచితినో యవియన్నియు వ్యర్థమాయెనని శోకించి యమ్మహాత్ముని తిరుమేను పరికించునప్పుడు మూఁడు వ్రేళ్ళు ముడిచియుండుటఁగాంచి కారణంబేమని తర్కించి వారు జీవించియుండఁగా మూఁడుకోరికలుగలవని సన్నిధిస్వాములచే నెఱింగి దాసుఁడవితీర్చునని చెప్పఁగా ముడిచినవ్రేళ్లు చాపునకువచ్చె నప్పుడచ్చట నున్నవారందఱు రామానుజుల భక్తికి నతనియందు యామునాచార్యులకుఁగల వాత్సల్యమునకు నచ్చెరువొందిరి. పిమ్మట రంగరాజ స్వామివారు రామానుజులకు నుభయవిభూతి నాయకత్వమొసంగి శ్రీరంగంబునందుంచిరి. 216

తదాదిగా లక్ష్మణగురుండు శ్రీరంగంబు రాజధానిగాను శేషాద్రి హస్తిగిరి తోతాద్రి ప్రభృతి పుణ్యక్షేత్రంబులు పర్యాయ

పత్తనంబులుగాను నేర్పరచి విశిష్టాద్వైత సిద్ధాంతరాజ్యము పరిపాలింపుచుండెను. భూమీశునిపై మఱియొక భూమీశుఁడు యుద్ధంబునకు వచ్చినట్లు సర్వజ్ఞభట్టరను నొకపండితుండు రామానుజులపై స్పర్ధచే శ్రీరంగవీధులందుఁ దననామముఁ జాటింపుచు వాదమునకు రమ్మనుచుండె నయ్యవసరంబునఁ గూరేశపుత్రుండగు పరాశర భట్టరను నామంబుగల బాలకుండు బాలురతోఁ నాడుకొనుచుండి యాపండితునితో నిట్లనియె. నోరీ! యాత్మస్తుతిపరాయణా!! రామానుజ కూరేశాది మహాపండితులుండు ప్రదేశంబునందు లజ్జాభయంబులఁద్రోసి సర్వజ్ఞభట్టరని చాటింపుచున్నావు. నీసర్వజ్ఞత్వ మిప్పుడే బయల్పుచ్చెద నుండుమని చెప్పుచు నిసుకదోసెడుదీసి యిదియెంతయో చెప్పుమనుచుండఁగా నీసైకతరేణువు లెట్లులెక్కింతునాయని యక్కోవిదుండు నిర్విణ్ణుండైయుండె భట్టరువారు మరల సైకతములోఁ గొంతపాఱఁబోసి యొక్కచేతిలోనుంచి దీనినైనం జెప్పుమని యడిగి జవాబుగానక యోరీ! కోవిదాధమా!!. యదిదోసెడు ఇది చేరెడని చెప్పలేని నీవా సర్వజ్ఞుండవని యాక్షేపించె నంత నప్పండితుండు విస్మయానందములుపొంది భట్టరువారి నెత్తి ముద్దాడి భుజంబున వహించుకొనిపోయి రామానుజ కూరేశులకు సాష్టాంగ దండప్రణామంబు లాచరించి యపరాధక్షమాపణంబు చేసికొని బాలకప్రభావంబుఁ గొనియాడుచుంబోయె నది యట్లుండఁ గొంతకాలంబునకు యజ్ఞపురుషుండను నొక యుద్దండపండితుం డద్వైతవాది సర్వదేశములు జయించి శంకరభాష్యములతోసహా వేదాంత గ్రంథంబులు బండ్లపై నెత్తించుకొని శ్రీరంగంబునకువచ్చి రామానుజులవారిం బిలిపించి తదీయసిద్ధాంతంబు విశిష్టాద్వైతంబగుట లెఱింగి లక్ష్మణాచార్యులతో నిట్లనియె.

సీ॥ అద్వైతమతము నేనన్ని దేశములందుఁ
  గూర్మిమీఱఁగ నెలకొల్పినాఁడ
జండపండితుల నొక్కండనై గెల్చి వా
  రొనరించు జోహారులొందినాఁడ
సౌరగాణాపత్య శైవులు శరణన్న
  నిందించి వారి మన్నించినాఁడ
నిరువదేడుల ప్రాయ మెనయు నీతో వాద
  మతి లాఘవంబంచు నరయువాఁడ
 వచ్చితేని రమ్ము. వాదంబునకు లేక
 నీమతంబువిడిచి నామతంబు
 సమ్మతించి నేఁడు చట్టువుఁ గమ్మన్న
 నతనితోడ లక్ష్మణార్యుఁడనియె. 218

సీ॥ మేను డెబ్బదియేండ్లచే నీరసంబైన
  నొంది తహంకార మూర్ఛితముగఁ
బాపంబనక యహంబ్రహ్మాస్మియనునీకుఁ
  బలుకంగరాని దుర్భాషలున్నె
యింతలో సంభ్రమంబేల నీవాద వి
  ధానంబెఱింగి సమాధానమిత్తు
లీల శాస్త్రములు వల్లించియు నీబుద్ధి
  పక్వంబుగాక దుర్భ్రాంతిఁజెందె
 నోసమాలు పఠించెడు గూని వైష్ణ
 వుని బుధుండగు నద్వైతి చెనకి గెల్వ
 డనెడు లోకోక్తి నెపుడైన వినవొ పూని
 రమ్ము ప్రతివాదివై వేగిరమ్ము మాని. 219

అని వచించిన రామానుజాలాపంబులకు లజ్జించియు మరల యజ్ఞపురుషుండిట్లనియె వైష్ణవోత్తమా మన మిరువురము ఇరువది దినంబులు వాదము సల్పుదము పిదప గెలిచినవానికి నోడినవాఁడు శిష్యుండై భజింపవలయునన్న నల్లెయని రామానుజార్యుండంగీకరించె నంత వారిరువురు గంధ సింధురంబులభంగి నాలఁబోతుల పోల్కి శార్దూలంబులరీతి హర్యక్షంబులగతి ముఖాముఖిఁ బదునేడు దివసంబులు జయాపజయంబులు లేక సమానంబుగా వాదజన్యంబొనర్చిరి పదునెనిమిదవ దివసంబున సాయంకాల మద్వైతిప్రశ్నంబులకు సమాధానం బీయనేరక ఱేపటిదినం బిచ్చెదననియె యజ్ఞపురుషుండును నంగీకరించి యిఁక రెండుదినంబులు గడువున్నదిగనుక యట్లు చేయుమనఁగా రామానుజార్యుండు మఠంబునకరిగి ప్రసాదంబు భగవంతున కర్పించి తానుమాత్ర మారగింపక నిద్రించె నింతలోఁ దదీయేష్టదైవంబగు వరదరాజస్వామి స్వప్నంబున సాక్షాత్కరించి యీరేయి దిగులొంది భుజింపకుంటివేలయనిన యతీంద్రుండు దేవదేవుని పాదంబులు వట్టుకొని స్వామీ! వ్యాస, బోధాయన, గుహదేవ, భారుచి, టంక, ద్రమిడాచార్య, శఠగోప, యామునాదుల నాటనుండి సురక్షితంబైయున్న వైష్ణవసిద్ధాంతరాజ్యము నాదౌర్భాగ్యముచే నేటితోఁ బోవుచున్నది. ఇయ్యవమానం బెట్లు సహింతునని దుఃఖింపఁగా వరదుండిట్లనియె. 220

వత్సా! నీయంతవానిని నీకు శిష్యునిగా నొనరించుట కింతసేసితి నిప్పుడైన మించినదిలేదు. యామునాచార్య విరచిత మాయావాద ఖండనమను గ్రంథమును జూచి పఠింపుము. ప్రతివాదిని జయింతువని చెప్పి యంతర్హితుండయ్యె నంత లక్ష్మణాచార్యుం డట్లుగావించి ప్రాతఃకాలకృత్యంబులుదీర్చి ప్రతివాదిని సమీపింపఁగా నయ్యజ్ఞపురుషుండు యతీంద్రుని తేజఃప్రభావంబుల కచ్చెరువొంది తదీయ పాదంబులఁబడి లేచి యంజలిబద్ధుండై యిట్లనియె స్వామీ! నాభ్రమ

తొలంగెను. సాక్షాద్రంగేశ్వరస్వరూపుండవగు నీతేజస్సున కోడితిని శిష్యునిగా నంగీకరింపుమని ప్రార్థించి రామానుజాచార్యులవలన బంచసంస్కారాదులు ప్రాపించి మంత్ర మంత్రార్థంబులు గ్రహించి అరుళాళప్పెరుమాళ్ళెంబెరుమానారను తిరునామంబువహించి గురుసేవ చేయుచుండెను. అదిమొదలు రామానుజులవారికి నేడువందల యేకాంగులు పంచశత త్రిదండ సన్యాసులు సన్నిధి పరిచారకులై యుండిరి. కూరేశ దాశరథియెంబారులను మహాపండితు లమ్మహాత్మునకు శిష్యులై శాస్త్రసహాయము చేయుచుండిరి. ఏడులక్షుల కొత్తియమ్మ లప్పురుషవరేణ్యునకు శిష్యురాండ్రైరి. వేలకొలంది స్వాములప్పుణ్యరాశి పాదంబు లాశ్రయించిరి. సామంతరాజులు సార్వభౌములనేకు లయ్యతీశ్వరునకు నంతేవాసులైరి. శూద్రాభీర యవనాదులును మాల మాదిగ యెఱుకల యేనాదులు మొదలైనవారు లక్షలకొలంది రామానుజసంబంధులై పునీతులైరి. వైష్ణవస్వాము లియ్యాచార్యునకు నంతేవాసులై డెబ్బదినాలుగు సింహాసనముల కధిపతులైరి మానవాకారముం దాల్చి వలయునన్నవారికెల్ల సిద్ధాంతమర్మంబు లుపదేశించి మంత్రోపదేశమునేసి అభిజన విద్యామదంబుగల పండితుల గర్వంబడంచెను. 221

వెండియు నిమ్మహాత్ముండు చరమశ్లోకార్థముకొఱకు ననేక పర్యాయంబులు తిరిగి తిరుక్కోట్టియూరినంబిచే గ్రహించెను. ఈసూరిజనాగ్రగణ్యుండు పెరియనంబిచేఁ బంచసంస్కారమంత్ర మంత్రార్థంబులును తిరుక్కోట్టియూరినంబిచేఁ జరమశ్లోకార్థంబునుఁ దిరుమలనంబిచే శ్రీరామాయణ విశేషార్థంబులునుఁ దిరుక్కచ్చినంబిచే నాలువార్తలును మాలాధరనంబిచే ద్రావిడ వేదంబులును గ్రహించెను 222

సుబుద్ధుఁడు

జగద్గురుండగు రామానుజులవారికి గురువులగు నీనంబులెవ్వరో యెట్టివారో వివరింపుడు. వీరు రామానుజులకంటె నెక్కువవారా యేమి ? 228

వరవరముని

మనమట్టి విమర్శ చేయఁగూడదు. రామానుజు లొక్కనాఁడు వీధిలో వచ్చుచుండఁగాఁ దాదాచార్యుండగు పెరియనంబి సాష్టాంగ నమస్కారముఁ గావించెను. సన్నిధిస్వామి లిదేమని యడుగగా నతండిట్లనియె నయ్యలారా ! అక్రూరోద్ధవాదులు తనభక్తులైనను శ్రీకృష్ణుఁడు వారినిఁ బూజ్యులుగా భావించునట్లు రామానుజులు మమ్ములను గురువులుగా నెంచుచున్నాఁడు మేమమ్మహాత్మునకు లోక విడంబనార్థము గురువులమేకాని జగదాచార్యుం డతండేయని తీర్మానించెను. 224

సుశీలుఁడు

యామునమునీంద్రు లుండఁగానే రామానుజులు యువకులై యున్నారుగదా పంచనంబులకుఁ బెట్టుబడిపెట్టి వారిద్వారా చెప్పించక పోతే తానేల యుపదేశింపరాదు ! 225

వరవరముని

యామున రామానుజు లేకీభవించినచో సమస్తజీవుల నొక్క సారి మోక్షమునకుఁ దోలియుందురు. లీలావిభూతి నశించును. రాఁబోవు జీవకోటికి శరీరములిచ్చువారుండరు. సృష్టి యాగిపోవును దానికైగదా రమాపతి జాగరూకుఁడై యామున రామానుజులకు సమావేశము కుదురనీయలేదు. వెండియు నీపంచనంబులు యాము నాచార్యులకు శిష్యులై రామానుజులకు గురువులై యున్నారు. ఈయైదుగురికి సంస్కృత ద్రావిడ నామంబులు గలవు. వానిని

వరుసగా నెఱింగింతు వినుము. కాంచీపూర్ణులు, మహాపూర్ణులు, గోష్ఠీపూర్ణులు శ్రీశైలపూర్ణులు, మాలాధరులను సంస్కృతనామంబులు. తిరుకచ్చినంబి, పెరియనంబి, తిరుకోట్టియూరినంబి, తిరుమలనంబిమాలాధరనంబి యను ద్రావిడనామంబులును గలవు. ఇంతే కాక యతీంద్రునిమాహాత్మ్య మింకను నెఱింగింతు నాలకింపుము. 225

1 శ్లో॥ మస్తకం శ్రీశఠారాతిం, నాథాఖ్యం ముఖమండలమ్
నేత్రయుగ్మం సరోజాక్షం, కపోలం రాఘవంతథా

2 శ్లో॥ వక్షస్థలం యామునాఖ్యం, కంఠం శ్రీపూర్ణదేశికమ్
బాహుద్వయంగోష్ఠిపూర్ణం, శైలపూర్ణం స్తనద్వయమ్

3 శ్లో॥ కుక్షింతువరరంగార్యం, పృష్ఠంమాలాధరంతథా
కంటింకాంచీమునింజ్ఞేయం, గోవిందార్యంనితంబకమ్

4 ,, భట్టవేదాంతినౌజంఘే, ఊరుయుగ్మంతునంబిలం
కృష్ణంజానుయుగంచైవ, లోకశ్రీపాదపంకజమ్

5 ,, రేఖాంశ్రీశైలనాథాఖ్యం, పాదుకాంవరయోగినమ్
పుండ్రంసేనాపతింప్రోక్తం, సూత్రంకూరపతింతథా

6 ,, భాగినేయంత్రిదండంచ, కాషాయంచాంధ్రపూర్ణకం
మాలాంచకురుకేశార్యం, ఛాయాశ్రీచాపకింకరమ్

7 ,, ఏవంరామానుజార్యస్య, వయవానఖిలాన్గురూన్
మహాంతంచావయవినం, రామానుజమునింభజే

8 ,, గురుమూర్త్యాత్మయోగీంద్రం, యోధ్యాయేత్ప్రత్యహంనరః
సర్వాన్కామానవాప్నోతి, లభేచ్చాంతేపరంపదమ్

నమ్మాళ్వారుశిరస్సుగాను నాథమునులుముఖముగాను, పుండరీకాక్షుఁడునేత్రములుగాను శ్రీరామమిశ్రులు చెక్కిళ్ళుగాను యామునమునిఱొమ్ముగాను మహాపూర్ణులుకంఠముగాను గోష్ఠీపూర్ణులుబాహు

వులుగాను శైలపూర్ణులు స్తనద్వయముగాను తిరురంగ ప్పెరుమాళ్లు పొట్టగాను మాలాధరుఁడు వీపుగాను కాంచీపూర్ణులు నడుముగాను ఎంబారు పిరుదులుగాను భట్టరునంజియ్యరు పిక్కలుగాను నంబిళ్ళ తొడలుగాను వడుక్కు త్తిరువీధిప్పిళ్లై జానువులుగాను పిళ్ళలోకాచార్యులు పాదములుగాను తిరువాయిమొళి ప్పిళ్ళ పాదరేఖలుగాను మణవాళమహామునులు పాదుకలుగాను సేనమొదలియారూర్ధ్వ పుండ్రముగాను కూరత్తాళ్వారు యజ్ఞోపవీతముగాను దాశరథి త్రిదండముగాను వహగనంబి కాషాయవస్త్రముగాను కురుకేశార్యుండు తోమాలగాను ధనుర్దాసు మేని నీడగాను గలిగితనరారుచుండు రామానుజయోగీంద్రుల సేవింపుచున్నానని యొక్క మహాత్ముఁడు చెప్పెను. ఈప్రకారము సర్వాచార్యులును శరీరముగాఁగల రామానుజయోగీంద్రునిఁ బ్రతిదిన మెవ్వఁడు ధ్యానించునో వాఁడిహలోకంబుల సర్వవాంఛితములు నెఱవేర్చుకొని తుదకుఁ బరమపదమునుఁ బొందునని పూర్వాచార్యులు తీర్మానించిరి. యతీంద్రుని మహిమంబిట్టిదని తలంపుము. 226

సుశీలుఁడు

యతీంద్రుఁడు చరమశ్లోకార్థ మనేకపర్యాయములు గోష్ఠీపూర్ణులయొద్దకుఁ దిరిగినను సెప్పలేదని సాయించితిరి. దానివిశేషమేమో సెలవిండు. 227

వీరవరముని

చరమశ్లోకంబనఁగాఁ బూర్వము శ్రీకృష్ణుండు సర్వోపనిషత్సారంబగు గీతాశాస్త్ర మర్జునునకుపదేశింపగాఁ నతండామూలాగ్రముగా విని పూర్వోత్తర సందర్భము తెలియక చివరకు దుఃఖించెనతని దుఃఖనివారణార్థము చరమోపాయంబుపదేశించి గీతాచార్యులవారు మరలవిచారించి యయోగ్యాదీనింజదివియర్జునుడు కూడమోక్షం

బహుగు నేమోయని శంకించి ఫల్గునునితో మరల నిట్లనియె నర్జునా యీరహస్యంబు తపస్సుచేయనివానికి భక్తిలేనివానికి గురుశుశ్రూష చేయనివానికి నాయందసూయగలవానికి నెకప్పుడైనం జెప్పఁగూడ దని శాసించెను. దానివల్లఁ బూర్వాచార్యులయ్యర్థమును రహస్యముగానుంచి పూర్ణాధికారులకుమాత్ర ముపదేశింపుచు వచ్చిరి. బహుపర్యాయములు తనయొద్దకువచ్చిన భాష్యకారుల ననుగ్రహించి గోష్ఠీపూర్ణులు చరమార్థము నుపదేశించి వెల్లడిచేయునేమో యని శంకించి లక్ష్మణార్యునితోఁ దండ్రీ! నీయార్తిసహింపలేక దీనిం జెప్పితి నీవెవ్వరికి నుపదేశింపవలదు చెప్పినవానికి నరకము విన్నవానికి మోక్షము చుమీ యని పనిచెను. భాష్యకారయోగి శ్రీరంగంబునకేగి కూరేశ దాశరథులనుమాత్రము పరీక్షించి చరమార్థ ముపదేశించి యొక్కతఱి రహస్యప్రదేశస్థుఁడై యిట్లని చింతించె, నీచరమార్థంబును శ్రీకృష్ణుఁ డర్జున వ్యాజముచే లోకోపకారార్థంబుగాఁ బ్రకటించెను. యామునాదులు దానిగౌరవం బెఱింగినవారగుటచే నతిగుహ్యముగా దాఁచియుంచి యర్హులని తోఁచినవారికి నుపదేశింపుచు వచ్చిరి. మద్గురుండగు గోష్ఠీపూర్ణులుసహా నాచే శాబ్దిచేయించి యుపదేశించిరి. దీనినింత దుష్కరముగా నుంచినచో నధికారులులేక కొలఁదికాలములో నెవ్వరికిఁ దెలియనికతంబున నంతరించును. అటుమీఁదఁ జరమార్థప్రదాతయగు వాసుదేవు నుద్దేశము వ్యర్థంబగు నట్లుకాకుండ నుద్ధరింపవలెనని తలంచి యొక్కనాడు లక్షలకొలంది జనుల రావించి కాంచీపుర గోపురంబెక్కి శ్రీమదష్టాక్షరి మంత్రార్థంబును జరమశ్లోకార్థము నందఱు వినునట్లు వక్కాణించెను. జనులు తదీయోపకార వాత్సల్యంబులకు నచ్చెరువంది నమస్కరించి జయ జయ ధ్వనులుసేసి రామానుజులవారిని వేనోళ్ళం గొనియాడిరి. 228

తరువాత నపరిమితార్తితో గోష్ఠీపూర్ణులువచ్చి యతీంద్రునిఁ జీరి గురుద్రోహి కేమిగతియని మందలించెను. రామానుజార్యుండు

శాశ్వత నరకవాసమే నిశ్చయమానెను. దానినెఱింగియు నిక్లేల చేసితివని నంబిగా రడుగఁగా దేవా! విన్నవారికి మోక్షమని మీరే సాయించితిరి. కోట్లకొలఁది జనులు నాచేవిని ముక్తికిఁ జనుచుండఁగా నేనొక్కండను నరకమునకేగిన నేమని చెప్పితిననియెను. గోష్ఠీపూర్ణులవాక్యంబులకలరి లక్ష్మణార్యునిఁ గౌఁగిలించి తండ్రీ! నీవు చేతనోద్ధారణార్థ మవతరించిన జగద్గురుండవు. నీచే నిప్పని సేయించినవాఁడు సర్వజీవదయాపరుండగు శ్రీకృష్ణుండు చుమీ. నీకును నీచే విన్నవారికి నపవర్గంబు కరతలామలకంబు. నేను స్వార్థపరుఁడనగుటచే నాకడుపునిండినఁ జాలుననుకొంటిని. నీవు స్వార్థత్యాగివి. పరోపకారపరాయణుండవగుటచేఁ బస్తుండివైననఁ బరుల యాకలిఁ దీర్పఁగోరితివని ప్రశంసించి పోయె నంతట లక్ష్మణగురుండు కతిపయచ్ఛాత్రులతో బయలుదేఱి దిగువతిరుపతికరిగి యచ్చటనివసించి కొండమీదనుండు శ్రీశైలపూర్ణులవారినిఁ బిలిపించెను. 229

సుశీలుఁడు

పెద్దలకడకు శిష్యులు పోవలయునుగాని వారిం బిలిపించుట లపచారంబుగాదా! శాస్త్రవశ్యుండగు నాబెరుమానారు లక్లేల చేసిరి ?. 230

వరవరముని

ఆళ్వారు లందరికి శేషాద్రి శేషరూపంబుతో సాక్షాత్కరింపఁగాఁ బ్రాకృతాంఘ్రులతోఁ బర్వతారోహణం బొనర్పరాదని కపిలతీర్థంబుకడ నిలిచియుందురు. భక్తవత్సలుండగు శ్రీనివాసప్పెరుమాళ్ళు తానేవచ్చి దర్శనంబిచ్చుచుండును. అందువల్లనే యాతీర్థంబున కాళ్వారి కోనేరను పేరు ప్రసిద్ధమయ్యెను. రామానుజయోగి జగదాచార్యుండయ్యును భక్తిచేత నాళ్వారలలోఁ జేరినందువల్ల నగ్గిరి శేషాకారంబుతోఁ గనుపట్టఁగా నయ్యోగివర్యుండు శైలారోహణంబు చేయనొల్లక దిగువతిరుపతిలోనిలిచి తిరుమలనంబినిఁ బిలిపించి

తదీయాంఘ్రులంబడి నమస్కరించి లేచి బద్ధాంజలియై దేవా! రామాయణ సంస్థితోపనిషదర్థంబులు వినుటకు వచ్చితి విన్నవింపు డని యాచించెను. 231

సుశీలుఁడు

శ్రీరామాయణకథయం దుపనిషదర్థంబులుగలవా యున్నచోఁ దిరుమలనంబి కెట్లుదోఁచెను, రామానుజుల కేల తోఁచలేదు? 232

వరవరముని

ఈశ్వరులకుఁ దెలియని శాస్త్రంబులేదు కాని సర్వజ్ఞులగు రామకృష్ణులు వసిష్ఠ విశ్వామిత్ర సాందీపనులను గురువులుగాఁ దలంచినట్లు లోకవిడంబనార్థము రామానుజయోగి తిరుమల నంబియొద్ద కేగెను. తిరుమల నంబిగారు తెలిసికొన్నవిధం బెట్లంటివేని యామున మునీంద్రులు పరమపదనాథుని సింహాసనాంశముచే భూలోకంబున నవతరించి సర్వశాస్త్రములయందు నేకసంధాగ్రాహియై ద్వాదశవర్షప్రాయంబున సర్వవిద్వజ్జన కోలాహలు నోడించి కొంతకాలము రాజ్యంబు సేసి శ్రీరామ మిశ్రోపదేశంబుచే సన్యాసియై శ్రీరంగంబుఁ జేరి రంగరాజానుగ్రహంబుచే వేదశాస్త్రములయందు సర్వజ్ఞత్వము సంపాదించి శిష్యుల కుపదేశించెను. గీతాశాస్త్రమునంగల విశేషంబులన్నియుఁ గొలఁదిశ్లోకములతోఁ బ్రకటించెను. రామాయణార్ణవంబునదిగి విశేషార్థంబులను రత్నంబులార్జించి తిరుమలనంబికినిఁ దిరుమంత్రద్వయ మంత్రార్థంబులనుఁ బెరియనంబికిఁ జరమార్థంబు గోష్ఠీపూర్ణులకు వరదరాజానుగ్రహంబు కాంచీపూర్ణులకు ద్రావిడవేదార్థంబులు మాలాధరునకునిచ్చి తక్కినశాస్త్రార్థంబు నిపంచనంబులను సర్వచ్ఛాత్రులకు నిచ్చెను. రామానుజయోగీంద్రు లయ్యర్థరత్నంబులు ప్రాపించుటకుఁ దిరుమలనంబికడ కేగి యాచించిరి. నంబిగారును సంతోషించి యతీంద్రులఁగని పుత్రా! నిరంతరము నేనిచ్చుటనుండుటకు వీలులేదు. ప్రాతఃకాలము భగవత్సన్నిధియందుఁ దిరుమంజన

కైంకర్యమున్నది. దానిని నిర్వహించుకొని వచ్చుచుండుమని చెప్పి పర్వతారోహణంబొనర్చి గృహంబుఁ జేరి నాల్గవజామున వామన ముహూర్తంబున లేచి రెండుక్రోసులదూరంబుననుండు పాపనాశనంబున కరిగి మజ్జనం బాచరించి తీర్థంబుఁ గొనివచ్చి శ్రీనివాసున కర్పించి భోజనంబుఁగావించి దిగువ తిరుమలకేగి రామానుజులకు రామాయణ విశేషార్థంబు లుద్దైవముల కుపదేశించుచు సంవత్సర కాలంబునకుఁ బూర్తిఁగావించెను. తరువాత నొక్కతఱి నుద్దైవరులతో నంబిగా రిట్లనిరి. తండ్రీ! నీప్రతిజ్ఞ నంగీకరించి యింతకాలము బహు కష్టములకు సహించి గ్రంథము పూర్తిచేసితి కాని కొండపైకి నీవురాక తప్ప దెంమకనఁగాఁ దొండమానుచక్రవర్తి శత్రువులకోడి శ్రీనివాసునిఁగూర్చి తపంబు చేయఁగా నప్పురుషోత్తముఁ డతనికి శత్రుజయార్థము శంఖ చక్రంబులిచ్చి భక్తవాత్సల్యంబు ప్రకటించుట కిప్పటికి నాచిహ్నంబులు ధరింపకుండుటచే రంధ్రంబుఁగొని శైవులు వీరభద్రుండని దేవాలయంబు నాక్రమించిరి. అయ్యవసరంబున శైవ వైష్ణవులకుఁ గలహంబు జరుగఁగా మధ్యవర్తులు ఉభయ పక్షంబులవారి నొక్కచోటఁజేర్చి యొక్కవారంబు వైష్ణవులును రెండవ వారంబు శైవులును పూజించున ట్లాడంబరచిరి. నాటఁగోలె మనకుఁ జాలాసంకటముగా నున్నది. దానిని నీవు నివారింపవలయునని వచింపఁగా నంబెరుమానారు దుఃఖించి వైష్ణవవిపత్తునుఁ బాపనెంచి శేషునిపై నంఘ్రులుంచుటకు సంశయించి పాదంబులకు గుడ్డలుసుట్టి జానువులతోఁ బ్రాకుచుండఁగా నద్దురవస్థనుఁగాంచి సహింపలేక శ్రీనివాసుం డెదురుగావచ్చి రామానుజుని భుజంబులపై నెక్కించుకొని పోయి కోవెలకడదించి పుత్రా! నీవీనియమంబుమాని గిరిపైజరించి మతాంతవ్యాప్తి మాన్పుమని శాసించి వేంకటేశ్వరుఁ డదృశ్యుఁడయ్యెను.

లక్ష్మణగురుం డొక్కనాఁడు సభగావించి యుభయపక్షంబుల వారినిఁ బిలిపించి దైవవిషయంబున మీమీయభిప్రాయంబు తెల్పఁగిం పుడు. తగాదా నివర్తింతుననఁగా శైవు లిట్లనిరి.

సీ॥ మావీరభద్రుని మందిరంబునఁ జేరి
విష్ణుదేవుండని వెట్టితొట్టి
పలుకులాలాపించి పలుమాఱు మామది
కాయాస మొనఁగూర్చి యనుదినంబు
తులసితోఁ గిలపితోఁ దులనపూజ లొనర్చి
చక్కరపొంగళ్ళు మెక్కి మెక్కి
పులిహోర గారెలు పూర్ణము ల్దోసెలు
బొబ్బట్లు లడ్డుకంబులు నొనర్చి
సొంపుగాఁదిని కోవెలరొంపిఁ జేసి
విఱ్ఱవీగుచునున్నారు వీరవైష్ణ
వాగ్రణులమని మాకాగ్రహంబు వచ్చు
దాఁకఁ జేయుదురటుమీఁద దాసరారు. 234

శ్రీవైష్ణవు లిట్లనిరి.

సీ॥ పసి మెడపై గుదిబండఁ గట్టినపోల్కిఁ
గంఠభాగమున లింగముధరించి
కనులపై నుదుటిపై గళముపై మేనెల్ల
నాదరంబొప్ప విబూదిఁబూసి
పాషండులైయుండి పంకజాక్షునిగుడిఁ
జేరరాదనుచు యోజింపకుండ
మాటిమాటికి నిరాఘాటంబుగా దేవ
ళమునకు నచ్చి బిల్వంబు తుమ్మి

పూలు గైకొని తామసపూజ లెపుడు
సలుపుచున్నారు వీరశైవులమటంచు
పంకజాక్షునిఁ గని వీరభద్రబుద్ధి
లేదు జ్ఞానంబు వీరికి లేశమైన, 235

వారి పరస్పరాలాపంబులు లక్ష్మణాచార్యుండువిని శైవులతో నిట్లనియె నయ్యలారా! మీకు మాకు నొక్క దేవాలయంబున నేకీభవించుట కెంతమాత్రము వీలులేదు. శివాలయమనియో విష్ణ్వాలయమనియో నిర్ణయము కావలెను. ఎట్లందురా యుపాయం బొక్కటి చెప్పెద రాత్రికాలమున దేవునిసన్నిధిలో శివచిహ్నంబు లొకప్రక్కన విష్ణుచిహ్నంబు లొకవైపుననుంచియుభయులము కావలి యుండి ప్రాతఃకాలంబునఁ గవాటంబులు దీయునప్పుడు దేవుండు శివ లక్షణంబులు దాల్చియుండునేని మమ్ములను మీరు చంద్రగిరివఱకుఁ దఱిమివేయుడు. విష్ణులక్షణంబులు దాల్చునేని మిమ్ములఁ గాళహస్తి దాఁకఁ గొట్టింతునని యొప్పించి యానిశాకాలంబున విభూతి రుద్రాక్షలు స్ఫటికమాలలు త్రిశూల మొకవైపునఁ దులసీ నలిన బీజమాలలు లక్ష్మి శంఖ చక్రంబు లొక్కవైపుననుంచి యొకరిపై నొకరు కావలియుండి సూర్యోదయవేళఁ గవాటంబులు దెఱచి చూచిరి తత్సమయంబున శివచిహ్నంబులు దూరముగాఁ బాఱఁజిమ్మి యర్చావతారమూర్తి, 236

సీ॥ తిరుమణి శ్రీచూర్ణ వరరేఖలు ధరించి
కరమున శంఖ చక్రములుదాల్చి
లక్ష్మీసతి నురస్స్థలంబున నెలకొల్పి
గళమునఁ గౌస్తుభం బెలమిఁబూని
తులసీ నలినబీజ కలితమాలికలూని
వనమాలికల వైభవమునునిచి

హార కేయూర కోటీరముల్ వైచేసి
మితిలేని మణిపరిష్కృతులుదొడిగి
కరము రాణింపుచున్న పంకజదళాక్షు
శ్రీనివాసునిగాంచి కాంచిరి ముదంబు
వైష్ణవులు శైవు లచ్చోటువాసి నడచి
కాళహస్తికిఁబోయి రక్కాలమందు. 237

తదాది మతాంతర మాలిన్యమువిడిచి శేషాద్రిపై నిర్మలుండై వెలింగె. 238

సు శీ లుఁ డు

అయ్యా! రామానుజులాదిశేషుండుగనుక సర్వజ్ఞుండై! యాశేయి రుద్రచిహ్నంబులు పరిహరించి హరి నామసూత్రముగుండాపోయి విగ్రహంబు నలంకరించెననియు సత్యమునకది శివ చిహ్నంబులచే విగ్రహంబు నలంకరించెననియు శైవ శాక్తేయాద్వైతులు చెప్పుచున్నారే దాని సంగతియేమి? 239

వ ర వ ర ము ని

లింగములేని శివాలయ మెచ్చటనులేదు. అది యట్లుండఁగా వాస్తవ శివవిగ్రహమైనయెడల నుద్దెవరులు దాని స్పర్శింపనసరేకదా కలనైనం దలపోయుడు. శైవాదుల వాదము నిక్కమైనను గంగాధరుండు రామానుజులను దండింపవచ్చును లేదా యతీంద్రుండు బహిర్గతుండైనప్పుడు విష్ణుచిహ్నంబులు పాఱవైచి స్వకీయ చిహ్నంబులు ధరింపవచ్చు నెద్దియు లేదుకావున వేంకటేశ్వరుఁడు విష్ణువేకాని శివుండుగాడు. శాక్తేయులనునట్లు శక్తియుఁగాడు. ఈనిస్సార వాక్యంబులచేఁ బ్రయోజనంబులేదు. 240

సు శీ లుఁ డు

ఇఁకను గథాభాగంబునకుఁ జనుడు. 241

## వరవరముని

అంతట మతాంతర దేవాంతర సంబంధంబువిడిచి పరిశుద్ధుఁడై యున్న నంబారుంగొని యతీంద్రుండు శ్రీరంగంబునకరిగి బ్రహ్మసూత్రభాష్యంబు రచించి కూరేశునిచే వ్రాయించి యనేక శిష్యబృందంబులతోఁగదలి నానాదేశంబులందు విశిష్టాద్వైతంబు స్థాపించి పండరీపురము ద్వారకా ప్రముఖ పుణ్యక్షేత్రంబుల దర్శించి యా యా భగవన్మూర్తులఁ గొనియాడి నవద్వీపంబుదాఁటి సరస్వతీపీఠంబునకేగి తదీయాలయద్వారంబున నిలువంబడి కన్నీరుగార్చుచు బాలికామణియొకర్తు యతిశ్రేష్ఠుఁడ! "ప్యాస" యను శ్రుతి కర్థంబు సెప్పుమనఁగా రామానుజుం డిట్లనియె. "కంపిబతీతికపిః" అనఁగా సూర్యుఁడు. సూర్యునిచే వికసింపఁబడిన పుండరీకనిభ ముఖంబుగల వాఁడు భగవంతుఁడని దాని కర్థంబుసెప్పె నయ్యర్థం బాకర్ణించి దుఃఖంబుమాని సూరివర్యా! యిదివఱ కీపీఠంబునకు వచ్చిన శంకరాదుల నడుగఁగా నీశ్రుతి కపార్థంబు సెప్పిరి. నాటంగోలె నేను దుఃఖింపుచుంటి నేటికాసందేహంబు తీరఁగా సంతోషించితి. నేను సరస్వతిని, నాదుఃఖంబుఁ బోఁగొట్టుటచే శారదా శోకనాశనుండనియు బ్రహ్మసూత్రభాష్యంబ నర్పుటకు నీకేతగియున్నదిగనుక భాష్యకారుండనియు యత్యాశ్రమ లక్షణంబులు నీయందే నెలకొనియుండుటచే యతిరాజనియుఁ బ్రఖ్యాతివహింపుమని వరంబులిచ్చి హయగ్రీవ విగ్రహంబొక్కటి సమర్పించి సరస్వతీదేవి మాయమయ్యె నటుపిమ్మట నుడైవరులు భూతప్రయోగంబుచేసిన కోవిదులకు వెఱ్ఱిఁబుట్టించి తద్దేహసంబంధులు శరణొందఁగా వారల బాగుసేసి బదరికాశ్రమంబునకేగి యచ్చోటనుండు మునీంద్రులకు శ్రీభాష్యాదులు వినిపించి వారిచేమెప్పుఁగాంచి తిరిగి హృషీకేశము హరిద్వారము అయోధ్య మధుర గోకులము బృందావనము మొదలగు పుణ్యక్షేత్రస్థులగు భగవన్మూర్తులకు మంగళాశాసనముసేసి సాలాగ్రామము నైమిశారణ్య

మును దర్శించి గండకిలో స్నానమొనర్చి గంగాస్నానమొనర్చి బిందుమాధవు నర్చించి గయా ప్రయాగాదుల దర్శించి జగన్నాథంబుడాసి సుభద్రా బలభద్రసహితుండగు శ్రీకృష్ణు నర్చించి యచ్చోటనిలిచి యాస్థలంబునఁ బూజా పురస్కారాదులు సరిలేవు కాబట్టి పాంచరాత్రాగమ ప్రకారము చేయఁబూనఁగా జగన్నాథుం డిట్లనియె. 242

రామానుజా మదీయాలయంబు లన్నియు నీసిద్ధాంతానుసారముగా వైష్ణవంబు సేసితివి. కాని పాండురంగంబునందు నిచ్చటనుఁ బతితపావనబిరుదంబు వహించియుంటిని. నీమతంబున కొడంబడితినేని యాబిరుదంబు పోవును. నీనియమంబుమాని స్వేచ్ఛ నరుగుమనఁగా యతీంద్రుఁ డీయకొనక యారేయి నిద్రింపుచుండఁగా జగన్నాథుం డాసూరిశేఖరుని భుజంబున వహించి బహుదూరంబుననుండు శ్రీకూర్మంబున డించి కలలో నిట్లనియె. భాష్యకారా! యిది శ్రీకూర్మంబు. శైవులు నద్వైతులు దీనిని లింగంబనిపూజింపుచున్నారు వైష్ణవస్థలంబు సేయుమని నియమించి యంతర్ధానముసేసె జగన్నాథములో రామానుజీయులకు మీగురుండు శ్రీకూర్మంబున కేగెను. మీరును పొండని చెప్పి వారు గురునిడాయునటకుఁ దానొక శిష్యుఁడై పరిచర్య చేయుచుండి రామానుజీయులు రాగానే జగన్నాథుఁడదృశ్యుడయ్యెను. రామానుజాచార్యుం డంతేవాసులంగూడి మతాంతరులఁ దొలఁగించి శ్రీకూర్మమునుఁ బాంచరాత్రాగమప్రకారముగా వైష్ణవస్థలంబొనర్చి పాంచరాత్రవైష్ణవుల నర్చకులుగానిలిపి రామానుజీయవైష్ణవు లెన్నటికి నీక్షేత్రంబు దాటిపోరాదని శాసించి సింహాచలంబున కరిగి నృసింహునకు మంగళాశాసనంబొనర్చి మధ్య దివ్యదేశంబు లన్నియు సేవించి తాండవకృష్ణమాచార్యునకు గర్వభంగ మొనర్చి బయలుదేరి శ్రీకాకుళాంధ్రనాయకునకు మంగళగిరి పానకాలరాయనికి మంగళాశాసనంబొనర్చి మధ్యదేశ దివ్యస్థలంబులన్నియు సేవించి శ్రీరంగంబుఁ జేరి రంగేశ్వరుని సేవింపుచు సిద్ధాంతరాజ్యంబునుఁ బరిపాలింపుచుండె నయ్యవసరంబున,

సీ॥ కడుభక్తితో నమస్కారంబుఁగావించు
వారికద్దిన మపవర్గమిచ్చి
వార్ధకబాధచే వగపుఁజెందెడువారి
కానాడె వైకుంఠ మందఁజేసి
భోజనంబునకిచ్చి పొగడినవారి క
వ్వాసరంబున ముక్తిఫలముఁగూర్చి
దండాహతము నేయిదధులిచ్చువారి న
ప్పాటనే నిత్యవిభూతికనిచి
సరసియందొక్కదినమున జలకమాడి
కోట్ల జలజంతువుల కొనఁగూర్చెఁ బరమ
పదము సులభముగా మనభాష్యకారుఁ
డౌర లీలావిభూతి వ్యయంబుసేసి. 243

సీ॥ దానశౌండులకు సాధ్యముగాని నిత్య వి
భూతిఁ జెంచులవారిఁ బొందఁజేసి
యాగకర్తలకు నర్హముగాని వైకుంఠ
పదము మాదిగవారిపాలుసేసి
స్వాధ్యాయపరులకు శక్యంబుగాని ని
ర్వాణపదము బోయవారికిచ్చి
యోగివర్యులు సూడనోపని పరమ ప
దమున కేనాదుల దాయఁబనిచి
వారు వీరననేటికిఁ గోరిమ్రొక్కు
వారికెల్లను విపులాపవర్గమిచ్చి
సంతసించెను మనయతిచక్రవర్తి
కలఁడె యీదాత సర్వజగంబులందు. 244

సీ॥ అగ్రహారంబు లనుగ్రహంబుననిచ్చి
రవనీసురులకు ధరాధిపతులు
భూ గో హిరణ్యాది భూరిదానములచే
నెలమి నర్థులసాఁకిరివిశాంగ్రహ
విద్యాధనంబుచే విద్యార్థులగువారి
నాదరంబున బ్రోచి రఖిలబుధులు
వివిధ యోగాభ్యాసవిధముఁదెల్పిరియోగ
సిద్ధిచే మహిమలార్జించుమునులు

కాని రామానుజార్యునిగతి శరీర
ధారులకు మోక్ష మొనఁగూర్పనేరరైరి
కాన యతిరాజ దివ్యాంఘ్రి కమలయుగళ
మాత్మలోపలఁ జింతింపు మనుదినంబు.

246

సీ॥ ఆపోశనించె నయ్యంబురాశిజలంబు
గడియకాలములో నగస్త్యమౌని
చచ్చిన కర్ణాదిజనుల ముప్పదియేండ్ల
పైఁజూపె వ్యాసుండు పాండవులకు
సామర్థ్యమొప్ప విశ్వామిత్రకర్మంది
స్రష్టకు మారుగా సృష్టిఁజేసె
నౌర్వుఁ డాత్మీయ కోపానలంబు రగిల్చి
వనధిలో బాడబవహ్నిఁజేసె

మరుదవనినాథ సవన సమయమునందుఁ
జాలి సంవర్తముని శచీజానినోర్చెఁ
గాని మనభాష్యకారునిగతి శరీర
ధారులకు మోక్షమొనఁగూర్పనేరరైరి.

సుశీలుఁడు

తదుపరి నేమిజరిగెనో సాయించండి. 247

వరవరముని

హర విరించన శక్ర యమాది నిర్జరులు తక్కిన జేజేలంగూడి క్షీరసముద్రంబు దూరంబని తలంచి నిశాకాలంబున శ్రీరంగంబుడాసి రంగేశ్వరుని దర్శించి నమస్కరింపఁగా నప్పురుషోత్తముఁడు వారి నర్హాసనంబులనుంచి కుశలప్రశ్న మొనర్చి : వచ్చినకార్య మేమనఁగా 248
బ్రహ్మానుమతిచే యముండిట్లనియె.

సీ॥ ఇనుపముక్కులకాకు లెన్నోగలవు నాకుఁ
బనిలేదు హానికీపట్టునందు
నుక్కుకోఱలకుక్క లొక్కుమ్మడి మదించి
మొఱుగుచున్నవి జనమ్ములనుఁగోరి
వజ్రదంష్ట్రల కీటవారము ల్చెలరేఁగి
ప్రాఁకుచున్నవి నేలపైనఁ బర్వి
వీఁక మీఱఁగ ససం,ఖ్యాకులా కింకరుల్
పలవరింతురు పిచ్చిపట్టినట్లు
చిత్రగుప్తు నుద్యోగంబు చిన్నవోయె
నేవిచారణకృత్యంబులెల్లమాని
యుంటి నధమునిగతి నిరుద్యోగినగుచు
నేర్పు చెడియుండె సంయమినీపురంబు. 249

ఇంద్రుండిట్లనియె.

సీ॥ రసికాగ్రణులులేక పసమాలి రంభాది
కాంత లానందంబుఁ గానరైరి
కామినీ పురుష శృంగారచేష్టల కగ్గ
మగు నందనము శూన్యమై పొసంగె

సీవులఁ బెట్టేవు లావు సీవులమిన్న
లోనరించు పని ప్రయోజనముఁ గనకు
తనపవిత్రతనుఁ గైకొనెడువారలు లేక
మందాకినియు ఖేదమందుచుండెఁ

నతిథిజన పూజలేకుండ నారగించు
గేస్తుపోలిక నేను నిరస్తకీర్తి
ధనుఁడనైతి మదీయపత్తనము సుకృతి
దాసిరానికతంబున వాసుదేవ. 259

దీనికిఁ గారణంబేమనిన మధుసూదనుండు మందహాసంబొనర్చి విరించనాదులతో నిట్లనియె. వేల్పులారా! రాజైనవాఁడు రాజ్యంబు యువకుండగు కుమారుని కధీనంబొనర్చి తాను స్త్రీలోలుండై భోగంబులచే విఱ్ఱవీగినచందంబున మద్విభూతిద్వయంబు రామానుజులకర్పించి లక్ష్మీసరససల్లాపంబులతోఁ బ్రొద్దుపుచ్చుచుంటి నక్కారణంబున లీలావిభూతి కీకొఱంత వాటిల్లెఁ గాంతాలోలునకు సంపద్వృద్ధి కానేరదు గదా! మదీయశాసనానుసారంబుగాఁ జేయుచున్నభాష్యకారు నేమనుటకువీలులేకయున్నది. అతనికిఁ బ్రతీకారంబుగా నొక్కదుష్టునిసృజింతు వానిచే మీ మీ యుద్యోగంబులు ప్రయోజనంబుఁగాంచు. మీమీ లాలసలునెఱవేఱునని యూరడించి బంపఁగా నవ్వేలుపులు వారివారి నివాసంబులకరిగిరి. తరువాత భగవత్సంకల్పముచేఁ జోళరాజవంశంబునఁ బాలసంద్రంబున గాలకూటవిషంబుభంగి నొక్కదురాత్ముండుద్భవించె నతనికిసహాయంబుగాఁ గూచి మూచి కొఱవియను కాంతలుముగ్గురు జనించి యువతులై రామానుజునిచే నుపదేశముఁజెంది గురుసపర్యఁ జేయుచుఁ గొన్నిదినంబులుండి యతీంద్రుని లావణ్య సౌందర్య సౌకుమార్యాదులచే మోహితలై యొక్కనిశీథకాలంబున నమ్మహాత్ముని

పైఁబడిరి. భాష్యకారులు వారియభిప్రాయంబెఱింగి తగదనినిందించి సమ్మెటదెబ్బలచే నలయించి త్రోసిపుచ్చె నంతనగ్గయ్యాళులు కోపించి యతీంద్రా! నీ సిద్ధాంతంబునకుఁ గళంకము గూర్తుమని వాదించి యథేచ్ఛాజని మోహినీయంత్రంబుచేఁ బుణ్యహీనులం గొందఱివశీకరించి రహస్యముగా వారితో నిట్లనిరి. శిష్యులారా! మనది రామానుజసిద్ధాంతము సిద్ధాంత ధర్మంబులు ముఖ్యముగా నెఱుంగవలయు నెట్లంటిరేని "రా" అనఁగా రక్తము, "మా" అనఁగా మాంసము, "ను" అనఁగా నురుగు—దానిసేరేకల్లు. "జ" అనఁగా జలము. రామానుజ శబ్దమునకిది ముఖ్యభావము. మద్యమాంసంబులులేనిది మాన మతంబుశోభించదనిబోధింపఁగా జిహ్వాచాపల్య గుహ్యచాపల్యంబులు గలవారు శిరసావహించిరి. తదుపరి నాదుష్టస్త్రీ లీవిధంబునఁ జెప్పి తిరుమంత్రాదులుమాత్రము యథావిధిగానుపదేశించి దురాచారము ముదిరినకొలఁది శ్మశానభోజనంబులు, ద్వాదశ మట ఫలాహారంబులు, కంచుకోత్సవంబులు, జలపుష్పాహారంబులు, మెడసన్నపు గోవిందులు, ఉగ్గపుఁ బెరుమాళ్ళు, తిరుపత్తిగలు, మైథునకైంకర్యంబులు మొదలైనవానిచేఁ గాలంబుగడపుచు నింద్రియకింకరులై తాము సెడుటగాక యన్యులఁ జెడనూకిరి. 251

సుశీలుఁడు

యతీంద్రు లుండఁగానే తనసిద్ధాంతమున కిట్టి కీడు కలుగఁగా సమ్మహాత్ముం డెట్టులోర్చియుండెను. 252

వరవరముని

దురాచారులగు నమ్మతస్థు లెన్నడు సభకురారు. పండితులతో వాదంబునకుఁ గవియరు శాస్త్రముతో వారికిఁబనిలేదు. అర్ధరాత్రంబున రహస్యంబుగా గోష్ఠిచేయుదురు. వారియందు భగవదిచ్ఛ యట్లుండఁగా మనమేమి చేయుదుమని భాష్యకారు లుదాసీనులై యుండిరి. 253

సు శీ లుఁ డు

ఈమతమిప్పటికిని సమస్త దేశములందున్నట్లు తోఁచుచున్నదే.

వ ర వ ర ము ని

ఈమతస్థుల కీలోకంబున గౌరవముగాని చిత్త శాంతిగాని యుండదు. సరేగదా పెద్దలఁగాంచినచోఁ జోరులవలె దాగియుందురు. పరలోకంబున వారియిడుమలకు శాస్త్రమే సాక్ష్యమిచ్చుచున్నది. 255

సు శీ లుఁ డు

అటుపిమ్మట రామానుజులవారేమిచేసిరో సెలవిందు. 256

వ ర వ ర ము ని

భగవద్రామానుజులవారిట్లు జీవులకొలఁకుఁ బరమపదంబుఁ గొల్లఁబెట్టుచుండఁగాఁ చోళరాజ్యంబున క్రిమికంఠుఁ డేడేండ్లప్రాయంబున రాజ్యభారము వహించి వేయిమంది శైవపండితులఁ జేర్చుకొని "శివాత్పరతరం నాస్తి" యను వాక్య మొక పుస్తకంబున లిఖించి రాష్ట్రజను లందఱిచేఁ జేవ్రాలు సేయింపుచు నంగీకరింపనివారిని దండింపుమని నియమింపఁగాఁ దదీయభటు లన్నిదిక్కులఁజరించి,

సీ॥ తిరుమణి శ్రీచూర్ణ భరితాలికులఁ బొడఁ
గాంచి లేహనముఁగావించువారు
నారసింహ ముకుంద నారాయణాచ్యుత
గోవిందయనువారిఁ గొట్టువారు
రామానుజమతస్థుఁడీ మానవుండని
తెలియంగ వాని బాధించువారు
వైష్ణవంబనుమాట వసుధపై నిఁకమీఁదఁ
బ్రసరింపరాదని పలుకువారు

వైరి చోళధరాధీశ్వరానుచరులు
కలిగ వైష్ణవమునకు సంకటము దిన ది
నాభివృద్ధిగ నప్పు డయ్యధిపు సన్ని
ధానమునకరుదెంచె సాతాని యొకఁడు. 257

అతనినిరీక్షించి క్రిమికంఠుండునుఁ దదాస్థాన పండితులును "శివాత్పరతరం నాస్తి" యను పుస్తకంబున సంతకము చేయుమనిరి. అంతల కులికి యావైష్ణవుండు వారితో నయ్యలారా! మీరు చెప్పినట్లు నేను చేవ్రాలు చేసినను లోకస్థులందఱు చేసిననుఁ బ్రయోజనంబులేదు. కూరేశభాష్యకారు లంగీకరించినచో మీకార్యసాఫల్యం బగునని చెప్పఁగా క్రిమికంఠుఁడు వారింగొనిరమ్మని యేబదిమంది భటుల కాజ్ఞాపించెను. వల్లెయని వారు శ్రీరంగంబుసొచ్చి రాజాజ్ఞ నెఱింగింపఁగాఁ గూరపతివిని ముప్పు వాటిల్లెఁగదాయని చింతించి గురుండేగినచో నేనుండియు రక్షింపఁజాలను, నేనేగినచో నావిపత్తు నమ్మహాత్ముఁడు తొలంచునని యెంచి స్వకీయ శ్వేతాంబరములు విసర్జించి కాషాయాంబరంబులుధరించి శ్రీవత్సాంకమిశ్రులు నేనేరామానుజుండనని చెప్పి భటులతో వెడలఁగా నత్తుళాయమ్మగారునుఁ బెరియనంబిగారును కూరపతి ననుసరించి బయలుదేఱి క్రిమికంఠు నాస్థానంబునకరిగిరి. భటులునుఁ దీసుకొనివచ్చితిమని చెప్పిరి. యచ్చటనుండు దుష్ణసాతాని యీవచ్చినవాఁడు కూరేశుండుగాని రామానుజులు గారని చెప్పెను. 258

రాజు మరల రామానుజానయనార్థముగా నూర్గురుభటులఁ బంపఁగా వారు శ్రీరంగంబునకరిగిరి. ఇంతలో భాష్యకారయోగి రంగేశ్వరుని దర్శించి నమస్కరించి యిట్లనియె. 259

సీ॥ నీయాజ్ఞఁ గైకొని నేనీ వసుంధరా
స్థలమందు నరుఁడనై నిలిచినాఁడ
నుభయ విభూతులందొసరుగా నీమాటఁ
జెల్లింతునన విశ్వసించినాఁడ
బహుజీవులకు నీప్రభావంబు వర్ణించి
చెప్పి పునీతులఁ జేసినాఁడ
ముందు నీవనినట్లు సందియపడక జీ
వాళి మోక్షమునకుఁ దోలినాఁడ

నిప్పుడిట్టి విపత్తు నాకేలవచ్చెఁ
గూరపతి సాహసించి యక్కుంభినీశు
కడకుఁ జనె నేమిమూఁడునోగద యటంచుఁ
గంటఁదడిపెట్టఁగా రమాకాంతుఁడనియె. 260

తండ్రీ! పరమైకాంతియగు శ్రీవత్సాంకమిశ్రునకు భయంబు లేదు. కొంతకాలంబునకు మీరిరువురుంగలిసి సిద్ధాంతంబు పాలింతురు నీకిది విషమకాలంబు. మంచికాలము వచ్చువఱకెచ్చటనైన వసించి రమ్మనఁ రామానుజయోగి ప్రస్తుతముదొరకిన యేబదిమంది శిష్యులతోఁ బశ్చిమదేశమార్గంబుపట్టి తన్నుఁ బట్టవచ్చు భటులంగాంచి పల్లాండు జపించి సైకతంబు సల్లగా నది కొండవలె రాజభృత్యుల కడ్డపడఁగా నాదుర్మతులు సేయునదిలేక తిరిగిపోయి రాజునకెఱిఁగించిరి.

సుస్థలుఁడు

స్వామీ! కూరేశుం డసహాయుండయ్యును వైరియగు రాజునొద్దకు భయములేకుండ నెట్లువోయెను. బహిఃప్రాణ సమానుండగు శిష్యునివిడిచి రామానుజులెట్లు పలాయితుండయ్యెను. ఇది చాలా విస్మయముగా నున్నదిగదా! 262

వరవరముని

కూరేశుం డమానుష విక్రముఁడు, అప్రతిమ ప్రభావుఁడు, భగవద్దేకాంతి హనుమంతుం డొక్కఁడై లంకారాక్షసుల వధించి లంకనుఁగాల్చినట్లు వైనతేయుం డొక్కరుండై త్రయస్త్రింశత్కోటి నిలింపసహితుండగు శక్రునిజయించి సుధనుఁ గ్రహించినట్లు కూరేశుం డసహాయుండై సిద్ధాంతస్థాపనముకొఱకు శైవసభ కేగెను. తదీయ వైరి విధ్వంసనార్థము ఉడ్డైవరులు తప్పించుకొనిపోయి తిరునారాయణ పురంబుననుండి శ్యేనయజ్ఞమొనర్చి క్రిమికంఠుని సంహరించెనదియట్లుండఁగా శ్రీవత్సాంకమిశ్రులు వైష్ణవమతమనుకన్యకు మంగళసూత్రము వంటివారు. వైష్ణవచర్యలు పూర్తిగా నతనియందును జగదాచార్య చర్యలు భాష్యకారులయందుమాత్రమే గలవు. ఈసిద్ధాంతకన్యను వ్యాసబోధాయనాదులు శ్రుతిస్మృతీతిహాస పురాణసంఘుంబను దుగ్ధవార్ధిని మథించి జన్మింపఁజేసిరి నమ్మాళ్వారు పుష్కలాహారమిచ్చి పోషించిరి. యామునమునీంద్రులు సర్వాభరణభూషితంజేసిరి. కూరత్తాళ్వారు విరోధికృతాపాయంబునుఁ దొలంగించిరి. భాష్యకారయోగీంద్రు లామెను శ్రీనివాసునకిచ్చి పెండ్లిచేసిరి. ఏతత్కన్యామణి నాటంగోలెఁ బ్రౌఢాంగనయై ప్రపన్నులను బ్రసవించి భగవద్గుణాను భవాహారంబొసంగి పోషింపుచున్నది. సహచరియగు లక్ష్మియుఁ దన కామెకావించు పరిచర్య కానందించి దీర్ఘాయుష్య మొసంగుచున్నది. ఇదివైష్ణవసిద్ధాంత రహస్యము. 2౧3

శ్రీవత్సాంకమిశ్రులు శైవసభ కేగినప్పు డాశైవులు విష్ణువు పరాత్పరుఁడు కాఁడని యైదుప్రశ్నలిచ్చిరి. యాయైదుప్రశ్నలను నిరువదియైదు ప్రమాణములచే ఖండించి ప్రతివాదుల నోరు మూయించెను. కూరేశుం డప్పుడిచ్చిన ప్రమాణంబు లన్నియుంగలిసి కూరేశ విజయమను గ్రంథరాజముగా నున్నవి. విస్తరణభీతిచే నాగ్రంథంబు నిప్పుడు వచింప మానితిని. తరువాతఁ గూరపతి క్రిమికంఠుని

నిరీక్షించి రాజేంద్రా! నీపండితులు నిరుత్తరులై నోరుమూసిరి. నీవ పండితుండవగుటచే నీకొక్కరీతిగాఁ జెప్పెద నాలకింపు మెట్లంటివేని కాలుసాచినవాఁ డొకఁడు, సాచినకాలు కడిగినవాఁ డొకఁడు, ప్రక్షాళన తీర్థము శిరస్సునఁదాల్చినవాఁడొకఁడు వీరిముగ్గురిలో గొప్పవాఁ డెవ్వఁడో వచింపుమనఁగాఁ గ్రిమికంఠుఁ డిట్లనియెఁ గాలుసాచిన వాఁడు గొప్పవాఁడు కడిగినవాఁడు రెండవవాఁడు తత్తీర్థము శిరస్సున నుంచినవాఁడు మూఁడవవాఁడు. సరేగాని యీకథ దేనిలో నిదో దెలుపుమనఁగా గూరపతి రాజా! విష్ణువు బలినిమిత్తము బ్రహ్మాండమునుఁగొలిచి కటాహంబునుఁ బాదంబుచేఁ దాటింపఁగా నావరణజలము స్రవింపగా విరించి కమండులువునఁ బట్టగా నది గంగానది యయ్యెను. దానిని రుద్రుండు శిరంబున దాల్చి శివుండ య్యెను. మీసిద్ధాంతంబుననుండు సారస్య మింతేగదా యనఁగా పాషండరాజు కోపించి మీవైష్ణవయుక్తుల కేమిలే చాలాయున్నవి. సంతకము జేయుదువా లేదా యని నిర్బంధింప,గాఁ గూరేశుండా పుస్తకము నందుకొని "శివాత్పరంనాస్తి" యనుదానిక్రింద "ద్రోణ మస్తి ఇతఃపరమ్మ"ని చేవ్రాలుచేసె నదిచూచి పాషండకోవిదులు రాజుగారితో నయ్యా! శివ యనఁగాఁ దూమెడటు, దానికి మించి నది యిద్దు మున్నదని యెగతాళిగా వ్రాసెననిరి. క్రిమికంఠుఁడదరిపడి గూరేశుని నేత్రములు దీయుఁడని శాసించె నమ్మాటవిని కూరపతి రాజుతో నోరి! దుర్మతీ నిన్నుఁజూచిన కన్నులతో మదీయగురునిఁ గాంతునాయని తనచేతులతోఁ దనకన్నులు దీసివైచె నింతలోఁ బెరియనంబిగారి లోచనంబులు రాజు దీయించెను. పాషండరాజు నిష్కారణంబుగాఁ బిలిపించి వైష్ణవశిఖామణుల లోచనంబులు దీయించుట యెంత దుర్మార్గమో యాలోచింపుము. తరువాతఁ గూరేశ మహాపూర్ణుల నచ్చటివైష్ణవులు రహస్యముగా నూరు దాఁటించిరి. యత్తుళాయమ్మగారు వారిద్దఱింగైకొని శ్రీరంగంబున కేగుచుండఁగా

నయనమధ్యంబునఁ బెరియనంబిగారికి నవసానకాల మాసన్నమాయె నప్పుడు శ్రీవత్సాంకమిశ్రులు వారితో దేవా మీ కేమికావలయునో చెప్పుడనఁగా నంబిగారు కూరపతితో దండ్రీ! యొకానొక శకునము మన పెరుమాళ్ళ మనస్సునకు గాలంబయ్యెనని నుడివి దేహత్యాగంబొ నర్చి వైకుంఠంబున కరిగిరి. 264

సీ॥ పరమవైష్ణవ సార్వభౌముఁడై విలసిల్లు
యామునాచార్యాంఘ్రు లాశ్రయించి
పంచమజాతిసంభవుఁడైన మారనే
రినిఁ బ్రోచి వైకుంఠమునకుఁ బనిచి
భాష్యకారునకుఁ దాఁ బ్రథమదేశికుఁడై త
దీయ మాహాత్మ్యంబుఁ దేటపరచి
జీవించుకాలంబు దేవదేవుండైన
పంకజాక్షునకు నర్పణమొనర్చి
కూరపతిఁ గావఁ గ్రిమికంఠుఁ జేరఁబోయి
వైష్ణవమత రక్షణకుఁ గావపువుపీడి
పరమపదమున కేగిన పెరియనంబి
గారి ఋణమేవిధంబునఁ దీరుమనకు. 265

తరువాత శ్రీవత్సాంకమిశ్రులు నంబిగారికిఁ జరమకైంకర్యంబు నిర్వర్తించి శ్రీరంగంబుఁ జేరిరి. 266

సీ॥ ఖరదూషణాదుల గడియలోఁ గూల్చి రా
మునిఁ బోల్కి పాషండజనుల నోర్చి
సంపాతి యనుజుపక్షములఁ గాచినభంగి
గురుని విపత్తుఁ జెచ్చెరఁ దొలఁచి
ధరణీజకై కళేబరమేదిన జటాయు
వునుఁ బోలె మతముకై కనులొసంగి

మోపులాటకయుండఁ ముదమున మంత్ర ర
త్నాను సంధాన మెల్లపు డొనర్చి
బ్రహ్మసూత్ర నివహభాష్య నిర్మితివేళ
నాత్మగురునకొగి సహాయమైన
కూరనాథునెనయు సూరివర్యులు త్రికా
లంబులంపు లే రిలాస్థలమున. 267

అది యటులుండఁగా యతీంద్రుండు పశ్చిమారణ్యంబుఁ బ్రవేశించి గమనింపుచు వానచేఁ దస్సి మూఁడుదినంబు లుపవాసముండి సజ్జచేలమొద్దఁ గావలియుండు నెఱుకలవారిచే నాల్గవదినంబున మకరందంబుతోఁ గలిపి వేపుఁ సజ్జ లాహారంబుగాఁ గొని కొంగుపిరాట్టి దంపతుల ననుగ్రహించి మిథిలాపురంబుఁ బ్రవేశించి తదీయగ్రామవాసులు పాషండులగుటచేఁ దన్ను ధిక్కరింపఁగా స్వకీయ భాగినేయుండగు దాశరథి పాదతీర్థంబుచే వారిం బునీతులఁగావించి వైష్ణవంబిచ్చి యాంధ్రపూర్ణులను స్వర్ణకారుని నంతేవాసిగాఁ జేసికొని భాష్యకార యోగి శిష్యసహితుండై తొండనూరు బాహ్యోద్యానంబున నివాసంబుఁ గావించె నట్టియెడ నద్దేశపతియగు విఠ్ఠలరాయనికూఁతురు బ్రహ్మరాక్షసపీడితయై వస్త్రంబు దిగనాడి గంతులువైచుచుండఁగా నామెతల్లి యేడ్చుచుండె జనులు విభ్రాంతులై కనుచుండిరి. తత్సమయంబున నక్షయపాత్రఁ గైకొనివచ్చి సాతానిదాసింగని వృత్తాంతం బెఱింగి యయ్యో దీనికై చింతింపవలదు. రామానుజులను యోగీంద్రుఁడు శిష్యపరివృతుండై మన బాహ్యోద్యానంబున నున్నాఁడు. మీరమ్మహాత్ముని నాశ్రయించిన నీబ్రహ్మరాక్షసిని నిమేషంబున వదలించునని చెప్పఁగా విఠ్ఠలరాయఁడు సపరివారుండై యేగి నమస్కృతు లాచరించి యుడైనరులనుఁ దనపురంబునకుఁ గొనిపోయి సువర్ణాసనాసీనుం జేసి పూజింపుచుండె నింతలో నొక్క శిష్యుండు యతీంద్రుని పాదతీర్థంబు రాజపుత్రి పైనఁ జల్లఁగా నాబ్రహ్మరాక్షసి

యక్కన్యామణిని విడిచిపోవుచున్నానని జనులు వినునట్లు వచించి సమీపస్థ వటవృక్షశాఖను విఱుగఁద్రోసి పోయెను. తరువాత విఠ్ఠల రాయఁడు సకుటుంబ పరివారముగా యతీంద్రునిచేఁ బంచసంస్కారములు ప్రాపించి మంత్ర మంత్రార్థములు గ్రహించి శిష్యుఁడై విష్ణువర్ధనుఁడను విఖ్యాతినహించెను. 268

ఆవృత్తాంతంబాకర్ణించి పూర్వమబ్భాతికి గురువులగు క్షపణక మతస్థులు పండ్రెండువేలమంది యతీంద్రునిపై వాదంబునకుఁగవిసిరి తత్సమయంబున దాశరథి ప్రముఖశిష్యులు లక్ష్మణార్యుంగని దేశికోత్తమా! యీవచ్చినవారు శుష్కతార్కికులగు బౌద్ధులు నిరీశ్వరవాదులు వీరితో భాషించుట దోషము. ఇంతమందితో వాదించుటకు సంవత్సరములు పట్టును. నీవప్పనిమాని విశ్వరూపంబుఁ జూపించితివేని మామనోరథంబులు సిద్ధించుననిరి యెంబెరుమానారప్పలుకు లాకర్ణించి దేవాలయ మంటపంబునకొంజని జవనికఁ గట్టించి క్షపణకులను వెలుపలనుంచి తాను లోనికేగిసహస్రఫణాభాసురంబగు నాదిశేషరూపంబుదాల్చి వాదింపఁదొడంగె నప్పుడు ద్వాదశసహస్రసంఖ్యాకులగు ప్రతివాదుల కుత్తరంబు వచ్చుచుండె నప్పుని కాశ్చర్యంబుఁజెంది ప్రతివాదు లిదేమి చిత్రమాయని జవనికనెత్తి చూడగా శేషుం డనేకసూర్యుల కాంతిచే భాసిల్లుచుండె నయ్యద్భుత తేజస్సునుఁ జూడలేక బౌద్ధులలో కొందఱు హతులైరి. గొందఱు మూర్ఛిల్లిరి. మఱికొంద ఱీరూపంబు మానుషుని స్తుతించిరి. తదుపరి భాష్యకారయోగి పూర్వరూపంబుతో వెలుపలికిరాగా హతశేషులగు క్షపణకులు వచ్చి యతిసార్వభౌముని పాదంబులఁబడి యపరాధక్షమాపణము సేసికొని శిష్యులైరి. ఇట్లుండఁగా నొక్కనాడు యదుగిరిపతియగు దేవుండు యతీంద్రుని స్వప్నంబునఁ గనిపించి భక్తశిఖామణీ! యిచ్చటికి కనతి దూరంబున మదీయ పూర్వాలయంబు శిథిలమై యున్నది. దానినిఁ బునరుద్ధారణంబు సేయుమనఁగా మేల్కాంచి

రామానుజగురుండు శిష్యాళితోడను సపరివారుండగు విష్ణువర్ధనుని తోడను యదుగిరిఁ నారోహించి రెుుక్కవల్మీకంబుఁ ద్రవ్వించి దాని యందు లభించిన విష్ణువిగ్రహంబు లోక్కచోటదాఁచి విష్ణువర్ధనుని ధనంబుతోఁ గోనెల గోపుర మంటపాదులు నిర్మించి ప్రతిష్ఠ చేయు నప్పు డుత్సవబేరంబె కనిపించదయ్యె. 269

యతీంద్రుండు చింతించి నిద్రింపఁగా నమ్మహాత్ముని స్వప్నంబున యదుగిరిస్వామి సాక్షాత్కరించియిట్లనియె. వత్సా! పూర్వము ఢిల్లీసుల్తాను హిందూదేవాలయంబులు పడగొట్టించి విగ్రహంబులు గొని చని రెుుకకోట్టులోనుంచి తాళముపేసెను. మదీయోత్సవబేరం బచ్చటఁగలదు పోయి తెమ్మని చెప్పి యంతర్హితుండయ్యెను. యతిపతి మేల్కాంచి మేలుకాంచితినని యుప్పొంగి స్వప్నవృత్తాంతము శిష్యులకును విష్ణువర్ధనునకు వినిపించి యాయూరనుండి నానాదేశస్థులగు శిష్యులకు నుత్తరంబులు వ్రాయఁగా నందఱు తత్క్షణమే వచ్చిరి. తరువాత, 270

సీ॥ కూలీలతోఁ బద్మసాలీలతోఁ జెంచు
పాళీలతో గోపకాళితోడఁ
బంచమాన్వయులతో బలిజవారములతో
సాతానితెగలతో సఖులతోడ
వడ్డెయుప్పరులతో బైరాగిమూఁకతోఁ
బేరుగాంచిన రెడ్డివారితోడ
రాజసైన్యములతో రాజసంఘములతోఁ
గరి భట రథ ఘోటకములతోడఁ
గదలి బహులక్షల జనంబు కదిసిరాగ
నట విచర సేనతో లంకకరిగినట్టి
రాఘవునిపోల్కి నాయతిరాజు వేగ
మమరఁగా నేగి ఢిల్లీపురమునుడాసె. 271

తే॥ వప్రగతుఁడైన సుల్తాను వారి వార్తఁ
జూచుతెఱఁగింపఁగా విని సౌధమెక్కి
నేలయీనినచందాన నిలిచి యద్భు
తంబుగానుండు సేనావిధం బుఁగాంచి. 272

ఇప్పుడేమిచేయవలయునాయని చింతింపుచుండ సేనలు సేనాధి పతులునుఁ బ్రభూ! మాకు సెలవొసంగితివేని యొక్కదినంబున వధించి విరోధిభయంబు వాపుదుమని ప్రేలుచుండ వారినివారించి సుల్తాను పుత్రుండగు కప్లీర్దాసుం డిట్లనియె. 273

సీ॥ తనకంటె నధికుఁడై తనరు మహీనాథు
నోర్పమీఱఁగ శరణొందవలయుఁ
దనతో సమానుఁడై పెనఁగు భూపతితో వి
శేషంబుగా సంధిఁ జేయవలయు
బలహీనుఁడైయుండి పైకొన్నవానితో
నెదిరించి పోరి జయింపవలయుఁ
బరిపాలకుఁడు లేని పాడురాష్ట్రంబుపై
మేకొని చని యాక్రమింపవలయు
దేశకాలపాత్రంబుల తీరెఱింగి
నడచువానికి నాపత్తు పొడమకుండు
నట్లుగాకుండ మదిఁదోఁచినట్లొనర్చు
వానికెందును సౌఖ్యంబు కానరాదు. 274

తగువారిఁబనిచి వారి మానసాభిప్రాయంబెఱింగిపిమ్మట నెద్ది యైనం జేయవచ్చుననుటయు సుల్తాను పండితరాయ భగవంతరాయ లను విప్రులిద్దఱినిం బిలిపించి పనుపఁగా వారలరిగి సైన్యంబునంజొరఁ బాఱి రాజెవ్వఁడని యడుగుచుఁ బోయిపోయి పశ్చిమభాగంబునఁ బండితులకు భగవద్విషయంబుఁ బ్రసంగించుచు, 275

సీ॥ ఊర్జితామల ద్వాదశోర్ధ్వ పుండ్రములతో
లలిత కాషాయచేలంబుతోడ
బ్రహ్మసూత్రాఖ్యచేఁ బరగు జన్నిదముతో
రవణిల్లు ఘన త్రిదండంబుతోడఁ
దులసీ నలిన బీజ కలిత మాలికలతోఁ
గడునీలమగు శిఖా గ్రంథితోడ
దెసలవెలుఁగఁజేయు మొసలివారెంట్లతోఁ
గనకసన్నిభ దేహకాంతితోడఁ

ప్రబల వేదాంతవాక్యము లక్ష్యమైన
వారి కెఱిఁగించు నా యుక్తైనరునిఁ బాప
హరుని లోకైకగురుని మహానుభావుఁ
గాంచి మ్రొక్కి నుతించి యిక్కరణి ననిరి. 276

దేవా! నీవెవ్వండవు? రాజేంద్రుఁడవనుటకు భోగిలక్షణంబులు లేవు. కేవల సన్యాసికిట్టి సైన్యములు నీవైభవంబు గలుగవు. మహాపురుష లక్షణంబులన్నియు నీయందు నెలకొనియున్నవి. చతుర్భుజంబులులేని వాసుదేవునివలె నున్నావు. ఇచ్చోటికి వచ్చుటకుఁ గతం బేమనిన సూరిద్వయంబుతో లక్ష్మణాచార్యుం డిట్లనియె. శ్రీరంగ నివాసుండను యతీంద్రుండను వైష్ణవుండను సిద్ధాంతాభివృద్ధికై దేశాటనంబు సేయుచు సుల్తాను బుద్ధిమంతుండని తెలిసి దర్శింప వచ్చితి ననఁగాఁ బండిత భగవంతరాయ లేగి సుల్తానుకు విన్నవించిరి. తురుష్కప్రభుడు గండంబు దప్పినని సంతసించి భాష్యకారునిఁ బిలిపించి తపనీయాసనాసీనుం జేసి యాగమన కారణం బడుగఁగా నుదైవరు లాప్రభునితో రాజేంద్రా! హిందూదేవాలయ విగ్రహంబులు చిరకాలమునుండి మీయొద్దనున్నవి. వానిలో సెల్వపిళ్ళయను నుత్సవబేరంబు కావలసి వచ్చితినని పలికె నంత మ్లేచ్ఛరాజు మీర

న్వేషింపుండని తాళముచెవుల గుత్తు లొసంగె రామానుజులు పరిమిత శిష్యులతోనరిగి కవాటంబులు తెఱచి శోధింపఁగా నానావిగ్రహంబులు కానంబడియెంగాని సెల్వపిళ్ళ గోచరింపడయ్యె నంతులకు నెంబెరు మానారు చింతించి నిద్రింపఁగా నారాత్రి కలలో నద్దేవుండు ప్రసన్నుండై సుల్తాను పుత్రికకడనుంటిని దానింగూర్చి నాకు వివాహంబు చేయుమని వచించి మరల సుల్తాను కలలోఁగనిపించి రాజా నీతనయ బలుసావినుండి నాయధీనమునన్నది. యామెను నాకిచ్చి పెండ్లి సేయు మట్లుకానిచో నీకూతురు జీవింపదని చెప్పి సుల్తానుభార్యకు నట్లే వచించి మాయతీంద్రుఁడు మీకు వియ్యంకుఁడని భాషించి మరల నావార్త భాష్యకారున కెఱింగింపఁగా నాశ్చర్యమొంది యతిభూపతి భూపతితో నేకీభవించి రమాంశసంభూతయగు సుల్తానుపట్టిని సెల్వపిళ్ళతో జతఁగూర్చి పరిణయంబొనరించె నటుపిమ్మట సుల్తాను దుహితృజామాతల కొసంగిన యపరిమిత ధన కనక వస్తు వాహనాంబరాభరణాదులతో వధూవరులను చామీకరాందోళికా సంస్థితులఁజేసి సైన్యపరివృతుండై యదుగిరి కేతెంచి వధూవరుల నాలయంబునఁ బ్రతిష్ఠింపఁగా సుల్తానుకుమారి ద్రష్టలకు మహావిస్మయం బొదవింపుచు నర్చావిగ్రహంబయ్యెను. విష్ణువర్ధనప్రభృతి రాజసమూహం బాశ్చర్యంబుఁజెంది యతీంద్రుని మహిమంబు వేనోళ్ళం గొనియాడిరి. రామానుజయోగి రాజులనుఁ దదీయ వరూధినులను వారివారి నివసంబుల కనిచెఁ దక్కినవారును నాచార్య శాసనంబుఁగొని స్వదేశంబుల కరిగిరి. తరువాతఁ బంచమజాతివారు ఉడైవరులకు నమస్కరించి స్వామీ! సెల్వపిళ్ళనుఁగూర్చి మేమొనర్చిన శ్రమంబునకుఁ బరిమితిలేదు. మేమన్ని దేవళంబులఁ బ్రవేశించి నిరాఘాటముగా భగవన్మూర్తుల దర్శించి తీర్థ ప్రసాదంబు లందునట్లు దేవరవా రనుగ్రహింపవలయుననిన యతీంద్రుం డిట్లనియె.

బిడ్డలారా! సర్వేశ్వరుఁడు ధన కుల విద్యా రూపాభిజాత్యంబులకు సంతోషింపఁడు. తదీయ భక్తులమగు మేము నట్టివారమే కాని యుత్తమజాతి సంభూతులమని గర్వించి విఱ్ఱవీగువారు మీతోఁ గలసి మెలసి యుండుట కీయకొనరు నేసంగీకరించియుఁ బ్రయోజనంబు లేదు కాని నాయందుఁ బితృవాత్సల్యంబుగల యీ దేవుఁడు సంపత్కుమారాఖ్యచే ఖ్యాతిఁగాంచు నిద్దేవళంబునఁ బ్రతిసంవత్సరము ఫాల్గునశుద్ధ పౌర్ణమాస్యయందు బ్రహ్మోత్సవంబు జరుగు నయ్యవసరంబున నీపెరుమాళ్ళు వైకుంఠమునుండి వచ్చిన కిరీటంబుఁ దాల్చి మహావైభవంబుతో సేవసాయించు మీరక్కాలంబునఁ బుత్ర మిత్ర భ్రాతృ కళత్రంబులతోఁ గూడి దేవళంబునఁ బ్రవేశించి నిరంకుశముగా స్వామిని దర్శించి మూఁడుదినంబులు తీర్థ ప్రసాదంబులు గైకొనవచ్చునని యనుగ్రహింపఁగా వారలానందించిరి. ఈనియమం బిప్పటికిని జరుగుచున్నది, దీని నెవ్వరైన నడ్డగించినచోఁ గల్యాణసరస్సునందుఁ బుర్వులు పడి విఘ్నకరుల కపాయంబుఁ దెచ్చు నిది యిట్లుండఁగా నుడైవరులు శ్రీరంగమునుండి బయలుదేరి యప్పటికి ద్వాదశవర్షంబులు గతించెను యతీంద్రుఁ డచ్చటికివచ్చినసంవత్సరమే కూరేశునిఁ దలంచి దిగులొంది విరోధి ధ్వంసనార్థము శ్యేనయాగంబు గావించె నయ్యజ్ఞము పూర్తి కాగానే చోళరాజ కంఠంబునఁ బుర్వులువడి ముఱిగిపోనఁగా నబ్భూపాలుఁడు మరణించెను. పదుమూఁడవయేట యతీంద్ర ప్రేషితులగు శ్రీవైష్ణవులిద్దఱు శ్రీరంగంబునకేగి యానద్వృత్తాంతం బెఱింగివచ్చి రామానుజులకుఁ దెలిపిరి. తమపరి నమ్మహాత్ము డావైష్ణవులఁ గౌఁగిలించి తండ్రులారా! యిట్టిశుభవార్త నెఱింగించిన మీకీయందగిన బహుమానంబు ద్వయమంత్రంబుదక్క వేఱొక్కటిలేదని విన్నవించి ముముక్షులమ్మంత్రరత్నంబునను సంధానంబుసేసి సంస్కరింప విన్నందున దానికిఁ గల్యాణసరస్సని నామంబిడి శ్రీరంగప్రయాణంబున కుద్యోగింపఁగాఁ దన వియోగంబున కోర్వలేక దుఃఖించు శిష్యార్చకాదుల

విషాదంబుగని స్వర్ణకారునిచేఁ దనవంటి విగ్రహంబుసేయించి దానినిఁ బరిరంభించి స్వకీయ తేజస్సుచే నింపఁగా నావిగ్రహం బచ్చటివారితో బిడ్డలారా ! నేను మీమనోరథంబులు నెఱవేర్తు నెంబెరుమానారును నిర్బంధింపక శ్రీరంగంబునకుఁ బోనిండని చెప్పఁగా రామానుజాను చరు లూరడిల్లిరి. 278

తదుపరి భాష్యకారు లంతేవాసులఁగూడి కతిపయదినంబులు మార్గంబునఁగడపి యనాయాసంబుగా శ్రీరంగంబుఁ జేరి శ్రీవత్సాంక మిశ్రుల సదనంబునకుఁబోయెఁ దదాగమనవార్తవిని కూరపతి యతీంద్రుల పాదంబులఁబడి సాష్టాంగనమస్కారం బాచరింపఁగా నుదైనరులు లేవఁదీసి శిరంబు మూర్కొని కూర్చుండఁబెట్టి తానునుఁ గూర్చుండి యిట్లనియె. 279

సీ॥ వేదాంతవిషయము ల్వివరించుతఱి నిన్నుఁ
గాదని మను పరవాదిలేఁడు
విషయ వైరాగ్య వివృద్ధిలో నినుఁబోలి
వర్తించునట్టి పావనుఁడులేఁడు
జ్ఞానంబుచే ననుష్ఠానంబుచే భవ
త్సన్నిభుం డైన యశస్విలేఁడు
హరిపాదభక్తిచే గురుభక్తిచే నిన్నుఁ
జాలి మెచ్చించు వైష్ణవుఁడులేఁడు
నీవులేని పాడుసావి రంగేశు నా
నంద మొందఁజేయు నరుఁడులేఁడు
నీవిలోచనములు లేవయ్యె మత్పాప
బలముచేత ననున్నఁబలికెఁజట్టు.

తే॥ భాష్యకారమునీంద్ర యే భాగవత జ
నోర్ధ్వ పుండ్రంబుఁ గాంచి నే నోర్వఁ జాల
కేమి దుర్భాషలాడితినో మదక్షి
కమలములకట్లు దృష్టి భంగంబు గలిగె. 271

అని పలికినఁ గూరేశవాక్యంబు లాదరింపక తండ్రీ! నీవు భాగవత పారతంత్ర్య నిధానంబవు గాని భాగవతాపచారం బొనర్చు వాఁడవు గావు. కాని కరిగిరివరదునిపై నొక్క స్తవంబు గావింపుమని యాదేశింప నక్కోవిదాగ్రణి స్వల్పకాలంబులో వరదరాజస్తవంబు పూర్తిచేసి యతీంద్రునిఁ గని గురువర్యా! స్తవంబు సంపూర్ణంబయ్యెఁ గడచిన రేయి వరదుండు స్వప్నంబునఁ గానిపించెనని చెప్పఁగా భాష్యకారయోగి నిజచ్ఛాత్రవర్గంబుతోఁ గూరపతిం గైకొని కాంచీపురంబు డాసి వరదుని సేవించి కూరేశునితో నీ స్తవంబు విన్నవింపుమని చెప్పి దవ్వులకేగి వైష్ణవపరంపరాసేవితాంఘ్రి కమలుండై తదీయ దేశవాసులకు ద్వాదశవర్షములనుండి జరిగిన వృత్తాంతంబు దెలుపుచుండె నింతలోఁ గూరపతి స్తోత్రంబు ముగియఁగాఁ దేవప్పెరుమాళ్లు వరంబుఁ గోరుమనె నప్పలుకు లాలకించి శ్రీవత్సాంకమిశ్రులు దేవా! క్రిమికంఠునికి భయపడి వైష్ణవంబు విడిచినవారికిఁ బరమపదం బిమ్మనఁగా నద్దేవుం డట్లు గావించె నేతద్వార్త నాకర్ణించి రామానుజులారా! కూరపతీ!! స్వాతంత్ర్యంబు వహించి నా వాక్యం బుల్లంఘించితివని వచించి వరదునితో దేవాదిదేవా నానాదివ్యదేశస్థితులగు భగవన్మూర్తులను వదలి మహోత్కంఠతో వచ్చిన మా వాంఛితంబిట్లు వమ్ముసేయుదువా యన నప్పురాణపురుషుండు వరంబియఁ బూనె నంతలోఁ గూరేశుండు దేవాదిదేవా నీవు దృష్టినీయఁదలంచితివేని నీవు నీ వైభవంబు భగవత్సంబంధగ్రంథంబులు మద్గురుండగు రామానుజులవారు గోచరించునట్లు మాత్ర మిమ్ము తక్కిన ప్రపంచంబు దృష్టిగోచరంబు కావలదని కోరఁగా నరుళాళప్పెరుమాళ్ళట్లే వరంబిచ్చెను.

భాష్యకారు లచ్చోటం గొన్నినాళ్ళుండి యాస్థలవాసుల నానందింపం
జేసి కూరేశాదులతోం గదలి శ్రీరంగంబునకు విచ్చేసి సిద్ధాంతరాజ్యం
బును నిరంకుశముగాం బాలింపుచుండెను. 282

ఇట్లుండి లక్ష్మణాచార్యుం డొక్కమూంగవాని కుపదేశింపంగా
నతం డదిమొద లెవ్వరికిం గానంబడక సంవత్సరమునకు శ్రీరంగంబు
జేరి పండితుండై సర్వశాస్త్రంబు లుపన్యసింపుచుండెను. జనులాశ్చర్య
మొంది నీకీప్రభావం బెట్లుకలిగెనని యడిగిరి. వారితో నతండిట్లనియె
నయ్యలారా! యతీంద్రు నుపదేశబలంబుచే క్షీరవారాసికేగి కేశవుని
లక్ష్మినిం దదీయ పరివారంబులనుం గాంచి శేషునింగానక యేమయ్యె
నని ప్రశ్నించితిని. యచ్చటివారు బిడ్డా యీశేషుండు భూలోకస్థం
బగు శ్రీరంగంబున రామానుజార్యుండై యున్నాడు. నీవచ్చటికిం
బోయి రహస్యంబెఱింగింపుమనంగా వచ్చితినని గాఢవిస్మయముతో
వచించె శ్రోతలగు జను లత్యాశ్చర్యంబుం జెంది వేలకొలంది భాష్య
కార శ్రీపాదంబు లాశ్రయించి ముక్తిం గాంచిరి. వెండియు నిలయా
ళ్వారొక మల్లుని ధనుర్దాసునిగా నతనిభార్యనుం బొన్నాచ్చియారుగా
పేరులువెట్టి లోకవందనీయులం గావించెను. మఱియు నెంబెరుమా
నారు బహుజనసంచయంబుల నిట్లుపునీతులం జేసి ముక్తికనిచి వింశత్యు
త్తర శతహాయనంబులు మేదినిపైనుండి యొక్కతఱి నిద్రాహారంబులు
వర్జించి శిష్యులకు మూడహోరాత్రంబులు వైష్ణవధర్మంబు లుప
న్యసించె. స్వాము లచ్చెరువంది యీసంభ్రమంబునకు హేతువేమని
గురూత్తమునిం బ్రశ్నించిరి. వారితో నమ్మహాత్ముండు పుత్రులారా!
మానవశరీరంబుం జాలించి పరమాకాశంబున కేగందలంచితినని వచిం
పంగా స్వాములందఱు దుఃఖించి గురువర్యా! మీవియోగం బోర్వం
జాలము. మున్ను చక్రవర్తి తిరుమకనారు కోసలదేశసంస్థిత చరాచర
భూతంబులనుం జరమకాలంబున వెంటం గొనిపోయినట్లు మమ్ములం
గైకొనిపొమ్ము లేదా కావేరీహ్రదంబునంబడి దేహత్యాగంబుసేయుదు

మనఁగా నయ్యాచార్యుం డిట్లనియె. శిష్యులారా! మీకందఱికి నిప్పుడే మోక్షమిచ్చితినేని సిద్ధాంతము నశించి ముందు రాఁబోవువారి కాధారము లేకుండును. మీరు బలవన్మరణము పొందితిరేని శతారాతి మనస్సుఁగలంచి యామునాచార్యానుగ్రహంబునకు దూరులై చెడుదురు. మచ్ఛాసనానుసారముగా నుంటిరేని మోక్షం బొప్పింతునని వారి నూరడిల్లఁజేసి రంగేశ్వరుని సన్నిధి నంజలి ఘటించి యిట్లనియె దేవాదిదేవా! పురుషోత్తమా!! దాసునకుఁ బరమపదం బిమ్మనుటయ్యు జగదీశుం డిట్లనియె. భక్తాగ్రణీ హనుమంతునికిని నీవిభూతిఁ జిరకాలంబుండ రాదా యెంతకాలమున్ననుఁ గొఱంత లేదేయనఁగా రామానుజార్యుఁడు మరల స్వామితోఁ గేశవా! కలియుగంబున మానవాయుః ప్రమాణంబు నూఱువత్సరంబులుగదా పైన నిరువది వర్షంబులు గడపితి దేహంబునం దసహ్యము గలుగుచున్నది. ఇంతే కాక లీలావిభూతియందలి జీవులఁ గోట్లకొలంది వైకుంఠంబునకుఁ బనిచితి వారికిని నిత్యసూరులకును నేమేమి సల్లాపంబులు జరుగుచున్నవో వినవలయునని కుతూహలంబు పొడముచున్నది. కావున మదీయ వాంఛితంబు నెఱవేర్పుమనఁగా రంగేశ్వరుం డంగీకరించి యొక్క వరంబుఁ గోరుమనియె రంగేశ్వరియుఁ బ్రేరించె నటుమీఁద యతీంద్రుఁ డిట్లనియె. 283

సీ॥ ఆచంద్రతారార్కమై మదీయమతంబు
పొలివోక ధరణిపై నిలువవలయు
నామతంబునఁ జేరు నానాజనములకుఁ
జెడుమతప్రీతి నశింపవలయు
దైవతాంతర మతాంతర సాధనాంతర
ములరోసి నావారు మెలఁగవలయు
జ్ఞాన వైరాగ్య విస్తర సదాచార సం
పన్నులై నావారు ప్రబలవలయు

సంస్తుతింపబడి యెప్పుడునీ సన్నుతింపఁ
జాలని మదీయులనుఁగూర్చి సతతమేనె
చేయుచుందుఁ బ్రపత్తి విశేషకరుణ
చేఁ బ్రపన్నుల ముక్తికిఁ జేర్పనలయు.

అని వచించిన భాష్యకారులతో రంగేశ్వరుం డిట్లనియెఁ 284
పుత్రా! మదీయ లీలాఽసభంగములైన వరంబులుగోరి బద్ధసంసారు
లగు జీవులకు మహోపకారం బొనర్చితివి. ఈదృశవరంబులుగోరు
టకు నీకు నీశిష్యుండగు కూరేశునకుఁదక్క నన్యులకు సాధ్యంబు
గాదు నీకోరిన వరంబులన్నియు నిచ్చితి ననుటయు రంగనాయకి
యిట్లనియె. 285

సీ॥ మాదంపతులకీర్తి రాజిల్లఁజేయుట
చే భవత్కీర్తి భాసిల్లుఁగాక
సర్వసిద్ధాంత ప్రసంగంబుమాయించి
నీమతంబిలమీఁద నెగడుఁగాక
నీమతస్థులపొత్తు కామ లోభ క్రుధా
ప్రముఖారివర్గంబు పాయుఁగాక
భవదీయ సిద్ధాంతపరులు దారిద్ర్య వి
దూరులై సౌఖ్యమొందుదురుగాక

యని రమాదేవి దీవింప నందుకొనుచు
నయ్యతీంద్రుఁడు జోహారు లాచరించి
చనువుతో రంగనాథుని చాటుకేగి
మాయమైచేరె వైకుంఠమందిరంబు. 286

సుశీలుఁడు

గురువర్యా! భాష్యకారయోగి ప్రభావంబు రామకృష్ణ చరి
త్రంబులగు రామాయణ భారత భాగవతంబులబోలి శ్రోతలఁబునీతులఁ
జేయుచున్నదిగదా. 287

పరపరముని.

శిష్యా! యతీంద్రుని విలాసంబు సంక్షేపంబుగాఁ దెల్పితి. మఱియొకసారి సాకల్యంబుగా నెఱింగింతు నది యట్లుండనిమ్ము. 288

సీ॥ ఎందఱో భాష్యంబు లిల రచించిరిగాని
శ్రీభాష్యకారాఖ్యఁ జెందినారె
మతకర్తలై వేల మనుజులుండిరిగాని
ఘన సరస్వతిచేఁ బొగడ్తఁగనిరె
సన్న్యాసులై బహుజనులు మించిరిగాని
యతిరాజ విఖ్యాతి నందినారె
వేదాంతు లెందఱో వెలసిరిగాని శ్రు
తికి సమన్వయము కుదిర్చినారె

సూరులెందఱో జన్మించినారుగాని
మొనసి కోవిదుఁజేసిరే మూఁగవాని
మనయతీశ్వరునం దీయమానుష ప్ర
భావములు నిల్చియున్నవి పాయకుండ. 289

సీ॥ అశ్వమేధాది సర్వాధ్వరకర్తలు
రహిఁ, గోరు పదవి నిరాకరించి
భూ గో హిరణ్యాది భూరి దానములిచ్చు
దాతలార్జించు పదంబుదాఁటి
స్వాధ్యాయమందుఁ బ్రశస్తులౌవారు సం
పాదించు లోకవైభవముఁగేరి
యోగసిద్ధులు తపోయోగసిద్ధులుగన్న
భవ్యలోకంబెదు విష్టపంబుదాఁటి

చేరి రపవర్గపదము సంసారఘోర
వారినిధి నుత్తరించి సర్వవిధ పాత
కముల నెడఁబాసి మానవౌఘములు మున్ను 290
భాష్యకార దయారస ప్రాప్తివలన.

సీ॥ హరి కాత్మలాభ మెయ్యనఁగూర్చి సర్వాత్మ
లకు హర్యనుగ్రహ లాభమొసఁగి
వేదబాహ్యమతోరుశాదస్థుఁడగు పర
బ్రహ్మను వేదాంతపదముఁజేర్చి
యింపుగా వేద స్మృతీతిహాస పురాణ
ములకు సమన్వయమ్ము సమకూర్చి
శ్రీరంగ ముఖ మహాక్షేత్రస్థ దేవతా
కైంకర్యములు లెస్సగానమర్చి

విమల వైష్ణవసిద్ధాంత వృద్ధిఁజేయుఁ
డనుచు డెబ్బదినాల్గు సింహాసనాధి
పతుల నిలయందు నొనఁగూర్చి పరమపదము
నకుఁజనిన భాష్యకారు నెన్నంగవశమె. 291

# కూరేశవిజయము

## గ్రంథవృత్తాంతము

కూరేశుఁడనఁగా శ్రీరంగనివాసుండగు శ్రీవైష్ణవశిఖామణి. ఇమ్మహాత్మునకుఁ గూరేశుఁడు, కూరగురుఁడు, కూరపతి, కూరత్తాళ్వారు, శ్రీవత్సాంకమిశ్రులను తిరునామంబులు గలవు. ఈసూరివర్యుండు రామానుజులవారి శిష్యపరంపరలలోఁ బ్రధానుఁడు. గురువుగారికి బహిఃప్రాణమై యుండువాఁడు. యతీంద్రుఁడు బ్రహ్మసూత్రభాష్యము రచించినప్పు డయ్యాచార్యపుంగవునకుఁ జేదోడు వాఁదోడై యుండి లిఖించినవాఁడు. వివాహానంతర మేడుగడియలలోఁగా నొకానొకసందర్భముచే వానప్రస్థాశ్రమమును స్వీకరించినందున లోకోత్తర సౌందర్యవతియగు భార్యచేఁ బరిచర్యమాత్రముఁ గొనుచు సంభోగముచేయని విరక్తాగ్రేసరుఁడు. భగవద్భుక్తశేష ప్రసాదముచే జాయయందు సంతానముఁబడసిన యోగీంద్రుఁడు. కుదృష్టి సిద్ధాంత ధ్వాంత బాలభాస్కరుఁడు. భగవద్రామానుజమత పరిపాలక సార్వభౌముఁడు. పరమవైదికజనాగ్రేసరుఁడు. సమస్తశాస్త్రపారంగతుఁడు. లక్ష్మీనారాయణ పాదరాజీవ మరంద ద్విరేఫంబు. శ్రీవైష్ణవమత కన్యామణీ కంఠ మంగళసూత్రము. భాగవత పారతంత్ర్య పారావారము. పండిత కవిజన సముదయాశ్రితాంఘ్రి సరోజుఁడు. ఇప్పుణ్యరాశికి భగవత్ప్రసాదముచే నుద్భవించిన కుమారులు పరాశరభట్టారక, వ్యాసభట్టారక నామధేయులు. మఱియు వరదరాజస్తవాద్యనేక సంస్కృత గ్రంథ నిర్మాత. రామానుజ యోగీంద్రులు దేశాంతరగతులై యుండఁగా రాజనిర్బంధముచేఁ జోళసభకేగి మహాపూర్ణులతో నత్తుళాయమ్మతోఁ గలిసియుండి తనపైఁ గవిసిన పరవాదులతో నేడహోరాత్రములు వాదించి యోడించి విష్ణుపరత్వమును బ్రకటించి జయధ్వజ మెత్తించిన వాది గంధసింధుర కంఠీరవము. పరమత

స్థులతో నిమ్మహోత్సుండు వాడించిన వాక్యములకే 'కూరేశవిజయము' మని పేరు. ఈపవిత్రగ్రంథరాజ మింతవఱకు గనిలోని మాణికంబు వలె రహస్యముగానుండి పండితశేఖరులకుమాత్రమే వేద్యమగు చుండెఁగాని సామాన్యులకు గోచరింపదయ్యె. దేశభాషలయందిట్టి యుద్గ్రంథము లేనికొఱంతఁ దొలఁగింపఁబూని శక్తికొలంది నాంధ్రీక రించి యీజ్ఞానసూర్యోదయకోశమందు గృహాంతర నిధానంబుభంగి నుంచితి నేతద్వ్యాఖ్యానాంధ్రీకరణంబున నాకుఁ దర్క వేదాంత విశా రదుఁడు మదీయ తృతీయపుత్రుఁడు దాశరథి వాఁడోడాయె నట్టి మాచిరంజీవికి నాయురారోగ్యైశ్వర్యంబు లొసంగుటకై సీతాపతినిఁ బ్రార్థించి పండితులు మత్సాహసంబునకోర్చి-దోషంబులు వెల్లడింపక నన్నును జ్ఞానసూర్యోదయంబును సంతత మాశీర్వదింతురని విశ్వసించి వారికి సాష్టాంగనమస్కారంబు లాచరించెద.

ఇట్లు

శ్రీవైష్ణవపాదధూళి

గ్రంథకర్త: వెం వ్వా వేంకటదాసు

శ్లో॥ గాయత్రీ బోధితత్వాద్దశరథతనయ స్థాపితారాధితత్వా
చ్చాన్ద్రేః కైలాసయాత్రా వ్రత ముదితయాభీష్ట సంతానదానాత్
నేత్రేణ స్వేనసాకం దశశత కమలైర్విష్ణునా పూజితత్వా
త్తస్మై చక్రప్రదానాదపి చ పశుపతి స్సర్వదేవ ప్రకృష్టః

శ్లో॥ కందర్పధ్వంసకత్వా ద్ధరశకబళనాత్కాల గర్వాపహత్వా
ద్దైతేయావాసభూమి త్రిపుర విదళనాద్దక్షయాగే జయిత్వాత్
పార్థస్యాస్త్ర దానాంతర హరివిజయాన్మాధవే స్త్రీశరీరే
శాస్తుః సంపాదకత్వాదపిచ పశుపతి స్సర్వదేవ ప్రకృష్టః

శ్లో॥ భూమా లోకై రనేకై స్సతతవిరచితారాధనత్వాదణిమా
మష్టైశ్వర్యప్రదత్వా ద్దశవిధ వపుషా కేశవేనార్చితత్వాత్
హంసక్రోడాంగధారి ద్రుహిణమురహరాదృష్ట శీర్షాంఘ్రికత్వా
జ్జన్మధ్వంసాద్య భావాదపిచ పశుపతి స్సర్వదేవ ప్రకృష్టః

శ్లో॥ వారాణస్యాంచ పారాశరి నియమభుజస్తంభనాత్త్రిపురాణాం
విధ్వంసే కేశవేనాశ్రిత వృషవపుషాధారి తత్వాత్తలత్వాత్
అస్త్రోక బ్రహ్మశీర్షాస్థ్య నిశకృతగలాలంక్రియా భూషితత్వా
ద్దానాచ్చజ్ఞానముక్త్యోరపిచ పశుపతి స్సర్వదేవ ప్రకృష్టః

శ్లో॥ వైశిష్ట్యే యోనిపీఠాయితనరక రిపుక్లిష్టభావేన శంభో
స్స్వస్యైకార్థ ప్రతీకాయితహరవపుషాలింగితత్వేనయద్వా
అప్రాధాన్యాద్విశిష్టాద్వయ సమధిగమేదానవానామరాతేః
శంభోః ప్రాధాన్య యోగాదపిచ పశుపతి స్సర్వదేవ ప్రకృష్టః

పై శ్లోకములకు భావము

1. వైదికంబైన గాయత్రిమంత్రము భర్గశబ్దముచే శివునిఁ బ్రతిపాదించుటవలనను, సేతుసమీపమున శ్రీరాముఁడు లింగప్రతిష్ఠ

చేసి యారాధించుటవలనను, శ్రీకృష్ణుండు కైలాసంబున రుద్రునిఁ గూర్చి తపంబొనర్చి తత్ప్రసాదంబుచే సంతానముఁ బడసినందువలనను విష్ణువు వేయికమలములచే భవునిఁబూజించి పుష్పమొక్కటితక్కువ కాఁగాఁ దననేత్ర మర్పించుటవలనను, రుద్రుఁడు హరికిఁ జక్రమిచ్చుట వలనను శివుఁడే సర్వదేవతాశ్రేష్ఠుఁడు.

2. రుద్రుండు మారుని దహించుటవలనను, హాలాహలంబును భక్షించుటవలనను, రాక్షస నిలయంబులగు త్రిపురంబులను ధ్వంసమొనర్చినందువలనను. దక్షయాగంబున జయించుటవలనను, ఫాల్గునకుఁ బాశుపతం బిచ్చుటవలనను, మాధవుఁడు స్త్రీశరీరమును దాల్చినపుడు భోగించి "శాస్త"యను కుమారునిఁ బుట్టించినందువలనను శివుఁడే సర్వదేవతాశ్రేష్ఠుఁడు.

3. భూమియందు దనేకులచే నారాధింపఁబడుటవలనను, నారాధకుల కష్టైశ్వర్యంబు లిచ్చుటచేతను, విష్ణుడు దశావతారముల యందును బూజించుటచేతను, హంస వరాహరూపులై గవేషించిన బ్రహ్మ విష్ణువుల కగోచరంబులగు శీర్షాంఘ్రులు గలవాఁడైనందునను జన్మ మరణములు లేనివాఁడగుటచేతను శివుఁడే సర్వదేవతాశ్రేష్ఠుఁడు.

4. కాశియందు విష్ణుపరత్వమును జెప్పుచున్న వ్యాసునకు భుజాస్తంభనము చేసినందునను, త్రిపురాసుర యుద్ధంబున వృషభరూపియగు హరిచే భూమి వహింపఁబడుటచేతను, బ్రహ్మశిరస్సును గొట్టి భూషణముగాఁ గైసేసికొనుటవలనను శివుఁడే సర్వదేవతాశ్రేష్ఠుఁడు.

5. విష్ణువు శివలింగమునకు బానవట్టమై యుండుటచేతను, ఇద్దఱు కలిసియుండుటచే సమానమని యనుటకు వీలుగాక విష్ణువు

నకు సప్రాధాన్యమును శివునకుఁ బ్రాధాన్యమునుండుటచే శివుఁడే సర్వదేవతాశ్రేష్ఠుఁడు.

### పూర్వపక్షుల వాదము.

సిద్ధాంతము

పూర్వపక్షులు: గాయత్రీబోధితత్వాత్ = గాయత్రీమంత్రము అంతర్గతమైన భర్గశబ్దముచే శివునిఁ బ్రతిపాదించుచున్నది. కాన శివపరము సకలమంత్రసారమైన గాయత్రి శివునే ప్రతిపాదించుట వలన శివుఁడే సర్వోత్కృష్టుఁడు.

కూరేశులు:

శ్లో॥ గాయత్రీ పూర్వ కృత్యాచమన విధిపురస్కార సంకల్పతాద్యే
గోవిందాఖ్యా ప్రయోగాద్ధరిరితికథనాచ్ఛ్రౌత్యధీత్యాదికాలే
భర్గశ్శబ్దస్య సూర్యాత్మక హరిమహసో వాచకత్వాత్ పురస్తా
దోంకారాఖ్యేయ భావాదననిజగుణాచ్ఛుద్ధ సత్త్వాశ్రయత్వాత్

అర్థము: గాయత్రీజపమునకును నితర విధి పురస్కారములైన వైదిక క్రియలకును బూర్వాంగములగు నాచమనసంకల్పములయందు గోవిందనామ ముచ్చరింపఁబడుచున్నది. వేదాధ్యయనాదులయందు ముందుగా "హరిః ఓ"మ్మని యుపక్రమించుచున్నారు గాయత్రీమంత్రగతమైనది భర్గశ్శబ్దముగాని భర్గశబ్దముగాదు. ఆభర్గశ్శబ్దము సూర్యాంతర్గతుఁడైన నారాయణుని తేజమును జెప్పుచున్నది. సర్వవేదసారమై సర్వమంత్రములకు నగ్రమున వర్తించు నోంకారముచే విష్ణువే చెప్పఁబడుచున్నాఁడు. సర్వరక్షకత్వము భగవద్గుణము. అట్టిగుణము మహావిష్ణునియందే నిలిచియున్నది. శుద్ధసత్త్వాశ్రయుఁడు భగవంతుఁడని వేదములు వాకొనుచున్నవి. అట్టి శుద్ధసత్త్వాశ్రయుఁడు నారాయణుఁడేయని భృగుమహర్షి మొదలైనవారి చరిత్రములవలనఁ దేలు

చున్నదిగదా. కావున శివుఁడెట్లు గాయత్రీప్రతిపాదితుఁడై యుత్కృష్టుఁడగును.

వి ష య వి వే చ న ము

పూర్వ: "గాయంతం త్రాయతే యస్మా ద్గాయత్రీ" గానము చేయువానిని గాపాడునది గాయత్రి, "న గాయత్ర్యాః పరో మంత్రః న మాతుః పర దేవతా, బ్రహ్మవర్చసకామస్తు గాయత్రీం వేదమాతరం" గాయత్రికంటె నుత్తమమైన మంత్రములేదు, తల్లికంటె మిగిలిన దేవతలేదు, బ్రహ్మవర్చసమును బొందఁగోరినవాఁడు వేదమాతయైన గాయత్రి నుపాసింపవలయునని ప్రశంసింపఁబడి పరమవైదికమైన గాయత్రి మీకును నుపాదేయమేగదా. మీరును బ్రతిదిన మనుష్ఠించునదేగదా ?

కూరే: కాదని యెవరనిరి. అది యుపాదేయతమము. దాని ప్రామాణ్య విషయమున సందేహములేదు. అందుఁ బ్రతిపాద్యమైన పదార్థమునందే మనకుఁదగాదా. గాయత్రి శివునెట్లు ప్రతిపాదింపఁగలదు ?

పూర్వ: ఏమి ! సర్వసులభరీతిని గాయత్రి శివునిఁ బ్రతిపాదించుచుండఁగా నెట్లు కప్పిపెట్టఁగలవు. చూడుము "తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్యధీమహి ధియో యోనః ప్రచోదయాత్" అనిగదా గాయత్రి "హరస్స్మరహరో భర్గ స్త్ర్యంబక స్త్రిపురాంతకః" అను నిఘంటు ప్రమాణముచే భర్గుఁడనఁగా శివుఁడని బాలురకుసైతము తెలియుచున్నదిగదా భర్గుడన శివుడను నర్థము తెలియనివాఁడవేనటయ్యా ! పరతత్త్వవాదమునకు మొదలుపెట్టితివి.

కూరే: మాకు భర్గుఁడనునామము శివునకున్నదను విషయము తెలియకపోలేదు. దాని నట్లుంచుఁడు. మంత్రార్థ విచారణము

తరువాతసేయుదము. గాయత్రీజపమునకు ముందు మీరేమి సేయుదురు ?

పూర్వ: సంధ్యోపాస్తిఁ గావింతుము.

కూరే: దానికిముందో ?

పూర్వ: ఆచమన సంకల్పాదు లొనర్తుము. అవి దీనికేమిటి స్నాన ప్రాయశ్చిత్త ప్రాణాయామాదులైన సర్వ వైదిక క్రియలకును బరిపాటియేగా !

కూరే: సరే బాగుగనేయున్నది. ఆచమనమును "కేశవాది భిస్త్రిభిః పీత్వా" అనుటచేఁ గేశవాది నామములచేఁగదా సేయుదురు. ఇఁక "హరిః ఓమ్, శ్రీగోవింద గోవింద మహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య" అనిగదా సంకల్పారంభము. వీని యందు గోవిందాది విష్ణునామములున్నవే ?

పూర్వ: ఉన్నవిసరే; వానివలన మీకుఁ బ్రయోజనమేమి ?

కూరే: లోకములోనొకనాటకమాడుచున్నారనుకొనుఁడు. వారు హరిశ్చంద్ర నాటకమునకుముందు నలకథాప్రస్తావనగాని "మనాక్ కావ్యార్థ సూచన"మ్మను నాందిని నలకథావిషయకముగాఁ గాని చేయరుగదా. అట్లే గాయత్రీజపమేమి, యితర సర్వ వైదికక్రియలేమి ప్రారంభించునప్పుడు వానియందుఁ బ్రతిపాద్యమైన పరతత్త్వ సారాంశమును సూత్రప్రాయముగా నీయాచమనాదులు సూచించుచున్నవి. ఆచమనాదులయందు సూక్ష్మముగాఁ జెప్పఁబడు పరతత్త్వమే తత్తత్క్రియలయందు స్థూలముగా విశదీకరింపఁబడును గావున నాచమనాదులయందు మహావిష్ణువు చెప్పఁబడుటచే గాయత్రీప్రతిపాదితుఁడు నారాయణుఁడే కాని మఱియొకఁడు గాఁడు. ఉపక్రమోప సంహారా

ములన్నియుఁ దాత్పర్య నిర్ణాయకములు గాన మనకుఁదోఁచిన ట్లర్థముసెప్ప వీల్గాదు.

పూర్వా: అభ్యాసమునందు—అనఁగా నడుమ భర్గశబ్ద ముండుటచే దానినిబట్టి గోవిందశబ్దమునకు శివపరముగా నర్థము చెప్ప రాదాయేమి!

సూరే: అట్లు వీలుపడదు. "గౌరేషాహి తథా వాణీ తాంచవింద యతే యతః గోవిందస్తు తతో దేవ మునిభిః కథ్యతేభవాన్" గౌః=అనఁగా వేదములకును నర్థము. వానినిఁ దెలుపువాఁడవుగనుక నిన్ను మునులు గోవింద నామముచే నుడువుచున్నారు. "త్వద్విస్తరాయథా దేవా అహం భూతపతి స్తథా నతదస్తి వినాదేవ యత్తే విరహితం క్వచిత్" సమస్త దేవతల యందును నంతర్యామిగా నీవున్నావు. భూతపతినైననాయందు నట్లేయున్నావు. నీవులేనిదియు నీకు వశముగానిదియు నెచ్చట నేమియులేదు. అని మాచే నిస్పృహ పరతత్త్వముగాఁ జెప్పఁబడుచున్న శివుఁడే గోవిందశబ్దమునకు నారాయణుఁడే యర్థమనియుఁ దనకు నతఁడే ప్రభుఁడనియుఁ జెప్పినట్లు హరివంశమునఁ జెప్పఁబడియున్నది. కాక "మా ఋచో మా యజుస్సామ మా తాత పఠ కించన గోవిందేతి హరేర్నామగేయం గాయస్వ నిత్యశః" కష్టపడి వేదాధ్యయనమొనర్ప నవసరములేదు, హరినామమును నిత్యగేయమునైన గోవిందశబ్దమును సదా యుచ్చరింపుము—అనియుఁ గలదు. "హరణాత్ ప్రాణినాందేవ తతో హరి రితిస్మృతః, బృహత్వాత్ బృంహణత్వాచ్చ తస్మాద్బ్రహ్మేతి విశ్రుతః,వసనా ద్దేవనా చ్చైవ వాసుదేవేతి శబ్దితః తత స్త్వం విష్ణునామాసి యతో వ్యాప్తిః ప్రదర్శితాయతస్తు భూతభవ్యేశ స్త్వం నారాయణశబ్దితః" ప్రాణులను హరించుటవలన హరియనియు, బృహత్త్వ, బృంహ

ణాత్వములచే బ్రహ్మయనియు జగత్తునందు వసించుటచేతను క్రీడించుటచేతను వాసుదేవుఁడనియు, బ్రహ్మాండములయందు వ్యాపించుటవలన విష్ణుఁడనియు, సర్వభూతములకుఁ బ్రధాన ప్రభుఁడనగుటచే నారాయణుఁడనియుఁ బేర్కొనఁబడుచున్నాను అని విష్ణు వాసుదేవాది శబ్దములకు మహావిష్ణువే వాచ్యుఁడనియు, సతఁడే జగత్ప్రభువనియు హరివంశమునందు మీగౌరీపతియే వచించెను గావున నాచమన సంకల్పాది సర్వ వైదిక మంత్రములందలి హరి వాసుదేవాది శబ్దములు, విష్ణు వాచకములు. ఆచమనాదులు విష్ణుపరములు. “గోవిందేతి సదాస్నానం గోవిందేతి సదా జపః గోవిందేతి సదాధ్యానం సదాగోవింద కీర్తనం మృజ్జలాభ్యాం బహిస్స్నానమాంతరం విష్ణుచింతనం, ధ్యాయేన్నారాయణం దేవం స్నానాదిషుచ కర్మసు, వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్ విష్ణురారాధ్యతేపంథా నాన్యస్తత్తోషకారకః సకృన్నారాయణేత్యుక్త్వాపుమాన్ కల్పశతత్రయం గంగాదిసర్వతీర్థేషుస్నాతో భవతి పుత్రక ప్రాయశ్చిత్తాన్యశేషాణి తపః కర్మాత్మకాని వై యాని తేషా మశేషాణాంకృష్ణానుస్మరణం పరం ప్రాయశ్చిత్తాని చీర్ణానినారాయణ పరాఙ్ముఖం ననిష్పునంతి రాజేంద్ర సురాభాండ మివాపగాః యస్యస్మృత్యాచనామోక్త్యా తపోయజ్ఞ క్రియాదిషు న్యూనం సంపూర్ణతాం యాతిసద్యో వందే తమచ్యుతం” గోవిందనామోచ్చారణముతో స్నానము చేయవలయును, గోవిందనామముతో జపమొనర్పవలయు. గోవింద విషయకముగా ధ్యానము నాచరింపవలయును, నిరంతరము గోవిందునిఁ గీర్తింపవలయును, మృత్తిక, జలము వీనితో బహిఃస్నానమును, అంతరస్నానము విష్ణుచింతనముతో నొనరింపవలయును. దేవదేవుఁడైన నారాయణుని స్నానాది సర్వ కర్మలయందు ధ్యానింపవలయు, సాధువు ముముక్షువైన

వాఁడు విష్ణునారాధింపవలయు, నారాధనముకంటె నావిష్ణుని సంతోషపఱచుటకు వేఱుమార్గములేదు. ఒక్కసారి నారాయణ స్మరణ మొనర్చినవాఁడు మూఁడువందలకల్పము లేకగ్రీవముగా గంగాది సర్వతీర్థములయందు స్నానమొనర్చినయంతటి సుకృతము నొందుచున్నాఁడు. ప్రాయశ్చిత్తము తప ఆది సర్వ వైదిక కర్మములు కృష్ణస్మరణమే శరణముగాఁగలవి. యథావిధి నొనరింపఁబడినవయ్యుఁ బ్రాయశ్చిత్తాదులు విష్ణుపరాఙ్ముఖుఁడైనవానిని, కల్లుకుండను నదీజలములు పవిత్రముసేయలేని విధమునఁ బవిత్రునిఁ జేయఁజాలవు. ఎవని నామస్మరణము వలనఁ దపో యజ్ఞాదులు లోపముగలిగియు సంపూర్ణము లగుచున్నవో యట్టి యచ్యుతునకు నమస్కరించుచున్నాను. "అగ్నిమండలమధ్యస్థం ధ్యాయేద్యజ్ఞపతింహరిం యజ్ఞకృద్యజ్ఞభుగ్యజ్ఞీ" అగ్నిస్వరూపముతోఁ దదంతర్గతుఁడైయున్న హరిని ధ్యానింపవలయును వాఁడే యజ్ఞమునకుఁ బ్రభువు. యజ్ఞకర్తయు యజ్ఞభోక్తయు యజ్ఞమును నతఁడే. "విష్ణోర్నివేదితాన్నేన యష్టవ్యం దేవతాంతరం పితృభ్యశ్చాపి తద్దేయం తదానంత్యాయ కల్పతే" నారాయణనివేదితములైన హవ్యకవ్యాదులనే యితర దేవతలకును బితృదేవతలకును నివేదింపవలయును. అట్లొనర్చిన ఫల మనంతము. "పితృరూపీ జనార్దనః" పైతృకములందుఁ బితృరూపియై జనార్దనుఁడు వానిని గ్రహించును. ఇట్టిప్రమాణములచే స్నానము, ప్రాయశ్చిత్తము, జపము, ధ్యానము, తపము, అశ్వమేధాది యజ్ఞములు, పితృకర్మలు – ఇవియవియననేల సర్వవైదికకర్మలు విష్ణుపరములు. నారాయణాత్మకములు. ప్రసక్తానుప్రసక్తముగా నితరదేవతలు వచ్చినను సర్వమునకుఁ బ్రభువు నారాయణుఁడు. నతఁడేసర్వకర్మోద్దేశ్యభూతుఁడు. 'యత్కరోషియదశ్నాసియజ్జుహోషి

దదాసియత్ యత్తపస్యసికౌంతేయ తత్కురుష్వ మదర్పణం" అర్జునా! నీవుచేయు సర్వకర్మలు, నీవారగించు పదార్థములు, నీవొనర్చు యజ్ఞాదులు, నీవుగావించు దానాదులు, నీవొనరించు తపములు, సర్వము నాకు సమర్పించుము. స్వభావతః అవి మత్పరములేగనుక నీవును నీరహస్యమెఱిఁగి యవియన్నియు మద్దేవతాకములనియు మత్పరములనియు భావించుము అని గీతయందు స్వయముగా భగవంతుఁడే వచించెను. వేదాధ్యయనమొనర్చుటకు ముందు నధ్యయనము ముగిసిన వెనుక సదా హరినామ ముచ్చరించుచున్నారు. "వేదాక్షరాణి యావంతి పఠితాని ద్విజోత్తమైః తావంతి హరినామాని కీర్తితాని నసంశయః" వేదములయందెన్ని యక్షరములున్నవో యవియన్నియు విష్ణునామములు. వేదాధ్యయన మొనర్చుట నారాయణునిఁ గీర్తించుటయే. ఇట్లు వైదికకర్మాన్తర్గతకములైన స్నానము మొదలుకొని యాగాంతమైన సమస్త వైదిక కర్మానుష్ఠానము, సమస్తవేదములు వేదమంత్రములు విష్ణుపరములై తత్పరత్వస్థాపకములై యుండఁ బరమవైదికమైన గాయత్రీమంత్రము రుద్రపరమై తామస మెట్లగును? కాదు కాకపోఁగా "గంగాగీతాచ గాయత్రీ, తులసీగోపి చందనం ఏకాదశీ హరేర్నామ సాలగ్రామ శిలార్చనమ్ వైదికాష్టకమే తాని నియమేనదినేదినే యే భజంతి కలౌనిత్యం తేషామపి నమోనమః" గంగాస్నానము, గీతాపారాయణము, గాయత్రీ జపము, తులసీసమర్చనము, గోపీచందనధారణము, ఏకాదశీ వ్రతము, హరినామ స్మరణము, సాలగ్రామ శిలార్చనము— ఈయెనిమిదియు వైదికములు. నియమముతో నిరంతరము విడువక వీని నెవ రాచరించుచున్నారో వారికి నమోనమః ఇట్లు విష్ణుపరమని స్ఫుటముగాఁ జెప్పఁబడినది. కానియెడల

నిస్సందేహముగా వైష్ణవములైన తులసీ గీతా హరివాసరాదులైన తక్కిన యేడింటిలోఁ జేరవుగదా. ఏకజాతీయమైన యొక సమూహమునందు నన్యజాతీయమైన మఱియొక్కటి యంతర్భవించునా. బహుసంఖ్యాకమైన హంసకదంబమునఁ గాకమొక్కటి చేరితిరుగునా.

పూర్వ: సరే ఆచమనాదులయందు విష్ణునామములుండుటచే గాయత్రి విష్ణుపరమని చెప్పితివి. విష్ణునామములుకాని ఓంకారము, భూః—భువః—సువః అను శబ్దములు, సవితృ వరుణ సూర్య మిత్ర దేవాది శబ్దములు గాయత్రీపూర్వకృత్యములైన ప్రాణాయామ సంధ్యావందనాదులయందున్నవే. ఒక్క గోవిందాది శబ్దములనే పట్టుకొని గాయత్రి విష్ణుపరమని చెప్పుచున్నావు బలేవాడవయ్యా !

సూరి: గోవిందాదిశబ్దములనే పట్టుకొని మాకిప్పుడు గాయత్రితో నవసరమువచ్చి దానినిఁ గష్టముతో విష్ణుపరమొనర్చుటలేదు. విధిలేక గాయత్రియే స్వయముగా విష్ణుపర మగుచున్నది. మేమిప్పుడు క్రొత్తగా నేదియు కల్పింపనవసరములేదు. వేదార్థోపబృంహణములైన పురాణేతిహాసాదులే గాయత్రియర్థమును వ్యాఖ్యానించుచున్నవి అది తరువాతఁ జెప్పెదను. ఓంకారాదులు విష్ణుని బోధించుటలేదని మీరనిరి. ఆపాతరంపికులైన వారికవియన్యథాస్ఫురించినను యథార్థముగా విష్ణునామములే. బ్రహ్వృచబ్రాహ్మణమున "ప్రజాపతి రకామయత" అని మొదలువెట్టి "తాని శుక్రాణ్యభ్యతపత్ తేభ్యోభితప్తేభ్య స్త్రయోవర్ణా అజాయంత అకార ఉకార మకార ఇతితానేకధా సమభవత్ తదేతదోమితి" పరమాత్మ మూడువేదములను గాచివడియఁగొట్టెను. అప్పుడు వేదత్రయమునుండి సారభూతములై మూడువర్ణములు జనించెను. అవి అకారము,

ఉకారము, మకారము—వాని నొక్కటిగాఁగలిపెను, అదియే (అ+ఉ+మ్) ఓంకారమాయెను అనిచెప్పెను. "అవరక్షణే" అను ధాతువువలన నేర్పడుచున్న అకారము విష్ణువాచకము. "అఇతి నారాయణస్య ప్రథమాభిధానం" అయనునదినారాయణునకు మొదటిపేరు అనియున్నదిగదా సవిసర్గమైన 'అ' అను నక్షరము చతుర్థీవిభక్తిగలదై నారాయణునికొఱకు అనునర్థమును దెలుపుచున్నది. 'ఉ' యనునది యవధారణార్థకమైన యవ్యయము. అనఁగా నింతవఱకు అకారోకారములు గలిసి నారాయణునికొఱకే యనునర్థమును దెలుపుచున్నవి. అట్టిది ఇతరులకుఁ గానిదియు నారాయణునికొఱకే యైనదియు నేది? యని యాకాంక్ష గలుగగా మకారము సమాధానము చెప్పుచున్నది. "మనజ్ఞానే" అను ధాతువుచే నిష్పన్నమైన 'మః' అనుశబ్దము జ్ఞానస్వరూపుఁడైన జీవునిఁ జెప్పుచున్నది. జీవశబ్దము ప్రకృతికిని యుపలక్షణము. అనఁగాఁ జేతనాచేతనాత్మకమైన జగత్తు నారాయణున కిష్టవినియోగార్హమైన సొత్తు అని ఓంకారమునకుఁ బిండితార్థము. ఇదియే సర్వవేదముల యందుఁ బర్యవసానముఁ దేలు సారాంశము. దీనినే నారాయణాష్టాక్షరి "ఓ మిత్యగ్రేవ్యా హరేత్" అనుటచే మొదట నోంకారముచేఁ దెలిపినది. నమ ఇతి పశ్చాత్ అనుటచే మఱి కొంచెము విశదముగాఁ దెలిపి "నారాయణాయే త్యుపరిష్టాత్" అను నారాయణశబ్దముచే స్పష్టముగాఁ దెలిపినది. ఓంకారమునకు 'నమః' యను వర్ణద్వయము వ్యాఖ్యానము. దానికి నారాయణాయ యనునది వ్యాఖ్యానముగావున నోంకారము నారాయణవాచకము మఱియు "అకారేణోచ్యతే విష్ణురుకారేణ రమోచ్యతే మకారస్తు తయోర్దాస ఇతి ప్రణవలక్షణం" అకారముచే విష్ణువు, ఉకారముచే లక్ష్మి, మకారముచే

వానికి శేషభూతుఁడైన జీవుఁడు (ప్రకృతియును) చెప్పఁబడుచున్నారు. ఇదియే ప్రణవార్థము అనియుఁ జెప్పుచున్నారు. ఆదికావ్యమైన రామాయణము "అగ్రతః ప్రయయౌ రామః సీతా మధ్యే సుమధ్యమా పృష్ఠతస్తు ధనుష్పాణి ర్లక్ష్మణోఽను జగామహ" రాముఁడు ముందు నడచుచుండెను, మధ్య మంచి నడుముగల సీతయు, నామె వెనుక ధనుష్పాణియైన లక్ష్మణుఁడును నడచుచుండిరి అని రామగమనమును వర్ణించుచుఁ బ్రణవము విష్ణుపరమేయని దానియర్థమును సూచించుచు నుపబృంహణము చేసినది. మఱియు "గిరామస్మ్యేకమక్షరం" శబ్దములలో నొక్కయక్షరము నేనే, "ప్రణవస్సర్వవేదేషు" సర్వవేదములయందుఁ బ్రణవము నేనే, "ఓమిత్యేకాక్షరం బ్రహ్మవ్యాహరన్ మామనుస్మరన్" బ్రహ్మస్వరూపమైన ఓంకారము నుచ్చరించుచుఁ దదర్థభూతుఁడనైన నన్ను మనసా స్మరించువాఁడు (ముక్తినొందును) అని భగవద్గీతయందు స్వామి తానే వచించెనుగదా! కావున నోంకారము విష్ణువాచకము. ఇఁక 'భూః' అనునదియు విష్ణువాచకమే. 'భవతీతి భూః' అనిగదా శబ్ద వ్యుత్పత్తి - అనఁగా ఉన్నవాఁడు అని యర్థము. జగత్తున నందఱున్న వారేగనుక నందఱికి వాచకమగునని సందేహింపఁబనిలేదు. ఉండుటలో విశేషమున్నది. అనఁగా నెవరులేని సమయమున నున్నవాడని యర్థము. దీనినే "సదేవసోమ్యేదమగ్ర ఆసీత్" కల్పాదియందు సత్స్వరూపుఁడైన పరమాత్మ యొకఁడే యున్నాఁడు అని శ్రుతి చెప్పుచున్నది. "న బ్రహ్మా నేశానః నేమే ద్యావా పృథివీ" ఆకల్పాదియందు బ్రహ్మలేడు, శివుఁడు లేడు, భూమ్యాకాశములు మఱేమియు లేవు అని విశేషించి నిషేధించుటచే నా పరమాత్మ నారాయణుఁడేయని తేలుచున్నది. కాన 'భూః' అనునది

విష్ణుపరము. "భువః—భువనేషువసతీతి భువనాన్యస్మిన్ వసంతీతి వాభువః" భువనములయందుండువాఁడు లేక భువనములు తన యందుఁ గలవాఁడు అను నర్థముగలిగి వాసుదేవశబ్దము నుప లక్షింపఁజేయుచున్న 'భువః' అనుశబ్దము విష్ణుపరమైయున్నది. 'సూః' అనఁగా సృష్టి. దానినిచ్ఛగించినవాఁడు అని 'సువః' అను శబ్దమున కర్థము. "తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్" ఆకల్పాదియందున్నవాఁడే యీజగత్తునుసృష్టించిదానియందంత ర్యామిగాఁ బ్రవేశించెను. అని శ్రుతి చెప్పుచున్నది. కావున నీమూఁడువ్యాహృతులును వేదోద్ఘాటితమైన పరత్వమును విశ దీకరించుచు నారాయణపరములైయున్నవి.

సంధ్యావందన మంత్రాచమనమునందున్న సత్యజ్యోతిః ప్రభృతి పద ములు "నారాయణః పరోజ్యోతిః సత్యం జ్ఞాన"మ్మని నారా యణశబ్దమును మున్నిడుకొని ప్రవర్తించుటచేఁ దత్పరములై యున్నవి. "సుష్ఠుప్రాణినః కర్మసు ప్రేరయతీతి, సూర్యః" నిఖిల ప్రాణులను గర్మములయందుఁ బ్రవర్తింపఁజేయువాఁడు అను వ్యుత్పత్తిచే, "ఏష హ్యేవసాధుకర్మ కారయతి తంయమేభ్యో లో కేభ్య ఉన్నినీషతి" ఈవిష్ణువే యెవనినిఁ బ్రకృతినుండి విడిపింప నెంచుచున్నాఁడో వానిచే సాధుకర్మలు సేయించుచున్నాఁడు అనుశ్రుతిమూలకమై సూర్యశబ్దము విష్ణుపర్యాయమగుచున్నది. ఉపస్థానమంత్రమందున్నవరుణశబ్దమున్ను వరుణాంతర్యామియైన నారాయణుఁడు లేక వరణీయుఁడు భజింపఁదగినవాఁడు అనునర్థ ముచేతఁగాని విష్ణుపరమే. "త్రైలోక్యం మిమాతే" మూఁడు లోకములను గొలిచినవాఁడు అనునర్థముచే మిత్రశబ్దము త్రివి క్రముని బోధించుచున్నది. లేక "మీఙ్—హింసాయాం—త్రైఙ్ పాలనే" అను ధాతువులచే హింసారూపమైన సంసారమునుండి రక్షించువాఁడు అను నర్థముతో విష్ణుని బోధించుచున్నది.

సంధ్యాంతమునందు "స్తుత్వాదేవం జనార్దనం సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" ఇట్లు జనార్దనుని స్తుతించితిని సర్వదేవతలకు నొనరించు నమస్కారములు తదంతర్యామియై "క ఇతి బ్రహ్మణోనామ ఈశోహం సర్వదేహినాం ఆవాం తవాంగసంభూతౌ తస్మాత్కేశవనామవాన్" క అనఁగా బ్రహ్మకుఁబేరు. ఈశుఁడనఁగా భూతాధిపతినైన నాకుఁ (శివునకు) జెల్లును. మేమిరువురము నీశరీరమునఁ బుట్టితిమి. కావున నీకుఁ గేశవనామము గలిగినది అని చెప్పఁబడిన విష్ణునికే చెందుచున్నవి అనియుండుటచేఁ బూర్వాంగమ్ములైన యాచమన సంకల్ప సంధ్యావందనాదులు తదంతర్గత మంత్రములు శబ్దములు సర్వము నారాయణపరమగుచున్నవిగాన గాయత్రి విష్ణుపరమేగదా !

పూర్వ: ఏమోనయ్యా ! నీవిద్యాబలముచే గడబిడ చేయుచున్నావు. కాని ప్రధానభూతమైన మంత్రమునందు స్పష్టముగా భర్గశబ్దముచే శివుఁడు బోధింపఁబడుచున్నాఁడు. కావున నిదియంతయు మేమొప్పుకొనము.

కూరే: సరే గాయత్రీపూర్వాంగములన్నియు విష్ణుపరములని యింతదనుక నిరూపించితిని. దానియందు భర్గశబ్దమొకటి యున్నదనియు నది యేమో మిమ్ముద్ధరించుననియు మీరు సంరంభపడుచున్నారు. ఆసంరంభమునుగూడఁ దీర్చెదము. ఏదీ ? గాయత్రికిఁ జక్కఁగాఁ బదఖండన మొనర్చి వివాయర్థముగు సెలవిండు.

పూర్వ: చెప్పకేమి ! వినుము యః=ఎవఁడు, నః=మాయొక్క, ధియః=బుద్ధిని (లేక బుద్ధులను), ప్రచోదయాత్=ప్రేరించు

చున్నాడో, తత్ సవితుః = అట్టిసృష్టికర్తయైన, భర్గో దేవస్య = శివునియొక్క, వరేణ్యం = వాంఛనీయమైన మహిమను, ధీమహి = ఉపాసించెదము (కొనియాడెదము).

సూరే: "భర్గో దేవస్య" అనునది సమస్తపదమా లేక వ్యస్తపదములా (వేఱువేఱుపదములా) ?

పూర్వ: సమస్తపదమే (సమాసమే).

సూరే: అయినచో అకారాంతమైన భర్గశబ్దముతో దేవపదము సమసించునప్పుడు భర్గశబ్దమునకు ఓత్వమెట్లు వచ్చెను ? "భర్గదేవస్య" అనిగదా యగును.

పూర్వ: అట్లైనచో సమాసముగాదు వ్యస్తపదములే. ఇప్పుడువిను. యోనః ధియః ప్రచోదయాత్ = ఎవఁడు మాబుద్ధిని ప్రేరేంచుచున్నాడో తత్సవితుః = అట్టిసృష్టికర్తయైన దేవస్య = దేవుడైన భర్గః = ......ఓహొూ కుదురుటలేదే 'భర్గస్య' అనియుండిన సరిపోయెడిదికాబోలు. పెద్దచిక్కే పెట్టినావయ్యా ! (పూర్వపక్షులలో మఱియొకడు) ఓరీ ! నీవట్లుండరా నేనుచెప్పెదను వైష్ణవుఁడు మొత్తానికి చాలాగట్టివాఁడురా. ఏమీ ఆచార్యులుగారూ నేనుజెప్పెదనువినుఁడు.

సూరే: ఎవరైన మాకేమి మీరేచెప్పుడు.

పూర్వ: యః—ఏ—భర్గః = శివుఁడు, నః—మా—ధియః = బుద్ధిని, ప్రచోదయాత్ = ప్రేరించుచున్నాఁడో, తత్సవితుః దేవస్య-వరేణ్యం-ధీమహి = అట్టి సృష్టికర్తయైన దేవుని మహిమను ధ్యానించెదము అని భర్గశబ్దమును మంత్రమున నుత్తరార్థమునఁ జేర్చుచున్నాము. ఇప్పుడు సరిపడలేదా ?

సూరే: పాపము చాలశ్రమపడి మీరు శబ్దమును సరిపెట్టితిరి కాని యన్వయక్రమము సరిపడుటలేదు. విశేష్యమైన భర్గశబ్దము ముందును విశేషణమైన దేవశబ్దము వెనుకను జేరుచున్నది. అనఁగా ఏదేవుఁడు మాబుద్ధిని ప్రేరించుచున్నాఁడో యట్టి శివుని మహిమ నుపాసించెదము—అనిన సరిపోవునుగాని ఏశివుఁడు బుద్ధిని ప్రేరించుచున్నాఁడో యట్టిదేవుని గొలిచెద మనుటచే విశేషణ విశేష్యభావమునకు విరోధము గలుగుచున్నది. ఇట్లన్వయించుట శాస్త్రీయముగాదు, కాక గాయత్రి యర్థమును నిర్ణయముచేసిన బ్రహ్మాండపురాణ గాయత్రీ హృదయ గాయత్రీ భాష్యములకు మీయర్థము విరుద్ధమగుచున్నది.

పూర్వ: అట్లైనచో మీరెట్లు చెప్పుదురు?

సూరే: వినుఁడు. యః—నః—ధియః—ప్రచోదయాత్ =ఏవఁడు మాబుద్ధిని ప్రేరించుచున్నాడో, తత్—సవితుః—దేవస్య—వరేణ్యం—భర్గః—ధీమహి=అట్టి జగత్కారణభూతుఁడైన నారాయణుని యొక్క వరణీయమైన (భర్గః—యనెడి) తేజము నుపాసించెదము. ఇట సకారాంతమైన భర్గశ్శబ్దము సూర్యాంతర్యామియైన విష్ణు తేజోవాచకమేగాని భర్గశబ్దముగాదు. దేవశబ్దము నారాయణవాచకము. "దివ్యోదేవ ఏకోనారాయణః—విదామదేవం భువనేశమీడ్యం—ఏషహిదేవః ప్రదిశోనుసర్వాః—పూర్వోహి జాతః స ఉగర్భే అంత తమసి పరేదేవ ఏకీభవతి" అను శ్రుతివాక్యములయందు నారాయణశబ్ద సాహచర్యము గలిగి దేవశబ్దము విష్ణువాచకమగుచున్నది, సవితృ పదమును జగత్స్రష్టయైన నారాయణునిఁ జెప్పుచు "యతోవా ఇమాని భూతాని జాయంతే" ఎవనివలన నీభూతకోటి పొడము చున్నదో యను శ్రుతిని స్ఫురింపఁజేయుచున్నది. "ఆదిత్య

దేవతాయాశ్చప్రేరకం పరమాద్భుతం భర్గస్సంజ్ఞం వరేణ్యంచ ధీత త్వస్య ప్రచోదకం” ఆదిత్యదేవుని ప్రేరించునదియు, మిగుల నద్భుతమైనదియు, వరణీయమును ధీత త్త్వమును ప్రేరించునదియు, భర్గస్సంజ్ఞమైన విష్ణుతేజము—అని బ్రహ్మాండ పురాణము గాయత్రియర్థము నుపబృంహణము చేయుచున్నది “భర్గస్తదాఖ్యం భజనీయమేవం ధ్యాయామి నిత్యం రవిమండలస్థం” సూర్యమండలాంతర్గతమైనదియు, భజింపఁదగినదియు, భర్గస్సంజ్ఞమైనదియు నగు విష్ణుతేజమును ధ్యానించెదను. అని సావిత్రీభాష్యము గాయత్రికి నర్థము చెప్పుచున్నది. ఈయర్థమునే “ధ్యేయస్సదాసవితృ మండలమధ్యవర్తీ నారాయణ స్సరసిజాసనసన్నివిష్టః” సరసిజాసనమం దుపవిష్టుఁడై సూర్యాంతర్గతుఁడైన నారాయణుఁడు ధ్యానింపఁదగినవాఁడు అను వాక్యము సూచించుచున్నది. “యదాదిత్యగతంతేజః సూర్యునియందున్న తేజము నాది యను గీతావాక్యము గాయత్రి పూర్వార్థమును వ్యాఖ్యానించుచున్నది. ఉత్తరార్థమును “మత్తస్స్మృతిర్జ్ఞాన మపోహనంచ” నాప్రేరణమునలననే స్మృతి జ్ఞానము మొదలగునవి గలుగుచున్నవియను గీతావాక్యము విశదీకరించుచున్నది మఱియు గాయత్రీహృదయమునందు యాజ్ఞవల్క్యుని చేనడుగఁబడి బ్రహ్మ విష్ణువే సర్వజగత్కారణుఁడని వచించెను ఇట్లు గాయత్రి పురాణోపబృంహణ నిరుక్త్యాదులచే నిస్సందేహముగా విష్ణుపరమైయుండఁగా మీరు ‘భర్గ’ అను నక్షరద్వయ శ్రవణమాత్రముచే శివపరమని చెప్పఁబూనుట యన్యాయము. మఱియు నొకఁడు “సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణంవ్రజ, అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః” అను గీతాశ్లోకమునకు “శ్రీకృష్ణుఁను యాదవవంశ్యుఁడగుటచే నతనికి

మేఁకలమంద లనేకముకలవు. అందుచే యుద్ధముసేయ విముఖుఁడై విషాదమునొందిన యర్జునునిఁజూచి అర్జునా! నీవు "సర్వధర్మాన్ పరిత్యజ్య" యుద్ధాదికర్మలు చేయలేవుగాన వీనినన్నిటిని వదలి మామేకం=మామేఁకను, శరణంవ్రజ= శరణుఁబొందుము (మామేకలమందను గాచుము(, అహం= నేను, త్వాం=నిన్ను, సర్వపాపేభ్యః= సమస్త కష్టములనుండి, మోక్షయిష్యామి= విడిపించెదను అని యర్థము చెప్పెనఁట. పైవాని శ్లోకవ్యాఖ్యానమువలె మీయర్థమును మిక్కిలి హాస్యాస్పదమగుచున్నది. ఇట్లు గాయత్రీపూర్వకృత్యములైన స్నానాచమన సంకల్పాదులు, సంధ్యోపాస్తి గాయత్రి, ఇవి యన్నియు విష్ణుపరములే, విష్ణుపరములే సందేహములేదు.

మఱియు వినుఁడు.

శ్లో॥ ప్రఖ్యాతా శేషదేవ ప్రణమనవిషయత్వాత్తపో యజ్ఞకర్మ
స్తోమ న్యూనాధికత్వ ప్రశమపటిమావద్దిన్యనామ స్మృతిత్వాత్
బ్రహ్మణ్యత్వాద్గిరీశాహుతి విధిషు జలస్పర్శనాద్విష్ణుపాదాం
భోజాతాంభోధరత్వాదపి న పశుపతిర్విష్ణు రేవ ప్రకృష్టః 2

సర్వదేవతలనుగూర్చి చేయు నమస్కారములకు విష్ణుఁడే గమ్యుఁడగుటవలనను, తపోయజ్ఞాది వైదికక్రియలందు, విష్ణు నామస్మరణముచేతనే న్యూనాధికత్వదోషము లుపశమించుట వలనను బ్రహ్మణ్యుఁడగుటచేతను శివమంత్రాహుతులు వచ్చినసమయమునఁ దదశుభశాంతికై మరల యజమానుని జలస్పర్శనాదులు చేయుటవలనను శివుఁడు విష్ణుపాదసంభూతయైన గంగానదిని మస్తకమున ధరించుటవలనను మహావిష్ణువే సర్వోత్కృష్టుఁడు.

వి—వి

కూరే: ఒకవేళ సంధ్యావందనాదులలోని నారాయణపాపకేశవ శబ్ద
ములు తత్తద్దేవతాపరములైనను నాయా దేవతలు ఉద్దేశ్యభూ
తులు కారు. మహావిష్ణువే సర్వోద్దేశ్యస్థానము. "సర్వదేవనమ
స్కారః కేశవం ప్రతిగచ్ఛతి, శృణుష్వాంహే వరారోహే యథా
నిత్యం నమామ్యహం బ్రహ్మాద్యాశ్చ సదుక్తైన తపోవిద్యా
సమాధిభిః అర్చయంతి సదాయం వై సదాపశ్యంతి సూరయః"
పడతీ ! వినుము ప్రతిదినము నేనర్చించునట్లు బ్రహ్మాదిదేవతలు
మునులు తపో విద్యా సమాధులచే నెవనిఁ బూజించుచుం
డిరో తనివిదీరక నిత్యసూరు లెవనిని సదా చూచుచుండిరో
యట్టి కేశవునికే సమస్తదేవతలనుగూర్చి చేయు నమస్కార
ములు చెందుచున్నవి అని శివుఁడే పార్వతితోఁ జెప్పెను.
బోధాయనుఁడును "బ్రహ్మేశేంద్రాది దేవానాం దేవో
నారాయణఃపరః" బ్రహ్మ శివుఁడు ఇంద్రుఁడు మున్నగు దేవ
తలందఱికంటె నారాయణుఁడే శ్రేష్ఠుఁడు, అతఁడే పరబ్రహ్మము
అని స్పష్టముగాఁ జెప్పెను. మఱియు "విహితానధికం న్యూనం
సర్వతః పరివర్జయేత్" శాస్త్రవిహితమునకంటె నెక్కువగాఁ
జేయరాదు తక్కువగాను జేయరాదని నియమబాహుళ్యము
గలిగిన శ్రౌతస్మార్తాదికర్మలయందు "స్మృతేసకలకల్యాణభాజనం
యత్రజాయతే యస్య స్మృత్యాచ నామోక్త్యా తపోయజ్ఞక్రియా
దిషు న్యూనం సంపూర్ణతాం యాతి" నారాయణుని స్మరించిన
సమస్తశుభములు చేకూరుచున్నవి. ఎవని స్మరణముచేతను
నామ ముచ్చరించుటచేతను తపోయజ్ఞాది క్రియలన్నియు
న్యూనములయ్యు సంపూర్ణములగుచున్నవో యట్టి నారాయణు
నికి నమస్కరించుచున్నాను అనుటచే విష్ణునామస్మరణమువలన
న్యూనాధికత్వరూప దోషములన్నియు పోయి వైదికకర్మలు

సంపూర్ణములగుచున్నవి. అట్టి సర్వకర్తయు, సర్వాధికారియుఁ బవిత్రనాముఁడునైన మహావిష్ణువుగాక మఱియొకఁడెట్లుకృష్ణుఁడగును.

పూర్వ: భూతపతియని పేరొందిన శివునినామము లుచ్చరించుటవలన మాత్ర మట్టికర్మలు దోషరహితములై సంపూర్ణములు కావా యేమి ?

సూరే: కావు, కాకపోగా 'కోడూరుతగవు కొనితెచ్చెరా" యన్నట్లు యజమాని శివనామమంత్రోచ్చారణాహుతులవలన నపవిత్రుఁడగుచున్నాఁడు. అప్పుడు "అప ఉప స్పృశేత్" నీరు తాకవలయును అని యాచమనము చేసినఁగాని మరలఁ గర్మార్హుఁడు కాకపోవుచున్నాఁడెందువలననఁగా "యస్మాత్త్వం మత్కృతే క్రూర ! ఋషీన్ సంహృతవానసి తస్మాద్యజ్ఞే సురైస్సార్థంనత్వాం యక్ష్యంతు బ్రాహ్మణాః హుత్వాహుతిం తవక్రూరా మపస్పృక్ష్యంతు కర్మసు" క్రూరుఁడా ! నాయజ్ఞమున మునులననేకుల సంహరించితివికావున యజ్ఞాదులయందు దేవతలును బ్రహ్మవేత్తలును నిన్నుఁబూజింపకుందురుగాక. కారణాంతరముచేఁ గ్రూరమైననీయాహుతి చేసినను నపవిత్రులై వెంటనే పవిత్రోదకమునుదాఁకి వారు మరలఁ బరిశుద్ధులగుదురుగాక అని దక్షుఁడు శివుని శపించెను. (వాయుపురాణము). "రౌద్రరాక్షస పైతృకేస్పర్శే అప ఉపస్పృశేత్" రుద్రసంబంధమును రాక్షస పితృ సంబంధములునైన మంత్రాదులువచ్చిన నాచమనము చేయవలయును అని యాపస్తంబుఁడు సెప్పెను. "స్పృష్ట్వారుద్రస్య నిర్మాల్యంసహాసై వాప్లుతశ్శుచిః" శివనిర్మాల్యమును దాఁకినమాత్రము చేతనే స్నానముచేయవలయును నప్పుడుగాని శుచిగాడుఅని చంద్రిక

నుచున్నది. శివనామములు వైదికక్రియలందు దోషము
లను బోగొట్టకపోగా నుచ్చరించినంతమాత్రమున లేని దోష
ములను నెత్తిపై బెట్టుచున్నవి. కర్త నపవిత్రునిఁ జేయుచున్నవి.
మఱియు విష్ణుపాదమునందు జనించిన గంగానదిని శిరస్సున
ధరించి శివుఁడు గంగాధరుఁడైనాఁడుగదా పాదములు కడి
గించుకొన్నవానికంటెను కడిగి యాతీర్థమును మస్తకమునఁ
జల్లుకొనువాఁడు గొప్పవాఁడని మీరు చెప్పుదురు కాఁబోలు.

పూర్వ: ఓహో॥ మీరటిపోవుచున్నారే. శివుఁడు ధరించినది విష్ణు
పాద సంజాతమైన గంగ కానేకాదు. అది మఱియొకగంగ.
అదియేనని నీకేమిటక్కడఁ బ్రమాణము ?

కూరే: మఱియొక గంగయని చెప్పఁబూనినను మీకోర్కె సఫలము
గాదు. ఈవిషయమునఁ బద్మపురాణాదులు నిట్లు బోధించు
చున్నవి. "సర్వేశ్వరో హరిర్విష్ణు ర్ద్వితీయం పాదముత్తమం
దివిప్రసారయామాస బ్రహ్మలోకాంత మచ్యుతః శ్రీపాదం
దేవదేవస్య దృష్ట్వా సంభ్రమచేతసా ధన్యోస్మీతి వదన్ బ్రహ్మ
గృహీత్వా స్వకమండలుం భక్త్యా సంక్షాళయామాస తత్ర
సంస్థిత వారిణా అక్షయ్య మభవత్తోయం తస్య విష్ణోః ప్రసా
దతః తత్తీర్థం మేరుశిఖరే పపాత విమలం జలం.........
తాం దృష్ట్వా మేరుమధ్యాత్తు ప్రవహంతీం వరాననే ఆత్మనః
పావనార్థాయ శిరసా తామధారయమ్" సర్వేశ్వరుండైన మహా
విష్ణువు తనద్వితీయపాదమును నాకాశమున బ్రహ్మలోకము
వఱకుఁ జాచెను. దేవదేవుఁడైన యతని పాదమును జూచి
బ్రహ్మ సంభ్రమమున నచ్చటి యానదీజలముచేఁ గడిగి తన
కమండలువునఁ బట్టెను. ఆకమండలుజలము విష్ణుని కృపచే
నక్షయ్యమాయెను. ఆపవిత్రజలము మేరుశిఖరమునఁబడెను
.........మేరుమధ్యమునుండి ప్రవహించుచున్న యాగంగా

జలమును బవిత్రుఁడనగుటకై నేను శిరస్సున ధరించితిని—అని పద్మపురాణమున శివుఁడు చెప్పుచున్నాడు ఈశ్వరసంహిత నృసింహతాపనీయాదు లీవిషయమును స్పష్టముగాఁ జెప్పుచున్నవి కావని యెట్లందురు!

పూర్వ: శివుఁడు పవిత్రుఁడగుటకు విష్ణుపాదోద్భవియైన గంగానదిని ధరించినట్లయిన 'భవాంగపతితంతోయం పవిత్రమితిపస్పృశుః' రామలక్ష్మణులు 'శివుని శిరస్సునఁబడుటచే మహాపవిత్రమైనదీ గంగాజలము' అని స్పృశించిరి అను రామాయణ బాలకాండమునందలి వాక్యమునకును, హంసస్యగాత్ర సంస్పర్శాత్ పవిత్రత్వ ముపాగతా" శివుని గాత్ర స్పర్శచేఁ బావనత్వము బొందెను అనువాక్యమునకును విరోధము కల్గుచుండలేదా! శివస్పర్శచేఁ బవిత్రమైన గంగానదిని శివుఁడు స్వయముగాఁ బవిత్రుఁడగుటకు దానిని ధరించెనని చెప్పుచుంటి వేమయ్యా!

కూరే! పై గంగాధారణవిషయమును బద్మపురాణము స్పష్టముగాఁ జెప్పుచున్నది. రామాయణవాక్యమున కది యర్థముగాదు. "భవాంగపతితం తోయం పవిత్ర మితిపస్పృశుః" స్వయముగా మహాపవిత్రమై తానుస్పృశించిన శివునిఁగూడఁ బవిత్ర మొనర్చినదీగంగాజలము అనియర్థము. అట్లే రెండవవాక్యమునకును 'శివునకుఁ దనస్పర్శచేఁ బావనత్వము గల్పించినది'యని యర్థము. ఈయర్థమునేగదా పద్మపురాణమున శివుఁడే చెప్పెను. మఱియుఁ బశుపతి పరత్వస్థాపకములైన మతములను సూత్రకారుడు. "పత్యురసామంజస్యాత్" అను సూత్రముచే నిరాకరించియున్నాఁడు.

పూర్వ: అయితే "ననన్నచానచ్ఛివ ఏవ కేవలః" కల్పాదియందు సత్తు లేదు, అసత్తులేదు, మఱేదియులేదు. శివుఁడొక్కఁడే యుం

జేను అని శ్రుతి సర్వజగత్కారణ భూతునిఁగాఁ జెప్పుచుండ విష్ణుపాదతీర్థమును మోచుచున్నాడని యంత నైచ్యముగాఁ జెప్పుచున్నావే!

సూరే: విష్ణుపాదతీర్థధారణమువలన నైచ్యముఁ జెప్పుటలేదు అది శివునకు గొప్పతనమే సమకూర్చుచున్నది. కాని నైశ్రుతివాక్యము నకుమాత్రము మీయర్థము సరిగాదు. ఏమన సర్వత్ర శివాది శబ్దములు సామాన్యములై విశేషాకాంక్ష కలిగి యున్నవి. అనఁగా 'శివాస్తే సంధానస్సంతు' అనుచోట 'నీకుమార్గములు శివులగుగాక' యని చెప్పుముగదా! ఇంకేమన శుభములగు గాకయని యర్థము. ఇట మార్గమునకు శివశబ్దము విశేషణ మగుచున్నది. ఇట్లే లౌకికాలౌకిక వాక్యములందు, నితర సాధారణమై విశేషణమై సర్వశబ్దములనెల్ల "విశేషే పర్యవస్యంతి శబ్దే నారాయణాహ్వయే" సర్వశబ్దములను విశేషవాచకమైన యనఁగా నితర సాధారణమైన నారాయణ శబ్దమునం బర్యవసించుచున్నవి యన్నట్లు నారాయణునే చెప్పుచున్నది. "న బ్రహ్మ నేశానః" అను శ్రుతి శివుని నిషేధించియున్నదని పూర్వము చెప్పియుంటినిగదా కావున "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్థితః" బ్రహ్మాండముల యంతట లోపల వెలుపల వ్యాపించి నారాయణుఁ డున్నాఁడు అని ఘంటాఘోషముగాఁ జెప్పఁబడిన మహావిష్ణుఁ డుత్కృష్టుఁడు గాక పశుపతి యెట్లగును, కాదు.

పూర్వ: సరే గాయత్రి శివపరము కాకపోయినఁ బోవుగాక, "రఘునాథ తనయ స్థాపితారాధితత్వాత్" శ్రీరాముఁడు రావణవధఁ జేసి బ్రహ్మహత్యను బొందెను తచ్ఛాంతికై శివలింగమును సేతు తీరమందుఁ (రామేశ్వరమున) బ్రతిష్ఠించి యారాధించెనుగదా

రామరూపియైన విష్ణుని బ్రహ్మహత్యను బోగొట్టుటచే శివుఁడే యుత్కృష్టుఁడు

సి—శ్లో

శ్లో॥ వాల్మీక్యప్రోదితత్వాద్గిరిశను తిగిరాం తామసత్వాచ్చకాశ్యాం
రామాఖ్యాన్మంత్రజాపాదపిచ హనుమతః పుచ్ఛరోమే
శ్వరత్వాత్
సేతుత్రాణాయ యద్వాపరిజనవిధయాస్థాపనాదభ్థితీరే
రక్షోహత్యామదోషాద్గిరిశకృత నిజ బ్రహ్మహత్యా
నిరాసాత్ 3

అర్థ: రామునికి బ్రహ్మహత్య వచ్చినట్లును దానిని నివారింప శివలింగ ప్రతిష్ఠ చేసినట్లును వాల్మీకిప్రోక్తమైన రామాయణము నందు లేదు. రుద్ర మహత్వమును బోధించు పురాణాదులన్నియుఁ దామసములని చెప్పఁబడెను. కాశియందు శివుఁడే రామషడక్షరిజప మొనర్చెను. రామేశ్వరము రామేశ్వరము కాక యాంజనేయుని వాలమునందలి రోమములచేఁ నేర్పడిన లింగముగలది యగుటచే రోమేశ్వరమై యున్నది. ఒకవేళ శివలింగమును రాముఁడు ప్రతిష్ఠించినది వాస్తవమేయైనను భృత్యుని యజమాని తనకార్యమునందు నియోగించునట్లు తనభక్తుఁడైన శివుని సేతు రక్షణమునకై స్థాపించెను గాక రావణవధయందు దోషములేకపోవుటచే బ్రహ్మహత్య లేనే లేదు. పైగా బ్రహ్మశిరస్సునఱకుటచేఁ గలిగిన బ్రహ్మహత్యా దోషమును హరునకు నారాయణుఁడు బ్రహ్మ కపాలమునఁ దొలఁగించి యుండెను, కావున శివుఁడెట్లు ప్రకృష్టుఁడు.

౨—౨

పూర్వ: అయ్యో! రామాయణమునలేదా! సీతాసహితుఁడై పుష్పకమెక్కి వచ్చుచు రామచంద్రుఁడు సీతాదేవితో "అత్ర పూర్వం మహాదేవః ప్రసాదమకరోత్ ప్రభుః" ఇచ్చట నాచే నారాధింపఁబడి మహాదేవుఁడు (శివుఁడు) కరుణించెను అని చెప్పెనుగదా- ఏమయ్యా! మీమోసము.

సూరే: అదియా రామాయణవాక్యమునకర్థము అట్లయినచో "అత్ర పూర్వం=పూర్వము మేమువచ్చునప్పుడు అనిగదా చెప్పెను. అప్పటికి రావణ వధకాలేదు కావున బ్రహ్మహత్యవచ్చుటయుఁ దచ్ఛాంతికి లింగప్రతిష్ఠచేయుటయుఁ బొసగవు—మఱేమన, సేతు నిర్మాణమునకై మూఁడహోరాత్రములు, శ్రీరామచంద్రుఁడు సముద్రుని ధ్యానించి ఫలముగానక కోపమునొందఁగా నప్పుడు వచ్చి సముద్రుఁడు సేతునిర్మాణోపాయమెఱింగించెను గావున రాఘవుఁ డారాధించినది సముద్రుని ప్రసాదమొసర్చినదియు నతఁడే యావిషయము స్పష్టముగా రామాయణమునఁ జెప్పఁ బడియున్నది. ఆవిషయమునే సీతాదేవితోఁ జెప్పెను అంతే గాని శివునికచ్చట నేమియుఁ బ్రసక్తిలేదు మహాదేవశబ్దమున్నం దున నట్లు మీరు పొరఁబడుచున్నారు కాఁబోలు. మహత్— అని నీటికిఁ బేరు, (విశ్వకోశము) దానికిఁ బ్రభువుగాన, మహా దేవుఁడన సముద్రుఁడు శివకేశవులకు భేదములేదను మహే శ్వర తీర్థులుకూడ నచ్చట నట్లేయర్థముసేసియున్నాఁడు రామా యణముఁ జూచుడు యథార్థమిట్లుండఁగా నాపాలఁబడినటులై మీరు మాది మోసమనుట యన్యాయము.

పూర్వ: పోనీ రామాయణమున లేదేమో "అనుక్తమన్యతో గ్రా హ్యమ్—చెప్పనది మఱియొకదానివలన గ్రహింపవలయునను

న్యాయముచే నితరపురాణములయందుఁ జెప్పఁబడుటవలన లింగప్రతిష్ఠచేసిన విషయము నంగీకరింపవచ్చునుగదా

కూరే: వాల్మీకి ర్భగవద్బ్రహ్మా వాణీవాక్త్వస్వరూపిణీ చకార రామచరితం పావనం చరితవ్రతే; గాయత్ర్యాక్షరాణి చత్వారి ద్వేద్వేత్రీణ్యథ షట్క్రమాత్. చత్వారి సప్తకాండేషు స్థాపితాన్యక్షరాణి తు = బ్రహ్మయే స్వయముగా వాల్మీకి యాయెను సరస్వతియతని వాగ్రూపమునొందెను కాగా నతఁడు రామచరితమును వ్రాయుచు నేడుకాండములయందు గ్రమముగా మూడు నాలుగు, రెండు, రెండు, మూడు, ఆఱు, నాలుగు చొప్పున గాయత్రియందలి యిరువదినాలుగక్షరములిమిడ్చెను.(స్కాంద పురాణము) వేదఃప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా" రామాయణరూపమున వేదమే వాల్మీకిచేఁ బ్రకటింపఁబడెను, "పుణ్యం వేదైశ్చ సమ్మితం = పరమ పవిత్రము వేదసమ్మితము అని ప్రశంసింపఁబడినదియు బ్రహ్మవరముచే యథార్థముగా రామచరితము నెఱింగిన వాల్మీకిచే రచింపఁబడినదియు సత్యం వాల్మీకి నాస్మృతం—వాల్మీకిచేఁ జెప్పఁబడినదంతయు సత్యమే. అని ప్రసిద్ధినొందినదియు వాల్మీకి రామాయణమే అదియే రామచరితమునకుఁ బ్రధానము దానికి విరోధము లేక యన్యపురాణములయందుఁ జెప్పఁబడిన రామవిషయమును గ్రహింపవచ్చునుగాని, విరోధమున్నయెడల గ్రహింపవీల్లేదు పైవిషయము, విష్ణుపరత్వజ్ఞాపకములయందు నగ్రేసరమైన రామాయణమునకు విరుద్ధమగుచున్నందున సత్యముకాదు మఱియు నిట్లసంబద్ధముగా సాత్త్వికవిరుద్ధముగా రుద్రమాహాత్మ్యమును బ్రకటించుశాస్త్రములు "యచ్ఛాస్త్రం లింగపారమ్యం వామదేవముమాపతిం, తమఃప్రవర్తకం వక్తి తత్తామసము దాహృతం—ఏశాస్త్రము లింగమహిమను జెప్పునో యేది తమః

ప్రవర్తకుఁడైన శివుని భగవంతునిగా వాకొనునో యది తామస శాస్త్రము (గారుడపురాణము). "మాత్స్యం కౌర్మం తథా లైంగం శైవం స్కాందం తథైవచ ఆగ్నేయంచ షడేతాని తామసాని నిబోధత" మత్స్య కూర్మ లింగ శైవ స్కాందా గ్నేయ పురాణము లాఱును తామసములు. అవి శివమహిమను ప్రతిపాదించుటచేఁ దామసములనియు, "యా వేద బాహ్యాస్స్మృతయో యాశ్చ కాశ్చ కుదృష్టయః సర్వాస్తా నిష్ఫలాః ప్రేత్యతమోనిష్ఠాహితాః స్మృతాః" వేదబాహ్యము లైన స్మృతులు కుయుక్తులుగల మతములు తామసములు. వానివలనఁ బ్రయోజనములేదు. (మనుస్మృతి) అని యుక్తి వానిని గ్రహింపరాదని యు నుండుటచే సాత్త్వికవిరుద్ధమై తామసోక్తమైన పైవిషయము సత్యమనుటకు వీలులేదు. మఱియు శివస్థానములయందుఁ బ్రధానమగు కాశియందు శివుఁడు సదా రామతారకమంత్రమును జపించుచున్నటులు శాస్త్రములు చెప్పుచున్నవి. అట్టిశివుఁ డెట్లు రాముని బ్రహ్మత్వఁ దోలఁగించును. రాఘవుఁడెట్లు ప్రతిష్ఠించును.

పూర్వ: వారణాసియందు శివుఁడు జపించు తారకమంత్రము ప్రణవమేకాని రామమంత్రముకాదు. ఈవిషయమును స్కాందాంతర్గతమైన కాశీఖండము చెప్పుచున్నది చూడుము.

కూరే: ప్రణవమేయైనను నాయోంకారము విష్ణుపరమని చెప్పియే యుంటిని. కాక స్కాందము పైప్రమాణములచేఁ దామసమై యనాదరణీయ మగుచున్నది. కావున మనవిషయమున "శ్రీరామాయనమః కాశ్యాంజాప పరమేశ్వరః" శ్రీరామాయనమః అనుమంత్రమును కాశియందుఁ బెక్కేండ్లు శివుఁడు తపంబాచరించెనుఅని మొదలువెట్టి "యే లభంతేమధురం అచ్చటనున్నవారును శివునివలన రామషడక్షరీమంత్రో

పదేశమును బొందుచున్నారు. "జపంతో మంత్రసిద్ధాస్స్యాః" ఆరామమంత్రమును జపించి వారు ముక్తి కేగుచున్నారు అని శివుఁడొనర్చినది రామమంత్రజపమేయనియు నామంత్రబలము చేతనే యట మృతులైనవారు మోక్షముఁ జెందుచున్నా రనియుఁ జెప్పిన రామోపనిషత్తు ప్రమాణము.

పూర్వ: అయితే రాఁముడు లింగప్రతిష్ఠ చేయకపోయిన నచ్చటి శివ స్థానమునకు రామేశ్వరము (రామునిచేఁ బ్రతిష్ఠింపఁబడిన శివుఁడున్నచోటు) అను ప్రసిద్ధి యేలవచ్చెను ? లోక వ్యవహారము నొకప్రమాణమేగదా ?

సూరే: అది రామేశ్వరముగాదు. రోమేశ్వరము. పూర్వము యజ్ఞవాటీ పరిశుద్ధికొఱకుఁ బురుషమృగమును గొనితెమ్మని ధర్మరాజు భీమునిఁ బంపఁగా నతఁడుపోయి మార్గమధ్యమునఁ గనఁబడిన హనుమంతునితోఁ దనవృత్తాంతము చెప్పఁగా నామృగవేగ నివారణార్థము హనుమ తన తోఁకయందలి రోమములు కొన్నియిచ్చెను. వానినిఁగొని పురుషమృగమునకు సంకేతమొనర్చి వెనుదిరిగి భీముఁడు వచ్చుచుండెను. ఆమృగమును వెంటఁబడెను. సమీపింపఁగనే యొకరోమము నచటఁబడవేయఁగా నది లింగమాయెను. దానిని పూజించుటతో మృగమునకుఁ గొంతయాలస్యమాయె, మరల వెంబడింపఁగా మఱియొకరోమమును భీముఁడు పడవైచెను. దానిని కూడఁ బూజించుచుండఁ గొంతయాలస్యమాయె నిట్లు యజ్ఞవాటిపర్యంతమునచ్చటచ్చట హనుమత్పుచ్ఛరోమములవేయుచు గము నివారించుచు మృగమును భీముఁడు గొనివచ్చెనువే అని భారతగాథచెప్పుచున్నది. భీముఁడు పడవైచినరోమములలో నొకటిసేతుసమీపమున లింగమైయున్నది. దాననది రోమే

శ్వరమని ప్రసిద్ధివడసి కాలక్రమమున మాఱి రామేశ్వరమాయెను.

పూర్వ: అయితే, రాముఁడు లింగప్రతిష్ఠ చేసెనని చెప్పు పురాణముల నేమిచేసెదవు,

కూరే: ఏమిచేసెదను, "పాశినదే పాకరా పాచివన్లదానుఁడా" యన్నట్లు, అవితామసపురాణములనియు సత్యములుకావనియు పలుసారులుచెప్పితిని, మరల మీరు దానినేయడుగుచుంటిరి, పోనిండు రాముఁడు లింగప్రతిష్ఠచేసెననియే యొప్పుకొందును గాని యది యావగింజంతమాత్రము పనికిరానిదైన మీకుఁ జేయదెట్లనిన సేతురత్నముకొఱకు, "హస్తేతుమాలాహృది రామతత్త్వం జిహ్వాగ్రమూర్ధే పరరామమంత్రం, యస్యస్తకే కేశవపాదతీర్థం శివంమహాభాగవతంస్మరామి" చేతనతుమాలయు హృదయమున రామతత్త్వమును, నాలుకకొనయందు రామమంత్రమును, శిరస్సున విష్ణుపాదతీర్థమును గలిగి మహాభాగవతుఁడైన శివునిధ్యానించెదను అన్నట్లు తనభక్తుఁడైన శివుని స్థాపించెనేగాని బ్రహ్మహత్యా నివారణార్థముకాదు మఱియు "అహం మర్త్యావతారేషు త్వాంచరుద్ర మహాబల, తామసానాం మోహనాయ పూజయామి యుగే యుగే, దేవకార్యనిమిత్తేషు మానుషత్వముపాగతః—త్వామేవారాధయిష్యామి. త్వంచమే వరదో భవ, =రుద్రుఁడా నేను నామానవావతారములయందుఁ దామసజనమోహనమునకై నిన్నుపూజించుచుందును, నిన్నేయారాధించెదను, నీవును నాకువరములిచ్చువాఁడవు కాఁగనుపట్టుము "ఏవం వేదహితార్థాయవృత్తిం వేదవిగర్హితాం, విష్ణోరాజ్ఞాంపురస్కృత్యకృతం భస్మాస్థిధారణం" పార్వతీ—ఇట్లు వేదహితముకొఱకు వేదగర్హితమైన వృత్తినవలంబించితిని, మఱియు దేవదేవుఁడైన యామహావిష్ణుని

యాజ్ఞచే నిట్టి భస్మాస్థిధారణమునకుఁ దలయొగ్గితిని, = ఇట్లు పాద్మవరాహ పురాణాద్యుక్తవిధమునఁ దామస జనమోహనార్థమై రాముఁడు లింగప్రతిష్ఠ యొనర్చెనేగాని బ్రహ్మహత్యానిరాసార్థముగాదుఁ. అసలు, రామునకు బ్రహ్మహత్య యెక్కడిది? రావణునకు బ్రహ్మత్వమెచట? రావణుఁడు, మద్యరక్తపానమానుషమాంసాశనాగమ్యాగమనాది దురాచారములయందు నగ్రేసరుండగుటచే నాచారముచే నతనికి బ్రహ్మత్వములేదు, సుమాలియను దానవుని కూఁతురైన కైకసియందు జనించుటచే క్షేత్రవశమునను బ్రహ్మత్వములేదు భగవద్ద్రోహియైన హిరణ్యకశిపునంశముచే జనించుటవలన నంశముచేతనులేదు అసురవేళయైన సంధ్యాకాలమునఁ బుట్టుటచే జన్మకాలవిశేషముచేతనులేదు క్షేత్రమైన కైకసియందుపయుక్తమై వ్యర్థమగుటచే విశ్రవసుని రేతస్సంబంధము చేతను బ్రహ్మత్వములేదు.

పూర్వ: పోనీ పైవానిచేత బ్రహ్మత్వములేకుండిన నుండుఁగాక నవకోటి శివలింగములను, ప్రత్యహము పూజావందనాదులచే రావణుఁ డర్చించెఁగదా! అట్టి శివార్చనచే బ్రహ్మత్వము రావచ్చునుగదా!

కూరే: రుద్ర తత్పుత్రతద్దాస యక్షగంధర్వరాక్షసాః బాహ్యానిదేవతాన్యేవ తామసాః పరికీర్తితాః = రుద్రుఁడు తత్కుమారులు, రుద్రభక్తులు యక్షగంధర్వరాక్షసులు, దేవతాబాహ్యులు తామసులు అనియుండుటవలన శివపూజచే రావణునకు రావలసిన బ్రహ్మత్వమేమాత్రమును రాలేదుగాని తామసత్వము మాత్రము పూర్తిగావచ్చినది, కావున మహాదుష్టుఁడైన రావణునిఁ జంపుటచే రాఘవునికి సర్ప వృశ్చికాదులఁ జంపిన వానికే భంగి సుకృతమేగాని బ్రహ్మహత్యలేదు— లేని బ్రహ్మహత్యను శివలింగప్రతిష్ఠచేఁ బోగొట్టుకొనవలసిన పనియులేదుగదా

పూర్వ: అయితే రాముఁడు లింగప్రతిష్ఠచేసి బ్రహ్మహత్యను బోఁగొట్టు
కొనలేదనియే చెప్పుదువటయ్యా.

కూరే= ముమ్మాటికిఁ జెప్పెదను నేనేకాక వినఁగూడఁ జెప్పెదనియు
జెప్పెదను మఱియొక్కటి, "స్వయంతీర్ణః పరాంస్తారయతి,
తాను తరించిగదా యితరులఁదాఁటింపవలయును. శివుఁడు
పూర్వము పార్వతీ పరిణయవేళ బ్రహ్మశిరస్సునొకదానిని
ద్రుంచి బ్రహ్మహత్యచే నల్లాడుచుండఁగా నారాయణుఁడు
బదరికాశ్రమమున నొకగృహస్థుఁడైయుండి లక్ష్మిచే భిక్షము
వెట్టించి బ్రహ్మహత్యను బోఁగొట్టెను, హరుని కరతలమంటి
యున్న బ్రహ్మ శిరస్సప్పుడు రాలిపడియె. నట్టికపాలపతన
దేశము బ్రహ్మకపాలమనుపేరుతో నిప్పుడును వ్యవహరింప
బడుచున్నది. కావలసియున్నఁ దంను, శివుని చేతికపాలమునుఁ
గూడనచ్చటఁ జూపించెదను — ప్రమాణము కావలసియున్న—
"పురాకిల మహాదేవో మహాత్మా బ్రహ్మహత్యయాకపాలీ
సన్ మహాకాలం, చరన్మాధవమాశ్రితః తత్పత్న్యాస్తు మహా
లక్ష్మ్యాభిక్షయాకర దత్తయావిమోచిత శివఖ్యాతా శ్రీరామ
వసంహితా= అని శ్రీరామ సంహిత చెప్పుచున్నది. ప్రయాగ
మాహాత్మ్యము సవిషయము చెప్పుచున్నది. ఇట్లు తనబ్రహ్మ
హత్యఁ బోఁగొట్టుకొనలేక నారాయణు నాశ్రయించిన శివుఁడు
రాముని బ్రహ్మహత్యను బోఁగొట్టెనట = "తాను దూరఁగ్రంత
లేదు తనమెడకొకడోలా? చాలుమఱియు

శ్లో॥ కాండూర్ణాంగూర్ ప్రయాగాదికనగర మహాపాపనాశాది దేశా
దిష్వీశానేనహత్యా నినహావిహతయేస్థాపితారాధితత్వాత్
గౌరీశేప్యాసభంగాదఘరఘుపతి సందర్శితాద్వైశ్వరూప్యాత్
కాశ్యాః కృష్ణేన దానాదపి న పశుపతిర్విష్ణుగేన ప్రక్లృప్తః 4

తిరుక్కాండూరు తిరుణాంగూరు ప్రయాగ ప్రముఖ పాపనాశన స్థానములయందు బ్రహ్మహత్యా నివారణార్థము కేశవుని స్థాపించి భవుడు పూజించినందువల్లను. "కాశీ కేశవనిర్మితా ఆనందనే పుణ్యక్షేత్రే సంప్రతిష్ఠాప్య కేశవమ్ బ్రహ్మతన్నామతః కాశీ, సంజ్ఞయా సంజ్ఞితం పురం కేశవేనాభ్యనుజ్ఞాతో, విశ్వనాథాయ దత్తవాన్" బ్రహ్మదేవుఁడు కాశియను పురమును నిర్మించి కేశవానుజ్ఞచే విశ్వనాథున కొసంగెను. పురాణగాథవల్లను విష్ణువే సర్వోత్కృష్టుఁడు.

శ్లో॥ విద్యారణ్యోజ్ఝితత్వాన్నమక చమకయోర్వేద భాష్యేతదర్థ
వ్యాఖ్యానాద్దక్షయాగే హరచకిత సురోదీరితైస్తత్స్తుతిత్వాత్
విష్ణావామ్నాయవాచామపి సకలగిరాం ముఖ్యవృత్తేశ్చతస్మిన్
శంభోర్నామా ప్రయోగాత్ క్వచిదపి చమకే విష్ణుశబ్ద
ప్రయోగాత్ 5

నమకచమకములచే రాఘవునిచే శివుఁడారాధింపఁబడెననుటకు నిరాసము. వేదభాష్యమొనర్చు విద్యారణ్యులవారు నమక చమకములను వ్యాఖ్యానింపక విడుచుటవల్లను మఱియు నవి దక్షయాగమునందు రుద్రునకు భయపడిన నిర్జరులచేఁ జేయఁబడిన స్తోత్రము లగుటవల్లను వేదవాక్యములును సమస్త శబ్దములును విష్ణువునందు ముఖ్యవృత్తిగాఁ జెల్లుచుండుటవల్లనుఁ జమకమునం దెచ్చటను శివశబ్దప్రయోగాభావమువల్లను, అగ్నావిష్ణూ అని యుండుటవల్లను విష్ణువే సర్వోత్కృష్టుఁడు.

శ్లో॥ తేనైవ న్యాయరీత్యా సపరికరహరేః ప్రార్థ్య భావాభిధానాత్
బాహుళ్యా ద్దేవమాద్యైరనఘ రఘుపతేరేవ సంసేవ్యతోక్తేః
మాహింసీర్మన్యుంచ ధన్వేత్యపి నమకగిరా ఘోరరూపస్య శంభో
ర్మన్యోస్తుల్యోక్తి సిద్ధేరపిన పశుపతిర్విష్ణురేవ ప్రకృష్టః 6

సపరికరుఁడైన హరియే పూజనీయుఁడని రుద్రునిచేఁ జెప్పఁబడుటవల్లను అద్యుఁడై పాపరహితుఁడై స్వసేవ్యుఁడైనవాఁడు శ్రీరాముఁడే సేవ్యుఁడని హరుఁడు చెప్పుటవల్లను, 'మాహింసీర్మన్యుంచ ధన్వ' యనెడు నమకవాక్యముచే రుద్రునకు మన్యువనెడు దేవతకు సామ్యము సిద్ధించుటవల్లను విష్ణువే సర్వోత్కృష్టుఁడు.

శ్లో॥ ఘంటాకర్ణా ఘనాశాత్సుమహతి హరివంశే విరించి స్మరారి
స్కందానాం శౌరివంశే క్రమజని కథనాత్కేశవస్తోత్రమధ్యే
తజ్జాతస్యాభిధానా త్తదనుపురభిదాత త్పదాంభోజపాంసో
ర్మౌళౌ సంధారితత్వా త్పునతరభజనాయోగ్యభావాచ్చపాత్రాత్

'శౌరేః కైలాసయాత్రా వ్రత ముదితతయాభీష్ట సంతానదానాత్త'' ని పూర్వపక్షులిచ్చిన యాక్షేపణమునకు నిరాసము.

ఘంటాకర్ణుఁడను రాక్షసుఁ డితర దేవతానామ మాకర్ణింపఁ గూడదని వ్రతంబుఁబూని శివోపాసనచేసి ప్రసన్నుఁడైన రుద్రునిఁగాంచి మోక్షంబిమ్మని యాచించె నంత నద్దేవుఁ డతనితో దానవా! 'మోక్షమిచ్చెన్నన్నఁడందాత్త'ను ప్రమాణము వలన మోక్షదాయకుఁడు జనార్దనుఁడేకాని నావల్లఁ గాదతని నాశ్రయింపు మద్దేవుం డిపుడు కృష్ణావతార మెత్తి యున్నాఁడని వాసుదేవ ద్వాదశాక్షరి నుపదేశింపఁగా నవ్విభావరీచరుఁడు దానిజపించె నటుపిమ్మటఁ గొంతకాలంబునకు రుక్మిణీపతి యన్నిశాచరునకు సాక్షాత్కరించి తత్కృత జీవ

హింసానరమేధాదులవల్లఁ గలిగినపాపంబు నశింపఁజేసియుత్తర సాక్షికి మోక్షంబిచ్చుటవల్లను, హరివంశమునందు, "భర్గశ్చతు ర్భుజ ఇతివ్యథయాలమాలి" "తన్నాభిజాత మవగచ్ఛ చతు ర్ముఖంచ తస్మాచ్చపంచవదనోఽజని షణ్ముఖోఽస్మిన్" విష్ణు నాభియందు బ్రహ్మ జన్మించెను వానివలన రుద్రుండును రుద్రునివలనఁ గుమారస్వామియు జన్మించెననియుండుటవల్లను శివుండు శ్రీకృష్ణునిఁగూర్చి చేయు స్తోత్ర మధ్యమునందు "క ఇతి బ్రహ్మణోనామ, ఈశోహం సర్వదేహినాం ఆవాం తవాంగ సంభూతౌ, తస్మాత్కేశవ నామవాన్" క=అనఁగా బ్రహ్మ సర్వ భూతములకునుఁ ప్రభుండగు నే నీశుం డను మేమిద్దఱము నీశరీరంబునఁ బుట్టినందున నీవు కేశవాభి ధానుఁడవైతివని కీర్తించుటచేతను దానికనుకూలముగా నమ స్కరించునప్పుడు శ్రీకృష్ణపాదధూళి శిరస్సున ధరించుట చేతను మఱియు రుద్రుఁడు "దేవేషుమాం సుపూజ్యార్థం త్వయాకృతమిదంమమ అద్యమే మకుటారూఢం త్వత్పదాబ్జ మిదంహరే" ఓకృష్ణా! దేవతలయందు నన్నుఁ బూజ్యునిఁ జేయందలంచి నన్నుఁగూర్చి నీవు తపంబు చేసితివి. ఇప్పుడు నీపాదాబ్జములు నామకుటము నారోహించినవని స్తుతించెను. "పార్థోపనీతం మధుసూదనస్య పాదారవిందార్పిత చిత్రపుష్పం దదర్శ గంగాధరమౌళిభాగే బభూవ వీరః కృతనిశ్చయార్థః" పార్థుఁడు తాను సంధ్యాకాలంబున శ్రీకృష్ణుని చరణంబుల యందుఁ బూజించిన నానావర్ణ పుష్పంబులు శివుని శిరోభా గమునందుఁడఁగాఁజూచె నంతేకాక యాకసంబునకు విష్ణుపద

మని, శివునకు శిరస్సని శాస్త్రోక్తికలదు. కావుననే సీ॥ హరి పదంబును నీకు శిరమునసైన నభం, బున నభోగతులుంచు ననలనంగ నని వసుచరిత్రకారుఁడు నతుత్రవర్ణన మొనర్చెను.

శ్లో॥ వారాహోద్యుక్తరీత్యాస్వకలితవర నిర్వాహహేతో స్తథైవా
నుష్ఠానాద్వర్ధ దేవార్చన విధిషుమనుష్యావతారేష్వదోషాత్
తాదృక్పాదాబ్జధూళీభరణజుషి హరేమూలభూతేముకుంద
స్యాత్యాధిక్యాదనాదేరపి న పశుపతిర్విష్ణు రేవప్రకృష్టః 8

వరాహపురాణములో రుద్రగీతయందు రుద్రుఁడువిష్ణునిఁ గూర్చి "మర్త్యోభూత్వా భవానేవం, మామారాధయ కేశవ మాంభజస్వచ దేవేశ, వరంమత్తో గృహాణచ" ఓవిష్ణు దేవా ! దేనిచేత నేను పూజ్యుడనౌదునో యట్టియుపాయ మాలోచించి నీవు మర్త్యుఁడవై నన్నారాధింపుము. దేవేశా ! నాచే వరమునుఁబొందుమని చెప్పెను. దానికనుకూలముగాఁ గేశవుఁడు "దేవకార్యావతారేషు, మనుష్యత్వ ముపేయి వాన్ త్వామేవారాధయిష్యామి, మమత్వం వరదోభవ" ఓపినాకీ! నేను దేవకార్యార్థము మనుష్యుడనైఁ పుట్టి నిన్నే యారాధింతు నాకు వరములిచ్చువాఁడవు కమ్మని చెప్పెను. కావున దానినిర్వహించుటకు మధువైరి మనుష్యా వతారమెత్తెను. మనుష్యుఁడైనవాఁడు వృద్ధులను దేవతలను నారాధింపవలసియుండుటచే రామ కృష్ణా ద్యవతారముల యందు దశరథ వసుదేవాదులను వసిష్ఠ విశ్వామిత్ర సాందీ పన్యాదులనుఁ బూజించె నట్లే శివునిఁ బూజించెంగాని పరత్వ

బుద్ధిచే యజింపలేదు. మఱియు శివాంశముచే జనించిన యశ్వత్థామ బాణాగ్నిచే దగ్ధుండగు పరీక్షిత్తును శ్రీకృష్ణుఁడు బ్రతికించెను. శ్రీకృష్ణ పాదపాంసువు రుద్రుఁడు శిరంబున ధరించెను. "ఏకోహవై నారాయణ ఆసీత్ న బ్రహ్మా నేశానః, నేమేద్యావాపృథివీ" అని వేదము. పంచమవేదమగు భారతానుశాసనికపర్వమునందు "ప్రజాపతిం రుద్రంచాప్యహమేవ సృజామివై తౌతుమాం నవిజానీతో మమ మాయావిమోహితౌ" బ్రహ్మను రుద్రుని నేను సృజించితిని. మదీయ మాయా మోహితులై వారు నన్నెఱుంగరని నారాయణుఁడే చెప్పియున్నాఁడు. కావున విష్ణువే సర్వోత్కృష్టుఁడు.

శ్లో॥ పూర్వంచక్రస్య సత్వాద్ధరిభజనకృతాపేమపుష్పైస్సహస్రైః
శూలార్థం శూలినైక ప్రసవసమనిజచ్ఛిన్ననాసార్పితత్వాత్
చక్రాచ్ఛూలాయుధాప్తేఽపి మయకరతోఽగస్త్య సత్వం హితోక్త్యా
చక్రత్రాసాద్ద్రుతత్వాదపి న పశుపతిర్విష్ణురేవప్రకృష్టః

హరుఁడు జలంధరాసుర వధార్థము చక్రము విష్ణునకిచ్చెనను నాక్షేపమునకు నిరాసము. జలంధరాసురవధకుఁ బూర్వమే వైకుంఠాదిరూపములకుఁ జక్రత్వముండుటచేతను, ఋగ్వేదాష్టమానువాక తృతీయాధ్యాయాదులయందును యజుర్వేదారణ్యకాది ప్రశ్నైకాదశానువాకమునందును. సామవేదోత్తర బుజ్జనమాధ్యాయమునందును నారాయణుఁ డాదినుండి శంఖచక్రాదిదివ్యాయుధములుగలవాఁడని చెప్పఁబడియున్నది. వరాహపురాణోత్తరఖండంబున భగవచ్చక్రానాదిత్వమే చెప్ప

చున్నది. 'శ్రీకృష్ణుఁడు పంచజనుఁడను రాక్షసుని సంహరించి యొక పాంచజన్యముఁ గైకొనెనన్నరీతి నొకానొక యవతార మునందు శూలిచేఁ జక్రముగొనెనని చెప్పినను చెప్పవచ్చును. అదియట్లుండఁగాఁ బాంచరాత్రమునందు, "శ్లో॥ హాంపేయ పుష్ప సాహస్రై రర్చయన్ శంకరో హరిమ్ ఏకస్యైక ప్రసూనార్థం, స్వనాసామచ్ఛినత్స్వయమ్ దృష్ట్వాతద్భక్తి మతులాం హరిఃప్రీతో వరందదౌ లబ్ధలింగాచ పూజ్యాచ భూయస్త్వందం పతీయవామ్ శూలార్థము శూలి సహస్రహాంపేయపుష్పంబులచేఁ హరింబూజించి యొక్కపుష్పము తక్కువకాగాస్వకీయ నాసికనుఁ బెరికియర్పించెను. మితిలేనియాభక్తికిమెచ్చి విష్ణువుపార్వతీశివులంగాంచి లబ్ధచిహ్నములుగలవారై పూజ్యులై మీరెం పతులుండుదురుగాక యనియు శూలంబిచ్చెననియుం గలదు. వెండియు శివశూలము మయనిర్మితంబని గ్రంథాంతరమునఁ గలదు. సుదర్శనశతకమునందు.

శ్లో॥ నిర్వ్యాననిర్వేవ కాశీదవశిఖి జటిలజ్యోతిషాయేన దాహం
కృత్వాస్కృత్యావిలిత్యశలభ సులభయా యత్రచిత్రప్రభావే
రుద్రోప్యాద్రేర్గుహాత్రా సహగహనగుహం యద్భయాదభ్యయాసీ
ద్దిశ్యాద్విశ్వార్చితో వత్స శుభమని భృతం శౌరిహేతిప్రతాపః

భావము: ఏచక్రాగ్నిచేతఁ గాశీపురము దావాగ్నిచే నరణ్యమువలెఁ గాలెనో దేనియొక్క నానావిధమయూఖకాంతిచేఁ గాశిరాజనిర్మిత కృత్తి శలభమువలె సులభముగా భస్మమయ్యెనో యేచక్రరాజమునకు భయపడి భవానిరుద్రులు గహనగుహాప్రవేశము చేసిరో యట్టి విశ్వార్చితంబగు సుదర్శనము మీకు మిక్కిలి శుభంబు లిచ్చుఁగాకయని చెప్పఁబడియున్నది, కావున సహజ శంఖచక్రధారియగు విష్ణువే సర్వోత్కృష్టుఁడు.

శ్లో॥ పుష్పేష్వాస ప్రణీతాదపిచ పురభిదః పౌరుషార్థావశేషా
త్కీర్తి శ్రీకామ కామాతుర హరవిగలత్పారదౌఘ ప్రవాహాత్
దంపత్యోర్వాత్మదాసాయిత భృగువిహితాల్లింగ విచ్ఛేదనాచ్చా
నంగ ప్రధ్వస్త భావాదపి న పశుపతి ర్విష్ణురేవ ప్రకృష్టః 10

"కందర్పధ్వంసకత్వాత్త"ని పూర్వపక్షులిచ్చిన యాక్షేపమునకు నిరాసము. మన్మథుఁడు పుష్పమునే ధనుస్సుగాఁ ధరించి యాస్వల్పసాధనముతో సర్వలోకములను జయించుచున్నాఁడు. అట్టే కీర్తి సంపదలనుఁ గోరిన పంచాస్త్రునిచేఁ బీడితుఁడై శూలధరుఁడు జాయకులొంగి యర్ధనారీశ్వరుఁడయ్యెను వెండియు హరుండు కందర్ప వ్యథ భరింపలేక విడిచిన వీర్యము పాదరసమై ప్రవహించెను. దర్పక జననీజనకులకు దాసుండగు భృగుమహర్షి రుద్రాణీరుద్రులకు లింగవిచ్ఛేదమగు నట్లు శపించెను కీర్తిశరీరుఁడగు ననంగుఁడే రుద్రుని జయించెను గనుక విష్ణువే సర్వోత్కృష్టుఁడు

శ్లో॥ స్తోత్రప్రీతాతిశుభ్రాకృతిదనుజ భిదుచ్ఛిష్టహాలాహలాణు
స్వీకారశ్యామభావాద్గిరిశగలభువః కేశవేనైవపూర్వమ్
అస్తోకక్ష్వేళభుక్తేరఖిలనిజవపుః కృష్ణతాసూచితత్వా
త్తార్క్ష్యధ్యానోపరోధాదపిన పశుపతిర్విష్ణురేవప్రకృష్టః

హాలాహలభక్షణంబుచే శివుండుగొప్పవాఁడని యిచ్చిన ప్రశ్నెమునకు నిరసనము, 'పాలసంద్రంబునఁ గాలకూటంబుద్భవింపఁగా నప్పటికి శశివర్ణంచతుర్భుజమ్మని స్తుతింపఁబడుచున్న నారాయణుఁడు ద్వితీయ పారావారంబు భంగిఁబ్రవహింపుచున్న హాలాహలంబు నంజలి మాత్రముగాఁ గ్రోలియల్పజ్ఞులగు దేవతలచేఁ బ్రార్థింపఁబడిన శివుండువచ్చువఱకు నతనికిఁగోపము రాకుండ నీషణ్మాత్రముంచెను తావన్మాత్రమునుఁ గ్రోలి

భవుండు సహింపలేక గరుడధ్వజ మంత్రము జపింపఁగా హాలాహాలంబు నిర్విషంబై కంఠంబుననిలిచె నక్కారణంబున శివుండు శ్రీకంఠుఁడయ్యెను విష్ణువు విషంబంతయుఁ గ్రోలినందున హంసావతార హయగ్రీవావతారములయందు శుభ్రవర్ణుండగు జనార్దనుండు నీలవర్ణుండయ్యె నిక్కథ పద్మపురాణోత్తర ఖండంబునందును గరుడపురాణంబునందును గలదు కాఁబట్టి విష్ణువే సర్వోత్కృష్టుఁడు

శ్లో॥ కాలస్యానశ్వరత్వాదథ జగతియమస్యాధునా సంస్థితత్వా
దారణ్యాద్యానువాకే హరవధకథనా దృష్టమాద్యానువాకే
కాలాత్స్వరాట్ సహాయాత్పృథగపిని ధనఖ్యాపనాత్తస్యమూర్ధ
స్సుత్రేత్వభ్యాంచ సంధేరపిన పశుపతిర్విష్ణునేవ ప్రకృష్టః 12

రుద్రుండు కాలునిఁ జంపెననుదానికి నిరాసము. జనార్దన విభూతి భూతులగు కాలాంతకాదు లశాశ్వతులుగాని యాగమములు సెప్పుచున్నవి. తదనుకూలముగా యముం డిప్పటికి జీవించియున్నాడు. "తస్యేంద్రో వజ్రహస్తేన ధనుశ్చాస్యమచ్ఛినత్స్వయమ్ ఇత్యాదిభ్యః" "యన్నిషేధాగా ప్రపన్నేనసాంహితంపూర్వ వత్కృతమ్, యథా మన్యుకృతేక్రస్య యజ్ఞధ్వంస కృతస్త్వయా, తథాహంతే కరచ్ఛిత్వా ఇత్యుక్తితః స్థితో మయా, తతస్త్వాం ప్రార్థయామాస మమాంఘ్రిప్రాయపాపహా తథాతేన ప్రసాదేన, ప్రాణాన్ లేభేభవాంఛివ" శివా! మద్భక్తుండగు నింద్రుని క్రతువును నీవుధ్వంసించితివి. దానిచే నిన్నుఁజంపితిని మరలఁ బార్వతి నన్ను స్తుతించి నిన్నువ్వని కోరఁగా నామె ప్రార్థనచేఁ బ్రాణంబులిచ్చితినని కేశవుఁడు సెప్పెను. ఇదియిట్లుండఁగాఁ గాలుండు శూలికి నిధనంబుఁ గూర్చెననియుఁ దదీయాధ్వరమునందు నచ్చిన దేవతలు రుద్రుని

శిరంబు నతికించిరనియు నష్టమాధ్యాయానువాకమునందు గలదు. ఇంతేకాక బలి వృత్రాదులచే బాధితుండగు నింద్రుని గైటభాదులచే గష్టమొందిన విరించిని భృగు శాపాదులచే పీడితుండగు రుద్రునిం రక్షించినందున విష్ణువే సర్వోత్కృష్టుఁడు.

శ్లో॥ గీర్వాణస్తోమదత్తస్వ పశుపతి పరాత్సిద్ధతా దృగ్రసార్థం
గోరూపత్వాచ్చవిష్ణో శ్శివకలిత జటాస్వాహామతో బౌద్ధవేషాత్
దైత్యారేర్ముఖ్యహేతూభవదిషుకలనాద్విష్ణు సత్వంజఃస్య
ప్రాగీశానాత్రి తత్వాదపి న పశుపతి ర్విష్ణురేన ప్రకృష్టః

శివుండు త్రిపురాసుర సంహారము చేసినందున గొప్పవాఁడని చెప్పినదానికి నిరాసము. త్రిపురాసుర సంహారమునకు శక్తి చాలదని శంకరుఁడు శంకింపఁగా దేవతలందఱు స్వకీయ శక్తి తేజస్సులలో భాగమిచ్చిరి, అప్పటికి ధైర్యములేకపోగా సమర సామగ్రి సారవంతముగా నుండునట్లు చేసెదమని చెప్పి వేల్పు లాలోచించి భూమిని శతాంగముగా వేదములను గుఱ్ఱము లుగా మేరువును శరాసముగా నాదిశేషు నల్లెత్రాడుగా బ్రహ్మను సారథిగా నియమించిరి. పినాకపాణి త్రిపురంబులపై కేఁగి రాక్షసుల వధింపుచుండఁగాఁ జచ్చినవారు కొంతసేప టికిఁ బునర్జీవితులై ఢీకొనుచుండిరి. దానింగాంచి పార్వతీపతి నిర్విణ్ణుండు కాఁగాఁ గేశవుఁడు గోరూపమును ధరించి విరించిని దూడగాఁజేసి మయనిర్మిత కూపప్రాంతమున మేయుచు నిశాట పునర్జీవన హేతువగు రసాయనంబును దీర్ఘజిహ్వాలో నిశ్శేషముగాఁ బీల్చెను. తదుపరిఁ గొందఱు రక్కసులం జక్కాడి భవుం డలసటఁజెందెను, తదవసరంబున గోవిందుఁడు శివ జట నొక్కటి తెంచి స్వాహానముసేసి బౌద్ధవేషధారియై యశ్వత్థస్వతూలింగనముచేఁ ద్రిపురాసురభార్యల పాతి

పాతివ్రత్యభంగము గావింపఁగా నప్పటికి రాక్షసులు వధింప సాధ్యులుకారైరి. తరువాత రుద్రుండు విష్ణుపంజరమను మంత్రము జపింపఁగా జనార్దనుఁడు బాణరూపమును ధరించి త్రిపురాసురుల వధించెను. కాబట్టియే "త్రిపురం జఘ్నుషః పూర్వం, బ్రహ్మణా విష్ణుపంజరమ్ శంకరస్య మునిశ్రేష్ఠ, రక్షణాయ నిరూపితమ్" విష్ణుపంజరంబను మంత్రము త్రిపురాసుర సంహారకాలమందు రక్షణార్థము రుద్రునకు బ్రహ్మచే నిరూపింపఁబడెనని విష్ణుధర్మమునందును, "విష్ణురాత్మా భగవతో భవస్యామితతేజసః" అని కర్ణపర్వమునందును, "బలం హంతుం ప్రయాతస్య, తత్త్వథా విష్ణుపంజరమ్ వాగీశేనతు శక్రస్య, రక్షణాయ నిరూపితమ్" బలాసురునిఁ జంపఁబోవు శక్రునకు రక్షణార్థముగా బృహస్పతి విష్ణుపంజర ముపదేశించె నని పురాణాంతరమందునుం గలదు. ఏతత్ప్రమాణములచేఁ ద్రిపురాసురసంహారమునకు ముఖ్యహేతువగు విష్ణువే సర్వోత్కృష్టుఁడు.

శ్లో॥ తస్మిన్ యజ్ఞే ముకుందాగమ పరిభవయోః శ్రీశుకాప్రోదితత్వా
దన్యత్రోక్తోత్తరత్వాదపి హరిపరిశోః ఖండనాత్తత్ప్రమాణాత్
ధాత్రే సాక్షాత్ప్రసాదా దనుదనుజభిదః కృష్ణతో విష్ణుమూర్తేః
కైలాసేశస్యభంగా దపిన పశుపతిర్విష్ణుతేన ప్రకృష్టః 14

దక్షయాగమున ముకుందుఁడు కురంగరూపముఁదాల్చి పాఱిపోయెనను నాక్షేపమునకు నిరసనము. భాగవత చతుర్థస్కందమునందు "ఉపలభ్య పురైవైతద్భగవానబ్జసంభవః, నారాయణోఽపి విశ్వాత్మా న తస్యాధ్వర మీయతుః" దక్షయాగము రుద్రునిచే భంగమగునని యెఱింగి త్రికాలవేదులగు విరించి నారాయణులు ముందుగా వచ్చుటకే రాలేదని తత్త్వవేత్తయగు శుకుండు చెప్పెను. యాగస్థలమున కేరాని గోవిందుఁడు

జడిసి పాఱిపోవుటెట్లు. యితర గ్రంథములందున్నందురేని నిశ్చితార్థంబగు భాగవతమునకు విరుద్ధముగా ననిశ్చితార్థములగు పురాణంబులు విశ్వసనీయములుగావు మఱియు రుద్రసంగ్రామ జయమువలన రమాపతి ఖండ పరశువయ్యెనని సహస్రనామభాష్యంబున భట్టరాచార్యులవారువచించిరి రుద్రునిచే భంగమైన దక్షయాగమును నారాయణుఁడేగి నిర్విఘ్నముగా నెఱవేర్చెను బ్రహ్మరుద్రేంద్రాది దేవతలందఱు రమాధిపుని దర్శించి నుతించిరి యింతేకాక బాణాసుర బాహుచ్ఛేదన కాలంబునఁ గృష్ణునిచే రుద్రుఁడు భంగపడి స్తుతించెను కనుక విష్ణువే సర్వోత్కృష్టుఁడు

శ్లో॥ అశ్వత్థామావతారేశ్వర పరిభవనాత్సర్వశక్త్యాశ్రయత్వా
చ్ఛార్ఙ్గపాదారవిందార్పిత కుసుమచయాలోకనాదీశమాలా
కామారేర్గౌరవార్థాచ్చరణవిరచనాచ్ఛ్రీనృసింహేనపూర్వం
తస్యాస్త్రస్యాగ్రత త్వాదపిన పశుపతిర్విష్ణురేవ ప్రకృష్టః 15

శ్లో॥ "భైరవో వీరభద్రశ్చ రుద్రా ఏకాదశాస్తథా, శతరుద్రాశ్చ దుర్వాసా విశ్వకర్మా ఘటోద్భవః, ఔశానద్రౌణికాలాఖ్యా సంయమీ మేష శంబరః" భైరవుఁడు వీరభద్రుఁడు ఏకాదశ రుద్రులు శతరుద్రులు దుర్వాసుఁడు విశ్వకర్మ అగస్త్యుఁడు ఔశానుఁడు అశ్వత్థామ కాలాఖ్యుఁడు సంయమి మేషుఁడు శంబరుఁడు మొదలగువారందఱు శివావతారమూర్తులను ప్రమాణముగలదు, శివావతారుండగు నశ్వత్థామ యొకప్పుడు ద్వారవతికేగి కృష్ణా! నీకొక దివ్యాస్త్రంబిచ్చెద నీసుదర్శనము నాకిమ్మనియడిగె నయ్యాలాపంబులకు నచ్యుతుండు నవ్వి భూసురా! నీ వస్త్రము బదులీయ నవసరంబులేదు. మదీయ శంఖ చక్రాది పంచాయుధంబులం దెద్దియైనం గైకొమ్మనఁగాఁ బట్టిచూచి కదలింపలేక సిగ్గుపడి పాఱిపోయెను. భారతసంగర

మధ్యంబునఁ బాండవ తనయార్థ మశ్వత్థామ ప్రయోగించిన నారాయణాస్త్రమునుఁ గృష్ణుఁడు శాంతింపఁజేసెను. మఱియు గోవిందుఁడు సమరాంతమునఁ బాండవ తనయార్థము ద్రౌణి సంధించిన బ్రహ్మశిరోనామకాస్త్రమును వారించి తదీయ శిరోమాణిక్యమును హరించి నిర్వీర్యునిఁజేసి యమ్మణి పార్థులకిచ్చి పరీక్షిత్తును బ్రతికించెను. మధుసూదనుండు రుద్రగౌరవార్థము పార్థునిచే రుద్రోపాసన చేయించి పాశుపతాస్త్ర మిప్పించియుఁ బార్థుండు తనపాదములయందు సమర్పించిన ప్రసూనములను శివుని శిరస్సునందుఁ బ్రదర్శించి స్వకీయోత్కర్షమునుఁ బ్రకటింపించెను, ఇంతేకాక పురుషోత్తముఁడు నృసింహావతారంబున హరప్రయుక్త పాశుపతాద్యస్త్రములన్నియు గ్రసించి వ్యర్థముసేసెను. ఈయుదంతములచే విష్ణువే సర్వోత్కృష్టుఁడు.

శ్లో॥ ప్రఖ్యాతామ్నాయ భాష్యాదిషు హరిరితి వాక్యస్య విష్ణుప్రకర్ష
వ్యాఖ్యానాద్బ్రహ్మరుద్రాదిక సురహరణోదీరణాత్త్రిర్నిరుక్తే
ఆగ్నేయే తత్ప్రహాత్మే శరభ పరిభవా ద్దారుణే నారసింహే
కౌర్మే మాత్స్యే పురాణే బహుముఖకథితాత్సర్వతో
ప్రస్థితత్వాత్ 16

వేదభాష్యమునందును ' సహస్రనామభాష్యమునందును హరి శబ్దనిర్వచనము సెప్పఁబడియున్నది "బ్రహ్మాణమింద్రం రుద్రం చ యమం వరుణమేవచ, నిగృహ్య హరతే యస్మాత్తస్మాద్ధరిరిహోచ్యతే" బ్రహ్మను శక్రుని రుద్రుని యముని వరుణుని శాసించి ప్రళయమున వధించువాఁడగుటచే విష్ణువునకు హరి యను నామముకలిగియున్నది యిట్లుండఁగా రుద్రుండు శరభ రూపియై నృసింహుని వారించి చంపెనని కుదృష్టిసిద్ధాంత

ములు వాదించు దానికి నిరసనము. "తమభ్యాశగతం దృష్ట్వా నృసింహః శరభం రుషా, జఘాననిశితైరుగ్రైర్నఖైర్న ఖవరాయుధః" నఖములే యాయుధములుగాఁ గల నృసింహుఁడు తనతో వైరమునకుఁ గవిసిన శరభరూపియగు రుద్రునిఁ గాంచి రోషముతో వాఁడిగలిగి యుగ్రములగు గోళ్లతోఁ జీల్చెనని అగ్నేయ పురాణమునందును, "తతః క్రుద్ధో మహాకాయో, నృసింహో భీమనిస్వనః, సహస్రైః కరజైస్తీక్ష్ణైస్తస్య గాత్రాణ్యకర్తయత్" నిహతం భీమ ముత్యుగ్రం గతా సుం ద్రష్టుమాగతః, ఋషయో దేవగంధర్వా, యత్ర శేతే హతో హరః" కోపము గలవాఁడును మహాకాయుఁడును భయంకరధ్వనిగలవాఁడు నగు నృసింహుఁడు తీక్ష్ణములగు గోళ్లచే రుద్రావయములనుఁ జీల్చినప్పుడు ఋషులు దేవ గంధర్వులు గతాసువగు హరునిఁ గాంచిరని పద్మపురాముమునందును, "హంతు మభ్యాగతం రౌద్రం, శరభం నరకేసరీ, నఖైర్విదారయామాస" హిరణ్యకశిపుం యథా తన్నుఁ జంపుటకు వచ్చిన శరభరూపియగు రుద్రుని నరకేసరి హిరణ్యకశిపుభంగి గోళ్లతోఁ జీల్చెనని గారుడాష్టనపతితమాధ్యాయమునందును "నికృత్తబాహూరుశిరా, వజ్రకల్పముఖైర్నఖైః, మేరుపృష్ఠే నృసింహేన, శరభః సహసాపతత్" నృసింహుని వజ్రకల్పములగు గోళ్ళచేఁ జీల్పఁబడి శరభరూపియగు రుద్రుండు తెగిన చేతులు తొడలు శిరస్సుగలవాఁడై మేరు పృష్ఠమునఁ బడెనని నృసింహ పురాణమునందును "ప్రత్యేకం కరవాలేన ముఖచంచూపుటద్వయే, వ్యదారయన్ నృసింహాస్తం హిరణ్యకశిపుం యథా, తస్యకంకాళకేనైవ నగాకారేణనారద జయకేతో దండముచ్చం, చకార నరకేసరీ"

నృసింహుఁడు ప్రత్యేక కరవాలముచే ముఖ చంచు పుటద్వయంబులనుఁ జీల్చి యాకంకాళమును జయకేతువు సేసెనని కూర్మపురాణమునందును, ఇట్లే మత్స్యపురాణమునందునుఁ జెప్పఁబడియున్నది కాని తన కంఠరంగభస్త్రాలగు పార్వతీ ప్రార్థనచే రమాపతి మరల శివుని బ్రతికించెనని యున్నది. కావున విష్ణువే సర్వోత్కృష్టుఁడు.

శ్లో॥ శౌరేరన్యత్ర పాద్మే త్రిపురహరశిరో నూపురత్వాభిధానా
ద్వైకుంఠాదాగతేనాథచ నరహరిణానేకహేమాసురాణామ్
ధ్వంసాత్కాలాఖ్య దైత్యప్రమథనకథనాత్స్వస్వయాచక్రపాణే
ర్భ్యాయస్స్వస్థానయానాదపి న పశుపతి ర్విష్ణుతేన ప్రకృష్టః 17

"ద్వాదశార్క శిరోధామ, రుద్రశీర్షైక నూపురః, అనంతాయుధ దోర్దండో, నృసింహో వీరభద్రజిత్" ద్వాదశసూర్యులకంటెఁ గాంతిగలవాఁడును హరశిరస్సును నూపురముగాఁ గాలియందు ధరించినవాఁడును దోర్దండంబునందనేకాయుధములు గలవాఁడును, వీరభద్రజిత్తునగు నృసింహుఁడని పద్మపురాణమునందుండుటవల్లను, బ్రాహ్మము నృసింహుఁడు హిరణ్యకశిపునిఁ జంపఁగాఁ దదీయరక్తబిందువులు పాతాళగతమయ్యె నప్పుడనేక హిరణ్యకశిపు లుద్భవించి త్రిలోకవాసుల బాధించి రయ్యవసరంబున రాక్షసపీడితులు ప్రార్థింపఁగా నక్కడ సంకర్షణమూర్తిలోనుండు నారాయణుఁడు నృసింహుఁడై యాయసురుల వధించె నటుపిమ్మట హిరణ్యకశిపు పరిచారకుఁడగు కాలమూషకుఁడను రాక్షసుఁడు బ్రహ్మాండమును భేదింపుచుండఁగాఁ దన్నిశాటునిఁ గూడ నృసింహుఁడే వధించి స్వస్థానముఁ జేరెను. "విరాడంశః స్వరాట్సాక్ష్యంశో వైకుంఠనాయకః తదంశాస్త్రయో వ్యూహాస్తదం

శావిభవాగి స్మృతాగ” విరాట్టులో స్వల్పాంశము స్వరాట్టు స్వరాట్టులో స్వల్పాంశము వ్యూహత్రయము వానిలోనంశము నృసింహాద్యవతారములు అట్టియవతారమూర్తులలోనొక్కం డగు నరసింహుం డంతపనిచేసె నింతేకాక “సర్వేషాం కారణతమోహ్యేది విష్ణుః పరాత్పరః” అని యుండెంగావున విష్ణువే సర్వోత్కృష్టుండు.

శ్లో॥ బాహ్యా స్త్రీవేషవత్వే నటవదవిజహాన్మోహనత్వాద నాదేః
పుంసోయోనేరభావా ద్ధరగిరిసుత యోశ్ఛిన్న లింగత్వసిద్ధేః
గౌరీరూపావలోకస్ఖలిత విధిభవద్వాలఖిల్య ప్రధాన
చ్ఛాస్త్రశ్చేశానరేతస్స్మృతిసహిత పదాంగుష్ఠ దేశోద్భవత్వాత్ 18

“దేవ తిర్య జ్మనుష్యేషు, పున్నామా భగవాన్హరిః” దేవ తిర్యఙ్మనుష్యాదులయందు మగతనము గలవాఁడు కేశవుఁ డొక్కఁడేనని ప్రమాణముండుటవల్లను, “స ఏవ వాసుదేవోఽయం, సాక్షాత్పురుష ఉచ్యతే, స్త్రీప్రాయమేతత్సర్వం జగద్బ్రహ్మపురస్సరమ్” వాసుదేవుఁ డొక్కఁడే పురుషుఁడని చెప్పఁబడుచున్నాఁడని పరాశరులవారు వక్కాణించిరి. “యస్మాత్క్షరమతీతోఽహం, మక్షరాదపిచోత్తమః, అతోఽస్మి లోకేవేదేచ ప్రథితః పురుషోత్తమః, యోమామేవమసంమూఢో జానాతి పురుషోత్తమం. ససర్వవిద్భజతిమాం, సర్వభావేన భారత” ఎందువల్ల నేను క్షరు నతిక్రమించి యక్షరునికంటె నుత్తముఁడనై యున్నానో దానివల్ల లోకమునందును వేదమునందునుఁ బురుషోత్తముఁడని ప్రసిద్ధిఁజెందితిని యెవ్వండిట్టి తెలివిగలిగి నన్నుఁ బురుషోత్తమునిగా నెఱిఁగి భజింపుచున్నాఁడో వాఁడు సర్వముతెలిసిన జ్ఞానియని గీతాచార్యులవారానతిచ్చుట వల్లనుఁ గేశవుఁ డనాదిపురుషుఁడై మేహనము గలవాఁడై

యున్నాడే కాని యోనిగలవాఁడు కాఁడు. స్త్రీరూపధరుఁ డయ్యెంగదా యందురేని మీసాలుగొరిగించి హరిదళమునఁజేసి స్త్రీరూపముఁ ధరించిన వేషధారికిఁ బుంస్త్వముపోయి యోని రాదుగదా యది యట్లుండఁగా గిరిజా గిరీశులకు లింగయోని దన మగునట్లు మునులు శపించిరి కావున పుంస్త్వములేని రుద్రునకు యోనిలేని కేశవునకు సంయోగములుగలుగుట యసంభవము, కాని శివునకు మేఢ్రమున్నదందురేని వనితాకారుఁ డగు హరింగాంచినప్పుడు రుద్రునకు వీర్యస్ఖలనముకాఁగా నది తదీయాంగుష్ఠంబునఁబడి శాస్త జన్మించెనని పూర్వపురాణంబునఁగలదు. యోనిలేనిచోట దేహజన్మింపదందురేని వివాహ సమయంబున ధరాధరసుతం గాంచి మోహించిన బ్రహ్మ వీర్యము భూమియందుఁ బడఁగా వాలఖిల్యులు జన్మించిరి గదా! వధూవేషధారియగు నారాయణునిఁ బురుషునిగ నెఱుంగకపోవుటయు నిధువనాపేక్షచే వెంబడించుటయుఁ బ్రకృతిబద్ధజీవలక్షణమై యున్నది. మహాంతరులిచ్చిన ప్రశ్న చేతనే శివపరత్వము పోయినది. 'కృష్ణుఁడు జారుండు కాఁడా' యందురేమో యప్పురుషోత్తముఁ డేయంగనను మోహించి వెంటఁబడలేదు. మాకృష్ణుఁడు వనితావేషధారియగు పురుషునితో సంయోగముసేసి బిడ్డలఁగని గొప్పవాఁడయ్యెనని వైష్ణవు లెవ్వరు చెప్పుకొనలేదు గాని రామావతారంబునఁ దన్ను మోహించిన మునీంద్రులు ద్వితీయజన్మంబున రాజాంగనలై పుట్టి కృష్ణునను భార్యలై వలపు దీర్చుకొనిరి. గోలోకంబునను నిరంతర భగవదనుభవతత్పరులగువారు గోపికలై హరిం బొంది యవతారలీల లనుభవించిరి. నందనందనుఁ డనేక కాంతాలలామంబుల మోహంబు దీర్చియు నింద్రియస్ఖలన మొనర్పలేదు కాఁబట్టియే ఉత్తరాగర్భస్థపిండము ప్రాణము

లేకుండఁబడినప్పుడు శ్రీకృష్ణుఁడు "యదిమే బ్రహ్మచర్యంస్యా త్సత్యంచ మయితిష్ఠతి, అవ్యాహతం మమైశ్వర్యం, యదిజీవతు బాలకః" నేనస్ఖలితబ్రహ్మచారినైనచో సత్యము నాయందున్నచో వ్యర్థముగాని యైశ్వర్యముఁగలవాఁడ నైనచో నీబాలుఁడు జీవించుఁగాకయని శ్రీకృష్ణుఁడు శాబ్దిచేయఁగా బరీక్షిత్తు జీవించెను. "స్వాంగాలింగేరతిర్నస్యాదంగ నాలింగనేరతిః" తనశరీరముతానుదాఁకుటకురతిపుట్టదు ః నితాలింగనమునందే రతికలుగును. జగచ్ఛరీరుండగు కృష్ణునకు జగత్సంగలచానల కామంబుదీర్చుట వలపుగాదుగనుక విష్ణువే సర్వోత్కృష్టుఁడు.

శ్లో॥ దుర్వార్తాశంసి వక్త్రోద్వమిత విరచితాశ్లేషకామార్యపానే
శాస్త్రజ్జన్మోపపత్తేరపికిల శతసాహస్ర సత్సంహితాయామ్
భూతేశ ప్రార్థితాజప్రహితసుమహితాకార మాయాకృతస్త్రీ
వృత్తాంతస్యాభిధానాదపి న పశుపతి ర్విష్ణురేవ ప్రకృష్టః 19

అప్రమాణోక్తులు పల్కుచున్నవారి ముఖములో నుపమింపఁదగిన రుద్రాపానవాయువునందు శాస్త్రజన్మించెనని గ్రంథాంతరమునఁ గలదు. వెండియు శతసాహస్ర సంహితయందు "భూతేన ప్రార్థితోయోఽజో" శివప్రార్థనచే గోవిందుఁడొకానొకమాయాస్త్రీని సృష్టింపఁగా నయ్యంగననుఁగాంచి శివుండు మోహించి తలుమగా నప్పొలఁతి మాయమయ్యెనని వచింపఁబడినది. ఇంతేకాక దారుకావనములో మునిస్త్రీల మోహించి పినాకి శపింపఁబడెననియుం గలదు గావున విష్ణువే సర్వోత్కృష్టుఁడు.

శ్లో॥ కాశీ కేదార ఢిల్లీ కటక బదరికా ద్వారకాముఖ్యదేశే
ష్వాఖ్యా చిహ్నాధికత్వాదితరజనపదేష్వచ్యుతస్య ప్రసిద్ధేః

బాహుల్యాద్దేవనైవేష్వ పటుకరణభృత్ క్షుద్రకాపాలికానాం
లం కేశాద్వేషు యద్వాధునిక నరకులే శ్రేయసా మస్థిరత్వాత్

పుణ్యక్షేత్రములలో శివస్థలము అధికముగాఁ గలవని పూర్వపక్షులు చెప్పుచున్నదానికి నిరసనము.

కాశి కేదారము ఢిల్లీ కటకము హరిద్వారము హృషీకేశము బదరికాశ్రమము మధుర గోకులము బృందావనము సాలగ్రామము నైమిశారణ్యము జగన్నాథము గండకీనది ద్వారవతి పాండురంగము మంగళగిరి వేంకటాద్రి కాంచీపురము శ్రీరంగము కుంభకోణము శ్రీవిల్లిబుత్తూరు కురుకాపురము అనంతశయనము వానమామల యాదవాద్రి ఘటికాచలము మాల్యాద్రి భూతపురి అహోబిలము మొదలగు దివ్యదేశములయందుఁ గేశవార్చావతారంబులు, రామ కృష్ణ కేశవ మాధవ నృసింహ జనార్దనాది దివ్యనామంబులతోఁ దేజరిల్లుచున్నవి. మఱియు నా యా దివ్యస్థలంబులందు సేవఁజేసి యుండువారికి నిత్యోత్సవ మాసోత్సవ పక్షోత్సవ పల్లవోత్సవోద్యానోత్సవ కల్యాణోత్సవ దమనోత్స వాధ్యయనోత్సవ బ్రహ్మోత్సవములు విశేషముగా జరుగుచున్నవి. తిరుమలలో శ్రీనివాసప్పెరుమాళ్ళ సన్నిధియందు దినమున కిరువదినాలుగు భోగంబులు శ్రీరంగరాజసన్నిధి నఱువదియాఱుభోగంబులు సెల్లుచున్నవి. కాంచీపురమునందుఁ దేవప్పెరుమాళ్ళకుఁ దోతాద్రియందు దేవనాయకస్వామికి యాదవాద్రియందు సంపత్కుమారునకు జరుగు భోగంబు లపారిగా నున్నవి. దివ్యస్థలంబులందు శంఖ చక్ర గరుడధ్వజాది విష్ణుచిహ్నంబు లపారిగాఁ బ్రకాశించుచున్నవి. తిరుమలకు వేంకటేశ్వర సేవార్థము వచ్చు నానాదేశజనంబు లెచ్చోటను గాన

రారు. బిందుమాధవనివాసంబువల్లను విష్ణుపదీప్రవాహంబు వల్లను విశ్వేశ్వరకృత రామ మంత్రజపంబువల్ల కాశీ పురము గౌరవింపఁ బడుచున్నది. సేతుసమీపమం దుండు శివస్థలంబు గౌరవార్థము రామేశ్వరమని పిలువం బడుచున్నది. శివక్షేత్రంబులయందుండు నర్చకులు శైవ శాక్తేయ కాపాలికాదులు పాషండులని చెప్పఁబడుచున్నారు. "జాయమానంహిపురుషం. యంపశ్యేన్మధుసూదనః సాత్వికః స్సతు విజ్ఞేయః, సవై మోక్షార్థచింతకః" జన్మించినప్పుడు మాధవుఁ డెవ్వనిఁ గటాక్షించునో వాఁడు సాత్వికుఁడై మోక్ష విషయాసక్తి గలవాఁడై యుండునని ప్రమాణము గలదు. "పశ్యత్యేనం జాయమానం, బ్రహ్మారుద్రోథవాపునః, రజసా తమసా తస్య, మానసంసమభిప్లుతం" జన్మకాలమం దెవ్వని బ్రహ్మగాని రుద్రుఁడుగాని చూచునో యట్టివాఁడు రజ స్తమస్సులచే నావరింపఁబడిన మనస్సు గలవాఁడగునను మార్కండేయ భవిష్యత్పురాణోక్తులవల్లను భాగవత చతుర్థ స్కంద పురాణోక్తులవల్లను విష్ణువే సర్వోత్కృష్టుఁడు.

శ్లో॥ కూర్మాదీనా మనంతావతారచయజుషాంయోని జన్మోజ్ఝితానాం సత్వాదద్యాపిచావిర్భవననిగదనాద్యోనిజానాం నశాపా త్తస్మాత్త్వాదేవ శంభో ర్భృగుముని శపనాద్విర్థభావాచ్చయద్వా నానారూపావతారస్థితిషు వివిధత త్తన్నిమిత్తోపలంభాత్ 21

భగవద్దశావతారములు భృగు శాపమువల్లఁ గలిగెననియు వానిలోఁ గొన్నింటిని శివుండు సంపెననియుఁ జెప్పుదానికి నిరసనము. కూర్మాద్యవతారము లిప్పటికి నుండుటవల్ల రుద్రు నిచే జంపఁబడుట లబద్ధము. "మత్స్యోహ్యహాయ శిరావేదం, విద దృతిష్ఠతి, నృసింహావిజయశ్రీ ప్రోక్తః కూర్మో2మృతాచలోద్ధర్తా, కూర్మ చక్రేఽ ఉపేంద్రో2ద్యాపితిష్ఠతి

భృగురామశ్చ పీరఘూర్న రఘురామో నిజంపదమ్, జంగమా జంగమైర్గ ప్రాపశేషో౽ప్యాది శరీరభృత్, బుద్ధః పునర్నిజతనుః కల్కి చాంతే భవిష్యతి" మత్స్యావతారుండగు హరియే వేదము లుద్ధరించి బ్రహ్మకిచ్చెను. దేవరక్షణార్థము బలిని జయించిన యుపేంద్రుఁ డిప్పటికి నున్నాఁడు, దేవామృత ప్రదుఁడగు కూర్మావతారుఁడు కూర్మచక్రమునం దిప్పటికి నున్నాఁడు. భృగురాముఁడు పరపీఁఘ్నుఁడగు రాముఁడు రామునితోఁగూడిన చరాచరభూతములు శేషరూపియగు లక్ష్మణుఁడు స్వస్థానంబగు వైకుంఠంబున కేగిరి. బుద్ధరూపి యగు హరి నిజతనువునుఁ బొందెను. కల్క్యవతారుండగు హరి రాఁబోవుచున్నాఁడని పురాణేతిహాసములు ఘోషింపు చున్నవి "దేవతిర్యఙ్మనుష్యేషు, శరీరగ్రహణాత్మికా, లీలో యంసర్వభూతేషు, ధర్మత్రాణాయ కేవలమ్" దేవతిర్యఙ్మను ష్యులయందు లీలార్థముగా నవతరించి ధర్మత్రాణ మొనర్చు నారాయణావతారములకుఁ గారణము గనఁబడుచుండఁగా భృగుశాపమువల్లఁ గలిగెననుటయు శివునిచేఁ గొట్టఁబడెనను టయు మృషావాక్యంబులు నృసింహరామ కృష్ణాద్యవతార మూర్తులను భృగుండును హరుండు మహాభక్తితో నుపా సించువారేగనుక విష్ణువే సర్వోత్కృష్టుఁడు.

శ్లో॥ విష్ణోర్నానావతార స్థితికథక పురాణేషు కామారిపూజా
కృత్యస్యానుక్త భావాత్త్వదితరకథితస్యాస్య దత్తోత్తరత్వాత్
నానాదేశ ప్రతీతక్షితిపతి నిజనామ ప్రతిష్ఠోపపత్తే
ర్నర్త్యేశాది ప్రసిద్ధేఽపి న పశుపతి ర్విష్ణురేవ ప్రకృష్టః 22

నారాయణ నానావతార మహిమంబు వర్ణించు రామాయణ భారత భాగవత హరివంశ వైష్ణవ పాద్మాదులయందు రుద్ర

పూజా విషయము చెప్పఁబడలేదు. శివప్రధాన ప్రతిపాదకములగు తామసపురాణములయందును హరిమహిమంబు వర్ణింపఁబడియున్నది. నానాదేశాధీశులచే ననేక నామరూపములతోఁ గేశవుఁడు ప్రతిష్ఠింపబడెను. ఈకారణంబులచే విష్ణువే సర్వోత్కృష్టుఁడు.

శ్లో॥ శ్రీకూర్మాహీంద్ర దంష్ట్రోత్రి కృతిధర భగవద్ధారి తత్పూర్తతలాద్ధో
దేశస్థేశాంఘ్ర్యూర్ధ్వ దృష్టేరనుచిత కథనాత్కేతకీ పిత్సితస్య
తనూజార్ధక్షతస్య పిత్రా సరసిరుహభువా దర్శనా సంభవోక్తే
రత్యంతంహాస్యభావాదపి న పశుపతి ర్విష్ణురేవ ప్రకృష్టః 23

శివుండు పరిమితిలేకుండఁ బెరిగి కూర్చుండి తనపాదములఁజూచి రమ్మని మధువైరిని శిరస్సుఁగాంచిరమ్మని విరించినిఁబంపఁగా నిరువురు తెలుసుకొనలేక తబ్బిబ్బుఁజెందిరనుదానికి నిరసనము. ఆదికూర్మమైయాదివరాహమై యాదిశేషుఁడై భూమినిధరించిన వాఁడును స్వకీయాంఘ్రిచే బ్రహ్మాండమునుఁ గొలిచినవాఁడును విలయకాలమున బ్రహ్మాండమును గర్భమందుంచుకొని మార్కండేయాదులఁ గాపాడినవాడును సర్వజ్ఞుఁడును సర్వశక్తుండునగు నారాయణునకుఁ దెలియకుండ శివుండు పాద మెక్కడికిఁ జాచెనో దానింగాంచుటకుఁ గేశవుం డెక్కడికిఁ బోవలయునో యీప్రశ్న యెంత నీరసముగానున్నదో బుద్ధిమంతు లాలోచింపుడు, ఇది యిట్లుండఁగా రుద్రస్థానంబగు కైలాసము భూలోకంబునఁ గలదు. బ్రహ్మలోకము భూలోకమున కేబదికోట్ల యోజనంబుల దూరంబున నూర్ధ్వ భాగంబున నున్నది. దానికిఁబైన బ్రహ్మాండకటాహము కోటి యోజనముల పరిమితిగలిగి దట్టముగా నున్నది. దానిమీఁదఁ బదికోట్లయోజనంబులలోతున నీరున్నదిఁ రుద్ర బ్రహ్మదులకది

యగోచరంబై యున్నది. రుద్రుం డంతడూరము కాలు సాచుటయు కేతకీ ప్రసూన కామధేనువు లబ్బుటకేగుటయు బ్రహ్మదేవుని యింటినలంకరించు బ్రహ్మాండమునలరు బ్రహ్మాగమనించి చూడలేకపోవుటయు నసమంజసముగానున్నది. అగాధ సత్త్వబద్ధముగనుక విష్ణువే సర్వోత్కృష్టుఁడు.

శ్లో॥ దుర్వాసో ద్రౌణివాతాత్మ భవమయుఖ నైకా దశాభిఖ్య రుద్రా
దీనాం వేదే పురాణేష్వపినిగదనతో యోనిజా యోనిజానాం
నేశానేద్యాది వాక్యైర్విధన కథనతోప్యాది రుద్రస్య తేషాం
శారేః సర్వాధికత్వాదపి న పశుపతి ర్విష్ణురేవ ప్రకృష్టః

రుద్రావతారములకుం జావు పుట్టుకలు లేవని వదీయులిచ్చిన దానికి నిరాసము. దుర్వాసుఁడు హనుమంతుఁడు శుకుఁడు ఏకాదశ రుద్రులు మొదలగు శివావతారులు పుట్టినట్లు వేదములు పురాణములు చెప్పుచున్నవి. "ఏతౌ ద్వౌ విబుధశ్రేష్ఠౌ ప్రసాదక్రోధజౌ స్మృతౌ, తదాదర్శిత పంథానౌ, సృష్టిసంహారకారకౌ" నారాయణుని ప్రసాదమువలన బ్రహ్మ క్రోధమువలన రుద్రుఁడు జనించి సృష్టి సంహార కారకులైయున్నారని చెప్పుటచే రుద్రునకు జన్మము విధింపఁబడినది "ఏకోహ వై నారాయణో ఆసీత్ న బ్రహ్మానేశానః నేమేద్యావాపృథివీ" యనుటచే నిధనమునుఁ జెప్పఁబడుచున్నది గనుక విష్ణువే సర్వోత్కృష్టుఁడు

శ్లో॥ పాద్మే లైంగే పురాణేయ జనిచనిగమేభాం తేశ్రీశకోక్త్యా
కాశీశ బ్రహ్మముఖ్య రఘుకరపరిత త్త్వప్రకర్షాభిధానాత్
తేషాం జిహ్వానిరోధేవ్యసతి మునిభుజస్తంభనా దౌర్భాగ్యభావాత్
శ్రీశఖ్యాతిధ్వజత్వాదపిన పశుపతిర్విష్ణురేవప్రకృష్టః 25

పద్మపురాణమునందు 'అహంరామజగత్పూజ్యో, మమప్రాజ్ఞా యువాంసదా, అతస్త్వాంజానకీరామ, పరబ్రహ్మసమన్వితే త్వన్మాయామోహితాఃసర్వే, నత్వాంజానంతి తత్త్వతః' ఓరా మా నేనుజగత్పూజ్యుఁడనైనను సీతాసహితుండవును పరబ్రహ్మ వగు నీవునాకుఁబూజ్యుఁడవైయున్నావు నీమాయచే మోహితులైనవారు నిన్ను యథార్థముగా నెఱుఁగఁజాలకున్నారని రుద్రుఁడుసెప్పెను లింగపురాణమునందు "లోకపూజ్యో మహాత్మాచ, తారకబ్రహ్మనామకః, రామోరాజీవనయనో, దేవ ద్విజనమస్కృతః" తారకబ్రహ్మనామకుండగు రాముఁడు మహాత్ముఁడు రాజీవాక్షుఁడు దేవతలచే బ్రాహ్మణులచే నమస్కరింపఁబడువాఁడని చెప్పుచున్నది. "ఆలోక్య సర్వశాస్త్రాణి విచార్యచ పునఃపునః ఇదమేక సునిష్పన్నం, ధ్యేయో నారాయణస్సదా" అని వ్యాసుఁడు కాశిలోఁ జెప్పుచుండగా నమ్మని భుజస్తంభనమాయెనని కొందఱు సెప్పుదురు. జిహ్వానిరోధ మేలకాలేదో భుజస్తంభన మెందుకయ్యెనో తెలియదు గాని భుజమ్ము కొంతసేపట్లు స్తంభనమగుట రమాపతి పరత్వఖ్యాతి ధ్వజమైయున్నది కాబట్టి విష్ణువే సర్వోత్కృష్టుఁడు.

శ్లో॥ భూమ్యాద్యంశాశ్రితత్వాత్సరథముఖ సమిత్సాధనానాంచ తేషాం
విష్ణోర్నైసర్గికత్వాత్క్షితిభరణ విధేర్వాహనత్వాద్వ్యయోగాత్
సాక్షాత్స్వాంగే సుమిత్రా తనుభవవహనాన్నీలకంఠావతార
ప్రఖ్యాతేర్వాత సూనోరపి న పశుపతిర్విష్ణురేవ ప్రకృష్టః 26

త్రిపురాసుర సంహారకాలమందు శివుని వహించిన భూమిని జనార్దనుఁడు వృషభరూపియై వహించుటచే రుద్రుఁడుగొప్పవాఁడని మతాంతరు లిచ్చిన యాక్షేపమునకు నిరసము. నారాయణుఁ డాదిశేషుఁడై యాదివరాహమై యాదికూర్మమై

యిదివఱకే భూమిని ధరించియున్నాఁడందువల్లనే "గామావిశ్యచ భూతాని, ధారయామ్యహమోజసా" భూతరక్షణార్థము భూమినావేశించి నాబలముచే ధరింపుచున్నానని గీతయందు భగవంతుఁడే చెప్పెను. "విష్ణుస్సువనాని, విష్ణుర్వనాని, విష్ణుర్గిరయోదిశశ్చ" భువనములు వనములు పర్వతములుదిశలు విష్ణుని విభూతులని పరాశరులవారు చెప్పిరి. పినాకికి సమితాస్యధనంబులైన భూమి మేరువు వాసుకి ప్రముఖవస్తువులు జనార్దనుని విభూతులు కాఁబట్టి సర్వభూతభారవహుఁడగు గోవిందుఁడు శివుని వహించుటలో లోపములేదు. కాని రుద్రావతారుఁడగు హనుమంతుఁడు వైష్ణవాగ్రేసరుఁడై ముకుందుని నాల్గవ భాగమగు లక్ష్మణుని మహాభక్తితో వహించెను. రావణునితో శివబ్రహ్మల కతీతుండగు రాముఁడే పరబ్రహ్మమని బోధించెను సౌగంధికాపహరణార్థమేగు భీమునితో నారాయణుఁడే సర్వేశ్వరుఁడని బోధించెను. మఱియు రుద్రావతారుండగు శుకుండు కృష్ణభక్తిలో నద్వితీయుఁడై కృష్ణతత్త్వమును బోధించి యుత్తరానందనుని ముక్తికనిచెను బాల్యంబున శివోపాసకుండగు మార్కండేయుఁడు ప్రళయకాలంబునఁ దన్నుఁగాపాడిన సర్వోత్కృష్టుఁడైనను శ్రీకృష్ణుండని ద్వైతవనంబున ధర్మరాజున కెఱింగించెను గనుక విష్ణువే సర్వోత్కృష్టుఁడు.

శ్లో॥ అబ్రహ్మణ్యాశుచిత్వా దనవరత మపిబ్రహ్మశీర్షాస్థియోగాత్
స్పృష్టుం స్వస్యప్రయాతుం న సముచితతయాని త్యదాహేయభావాత్
దక్షాది బ్రహ్మహత్యామయ విపుల కపాలాన్వితగ్రీవభావాత్
తద్భూషానిత్యయోగాదపి న పశుపతిర్విష్ణురేవ ప్రకృష్టః 27

బ్రహ్మశిరస్సును గొట్టి కపాలమాలికగా ధరించుటచే శివుండు గొప్పవాండని యిచ్చినదానికి నిరసనము. 'కపాలమాలి' యను వాక్యముచే రుద్రుండబ్రహ్మణ్యుండై యశుచియై యున్నాడని తేలుచున్నది. దీనికనుకూలముగా "రుద్రార్చకో బ్రాహ్మణస్తు, శబరైస్సమతాం వ్రజేత్" రుద్రార్చకుండు బ్రాహ్మణుండైనను బోయవానితో సమానుండని హారీతస్మృతి పంచమాధ్యాయమునందుం జెప్పంబడియున్నది. కపాలమాలిక లాపాద మస్తకము ధరించినవాండు గమనించుటకు సంకటముగా నుండును. పితృ వన నివాసిత్వముచే నిత్యము హేయముగా నున్నాడు. తండ్రియగు బ్రహ్మనుం జంపి తదీయ కపాలమును ధరించుటయు నపుణ్యకార్యము కాంబట్టి విష్ణువే సర్వోత్కృష్టుండు.

శ్లో॥ శంభోర్జ్ఞాన ప్రదత్వేపిచ శుకవపుషా తామసత్వస్వభావా
చ్ఛుద్ధజ్ఞానా ప్రదానాద్రఘువరమనుదానేఽపి కాశీశ్వరస్య
స్వాహంతాగర్భితత్వాత్స్వపదగతి విలంబేన సద్యోముముక్షో
రప్రార్థ్యత్వాద్రవీందూపమిత నిజ జనస్థాన దానాధికారాత్

"ఈశానాద్జ్ఞాన మిచ్ఛేత్"ను ప్రమాణముచే రుద్రుండు గొప్పవాండనుదానికి నిరసనము. శుకయోగీంద్రుండు శివావతారుండేగనుక పరీక్షిత్తునకు విష్ణుచరిత్రంబును ముక్తిప్రదంబగు భాగవత ముపదేశించినందువల్ల శివుండు జ్ఞానప్రదాత యను ప్రతీతి కలిగినది. కాని యతండు స్వాభావికముగా దామసుండైయున్నాడు. మఱియు భవుండు కాశియందు రామ మంత్రోపదేశముచే ముక్తిదాయకుండందురేని యది క్రమముక్తికిం గారణమే కాని సద్యోముక్తిప్రదంబుగాదు. కనుక

సాత్వికులగు ముముక్షువులెవ్వరును భవునుపాసించరు. దానిచే విష్ణువే సర్వోత్కృష్టుఁడు.

శ్లో॥ మోక్షాపేక్షాన్వితానామపిచ యతిపతేర్దివ్యనారాయణాఖ్యా
సంపత్తేరేవ లోకే స్థిరపరమపద ప్రాపకత్వ ప్రసిద్ధేః।
స్వాకర్తృత్వేన ముక్తిర్గిరిశనిగదితాత్ కేశవస్యైవహస్తాత్
సాక్షాన్మోక్షప్రదత్వాదపి న పశుపతిర్విష్ణురేవ ప్రకృష్టః 29

మోక్షాపేక్షగలవారందఱికి మదాచార్యుండును యతీంద్రుండునగు రామానుజులవారి మతమునందు దివ్యనారాయణాఖ్య సంపత్తిచే బద్ధులకుఁగూడఁ బరమపదంబు సులభముగా లభించుచున్నది. గోవిందనామ మొక్కమా ఉచ్చరించుటచే ముక్తి గలుగునని సహస్రనామ ప్రమాణము లున్నవి. మోక్షమిచ్ఛే జ్జనార్దనాత్తని యున్నదిగదా కేశవునకు మాత్రమే సర్వముక్తినొసంగుటకు సాక్షా దధికారముగలదని శివుండే చెప్పియున్నాడు. "ఆదిత్యమంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరమ్మ"ని చెప్పఁబడు పంచాయతనపూజ కామ్యఫలప్రదము మాత్రమే యగుటవల్లను నవైదిక మగుటవల్లను విష్ణువే సర్వోత్కృష్టుఁడు.

శ్లో॥ ప్రాలేయాద్రీంద్రకన్యావయవ విలసనాద్యోని పీఠస్య పుంస
స్త్రద్రూపాయోగ్య భావాదపిచ పృథగవస్థా నయోగ్యత్వతస్తేన
నిత్యం వైశిష్ట్యరూపాద్వయమత వచనాయుక్త భావా ద్విశిష్టా
ద్వైతస్య స్వాస్య లింగావితయుతతయా చక్రిణో యుక్త్యయుక్తేః 30

శివలింగపీఠముగానున్న పానవట్టము విష్ణువని పూర్వపక్షులు చెప్పు నాక్షేపమునకు నిరాసము. లింగపీఠముగానున్న పానవట్టము పార్వత్యవయవమని లింగపురాణమునఁ జెప్పఁబడె

యున్నది. శివునకులేని పరత్వమును స్థాపించుటకుఁ దదీయ మతస్థులకు నాధారమేమియులేక పరబ్రహ్మమగు నారాయణుని దూషించుటయేముఖ్యాధారముగాఁ బెట్టుకొనియున్నారు. కాని వారి మృషాలాపములకు లొంగి "ఉత్తమః పురుష స్త్వన్యః, పరమాత్మే త్యుదాహృతః" యను గీతావాక్య ప్రతిపాదితుండగు వాసుదేవుండట్టి నీచాకారంబేలధరించును! వేలువేలంగములైయున్న యోని లింగములకు రెంటికిఁగాదా చిత్కముగాఁగలుగు సంయోగము నిరంతర మెట్లుకలుగును. కుదృష్టి మతస్థుల వాక్యములు నిరాధారములు నిరర్థకములు గనుక విష్ణువే సర్వోత్కృష్టుఁడు.

శ్లో॥ యద్వాస్వాంగార్ధదానా ద్ధిమగిరి దుహితుః కేశవస్యావిశేష
స్వాంగార్ధస్య ప్రదానాన్మనసిజ విమతస్యాశరీరత్వసిద్ధేః
వైశిష్ట్యస్యా ప్రసంగాద్భవత ఉభయతశ్చిద్వి వర్గాపవర్గా
యుక్తత్వాదేవశక్తేరపి న పశుపతి ర్విష్ణురేనప్రకృష్టః 31

రుద్రుండు సగముశరీరము పార్వతికిచ్చుటచేతను హరి హర నాధావతారమునం దర్ధదేహము హరికిచ్చుటచేతను శరీరమే లేనివాఁడయ్యెను. శరీరములేని రుద్రునకు హరితో విశిష్టత్వము సెప్పుటయుఁ బినాకి పరబ్రహ్మమనుటయు ముక్తిప్రదుండనుటయు నసంభవము గనుక విష్ణువే సర్వోత్కృష్టుఁడని తీర్మానించి పరవాదుల నోరుమూయించి శ్రీవత్సాంకమిశ్రులు జయభేరీవేయించి శ్రీరంగమున కేగిరి.

ఇది కూరేశ నిర్మితంబైన మూలశ్లోకములతో ధర్మాచార్య విరచితంబైన వ్యాఖ్యానములతో మొవ్వ వేంకటదాస ప్రణీతంబైన యాంధ్ర తాత్పర్యములతోఁగూడిన కూరేశవిజయము సంపూర్ణము.

# వైష్ణవనిర్ణయము

సు శీ లుఁ డు

విష్ణువే సర్వజగత్కారణుఁడని సర్వోత్కృష్టదైవమని కూర త్తాళ్వారు సాధించిరి నీవునట్లే చెప్పితివి సర్వజనులు నారాయణుని మాత్రమే సేవింపుచు వైష్ణవులైయుండలేదే హేతువేమి 292

వ ర వ ర ము ని

లోకములోనుండు జనులు నానాదేశములయందు నానావిధాహారంబులు భుజింపుచున్నారు ఎట్లంటివేనిఁ గొందఱు జొన్నకూడు కొందఱురాగిసంకటి కొందఱు సజ్జసంకటి కొందఱు వరిగెకూడు మెక్కుచున్నారు కాని దేహధారణోపయోగమైన యాహారమెన్నికలుగానుండినను శాల్యన్నమే గొప్పదిగా నెన్నబడుచున్నది శుభాశుభకార్యంబులయందు మూఁగిన జనసంఘంబులకీయన్నంబుదక్క మఱియొకటి యోగ్యంబుగాదు సూపశాకదధిఘృత గోరసాదుల సాంపీడనంబు వల్లనే సాఫల్యమగుచున్నది దేవపితృయాగాది కార్యంబులయందీయన్నమే శ్లాఘ్యమైయున్నది దేవాయతనంబులయందు నివేదనార్హంబగు (పాయసము) దధ్యోదనము, పులిహోర చక్కెరపొంగలిముద్గాన్నప్రముఖపదార్థంబుల కీవరియన్నమే యాధారమైయున్నది శాల్యన్నంబిట్టి ప్రభావంబుగలదియైనను దుర్లభంబగుటచేఁ గొందఱును సామర్థ్యంబెఱుఁగని కతంబునఁ గొందఱును సరిపడక కొందఱును భుజింపఁజాలకున్నారు. 293

సు శీ లుఁ డు

శాల్యన్నము సరిపడనివారుకూడ నున్నారా? 294

వ ర వ ర ము ని

లేకేమి! బలుమందిగలరు. శాల్యన్న మొక్కటియేకాదు. శ్లాఘ్యపదార్థములు సరిపడనివా రనేకులుగలరు. శాల్యన్నము మెక్కి

నచో నొక్కనిఁ జఠరశూల కలుగును, వేఱొకనికి వాంతులు విరేచనంబులు పుట్టును, దధి ఘృత గోరస నవనీత పాయసాపూపంబులపాయకరంబు లగుటచే మానుకొన్నవారు సమస్తదేశములందుఁ గలరు, ఆశ్లేషయందఱు భగవద్భక్తులు కాజాలరు. భవ్యపదార్థంబుల దాఁటి దురాహారంబులు మెక్కు దుష్టులభంగి రాజస తామసులు విష్ణుప్రభావం బెఱుంగఁజాలకయు నెఱింగినను రుచింపకయు రుచించినను శ్రద్ధలేకయు శ్రద్ధయున్ననుఁ ద్వరలేకయుఁ గాలంబుఁగడపుచు సాంసారిక వ్యాపారంబులలో మునుంగుచున్నారు దేవతారాధనచేయువారైనను క్షుద్రఫలముల కాసించి క్షుద్రదేవతలఁగొల్చుచున్నారు. సాత్వికులుమాత్రము పరమవైదికులై ముముక్షువులై రమాపతి నుపాసింపుచున్నారు. ద్వైతాద్వైత విశిష్టాద్వైతులు విష్ణుపరత్వస్థాపకులగుటచే వైష్ణవులైయున్నారు. కొందఱు రహస్యముగా శక్తినిఁ బూజించిననుఁ బ్రాతఃకాలంబున లేచి స్నానమాచరించి 'హరిః ఓమ్ శ్రీగోవింద గోవింద గోవింద మహావిష్ణో రాజ్ఞయా' యని వైదిక కార్యంబుల నారంభించుచున్నారు అద్వైతులైనను వికటవాదము చేయువానిం గాంచి యోరీ! అద్వైతముగా మాట్లాడుచున్నావేమిరా! యని గర్హింపుచున్నారు. శంకరాచార్యులవారు భగవద్గీతాభాష్యమును విష్ణుసహస్రనామ భాష్యమును రామకర్ణామృతమును లక్ష్మీనృసింహస్తోత్రమును భజగోవిందశ్లోకములను నారాయణపరముగా రచించి నారాయణసాయుజ్యమొందినందువల్ల నమ్మహాత్ముఁడు పరమవైష్ణవుఁడైయున్నాఁడు. పండితాగ్రేసరుఁడై వైష్ణవ తిరస్కారార్థముగా శివపరత్వ స్థాపకుఁడగు అప్పయ్యదీక్షితులవారు చరమదశయందు. 295

శ్లో॥ భవద్ద్వారి క్రుధ్య జ్జయవిజయ దండాహతి దల
త్కిరీటాస్తేటా ఇవ విధి శివేంద్ర ప్రభృతయః
వితిష్ఠంతేయుష్మన్నయన పరిపాతోత్కలికయా
వరాకాః కేతత్రక్షపిత మురనాకాధిపతయః 296

ఓమురాంతకా! నీద్వారమునందుఁ గోపించి జయవిజయులు కొట్టఁగాఁ గిరీటములు పగిలిన బ్రహ్మరుద్రేంద్రాది నిర్జరులు నీకటాక్షప్రాప్తికొఱకుఁ గిటకములవలెఁ గాచుకొని యున్నారు నిక్కృష్టులగు తక్కినవేల్పులఁ జెప్పనేలయని వరదరాజ స్తవంబునందు గానియూడెనింతేకాక యాసూరివర్యుఁడు వృత్తిఁజెందినప్పుడు మొదలొనుండు బంగారుభూషణము శోధింపఁగా గోపాలసాలగ్రామముండె నప్పుడితండు వైష్ణవుండని తీర్మానించిరట. దీనింబట్టిచూడఁగా నప్పయ్యదీక్షితుల వారు వైష్ణవుండని తేలినది. భగవద్గీతకొక భాష్యమువ్రాసి యద్వైతసిద్ధియను గ్రంథము రచించిన మధుసూదన సన్యాసి ఆనందమందాకిని యను గ్రంథంబునందు. 297

శ్లో॥ యత్పాదాంబు విధాయ మూర్ధని శివత్వం హారా
ప్రాప్తో భక్షిత కాలకూటనికరో మృత్యుంజయత్వం యయౌ
దిగ్వాసా స్వకపాలమాత్ర విభవ శ్చేశానతాం
సత్వం నందసియస్య మందిరే తో నందాయ తస్మై నమః 298

ఎవ్వని పాదతీర్థము శిరస్సున ధరించి స్మశాన వాసుండగు రుద్రుఁడు హరాత్ముగా శివత్వమునుఁ బొందెనో కాలకూటంబునుఁ గ్రోలియు మృత్యుంజయుఁడయ్యెనో దిగంబరుఁడై నరకపాలమును ధరించుమాత్రమువిభవము గలిగియు నీశానత్వ మొందెనో యట్టి నీవెవ్వని మందిరంబున సంతోషింపుచున్నావో యానందునకు నమస్కారము. 299

శ్లో॥ మధ్యాహ్నే యమునాతటే విటపినాం మూలే వయస్యైస్సమం
దధ్యన్నాన్యుపభుజ్యరజ్యతి పునస్తల్క్రీడనేచ్ఛయా
దేవేంద్రత్రిపురాంతకః కమలభూం స్యేచనాకాలయాః
కాకాకారజుషోముహుః కబళయంత్యుచ్ఛిష్టమిస్తంతవ 300

ఓ కృష్ణా! నీవు మధ్యాహ్నకాలమునందు నృపసూనాలముసఁ గూర్చుండి స్నేహితులఁగూడి దధ్యన్నమును భుజించి మరలఁ గ్రీడార్థమేగఁగా శక్ర హర విరించనాది దేవతలు కాకరూపములుదాల్చి నీవు భుజించినచోట రాలిన మెతుకులు మాటిమాటికిఁ బ్రీతితో భుజింపుచున్నారని వచించెను. దీనిచే మధుసూదనసరస్వతి వైష్ణవుఁడై యున్నాడు. 301

శ్లో॥ జగత్త్రయత్రాణ విధాధృతవ్రతం
తవాంఘ్రిరాజీవమపాస్య యే జనాః
శరణ్యమన్యం మృగయంతి యాంతి తే
నితాంత మీశాన కృతాంత దేహలీమ్

ఓభగవంతుండా! ముల్లోకంబుల రక్షించుటకు వ్రతంబుఁబూని యున్నావు. అట్టి నీపాదరాజీవంబు విడిచి యేజను లితర రక్షకులకై వెదకుచున్నారో యట్టివారు యమమందిరముఁజేరి బహు బాధలొందుదురని దేవతాంతరముల నిరసించెను గనుక పండితరాయలగు జగన్నాథుండును వైష్ణవుండు. కృష్ణకర్ణామృతమును రచించిన లీలాశుకుండునుఁ గృష్ణలీలాతరంగిణీ ప్రణేతయగు నారాయణతీర్థులవారును సంగీతవిద్యా విశారదుండగు త్యాగరాజస్వామియు వైష్ణవులు. ఇంతయేల యద్వైతమతస్థులలోఁ బూర్ణజ్ఞానులై జగత్ప్రసిద్ధులగు పండితులందఱు రామానుజీయులు కాకపోయినను విష్ణుభక్తులగుటచే వైష్ణవులనఁబడుచున్నారు. వల్లభాచార్యసంబంధులును రాధాకృష్ణమతస్థులగు జయదేవాదులును రామానంద తులసీదాస ప్రియదాస కబీర్దాస కమాల్దాస ప్రముఖోత్తరదేశీయులును వైష్ణవులు. నవద్వీపవాసుండగు చైతన్యస్వామియుఁ బండరీపురవాసులగు జ్ఞానదేవ నివర్తిదేవ సోపానదేవ నామదేవ నరహరి ఘోరాకుంభారు రాకాకుంభారు రోహిదాస చోకామేళులును, మీరాబాయి సక్కుబాయి గోమాబాయి మొదలగు వధూమణులును, నింబారాజ బోసలబావా తుకారాం

సమర్థరామదాస భద్రాద్రిరామదాస తూము నరసింహదాస ప్రభృతులును వైష్ణవులు. పూర్ణప్రజ్ఞాచార్యుల మతస్థులగు మాధ్వులందఱు వైష్ణవులు. వేదాంతదేశిక ప్రభృతి వడగలవారందఱు రామానుజీయ వైష్ణవులై యున్నారు. 302

సుశీలుఁడు

మీయుపన్యాసము వినుచున్నకొలఁది జగమంతయు వైష్ణవమయముగాఁ దోఁచుచున్నదే. 303

వరవరముని

వత్సా! సౌర శాక్తేయ గాణపత పాషండ కాపాలికాది మతంబులు రాజస తామస పురాణకల్పితంబులు గాని వైదికంబులుగావు. జైన చార్వాక బౌద్ధాది మతంబులు నిరీశ్వరవాదయుక్తంబులు నారాయణ పారమ్య మంగీకరించియు దేవతాంతరపరులైనవారు మిశ్రవైదికులు రామానుజీయులందఱు పరమవైదికులు.

సుశీలుఁడు

సౌర శాక్తేయాది మతంబులతో విష్ణునకు సంబంధము లేదా యేమి ? 305

వరవరముని

జగత్కర్తయగు విష్ణునకు సంబంధములేని మతంబెద్దియు లేదు కాని నారాయణుండు తనభక్తులకుమాత్రము శాశ్వతానందప్రదంబగు పరమపదంబిచ్చును. తక్కినమతస్థులను లీలావిభూతిస్థంబులగు నూర్ధ్వాధోలోకంబులఁ ద్రిప్పుచు లీలను నుపయోగపఱచుకొనును.

సుశీలుఁడు

లీలోపయోగమనఁగా నర్థమేమి ? 307

వరవరముని

సర్వేశ్వరునకు లీలావిభూతియని నిత్యవిభూతియని ప్రఖ్యాతి గొన్న విభూతిద్వయంబు గలదు. విరజానది కీవలనుండు సమస్తలోకంబులు లీలావిభూతి, విరజ కవ్వలనుండునది నిత్యవిభూతియని చెప్పఁబడును. ఎనుబదినాలుగులక్షల రకములుగానుండు జంతుకోటులన్నియు లీలావిభూతియందు నొక్కచోటనైన నిల్కడలేక దేవ తిర్యఙ్మనుష్య స్థావర సర్ప క్రిమి కీటక వృక్ష లతాగుల్మాదులై జనింపుచు సుఖ దుఃఖంబు లనుభవింపుచుండఁగా భగవంతుఁడు వీక్షింపుచుఁ గాలక్షేపము చేయుటే లీలయనఁబడును. 308

సుశీలుఁడు

ఇఁకఁ బరమవైదికుల నెఱింగింపుఁడీ. 309

వరవరముని

ఆదియందు వైష్ణవంబుఁ బ్రకటించిన వ్యాసబోధాయన టంక ద్రమిడాచార్య భారుచి గుహదేవప్రముఖులు వైష్ణవులు. వెండియు నయోనిజాతులగు పొయ్గపూదప్పేయాళ్వారలును కేవల భగవద్భక్తి విద్యా పాండిత్యంబుచేఁ బాండ్యసభామధ్యంబున విష్ణుపారమ్యము నెలకొల్పిన పెరియాళ్వారును రుద్రుని మెప్పించి భక్తిసారులని పేరుఁ గాంచిన తిరుమలిశైయాళ్వారును దృణీకృతాధిక ప్రాభవుండై సకలోపనిషత్సారంబగు ముకుందమాల రచించిన కులశేఖర దివ్యసూరియు శ్రీరంగంబున నంబెరుమాళ్ళచే భోగ్యంబుగాఁ గబళింపఁబడిన యోగివాహనుండును బాల్యంబునందే గాఢవైరాగ్యం బవలంబించి హరికి సూనమాలాకైంకర్యం బొనర్చిన తొండరడిప్పొడియాళ్వారును శ్రీరంగంబునఁ గోవెల గోపుర ప్రాకార మంటపాదులు నిర్మించి ప్రత్యక్ష వైకుంఠంబొనర్చిన తిరుమంగయాళ్వారును జనించుటాదిగాఁ దల్లి చనుఁబాలైనం గ్రోలక భగవద్గుణానుభవంబుచే ముప్పది

నాలుగేడులు శరీరంబుఁ బోషించిన నమ్మాళ్వారును నిజభక్తపుష్ప మాలికలచే రంగేశుని మెప్పించి మగనిగాఁ గైకొన్న గోదాదేవియు శరణోపకృత పద్యమాత్రంబుచే రెండువేలమంది మతాంతరుల నోడించిన మధురకవియాళ్వారును వైష్ణవులగుటయేకాక శ్రీవైష్ణవులై యున్నారు. 310

దృశ్యపదార్థంబులెల్ల విష్ణుస్వరూపంబుగాఁ గాంచి తదీయధ్యానంబుచే దేహేంద్రియ ప్రపంచంబులు మఱచి హరిపదంబుఁ జెందిన నాథమునీంద్రుండును నాథమునీంద్రుని దివ్యశాసనంబు వహించి భక్తాగ్రేసరుండైన పుండరీకాక్షుండును దదీయశిష్యుండై యామునమునీంద్రులకు నాచార్యుండైన శ్రీరామమిశ్రుండును ద్వాదశవర్షప్రాయంబున విద్వజ్జన కోలాహలునోడించి సకలవేదాంతసారంబగు స్తోత్రరత్నమును రచించి పంచమంబులఁ బునీతులఁ జేసి కుమతధ్వాంత దివాకరుండై భగవన్మహిమంబును భూలోకవాసులకుఁ బ్రకటించిన యామునాచార్యులవారును దదీయశిష్యులై రామానుజులవారికి దేశికులైన మహాపూర్ణ శ్రీశైలపూర్ణ గోష్ఠీపూర్ణ కాంచీపూర్ణ మాలాధరాఖ్యలుగల పంచమంబులును జగదాచార్యులై వైష్ణవసిద్ధాంతంబును సర్వదేశములయందు నెలకొల్పి శ్రియఃపతిచే నుభయవిభూతి నాయకత్వమువహించి బ్రహ్మసూత్రభాష్యగీతాభాష్యాద్యనేక వేదాంత గ్రంథంబులు రచించి మనుష్యులకేకాక పశు పక్షి మృగాదులకుఁ బరమపదంబొసంగిన రామానుజులవారును తీక్ష్ణవైరాగ్యంబుచే విషయానుభవమును వర్జించి గురుభక్తియందు హరిభక్తియందు నాఁటివెలసిన యెంబారును యావజ్జీవపర్యంతము మహాసౌందర్యవతియగు భార్యతోనైన భోగింపక వానప్రస్థాశ్రమంబు స్వీకరించి కేవల విష్ణుప్రసాదలబ్ధసంతానుండై యేడహోరాత్రంబులకు వేయిమంది కుదృష్టిమతపండితుల నోడించి వైష్ణవసిద్ధాంతస్థాపకుండైన శ్రీవత్సాంకమిశ్రులును భగవదేకాంతియై వేదాంతిని జయించి రామానుజమునిఁ జేసిన పరా

శర భట్టరువారును ద్రావిడవేదంబు లన్నియుఁ గ్రోడీకరించి యేక
రాశిగా నొనర్చి రంగేశ్వరునిచే సర్వస్వ దానంబుఁబడసిన నంజియ్య
రును వటవృక్షంబునకు మోక్షమిచ్చి ద్రావిడవేదోపదేశంబుచే జను
లను ధనుల్యఁజేసి పరమపదములోఁ బత్రికఁజెల్లించిన నంబిళ్ళయు
సురాంగనాతుల్య సౌందర్యవతియగు జాయతో గుర్వాజ్ఞా నిర్బంధం
బుచే రెండుమాఱులుమాత్రమే భోగించి పుత్రరత్నద్వయంబునుఁ
గాంచిన శ్రీకృష్ణపాదదేశికులవారును అష్టాదశరహస్యంబులను గ్రంథ
రత్నంబుల నిర్మించి లోకోపకారంబొనర్చిన పిళ్ళలోకాచార్యులవారును
ఆచార్యహృదయకోశరచనచే గర్వాంధుల కులమదంబుఁ దూలంగించి
నానాజాతులకు వైష్ణవసిద్ధాంతాధికారంబొసంగిన అళహియమణవాల
ప్పెరుమాళ్ళనయనాచార్యులవారును భగవత్ప్రభావ ప్రతిపాదకంబగు
తిరువాయిమొళి జీవనప్రాయంబుగా మెలంగిన మదీయాచార్యుండగు
శ్రీశైలేశులును అభయప్రదానసారాద్యనేక పవిత్రగ్రంథంబులు
నిర్మించి శిష్యపరంపరపై నాచార్యత్వంబు నెఱపిన పెరియవాచ్చాం
బిళ్లగారును హయగ్రీవావతారుండై శతదూషణ్యాద్యనేక గ్రంథంబులు
నిర్మించి రామానుజ సిద్ధాంతాభివృద్ధిఁజేసిన వేదాంతదేశికులవారును
వైష్ణవశిఖామణులైయున్నారు. 311

భాగవతులు

సుశీలా! మదీయాచార్యవర్యుండగు నిమ్మణవాలమహామునీం
ద్రులును అఘటనఘటనాసమర్థులైరామానుజ సిద్ధాంతము నుద్ధరింపు
చుమనబోటివారికి మోక్షమార్గంబునుపదేశింపుచున్నారు. రామాను
జశిష్యపరంపరలు కోట్లకొలంది వైష్ణవులై ప్రకాశింపుచున్నారు. ఇక్కా
లంబున నివ్వరవరమునీంద్రులు మనకులభించుట మహాభాగ్యంబని
తలంపుము. 312

సుశీలుఁడు

నరవరమునీంద్రా ! మీరు చెప్పినవాండ్లు మన భరతఖండ నివాసులేగాని యితర ఖండస్థులగు మహమ్మదీయులు హూణులు వైష్ణవులుగా రెందువల్ల ? 31౯

వరవరముని

వారివిషయ మంతగాఁ బ్రశంసనీయముగాదు. భగవత్సృష్టి యొక్కొక్క దేశంబున నొక్కొక్క విధంబుగానుండును. ఒక్కచోట మంచు విశేషముగానుండును, అచ్చటిమనుష్యులు శ్వేతవర్ణముగా నుందురు. ఉష్ణాధిక్యముగలచోట మనుష్యులు నల్లగానుందురు. సమ శీతోష్ణములుగలచోట శ్వేతాధిక్యము నీలాధిక్యములేక చిత్రవర్ణ ముగా నుందురు. సృష్ట్యాదిలోనే రాక్షసు లధర్మ ప్రవర్తకులుగాను దేవతలు సన్మార్గప్రవర్తకులుగాను నుండిరి దానవులనుగూడ ధర్మప్ర వర్తకులఁ జేయనలయునన్న వీలుగాదుగదా యట్లే యీదేశ మాది నుండి పుణ్య పాప విమర్శనముగలిగి యీలోకమునుఁ దృణప్రాయము గాను స్వర్గ మోక్షముల నత్యంతాసక్తితోను భజింపుచు సదాచార సంపత్తిగలిగియున్నది. ప్రవృత్తినిష్ఠులీ దేశంబున స్వల్పముగా నివృత్తి నిష్ఠు లధికముగానుందురు. తక్కిన ఖండంబులలో నివృత్తినిష్ఠులు మిక్కిలి స్వల్పముగానుందురు, పాశ్చాత్యుల సాంగత్యముచే నిప్పుడే తత్ఖండవాసులును మిక్కిలిగాఁ బ్రవృత్తి ధర్మమునే యాచరింపు చున్నారు. కాని పూర్వమునుండి యీ భరతఖండము శ్రుతి స్మృతీతి హాసంబులతోఁ బవిత్ర కావ్యంబులతోఁ శస్త్రాస్త్రవిద్యానిష్ణాత విద్వ లతోఁ ఋషులతోఁ దేదీప్యమానమగుచున్నది. దీనియందు మాతాపితృభక్తి గల పుండరీకాదులును శుక వ్యాస పరాశర హారీత ప్రభృతి మునీంద్రు లును హరిశ్చంద్రాది సత్యవ్రతపరాయణులును హనుమద్గాంగేయాది పవిత్ర బ్రహ్మచారులును యుధిష్ఠిరాది ధర్మవర్తనులును బలి శిబికానీన దధీచి ప్రముఖ వదాన్యశేఖరులును కాళిదాసాది కవితావిశారదులును

పురాణేతిహాస కర్తలగు వాల్మీకి వ్యాసాదులును నారద త్యాగరాజాది గాయక సార్వభౌములును అనసూయారుంధతీ సీతా సావిత్రీ ప్రముఖ సాధ్వీమణులును శంకర రామానుజ మధ్వాచార్యాది మతకర్తలును భగీరథాది వంశోద్ధారకులును రామ కృష్ణాది పరబ్రహ్మస్వరూపులును ఈఖండంబునందే జన్మించిరి. 314

మహాత్ముల చరిత్రములువిని తలలూచి సంతోషించువారఖిల దేశంబులఁగలరుగాని యేతత్ఖండవాసులంబోలె లోకవాంఛల నీసడించి సత్య జ్ఞాన భక్తి వైరాగ్యాదులకై ప్రాణంబు లర్పించువారేఖండంబునం గానరారు. రత్నంబులు సముద్రమునందును గనులయందునుఁ బుట్టునుగాని పల్వలంబున జనింపవు. హంసలు మానసహ్రదంబున నుండునుగాని బురదగుంటలలోనుండవు. దంతావళంబులు రాజాస్థానంబుననుండునుగాని దరిద్రునియింటిలోనుండవు. కామధేను వింద్ర లోకంబున నుండునుగాని గొల్లవాని మంటయందుండదు. రామ కృష్ణాద్యవతార పురుషులు జనింపవలయునన్నచో దశరథ వసుదేవుల వంటి తపస్సంపన్నులును దేవకీ కౌసల్యలవంటి తపస్వినులగు సాధ్వీమణులుండవలయు నయ్యవతారపురుషుల మాహాత్మ్యంబెఱిఁగి గౌరవించి యితరులకుఁ దెలుపుటకు వసిష్ఠ విశ్వామిత్రాగస్త్య శరభంగ సుతీక్ష్ణ ప్రముఖ జ్ఞానసంపన్నులుండవలయు నట్టివారులేని యీపాపిష్ఠి కాలంబున భగవంతుఁడవతరించిననుఁ బ్రయోజనంబు లేదు. అట్లె వైష్ణవజనంబు లార్యావర్త పుణ్యభూమియగు మనఖండంబుననే జనింతురు. 315

సుశీలుఁడు

తక్కినఖండంబులవారికి దేవుడున్నాడా లేడా! 316

వరవరముని

సర్వం విష్ణుమయం జగత్తను ప్రమాణమునననుసరించి సర్వలోకంబులకు నశేషఖండంబులకుఁ బ్రభువై విష్ణుదేవుఁడే రక్షించుచున్నాడు.

కాని యాయా దేశములకుఁ దగినట్లు మతకర్తల సృజించి వారియందావేశించి కర్మానుగుణముగా నాయా జీవులకు ఫలంబులిచ్చుచున్నాఁడు. 317

సుశీలుఁడు

ఏకాలమందైన నేదేశమందైనను భగవత్కృపాపాత్రులకంటె లీలాపాత్రు లధికముగా జన్మింపుచుందు రెందువల్ల? 318

వరవరముని

పరమపదము త్రిపాద్విభూతి. యచ్చట భగవత్కృపాపాత్రులే యుందురు ఇది లీలావిభూతి కావున లీలాపాత్రులే యుందురు కాని భగవంతుఁడు స్వకీయ ప్రభావ ప్రకటనార్థము తనభక్తులను స్వల్పముగా నప్పుడప్పు డచ్చటచ్చట సృజింపుచుండును. 319

సుశీలుఁడు

సరేగాని యిఁక వైష్ణవవిషయం బెఱింగింపుము. 320

వరవరముని

విష్ణువే జగత్కారణుఁడైనచో నందఱు నతని నేల భజింపరని ప్రశ్నించితివి. దానికి సమాధానంబుగాఁ గొంత యెఱింగించితి నింకను వచింతు విను మెట్లంటివేని బుద్ధిపూర్వకముగా నబుద్ధిపూర్వకముగాఁ గేశవుని భజించువారే బహుసంఖ్యాకులై యున్నారు. ప్రతిగ్రామంబున రామమందిరములు నిర్మించి శ్రీరామనవమినాఁడు సీతారామకల్యాణము చేయింపుచున్నారు, గోకులాష్టమినాఁడు శ్రీకృష్ణజన్మోత్సవంబు గావింతురు. వైశాఖంబున నృసింహజయంతి చేయుదురు. అనంతపద్మనాభుని నోములు నోచుకొందురు. సత్యనారాయణవ్రతంబెక్కువగా నాచరింతురు. శనివారమునాఁడు వేంకటేశ్వర పూజయు నమావాస్యయందుఁ దిరువఖ్యారి వీరరాఘవ పూజయుఁ జేయుచుందురు. చిలుకద్వాదశియందు విష్ణుదేవుని సుధామథనావతారోత్సవము

గావింతురు. తిరుపతి శ్రీనివాసప్పెరుమాళ్ళ మ్రొక్కుబడిలేని దేశముగాని యిల్లుగాని జాతిగాని లేదు. వేంకటేశ్వరుని సన్నిధికిఁ బ్రతిదినంబునుఁబోవు జను లసంఖ్యాకులైయున్నారు. ఇప్పుడు పేర్కొనఁబడినవారు వైష్ణవులని తలంపుము. మ్రొక్కుబడితీర్చుటకుఁ దిరుమల కేగ యత్నించువారు గోడలయందుఁ గలశంబులయందు స్వకీయ లలాటంబులయందునుఁ దిరుమణీ శ్రీ చూర్ణంబులు ధరించి గోవింద నామోచ్చారణము చేయుచు శేషాద్రి కేగి స్నానానంతరము స్వామిని దర్శించి తిరిగి యిల్లుసేరువఱకు నియమముతో విష్ణులాంఛనంబులు ధరించి హరిభజనంబు గావించి తిరిగి సాంసారికకృత్యంబులఁబ్రవేశించుదాఁక వైష్ణవులైయున్నారు. తిరువళ్ళూరిలో సహాబిలములో వేదాద్రిలో మంగళగిరిలో మఱియు ననేక దివ్యస్థలంబులలో జనసంఘంబు లనిష్ట నిఃసనార్థము యిష్టప్రాప్తికొఱకు నసంఖ్యాకులుగా మూఁగుచున్నారుగనుక వారందఱు వైష్ణవులని తలంపుము.

తిరుమలలో మ్రొక్కుబడి దూఱి జగన్నాథములో యాదవాద్రిలోఁ బ్రసాదము దూషించి విపత్తుఁజెందనివాఁ డింతవఱకు లేడు గనుక సమ్మతించువారందఱు వైష్ణవులే స్వాధ్యాయపరు లాపన్నివారణార్థము కాంచీపురంబున కేగి వరదుని సన్నిధియందు నానాదేశస్థులు నెలలకొలఁది వేదాధ్యయనము చేయుచున్నారు. వారక్కాలంబున వైష్ణవులైయున్నారు. శ్రాద్ధముచేయువారందఱు విష్ణుస్థాన మేర్పరచి విష్ణుపాత్రనిచ్చి విష్ణుస్తోత్రముతో ముగింపుచున్నారు గనుక వారు వైష్ణవులే. "విష్ణుర్యోనిం ప్రకల్పతే" యను మంత్రము సెప్పుటవల్ల గర్భాధానము చేయువారందఱు వైష్ణవులే. మఱియు సాతానులు పంచమదాసులు చెంచువారు వడ్డెవారు ఉప్పర్లు మొదలగువారిలో నాజన్మవైష్ణవు లనేకులుగలరు. వైష్ణవస్వాములకు శిష్యులైన కమ్మవారు కాపువారు రెడ్డివారు వెలమవారు వైశ్యులు క్షత్రియులు నియోగులలోఁ గొందఱు గోల్కొండవ్యాపారులు మొదలగువారును వైష్ణవులైయున్నారు. శైవాది మతాంతరులు ఏదేశమందైన నేకాల

మంద్రైన స్వల్పసంఖ్యాకులైయున్నారు. "నారాయణః పరంజ్యోతి రాత్మా నారాయణః పరః" యను మంత్రపుష్పము నారాయణునకు దేవాలయములయందును బఠింపుచున్నారు. అప్పుడు సర్వదేవతలును నదియారాధకులును వైష్ణవులే యగుచున్నారు. దేహధారులందఱికి వైష్ణవము జన్మముతో వచ్చియున్నది. తక్కినమతంబులన్నియుఁ దెచ్చిపెట్టుకొన్నవి. వారివారి కర్మానుసారముగా లభించినవి. ఏమతస్థుఁ డేదేవతనుపాసించినను గమ్యస్థాన మొక్కటేయని కొందఱు ఉపదేశకులు చెప్పుచున్నారు. కాని యది యబద్ధము మాలపల్లెమార్గమునఁ బోవువాఁ డగ్రహారంబు చేరడు. అగ్రహారమార్గమునంబోవువాఁడు మాలపల్లె జేరడు. ఏమార్గమునఁబోవువాఁ డాదేశమునఁ జేరును. సముద్రాభిముఖుఁడై పోవువాఁ డిల్లుసేరడుగదా! కనుకనే,

శ్లో॥ యేప్యన్యదేవతాభక్తాః, యజంతే శ్రద్ధయాన్వితాః
తేఽపి మామేవ కౌంతేయ, యజంత్యవిధిపూర్వకమ్

ఎవ్వారు యితరదేవతాభక్తులై శ్రద్ధతోఁ బూజింపుచున్నారో వారు నన్నుఁ బూజించువారే కాని యది విధిపూర్వకమైన పూజకాదు. 322

శ్లో॥ అహంహి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ
నతుమామభిజానంతి, తత్త్వేనాతశ్చ్యవంతి తే

నేను సర్వయజ్ఞములకు భోక్తనై ప్రభువునైయున్నాను. ఈవిషయము యథార్థముగా వారెఱుంగరు కావున పతనముఁ జెందుచున్నారు. 323

శ్లో॥ యాంతి దేవవ్రతా దేవాన్, పితౄన్ యాంతి పితృవ్రతాః
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపిమాం

దేవతలఁగూర్చి వ్రతములుసేయువారు దేవలోకమును పితృదేవతలఁగూర్చి పూజించువారు తదీయలోకమును భూతములఁబూజించు

వారు భూతలోకమునుఁ బొందుదురని గీతాచార్యులవారానతిచ్చిరి. కాఁబట్టి సర్వదేవతాభక్తులకు గమ్యస్థానమొక్కటియను మృషాలాపములను బుద్ధిమంతు లెన్నటికిని విశ్వసింపఁగూడదు, 324

శ్లో॥ విష్ణుభక్తి పరో దేవో, విపరీత స్తథాసురః

విష్ణుభక్తిపరుఁడు దేవుఁడనియుఁ దదితర భక్తుఁ డసురుం డనియుఁ బ్రమాణమున్నదిగనుక దేవతలందఱు విష్ణుభక్తులగుటచే వైష్ణవులైయున్నారు. 325

సీ॥ వైకుంఠనాథు నాభీకంజభవుఁడైన
సరసిజాసనుఁడు వైష్ణవుఁడుగాడె
విధికిజనించి శ్రీవిభుపాదజలము ని
చ్చలుదాల్చు శివుఁడు వైష్ణవుఁడుగాడె
వామనాగ్రజుఁడై దివంబుఁ గ్రమ్మరఁగొన్న
శంబధరుండు వైష్ణవుఁడుగాడె
దనుజారికృపచే సుధారసంబార్జించి
చవిఁగొన్న సురలు వైష్ణవులుగారె
వారిజాక్షు చక్రధారచే నీల్గి మో
క్షమునుఁ గాంచినట్టి సర్వదైత్య
వరులు నారయంగ వైష్ణవుల్గద వైష్ణ
వేతరుండుగలఁడె వ్రాతశీల, 326

సీ॥ ఆది గోవిందాఖ్య హరినామములఁగూడి
హరిపరంబైన గాయత్రి మనువు
మఱునక శ్రీరామ మంత్ర జపముచేఁ బ్ర
శస్తిఁగాంచిన శీతశైలపుత్రి

విద్యాధిదేవతా విఖ్యాతిచే విష్ణు
జనియై వెలంగు భాషావధూటి
సకల సస్యోద్భవాస్పదమై మురారి ద్వి
తీయయై తగు ధరిత్రీపురంధ్రి

విష్టపత్రయము పవిత్రంబుసేయుచుఁ
జెలఁగు గంగ భూరి తులసి వైష్ణ
వత్వ సిద్ధిఁగాంచి వర్తింపుచున్న వి
తరులఁజెప్పనేల ధన్యశీల. 327

సీ॥ గౌరవౌదార్య సౌఖ్యప్రాభవములకు
సంభవాగారమే జలధిపుత్రి
లావణ్య సౌందర్య జీవన ధైర్య శు
భములకు నిలయమే పరమసాధ్వి
ధన ధాన్య కనక వస్త్ర మణీచయములకు
స్థానమైయొప్పునే సరసిజాక్షి
హర విరించ నసురేంద్రాది లోకైశ్వర్య
ములకు నాధారమేపొలఁతిమిన్న

యట్టిలక్ష్మి కేశవాంగనయై వైష్ణ
వత్వ మొందియుండ వసుధనామె
కరుణఁగోరువారుగద జీవులెల్ల వై
ష్ణవులుగారె తలఁప సాధువర్య. 328

సీ॥ ఘనతపంబున హృషీకవ్యాప్తి నడగించు
యోగీంద్రు లనురాగ మొందఁజేసి
విషయ వైరాగ్యంబు వివిధసూక్తుల జనా
వళికి బోధించు సూరులనదల్చి

గండరగండులై ఖండనంబున విరో
ధుల గెల్చు ధైర్యవంతుల నెదిర్చి
మహనీయులై మహిమంబుచే నిరతంబు
నుప్పొంగు జేజేలయుబ్బు మాన్పి

స్త్రీల కూడికములు సేయించి పూవింట
నెల్లలోకముల జయించి కామ
సౌఖ్యమిచ్చు పంచసాయకుం డనలేని
వైష్ణవుండుగాడె వరగుణాఢ్య. 329

వెండియు రాక్షసులలోఁ బ్రహ్లాదుండు బలిచక్రవర్తి విభీష
ణుఁడు మొదలగువారును వారివారి సంబంధులును వైష్ణవులు. 330

పూర్వము "అచ్యుతాయనమః"యని సముద్రమును గ్రుక్కెఁడు
నీరుసేసి యాపోశనించినవాఁడును స్వకీయాధ్వరకాలంబున యాగభోక్త
వని రామునిఁబొగడి జీవమణి నర్పించిన కుంభసంభవుండును 'నదైవం
కేశవాత్పరమ్మని' గంగాతీరమ్మున ముమ్మాఱు బాసఁజేసిన వ్యాసుం
డును కృష్ణలీలాప్రసంగంబుచేఁ బరీక్షిత్తును ముక్తికనిచిన శుకయో
గీంద్రుండునుఁ బ్రళయకాలంబున నన్నుఁగాపాడి దివ్యజ్ఞానమిచ్చినవాఁ
డీకృష్ణుండేయని ధర్మరాజున కెఱింగించిన మార్కండేయుండునుఁ
దత్త్వత్రయ ప్రతిపాదకముగా విష్ణుపురాణము రచించిన పరాశరుం
డును రామావతార వైభవం బనుభవించుటకు ననేక వర్షంబులు
సూర్యవంశజులకుఁ బౌరోహిత్యంబొనర్చిన వసిష్ఠుండును ధ్రువ ప్రహ్లా
దాదులకు విష్ణుమంత్ర ముపదేశించి యహోరాత్రము భగవన్నామ
కీర్తనమొనర్చు నారదుండును నారదున కనేకవర్షంబులు భగవ
త్తత్త్వము నుపదేశించిన నర నారాయణులును వైష్ణవాగ్రేస
రులునుమీా. 331

వైరాగ్యనిధానులగు సనకసనందనులును రావణునకు ముక్తి ప్రదుండును సర్వోత్కృష్టదైవంబును నారాయణుండని తెలిపిన సనత్కుమారుండును రాఘవు నాశ్రయించి సనాతనంబుఁ గావించుకొన్న విశ్వామిత్రుండును రామునకు స్వకీయతపంబు ధారవోసి ముక్తిఁగాంచిన శరభంగుండును సీతాపతీ భవద్దర్శనార్థము శక్రునిఁ దిరస్కరించి విమానమును బాలుఁడోలి నిలిచితినని వచించిన సుతీక్ష్ణుండును లక్ష్మణాగ్రజునకు శరణాగతిఁ జేసి ఖర దూషణాది వైరుల నిర్మూలించుకొని సుఖించిన దండకావనస్థిత మునిస్తోమంబులును లవణాసుర సంహారార్థము సీతావల్లభునకు శరణాగతిఁ జేసిన చ్యవనాదులును కోట్లవర్షంబులు రామనామంబు జపించి తదీయ పుణ్యంబున శ్రీరామాయణంబు రచించి త్రైలోక్యశ్లాఘ్య విద్వత్కవుల కాచార్యుండైన వాల్మీకియు వైష్ణవశిఖామణులు. సేనాన్వితుండగు భరతస్వామికి వానర సేనాన్వితుండగు శ్రీరామునకు స్వకీయాహార తపధనలబ్ధంబగు వస్తుసామగ్రిచే విందొనర్చిన భరద్వాజుండును సీతాదేవినిఁ బూజించి దివ్యాంగరాగంబొసంగిన యనసూయా త్రిమునీంద్రులును భవిష్యద్రామకైంకర్యం బొనర్పఁ దనకాయువులేదని దుఃఖించి సంపాతికి రామప్రభావం బుపదేశించిన నిశాకరమునీంద్రుండునుఁ ద్రిమూర్తుల శోధించి విష్ణువొక్కఁడే పరబ్రహ్మమని మునులకు బోధించిన భృగుమహర్షియు రామ పాదధూళిచే శాపంబు నశించునని చెప్పిన గౌతముండును సుహాసవతియగు నహల్యయు వ్యాసచ్ఛాత్రులగు పైలవైశంపాయనాదులును నారాయణార్పణంబుగా దీర్ఘ సత్రయాగంబొనర్చి ముక్తిఁగాంచిన శౌనకాది పావన సహస్ర మునిప్రవరులును తదీయ పారికాంక్షులకు విష్ణుకథాప్రపంచము నాకణించిన సూత పౌరాణికుండును శక్తి గాఙ్గేయ హారీతాదులును వైష్ణవ వరేణ్యులు. సౌగంధికానయనార్థమేగు భీమునకు విష్ణుపారమ్యమును బోధించినహనుమంతుండును యుధిష్ఠిరునకు ధర్మంబులెఱిం

గించుతటి నన్నిధర్మంబులకంటెఁ గృష్ణభక్తి శ్రేష్ఠంబని వక్కాణించి శ్రీకృష్ణుని ధ్యానింపుచు నిరీక్షింపుచు దేహత్యాగంబొనర్చి పరమ
పదమునొందిన భీష్ముండును వైష్ణవశ్రేష్ఠులు. 332

భూపుత్రికై ప్రాణంబులువిడిచి రామునిచేఁ జరమక్రియలు ప్రాపించిన జటాయువును సీతావృత్తాంతంబుఁ దెలిపి వానరుల దిగులు వాపిన సంపాతియుఁ గుశలవులచే రామాయణం బామూలాగ్రమాకర్ణించి దాశరథిచే ముక్తిఁగాంచిన కోసలదేశవాసులునుఁ దద్దేశసంస్థిత చరాచరభూతంబులును రామానుచరులగు డెబ్బదిరెండువెల్లవలవనచర
సమూహంబులును వైష్ణవశిరోమణులని తలపోయుము. 333

గోకులస్థంబులై కృష్ణసంబంధంబుగల గోగణ గోవత్స వృషభంబులును బృందావనస్థంబులగు తరు శాఖా లతా గుల్మాదులును వైష్ణవంబులు. శ్రీకృష్ణునియందు బద్ధానురాగులైన గోపీగోపాలక గోపార్భకులును గోవిందునియందుఁ బుత్రవాత్సల్యంబునెఱపిన నంద యశోదలును జనార్దనుని దివ్యమంగళవిగ్రహంబుఁ బ్రాపించి నిధువన సౌఖ్యంబునం దేలిన మూడులక్షల యేబదివేల వల్లవీరత్నంబులును దేవకీనందనునకు భార్యలై సమస్తభోగములందిన రుక్మిణీ సత్యభామా ప్రముఖాష్టమహిషీ వర్గంబును షోడశ సహస్ర రాజకన్యాలలామంబులును లోకోత్తర సౌందర్యాదులు ప్రాపించి వాసుదేవునిఁబొందిన సైరంధ్రియు శ్రీకృష్ణునిఁ గడుపారఁగనిన దేవకీ వసుదేవులును రుక్మిణీపతికిఁ బుత్ర పౌత్ర భ్రాతృ పరివారంబులై వృద్ధిఁజెందిన ముప్పదిమూడుకోట్ల యాదవులును శ్రీకృష్ణున కంతరంగభక్తులగు పాండవులును మాలాకార బహుళాశ్వోద్ధ వాక్రూర సంజయ విదురాదులును ద్రౌపదీ కుంతీ సుభద్రాదులును ఫలంబులచే రామునకుఁ దృప్తిఁగూర్చిన శబరియు మహాభక్తుండగు గుహుండును పృథుకంబులచే గోవిందునకు సాహిత్యంబొసంగిన కుచేలుండును మరణకాలం

బునజనార్దనుని స్మరించి ముక్తిఁగాంచిన ద్రోణుండును వైష్ణవప్రవరులైయున్నారు. శ్రీరంగాది దివ్యక్షేత్రములయం దాయాకాలమున నర్చావతారముల సేవించువారందఱు వైష్ణవులగుచున్నారు. లోకమంతయు విష్ణుమయంబైనట్లు వైష్ణవమయమైయున్నది. సంతోషమునొందుము. 334

వెండియు సూర్యుండు నారాయణుని నేత్రమునందునుఁ జంద్రుం డతని మనస్సునందును జనించెనను శ్రుతిప్రమాణమువలన నర్కేందులు వైష్ణవులైయున్నారు. 335

మఱియుఁ బ్రకాశించువారిలో సూర్యుఁడు నక్షత్రములలోఁ జంద్రుఁడు రుద్రులలో శంకరుఁడు యక్షరాక్షసులలోఁ గుబేరుఁడు వసువులలోఁ బావకుఁడు పురోహితులలో బృహస్పతి సేనాపతులలో స్కందుఁడు మహర్షులలో భృగువు దేవర్షులలో నారదుఁడు గంధర్వులలోఁ జిత్రరథుఁడు చతుర్ముఖుఁడు మునులలో వ్యాసుఁడు కవులలో శుక్రాచార్యుఁడు నావిభూతియని గీతాచార్యులవారు వక్కాణించుటచే వారందఱును వైష్ణవులు. ఇంద్రియములలో మనస్సు పర్వతములలో మేరువు జలాశయములలో సముద్రము శబ్దములలోఁ బ్రణవము యజ్ఞములలో జపయజ్ఞము స్థావరములలో హిమాలయము వృక్షములలో నశ్వత్థము భగవద్విభూతులగుటచే వైష్ణవములు. సంభవహేతువులలో మన్మథుఁడు నాగులలో ననంతుఁడు యాదస్సులలో వరుణుఁడు పితృదేవతలలో నర్యముఁడు దండించువారిలో యముఁడు పక్షులలో వైనతేయుఁడు చరించువారిలో వాయువు సిద్ధులలోఁ గపిలుఁడు గీతాశాస్త్రప్రకారము వైష్ణవులు. హయములలో నుచ్చైశ్శ్రవము గజములలో నైరావతము ఆయుధములలో వజ్రము గోవులలో గామధేనువు మృగములలో సింహము మత్స్యములలో మకరము నదులలో జాహ్నవి సృష్టికి నాదిమధ్యాంతములు విద్యలలో బ్రహ్మవిద్య వాదులలో వాదము అక్షరములలో నకారము సమాసము

లలో ద్వంద్వము హరించువానిలో మృత్యువు నారీమణులలో లక్ష్మి కీర్తి వాక్కు జ్ఞాపకశక్తి బుద్ధి ధైర్యము క్షమ సామములలో బృహత్సామము ఛందస్సులలో గాయత్రి మాసములలో మార్గశీర్షము ఋతువులలో వసంతము కుటిలురయందు జూదము తేజస్సులలో తేజస్సు సత్వవంతులయొక్క సత్వము రహస్యములలో మౌనము జ్ఞానులలోని జ్ఞానము సర్వభూతసృష్టికి బీజము విభూతిగలది కాంతిగలది బలముగలది యివియావత్తు నావిభూతులని భగవంతుండు సెప్పుటచే వైష్ణవములు. మధుసూదనునకు భూమి భార్యయై జలంబు నారాయణశబ్దంబుచే నద్దేవునకు నివాసంబై యగ్ని యప్పురుషోత్తమునకు రోషంబై వాయువు జగదీశునకు నుచ్ఛ్వాసంబై యాకాశంబు బద్మనాభునకుఁ బదంబై యుండుటచేఁ బంచభూతంబులు వైష్ణవంబులు. మఱియు నక్కమలాక్షునకు సముద్రంబులు కుక్షియై పర్వతంబులు శల్యంబులై ధారాధరంబులు శిరోజంబులై వర్షంబు వీర్యంబై వృక్షములు రోమంబులై నదులు రోమకూపంబులై పాతాళంబు పాదతలమై మర్త్యలోకంబు కటిప్రదేశంబై స్వర్గలోకంబు గళప్రదేశంబై సత్యలోకంబు శీర్షంబై తక్కినలోకంబులు మధ్యావయవంబులై వేదంబులు శాస్త్రంబులు వందిమాగధులై గీర్వాణభాషాలిపులు పదతల కరతల రేఖలై యొప్పుటంజేసి వైష్ణవంబులు, ఆదిశేషాదివరాహాదికూర్మంబులు భగవత్సంబంధంబు లగుటవలన వైష్ణవంబులు. చరాచరభూతంబులన్నియు వైష్ణవంబులని తలంపుము. లీలావిభూతికంటె మూడంత లెక్కుడగానుండు పరమపదంబునందుండు ననంత గరుడ విష్వక్సేన. కుముద కుముదాక్ష శంకుకర్ణ సర్పనేత్ర జయ విజయాది నిత్యసూరి పరంపరలు వైష్ణవులు. గోలోకమునందును సంతానలోకమునందును క్షీరసముద్రంబునందును శ్వేతద్వీపంబునందు వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధాది వ్యూహంబులందుగల దేహధారులందఱు శ్రీవైష్ణవులేచుమీ. 336

# ముక్తజనప్రయాణము

సుశీలుఁడు

గొప్పవార లనేకు లనేక స్థలంబుల నున్నారు. వారి నాశ్రయించి ఫలాపేక్షారహితంబుగా సమస్త పరిచర్యలొనరించు దీనులు లేరుగదా! నారాయణుండు సర్వోత్కృష్టుండైనను జీవులు వాని నాశ్రయింపవలసిన పనియేమి ? 337

వరవరముని

నవీనముగా భగవాను నాశ్రయింపుమని మనవెవ్వరు నిర్బంధింపుటలేదు. కాని జీవకోట్లన్నియు శ్రియఃపతి సొత్తైయున్నవి. వాఁడు స్వామియై యున్నాడు. దీనికి వేదము ప్రమాణమైయున్నది. వేదంబుల కాధారమైనది "ఓంకారము". ఓంకార వివరణమే శ్రీమదష్టాక్షరిమంత్రము. ఈతిరుమంత్రమునందు జీవేశ్వరులకు నిత్యసంబంధము చెప్పఁబడియున్నది.

శ్లో॥ పితాచ రక్షకశ్శేషీ, భర్తాజ్ఞేయో రమాపతిః
స్వామ్యాధారో మమాత్మాచ, భోక్తాచాద్య మనూదితః

అనఁగా జీవునకు రమాపతి తండ్రి, రక్షకుఁడు, శేషి, భర్త, జ్ఞేయుఁడు, స్వామి, ఆధారము, ఆత్మ భోక్తయైయున్నాడని మంత్రము చెప్పుచున్నది. దీనింబట్టి చూడఁగా జీవేశ్వరులకుఁ బుత్ర పితృ సంబంధము, రక్ష్య రక్షక సంబంధము, శేష శేషి సంబంధము, భార్యా భర్తృ సంబంధము. జ్ఞాతృ జ్ఞేయసంబంధము స్వస్వామి సంబంధము, ఆధేయాధారసంబంధము, భోగ్య భోక్తృ సంబంధంబునను నవవిధ సంబంధంబులు కలవు. శరీరధారులలోసహా పరస్పరముగా నిట్టిసంబంధములు గలవు గాని యవి సోపాధికములై కలహాపేతములై క్షణభంగురములై యున్నవి. జీవేశ్వరుల సంబంధ మెన్నటికి నశింపదు. ఈ రహస్యము జీవులలోఁ గోటి కొక్క రెఱుంగు

దురేమో. తక్కినవారికిఁ దెలియదు. కనుకనే యన్య శేషత్వము స్వాతంత్ర్యము మొదలైనవి వహించి చెడుచున్నారు. సర్వజ్ఞుండగు నారాయణుండీ సంబంధ మెఱింగియుండుటచే జీవులలో భక్తులనేకాక,

ఉ॥ జారులఁ జోరులన్ వృజిన, సంచయ పూర్ణుల దుష్టులన్ దురా
చారుల నాస్తికాధముల, సాధువిరోధుల సత్యదూర సం
సారుల జీవహింసకుల, సాఁకుచునుండె సరోజనేత్రుఁ డా
హారము నీర మంశుకము, లాదటనిచ్చి మహోపకారియై. 339

సుశీలుఁడు

పైసంబంధంబు లెఱుంగక మాధవుని భజించినవారికి ఫలంబు లేదా ? 340

వరవరముని

ఫలసమాచారమట్లుండనిచ్చి ముముక్షువైనవాఁడు ముందుగా నర్థపంచకము, తత్త్వత్రయము, నవవిధ సంబంధములు మొదలైనవి తప్పక తెలిసికొనవలయును. తెలిసి చేసినభక్తి కన్నులు తెఱచి ప్రయాణము చేసినట్లుండును. తెలియక చేసినభక్తి కన్నులు మూసి నడచినట్లుండును. 341

సుశీలుఁడు

మీరు చెప్పినట్లు చేసినవాఁడేమగును ? 342

వరవరముని

పరమపదమునఁజేరి శాశ్వతుఁడై యానందించును. 363

సుశీలుఁడు

పరమపదమనఁగా నెట్టులుండు నెక్కడనుండును ? 344

వరవరముని

పరమపదము బ్రహ్మాండమునకుఁ బైభాగమందుండును. ముందు బ్రహ్మాండ సమాచారం బెఱింగించి తరువాతఁ బరమపద

వృత్తాంతం బెఱింగించెద నాకర్ణింపుము. అతలము, వితలము, సుతలము, రసాతలము, మహాతలము, తలాతలము, పాతాళమునని చెప్పఁబడునవి యధోలోకంబులు. భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జనర్లోకము, తపోలోకము, సత్యలోకము ననునవి యేడు నూర్ధ్వలోకంబులు. భూలోకముక్రింద నేడు లోకంబులును భూలోకముతోఁ బైన నేడులోకంబులును మొత్తము పదునాలుగు లోకంబులు. ఈలోకంబులు భాండంబులభంగి నొకదానిపై నొకటి నిలుచుటకు సప్తకుల పర్వతములు సప్తదిగ్గజములు నాదిశేషుఁడు నాదివరాహము నాదికూర్మము మొదలైనవి యాధారములుగా నున్నవి. వానికి భగవత్సంకల్పము ముఖ్యాధారమై యున్నది. ఈలోకంబులకుఁ జుట్టునుఁ జక్రవాళపర్వతంబున్నది. గ్రుడ్డునకుఁ బెంకువలెఁ గోటియోజనముల మందముగల కటాహ మన్నివైపులఁ గ్రమ్ముకొని యున్నది. దీనికే బ్రహ్మాండమని పేరు. బ్రహ్మాండమునకుఁ బైభాగములో నపార జలంబుగలదు. దానికే యావరణజలంబని నామము. మధుసూదనుండు బలిచక్రవర్తికై యజాండము గొలుచునప్పు డద్దేవుని పాద సంఘర్షణంబుచేఁ గోటియోజనసాంద్రంబగు కటాహంబు బగిలి యాజలంబు నదియై విష్ణుపదియను నామంబుతో ముల్లోకంబులఁ బ్రవహించి పవిత్రము సేయుచున్నది. 345

సుశీలుఁడు

దానిసమాచార మట్లుండనిమ్ము. ఈలోకంబున జనించినవారు మేనులువిడిచినప్పు డెవ్వరేలోకంబున కేగుదురో వక్కాణింపుము!

వరవరముని

కేవల పాపాత్ములు యమలోకంబునకేగి డెబ్బదిరెండువేల నరకంబు లనుభవింతురు. పుణ్యాత్ములగువారు స్వర్గంబునకరిగి సుఖం బనుభవింతురు. నానావిధ యోగులు తపస్సంపన్నులు సత్యలోకంబునకును దపోలోకాదులకుం బోవుదురు. కాని యాయాపుణ్యలోకం

బులు పొందినవారు పుణ్యక్షీణకాలంబున మరల భూలోకంబున జనింతురు. జీవులై ప్రకృతి వశ్యులై కేశవు నాశ్రయింపని కాలమెల్లను రాటపుఁజక్రమువలె దిరుగుచుందురు. కొందఱీలోకంబున సుఖంబనుభవించి పరలోకంబున దుఃఖంబుఁగాంతురు. కొందఱిచ్చట దుఃఖానుభవులై పరలోకంబున సుఖంబుఁగాంతురు. కొందఱుభయలోకంబుల సుఖానుభవులై కొం ఉభయ లోకంబుల దుఃఖానుభవులై యుందురు. బ్రహ్మాండాంతర్గత జీవులందఱు పొందునది యింద్రియానుభవమమాత్రమే. కేవలు లాత్మానుభవముచేతను నిత్యముక్తులు భగవదనుభవముచేతను సుఖింతురు. 347

సుశీలుఁడు

త్రిపాద్విభూతికేగు ముక్తుని ప్రయాణవార్తను సాకల్యముగా వక్కాణింపుడు. 348

వరవరముని

ఒకానొకజీవుండు బహుసహస్రజన్మ సంచిత పుణ్యపరిపాకంబుచే విష్ణుభక్తుఁడై సదాచార్యు నాశ్రయించి భగవద్గుణానుభవ కైంకర్యంబులచేఁ బుసీతుండై ప్రారబ్ధానంతరము మేనువిడుచునప్పుడు నారాయణుఁడు స్వకీయ దివ్యమంగళ విగ్రహంబుతో హార్దపురుషుఁడనుపేర సాక్షాత్కరించును. ముక్తపురుషుం డబ్భగవంతుని సౌందర్య లావణ్య సౌకుమార్యాదు లనుభవించి తదితర విషయంబులన్నియు మఱచి భగవద్రూపమగ్నమానసుండై ముందుగా నర్చిరాదిమార్గంబునంజని దినాభిమాని పక్షాభిమాని మాసాభిమాని సంవత్సరాభిమాని లోకంబులుదాఁటి భూలోకంబునకుఁబైన లక్షయోజన దూరంబుననుండుభువర్లోకంబుఁ బ్రవేశించి సూర్యమండలము భేదించుకొని తదుపరిఁబనునాలుగులక్షల యోజనపరిమితిగల యింద్ర గ్రహ నక్షత్రాదులకు నివాసంబగు స్వర్లోకంబుఁ బ్రవేశింపఁగా, 349

సీ॥ పూలచేఁబూజించి భూమిపైఁబ్రాలి సా
ష్టాంగ నమస్కృతుల్ సలుపువారు
బహువిధ యాగాది ఫలములర్పించి
పూతవాక్యములచేఁ బొగడువారు
బాపురే మన యిక్కఁబాసిపో యెనటంచుఁ
జూపులర్థైసనిల్పి సోలయువారు
గాన సాహిత్యాద్యనూన విద్యలచేతఁ
జెలఁగి సంతోషింపఁ జేయువారు
వేణు వీణా మృదంగాది వివిధ వాద్య
ములను వినిపించి నృత్యంబు సలుపువారు
కానఁబడుచుందు రమాదిలోకంబులందుఁ
బూజ్యుఁడగు ముక్తుఁ డేగునప్పుడు సుశీల. 350

సుశీలుఁడు

బద్ధజీవుఁడైయుండియు ముక్తుఁడైనంతమాత్రమున వేల్పుల
చేతనహో యట్టి గౌరవంబుఁ జెందునాయేమి. 351

పరవశముని

అది ముక్తునకు సొంతగౌరవంబుగాదు. భగవదాశ్రయమాహా
త్మ్యంబని తలంపుము. మనముచేయుభక్తి స్వల్పంబైనను భగవదను
గ్రహంబుచే వచ్చు యశోగౌరవసౌఖ్యంబు లపరిమితంబులు. కావుననే
సాధుజనులు సర్వసంఘ పరిత్యాగంబుసేసి లక్ష్మీపతి నాశ్రయింపు
చున్నారు నీకు నేను చిరకాలంబునుండి బోధించున దిద్దియేకదా !

సుశీలుఁడు

తరువాతి విషయంబు వినిపింపుము. 353

## వరవరముని

అటుపిమ్మట ముక్తుండు ధ్రువలోకంబుడాసి తదీయ బూజ లంగీకరించి కోటియోజన పరిమితంబై యుద్యోగము పోయినప్పు డింద్రాదులు నివసించు మహర్లోకంబుఁగడచి దానిపైఁ గోటియోజన పరిమితంబై సనకాదులకు నిలయంబగు జనర్లోకంబునకుంజని బ్రహ్మ పుత్రులగు నా సనకసనందనాదులచే సన్మానితుండై యాలోకంబుఁ గడచి యెనిమిదికోట్ల యోజనంబుల పరిమితిగలిగి వైరాజులను ప్రజా పతులుండు తపోలోకంబుఁజొచ్చి తదీయ సపర్య లందుకొని దానికిఁ బైన నలువది యెనిమిదికోట్ల యోజనంబుల పరిమితిగలిగి బ్రహ్మ దేవుఁడువసించు సత్యలోకంబుఁ జేరఁగా నక్కమలభవుండు నిలింపు లచే మునులచే బరివృతుండై ముక్తుని సన్మానించి. 354

సీ॥ నానావిధానేక యోనులందు జనించు
జన్మపరంపరాశ్రమముఁబాసి
సంయమనీపురీశ్వరుని శాసనముచే
నరకంబుఁగూర్చు బన్నములువీడి
పతనభయమూన కాస్పదమై కృశింపఁజే
సెడు సురలోక వాంఛితమువీడి
జన్మ జరా దుర్దశా రోగములకు న
గారమై పొలుచు సంసారమేది
పోవుచున్నావు నిత్యవిభూతికీవు
నాకుఁ బ్రారబ్ధ మింక నెన్నాళ్లుగలదొ
చెప్పుమని చక్రితోడ వచించి నాకు
మాఱుగాఁ జేయుమయ్య నమస్కృతులను. 355

అని వగచిన బ్రహ్మనూఱడించి ప్రతినమస్కారంబుఁగావించి విష్ణుభక్తుండగు ముక్తుండు కోటియోజన సాంద్రంబగు బ్రహ్మాండ

కటాహంబు భేదించుకొని దానికిఁ బదిరెట్లుగల జలావరణంబుదాఁటి దానికంటెఁ బదిమడుగులుగల వహ్నితత్త్వంబుదాఁటివహ్నికంటెఁ బదిరెట్లుగల వాయుతత్త్వంబు నతిక్రమించి వాయువుకంటెఁ బదింతలుగల యాకాశతత్త్వంబు నుత్తరించి నింగికంటెఁ బదింతలగు నహంకారతత్త్వంబు నహంకారతత్త్వమునకంటెఁ బదింతలగు మహత్తత్త్వంబు నుల్లంఘించి పరిమితిలేని మూలప్రకృతిం గడచి వేదమయ పర్వతంబునుఁ గాంచి దానికవ్వల నమృతవాహినియగు విరజానదిని సమీపించె నానదియే లీలావిభూతికి నిత్యవిభూతికిఁ బొలిమేరయైయున్నది.

ముక్తుం డన్నదియందు స్నానమొనర్చెను. ఇరువదినాలుగు తత్త్వంబులతోఁగూడిన ప్రకృతి బంధ మానీటిలోఁ గలిసిపోగా జీవుం డప్పుడు కబలిత రాహు విముక్త భాస్కరబింబంబుపగిది పిహితాతి సాంద్రధారాధర నిర్గత నిశాకరమండలంబురీతి నాచ్ఛాదిత నిబిడ ధూమ సమూహ నిర్ముక్తాశ్రయాశునిభంగి వేయిసూర్యులకాంతితోఁ బ్రజ్వలించె నట్లు ప్రకాశింపుచు విరజానది కవ్వలియొడ్డుజేరి యదివఱకే యచ్చటికి వచ్చియున్న షోడశ సమాప్రాయ శరీరంబునఁ బ్రవేశించి సుఖించెను. తదుపరి నమానవుండను పురుషుండు స్పృశింపఁగా నాశరీరధారి చిరకాలం బనుభవించిన సంసారతాపంబువిడిచి పరబ్రహ్మనిర్ముక్త సుగంధ మాల్యాంబరాభరణాదులు ధరించి హాటకాందోళికారూఢుండై యాదివాహకులు వహించి నడునఁగాబోయి బహుయోజనోన్నతంబును మహావిశాలంబునగు జాంబూనద గోపురంబు గాంచి యచ్చటనుండు కుముద కుముదాక్ష శంకుకర్ణ సర్పనేత్ర చండ ప్రచండ జయ విజయాది దౌవారికులకుఁ మ్రొక్కి యగ్గోపురంబుగడచి వైకుంఠవీథిం బ్రవేశించి కొంతదవ్వరిగి గురుపరంపరామందిరంబునకరిగి సాష్టాంగనమస్కారంబుతోఁ దదాశీస్సులంగైకొనియె. 357

# పరమపదవర్ణనము

అయ్యవసరంబున నాముక్తునింగొని గరుడ విష్వక్సేనాదులు తమతమ సద్మంబులయందు భార్యాసహితులై పూజించి యతని వృత్తాంతంబు నిజద్వితీయల కెఱింగించి తరువాత నడు వీధిలోనికిఁ బోఁగా నచ్చటఁ బంచశత దివ్యాప్సరసలా ముక్తపురుషునితోఁ గలిసి బరిమళ ద్రవ్యంబులచేమంచి సరసల్లాపంబులచేఁ బరిహాసాలాపంబులచేతను నానంద మొందించిరి, యటుపిమ్మట గరుడ విష్వక్సేనాది నిత్యసూరు లమ్మహాత్మునిఁగొనిపోయి తిరుమామణిమంటపంబుఁ బ్రదర్శింపించిరి. దాని వైభవం బెట్టిదనఁగా నద్దివ్య మంటపమునుఁ బరివేష్టించి. 358

జంబూ జంబీర రసాల కపిత్థమోచా గోస్తని నారంగ నారికేళ పనసాది ఫలవృక్షంబులును మల్లికా చాంపేయమాఖ్య జాతి మాలతీ ప్రముఖ లతాంత భూరుహంబులును సంతాన హరిచందన, పారిజాత, కల్పక, మందారాద్యాదార్య తరువులును రజతమయంబులై సువర్ణమయంబులై నవాంకురంబులతోఁ గోరకంబులతోఁ బల్లవంబులతోఁ బుష్ప గుచ్ఛంబులతో లతా సమూహంబులతో శలాటువులతో మాధుర్య ఫలంబులతో మకరంద పటలంబులతో బంభరకదంబకములతోఁ బ్రభూత దీర్ఘంబులై యదభ్రవిశాలంబులై విరాజిల్లుచుండెను. తులసీ దమన స్థౌణేయాది పత్రంబులు గుమ గుమ వాసింపుచుండె నా యా వృక్షషండంబుల మధ్యమందుఁ జామీకరకాసారంబు లగాధ శైత్య మాధుర్య యుక్త జలంబులతో భాసిల్లుచుండె నా సరస్సులయందు సౌగంధిక హల్లక కైరవ కోకనద పుండరీక నీలోత్పలంబులు సుగంధంబు లీనుచుండె సరసీతటంబులయందుఁ గారండవ చక్రవాక బలాకా కాదంబ రాజహంసాదు లవ్యక్త మాధుర్యారావంబులు మనోహరంబుగాఁ జేయుచుండె. వెండియు నిష్కుటంబుల

యంను భరద్వాజంబులు ఖంజరీటంబులు కికిదివులు దార్వాఘాటంబులు పారావతంబులు శారికలు కలవింకంబులు తామ్రచూడంబులు కీరంబులు మయూరంబులు తామ్రముఖంబులు గువ్వలు మొదలైనవి కోలాహలధ్వనిఁ జేయుచుండె. 359

మఱియు నిత్యవిభూతి మంటపమునందు స్తంభంబులు దూలంబు లప్రాకృతంబులై వజ్ర వైడూర్యమయంబులై నీలగోమేధిక మయంబులై పుష్యరాగమరకత మయంబులై, పద్మరాగమాణిక్య మయంబులై విరాజిల్లుచుండె ఖట్వాసనంబులు ఘటికాసనంబులు బంగారువేదికలు పద్మరాగ సోపానంబులు రత్నకుట్టిమంబులు గలిగి సొబగారుచుండె వెండియు నద్దివ్యమంటపంబు నందు సముబోధప్రబోధన ప్రాదంబులును చందనపేటికలు కస్తూరి సంపుటులు పన్నీటికొలంకులు పాయసనదులు మకరంద రసప్రవాహనిమ్నగలు నానావిధ సూపాపూపోత్పాదక వృక్షంబులు వివిధాన్నాల్పాంబరాభరణోత్పాదకమహీరుహంబులన్నిటఁ సలంబుఁ దనరారుచుండె లీలావిభూతిలో నుండు దేహధారులందఱొక్కసారి ప్రవేశించిన నొక్కస్తంభంబుమఱుగున దాఁపదగిన వైశాల్యముగలిగియుండెను 360

అట్టి దివ్యమంటపమధ్యంబున హేమపర్యంకంబునందుఁ గోటిచంద్రులవంటి శ్వేతకాంతితో నానారత్నాలంకృతఫణాసహస్రంబుతో నాదిశేషుండు వేంచేసియుండె నాతల్పంబునందుఁ గుడిప్రక్కను శ్రీదేవి యెడమవైపున భూనీళాదేవులు దేవి సహస్రపరివేష్టితలై తన్ను సేవింపఁగా శ్రీమన్నారాయణుండు కోటిసూర్య ప్రకాశమానుఁడై వేంచేసియుండె నద్దేవాదిదేవు నమ్ముక్తపురుషుండు దాసి సేవించినప్పు డద్దేహధారికిఁదోఁచిన వైభవం బెట్టిదనఁగా నమ్మహావిష్ణువు త్రిలోకపావనియగు గంగానదీప్రభవకారణంబులును బ్రహ్మాండమునుఁ గొలిచినవియు హర విరించనేంద్రాదుల కిరీటంబులయందు నూతన మర్యాదఁ జెందునవియు యోగిజన భక్తజన హృదయంబుల

నిలిచి యజ్ఞానాంధకారంబుఁ దొలంగించి జ్ఞానదీపంబునుఁ బ్రజ్వరిల్ల జేయునవియు శ్రీభూనీళా కరంబులకు నన్నెఁగూర్చునవియుఁ గోక నదంబులఁబోలు పాదతలంబులు గలవియు నక్షత్రంబుల నిరాకరించు నవియు వేదాంత స్తుత్యంబులైనవియు నగు దివ్యాంఘ్రి సరోజంబుల తోడను మకర సదృశ జంఘలతోడను సుందరములగు జానువులతో డను హాటక మోచా స్తంభంబులవంటి యూరువులతోడను స్నిగ్ధం బులై గుండ్రంబులగు శ్రోణులతోడను సింహమధ్యంబుతోడను ననంత కోటి బ్రహ్మాండముల కాధారమగు జఠరంబుతోడను విరించి కుత్పత్తిస్థానమై సౌందర్య ప్రవాహమునకైయొక్క సుడివలెనుండు నాభి తోడను ప్రళయోదధిమగ్నమైన భూమిని గోవర్ధన మందరపర్వతము లను లేవనెత్తినవియు రామావతారంబున సీతాకుచంబులయందునుఁ గృష్ణావతారకాలంబున గోపికాష్టమహిషీ షోడశ సహస్ర రాజకన్యా సమూహ కుచంబులయందును గౌరవంబుఁగాంచినవియు శరణాగతుల కభయప్రదానంబు సేయునవియు నౌదార్యమునకు జన్మస్థానంబులైన వియు హల కులిశ శంఖ చక్ర శరాసన ధ్వజాంకుశ ఛత్ర చామరాది రేఖాలంకృతంబులైనవియు నా యా కాలంబులయందు దివ్యాయుధ ములు ధరించి దుష్టసంహారంబు చేయునవియుఁ జంద్రసమాన శ్వేత వర్ణ నఖరంబులు గలవియు దేవతల కమృతమిచ్చినవియు నగు హస్త పద్మంబులతోడను గజ కర పరిఘోపమాన బాహువుల తోడను శ్రీవత్స కౌస్తుభ లక్ష్మీవిరాజమాన భుజాంతరంబుతోడను శంఖ సదృశంబగు గళంబుతోడను రాకాచంద్ర సంకాశంబగు ముఖంబు తోడను పుండరీక సదృశములై యాకర్ణాంతంబులగు లోచనంబుల తోడను ధగద్ధగాయమాన మకరకుండల యుక్తంబులై శ్రీకారనిభం బులగు కర్ణంబులతోడను చాంపేయ సన్నిభ నాసా పుటంబుతోడను నింద్ర నీలమణి సమానంబులగు వెండ్రుకలతోడను దర్పణోపమ కపోలంబులతోడను సర్వేశ్వరత్వమును బ్రకటించు నవరత్నస్థగితసువర్ణ

లతోఁ గంకణ కటిసూత్రంబులతో విభ్రాజమానుఁడైయున్న లక్ష్మీపతినిఁ బరబ్రహ్మనుఁ బరవాసుదేవుని సాక్షాత్కరించి "సర్వమంగళశాలివిగ్రహాయ సమస్తపరివారాయ శ్రీమతే నారాయణాయ నమః" యని స్తుతించి శేషతల్పము నారోహించునప్పుడు దూరదేశగతుఁడై మరలవచ్చిన కుమారునిఁ బ్రేమించు తల్లివలెఁ జగజ్జననియగు లక్ష్మీదేవి ముక్తుని నెత్తుకొని స్తన్యామృతము నొసంగగా నయ్యమృతంబును గ్రోలినమాత్రాన నతండు చతుర్భుజములతోఁ గూడి విష్ణురూపుఁడై వెలుంగుచుండె నంత నాశరీరిని పరబ్రహ్మ చూచి 'కస్త్వం' నీవెవ్వండవని సరసాలాపంబాడఁగాఁ 'దేవా! అహం బ్రహ్మాస్మి' నేను పరబ్రహ్మతో సమానము గావచ్చుచున్నానని బదులుచెప్పెను. వాసుదేవుండు నవ్వుచు వానిని గాఢాలింగనమొనర్చి విడిచె నటుపిమ్మట నమ్ముక్తపురుషుండు సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యంబులంబడసి భగవత్సన్నిధింబాసి యన్వలికేగి నిత్యముక్తులగోష్ఠిలో గలిసి భగవద్గుణానుభవ కైంకర్యంబులచే నపరిమితానందవారాశి నోలలాడుచుండెను. 362

సుశీలుఁడు

ఆవిభూతియందు జీవున కనిష్టము లేమైన నుండునా? 363

వరవరముని

జీవునకు నప్పదవియందుఁగూడ ననిష్టము లున్నచో దానిని మోక్షమని చెప్పఁదలసినదిలేదు. వెండియు నాలోకంబున మిశ్రసత్వముగాని రాజస తామసంబులుగాని లేవు. ముక్తునకు సంసారబంధము విరజానదిలోఁ గలిసిపోయెను. కావున జయాపజయంబులు మానావమానంబులు శీతోష్ణంబులు సుఖ దుఃఖంబులు కీర్త్యపకీర్తులు కలిమిలేములు భయాభయంబులు మొదలైనవిలేవు పుత్ర మిత్ర కళత్రాది సంబంధములు లేవు. 364

సీ॥ రోగముల్లేవు వైరులులేరులేవు వి
పత్తులు పుణ్యపాపములులేవు
భూతపీడలులేవు జాతిభేదములులే
వాధులులేవు దయ్యములులేవు
వడగాడ్పులునులేవ, సగ్రహంబులుగల్గ
వతివృష్ట్యనావృష్టులందులేవు
కాటకంబులులేవు గాలివానలు పిడు
గులులేవు క్షుత్పిపాసలునులేవు

సర్ప వృశ్చిక మక్షికంబు సారమేయ
మశకదంశ పిపీలికామత్కుణాఖు
గంధ మూషిక ప్రముఖ జంతుగణమువలనఁ
గలుగుబాధలులే నజ్జగంబునందు ౩౯౫

సీ॥ అప్పుమోపై యింటఁ గప్పులేదని కార
ముప్పులేదని కుంది చెప్పువారు
గాలిలేదని కొంపచాలలేదని బిడ్డ
పాలులేవని దిగుల్పడెడువారు
మగఁడులేడని మంచినగలులేవని బిడ్డ
లఁగననైతినటంచు వగచువారు
పండలేదుపొలంబు నండలేదన్నంబు
తిండిలేదని పొక్కుచుండువారు

లేరుమూఁగవారు లేరుపంగులు జీవు
వారులేరు బీదవారులేరు
పిచ్చివారులేరు భీతిల్లువారుండ
బోరునిత్య మవ్విభూతియందు ౩౯౬

సీ॥ లలిబాల్య కౌమారములులేవు జరలేదు
కామాది షడరివర్గంబులేదు
ఈషణత్రయములేదెన్నఁగాఁ దాపత్ర
యములేదు షడ్వికారములులేవు
కర్మబంధములు షడూర్ములు గనరావు
శోకంబు పొడమ దసూయలేదు
శాపముల్లేవు దుశ్చారిత్రములులేవు
మరణముల్లేవు జన్మములులేవు

రాత్రులును వాసరాంధకారములు గల్గ
వబ్దములులేవు కాలవ్యయంబులేదు
కైతవాది వ్యసన సప్తకంబులేదు
పుణ్యనిధియైన నిత్యవిభూతియందు. 367

సీ॥ మంచులుపుట్ట వమావాస్య, పౌర్ణమా
సీ మాసములులేవు చేటు లేదు
కలహంబులేదు నిందలుజనింపవు పరా
భవములులేవు విభ్రాంతి సంభ
వింపదు దుష్టావివేకంబు పొడమదు
హాని వృద్ధులు సంశయములులేవు
దూషణముల్లేవు దుర్భాషలునులేవు
దుర్గంధములులేవు దుమ్ములేదు

వెల్లఁ బాటులేదు విధవాత్వమునులేదు
బద్ధకంబు దుష్కపటములేదు
వంచనయును దుర్వివాదముల్లేవు పో
జీవి ముక్తిపదముఁ జెందినపుడు. 368

వేయిమాటలేల. పరమాకాశంబునందుఁ బ్రకృతిసంబంధవికారంబు లెవ్వియునులేవు. జీవుం డెన్ని బ్రహ్మకల్పంబులం బైననుఁ బ్రాపించి పని భగవదనుభవంబుసేయుచు నచ్చటఁగల పదార్థంబులన్నియు ననుభవింపవచ్చును. వెండియు ముక్తుండు ప్రాపించిన పంచోపనిషన్మయ శరీరంబు జీవునిచందంబున శాశ్వతంబగుటం జేసి. 369

సీ॥ భువిచే నపాయంబుఁ బొందదు మగ్నమై
పానీయములనున్న నానకుండు
దారుణవహ్నిచే దగ్ధంబుగాదు వి
శేషానిలమున శోషింపదెపుడు
పర్వతంబులఁదాకి బడలదు నానావి
ధాయుధంబులచేత హానిగనదు
వైవర్ణ్యమొందదు వాతాది రుజల క్షీ
ణంబుగాదు మిత్తిఁగనదెపుడు
బాల్య కౌమార దుస్తర వార్ధకముల
పాలుగాకుండ యౌవనప్రాయమొంది
కాంతులీనుచు సర్వసౌఖ్యములఁగాంచి
నిత్యముక్తుల దేహముల్ నెగడుచుండు. 370

సీ॥ హిమజలహ్రదంబులం దెలమిమీఱఁగఁగ్రుంకి
లలిత సువర్ణ చేలములుగట్టి
జాళువా తొళసిపూసలుదాల్చి జాళువా
తమ్మిబీజములు మోదమునవైచి
పురువాంఛ గలిగినప్పుడు భక్ష్యభోజ్య లే
హ్యాది దివ్యాహార మారగించి
భర్మ రసాలాది ఫలరాజములు మెక్కి
హేమ పుష్ప మరంద మెసఁగనాని

సామగానంబుచే రమాజాని పాద
పద్మములు సన్నుతింపుచు భాగవతులు
సెంము నానంద మింతని చెప్పరాదు
ఖ్యాతిఁగాంచిన నిత్యవిభూతియందు 371

సీ॥ కోకిలంబులు భార్గవీకాంతు మహిమంబు
సామగానముచేఁ బ్రశంసఁజేయఁ
బారావతములు దైత్యారాతి విభవంబుఁ
గావ్యపాఠములచే గణనసేయ
శారికాకీరము ల్సరసిజాతాక్షు సు
ధోపమనామంబు లుచ్చరింప
రాజహంసలు పక్షిరాడ్వాహనుని కథా
భాగము ల్వర్ణించి పలుకుచుండ

విస్మయంబుచేత వినుచు నాహాహాహా
యనుచు సారె సారె కనువుమీాఁ
గనుచు సంతసింతు రనిశంబు నిత్య వి
భూతియందు నిత్యముక్తజనులు. 372

సుశీలుఁడు

మోక్షంబనఁగా జీవుండు కదలక మెదలక యుండు నివృత్తి యని కొందఱు చెప్పుచున్నారు. అది యట్లుండఁగా మీారు ముక్త జీవుఁడు సహితము సర్వసౌఖ్యములు పొందునని చెప్పుచున్నారే యెందువల్ల ? 373

వరవరముని

జీవికి నీవుచెప్పునది కైవల్యస్థంబగు బండముక్తి. యదిమన కవసరంబులేదు. స్వర్గ సత్యాది లోకంబులనుండు భోగంబు పతనభయం బుతోఁగూడి పునరావృత్తిఁ గలిగించుంగావున నవియు వాంఛనీయం

బులు గావు. పరమపదసౌఖ్యంబులు వికారరహితంబులై శాశ్వతం బులై యున్నవి. ఇంతేకాక మన విష్ణుదేవుండు సృష్టి స్థితిలయంబులకుం దాను కారకుండయ్యును జగత్సర్గ సంహారంబులు రుద్ర విరించునులయందుం ద్రోసి పోషణకృత్యంబు స్వయముగా నాచరింపుచున్నాడు. శరీరధారులు బ్రహ్మనాశ్రయించినచో సృష్టికర్త గనుక యెన్నిసారు లెన్నిజన్మంబులైన నిచ్చుచుండును. రుద్రునాశ్రయించిన వారి నతం డెన్నిసారులైన సంహరించును. విరించి సృష్టికి శాస్త్రసహాయము కావలయునుగనుక విద్యాధిదేవతయగు సరస్వతిని భార్యగాం బరిగ్రహించెను. సంహార కృత్యమునకు శక్తి సహాయమవసరము గనుక రుద్రుండు దుర్గా కాళీ ప్రముఖ నామంబులుగల శక్తినిం బరిగ్రహించెను. నారాయణుండు పోషణకృత్య ప్రధానుండగుటంజేసి యాశ్రితుల నీలోకంబున నున్నంతవఱకుం బోషించి దేహాంతంబునం బరమపదంబునం జేర్చి రక్షించును. దానివల్లనేకదా ధన ధాన్య హేతువగు శ్రీ భూదేవుల జాయలుగాం గైకొనియున్నాడు. కాబట్టి మనముక్తి జీవోపాసకులవలెం గైవల్యంబుగాదు. మాయావాదులభంగి మిథ్యయుం గాదు. శైవులవలెం బ్రమథగణ సమావేశంబునుగాదు. స్వర్గంబుభంగి మూన్నాళ్ళ ముచ్చటగాదు. బ్రహ్మలోకాదులవలెం బునరావృత్తి సహితంబుగాదు. శాశ్వతానందప్రదంబైన దేశవిశేషంబని తలంపుము.

మఱియు నిత్యముక్తు లొక్కొక్క సౌధంబున నొక్కొక్క మంటపంబున వేలు లక్షలు కోట్లుకోలంది సమావేశముసేసి వాసుదేవాద్భుతలీలలువర్ణింపుచు మధురైకనామోచ్చారణంబొనర్చుచు శ్రీమనోహరుని సౌకుమార్య లావణ్య తారుణ్య సౌందర్యములు దలంచుకొని మోహింపుచు భగవంతుని మత్స్య కూర్మ వరాహ నారసింహవామన రామకృష్ణావతారమాహాత్మ్యంబు స్మరింపుచు హరికథా ప్రసంగంబుసేయుచు నారాయణకల్యాణగుణార్ణవంబున మునింగి తేలుచు ముకుందసామర్థ్యంబునకు విస్మయంబందుచుం బులకాంకురంబులతో నేకాంతంబు

ఁతో గద్గద కంఠస్వరంబులతో బద్ధాంజలులతో దేహవిస్మృతితో 'నహమన్నమహమన్నమ్ హావ్ హావ్' యనుచుందురు. 375

లీలావిభూతినుండి ముక్తులై పరమవ్యోమంబుఁ జేరినవారు మున్ను సంసారంబునఁ దామునడిన బాములు వదలించి యిట్టిదశకుఁ దెచ్చినవాఁడు దయాసముద్రుఁడగు నధోక్షజుండుగదాయని వెఱఁగందుచు నిత్యసూరిసేవిత పాదాంభోజుఁడగు కేశవునకు మనవంటి నీచులతోఁ గించిత్ప్రయోజనము లేకున్నను కేవల వాత్సల్యముచేఁ బునీతులఁజేసి పోషించెఁగదాయనుచు నిట్టి దీనానుకంపియగు మాధవు నాశ్రయింపలేక యనంతకోటిజన్మంబులు బాధపడితిమేయనుచు జన్మజన్మంబున సోపాధిక బంధువులనమ్మి నిరుపాధిక బాంధవుండగు మురారిని విశ్వసింపలేక తాఱుమాఱైతిమే యనుచు దివ్య దేహంబును శాశ్వతపదంబును శాశ్వతానందంబిచ్చినవాఁ డిప్పుండరీకలోచనుండే గదా! తదీయఋణం బెట్లుదీర్తుమనుచు భగవద్గుణానుభవంబునం గల మాధుర్యం బిప్పటికి నెఱింగితిమనుచు సదాచార్యానుగ్రహంబుచే నిట్టిమహాపదవి లభించెననుచు నట్టియాచార్యునితో సంబంధంబుఁ గలిగించినవాఁ డిక్కమలనాభుండే సుమీయనుచు దయాస్వరూపిణియు లోకమాతయునగు లక్ష్మీపురుషకారంబున నింతవారమైతిమి బళీ యనుచు దేవతాంతర సాధనాంతరపరులు కోటిజన్మంబులకైన నిప్పదంబు డాయంజాలరుగదా యనుచు శఠగోప యామున రామానుజాది యోగులు మనకాదర్శకులగుటచే నీవైభవంబున కర్హులమైతిమనుచు నానందవారాశి నోలలాడుచుందురు. 376

సుశీలుఁడు

ముక్తున కీలోకసమాచారంబు జ్ఞాపకముండునా? 377

## పరపదమున

పరమపదవికేగిన జీవుఁడు లోకవిషయమే కాదు సర్వలోక పరిజ్ఞానంబును సర్వజన్మ పరిజ్ఞానంబును నిర్మలముగాఁ బ్రకాశింపుచుండును. బాల్యంబునఁ దానొనర్చిన హేయకృత్యంబులు స్మృతికి రాగా బండితుండు తన్నుదానే నిందించుకొని యుదాసీనత్వముతో నుండు నట్లు సర్వవిషయములు సంసారబాధలు మనంబునఁదోఁచినను దేవగించుకొని కడచినదానికి వగవనేలయని యుదాసీనుఁడై సర్వకాల భగవత్ప్రాప్తిఁదలంచి యుప్పొంగును. వెండియు ముక్తసకలలోకములను సృష్టింపఁగల శక్తియున్నను నవ్వని భగవద్వ్యతిరిక్తంబనియుఁ దన శేషత్వ పారతంత్ర్యములకుభంగమనియు భగవదనుభవకాలము వృథా కడచుననియు సమస్త వ్యాపారంబులు మానియుండును. నిత్యముక్తులన్యోన్య సౌహార్దము పెంపారుచుండఁగాఁ గోట్లకొలఁది కాంతాపురుషులై భవించి రమణీయోద్యానవనంబుల విహరింపుచుఁ గుసుమాపచయంబు చేయుచుఁ బుష్పమరందంబుఁ గ్రోలుచు మధుర ఫలంబులు మెక్కుచుఁ గ్రీడాపర్వతంబులఁ జరింపుచు నానావిధ వాహనంబు లారోహింపుచు వాయువేగ మనోవేగంబులచే భూమ్యాకాశ మధ్యమందు విహరింపుచు నిచ్ఛగలిగినవేళ నప్రాకృత భక్ష్య భోజ్య లేహ్య పానీయాదు లారగించుచు నున్నత సౌధంబులారోహింపుచు మృదు స్నిగ్ధ శయ్యలఁ బవళింపుచుఁ జంద్రశాలలఁగ్రీడింపుచు భగవన్నామోచ్చారణముచేఁ గోలాహలధ్వని సేయుచు సుందరమానినీ రూపంబుల ధరించి విష్ణునితోభోగింపుచు హేమడోలికల నూఁగుచుఁ బరస్పరాలింగనంబు లొనర్చుచుఁ బటిస్వరముగా భుజంబు లప్పళింపుచుఁ బరబ్రహ్మానంద రత్నాకరంబున జీవు లోలాడుచుందురు. 783

గద్యము: ఇది శ్రీసీతావల్లభ ప్రసాద సమాసాదిత కవితాప్రవీణ వేదాల సీతారామాచార్య కృపాలబ్ధ మంత్ర రత్నాను సంధాన: పవిత్రాంతరంగ నిఖిల దుర్మత శిలోచ్చయ దంభోళీ భూత సముద్రాల లక్ష్మణాచార్యానుగ్రహ బోధిత విశిష్టాద్వైత రహస్యార్థ ధురంధర శఠగోప యతిరాడ్వర వరయోగి ప్రభృతి. పూర్వాచార్య చరణ సరోజ భ్రమ రాయమాన కృష్ణమాంబా కృష్ణార్య తనూజ శ్రీవైష్ణవవిధేయ వేంకటదాస నామధేయ ప్రణీతంబైన జ్ఞానసూర్యోదయము

నందు షష్ఠభాగము

సర్వము

సంపూర్ణము



# రామానుజ విజ్ఞాపనము

శ్రీరామానుజ గురుపరమేశ్వరా! ప్రణామంబు లొనరించెద సంగీక రింపుము. నీవు తొల్లి శ్రీవైకుంఠంబున శ్రీమన్నారాయణునితోఁ బ్రతిజ్ఞఁజేసి చేతనోద్ధారణమునకై యీలోకంబున నవతరించితివి. సర్వ దుర్మత మేదినీధర దంభోళివై విరాజిల్లితివి. కోట్లకొలంది జనులకు విష్ణుమాహాత్మ్యంబుఁదెలిపి పునీతులఁజేసి పరమపదంబున కనిచితివి. పశు పక్షి మృగాదులకు ననాయాసంబుగా మోక్షంబొసంగితివి. అది యట్లుండఁగా నేను జన్మించి పదునేనవనాటి మధ్యరాత్రమందు మా తల్లిప్రక్కలో శయనించి యుండఁగా నీవు శేషరూపంబుతో సాక్షాత్కరించి నీడఁబట్టఁగా మాతల్లి భీతిచేఁ బ్రలాపించెనట. తదీయ శబ్దంబువిని యామె దేహసంబంధులును మఱికొందఱు మనుష్యులును వచ్చి చూడఁగా నేమియుం గానంబడనందున స్వప్నమేమోయని తలంచి యమ్మా! పిల్లవానిం గైకొని బయటికి రమ్మనిరట. తరువాత మదీయసవిత్రి నన్నెత్తుకొని వెలుపలికివచ్చుచుండఁగా నాసర్పము మరల నట్టింట నందఱికిఁ గన్పించెనట. ద్రష్టలను వారంతటఁ గఱ్ఱలతో మోదఁబోవఁగా నదృశ్యమయ్యెనట. వారందఱు విస్మయంబొంది యిది దేవతాసర్పముగాని సామాన్య ఫణి గాదని వక్కాణించి పోయిరట. ఈవృత్తాంతము మజ్జనయిత్రి కౌమారసమయంబున నాకెఱింగించె నంతకుమున్నే ద్వాదశవర్షప్రాయంబున శ్రీనివాసుండు స్వప్నంబున సాక్షాత్కరించి కొంత జ్ఞానమిచ్చియున్నందువల్లను నీవు నన్నుఁ గటాక్షించినందువల్లను మాతల్లిగారు చెప్పిన మాటలువిని బాల్యంబునఁ గన్పించిన సర్పము శేషరూపియగు రామానుజయోగీంద్రుండు గదా యని తెలిసికొంటిని. శ్రీమన్నారాయణుని నిర్హేతుక జాయ

మాన కటాక్షంబువల్లను మఱియు నప్పురుషోత్తముఁడు స్వప్నంబున సాక్షాత్కరించి మంత్రోపదేశము చేయుటవల్లను నాకు ధన ధాన్య వస్త్రాన్నపాన సత్సంతాన విద్యా జ్ఞాన భక్తి వైరాగ్యంబులు గలిగెను. మదీయ యౌవనంబున దేవరవారు దర్శనంబిచ్చి కటాక్షించుట లాదిగా వైష్ణవసిద్ధాంత ప్రభావంబును నానాసిద్ధాంత దౌర్బల్యంబునుఁ దెలిసె. గురుపరంపరావృత్తాంతంబు గోచరించె నర్థపంచకంబు తత్త్వత్రయంబు మంత్రార్థంబులు కొంచెము కొంచెముగా గోచరించె శిష్య సమూహంబులు వృద్ధిఁగాంచుచుండె మోక్షసంశయంబులు నిర్మూలంబులయ్యె నీసిద్ధాంత నిధానంబులగు భాష్య భగవద్విషయంబులు మాత్ర మీనాటికి దురవగాహంబులైయున్నవి. తదీయగ్రంథంబులను దాసునకిచ్చుట కర్హంబులని తోఁచినచోఁ బ్రసాదించి తెలుపుదురు గాక. దేవరవారు లీలావిభూతియం దుండునప్పుడు చతుర్థజాతి సంభూతుండగు ధనుర్దాసుని లోకవంద్యునిగాఁ జేసితివి. సువర్ణకారుం డగు వడుగనంబిచేఁ బచనంబొనర్పఁబడిన భక్ష్య భోజ్యాదులు ప్రీతితో నారగించితివి. అదేప్రకారము బలిజవాఁడనగు నన్ననుగ్రహించి సిద్ధాంతమర్మంబు లుపదేశింపుచుంటివి. రమానాథు ననుగ్రహంబుచేఁ జేతనునకు జ్ఞాన భక్తి వైరాగ్యంబు లుద్భవించును. నీకటాక్షముచే నీసిద్ధాంత రహస్యంబులు గోచరించును. మధుసూదనుండు జగద్వ్యాపారి గనుక యేమతంబునైన నేదేవతాపరులనైన నంగీకరించి తగినట్లు ఫలంబులిచ్చుచు లీలార్థ ముపయోగించుకొనును. నీవు చేతనోద్ధారణ దీక్షాధురంధరుడవుగనుక శ్రీవైష్ణవ రాజ్యంబునుఁ బరిపాలింపుచు నవైదిక సిద్ధాంతరాజ్యంబులపై దండెత్తి జయించి నశింపఁజేయుచున్నావు. నీభక్తివైభవంబు జనార్దనుండెఱుంగును. జనార్దనుని మాహాత్మ్యంబు యథార్థముగా నీవెఱుంగుదువు. దానివల్లనే రమాధిపతి నీమతస్థులను దయాపాత్రులుగా నంగీకరించి పరమపదం బిచ్చుచున్నాడు. నీవొకచేయి లక్ష్మి యొకచేయిఁబట్టి లాఁగి చేతను

నందీయఁగా విష్ణువు ముక్తిపదవియయుఁ జేస్తునని సూరులు వచింతురు. పూర్వము పరబ్రహ్మమగు నారాయణుండు నానావిధావైదిక మతంబులను పంకంబునఁ గూరుకొని యుండఁగా నప్పుడు హస్తమునిఁ జేయూఁత నిచ్చి పరమవైదికంబగు వైష్ణవసిద్ధాంత సౌధంబెక్కించి సుఖింపఁ జేసితివి. రామానుజార్య దివ్యాజ్ఞ వర్ధిల్లవలయునని ప్రతిదినంబును ప్రతి దేవాలయంబునందునుఁ బ్రతిదేశమునందునుఁ బ్రతికోవిదుండును వచింపుచున్నాడు. ప్రభూ! నీవాచార్య లక్షణ విశేష సంపన్నుఁడవగుటచే జగదాచార్యుండవు. బ్రహ్మసూత్ర యాథార్థ్యవేదివగుటచే భాష్యకారుండవు. నీకీబిరుదంబు సరస్వతీదత్తంబైనది. మఱియు వేదార్థ నిర్ణేతవగుటచే శారదాశోక నాశనుండవు తురీయాశ్రమ పోషకుండ వగుటచే యతీంద్రుండవు కుమతధ్వాంత భాస్కరుండ వగుటచే వైదికాగ్రేసరుండవు. విశిష్టాద్వైత సిద్ధాంత పరిపాలకుండ వగుటచే వైష్ణవచక్రవర్తివి. విరాగ పరాయణుండవగుటచే జితేంద్రియుండవు. సర్వచేతనోద్ధారకుండ వగుటచే దయాసముద్రుండవు శేషాహినగుటచేఁ బండిత సార్వభౌముఁడవు. మోక్షప్రదాయకుండ వగుటచే ముని నిలింపాతితుండవు. మతకర్తలలో నీకుసమానుఁడే లేఁడు. మించినవాఁడెక్కడనుండును. తులసీనలినాక్షమాలాలంకృతా! వందనంబులు. తిరుమణి శ్రీచూర్ణభరిత ద్వాదశోర్ధ్వపుండ్రధరా! ప్రణామంబులు. కాంతిమతీనందనా గిడిగిన్సు. కేశవార్యతనూజా జోహారులు. ఆసూరివంశపయః పారావారరాకాసుధాకరా చిన్నిపూవులు. మఱియు గ్రంథంబులన్నియు భవత్సిద్ధాంతానుసారముగాను నారాయణ ప్రభావ వర్ణనముతోడను పరమత ధ్వంసంబులుగాను విలసిల్లుచుండును "జ్ఞానసూర్యోదయ" గ్రంథ రచనా విశేషంబు నేటితోఁ బూర్తి

యయ్యెను. దీనిని శీఘ్రకాలంబునఁ బ్రకటించి నీమతస్థులకుఁ బంచి యిమ్ము. నాకును నాసంబంధులకునుఁ దలచినప్పుడు పరమపదంబు ననుగ్రహింపుము. రమావిభుఁడు జ్ఞాన భక్తి వైరాగ్యంబులు గల వారికి మోక్షంబొ సంగును. మాదృశ దీన జనసంఘంబులకు నీవీయ వలయును. కూరేశ దాశరథి గోవింద మిశ్ర భట్టరాచార్యాది గురు పరంపరా పూజిత చరణారవిందా! దివ్యచిత్తానుసారముగా దయ చేయుము, నమో నమోస్తుతే.

---

# శ్రీ దేవీ విజ్ఞాపనము

శ్రీదేవీ ! మదీయ నమస్కారంబు లంగీకరింపుము. జననీ ! నీకును నీమనోహరుండగు నారాయణునకును భార్యాభర్తృ భేదంబును తరుణీత్వ పుంస్త్వభేదమే కాని జ్ఞానశక్తిబలైశ్వర్య వీర్య తేజ ప్రముఖ కల్యాణగుణంబులు సమానంబులై యుండు నిట్లు వేదపురుషుండు వర్ణించి చెప్పుచున్నాడు వెండియు నీవు సదా కరుణాస్వరూపిణివి. నీవిభుండు నిగ్రహానుగ్రహంబులు రెండును గలవాఁడై సమయోచితముగా నుపయోగింపుచుండును. నీవు రాజ్యలక్ష్మివై రాజులను జయలక్ష్మివై సంగరశూరులను ఉద్యోగలక్ష్మివై నిరుద్యోగులనుఁ గార్ముకలక్ష్మివై ధనుర్ధరులను సభాలక్ష్మివై సామాజికులనుఁ బురలక్ష్మివై పౌరులను ధనలక్ష్మివై దీనులను ధాన్యలక్ష్మివై సర్వభూతములను వైరాగ్యలక్ష్మివై రాగాతురులను స్వర్గలక్ష్మివై యింద్రాది నిలింపులను నిధి సనక రూపలక్ష్మివై కుబేరుని అణిమాద్యష్టవిభూతిలక్ష్మివై యుమామహేశ్వరులను సత్యలోకలక్ష్మివై సరస్వతీ బ్రహ్మలను పాతాళలక్ష్మివై బలి ప్రముఖ దానవులను వనలక్ష్మివై యుద్యానవనాదులను హాటకలక్ష్మివై మేరునగంబును మాణిక్యలక్ష్మివై రోహణాద్రిని సాఫల్యలక్ష్మివై పుణ్యకార్యంబులను విద్యాలక్ష్మివై పండితులను సౌందర్యలక్ష్మివై కంతుజయంతి వసంతాదులను ప్రభాలక్ష్మివై సూర్య చంద్రాగ్నిహోత్ర నక్షత్రాదులనుఁ దపోలక్ష్మివై తాపసులనుఁ గాపాడుచున్నావు. గృహలక్ష్మివై గృహిణీలక్ష్మివై భోగలక్ష్మివై శ్రీహరికి సౌభాగ్యానందంబు లిచ్చుచున్నావు. మోక్షలక్ష్మివై ముముక్షువులఁ బ్రోచుచున్నావు. నీకటాక్షలేశంబు గలవానికిఁ గుటుంబపోషణ గృహనిర్మాణ వస్త్రాన్నపానాదులకుఁ దగినంత స్థితియుండును.

నీకటాక్షాతిశయము గలవానికి గజాంతైశ్వర్యముండును. నీకటాక్షంబు మిక్కుటంబుగాఁ బ్రసరించునప్పు డొకఁడు శక్రుఁడగు నింకొకఁడు విరించనుఁడగును. నీయపాంగ దృష్టిచేతనేగదా హనుమంతుఁడు భావి బ్రహ్మయయ్యెను. నీదయఁగలవానికి నిష్టార్థములన్నియు సిద్ధముగానుండును. నీకృపదూరునకు సహింపరానిబాధ లెడతెగకయుండును. నీకోపంబుచే రావణునిసంపదలును వాఁడును నశించెను. నీయనుకంపచే విభీషణునకుఁ జిరకాల రాజ్యభోగంబులు ప్రాప్తించెను. ఈదేవిధంబున మదీయ దుర్దశలనుఁ గొంతలను రూపుమాపి యిష్టార్థంబులు సేకూర్పుము. శ్రీదేవీసహస్రంబను పేరుతో నీప్రభావంబును వేయిపద్యంబులచే వర్ణించితి నది ధనాభావంబున నచ్చుపడక ఝిల్లికల కాహారంబగుచున్నది. తదీయగ్రంథంబును ముద్రింపించి మదీయలోచనంబులకును పాఠకుల మనస్సులకునుఁ బరమానందము గలిగింపుము. చేయవలసిన వర్ణనమంతయు భవత్కృతియందే నిలిపినందునఁ జర్విత చర్వణ మేలయని మానితి. దివ్యచిత్తానుసారముగా ననుగ్రహింపుము.

---

# భగవద్విజ్ఞాపనము

లక్ష్మీపతీ ! నమస్కారంబులు. జగన్నాథా ! కృష్ణావతార సమయంబున మధురలోఁ గంసదాసియగు సైరంధ్రికి సౌందర్యాదుల నొసంగి యామెతో భోగించి లోకపూజ్య నొనర్చినట్లు కలియుగంబున నన్ను దాసునిగాఁ బరిగ్రహించి నాహృదయంబున రమింపుచు నవిరళకవితాధార నొసంగితివి. నేనది మొదలుగా దేవర వారి విషయములో రచించిన కృతులచే లేఖిను లరిగిపోయినవి. చేతులు కాయలు గాచినవి. శ్రోణులును కిణములచే నిండినవి. ముద్రితకోశంబులును ముద్రితవ్య గ్రంథములును పేటికలంబడి ఝిల్లికల కాహారంబగుచున్నవి. ఇది యిట్లుండఁగా మరలఁ జిత్తచాంచల్యంబుచే నీప్రధాన భరితంబగు "జ్ఞానసూర్యోదయం" బను వేదాంతగ్రంథ రచన కారంభింపఁగా నీదయాకటాక్షంబుచే నేటికిఁ బూర్తియైనది. దాని నచ్చొత్తింపవలయు నన్న ధనాభావంబుగా నున్నది. నాకును నాకుటుంబమునకును విద్యాధనంబు పుష్కలంబుగా నిచ్చితివి. చాలినంత స్వాపతేయం బీయవైతివి. మోక్షార్థికి నీకు ధనంబేలయనుమువా త్రింశద్వర్షంబులనుండి దేవాలయకార్యము నాయందుంచితివి. దానికిప్పటికి క్షేత్రార్జనముతోఁగూడ నేబదివేలరూప్యంబు లైనవి. కాని తుదముట్టలేదు. స్వప్నంబునఁ గొలఁదికాలముక్రిందఁ గనిపించి భక్తులకాలక్షేపమునకు మఠము గట్టింపుమని శాసించితివి. అదెందుపను ఇట్లుండఁగా నీగ్రంథ ముద్రణమునకు నదభ్రద్రవ్యము కావలసియున్నది. వీనికన్నిటికిఁ గావలసిన ద్రవ్యం బొనఁగూర్చిన నొనఁగూర్పుము. లేదా మదీయమనంబున నీపాదారవిందభక్తి తప్ప నన్యాభిలాషలు జనింపకుండునట్లనుగ్రహింపుము. త్రిజట కుచేలుర కపారైశ్వర్యంబును త్రివక్ర కపారసౌందర్య

భోగంబులను ద్రౌపదికక్షయవస్త్రంబు లొసంగితివి. సముద్రముపై
రాలఁ దేలించి సేతువుఁ గట్టించితివి. రెండవసారి వారాశిపై ద్వారక
నిర్మించితివి. యమలోకంబున కేగిన సాందీపనిపుత్రుని వాసుదేవవ్యూ
హంబునకరిగిన వైదికపుత్రనవకంబును భూలోకంబునకుఁ దెచ్చి యిచ్చి
తివి. కోఁతులను గొల్లలను గొల్లప్రాఁబోడులను జగద్వందనీయులుగాఁ
జేసితివి. ఇట్టి నీకసాధ్యంబేమియు లేదుగదా ! రానురాను నన్ని వార్ధ
కంబున రోగంబులకు మనోరోగంబులకు విపత్తులకు, నపవాదంబులకు
నధీనంబు సేయుచున్నావు. సర్వశక్తుండనగు నీవు బాధిం
పఁగా నశక్తుండనగు నేనెట్లు సహింతును. నీకృపాపాత్రుం
డఁగావలెనని సేవింపుచుండఁగా నన్ను లీలాపాత్రునిఁ జేసికొను
చున్నావు, నీకు నిది ధర్మముకాదు. నీకార్యంబులు నాచేఁ
జేయింపఁదలచినచో సిద్ధింపఁజేయుము లేదా ప్రారబ్ధంబుఁ దొలంగించి
పరమపదంబిమ్ము ఈజరాభారంబున నేనేపనిచేయుటకు నశక్తుండనుగాక
యున్నాను. దేవా ! నీవుహృషీకేశుండవుగనుక నింద్రియజయంబును
లక్ష్మీపతివికాన సంపత్తులను భూభర్తవుగాన ధాన్యసస్యాన్నపానంబు
లనుఁ గలిగింపుము. ఉభయవిభూతినాయకుండవుగాన భక్తిరాజ్యాధి
పత్యంబుఁ బ్రసాదింపుము. నీవు సర్వేశ్వరుండవు సర్వాంతర్యామివి
నిఖిల నిలింప సార్వభౌముఁడవు కనుకనే నాకు జనకుండవై జనయి
త్రివై యుపాధ్యాయుండవై దేశికుండవై దాతవై సుహృదుండవై
దైవంబవై ధారకమై పోషకమై భోగ్యమై యుండుటచే సర్వదేవతలను
మానవులనుఁ దృణీకరించి నిన్నే నమ్మియుంటి "జ్ఞానసూర్యోదయః"
గ్రంథరాజంబును శీఘ్రంబున ముద్రింపించితివి కాని దీని నచిరకాలం
బున లోకంబున వ్యాపింపఁజేసి భాగవతుల కొసంగుము. వెంపటము
నిప్పాడివాడ నిర్మాణమైనదాది భవద్దేవాలయంబులేని కుగ్రామమై
రొప్పుచుండెను. అట్టికొఱంత నివారింపఁబూని కతిపయకాలమునకు
నీవు రుక్మిణీ సత్యభామా రాజ్యలక్ష్మీ ప్రభృతి దేవీమణులతోడను
హనుమద్దేవునితోడనుఁగూడి (శ్రీ)వేణుగోపాలకాహ్వయంబుతో సదన

సన్నిధిఁ గల్పవృక్షంబురీతి నాలయంబుతో సాక్షాత్కరించితివి. దీనజనాగ్రేసరుండనగు నన్నొకవస్తువుగా సంగీకరించి లోకంబునకు నీప్రభావంబెఱింగింపఁదలంచి మదీయ హృదయంబునఁ బ్రవేశించి మదీయ ధర్మపత్నియగు రాధాదేవియందు సత్సంతానంబుఁ గలిగించి ప్రథమ పుత్రుండగు శ్రీనివాసప్పెరుమాళ్ళను దర్కశాస్త్ర నిపుణునిఁగాను ద్వితీయాత్మజుండగు వేంకటాచలపతిని సంస్కృతాంధ్ర సాహిత్య సంపన్నునిఁగానుఁ దృతీయనందనుండగు దాశరథినిఁ దర్క వేదాంత కవితా విశారదునిఁగానుఁ జతుర్థసూనుండగు రామప్రసాదుని వ్యవసాయ కార్య ధురంధరునిఁగా ననుగ్రహించి మదీయ పుత్రికామణులగు రామ బాణము కమలా దేవులను విదుషీలలామంబులుగా నొసఁగితివి. కాని వారికి దీర్ఘాయురారోగ్యైశ్వర్యంబులతోఁ గూడిన నీపాదారవిందభక్తి నొసంగుము. అట్లొసఁగితివేని నిట్టి క్రూరకలికాలమందు నైనను వారు నీబానిసలై నీకు నిత్యోత్సవ మాసోత్సవ బ్రహ్మోత్సవాది కైంకర్యంబులు గావింపుచు నీప్రభావంబును లోకంబునకు వెల్లడింతురు. గోపన్నగారిని నిమిత్తంబుగాఁగొని భద్రాచలంబునుఁ బుండరీకుని వ్యాజముచేఁ బండరీపురంబునుఁ బ్రసిద్ధిఁ జెందించినభంగి నిప్పాడివాఁడను బుణ్యక్షేత్రంబునుఁ గావించి యాచంద్రతారార్కముగా వృద్ధినొందు నట్లు సంకల్పింపుము. ఇదివఱకు నాకు శిష్యులుగా నొసంగిన స్త్రీపురుషులకు జ్ఞాన భక్తి వైరాగ్యంబు లపారంబుగా నొసంగుము. సంసార బంధంబులఁ దొలంగింపుము. సర్వలోకవందనీయులుగాఁ జేసి దుర్గుణంబులఁ దొలంగించి సద్గుణంబుల సమకూర్పుము. వేలకొలఁది నూతన సామాజికుల మదీయ భాష్యకారసమాజంబునఁ జేర్పుము. మున్ను నీవొసంగిన సత్యవచనప్రకార మీగ్రామంబునందు నేను నిర్ణయించుకొన్న స్థలంబునందు ధన ధాన్యోద్యానవన సమృద్ధంబైన మఠంబు నిర్మించి దానియందు భాగవత సహస్రంబులఁ జేర్చి నీగుణానుభవకైంకర్యాదులయందు నాకు సహాయంబుగా నిమ్ము. సముద్రంబుపై నొక్క

సారి సేతువు నొక్కపర్యాయము ద్వారకను నిర్మించితివి. దర్శన స్పర్శనంబులచే నొక్కత్రుటిలోఁ ద్రివక్రకు సౌందర్య సౌకుమార్య లావణ్య చాతుర్యాదు లొనఁగూర్చి లోకపూజ్యనుఁ జేసిన నీకసాధ్యం బెద్దియుఁ లేదు. మదీయ దేహరక్షణభారంబు నాత్మరక్షణ భారంబు దేవరవారి దివ్యాంఘ్రి సరోజంబులయందు సమర్పించుకొంటిని. శఠగోపనాథ యామున రామానుజ వరవరముని ప్రభృతి యోగీంద్రుల కొసంగినట్లు నీగుణానుభవ కైంకర్యంబులయం దధికారంబు గలిగింపుము. మాదృశ జఘన్యున కట్లు వాంఛించుట లర్హము కాదని యెఱింగియుఁ దావక సామర్థ్య సౌశీల్య వాత్సల్యంబులఁబట్టి యాచించెద. "జ్ఞానసూర్యోదయ" గ్రంథంబును నీపాదంబులయం దర్పించితిఁ బరిగ్రహింపుము.

పుండరీకాక్షా, భువనమోహనా, పురుషోత్తమా, పుణ్యరాశీ, పూతచరిత్రా, గరుడవాహనా, జీవితేశా, విరించనజనకా, విష్ణుదేవా, వాసుదేవా, నారాయణా, శ్రీనివాసా, నారసింహా, వామనా, జనార్దనా, శేషాద్రి వేంకటేశ్వరా, హస్తిగిరి వరదరాజా, రంగస్థల రంగేశ్వరా, పూడివాడ వేణుగోపాలా దవ్యచిత్తానుసారముగా నవధరింపుము. నమోనమః.



చెరుకుపల్లి 'త్రిలిఙ్గ' ప్రెస్సునందు ముద్రింపఁబడియె—15–4–1953

## జ్ఞానసూర్యోదయ గ్రంథముద్రణమునకు ధనసహాయమొనర్చిన వదాన్యుల యౌదార్య వివరణము

వక్కపట్లవారిపాలెము:—

| | |
|---|---|
| వక్కపట్ల నరసింహము, యీ బుల్లెమ్మ, పద్యాలనారాయణరావుగార్లు | రు 100- |
| పద్యాల శేషయ్యగారు | 25- |
| వక్కపట్ల చినవేంకయ్యగారు | 75- |
| పద్యాల రామారావుగారు | 25- |
| అంబటి సోమయ్యగారు | 25- |
| వక్కపట్ల రామయ్యగారు | 25- |
| యీ మహాలక్ష్మిగారు | 5- |
| యీ చినమహాలక్ష్మిగారు | 5- |
| పద్యాల రాఘవమ్మగారు | 50- |
| వక్కపట్ల వేంకన్నగారు కుమారుఁడు బాబురావుగారు బి. ఎ., బి. ఎల్. | 116- |
| మత్సా నరసయ్యగారు | 25- |

పెకనూరు:—

| | |
|---|---|
| గాజుల శేషమ్మగారు | రు 50- |
| తుంగల వేంకటరత్నమ్మగారు | 40- |
| తుంగల కామమ్మగారు | 25- |
| తుంగల వేంకటస్వామిగారు | 25- |
| తుంగల వేంకటేశ్వర్లుగారు | 100- |
| మాదివాడ తాతయ్యగారు | 5- |
| తుంగల నారాయణమ్మగారు | 10- |
| పూసల మంగమ్మగారు | 20- |

| | | |
|---|---|---|
| తుంగల వేంకయ్యగారు | రు | 5- |
| నీలకంఠం శేషయ్యగారు | | 5- |
| గుడివాక బసవయ్యగారు | | 5- |
| పద్యాల వేంకమ్మగారు | | 5- |
| తుంగల రాఘవయ్యగారు | | 5- |
| బాడిగ సరస్వతిగారు | | 20- |
| బాడిగ పున్నమ్మగారు | | 5- |
| మాదివాడ సుబ్బమ్మగారు | | 5- |
| దాసినేని పున్నమ్మగారు | | 5- |
| తుంగల కోటీశ్వరమ్మగారు | | 5- |
| నామన నాంచారమ్మగారు | | 5- |
| మాదివాడ లక్ష్మమ్మగారు | | 5- |
| పూసల రాఘవయ్యగారు | | 25- |
| తుంగల కాంతయ్యగారు | | 5- |
| గుడివాక భార్గవీదేవిగారు | | 5- |
| కాలారి వజ్రమ్మగారు | | 40- |

మొదుమూడి:—

| | | |
|---|---|---|
| మత్తి శాంతమ్మగారు | రు | 40- |
| పద్యాల కుటుంబయ్యగారు | | 400- |
| బచ్చు కృష్ణదాసుగారు | | 200- |
| బచ్చు అంకయ్యగారు | | 200- |
| బచ్చు మురవైరిగారు, బచ్చు జలాచంద్రయ్యగారు, బచ్చు వేంకటాచలపతిగారు | | 200- |
| బచ్చు కృష్ణారామయ్యగారు | | 100- |
| బచ్చు చినబసవయ్యగారు | | 50- |
| బచ్చు కృషమూర్తిగారు | | 100- |

| | |
|---|---|
| బచ్చు రేణుకయ్యగారు | రు 50- |
| బచ్చు రామయ్యగారు | 50- |
| కమ్మిలి రామయ్యగారు | 50- |
| సిరిసెట్టి వెంకటేశ్వర్లుగారు | 30- |
| సిరిసెట్టి అభిమన్యుడుగారు | 30- |
| సిరిసెట్టి వీరరాఘవమ్మగారు | 50- |
| బచ్చు వెంకటరత్నమ్మగారు | 25- |
| బచ్చు అమ్మయ్యగారు | 50- |

కోడూరు :—

| | |
|---|---|
| కోట రామయ్యగారి సోదరు వైద్యుడు | రు 100- |
| సింగం హైమవతమ్మగారు | 100- |
| కోట చిట్టియ్యగారు | 50- |
| వక్కపట్ల వెంకమ్మగారు | 40- |
| కోట కోదండరామయ్యగారు | 10- |
| కోట వెంకటరత్నంగారు | 5- |
| కాలారి సీతారామయ్యగారు | 5- |
| కాలారి వెంకయ్యగారు | 5- |
| కోట వెంకమ్మగారు | 5- |
| పద్యాల రంగయ్యగారు | 5- |
| కోట నాంచారమ్మగారు | 5- |
| కోట కృష్ణయ్యగారు | 5- |
| కోట సీతారామయ్యగారు | 10- |

వాడపాలెము :—

| | |
|---|---|
| మేడిసెట్టి వేంకటరెడ్డిగారు | 100- |
| మేడిసెట్టి చలపతిరావుగారు | 50- |

వరికూటివారిపాలెము:—

| | |
|---|---|
| వరికూటి గరుటమ్మగారు | రు 25- |
| వరికూటి చంద్రయ్యగారు | 5- |
| భోగాది నాగరత్తమ్మగారు | 25- |

ధూళిపూడి:—

| | |
|---|---|
| తుంగల బాపమ్మగారు | 10- |

శ్రీకాకుళము:—

| | |
|---|---|
| ఒల్లు రత్తమ్మగారు | 25- |

ఆవలవారిపాలెము:—

| | |
|---|---|
| మత్తి సీతయ్యగారు | 100- |

చావలి:—

| | |
|---|---|
| కుంచే చినవేంకటసుబ్బయ్యగారు | 10- |

పూడివాడ:—

| | |
|---|---|
| పద్యాల వేంకటసుబ్బయ్యగారు | రు 100- |
| పద్యాల అమ్మన్నమ్మగారు | 100- |
| పద్యాల రామముత్యమ్మగారు | 100- |
| మొవ్వ రామప్రసాదుగారు | 50- |
| తాడివాక రామయ్యగారు | 50- |
| బచ్చు కోటయ్యగారు | 25- |
| మొవ్వ శ్రీనివాసప్పెరుమాళ్ళుగారు | 25- |
| మొవ్వ వేంకటాచలపతిగారు | 25- |
| మొగలిపువ్వు రత్తమ్మగారు | 10- |
| దిట్టకవి శేషభట్టరాచార్యులుగారు | 100- |
| పద్యాల రామబాణమ్మగారు | 50- |
| అంబటి అచ్చమ్మగారు | 25- |

దా ప లి:—

| | |
|---|---|
| వెలివల వీరయ్యగారు | రు 10- |
| విష్ణుమొలకల నాగయ్యగారు | 5- |
| యీ రామయ్యగారు | 5- |
| వెలివల బాపమ్మగారు | 5- |
| సోమరౌతు పున్నమ్మగారు | 5- |
| యీ మాణిక్యంగారు | 5- |
| గోపాలం శాంతమ్మగారు | 5- |
| విష్ణుమొలకల సీతమ్మగారు | 5- |
| భోగాది శేషయ్యగారు (వరికూటివారిపాలెం) | 25- |
| పద్యాల లక్ష్మీనరసమ్మగారు (వక్కపట్లవారిపాలెము) | 25- |

## మావద్ద లభించు గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| గోపికావిలాసము | ... | ... | 1-8-0 |
| సీతారామప్రభావము | ... | ... | 1-4-0 |
| వరవరమునిహృదయము | ... | ... | 0-12-0 |
| లక్ష్మీస్తవము | ... | ... | 1-0-0 |
| భాగవతసుసంభూజము | ... | ... | 1-0-0 |
| జ్ఞానసూర్యోదయము | ... | ... | 10-0-0 |
| కావ్యకళ | ... | ... | 2-0-0 |
| భ్రాంతగానము | ... | ... | 0-6-0 |

పరాశరభట్టారకుల విష్ణుసహస్రనామభాష్యము—
సాంధ్ర తాత్పర్యము 2-0-0

ప్రాప్తిస్థానము:—

మొవ్వ వేంకటదాసుగారు, పూడివాడ.

[వయా] పొన్నూరు, గుంటూరుజిల్లా.

ఓం నమో నారాయణాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీ వేంకట గురుభ్యో నమః
శ్రీ శ్రీనివాస గురుభ్యో నమః
శ్రీ విష్ణు దాస గురుభ్యో నమః
శ్రీ కృష్ణ దాస గురుభ్యో నమః

Padyala Maithilinatha Prasad
&
Padyala Urmila Manasa Rayalu
(S/o P. Padma mandira &
P. Deva Raja Perumallu)
(S/o P. Ramabharama &
P. Venkateswarlu)

Ph.No: 9000545202.

RMM 06/02/20
(RAMOJI)



(Ramaji & Urmi & Vikki)




భాష్యకార సమాజ స్థాపకులు
మహర్షి శ్రీ వేంకటదాసస్వామి గారు



శ్రీరమా చిత్రశాల

తర్కవేదాంత విశారద

# పండిత శ్రీ మొవ్వ శ్రీనివాసపెరుమాళ్ళుగారు



శ్రీవేణు గోపాల సేవాశ్రమాధిపతులు, తర్కవేదాంత "కవిభట్టారక"
శ్రీ మొవ్వదాశరధి సూరి "విష్ణుదాసు" గారు.

పూడివాడ. ది. 30-8-1998

సర్వంశ్రీకృష్ణార్పణం



Thanks for watching from

PADYALA MAITHILI NATHA PRASAD

(RAMOJI)& (lakshmoji)

(S/o p. Padma mandira& devaraja perumallu)